
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్ధం మహానుభావులైన శ్రీ రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) రామకృష్ణ మఠ్ వెబ్ సైట్: http://www.rkmath.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## రామకృష్ణ మఠ్ వారి వెబ్ సైట్

## http://www.rkmath.org



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

జనవరి 2009
వెల : రూ. 10



వివేకభాసా కమనీయకాంతిమ్
వివేకినం తం సతతం నమామి।



# సుబోధ

**సూ**ర్యరశ్మి అనేక ప్రదేశాల్లో పడుతుంది. కానీ కాంతిని గ్రహించే అద్దం, నీరు, మెరుగుపెట్టిన లోహాలు మాత్రమే సూర్యరశ్మిని చక్కగా ప్రతిఫలింపజేస్తాయి. భగవంతుడి దివ్యతేజం విషయమూ ఇలాంటిదే. అది సమానంగా, నిష్పక్షపాతంగా అందరిపైనా ప్రసరిస్తుంది. కానీ సజ్జనులు, సాధుసత్తముల వినిర్మల హృదయాలు మాత్రమే ఆ దివ్యతేజాన్ని చక్కగా ప్రతిఫలింపజేస్తాయి.

ధూళి పట్టిన అద్దం సూర్యకిరణాలను ప్రతిఫలింప చెయ్యలేదు. అలాగే మాయామోహితులైన మలిన హృదయులు, అపవిత్ర హృదయులు భగవన్మహిమను చూడలేరు. కానీ నిర్మలమైన అద్దం సూర్యుణ్ణి ప్రతిఫలింపజేసే రీతిలో పవిత్ర హృదయులు భగవంతుణ్ణి చూడగలరు. కాబట్టి మనసును ఎప్పుడూ పవిత్రంగా ఉంచుకోవాలి.

నీటితో కలిసిన పాలను చిక్కబరచడానికి చాలాసేపు పడుతుంది, చాలా శ్రమపడాల్సి వస్తుంది. లౌకికుడి మనస్సు దుష్ట చింతనలు అనే మురికి నీటితో కలిసి చాలా కలుషితమవుతుంది. దాన్ని పరిశుద్ధం చేసుకోడానికి అతడికి చాలాకాలం పడుతుంది. దాని కోసం ఎంతో శ్రమపడాల్సి ఉంటుంది.

వెలుగు నివ్వడం దీప స్వభావం. దాని సాయంతో కొందరు వంట చేసుకొంటారు, కొందరు దొంగ దస్తావేజులను సృష్టిస్తారు, కొందరు సద్గ్రంథ పఠనం చేస్తారు. అలాగే కొందరు భగవన్నామ కీర్తనతో ముక్తిని పొందజూస్తారు, కొందరు తమ దుష్కార్యాలను సాధింపజూస్తారు. ఎవరెలా వినియోగించుకొన్నా భగవన్నామం మాత్రం నిష్కళంకంగా, పరమ పవిత్రంగానే ఉంటుంది. ❋

('శ్రీరామకృష్ణ బోధామృతం' నుంచి)

**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029
ఫోన్: 040–2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద**
సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 66 | సంచిక: 1 | జనవరి 2009



తమోఘ్నాయ హిమఘ్నాయ శత్రుఘ్నాయామితాత్మనే ।
కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాం పతయే నమః ॥

చీకటినీ, మంచును పోగొట్టువాడవు, ఉపాసకుల శత్రువులను వధించువాడవు, అమిత తేజస్సు గలవాడవు, దీప్తిమంతుడవు, జ్యోతిర్గణపతివీ అయిన నీకు నమస్కారము.

(ఆదిత్యహృదయం)





## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**............ రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాతపేరు / చిరునామా | రూ. |
|---|---|---|
| మహారాజ పోషకులు | : డా॥ అమన్ శిష్టా, రత్నంపేట్, రామచంద్రంపేట్, తూర్పుగోదావరి జిల్లా - 533 255 | 10,116 |
| " " | : శ్రీ నల్లజర్ల వేంటకేశ్వర రావు, తణుకు, పశ్చిమ గోదావరి జిల్లా - 534 211 | 10,000 |
| " " | : శ్రీమతి వుండవల్లి సుదక్షిణాదేవి, యూసఫ్‌గూడ, హైదరాబాద్ - 500 038 | 10,000 |
| పోషకులు | : శ్రీమతి ఎన్. జ్యోతిర్మయి, అంజాహపూర్, బెంగుళూరు - 560 062 | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం.

భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు

**ముఖచిత్రం :** స్వామి వివేకానంద భారతదేశమంతా పర్యటిస్తూ 1892 అక్టోబరులో బెల్గామ్ వెళ్ళారు. అక్కడ హరిపాద మిత్ర ఇంట్లో తొమ్మిది రోజులు బస చేశారు. ఆ సమయంలో తీసిన స్వామీజీ ఛాయాచిత్రం ఆధారంగా అదే భంగిమలో ఫైబర్ గ్లాస్‌తో మలచిన స్వామీజీ విగ్రహాన్ని అక్కడి రామకృష్ణ మిషన్ కేంద్రంలో నెలకొల్పారు. స్వామీజీ బస చేసిన ఆ ఇల్లు ప్రస్తుతం బెల్గామ్ రామకృష్ణ మిషన్ ఆధ్వర్యవంలో ఉంది.



| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 365 |

గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



## శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- **'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకి కుడి భాగంలో మీ చందా గడువు నెల పొందుపరచబడి ఉంది. *సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.***
- **మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.**
- **మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.**
- **పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ చేయబడుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.**

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

**- *సర్క్యులేషన్ మేనేజర్***




**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**

Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh

Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com

సంపాదకీయం

# ఆనంద సాధానికి ఆధ్యాత్మికతే పునాది !

**"నా** ఆశలన్నీ యువతరం పైనే! సింహ సదృశులై వాళ్ళ సమస్యలను వారే పరిష్కరించుకొంటారు. నా ప్రాణాలు సైతం ధారపోసి రూపొందించిన సిద్ధాంతాలనూ, భావాలనూ నవతరం దేశం నలుమూలలా వ్యాపింపజేస్తుంది" అన్న స్వామి వివేకానందుని మాటలు యువతరంపై ఆయనకు ఉన్న సంపూర్ణ విశ్వాసానికి నిదర్శనం. అయితే స్వామీజీ ఆశలన్నీ తమపైనే ఉన్నాయని ఎంతమంది యువతీ యువకులు గ్రహించారన్నది ప్రశ్నార్థకం.

స్వామీజీ ఆశించిన విధంగా మన సమస్యల్ని మనమే ఎలా పరిష్కరించుకోగలం? మన సమస్యలన్నింటికీ ముఖ్య కారణం – మన మీద మనకు విశ్వాసం లేకపోవడమే! ఆత్మవిశ్వాసాన్ని అలవరచుకొంటే ఎలాంటి సమస్యనైనా సునాయాసంగా అధిగమించవచ్చు. అదే స్వామీజీ మనకు అందించిన విజయ సూత్రం.



అయితే 'ఆత్మవిశ్వాసం'తో ఆధునిక పరిజ్ఞానాన్ని సంపాదించి, ఆధ్యాత్మిక జ్ఞానాన్ని విస్మరిస్తే ఆధ్యాత్మిక శక్తి కన్నా ఆర్థిక శక్తే మెరుగనే భ్రాంతికి లోనవుతాం. అతీంద్రియ శక్తిని మరిచి ఇంద్రియ సుఖాలే ఉన్నతమైనవనే అపోహకు గురవుతాం. కాబట్టి 'ఆనంద సౌధానికి ఆధ్యాత్మికతే పునాది' అనే సత్యాన్ని మనం ఎన్నడూ మరువరాదు.

**వినోదాలమయం, విలాసాల నిలయం:** సినిమా, టీవీ, ఇంటర్‌నెట్, మొబైల్ ఫోన్ మొదలైన ఆధునిక పరికరాలూ, పాశ్చాత్య సంస్కృతీ ఆధిపత్యం చలాయిస్తున్న రోజులివి. వీటి ప్రభావంలో మనం ఆదమరిచి, ఆదర్శాలను వదలి మన జీవితాలను వినోదాలమయంగా, విలాసాల నిలయంగా మలచుకుంటున్నాం. పాశ్చాత్య ప్రభావ ప్రవాహంలో కొట్టుకొని భౌతికానందమే బ్రహ్మానందమని భ్రమిస్తున్నాం. భౌతికసుఖాల్లో మునిగితేలుతున్న పాశ్చాత్యులను చూసి వారంతా జీవితాన్ని ఆనందంగా అనుభవిస్తున్నారని మనం భావిస్తున్నాం. కానీ బయటకు వారు మందహాస వదనంతో కనిపిస్తున్నా, వారి మనోంతరాళాల్లో దావానలం ప్రవహిస్తుందనే నిజాన్ని మనం గమనించాలి.

"Social life in the West is like a peal of laughter; but underneath, it is a wail. It ends in a sob. The fun and frivolity are all on the surface: really it is full of tragic intensity... The whole of the Western world rests on a volcano which may burst at any moment and destroy the whole world." ***- Swami Vivekananda***

భౌతిక పరిజ్ఞానంతో సర్వం సాధ్యమని విశ్వసించి ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని విస్మరిస్తే వినాశనం తప్పదు. కాబట్టి 'భౌతిక సంపదలే శాంతికి మూలమనే భ్రమ నుంచి బయటపడి, ఆనంద నిధి ఆధ్యాత్మికతలోనే ఉంది' అనే సత్యాన్ని మనం ఎంత త్వరగా గ్రహిస్తే అంత మంచిది.

**ఆధ్యాత్మికతే ఆలంబన :** మతం, దైవం, ఆధ్యాత్మికత అనేవి అర్థరహితమని భావించేవారు అధికం. అయితే మతం అంటే – "మనిషిలో ధైర్యాన్ని పెంచి, పిరికితనాన్ని పారద్రోలేదే మతం. మానసిక బలాన్ని పెంచి బలహీనతను తొలగించేదే మతం. మనిషిలో మంచిని పెంచి, చెడుని త్రుంచేదే మతం" అని స్వామి వివేకానంద మతానికి నూతన అర్థాన్నీ, వినూత్న దృక్పథాన్నీ కల్పించారు.

పాశ్చాత్య నాగరకతలోని తళుకుబెళుకులను చూసి మైమరచిపోకుండా దైవమే సత్యం, ఆత్మే నిత్యం అని గుర్తుంచుకోవాలి. దైవాన్ని విస్మరించి దివ్యత్వాన్ని శంకించిన నాడు భారతదేశ మనుగడే ఉండదు.

If you give up the spirituality, leaving it aside to go after the materializing civilization of the West, the result will be that in three generations you will be an extinct race... అన్న స్వామి వివేకానందుని హెచ్చరికను మనం గుర్తుంచుకోవాలి. అలా గుర్తుంచుకొని, అప్రమత్తులమై మెలగిన నాడు పాశ్చాత్య సంస్కృతి వెల్లువై ప్రవహించినా సుదీర్ఘ చరిత్ర గల మన భారతదేశ సనాతన ధర్మాన్ని రూపుమాపలేదు. మన ఆధ్యాత్మిక మూలాల్ని పెకలించలేదు. ఆధ్యాత్మికతే మన పునాది, జీవశక్తి. ఆ ఆధ్యాత్మికత మాయమైనప్పుడు మన దేశమే కాదు మొత్తం ప్రపంచమే కనుమరుగైపోతుంది.

**భారతదేశం అంతరించిపోతుందా? :** దృఢంగా, విశాలంగా విస్తరించిన వటవృక్షాన్ని పెకిలించడం ఎంత కష్టమో మన భారతీయ సనాతన ధర్మాన్ని నిర్మూలించడం కూడా అంతే కష్టం.

వర్షాకాలంలో ఓ లత మర్రిచెట్టు పైకి ప్రాకింది. ఆ లత మర్రిచెట్టు పైకి వెళ్ళి 'నీకు 200 ఏళ్ళు. అయినా ఏం ప్రయోజనం! నేను ఒక్క సంవత్సరంలో నీ తలపైకి ఎక్కి కూర్చున్నాను' అని గర్వంగా మర్రిచెట్టుతో అంది. అందుకు మర్రిచెట్టు, 'అవును, నిజమే! కానీ నేను చూసిన వాటిలో నువ్వు 200వ దానివి' అని నవ్వుతూ బదులిచ్చింది.

వటవృక్షం లాంటి మన భారతదేశ సంస్కృతిని లతల లాంటి పాశ్చాత్య సంస్కృతులు ఎన్ని చుట్టుముట్టినా, అవి మన దేశంపై ఎలాంటి శాశ్వత ప్రభావాన్నీ చూపలేవు.

ప్రస్తుతం మన దేశం పాశ్చాత్య సంస్కృతి ప్రభావానికి లోనవుతున్నట్లు కనిపిస్తున్నా అది భారతదేశానికి ఎలాంటి హానీ చేకూర్చలేదు. విదేశాల పర్యటన తరువాత భారతదేశ స్థితిని గురించి స్వామి వివేకానంద తన అభిప్రాయాన్ని ఇలా వ్యక్తం చేశారు: "భారతదేశం పతనం చెందిందని నేను కూడా అభిప్రాయపడ్డాను. కానీ పాశ్చాత్య దేశాలను సందర్శించిన తరువాత నా అభిప్రాయం తప్పు అని తెలిసింది. ఓ ధన్య భారతమాతా! నీకు ఎన్నటికీ పతనం లేదు."

**మానవాళికి మహత్తర సందేశం :** 'ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్... ఈ చరాచర సృష్టి అంతా భగవంతునితో నిండివుంది'. భారతదేశ అత్యున్నత ఆధ్యాత్మిక ధర్మాన్ని ప్రతిబోధించే తత్త్వం ఇది.

సర్వత్రా వ్యాపించి ఉన్న ఆత్మ చైతన్యాన్ని అవగతం చేసుకోవడం ఆధ్యాత్మిక మార్గంలో పరమోత్కృష్ట స్థితి. మరి ఆ స్థితిని చేరుకోవాలంటే ముందుగా మనిషికి కొన్ని ప్రాథమిక అవసరాలు తీరాలి. ఒక సాధారణ మనిషి పరిపూర్ణ వ్యక్తిగా మారాలంటే శారీరక బలం, మానసిక బలం, ఆధ్యాత్మిక బలం అవసరం.

మనిషి జీవించడానికి ఆహారం అవసరం. మనిషిలో విచక్షణాజ్ఞానం లేకపోతే మనిషి పశుతుల్యుడిగా మారుతాడు. కాబట్టి మనిషికి ఆహారంతో పాటు విద్య అవసరం. ఆ విద్య మనిషిలో మేధాశక్తిని పెంచుతుంది. మనిషిలో దేహబలం, బుద్ధిబలంతోపాటు ఆధ్యాత్మిక బలం లేకపోయినట్లయితే

> **ప్రపంచంలోని సమస్త సంపదనీ కుమ్మరించినా, ఎన్ని సాంఘిక, రాజకీయ సంస్కరణలు చేపట్టినా ఆధ్యాత్మికత ఆలంబన కానప్పుడు భారతదేశం పతనమవుతుంది. అప్పుడు మొత్తం ప్రపంచమే కనుమరుగైపోతుంది.** *- స్వామి వివేకానంద*

ఆ మనిషి విద్యావంతుడైనా వక్ర మార్గంలో పయనించే ప్రమాదం ఉంది. ఆధ్యాత్మిక విలువలు లేని విద్యాధికులే ఎన్నో దురాగతాలకు పాల్పడడం మనం చూస్తున్నాం. కాబట్టి ప్రపంచంలో ఏ వ్యక్తి అయినా ఆనందంగా జీవించాలంటే భౌతిక పరిజ్ఞానంతో పాటు ఆధ్యాత్మిక విజ్ఞానం కూడా అవసరం.

అసలైన 'ఆధ్యాత్మికత' అంటే అంతటా, అన్ని జీవుల్లోనూ ఒకే ఆత్మ ఉందని గ్రహించడం. ఈ జగత్తంతా భగవన్మయమే అన్న మన వేదాంత సారాన్ని ప్రపంచానికి అందించారు స్వామి వివేకానంద. ఈ అనుభూతి మనందరికీ అనుభవవేద్యం అయ్యేవరకూ మన వెంటే ఉంటానని అభయమిచ్చారు స్వామీజీ.

I shall inspire men everywhere, until the world shall know that it is one with God. ***- Swami Vivekananda.***

స్వామీజీ సందేశాన్ని దృఢ నిశ్చయంతో ఆచరించడానికి ప్రయత్నిద్దాం. ఆత్మజ్ఞానం లేని ఆధునిక పరిజ్ఞానం అశాంతికి దారితీస్తుంది కాబట్టి **'ఆనంద సౌధానికి ఆధ్యాత్మికతే పునాది'** అన్న స్వామి వివేకానంద సందేశాన్ని ప్రపంచానికి చాటుదాం. ❀

గోరుముద్ద

# నేను నాదేశం

- స్వామి సుప్రియానంద

మార్పు రావాలంటున్నారు. ఏం మార్పు రావాలి? అది ఎవరిలో రావాలి? నాలోనా, నాదేశంలోనా? మనిషి తాను మారకుండా అన్నింటిలోనూ మార్పుని ఆశిస్తున్నాడు. ''దేశమును ప్రేమించుమన్నా! మంచి యన్నది పెంచుమన్నా!... దేశమంటే మట్టికాదోయ్! దేశమంటే మనుషులోయ్!" అన్న గురజాడ పలుకులు ఉపన్యాసాలకు పరిమితమయ్యాయి.



'నేను, నా వాళ్ళు' అన్న పరిమితి నుండి బయటపడి 'నేను-నాదేశం' అనే భావన ఉంటేనే దేశాన్ని నిజంగా ప్రేమించగలం. స్వార్థచింతనతో ఏ ఘనకార్యాలూ సాధించలేం.

స్వామి వివేకానంద అమెరికా నుండి తిరిగి వచ్చినప్పుడు అన్న మాటలు ఒక్కసారి జ్ఞాపకం చేసుకుందాం. "భారతదేశాన్ని వదలి రాకముందు ఆ దేశాన్ని ప్రేమించాను. ఇప్పుడు భారతదేశం యొక్క దుమ్ము ధూళినీ, అక్కడ వీచే గాలినీ కూడా పవిత్రభావంతో ఆరాధిస్తాను".

'దేశం నీకేంచేసిందని కాదు. దేశం కోసం నువ్వేం చేశావన్నదే ముఖ్యం' అని వక్తృత్వ పోటీల్లో బహుమతులు పొందేందుకు పిల్లలచేత చెప్పిస్తాం. దేశం కోసం ఏం చేయాలో దేశంలో చాలామందికి తెలియదు. ఎక్కువ శాతం అదేపనిగా దేశాన్ని విమర్శించడానికే కంకణం కట్టుకుంటారు. దానిలోనే అమితానందం పొందుతుంటారు.

నిత్యజీవితంలో మన దేశం కోసం ఏవో పెద్ద ప్రణాళికలు రూపొందించనక్కరలేదు. పాఠశాలల్లో తరచూ విద్యార్థులు చేసే ప్రతిజ్ఞ - 'భారతదేశం నా మాతృభూమి. భారతీయులందరూ నా సహోదరులు...' అన్నది జ్ఞాపకం ఉంచుకొని అది ఆచరిస్తే చాలు. దీనివలన మనకు దేశభక్తి కలుగుతుంది.

దేశభక్తిని ఎంతో సున్నితంగా తెలియజెప్పే సంఘటన ఒకటి చూద్దాం! స్వామి రామతీర్థ ఒకసారి జపాన్ దేశంలో రైలుబండిలో ప్రయాణిస్తున్నారు. ఆయనకు ఆహారం నిమిత్తం పండ్లు కావలసివచ్చాయి. బండి స్టేషన్లో ఆగినప్పుడు ప్లాట్‌ఫారం మీద ఎక్కడా పండ్లు లభించలేదు. మరో రెండు, మూడు స్టేషన్‌లలో బండి ఆగినా ఎక్కడా పండ్లు దొరకలేదు. ఇది గమనించిన తోటి ప్రయాణికుడైన ఒక జపాన్ దేశస్థుడు ఒక స్టేషన్లో బండి ఆగీ ఆగకముందే రివ్వున స్టేషన్ బయటకు పరుగెత్తుకెళ్ళి పండ్లు తీసుకొచ్చి స్వామి రామతీర్థకు ఇచ్చాడు. స్వామి రామతీర్థ డబ్బులివ్వబోతే నిరాకరించి 'అయ్యా! మీరు భారతదేశం తిరిగి వెళ్ళినప్పుడు జపాన్‌లో కనీసం పండ్లు కూడా లభ్యం కాలేదన్న మాట అనకుండా ఉంటే అదే నాకు మీరిచ్చే ప్రతిఫలం' అన్నాడు.

స్వామి వివేకానంద మన దేశభక్తిని 'మాటల దేశభక్తి' (Lip patriotism) గా వర్ణించారు. ఇతరులను 'అనుకరించడం మరణంతో సమానం అన్న ఆయనే ఇతరులలో మంచిని గ్రహిస్తేనే ప్రగతిని సాధించగలమంటారు. ప్రస్తుత పరిస్థితుల్లో దేశభక్తిని మాటలతో కాక చేతలలో చూపించవలసిన అవసరం ఎంతో ఉంది. అప్పుడే స్వామి వివేకానంద భారతావని గురించి కన్న కలలు నిజం చేయగలం. ❁

## సంక్రాంతి శుభాకాంక్షలు



**'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు, రచయితలకు, రచయిత్రులకు, ఏజెంట్లకు, ప్రకటనకర్తలకు మా హృదయపూర్వక శుభాభినందనలు.** - సంపాదకులు



# అద్భుత కల్పతరువు

– స్వామి జ్ఞానదానంద

**1886** జనవరి 1వ తేదీన, కలకత్తాలోని కాశీపూర్ ఉద్యాన గృహంలో శ్రీరామకృష్ణులు కల్పతరువు అయ్యారు. భక్తులందరినీ ఆయన "ఆధ్యాత్మిక జాగృతి పొందండి" అని ఆశీర్వదించారు. తత్ఫలితంగా కొందరు భావపారవశ్యు లయ్యారు. కొందరికి సమాధి స్థితి కలిగింది. మరికొందరికి దర్శనాలు కలిగాయి. ఇంకొందరిలో కుండలినీశక్తి జాగృతమయింది.

ప్రస్తుతం కల్పతరువు పర్వదినాన్ని వార్షిక ఉత్సవంగా కాశీపూర్‌లో జరుపుకొంటున్నారు. ఈ మహోన్నత సంఘటనను తలచుకొని ఆనందిస్తూ శ్రీరామకృష్ణులు నివసించిన కాశీపూర్ ఉద్యానంలో పెద్ద సంఖ్యలో జనం సమావేశమవుతున్నారు. కల్పతరువు పర్వదినాన్ని పురస్కరించుకొని తమ కోర్కెలు నెరవేర్చమని ప్రార్థించడానికి భక్తులు దూర ప్రాంతాల నుంచి కూడా కాశీపూర్ రావడం పరిపాటి. ఎందుకంటే భగవంతుడు కల్పతరువు కదా! ఈ అద్భుతమైన తరువు నుంచి ఏది కోరితే అది పొందవచ్చు. కానీ ఆ అవకాశం సంవత్సరానికి ఒక్కసారే వస్తుంది. ఈ శుభదినం కోసం భక్తులు ఆర్తితో వేచి ఉంటారు.

సృష్ట్యారంభంలో బ్రహ్మ మానసంలో అనేకంగా అవాలనే కోర్కె జనించింది. ఆయన కోర్కెలతో అనేక రకాలుగా క్రీడించి, చివరికి ఈ అశాంతిమయాలయిన కోర్కెలను మానవులకు ప్రాప్తింపజేశాడు. ఆయన పూర్తిగా కామనారహితుడయ్యాడు. మానవులతో ఆయన ఇలా చెప్పాడు: "మీరు కోర్కెలతో క్రీడించి ఆనందించండి. నా కంటూ ఏ కోర్కెనూ మిగుల్చుకోలేదు. నా కోర్కెలన్నింటినీ మీకు ధారాదత్తం చేసివేశాను. నేను కామనారహితుడనే అయినప్పటికీ, నేనే వాటి పాలకుడను. నేను కల్పతరువును."

కోర్కె మనల్ని వంచిస్తుంది, మోహింపజేస్తుంది. దానికి ఆద్యంతాలు లేవు. ముసలితనం మనుష్యులకు వస్తుంది కానీ కోర్కెలకు రాదు. చాలా మంది భక్తులు 'మాకు ఆయురారోగ్యాల్నీ, ధనసంపదల్నీ, పేరుప్రతిష్ఠల్నీ ప్రసాదించు' అని ఒక కోరికల జాబితాతో ఆలయాలకు వెళతారు.

మనం కోరిన కోర్కెలను భగవంతుడు నెరవేరుస్తాడు. కానీ ప్రతి కోరిక వెనుకా ఒక పెద్ద పులి పొంచి ఉందని మరచి పోవద్దు. రోగం, వియోగం, దిగులు, అప్రతిష్ఠ ఇత్యాదులు సజీవమైన పులి కన్నా వేయి రెట్లు భయంకరమైనవి. కాబట్టి మనకు ఏది అవసరమో దానినే ప్రసాదించమని భగవంతుణ్ణి ప్రార్థించాలి.

మనం అమ్మవారిని ఎలా ప్రార్థించాలో శ్రీరామకృష్ణులు మనకు ఇలా వివరించారు: 'అమ్మా! నాకు ఎలాంటి భౌతిక సుఖం అక్కర్లేదు. నాకు పేరుప్రతిష్ఠలు వద్దు. నాకు అష్టసిద్ధులు అక్కర్లేదు. నాకు తక్కిన నూరు శక్తులు కూడా వద్దు. అమ్మా! నీ పట్ల శుద్ధభక్తిని అనుగ్రహించు. అమ్మా! నీ భువనమోహన మాయ నన్ను భ్రమింపజేయకుండుగాక!'



కల్పతరువైన శ్రీరామకృష్ణులను భక్తి, జ్ఞాన వైరాగ్యాల్ని మాత్రమే ప్రసాదించాల్సిందిగా ప్రార్థిద్దాం. ఆయన మనకు ఏది శ్రేయస్కరమో అదే ప్రసాదిస్తారని సంపూర్ణ శరణాగతి భావంతో మెలుగుదాం. ❀

**1. శ్రీరామకృష్ణులు కల్పతరువు పర్వదినాన భక్తులను ఆశీర్వదించింది ఈ మామిడి చెట్టు క్రిందనే!**

**2. శ్రీరామకృష్ణులు ఈ భవనం మేడమీద గది నుంచి దిగివచ్చి భక్తులను ఆశీర్వదించారు. ఆయన ఈ భవనంలోనే మహాసమాధి చెందారు.**

**కలకత్తా కాశీపూర్ రామకృష్ణ మఠ ఆవరణలో నేటికీ ఈ మామిడి చెట్టునూ, భవనాన్నీ చూడవచ్చు.**

(జనవరి 14న సంక్రాంతి)

# పెద్ద పండుగలోని పురాణ విశేషాలు

సేకరణ : కుమారి ఎ. జయంతి



హిందువులకు మకర సంక్రాంతి చాలా పవిత్రమైనది. దేశంలోని అన్ని ప్రాంతాలవారూ తమ తమ పద్ధతులలో ఈ పండుగను భక్తి ఉత్సాహాలతో జరుపుకుంటారు. గంగాసాగర్, ప్రయాగ లాంటి తీర్థాలలో సూర్యోదయానికి ముందే లక్షలమంది స్నానాలు చేసి, ఉదయిస్తున్న సూర్యుణ్ణి ప్రార్థిస్తారు.

ఆదిత్యుడు హిందువులకు ప్రత్యక్షదైవం. కాలచక్రాన్ని తిప్పే సూర్యుడు కాలానికి అతీతుడు. సూర్యుడు ఒక్కొక్క మాసంలో ఒక్కొక్క రాశిలోకి వెళతాడు. అందుకే ఏడాదిలో 12 సంక్రాంతులు వస్తాయి. సూర్యుడు ఒక రాశి నుంచి మరొక రాశిలోకి ప్రవేశించడాన్ని "సంక్రమణం" అంటారు. ఈ పన్నెండు సంక్రాంతులలో దేని ప్రాముఖ్యం దానిదే. అయినా కర్కాటక సంక్రాతికీ (సూర్యుడు కర్కటక రాశిలో ప్రవేశించే రోజు), మకర సంక్రాంతికీ ప్రాముఖ్యం ఎక్కువ. ఈ రెండింటిలోనూ మకర సంక్రాంతి ఆధ్యాత్మికంగా చాలా విశేషమైనది. సూర్యుడు ధనూరాశి నుంచి మకరరాశిలో ప్రవేశించినప్పటి నుండి ఉత్తరాయణం అనీ, మిథునరాశి నుంచి కర్కాటక రాశిలో ప్రవేశించినప్పటి నుంచి దక్షిణాయనం అనీ అంటారు. ఉత్తరాయణాన్ని దేవయానమనీ, దక్షిణాయనాన్ని పితృయానమనీ కూడా అంటారు.

మకర సంక్రాంతి నాటి నుంచి ఉత్తరాయణ పుణ్యకాలం ప్రారంభమవుతుంది. దేవతలకు ఉత్తరాయణం పగలు అనీ, దక్షిణాయనం రాత్రి అనీ అంటారు. భీష్మ పితామహుడికి అతని తండ్రి ఇచ్ఛా మరణ వరమిచ్చాడు. అందువల్ల ఆయన ఉత్తరాయణం వచ్చేదాకా అంపశయ్య మీద ఉండి, ఉత్తరాయణం రాగానే తన భౌతిక దేహాన్ని విడిచిపెట్టాడని మహాభారతంలో చూస్తాం. ఉత్తరాయణ పుణ్యకాలంలో మరణించినవారికి మరుజన్మ ఉండదు అంటారు. ఆది శంకరులు వారు సన్న్యాసం స్వీకరించినది సంక్రాంతి నాడే.

మకర రాశికి అధిపతి శనీశ్వరుడు. ఈయన సూర్యుడి కుమారుడు. సూర్యభగవానుడికీ – ఆయన భార్య అయిన ఛాయకీ కలిగిన పుత్రుడు శని. ఈయన కళ్ళు విప్పగానే (పుట్టిన వెంటనే) సూర్యగ్రహణం ఏర్పడిందట! సూర్యుడు మకర సంక్రాంతి రోజున తన ఈ కుమారుని ఇంటికి వెళతాడట. సాధారణంగా ఈ తండ్రీ కొడుకులకు పడదు, ఎన్ని విభేదాలున్నా సూర్య భగవానుడు ఈ రోజున తామిద్దరం కలవాలనుకుంటాడు. ఇది తండ్రీ తనయుల మధ్య ఉండే అనుబంధాన్ని తెలియజేస్తుంది. చాలామంది తల్లితండ్రులు మకర సంక్రాంతికి తమ పుత్రుల ఇళ్ళకు వెళ్ళి కొడుకులకూ, కోడళ్ళకూ ప్రేమాభిమానాలతో బహుమానాలివ్వడం ఇప్పటికీ వాడుకలో ఉంది. వెళ్ళడానికి వీలు కాకపోతే పెద్దలు తమ పిల్లలకు ప్రేమపూర్వకంగా బహుమానాలు పంపుతారు.

శాపవశాత్తూ కపిలముని ఆశ్రమంలో భస్మరాశులుగా మారిన సగరపుత్రులకు విముక్తి కలిగించడానికి పవిత్ర గంగామాతను భూమ్మీదకి తేవడం కోసం ప్రస్తుతం గంగాసాగర్‌గా ప్రసిద్ధికెక్కిన ప్రదేశంలో తపస్సు చేశాడు భగీరథుడు. పవిత్ర గంగాజలంతో తర్పణాలు విడిచి తమ పూర్వీకులైన అరవై వేల మంది సగరపుత్రులకు భగీరథుడు శా(పా)ప విమోచనం కలిగించింది మకర సంక్రాంతి నాడే! అందుకే ఇప్పటికీ గంగానది బంగాళాఖాతంలో కలిసే చోట (బెంగాల్ రాష్ట్రంలో) మకర సంక్రాంతి నాడు గంగాసాగర్ మేళా జరుగుతుంది.

శ్రీమహావిష్ణువు లోకకంటకులైన రాక్షసులందరినీ సంహరించి, వారి తలలు మంధర పర్వతం కింద పాతిపెట్టింది సంక్రాంతి నాడే. ఇలాగ వ్యతిరేక శక్తుల నిర్మూలననీ, న్యాయబద్ధమైన నూతన జీవన ప్రారంభాన్నీ సూచిస్తుంది 'సంక్రాంతి'. ❀



# అమెరికాలో అనూహ్య దర్శనం

స్వామి శారదానంద కొన్నాళ్ళపాటు న్యూజెర్సీలోని మాంట్‌క్లెయర్‌లో వీలర్ దంపతుల ఇంట్లో అతిథిగా ఉండేవారు. ఆ సమయంలో స్వామి శారదానందకు ఆసక్తికరమైన ఓ సంఘటన తెలిసింది.

స్వామి తరచూ శ్రీరామకృష్ణులను గురించి మాట్లాడుతూ ఉండేవారు. ఒక రోజున ఆయన శ్రీరామకృష్ణుల ఫోటోను శ్రీమతి వీలర్‌కు చూపించారు. ఆ ఫోటోను చూడగానే ఆమె "ఓ స్వామీ! అదే ముఖం ఇది!" అంటూ ఆశ్చర్యాన్ని వ్యక్తం చేసింది.

అప్పుడు స్వామి ఆమెతో "నువ్వు అంటున్నదానికి అర్థం ఏమిటి?" అని ప్రశ్నించారు. అప్పుడావె స్వామి శారదానందకు అసలు సంగతిని ఇలా వివరించింది:



స్వామి శారదానంద

'చాలా కాలం క్రిందట నేను స్వప్నంలో ఒక యోగిని దర్శించాను. అప్పటి నుంచీ ఎవరైనా యోగి వచ్చారని విన్న వెంటనే నేను అక్కడకు వెళ్ళేదాన్ని. కానీ, నేను ఆనాటి దృశ్యంలో చూసిన యోగి మాత్రం నాకు ఎక్కడా కనిపించలేదు. నాకు స్వప్నంలో దర్శనమిచ్చిన యోగి ఇప్పుడు మీరు చూపించిన ఫోటోలోని యోగి ఒక్కరే! ఆయన శ్రీరామకృష్ణులే అని ఇప్పుడు తెలిసింది'.

"తనకు కావాల్సిన వ్యక్తులను గురుదేవులే స్వయంగా ఎంపిక చేసుకుంటారు. మేమంతా కేవలం ఆయన చేతిలోని పరికరాలం మాత్రమే!" అంటూ శ్రీరామకృష్ణులు ఒక భక్తురాలికి ఇచ్చిన అనూహ్య దర్శనం గురించి స్వామి శారదానంద తెలిపారు.

(జనవరి 2న శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన **స్వామి శారదానంద జయంతి)**

# సాధుపురుషుని సేవా ఫలం

ఒకసారి రాఖాల్ (స్వామి బ్రహ్మానంద) వీధిలో నడిచి వెళుతుండగా రోడ్డుపై ఒక చిల్లర నాణెం దొరికింది. అతడు దాన్ని తీసి ఒక బిచ్చగానికిచ్చాడు. పసిబిడ్డ తన తల్లికి అన్ని విషయాలూ తెలియజేసే విధంగా శ్రీరామకృష్ణులకు అన్ని విషయాలూ తెలియజేయడం రాఖాల్ స్వభావం. రాఖాల్ చెప్పింది వినగానే శ్రీరామకృష్ణులు చీవాట్లు పెట్టారు. "చేపలు తినని వ్యక్తి చేపల బజారుకు ఎందుకెళతాడు? ధనమే అవసరంలేని వాడివైతే, ఆ నాణాన్ని ఎందుకు తీసుకుంటావు?" అన్నారు. ఎంత అద్భుతమైన తర్కం. ఆధ్యాత్మిక జీవనానికి తీవ్ర అంతరాయాలైన కామినీ కాంచనాల నుంచి తన మానస పుత్రుడు పూర్తిగా విముక్తుడవ్వాలని శ్రీరామకృష్ణులు ఆకాంక్షించారు.



స్వామి బ్రహ్మానంద

ఒకరోజు మధ్యాహ్నం రాఖాల్ని శ్రీరామకృష్ణులు తన పాదాలు ఒత్తమన్నారు. మొదట రాఖాల్ అనిష్టంగా ఉన్నాడు. కానీ గురుదేవులు "చూడు! సాధుపురుషులను సేవించడం వల్ల అద్భుత ఫలితాలు లభిస్తాయి" అని చెప్పారు.

శ్రీరామకృష్ణుల పాదాలు ఒత్తడం ప్రారంభించగానే, రాఖాల్‌కు జగన్మాత దర్శనం కలిగింది. ఆమె ఏడు, ఎనిమిది ఏళ్ళ వయస్సున్న బాలికలా ఉంది. శ్రీరామకృష్ణుల మంచం చుట్టూ కొన్నిసార్లు ప్రదక్షిణ చేసి, వారి శరీరంలో ప్రవేశించింది. ఈ దృశ్యంతో రాఖాల్‌కు పరమానందం కలిగింది. అప్పుడు శ్రీరామకృష్ణులు చిరు మందహాసంతో "రాఖాల్! సాధుపురుషుని సేవాఫలితం చూశావా?" అన్నారు. ❀

(జనవరి 28న శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన **స్వామి బ్రహ్మానంద జయంతి)**

# దేవీ వైభవం

ప్రవచనం: శ్రీ సామవేదం షణ్ముఖశర్మ విలేఖనం: శ్రీమతి ఎన్. శేషు

(గత సంచిక తరువాయి)

అమ్మవారి ప్రతీ రూపం ఒక దివ్యతత్త్వాన్ని తెలియ చేస్తుంది. అందులో అతి ముఖ్యమైన స్వరూపం లలితా త్రిపురసుందరి; ఈ అమ్మవారు అన్నీ ఇస్తారు. శ్రీరామకృష్ణ పరమహంస "అమ్మ కోసం నేను ఏడ్చాను" అన్నారు. మంత్రంతో కనపడిందా తంత్రంతో కనపడిందా అంటే "నేను అమ్మ కోసం రోదించడం వల్ల కనపడింది" అన్నారు. అమ్మ వారిని ఏడ్చి సాధించాలిట. *'బాలానాం రోదనం బలం'* అంటాం. *'హింసా బలమసాధూనాం, రాజ్ఞాం దండ విధిర్బలం'* – దుర్మార్గుడు హింసించి సాధిస్తాడు, రాజు దండించి సాధిస్తాడు, పిల్లలు ఏడ్చి సాధిస్తారు. అలా అమ్మ వారిని సాధించడానికి గొప్ప విద్య ఏడుపు. అమ్మ మంత్రానికి లొంగదు, ఏడిస్తే లొంగుతుందట.

శంకర భగవత్పాదుల వారొక మాట అంటారు – *"న మంత్రం నో యంత్రం తదపిచ న జానే స్తుతిమహో న చాహ్వానం ధ్యానం తదపి చ న జానేస్తుతి కథాః, న జానే ముద్రాస్తే తదపి చ న జానే విలపనం॥"*

శ్రీవిద్యను ఇంత ప్రబోధించి సర్వత్రా వ్యాపింపజేసిన ఆ మహానుభావుడు మంత్రాలు ఏవీ రావంటారు; స్తోత్రాలు కూడా రావట; సౌందర్య లహరి రచించిన ఆయన అన్నమాట అది! ఏడవడం కూడా రాదన్నారు. విశ్వనాథ సత్యనారాయణ గారు భగవంతుణ్ణి తలచుకుంటే ఏ స్పందనా ఉండని వారిని "చంద్ర దినుసులు" అన్నారు; కొందరు "అమ్మ" అని తలచుకొంటూ కన్నీళ్ళు కారుస్తారు. అలాంటి వారివి గొప్ప జన్మలు.

*"బహువిధ పరితోష బాష్పపూర స్ఫుట పులకాంకిత చారు భోగభూమిం చిరపద ఫలకాంక్షి సేవ్యమానాం పరమ సదా శివ భవానీం ప్రపద్యే"* – నీ శరీరం భోగభూమి ఎప్పుడవుతుంది అంటే పరమేశ్వరుణ్ణి తలుచుకోగానే పులకించిపోయి కన్నీళ్ళు వస్తే అది భోగభూమి అన్నారు; ఆ స్థితి రావాలట!

పరం జానే మాతస్త్వదనుసరణం కష్టహరణం – 'ఇవేవీ రావు కానీ నిన్ను అనుసరిస్తే మాత్రం కష్టాలు పోతాయి, అదొక్కటి తెలుసు. కానీ ఎలా అనుసరించాలో... వీటిలో వేటిలో నేను పండితుణ్ణి కాను అమ్మా' అని ఏడ్చారు శంకరుల వారు. అలాగే శ్రీరామకృష్ణ పరమహంస ఏడ్చి సాధించారట. అప్పుడు అమ్మ దొరికింది. పరమహంసను 'దేవుడున్నాడా? ఉంటే కనపించడేం' అని అడిగారట. దైవం గురించి తెలుసుకోవాలనే తీవ్రమైన తపన ఉంటే దైవమే వచ్చి చెబుతుంది. "దైవం కోసం తపించాలి. నేను ఏడ్చాను, నాకు కనపడింది. నువ్వూ ఏడువు. నీకూ కనపడుతుంది. ఎలా ఏడవాలి అంటే తల్లి పిల్లవాణ్ణి ఎత్తుకుని ఆడిస్తూ, కొంత సేపటికి దించి బొమ్మలిచ్చిందట. వాడు బొమ్మలతో ఆడుకుంటున్నాడు; తల్లి తన పని చూసుకుంటోందట. కొంతసేపు ఆ బొమ్మలతో ఆడుకుని, విసుగొచ్చి బొమ్మలు పక్కన పడేసి 'అమ్మా' అని ఏడ్చాడట. అప్పుడు పనిలో ఉన్న తల్లి పరుగెత్తుకుని వచ్చి, పిల్లవాణ్ణి ఎత్తుకుందట. అలా మనం ప్రపంచపు బొమ్మలలో ఏమీ లేదు, అమ్మే కావాలి అని ఏడిస్తే తప్పకుండా అమ్మ ఎత్తుకుంటుంది" అన్నారు రామకృష్ణ పరమహంస.

అలా ఏడ్చి, ఎంతో తపనపడి "నువ్వు కనబడకపోతే పొడుచుకుంటాను"అని అమ్మ చేతిలోని కత్తి తీసుకున్నారట. అప్పుడు అమ్మ కనపడింది. "అప్పటి నుండీ అమ్మ తన అన్ని రూపాలూ నాకు చూపించింది. ఎన్నెన్ని రూపాలు శాస్త్రాలు వర్ణించాయో అన్ని రూపాలూ చూపించింది. ప్రతీ రూపమూ అందమే. అందులో ఒకటి ఎక్కువ, ఒకటి తక్కువ అనను. కానీ త్రిపుర సుందరీ స్వరూపం అందాలలో కెల్లా అందం. అది సర్వ శ్రేష్ఠమైన స్వరూపం" అని అన్ని స్వరూపాలూ దర్శించిన శ్రీరామకృష్ణ పరమహంస తన అనుభూతిని చెప్పారు.

త్రిపుర సుందరినే రాజరాజేశ్వరి అనీ, కామాక్షి అనీ ఎన్నో రూపాలతో మనం కీర్తిస్తున్నాం. ఆ అమ్మ ధరించిన ఇతర రూపాలను సౌందర్యలహరిలో "శరజ్జ్యోత్స్నాచ్ఛశుద్ధాం, శశియుత జటాజూట మకుటాం" అని ఒక చోట, "కమల వన బాలా తవ రుచిం" అని మరొక చోట – ఇలా రకరకాల

రూపాలను వివిధ రకాలుగా వర్ణించినా, ప్రత్యేకించి సౌందర్య లహరి అంతటికీ కూడా అధిష్ఠాన దేవత అయిన త్రిపుర సుందరీ స్వరూపాన్ని ఒకచోట వర్ణించారు శంకర భగవత్పాదులు. ఆవిడే కాంచీపుర క్షేత్రంలో తల్లి అని చెప్పడం ఆయన ఉద్దేశం. అది ఎలా చెప్పారంటే –

క్వణత్కాంచీదామా కరికలభకుంభస్తననతా
పరిక్షీణా మధ్యే పరిణతశరచ్చంద్రవదనా,
ధనుర్బాణాన్ పాశం సృణిమపి దధానా కరతలైః
పురస్తా దాస్తాం నః పురమథితు రాహోపురుషికా



ఎంత అద్భుతంగా చెప్పారో ఆ తల్లి సౌందర్యాన్ని. ఎదురుగా కళ్ళ ముందు కనిపించిందట.

పురస్తా దాస్తాం... పురస్తాత్ = ముందర; ఎవరి ముందర అంటే... నః పురస్తాత్ = నా ముందర, ఆస్తాం = ఉన్నది. నా ముందర ఉన్నది ఎవరు.... పురమథితు రాహోపురుషికా= త్రిపురాసుర సంహారకుడు అయిన శివుని (పురమథితుడు = త్రిపురాసుర సంహారకుడు); అహోపురుషికా – పురుషికా అంటే పురుషకారం, పౌరుషం, శక్తి. ఒక పురుషుడి శక్తి – పురుషకారం. ఆ పరమేశ్వరుడికి పురుషకారం ఆవిడ. అలాగ అయ్యవారి శక్తే అమ్మవారు అని చెప్పడానికి "అహోపురుషికా" అనే శబ్దం చెప్పారు. అయ్యవారు అహంకార స్వరూపం, ఇది తత్త్వం. అహం అనే స్ఫురణకు మూలమైన చైతన్యమే అమ్మ ఈ తత్త్వాన్ని రూపంగా చూపిస్తున్నారు.

'క్వణత్ కాంచీదామా కరికలభకుంభస్తననతా' – ఆమె ఒడ్డాణం పెట్టుకుని కూర్చుందట; అది చప్పుడు చేస్తున్న మువ్వల ఒడ్డాణం. మువ్వల ఒడ్డాణం కూడా కదిలితేనే చప్పుడు చేస్తుంది. కానీ అమ్మవారు కూర్చుని ఉన్నారు, అయినా క్వణత్ కాంచీదామా! – అంటే ధ్వని చేస్తున్న ఒడ్డాణం పెట్టుకుని ఉన్నారు. 'రణత్కింకిణి మేఖలా' అనే లలితా సహస్రనామం నుండే 'క్వణత్ కాంచీదామా' వచ్చిందట. అంటే అమ్మే చైతన్యం కాదు, అమ్మ వేసుకున్న ఆభరణాలు కూడా చైతన్యవంతాలే; జడములు కావు, స్వయంగా చలనం కలిగి ఉన్న చైతన్య స్వరూపాలు. అమ్మవారి ఆభరణాలన్నీ మంత్ర రహస్యాలు. 'క్వణత్ కాంచీదామా' అంటే శబ్ద స్వరూపమైన ఒడ్డాణం. మంత్రమయమైన శక్తి ఆ ఒడ్డాణంలో ఉన్నది. అలాంటి మ్రోగుతున్న మంత్రమయ స్వరూపిణి జగదంబిక భాసిస్తూ ఉండగా, ఆవిడ నాలుగు చేతులలో నాలుగు పట్టుకుని కూర్చున్నారట. అవేమిటంటే చెరకు విల్లు, ఐదు పువ్వుల బాణాలు, పాశము, అంకుశము. ఈ నాలుగూ ఏమిటో 'లలితా సహస్రం'లో చెప్పారు – "రాగ స్వరూప పాశాఢ్యా క్రోధాకారాంకుశోజ్జ్వలా, మనో రూపేక్షు కోదండా పంచతన్మాత్ర సాయకా" అని. ఇప్పుడు మనం 'దేవీ వైభవం'లో రూప వైభవం చూస్తున్నాం. రూపం నుండి వైభవంలోకి వెళుతున్నాం. ఆ వైభవంలో ఈ నాలుగు చేతుల్లోని రహస్యం ఏమిటి అంటే... ఒకటి చెరకు విల్లు. 'మనో రూపేక్షు కోదండా' – మనస్సనే చెరకు విల్లు. పంచతన్మాత్రలనే పువ్వుల బాణాలు, అనురాగమనే పాశం, క్రోధం అనే అంకుశం. మన బ్రతుకంతా ఈ నాలుగే. జీవితాన్ని పరిశీలించి చూస్తే తెలిసేదేమిటంటే – ఒకటి మన మనస్సు. మనస్సు ఎంత సున్నితమైనదంటే అది చెరకు లాంటిది. తియ్యదనమంతా మనస్సుదే! సుఖం కానీ, దుఃఖం కానీ అనుభవించే స్థితి మనస్సుదే. అనుభవస్థానం మనస్సు. అందుకే చెరకుతో పోల్చారు దాన్ని. వట్టి మనస్సు ఏమీ చెయ్యలేదు, అలాగే వట్టి ధనుస్సు ఏమీ చెయ్యదు. ధనుస్సుకు బాణాలు కావాలి. బాణాలు ఏమిటి అంటే – "పంచతన్మాత్ర సాయకా" – తన్మాత్రలు అంటే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ– ఈ పంచతన్మాత్రలు – పువ్వుల బాణాలు అమ్మ పట్టుకున్నవి. ఇదే మన బ్రతుకంతా కూడా! ఈ ఐదే మన ఇంద్రియాలకు ఉన్న లక్షణం. ఈ ఐదే మనం బయట ప్రపంచంలో చూస్తున్నవి. బయటి ప్రపంచంలో ఉన్న ఐదింటిని ఇంద్రియాల ద్వారా గ్రహించి మనస్సు ఆనందిస్తుంది. మన అనుభూతులన్నీ కూడా ఈ ఐదింటితో కూడుకున్నవే. ఈ ఐదూ స్వయంగా ఏమీ చెయ్యలేవు, మనస్సు కలిస్తే తప్ప! ❀ **(సశేషం)**

# పరిప్రశ్న

**- స్వామి సుకృతానంద**

జి.కె. రావు, కాకినాడ

**? : కైకేయి లేకుండా రామాయణం లేదు కదా? ఆమెను జనులు ఆచంద్రార్కం దూషించడం మంచిదేనా?**

✍: ఆధ్యాత్మికంగా చూస్తే కైకేయిని నిందించనవసరం లేదు. శ్రీరామ కార్యంలో ఆమె ఒక పరికరం. స్త్రీని చెప్పుడు మాటలు ఎంతగా ప్రభావితం చేస్తాయో వాల్మీకి మహర్షి చూపిస్తారు. మన ఇతిహాస, పురాణాలు సమాజంలో జనులు వ్యవహరించే తీరును చూపిస్తూ ఆదర్శ నాయకుల ద్వారా చివరికి సత్యమే గెలుస్తుందనీ, అధర్మ ఆచరణ స్వీయ నాశనానికి కారణమనీ ప్రతినాయక పాత్రల ద్వారా చెబుతున్నాయి. కైకేయి తన స్వార్థ ఆలోచనతో రాముణ్ణి అడవికి పంపి, భర్తనే కోల్పోయింది కదా! అందరికీ దుఃఖాన్ని కలిగించింది. స్త్రీ, పురుషులు అనే భేదం లేకుండా



అందరూ త్యాగజీవితాలను గడపాలని ప్రధాన పాత్రలైన శ్రీరాముడు, సీతా మాత, లక్ష్మణ, భరత, శత్రుఘ్న, ఆంజనేయ స్వాముల ద్వారా రామాయణం తెలుపుతుంది. స్వార్థపరత్వం ఎక్కడ ఉన్నా నిందించవలసిందే!

ఎం.కె. నాగభూషణం, బెంగుళూరు

**? : ఆత్మ యందే బుద్ధినుంచి, ఆత్మను గూర్చియే చింతన చేయుచూ మనస్సును ఆత్మలో సంలగ్నపరచి, నిష్ఠగలిగి ఉండడం ద్వారా ఆత్మజ్ఞానం పొందవచ్చని భగవద్గీతలో భగవానుడు బోధించాడు? ఇది ఎలా సాధ్యం?**

✍: యద్భావం తద్భవతి! ఆత్మ అంటే పరమాత్మ, భగవంతుడు అని అర్థం. నిర్గుణోపాసకులు సాధన చతుష్టయ సంపన్నులై అజ్ఞానాంధకారం, భ్రాంతి నుంచి విముక్తులై సమదర్శిత్వంతో వ్యవహరిస్తారు. వారు సదా పరమాత్మనిష్ఠులై ఉంటారు. ఓ నచికేతుడు, శ్వేతకేతువు, భృగువు, ప్రహ్లాదుడు, ధ్రువుడు, నారదుడు, శ్రీ ఆదిశంకరులు, శ్రీ రామకృష్ణ పరమహంస, రమణ మహర్షి - ఇలా అసంఖ్యాకులైన వారెందరో పరమాత్మ జ్ఞానంతో లోకకల్యాణ కారకులయ్యారు. ఎవరు ఆత్మానందం పొందుతారో వారు బాహ్యంగా అత్యంత దుఃఖం కలిగినా చలించరు. ఈ గీతా శ్లోకం అలాంటి అనుభూతి శ్లోకం. దాన్ని సాధన, భగవదనుగ్రహంతో పొందాలి. వేదాల్లో "ఆత్మక్రీడా, ఆత్మరతిః, క్రియావాన్ యేష బ్రహ్మ విదాం వరిష్ఠః" ఆత్మలోనే క్రీడించు వాడు, పరమాత్మలో రమించువాడు, బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠతముడు, గరిష్ఠుడు అని చెప్పబడింది. ఇవి అతీంద్రియ అనుభవ వాక్యాలు.

పి. సుందర రావు, ఒంగోలు

**? : ఆత్మ, చైతన్యం, ప్రాణం, జీవం - వీటి విశేషార్థాలేమిటో తెలుపవలసిందిగా మనవి?**

✍: **ఆత్మ :** నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త స్వభావమైనది ఆత్మ. వేదాలలో నాలుగు మహావాక్యాలు ఉన్నాయి. అందులో ఒకటి 'అయమాత్మా బ్రహ్మ'. బృహదారణ్యక ఉపనిషత్తు 'ఆత్మే బ్రహ్మ' అంటుంది. జీవుడు బ్రహ్మమే, వేరు కాదు అంటారు బ్రహ్మ విదులు. వేదాల సారమైన ఉపనిషత్తులు బోధించేది ఇదే. అహంకార, మమకారాలతో మనిషి తాను ఎవరో తెలుసుకోలేక నానా బాధలూ పడుతున్నాడు. ఇష్టదేవత అనుగ్రహంతో తానెవరో తెలుసుకుంటే అమరుడవుతాడు. నిష్కామ కర్మల ద్వారా చిత్తశుద్ధి కలిగి జ్ఞానోదయం అవుతుంది. దీని కోసమే ఆధ్యాత్మిక సాధనలన్నీ.

**చైతన్యం :** జడం కానిది. చైతన్యమే ఆత్మ.

**ప్రాణం :** ప్రాణం ఉండబట్టే జీవిస్తున్నాం. శ్వాస (ప్రాణం) పోతే శరీరం శవం అవుతుంది. దేహం బయట ఉన్నది వాయువు, లోపల ఉన్న దానిని ప్రాణం అంటున్నాం. శక్తే ప్రాణం.

**జీవం :** ప్రాణధారణే; శరీరంలో ప్రాణం ఉన్నప్పుడు జీవుడంటారు. చైతన్యం ఉంటుంది. 'జీవో బ్రహ్మైవ' అని. బ్రహ్మం ఒక్కటే ఉన్నది. వేరు లేదు. అందుకే 'బ్రహ్మమొక్కటే, పరబ్రహ్మమొక్కటే' అని అన్నమయ్య పాడారు. ❀

# ఓ ధీర యతివరా !

ఆలపించుము యతివరా!
అనంతోద్భవ ముక్తగీతం
గిరి గుహాంతరసీమలందున
గహనకీకారణ్యములలో
లోకవాసన లేని చోటుల
కామకాంచన యశఃకాంక్షా
కలుషితము కానట్టి నెలవుల
సచ్చిదానంద ప్రశాంతులు
సరితలై ప్రవహించు తావుల
జనన మొందిన ప్రణవగీతిక
జలద గంభీర స్వనమ్మున
నింగి నేల ప్రతిధ్వనించగ
పాడుమా ఓ ధీరయతివర!
ఓం తత్ సత్ ఓం

పసిడివైనా ఇనుపవైనా
పగలగొట్టుము శృంఖలమ్ముల
రాగమో ద్వేషమో సర్వ
ద్వంద్వములు పెనుబంధనములే
చీదరించిన ఆదరించిన
చితకబాదిన దాసు డెప్పుడు
దాసుడే పరతంత్రుడే
సంకెలలదే లోహమైనా
బంధ మొకటే బాధ లొకటే
అందుచే ఓ వీరయతివర
బంధముల ఛేదించి పాడుము
ఓం తత్ సత్ ఓం

కటిక చీకటి తెరలు సాంతం
కరిగి వెలుగులు విరిసి మెరియగ
జనన మరణాజస్ర చక్ర
భ్రమణ మన్నది అంతరించగ
జీవులను శాసించు మిథ్యా
మోహతృష్ణల నుత్తరిస్తూ
తన్ను తాను జయించినపుడే
అన్నిటిని నిర్జించగలమని
తెలిసి పాడుము ధీరయతివర!
ఓం తత్ సత్ ఓం



విత్తి నావోఫలం తప్పదు
కారణం అవుతుంది కార్యం
మంచి కెప్పుడు మంచి జరుగును
చెడుకు చెడుఫలితమ్ము తథ్యము
నియతి ఇది అనివార్య నియమం
నామ రూపములున్న ఎడ బం
ధములు తప్పవు ఇది యథార్థం
ఆత్మ నిత్య విముక్త మని గళ
మెత్తి పాడుము యతివరేణ్యా
ఓం తత్ సత్ ఓం

తలిదండ్రులు ఆలుపిల్లలు
బంధుమిత్రు లటంచు మూర్ఖులు
కలలు కందురదేమి చోద్యమొ
లింగరహితమ్మైన ఆత్మకు
తండ్రు లెవ్వరు? బిడ్డ లెవ్వరు?
మిత్రు లెవ్వరు? వైరు లెవ్వరు?
ఉన్న దొకటె అనన్యమైనది
సర్వమా ఆత్మస్వరూపమే
పాడుమో యతి! తత్వమసి యని
ఓం తత్ సత్ ఓం

ఉన్నదంతా ఆత్మయే అది
నామ రూపాంకములు లేనిది
నిత్యశుద్ధం నిత్యబుద్ధం
ఆత్మ ఒకటే దాని చుట్టూ
మాయ కలలను అల్లుతున్నది
ప్రకృతి పురుషుడు సాక్షి అదియే
అందులోనే నీవు కల వని
పాడుమా ఓ ధీరయతివర!
ఓం తత్ సత్ ఓం

కామ లోభ యశః ప్రతిష్ఠా
కాంక్ష కాపుర మున్నచోటను
నిజం నిమిషం నిలువజాలదు
జీవితంలో వలపుకత్తెగ
స్త్రీని తలచే వా డపూర్ణుడు
సంచితం కించిత్తు ఉన్నా
కోప మది ఇసుమంత ఉన్నా
మాయగుమ్మం దాటజాలడు
వాసనల వర్జించి పాడుము
యతివరా! ఉన్ముక్తగీతం
ఓం తత్ సత్ ఓం



ఇల్లు వాకిలి ఏల నీ కిక
ఎత్తుమనికేతన పతాకం
నీలిగగనం ఇంటికప్పై
నేలయే నీ పట్టుపరుపై
భోజనం యాదృచ్ఛికంగా
ఎంచి రుచులను లెక్కచేయకు
ఆత్మ నిత్య కళంకరహితం
అన్న పానాదికము ల
ద్దాని మలినం చేయజాలవు
జీవనదివలె ప్రణవగీతం
ఆలపిస్తూ సాగు యతివర!
ఓం తత్ సత్ ఓం

తత్త్వమెరిగినవారు అరుదే
వెక్కిరించే మూకలెక్కువ
నిక్కి ముందుకు నిర్భయంగా
ఒక్కడవె చక్కగ చరించుము
హేయ మాయాతిమిర బాధిత
జీవకోటికి ఊతమిస్తూ
బాధలకు భయపడక సుఖముల
కై తపించక ఓ యతీశ్వర
పాడు ద్వంద్వాతీతగీతం
ఓం తత్ సత్ ఓం

మిత్రమా! ఎటు వెతుకుచుంటివి?
ఇచ్చటా మరి అచ్చటా ఎ
చ్చోట ముక్తిని వెతుకుచుంటివి?
గ్రంథములలో కానిపించదు
లేదు దేవాలయము లందున
ఎందుకిక ఈ వ్యర్థయత్నం
నిన్ను బరబర లాగి తనతో
ఈడ్చుకొనిపోతున్న మాయా
పాశమును నీచేత బట్టుక
బేలవై విలపించుతావా?
మానిశోకం వీడి తాడును
పాడుమో యతి ముక్తిగీతం
ఓం తత్ సత్ ఓం

పలుకుమా! సర్వేజనా స్సుఖి
నోభవంతని శాంతి సూక్తం
పలుకు! అభయం సర్వభూతే
భ్యో ప్రవచనం ప్రాణికోటికి
సర్వభూతములందు నేనే
నేను ఆ ఏకైక ఆత్మను
ఇహపరమ్ముల వ్యథలు ఆశలు
సకలమును వర్జించి బంధము
లన్నిటిని తెగదెంచి యతివర!
పాడుమా నిర్మోహగీతం
ఓం తత్ సత్ ఓం

మేను ఉండిననేమి ఊడిన
నేమి దేహభ్రాంతి ఎందుకు?
కర్మవాహినిలోన అది కడ
తేరిపోనీ చింత ఎందుకు?
కొందరీ అస్థికల గూడును
పూలతో పూజించితే అది
కొందరికి బహు నిందనీయం
స్తోత్ర స్తుత్యుడు నిందకుడు నిం
దితుడు ఒకటే అయినచో ఇక
దూషణలు భూషణలు సర్వం
అర్థరహితపు శబ్దజాలం
అందుచే ఓ యతివరా! ఎలు
గెత్తి పాడు విరాగగీతం
ఓం తత్ సత్ ఓం

కర్మబంధములు వదిలే వరకూ
క్రమక్రమంగా ఆత్మవిముక్తికి
విక్రమించు మిక జన్మం శూన్యం
నీవూ నేనూ జీవుడు దేవుడు
ఎవరూ మిగలని చిరచింతన మిది
నే నన్నిటిలో సకలం నాలో
మిగిలిన దొక పరమానందమ్మే
ఎరిగి 'తత్వమసి' పరతత్వమ్మును
పాడుము యతివర! ప్రబోధగీతం
ఓం తత్ సత్ ఓం.

**అనుకృతి : గజ్జెల మల్లారెడ్డి**

*స్వామీజీ 1895 జూలైలో సహస్ర ద్వీపం (న్యూయార్క్)లో ఉన్నప్పుడు ఆయన ముఖతః అపూర్వ త్యాగభక్తి వైరాగ్య భావాలు ఆశుధారా ప్రవాహంగా వెలువడ్డాయి. ఆ అపూర్వ తాత్వికావేశ ఫలితంగానే ఈ **'యతిగీతం'** (The Song of the Sannyasin) ప్రాదుర్భవించింది.*

# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -19

(గత సంచిక తరువాయి...)

# తపించే హృదయం !

పఠాన్‌కోట ఊరి బయట ఒక అందమైన శివాలయం ఉంది. దాని చుట్టుపక్కల ప్రాంతమంతా రమణీయంగా ఉంది. అక్కడ ఒక మంచినీటి ఊట ఉంది. వర్షాకాలంలో ఆ నీరు ప్రవహించి ఒక చిన్న నది రూపం దాలుస్తుంది. వర్షాకాలంలో ఆ నీటి ప్రవాహం తీవ్రంగా ఉంది. నాలుగు వైపులా చెట్లూ చేమలూ పచ్చగా, అందంగా ఉన్నాయి.

స్వామి జపానంద యాత్రలు చేస్తూ డల్‌హౌజీ చంబా కొండ నుంచి దిగి అక్కడకు వచ్చారు. శివాలయం పక్కనే ఒక చిన్న గది ఉంది. పూజారిని అడిగితే ఆ గదిలో ఉండమన్నారు. రాత్రి అయ్యేసరికి బాగా జ్వరం వచ్చింది. స్పృహ లేకుండా రాత్రంతా, మర్నాడు సాయంత్రం నాలుగు గంటల వరకూ అలాగే ఉన్నారు. పూజారి మంచి మనిషి, కానీ అతని పరిస్థితీ అలాగే ఉంది. అతను కూడా జ్వరంతో నీరసంగా పడుకునే ఉన్నారు. ఒక పంజాబీ స్త్రీ వచ్చి, పూజారి సేవ చేసి వెళ్ళిపోతూ ఉంటే అతను పక్క గదిలో ఉన్న సాధువు విషయం చెప్పారు. సాధువుకు ప్రణామ్ చేద్దామనుకుని ఆమె ఆ గదిలోకి వచ్చింది. అక్కడ జ్వర తీవ్రతతో పడుకుని ఉన్న స్వామిని చూసి మొదట నిద్ర పోతున్నారనుకుంది. సాయంత్రం అయిపోయింది కదా నిద్ర లేపితే బాగుంటుందనుకుని "మహరాజ్! సాయంత్రం అయింది. ఇంకా ఎంత సేపు నిద్ర పోతారు లేవండి" అని పిలిచింది. అలా ఎన్ని మార్లు పిలిచినా ఆ సన్న్యాసి పలకలేదు. ఆమె అప్పుడు దగ్గరకు వెళ్ళి చూస్తే తెలిసింది– ఆయన స్పృహలో లేరని! ఆమెకు కళ్ళలో నీళ్ళు తిరిగాయి. 'భగవంతుడే నన్ను ఇటు వెళ్ళమని నిర్దేశించాడు. లేకపోతే ఈయన జ్వరంతో తిండి లేకుండా ఇలాగే పడి ఉండే వారు. ఊళ్ళో మలేరియా జ్వరం బాగా ఉంది. నేను వేడి పాలు తీసుకొచ్చి ఇస్తాను. పాలు తాగితే ఈయనకి కొంచెం శక్తి వస్తుంది' అని మనస్సులో అనుకుంటూ ఆ మాటలు పైకే పలికింది. అది వినిపించింది స్వామి జపానందజీకి.

లేచి కూర్చోవడానికి ప్రయత్నం చేశారు కానీ, సాధ్యపడలేదు. ఆమె జాగ్రత్తగా సన్న్యాసిని పట్టుకుని కూర్చోబెట్టింది. తాగడానికి నీళ్ళు ఇచ్చింది. పాలు తీసుకురావడానికి బజారుకు వెళ్ళింది. బజారు కొంచెం దూరంగా ఉంది. బజారు నుంచి పాలు తెస్తూ, తన



కుమారుణ్ణి కూడా తీసుకొని వచ్చింది. తన కొడుకుకు స్వామిని చూపించి, "అనారోగ్యంగా ఉన్నవాళ్ళకు సేవ చేయాలి. నువ్వు పొద్దుటే వచ్చి స్వామీజీకి పాలు తీసుకొచ్చి ఇవ్వు. నేను కొంచెం ఆలస్యంగా వస్తాను. మహరాజ్‌కు ఏం తినాలని ఉందో అడిగి నాకు చెప్పు. ఆయనకు ఏం కావాలో అది నేను వండి తీసుకొస్తాను. మళ్ళీ సాయంకాలం వచ్చి చూడు. కావలసినవి తీసుకుని వచ్చి ఇవ్వు" అని చెప్పింది.

చాలా రోజులు సన్న్యాసి జ్వరంతో బాధపడ్డారు. ఆ దయామయి వారిని కన్నతల్లిలా చూసుకుంది. ఏ ఇబ్బందీ కలగకుండా సేవ చేసింది. కొన్ని రోజుల తరువాత అక్కడ ఆర్యసమాజపు అధ్యక్షుడు ఆ విషయం తెలుసుకుని స్వామి జపానందజీని చూడడానికి వచ్చారు. బండి తెప్పించి ఆర్యసమాజం తాలూకు అతిథి గృహానికి తీసుకెళ్ళారు. వైద్యుణ్ణి పిలిపించి చికిత్స ఇప్పించారు. అక్కడ ఆయన రెండు నెలలు ఉన్నారు. స్వామి జపానందజీ ఆరోగ్యం మెరుగయ్యేంత వరకూ సేవలందించింది ఆ తల్లి. ❀

(మిగతా వచ్చే సంచికలో...)

అనువాదం : శ్రీమతి జి.ఎస్. లక్ష్మి

# దేవుని దాసుడు

కథ : టి.ఎం.ఎస్., చిత్రాలు : శంకర్
తెలుగుసేత : స్వామి జ్ఞానదానంద




4
ఆ సాయంత్రం రామానుజాచార్యులు మల్లయోధునికి శ్రీరంగనాథుని దర్శనం చేయించారు. ఆ భగవంతుని కృపాకటాక్షం ఆయనపై ప్రసరించింది.
అద్భుతమైన అంగ సౌష్ఠవం, ముఖమండలం కలిగిన శ్రీరంగనాథ స్వామిని దర్శించుకో నాయనా!
శ్రీరంగనాథుని అందమైన కళ్ళను చూసిన వెంటనే మల్లయోధుడు పరవశించిపోయాడు.
5
స్వామీ! ఒక స్త్రీ బాహ్యసౌందర్యానికి మతి భ్రమించి పిచ్చివాడినైన నన్ను కనికరించి నా భ్రాంతిని పోగొట్టిన ఓ గురువర్యా! ఇకపై ఆ రంగనాథ స్వామికి మాత్రమే నేను ఊడిగం చేస్తాను!
ఈ రోజు నుండి 'విల్లిదాసు' అనే పేరుతో నువ్వు స్వామి సేవలు చేస్తూ ఉండు!
మల్లయోధుడు, అతని భార్య శ్రీరామానుజుల వారి సేవకి సంపూర్ణంగా అంకితమయ్యారు.
6
విల్లిదాసు పట్ల శ్రీరామానుజులు అపారమైన కృపాకటాక్షం వర్షింపజేశారు. రోజూ కావేరీ నదిలో స్నానం చేసి అతని భుజం పట్టుకుని నడిచేవారు. విల్లిదాసు పట్ల తమ గురువు చూపిస్తున్న ప్రేమను చూసి ఇతర శిష్యులు అసూయ చెందారు.
7
ఈ విషయం గమనించిన శ్రీరామానుజులు తమ శిష్యుల అపోహను తొలగించాలని సంకల్పించారు. ఒక శిష్యుణ్ణి ఇతర శిష్యుల ధోవతులన్నీ కాస్త కాస్త చింపి రమ్మన్నారు. మరుసటిరోజు...

మిగతా 36వ పేజీలో...



# దివి నుంచి దిగివచ్చిన దివ్య పురుషుడు
# స్వామి వివేకానంద

– స్వామి రంగనాథానంద

విద్యార్థి దశలో ఉన్న నరేంద్రుడికి బలమైన కోరిక ఒకటి ఉండేది – "భగవంతుణ్ణి ప్రత్యక్షంగా చూడాలి, సాధ్యమా"? ఇదే ప్రశ్నను శ్రీరామకృష్ణులను "మీరు భగవంతుణ్ణి ప్రత్యక్షంగా చూశారా?" అని అడిగాడు. అందుకు గురుదేవులు, "అవును. చూశాను, స్పష్టంగా.. నిన్ను చూస్తున్నంత స్పష్టంగా చూశాను" అంటూ "నువ్వు కూడా భగవంతుణ్ణి చూడగలవు". అని చెప్పారు. భగవంతుణ్ణి చూడాలి అనే తీవ్రమైన కాంక్షే నరేంద్రుణ్ణి స్వామి వివేకానందగా తయారుచేసింది. ఆ ఆకాంక్షే ప్రపంచానికి ఆధ్యాత్మిక వెలుగులను ఇచ్చింది. జీవితంలో ఏం కావాలన్న విషయంలో స్పష్టత రావాలి. ఆ దిశగా ప్రయత్నం చెయ్యాలి. విశ్వాసం, పట్టుదల, కార్యదీక్ష మనిషిని మహోన్నతునిగా తయారుచేస్తాయని స్వామీజీ ఆచరణలో చూపారు.

**గురుసాన్నిధ్యం :** నరేంద్రుడు 18 ఏళ్ళ ప్రాయంలో ఉన్నప్పుడు రామకృష్ణుల దగ్గరకు వెళ్ళాడు. నరేంద్రను చూడగానే అతనిలోని ప్రత్యేక లక్షణాలను గుర్తించిన గురుదేవులు, అతను తన ప్రణాళికలను అమలుచేసే ఋషిగా నిర్ధారణ చేసుకున్నారు. ఆ యువకునిలోని దివ్యత్వాన్ని వెలికితీసే బాధ్యత తీసుకున్నారు. పరాయి వారి పాలనలో బానిసత్వ లక్షణాలతో ఉన్న భారతీయుల్ని జాగృతపరిచే శక్తిగా మలిచారు.

ప్రతి మానవుడూ గురుసాన్నిధ్యంలోనే పరిపూర్ణుడు కాగలడు. తాను ఏమిటో తన ప్రయోజనం ఏమిటో తెలుసుకునే జ్ఞానం గురువు దగ్గరే లభిస్తుంది. మానవుణ్ణి మహాత్మునిగా తీర్చిదిద్దే శక్తి గురువుకు ఉంటుందని వేదాలు, ఉపనిషత్తులు చెబుతున్నాయి. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు కూడా వారి అవతార లక్ష్యాలను గురువు దగ్గరే తెలుసుకోగలిగారు. ఆధునిక పరిభాషలో చెప్పాలంటే, మన పాస్‌వర్డ్ గురువు సన్నిధిలోనే తెలుసుకోగలుగుతాం.

**స్వామి వివేకానంద జన్మవృత్తాంతం :** రామకృష్ణ భగవానులు గురువుగా అవతరించేందుకు దివి నుంచి భువికి దిగి వస్తూ సప్తర్షిమండలంలో ఒక ఋషీశ్వరుని దగ్గరకు వెళ్ళి "నేను వెళ్తున్నాను, మీరూ భూమండలానికి దిగి రండి" అని చెప్పి వచ్చారు. ఆ ఋషీశ్వరుడే తన ఎదురుగా ఉన్న యువకుడు అని తమ యోగశక్తితో గురుదేవులు గ్రహించారు. నరేంద్ర నామధేయంతో ఉన్న ఆ యువకుణ్ణి స్వామి వివేకానందగా తీర్చిదిద్దారు.

**స్వామి వివేకానంద ప్రపంచానికి చేసిన మేలు :** మన సంస్కృతిలో ఉన్న గొప్ప లక్షణాలను వెలికి తీసి, మనలో అనాదిగా ఉన్న రుగ్మతలనూ, బలహీనతలనూ నిర్దాక్షిణ్యంగా ఖండించారు. పశ్చిమదేశాలలోని గొప్ప విలువలను మన జాతీయతలోకి తీసుకువచ్చారు. అలాగే ఎంత ప్రగతి సాధించినా ఆధ్యాత్మిక పునాది లేకుంటే అది కుప్పకూలుతుందని వివరించి, పాశ్చాత్యులకు ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచారు.

**మానవ సేవే మాధవ సేవ :** ఆచరణాత్మకమైన ఆధ్యాత్మిక విద్యనే ప్రజలకు బోధించారు. ఆకలితో ఉన్నవాడి ఆకలి తీర్చడమే అసలైన దైవ భక్తి అని ఆచరణలో చూపారు. భగవంతుని గురించి చెబుతూ, "నువ్వు భగవంతునికై వెతుకుతున్నావా? అయితే మానవునిలోనే వెతుకు" అని ఆధ్యాత్మికతకు నూతన సందేశాన్నిచ్చారు.

'త్యాగం, సేవ' అనే రెండు జాతీయ ఆదర్శాల్ని స్వామీజీ మనకు అందించారు. ఈ రెండు ఆదర్శాల్ని పెంపొందించుకుంటే వ్యక్తిగా త్యాగభావంలో సంతృప్తి, సేవాభావంలో ఆనందం లభిస్తాయి. దేశం సమగ్రాభివృద్ధి చెందుతుంది. ❀

**సేకరణ: ఆర్. కృష్ణ**

# మార్గాన్వేషణం



**రా**మా! సాధన చతుష్టయాలైన సంతోషం, శమం, విచారణ, సాధు సంగమం అనేవి సంసార సాగరం నుంచి తరింపజేసే ఉపాయాలు.

**శ్లో॥ సంతోషః పరమోలాభః సత్సంగం పరమాగతిః ।**
**విచారః పరమః జ్ఞానం శమోహి పరమమ్ సుఖమ్॥**

'సంతోషమే పరమ లాభం. సత్సంగమే పరమగతి. విచారమే పరమ జ్ఞానం. శమమే పరమ సుఖం'.

ఈ నాలుగు రకాలైన ఉపాయాలనూ అభ్యసించేవారే ఘనీభూతమై ఉన్న ఈ మోహజాలాన్ని జయిస్తారు. వీటిలో ఏ ఒక్క దాన్నైనా సర్వశక్తి యుక్తులతో అభ్యసిస్తే, మిగతా మూడూ కూడా లభిస్తాయి. అందుచేత రామా! తాత్సారం చేయకుండా, అందులో ఒక్కదానినైనా అభ్యసించాలి.

స్వచ్ఛమైన శమం వల్ల హృదయం నిర్మలమైనప్పుడు అట్టి వాని వద్దకు మిగతా మూడూ వచ్చి చేరుతాయి. సంతోషం, విచారణ, సత్సంగం ఉన్నచోట 'జ్ఞానం' రూపు దిద్దుకుంటుంది, సుగుణాలన్నీ ఆశ్రయిస్తాయి, విజయలక్ష్మి వరిస్తుంది.

ఓ జనులారా! మీరంతా "స్వప్రయత్నం" అనే పురుషకారం చేత మనస్సును జయించి, ఈ నాల్గింటిలో ఏ ఒక్కదానినైనా నిరంతరం ప్రయత్నపూర్వకంగా అవలంబించండి. "శ్రద్ధతో, ఓర్పుతో, నేర్పుతో – ఒక్కటైనా దైనందికమైన అలవాటుగా మార్చుకోండి" అని మీ శ్రేయోభిలాషులమైన మేము పదే పదే చెబుతున్నాం. ఈ నాల్గింటినీ కాస్త కాస్త ఆశ్రయిస్తూ పోగా, కొంతకాలానికి అంతా సుసాధ్యమే అవుతుంది. మొదట్లో కొంత పట్టుదల వహించి, ఆ తరువాత ప్రయత్నం వీడకుండా ఉంటే మీకు సాధ్యం కానిదంటూ ఏదీ ఉండదు. అసలు ప్రయత్నమనేదే చేయకుండా, "మానవ మాత్రులం! మా వల్ల ఏమవుతుంది?" అని మిమ్మల్ని మీరే సముదాయించుకుంటూ, తుచ్ఛ విషయాలకై పరుగులు పెడితే అది మూర్ఖత్వమే కదా! ఎందుకంటే మానవులలోనే అత్యంత మహనీయులు, ఆత్మజ్ఞులు... అత్యంత మూర్ఖులు కూడా ఉన్నారు. అందువల్ల సాధన చెయ్యండి. అసలు రహస్యమంతా సాధనలోనే ఉంది కానీ, దైవంలో కాదు.

ఈ చిత్తాన్ని పురుషకారంతో జయించి, ఈ నాల్గింటిలో ఒక్కదానినైనా వశం చేసుకుంటేనే 'ఉత్తమగతి'. అలా కాకుండా, చిత్తం యొక్క ఇచ్ఛ ప్రకారం వర్తించడం, ఇంద్రియ విషయాలను మాత్రమే ఆశ్రయించడం, కల్పిత వ్యవహారాలనే నమ్ముకొని ఉండడం... అది శుభప్రదం అవుతుందా? ఈ నాల్గింటి కోసం కష్టపడి ప్రయత్నించాలి.

ఈ చంచల చిత్తం గుణదోషాలనే ప్రీతిపూర్వకంగా ఆశ్రయిస్తోంది. ఆ గుణ దోషాలను మొట్టమొదట జాగ్రత్తగా గుర్తించాలి. అయ్యో! ఈ సాంసారిక జీవులు తమ చిత్తం ఆశ్రయించే గుణ దోషాలేమిటో గమనించడానికి కొంచెమైనా ప్రయత్నించకుండా, పరుల దోషాలను మాత్రం ఎంచుతూ కాలం వెళ్ళబుచ్చుతున్నారే? ఇది అత్యంత దౌర్భాగ్యకరమైన విషయం.

అయితే ఈ గుణదోషాలు తొలగేదెలా? సుగుణాలను ఆశ్రయించడమే అందుకు ఉపాయం. కనుక రామచంద్రా! నీకు ఏ మార్గం కావాలో బాల్యంలోనే నిర్ణయించుకో. చక్కగా విచక్షణ చేయి. మార్గాన్ని అన్వేషించు. అనుసరించు. అంతేకానీ, దుఃఖిస్తూ కూర్చుంటే నీకు గానీ, నీ వల్ల మరెవరికైనా గానీ ఏ లాభమూ ఉండదు.

ఈ మనస్సు తన యొక్క వాసనా వేగంతో ఎప్పటికప్పుడు జీవుణ్ణి ముంచెత్తుతుంది. అయితే అలాంటి వాసనలు, తటాకానికి రెండువైపులా ఉన్న గట్లలాగ శుభ – అశుభ రూపాలలో ఉంటున్నాయి. 'శుభం' అనే ఆవలి ఒడ్డుకు చేరుతావా? అశుభాన్నే ఆశ్రయిస్తూ రోజులు గడుపుతావా? నీ ఇష్టం. ప్రయత్నాన్ని బట్టే ప్రయోజనం ఉంటుంది. తాత్సారం చేసేవారికి అనేక జన్మలు గడిచిపోతున్నాయే కానీ, నివృత్తి లభించడం లేదు. కాబట్టి రాఘవా! పురుషకారాన్ని ఆశ్రయించు. అప్పుడు అశుభ వాసనలు నిన్ను ఏ మాత్రం సమీపించలేవు. ❀

*('శ్రీవసిష్ఠ రామ సంవాదం' ముముక్షు–వ్యవహార ప్రకరణం నుంచి)*

**అనువాదం : వై. హెచ్. రామకృష్ణ**



స్వామి వివేకానందుని పూర్వీకుల గృహం ఉన్న గౌర్‌మోహన్ ముఖర్జీ వీధి



స్వామి వివేకానందుని పూర్వీకుల గృహం (పునరుద్ధరణకు ముందు)



స్వామి వివేకానందుని పూర్వీకుల గృహ సింహద్వారం (పునరుద్ధరణ తరువాత)



భువనేశ్వరీ దేవి పూజా మందిరంలోని శివలింగం

# నరేంద్రుడు నడయా

## స్వామీజీ జన్మగృహ

స్వామి వివేకానంద (నరేంద్ర) కలకత్తాలోని సిమ్లా (సిమూలియా)లో
స్వామి వివేకానంద జన్మించిన ఆ గృహం 2002లో రామకృష్ణ మిషన్ కేం
ఉండేదో అచ్చం అలాగే దానిని రామకృష్ణ మిషన్ పునరుద్ధరించింది. ఆ గ
విరాజిల్లుతోంది. ఈ కేంద్రం 1. స్వామి వివేకానంద ధ్యానమందిరం, 2. స
4. గ్రామీణ, మురికివాడల అభివృద్ధి కేంద్రం, 5. వ్యక్తిత్వ వికాస కేంద్రం - మొ

### తనువు పులకించే నరేంద్ర

1) నరేంద్రుడు చిన్నప్పుడు చాలా అల్లరి చేసేవాడు. నరేంద్రుని అల్లరిని
చేశావంటే శివుడు నిన్ను కైలాసానికి రానివ్వడు' అని బెదిరించగానే నరేంద్రుడు
చూసి కుటుంబసభ్యులు భయభ్రాంతులకు లోనయ్యారు. అతడు మాత్రం లేశ
భిక్ష కోసం తమ ఇంటికి వస్తే నరేంద్రుడు తన చేతికి అందిన వస్తువులన్నీ వారికి
తాళం వేసేవారు. 4) నరేంద్రుడు ఒక రోజు ధ్యానం చేసుకుంటున్నప్పుడు ప్రశాం
భగవానుడని తరువాత కాలం
అతడి మధుర గానాన్ని విని
తబలా, పక్వాజ్ మొదలైన స



స్వామి వివేకానందుడు త
3 గౌర్‌మోహన్ ముఖర్జీ వీధి,
సందర్భంగా (ఆంగ్ల క్యాలండర్
ప్రకారం 17 జనవరి 2009) అ

స్వామి వివేకానందుని త
పూజించింది. ఒకరోజు ర
ఆయన నుంచి దివ్య తేజస్సు
మారి భువనేశ్వరీదేవి గర్భం
ఆనందంతో ఓలలాడింది. '
భువనేశ్వరీ దేవి
వివేకానందునిగా

# ాడిన పుణ్యధామం!

హం – చిత్రమాలిక

లో నెలకొన్న గౌర్‌మోహన్ వీధిలోని 3వ నంబర్ ఇంట్లో జన్మించారు.
కేంద్రంగా గుర్తింపు పొందింది. స్వామీజీ జన్మించినప్పుడు ఆ గృహం ఎలా
ఆ గృహం నేడు 'వివేకానంద పూర్వీకుల గృహం, సాంస్కృతిక కేంద్రం'గా
స్వామి వివేకానంద జీవితంపై చిత్ర ప్రదర్శనశాల, 3. పరిశోధనా కేంద్రం,
మొదలైన విభాగాల ద్వారా నేడు అనేక సేవాకార్యక్రమాలను నిర్వహిస్తోంది.

## ద్రుని బాల్యలీలలు కొన్ని :

ని అదుపుచేయలేక విసుగుపోయి భువనేశ్వరీ దేవి 'నరేంద్రా! నువ్వు అల్లరి
కు శాంతించేవాడు. 2) నరేంద్రుడు ధ్యానం చేస్తున్నప్పుడు ప్రక్కనే త్రాచుపామును
లేశమైనా బాహ్యస్పృహ లేని ధ్యానస్థితిలో నిమగ్నమై ఉన్నాడు. 3) సాధువులు
లకి ఇచ్చేసేవాడు. అందువల్ల సాధువులు వచ్చినప్పుడు అతణ్ణి మేడపై గదిలో ఉంచి
శాంతత మూర్తీభవించిన ఒక సన్న్యాసిని దర్శించాడు. ఆ ప్రశాంత మూర్తే బుద్ధ
లంలో వివేకానంద తెలియజేశారు. 5) నరేంద్రుడు శ్రావ్యంగా గానం చేసేవాడు.
ని శ్రీరామకృష్ణ పరమహంస భావసమాధి స్థితిని పొందేవారు. నరేంద్రుడు
సంగీత వాయిద్యాలను వాయించడంలో కూడా ప్రావీణ్యం సంపాదించాడు.

తన బాల్య లీలల్ని ప్రదర్శించిన ఆ గృహాన్ని (స్వామి వివేకానంద పూర్వీకుల గృహం,
ధి, కోలకత్తా -700 006 ) నేటికీ సందర్శించవచ్చు. స్వామి వివేకానంద జన్మదిన
కర్ ప్రకారం జనవరి 12 - జాతీయ యువజన దినోత్సవం, ఈ సంవత్సరం తిథి
) ఆ పుణ్యధామం చిత్రమాలికను 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు అందిస్తున్నాం...

తల్లి భువనేశ్వరీదేవి మగ బిడ్డ కోసం అచంచల భక్తి ప్రపత్తులతో శివుణ్ణి
రాత్రి భువనేశ్వరీదేవికి కలలో శివుడు ధ్యాన నిమగ్నుడై దర్శనమిచ్చాడు.
స్సు వెలువడి భువనేశ్వరీ దేవిని ఆవరించింది. పరమశివుడు మగ శిశువుగా
ంలో ప్రవేశించాడు. అప్పుడు భువనేశ్వరీదేవి మనస్సు అనిర్వచనీయమైన
'ప్రభో పరమేశ్వరా! నీవే నా కుమారుడిగా జన్మించబోతున్నావా!' అంటూ
పారవశ్యంతో విలపించింది. 12 జనవరి 1863న ఆ వీరేశ్వరుడు
గా అవతరించింది ఈ గృహంలోనే! ❀



నరేంద్రుడు ధ్యానం చేసిన గది



వివేకానందుని తల్లి భువనేశ్వరీ దేవి



వివేకానందుని అక్క స్వర్ణమయి



స్వామి వివేకానందుని తమ్ముళ్ళు మహేంద్రనాథ్ దత్తా, భూపేంద్రనాథ్ దత్తా



స్వామి వివేకానంద పూర్వీకుల గృహం, సాంస్కృతిక కేంద్రం



స్వామి వివేకానంద ఉపయోగించిన సంగీత వాయిద్యాలు

# అసలైన విజయం!

- గౌతమ్

ఆధ్యాత్మిక జీవితంలో విజయం సాధించడం గురించి చెప్పుకొనే ముందు అసలు ఆధ్యాత్మిక జీవితం అంటే ఏమిటో తెలుసుకోవాలి. భగవత్ దర్శనమే ఆధ్యాత్మిక జీవితమా లేక మానవాతీత శక్తులను సాధించడమా లేక పూజలు, వ్రతాలు, తపస్సు చేసి ప్రాపంచిక జీవితంలో విజయం సాధించడమా?

పరమేశ్వరుడి దర్శనమే చాలు అనుకుంటే రావణాసురుడికి ఆ దేవదేవుడు ప్రత్యక్షమయ్యాడు. మన దేశంలో మానవాతీత శక్తులున్నవారు చాలా మందే ఉన్నారు. కొందరు లోహాన్ని బంగారం చెయ్యగలరు, కొందరు గాలిలో ఎగరగలరు, కొందరు ముందు జరగబోయేదాన్ని చెప్పగలరు, మరికొందరు కాయసిద్ధిని సాధించి తమ ఆయుర్దాయాన్ని పొడిగించుకోగలరు. పూజలూ పునస్కారాలూ చేసి సంపద, కీర్తి, అధికారాలను పొందేవారి సంఖ్య చెప్పలేనంత ఉంది.



మరి ఆధ్యాత్మిక జీవితం అంటే ఏమిటి? పూజలు చెయ్యొచ్చు, భక్తిని పెంపొందించుకోవచ్చు కానీ భగవంతుణ్ణి ఏమీ అడగకూడదు. "భగవంతుడా! నా కోరిక తీర్చు. నాకు అది ఇవ్వు... ఇది ఇవ్వు... నా కోరిక తీరిస్తే నీకు నేను ఏదో చేస్తాను..." అనడం భక్తి కాదు; అది భగవంతుడితో వ్యాపారం.

పర్షియాను జయించి, ఉత్తర భారత దేశంలో పురుషోత్తముడనే రాజును ఓడించి, దక్షిణాపథం వైపు దూసుకుని వెళుతున్నాడు అలెగ్జాండర్ చక్రవర్తి. అతని రథానికి ఇరువైపులా శిరస్సు వంచి ప్రణామాలు చేస్తున్నారు జనం. అతని ఆధిపత్యాన్ని ఎదిరించలేక తల వంచుతున్నారు.

రథంలో పయనిస్తున్న అలెగ్జాండర్ దృష్టి ఒక వ్యక్తి పైన పడింది. అతను తల వంచి నమస్కరించ లేదు. అలెగ్జాండర్ వైపు తదేకంగా చూస్తున్నాడు. అది గమనించి వెంటనే ఒక సైనికుడు ఆ వ్యక్తి దగ్గరకు వచ్చి "బతికి ఉండాలంటే తల దించు. లేకపోతే ప్రాణాలతో ఉండవు" అని బెదిరించాడు.

అయితే అతను ఆ సైనికుడి మాటలు వినిపించుకోలేదు. ఇది చూసిన అలెగ్జాండర్ తన రథం ఆపి, ఆ వ్యక్తి దగ్గరకు వెళ్ళాడు. "నేనెవరో తెలుసా" అని గర్జించాడు. అతను బదులు చెప్పకుండా అలెగ్జాండర్‌నే చూడసాగాడు. అలెగ్జాండర్ కోపంగా తన ఖడ్గం తీసి, "తల వంచక పోతే శిరచ్ఛేదన చేస్తాను" అని హెచ్చరించాడు. అయినా ఆ వ్యక్తి నిశ్చలంగా ఉన్నాడు. అలెగ్జాండర్ అతని మీద పట్టరాని కోపంతో తన చేతిలోని కత్తిని ఎత్తాడు. అయినా అతడు చలించలేదు. అలెగ్జాండర్ నిశ్చేష్టుడయ్యాడు. ధైర్యాన్ని కోల్పోయాడు, మానసికంగా దుర్బలుడయ్యాడు.

"నీకు మరణమంటే భయం లేదా?" అని అలెగ్జాండర్ అడగగా ఆ వ్యక్తి మందహాసంతో "లేదు" అన్నాడు. తన జీవితంలో ఇప్పటి వరకూ ఇలాంటి వ్యక్తిని ఎదుర్కోలేదని గ్రహించాడు అలెగ్జాండర్. ఎదురులేని వీరుడిగా పేరుగాంచిన అలెగ్జాండర్‌కు ఆ వ్యక్తిని తాను ఎదిరించలేనని తెలిసింది.

"మరణమంటే ఈ వ్యక్తికి భయం లేదెందుకు?" అని మనస్సులో పదే పదే అనుకున్నాడు. "నువ్వెవరు? నీకు మరణమంటే ఎందుకు భయం లేదు?" అని అడిగాడు.

ఆ వ్యక్తి "నేను శరీరాన్ని కాదు, బుద్ధిని కాదు, మనస్సును కాదు. నాకు చావు, పుట్టుకలు లేవు. లేని చావుకు భయం ఎందుకు? నువ్వు ప్రపంచ సామ్రాట్‌వి కావచ్చు కానీ నిన్ను నువ్వు శరీరమని అనుకుంటున్నావు. ఎంత రాజ్యం ఉంటే ఏమిటి, ఏదో ఒక రోజు మరణిస్తావు. అప్పుడు నీకు కావాల్సింది ఆరడుగుల నేల మాత్రమే. ఆఖరికి నువ్వు సాధించేది అదే" అన్నాడు.

అప్పుడు అలెగ్జాండర్ 'ఆ వ్యక్తి ఒక మహాయోగి' అని గ్రహించాడు. వెంటనే యుద్ధప్రయత్నాన్ని విరమించుకొని, ప్రణామం చేసి వెనక్కి తిరిగాడు.

ఆధ్యాత్మికత అంటే మనోబుద్ధి అహంకారాలను జయించి తాను ఆత్మస్వరూపుడననే జ్ఞానం పొందడమే! ఆధ్యాత్మిక సామ్రాజ్యంలో అదే 'అసలైన విజయం!' ❀

## మనిషిని మనీషిగా మార్చేది

# ఓ మంచి ఆలోచన

– స్వామి సేవ్యానంద

మనం మన శారీరక ఆరోగ్యానికి అవసరానికి మించి ప్రాధాన్యమిస్తాం. అయితే మన మానసిక ఆరోగ్యం మాటేమిటి? మనకు వచ్చే మానసిక వ్యాధుల విషయం అలా ఉంచితే యాభై శాతానికి పైగా శారీరక వ్యాధులకు కూడా 'మనస్సే' కారణమని ఆధునిక వైద్యశాస్త్రం చెబుతోంది. అందుకే మన మనస్సును ఆరోగ్యంగా ఉంచడం ఎంతైనా అవసరం.

**మనస్సుకు మంచి ఆహారం:** మన శరీరం ఆరోగ్యంగా ఉండాలంటే మంచి ఆహారం తీసుకోవడం ఎంత అవసరమో 'మనస్సు' ఆరోగ్యంగా, శక్తిమంతంగా ఉండడానికి మంచి ఆలోచనలు చేయడం అంతే అవసరం. అందుకే ఉన్నతమైన ఆలోచనలు, ఆదర్శాల కోసం మనం మంచి పుస్తకాలను చదవడం అలవాటు చేసుకోవాలి. మంచివాళ్ళతో స్నేహం పెంచుకోవాలి.

**చెడు ఆలోచనల్ని ఎలా ఎదుర్కోగలం? :** మన మనస్సును కొంతసేపు పరిశీలిస్తే మంచి ఆలోచనలు, చెడు ఆలోచనలు కూడా రావడం మనం చూస్తాం. మన ప్రమేయం లేకుండానే చెడు ఆలోచనలు గొప్ప శక్తితో మనపై దాడి చేయడం జరుగుతుంది. వీటిని ఎలా ఎదుర్కోగలం?

ఒక బకెట్‌లో మురికి నీళ్ళున్నాయి. దాన్ని మంచి నీళ్ళతో ఎలా నింపగలం? బక్కెట్ పైన ఉన్న కుళాయి (Tap) తిప్పి, మంచి నీటిని కాసేపు వదిలితే చెడు నీరు దానంతటదే బయటకు పోవడం మనం గమనించవచ్చు.

అదే విధంగా మనం చెడు ఆలోచనలకు ప్రాధాన్యం ఇవ్వకుండా మన మనస్సును మంచి ఆలోచనలతో నింపివేయాలి. దీనితో ఆ చెడు ఆలోచనలు వాటంతట అవే బలహీనమవుతాయి.

**ఆలోచనలు ఉన్నతమైతే సమాజానికీ ఉపకారమే :**

మనం చేసే మంచి ఆలోచనలు మనకు తెలియకుండానే ఎక్కడో దూరంలో ఉన్నవారిని కూడా ప్రభావితం చేస్తాయి. మహాపురుషులు ఈ సమాజానికి దూరంగా ఏ కొండల్లోనో, గుహల్లోనో చేసిన ఒక గొప్ప ఆలోచన ప్రపంచమంతా తరంగ రూపంలో వ్యాపించి, కొన్ని వేలమందిని ప్రభావితం చేయగలదు.

అందుకే ఈ రోజుల్లో తీవ్రవాదం, అశాంతి పెరుగుతున్నాయని మనం రోజులు తరబడి చర్చించే కన్నా 'ఉన్నతమైన ఆలోచనలు'అనే శక్తివంతమైన బాంబులను నలువైపులా వేస్తే అవి సరైన సమయంలో విస్ఫోటనం చెంది ఈ సమాజంలో శాంతి కిరణాలను ప్రసరింపజేయగలవు.

**ఆలోచనలే కార్యాలకు పునాది రాళ్ళు :** మనం చేసే ఆలోచనలే మనం చేయబోయే కార్యాలకు పునాది అవుతాయి. ఒకే తల్లికి జన్మించిన సంతానంలో ఒకరు ఉన్నతమైన జీవితం గడిపితే మరొకరు నీచమైన జీవితం గడపడం మనం చూస్తున్నాం. భారతమాతకు జన్మించిన సంతానంలో కొందరు దేశానికై ప్రాణాలను అర్పిస్తే మరికొందరు దేశవినాశనానికి కారకులవుతున్నారు. ఈ వ్యత్యాసానికి కారణం మన ఆలోచనలు వేరు కావడమే!

***"మీ మనసుని ప్రతీ క్షణం ఉత్తమమైన ఆలోచనలతో, అత్యున్నతమైన ఆదర్శాలతో నింపివేయండి. వీటి ఫలితంగా మీరు ఉన్నతమైన కార్యాలను సాధించగలరు"*** అని స్వామి వివేకానంద చెబుతారు. ఆలోచనలు ఉన్నతమైతే కార్యాలు కూడా ఉన్నతమవుతాయి.

మనం నిరంతరం మంచి ఆలోచనలు చేస్తూ మంచి పనులను చేస్తే కొంత సమయానికి మనకు మంచి పనులను చేయాలనే బుద్ధి దానంతటదే కలుగుతుంది. మనం చెడు చేద్దామనుకున్నా మన మనస్సు అలా చేయనివ్వదు. మనం ఈ స్థితికి రావాలంటే క్రమం తప్పకుండా అభ్యాసం చేయాలి.

ఈ విధంగా మనం ఉన్నతమైన ఆలోచనలతో మహోన్నతమైన కార్యాలను సాధించి మన దేశాన్ని అగ్రస్థానానికి తీసుకువెళ్ళగలం. ❀



# యువవాణి

**- స్వామి పరిజ్ఞేయానంద**

బి. నరేశ్, చిత్తూరు

ప్రశ్న: **దేవుడు ఉన్నాడా? దేవుడు ఉంటే సమాజంలో జరుగుతున్న అవినీతి, అన్యాయాలను చూస్తూ ఎందుకు పట్టించుకోవడం లేదు? అయినా రాతి విగ్రహంలోని దేవుడు ఎలా మాట్లాడగలడు అని సందేహం కలుగుతుంది. ఆస్తికులు, నాస్తికుల పరిస్థితి బాగానే ఉంది. కానీ దేవుణ్ణి నమ్మీ నమ్మక ఉండే నా పరిస్థితి గందరగోళంగా ఉంది. నా సందేహానికి మీ సమాధానం ఏమిటి?**

**జవాబు:** పుణ్యభూమి, యోగభూమి అయిన భారతదేశంలో దేవతలు కూడా జన్మించాలని తపన చెందుతారంటారు. దేవతలకు కూడా దక్కని అరుదైన మానవ జన్మ పొందిన మనం మాత్రం దేవుడున్నాడా, లేదా అని సందేహించడం చాలా బాధాకరం.

ఈ భరత భూమిపై జన్మించి భగవంతుణ్ణి దర్శించడమే కాకుండా ముఖాముఖి మాట్లాడిన ఎంతోమంది భక్తులూ, యోగుల గురించి మనం విన్నాం. అందుకు అత్యున్నత నిదర్శనం శ్రీరామకృష్ణ పరమహంస జీవితం. ఆయన కాళీమాతను దర్శించడమే కాదు, సొంత తల్లిగా భావించి ఆమెతో సంభాషించేవారు. అద్వైత సాధనలో తోతాపురి నిష్ణాగరిష్ఠుడు. ఆయన శ్రీరామకృష్ణుల దగ్గరకు వచ్చి నీకు అద్వైత సాధనలో తర్ఫీదు నిస్తానంటే, శ్రీరామకృష్ణులు వెంటనే 'మా అమ్మ అనుమతి తీసుకొని వస్తాను' అన్నారు. అంటే మనం ఏ పని చేసినా మన కన్న తల్లికి ఎలా చెబుతామో, అలాగే శ్రీరామకృష్ణులు ఏ చిన్న విషయాన్నైనా కాళీమాతకు చెప్పేవారు. భగవంతునితో నిరంతరం కలిసి ఈ భువిపై నడయాడిన మహాత్ముల జీవితాలు చదివితే దేవుడు ఉన్నాడా, లేదా అన్న ప్రశ్న ఉదయించడానికి ఆస్కారమే లేదు.



సమాజంలో పెరుగుతున్న అవినీతి, అన్యాయాలు మానవుల కొలమానం ప్రకారం బహుశా ఎక్కువనే అనిపించవచ్చు. కానీ భగవంతుని కొలమానం మనకు తెలియదు. నూరు తప్పులు చేసేవరకూ శిశుపాలుణ్ణి శ్రీకృష్ణుడు శిక్షించలేదు. సమాజంలో అధర్మం పెరిగి, ధర్మం తరిగినప్పుడు భగవంతుడు అవతరించి దుష్టుల్ని శిక్షించలేదంటారా? రాముడు, కృష్ణుడు బయట రాక్షసుల్ని సంహరిస్తే ఈ యుగంలో శ్రీరామకృష్ణులు మనలో ఉన్న సంశయ రాక్షసుల్ని సంహరిస్తున్నారు.

తల్లి తన పిల్లవాడికి శుభ్రమైన దుస్తులు వేస్తుంది. కానీ పిల్లవాడు ఆటలాడుకుంటూ ఆ దుస్తుల్ని మురికి చేస్తాడు. మలినమైన ఆ దుస్తుల్ని చూసి మనం ఎవరిని నిందించాలి? భగవంతుడు మనకు అవసరమైనవన్నీ సమకూర్చాడు. కానీ వాటిని దుర్వినియోగం చేస్తే అందుకు బాధ్యులం మనమే!

God makes all things good, man meddles with them and make them bad. ***- Rossean***

నేటి సమాజంలో అవినీతి, అక్రమాలు పెరిగిపోతున్నాయనీ, నీతిమంతులు, బుద్ధిమంతులు కరువై పోతున్నారనీ మనం ఏకరువు పెడుతున్నాం. ఆ సమసమాజ నిర్మాణంలో ముందు మన పాత్రను సరిగ్గా పోషించడానికి పరిశ్రమిద్దాం.

Make yourself honest and sincere, then you may be sure that one rascal is less in this world.

***- Thomas carlyle***

విగ్రహారాధనను నిరసించిన వివేకానందుడంతటి మహాత్ముడు కాళీమాతను దర్శించి, ఆమెతో సంభాషించిన కొన్ని సంఘటనలే రాతి విగ్రహం మన సమస్యలకు స్పందిస్తుందా, లేదా అనే సందేహానికి సమాధానం.

ఈ కాలంలో నాస్తికులమని బయటకు చెప్పినా లోలోపల ఆస్తికులుగానే ఉంటున్న వారి సంగతి మనకు తెలిసిందే. నాస్తిక సంఘానికి ఒకడు అధ్యక్షునిగా ఎన్నికయ్యాడు. పత్రికా విలేఖరి ఒకడు, అధ్యక్షునిగా ఎన్నికైన ఆ నాస్తికునితో 'అయ్యా! మీరు నాస్తిక సంఘానికి అధ్యక్షులుగా ఎన్నిక అవడంలో మీ విజయ రహస్యం ఏమిటి?' అని అడిగాడు. అందుకు 'నాదేమీ లేదు, అంతా ఆ భగవంతుని దయే' అన్నాడట ఆ ఆస్తిక నాస్తికుడు.

ఆస్తికులైనా, నాస్తికులైనా ఏదో ఒక మార్గంపై విశ్వాసం ఉంచి జీవితాన్ని కొనసాగించడం మంచిది. అంతేకానీ, 'ఆస్తిక నాస్తికులు'గా ఉంటే జీవితం గందరగోళంగానే ఉంటుంది. ❀




# ఆయన మాటే నా జీవిత బాట!

**నా** పేరు దుర్గారావు. మాది శ్రీకాకుళం జిల్లా రాజాం దగ్గరలోని 'లింగాపురం' అనే గ్రామం. మా వంశంలో నా ముందు తరాల వారెవరూ చదువుకోలేదు. మా ఇంట్లో నన్ను మాత్రం చదివించారు. డిగ్రీ చదువుతున్న రోజుల్లో 'విస్‌డమ్' మాసపత్రికలో చిన్న చిన్న రచనలు చేస్తుండేవాణ్ణి. వాటికి బహుమతులుగా వారు శ్రీరామకృష్ణ మఠం వారి పుస్తకాలు పంపించేవారు. అప్పుడే శ్రీవివేకానంద జీవిత చరిత్ర సంపూర్ణంగా చదివాను. స్వామి వివేకానంద ఉన్నతమైన వ్యక్తిత్వాన్ని ఆకళింపు చేసుకున్నాను. ఆత్మ విశ్వాసంతో, అకుంఠిత దీక్షతో ఏమైనా సాధించ వచ్చునని వారి అమెరికా పయనం, అక్కడ ఆయన ఎదుర్కొన్న సమస్యలు, వాటిని అధిగ మించిన తీరు నా మనసును ద్రవింపజేశాయి. స్వామి వివేకానంద వ్యక్తిత్వం నన్ను ఎంతగా ప్రభావితం చేసిందంటే నా వృత్తికీ, ప్రవృత్తికీ స్ఫూర్తిప్రదాత ఆయనే అనడం అతిశయోక్తి కాదు.



కోరాడ దుర్గారావు

"శీల నిర్మాణం గావించి, మనిషిని ఉన్నత స్థితికి తీసుకువెళ్ళేదే నిజమైన విద్య" అని స్వామి వివేకానంద ప్రబోధించారు. ఆ ప్రభావంతో 'నా చదువు పదిమందికీ ఉపయోగపడాలి, అట్టడుగున ఉన్నవారిని ఆర్థికంగా పైకి తేవాలి' అనే సంకల్పంతో ఎమ్.కాం. పూర్తి చేసి, ప్రైవేటు ఫైనాన్స్ కంపెనీలో చేరాను. ఎంతో మందికి వారి పొదుపుతోనే ఆర్థిక పరిపుష్టి కలిగించేందుకు కృషి చేశాను.

కొంత కాలానికి కంపెనీ అంతర్గత కారణాల వల్ల అందులో పనిచేసేవారి వేతనాలు తగ్గించింది. దాంతో చేసేది లేక బయటకు వచ్చాను. అప్పటి నా స్థితి ఆర్థికంగా, సాంఘికంగా శూన్యమై పోయింది. అలాంటి పరిస్థితుల్లో స్వామి వివేకానంద ప్రవచనాలు, ప్రబోధాలు మళ్ళీ నన్ను ఉత్తేజితుణ్ణి చేశాయి. ఎనిమిదేళ్ళు చదువుకు దూరమైన నేను మళ్ళీ చదువుపై దృష్టి పెట్టే సరికి ఎంతోమంది విమర్శించారు, వికృతంగా నవ్వుకున్నారు. అయినా పట్టు వదలలేదు. ఎప్పటికైనా స్వామి వివేకానంద సంబంధించిన అంశాలతో రీసెర్చి చేయాలని నిర్ణయించుకున్నాను.

అదే ప్రేరణతో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. రెలిజియస్ స్టడీస్ చేశాను. ఎం.ఏ. తెలుగు చేశాను. ఆ తర్వాత సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి గారి 'వివేకానంద' కావ్యానుశీలన అనే అంశంతో ఎం.ఫిల్ చేశాను. ప్రభుత్వ ఉద్యోగం సాధించాను. ప్రస్తుతం ద్రావిడ విశ్వవిద్యాలయం కుప్పం నుంచి దూరవిద్య ద్వారా 'తెలుగులో వివేకానంద సాహిత్యం' అనే అంశంపై పిహెచ్.డి. చేస్తున్నాను.

దరిద్రనారాయణుల సేవ చేయాలి. అనాథలనూ, అన్నార్తులనూ ఆదుకోవాలి అని స్వామిజీ నిరంతరం పరితపించారు. ఆవేదన చెందారు. 'మానవసేవే మాధవసేవ' అనే నినాదాన్ని ఆచరించి చూపారు. నీతి, నిజాయతీల గురించి నొక్కి వక్కాణించారు. ఆ ప్రభావంతోనే విద్యార్థి దశలోనూ, ఉద్యోగ దశలోనూ కూడా సత్యం, ధర్మం, న్యాయం, నీతి, నిజాయతీలను పంచప్రాణాలుగా కలిగి జీవిస్తున్నాను. లోభాలకూ, ప్రలోభాలకూ లొంగిపోకుండా, పైసా కూడా లంచం తీసుకో కుండా సేవాభావంతో పనిచేయగలుగు తున్నాను. ఇదంతా స్వామి వివేకానంద నాలో రగిలించిన స్ఫూర్తి.

"నీవు విద్యావంతుడవు కావడంతో పాటు నీ తోటివారినీ, నీ చుట్టూ ఉన్నవారినీ నీ స్థాయికి తీసుకురావడానికి ప్రయత్నించు" అని స్వామిజీ పదే పదే అనేవారు. మనల్ని ఉత్తేజితుల్ని చేసి, ఉత్సాహపరచి ముందుకు ప్రోత్సహించే మార్గదర్శకులు ఉన్నప్పుడు మనలో నిద్రాణమై ఉన్న శక్తి సామర్థ్యాలు పెల్లుబుకుతాయి. స్వామీజీ నాకు ఆ విధమైన స్ఫూర్తిని కలిగించారు కాబట్టి నేను నా చుట్టూ ఉన్నవారి శక్తియుక్తులను బయటకు రప్పించడానికి ప్రయత్నిస్తున్నాను, ప్రేరణ కలిగిస్తున్నాను.

నా జీవితంలో కుటుంబ విషయాల్లో కానీ, ఉద్యోగ నిర్వహణ విషయంలో కానీ ఎదురైన కష్టాలను, నష్టాలను, సమస్యలను, సవాళ్ళను ఆత్మవిశ్వాసంతో ఎదుర్కొని ముందుకు వెళ్ళగలుగుతున్నానంటే అందుకు కారణం స్వామి వివేకానందే! నా జీవితంలో నేను వేసే ప్రతి అడుగూ ఆయన మార్గదర్శకమే! జీవితంలో నేను పొందిన వైఫల్యాలేవైనా అవి నా స్వయం కృతాపరాధాలే. విజయాలేవైనా అవి స్వామి వివేకానందుల వారి విజయాలే! ❀

*కోరాడ దుర్గారావు, లింగాపురం, రాజాం, శ్రీకాకుళం జిల్లా*



# కొండను పిండి చేసిన ఆత్మవిశ్వాసం

**- డా॥ కరిమద్దెల నరసింహారెడ్డి**

**'నేను సముద్రాన్నే ఆపోశన పడతాను',**
**'నేను సంకల్పిస్తే కొండలే పిండి అవుతాయి'**
**అని కార్యశూరులు అంటారు. అలాంటి శక్తి, సంకల్పాలతో అవిశ్రాంతంగా శ్రమించినప్పుడే గమ్యాన్ని చేరగలం.**

***- స్వామి వివేకానంద***

ఆత్మవిశ్వాసంతో కొండను పిండి చేయవచ్చుననే స్వామి వివేకానందుని సందేశానికి దశరథ్ మంజీ సజీవ సాక్ష్యం.

బీహార్ రాజధాని పాట్నాకు దాదాపు వంద కిలోమీటర్ల దూరాన ఒక గ్రామం ఉంది. దాని పేరు గెహ్లోర్. ఆ గ్రామానికీ, ప్రక్క గ్రామానికీ మధ్య ఒక కొండ అడ్డంగా ఉంది. గెహ్లోర్ ప్రజలు నిత్యావసరాలు కొనుక్కోవాలన్నా, అత్యవసర పరిస్థితుల్లో వైద్యసహాయం పొందాలన్నా ఆ కొండ చుట్టూ తిరిగి, అవతలి గ్రామానికి పోవాలి. అలా వెళ్ళడానికి సుమారు 32 కిలోమీటర్ల దూరం ఉంది. కొండను తొలిస్తే కేవలం మూడు కిలోమీటర్ల దూరం. మూడు కిలోమీటర్ల దూరానికి అనవసరంగా 32 కిలోమీటర్లు కొండ చుట్టూ తిరిగి వెళ్ళాలి. శ్రమ దండుగ, సమయం వ్యర్థం. అయినా ఆ గ్రామ ప్రజలు అలాగే తంటాలు పడుతున్నారు.

ఆ గ్రామంలోని దశరథ్ మంజీ అనే రైతు ఒకనాడు కొండ అవతల పొలంలో సేద్యం చేస్తున్నాడు. అతని భార్య ఫాగుణీదేవి భర్తకు అన్నం తీసుకొని, కుండ నెత్తి మీద పెట్టుకొని కొండ మధ్యలోనున్న చిన్న చరియ గుండా పోతుండగా రాళ్ళు గుచ్చుకొని క్రింద పడింది. అన్నం నేలపాలయింది. ఆమె గాయాల పాలైంది. ఆ గాయాలతోనే ఆమె మృత్యువుకు బలైంది.

కలత చెందిన దశరథ్ మంజీ కొండను తొలిస్తే తప్ప గ్రామానికి మేలు జరుగదని మనస్సులో నిర్ణయించుకొన్నాడు. ఊరి ప్రజలనందరినీ సమావేశపరిచి "నేను ఈ కొండను తొలుస్తాను. అవతలికి దారి చేస్తాను" అని ప్రకటించాడు. ఆ ప్రకటన విని జనమంతా నవ్వుకున్నారు. "ఒరేయ్! కొండను తొలుస్తాడట మొనగాడు" అని అవహేళన చేశారు. అయినా దశరథ్ మంజీ వారి మాటలను పెడచెవిన పెట్టి, చేతులతో ఉలి, సుత్తి పట్టాడు. గుండెల్లో కొండంత ఆత్మవిశ్వాసాన్ని నింపుకొన్నాడు. ఎవరి సాయం కోసం ఎదురుచూడకుండా తలవంచుకొని, మౌనంగా, గంభీరంగా అడుగులు వేస్తూ కొండను సమీపించాడు. వినమ్రంగా నమస్కరించి కొట్టడం మొదలుపెట్టాడు. రోజులు, నెలలూ కాదు, ఇరవై రెండు సంవత్సరాలు కొండను కొట్టాడు. మూడు కిలోమీటర్ల పొడవు ముప్పై అడుగుల వెడల్పుతో దారి చేశాడు.

దశరథ్ మంజీ కొండంత ఆత్మ విశ్వాసం ముందు కొండ చిన్నబోయింది. అతని ఆత్మవిశ్వాసం ముందు తలవంచుకుని దాసోహమంది. మంజీ కృషినీ, ఆత్మ విశ్వాసాన్నీ, పట్టుదలనూ చూసి గ్రామ ప్రజలందరూ విస్తుబోయారు.

దశరథ్ కొండను తొలిచి తయారు చేసిన మార్గంలో ఇప్పుడు వాహనాలు కూడా వెళ్తున్నాయి. రోడ్డు కూడా వేశారు. అయితే దశరథ్ మంజీ అనితర సాధ్యమైన ఆత్మవిశ్వాసంతో ఈ మహాకార్యాన్ని నిర్విఘ్నంగా పూర్తి చేసినా ఆ దృశ్యాన్ని చూసే అదృష్టం అతని భార్యకు లేదు. మంజీ ఆత్మవిశ్వాసానికి కృతజ్ఞతగా గెహ్లోర్ ప్రజలు తమ గ్రామం పేరును మార్చి, 'దశరథ్ నగర్' అని పిలుచుకుంటున్నారు.

చిన్న చిన్న సమస్యలకే నీరసించిపోయే వారికి ఆత్మవిశ్వాసంతో కొండను తొలిచిన దశరథ్ మంజీ ఆదర్శనీయుడు.

Success is like a train, which has several coaches - hard work, focus, luck, attitude and vision. But leading all those is the engine of Self-confidence.

మహనీయుల జీవితాల్లో
## మధురఘట్టాలు
– జిల్లా ప్రభు

# ఆదర్శప్రాయం ఆయన జీవన విధానం



ఎవరు గొప్ప అన్న ప్రశ్న అనాదిగా మనల్ని వెంటాడుతూ ఉంది. 'కొందరు గొప్పవారుగా జన్మిస్తారు. కొందరు గొప్పతనాన్ని సాధిస్తారు. కొందరిపై గొప్పతనం ఊడి పడుతుంది' అంటారు షేక్స్పియర్. గొప్పవారిగా జన్మించిన వారు కొందరే. గొప్పతనం వచ్చిపడినా దాన్ని ఎంతో కాలం నిభాయించుకోలేని వారుంటారు. గొప్పతనాన్ని వాస్తవంగా సాధించినవారే గొప్ప.

వారు శిల్పుల ఉలిచే మలచబడినవారు కారు. తమను తామే రూపొందించుకున్న మూర్తులు. తమ శీలాన్ని తామే నిర్మించుకున్నవారు.

అలా తమ మూర్తిమత్వాన్ని సృష్టించుకున్న వారిలో 'భారతరత్న' మోక్షగుండం విశ్వేశ్వరయ్య ఒకరు. ఆయన తమ చరిత్రను తామే నిర్మించుకున్నారు.

విశ్వేశ్వరయ్యగారు మైసూరు సంస్థాన దివాన్ పదవిని అత్యంత సమర్థంగా నిర్వహించి, స్వచ్ఛందంగా పదవీ విరమణ చేశారు. గొప్పవారిగా కీర్తిని గడించారు. పదవీ విరమణ రోజు సాయంకాలం అయిదు గంటల కల్లా తమ పనులన్నీ పూర్తి చేశారు. అయిదు గంటలైన వెంటనే కుర్చీ నుండి లేచి, చేతి కర్రతో కార్యాలయం నుంచి బయటకు వచ్చారు. పోర్టికోలో దివాన్ గారి కారు సిద్ధంగా ఉంది. కారు ద్వారం తెరచి డ్రైవర్ నిల్చున్నాడు.

"ఇది దివాన్ గారి కారు. నేనిప్పుడు దివాన్‌ను కాను. నా దివాన్ గిరి ముగిసింది. ఇప్పుడు ఈ కారులో కూర్చొనే హక్కు నాకు లేదు" అంటూ కాలినడకన ఇంటికి వెళ్ళారు.

మోక్షగుండం విశ్వేశ్వరయ్య యాదృచ్ఛికంగా గొప్పవారు కాలేదు. ఇలాంటి ఆదర్శపూర్వకమైన జీవిత విధానం వల్లనే వారు గొప్పవారయ్యారు. ❀

# విశేష భాష్యం చెప్పిన విద్యార్థి



స్వామి వివేకానంద యావత్ భారతదేశాన్నీ సందర్శిస్తూ మద్రాసు వచ్చారు. ఆ సమయంలో ఒక న్యాయ కళాశాల వసతి గృహంలో స్వామీజీకి బస ఏర్పాటుచేశారు. హాస్టల్ గదులన్నీ ఓసారి కలియ తిరుగుతూ ఒక విద్యార్థి ఉన్న గదిలోకి వచ్చారు స్వామీజీ. అక్కడ గోడపై వ్రేలాడదీసిన శ్రీకృష్ణభగవానుని చిత్రపటం కనిపించింది. వెంటనే "శ్రీకృష్ణ పరమాత్మడు నీల వర్ణంలో ఎందుకున్నాడు?" అని ఆ విద్యార్థిని ప్రశ్నించారు స్వామీజీ. ఆ ప్రశ్నకు ఏ మాత్రం తడుముకోకుండా ఆ విద్యార్థి "సముద్రం అనంతమైనది. అలానే ఆకాశం కూడా! రెండూ నీల వర్ణంలోనే ఉన్నాయి. భగవంతుడూ అనంతుడు కదా! అందుకే అతని మేనిఛాయ కూడా నీలంగా ఉంది" అన్నాడు.

స్వామి వివేకానంద ఆ సమాధానానికి ఎంతో ఆనందపడి, నువ్వు చక్కగా అభివృద్ధిలోకి వస్తావనీ, ప్రసిద్ధి పొందుతావనీ అన్నారు.

అద్భుతమైన మేధాసంపత్తి, అమోఘమైన బుద్ధి కుశలత కలిగి, దేశం కోసం తన న్యాయవాద వృత్తిని త్యజించి, నగరపాలక సంఘం (మున్సిపాలిటీ) అధ్యక్షునిగా మొదలుపెట్టి స్వతంత్ర భారత దేశ గవర్నర్ జనరల్ పదవి అధిరోహించి, 'రాజాజీ' అని అందరి చేతా పిలవబడిన ఆ విద్యార్థే– చక్రవర్తుల రాజగోపాలాచారి. ❀



# మనకిది మేలుకొలుపు...

- బి. సైదులు

వేవేల ఆశలతో వెన్నెల్లా ఆగమించిన వత్సరం 'ఇక సెలవంటూ...' అప్పుడే నిష్క్రమించింది. ఎన్నో మెరుపులు... మరెన్నో మరకలు... ఎన్నెన్నో తొలిసంధ్యల వెలుగుల్నీ, మలిసంధ్యల మసకల్నీ వీక్షించిన ముందుతరాలకు ఇవన్నీ అతి సాధారణమే కావచ్చు. కానీ కోటి ఆశలతో ఆనందాల్ని కొనగోట మీటాలనుకునే ఈ తరానికి మాత్రం ఇవన్నీ మిశ్రమానుభూతులే! సంతోషాల మాటటుంచి, గత ఏడాది నవతరాల ఆశలను మాత్రం బీటలు వార్చింది. అమెరికా దెబ్బకు మెరికల్లాంటి యువతీయువకులు కూడా ముఖాలు తేలేశారు. గాల్లో తేలినట్టుందే... అనుకున్న వారు గుండె పేలినట్టుందే అంటూ నేలపైకి దిగివచ్చారు. తారాజువ్వల్లా ఎగిసిపోతున్న వారు తల్లడిల్లిపోతున్నారు. కాని ఈ అనుభవం పాఠమే కానీ, పరాభవం కాదని తెలుసుకుందాం; 'గడచిన కాలమే గతాన్ని పూడ్చిపెట్టు గాక, అనంతమైన భవిష్యత్తు మీ ముందుంది' అన్న స్వామి వివేకానంద ధీరవచనాల్ని మరోసారి స్మరించుకుంటూ ముందుకు సాగిపోదాం. ఒక ద్వారం మూతపడిందంటే, మరో ద్వారం మరెక్కడో తెరుచుకుందని అర్థం; గతానుభవం మనకొక మేలుకొలుపని తెలుసుకొని, స్వాగతిస్తున్న ఆ ద్వారం ఏమిటో పసిగట్టడమే మన తక్షణ కర్తవ్యం.

## వనవాసమూ వరప్రసాదమే...

నాహ మర్థపరో దేవి! లోకమావస్తు ముత్సహే
విద్ధి మాం ఋషిభి స్తుల్యం విఫలం ధర్మమాశ్రితం....

అంటాడు శ్రీరాముడు కైకేయితో! ఈ వనవాస శిక్ష నాకు లోకంలో ధర్మాన్ని ఆచరించేందుకు విశాలమైన అవకాశాన్ని కలిగించింది; మునులతో కలిసి జీవించే విశేష అదృష్టాన్ని కలిగించిందంటూ కైకేయికి కృతజ్ఞతలు ప్రకటిస్తాడు శ్రీరామచంద్రుడు. కొన్నాళ్ళు మన పరిస్థితిని కూడా వనవాసంగానే భావిద్దాం. ఈ కష్టసుఖాల సమయాన్ని సంధికాలం అనుకుందాం. ఎప్పుడూ పడని వారు గొప్పకాదు, పడి లేచిన వారే గొప్పవారు; ఎందుకంటే వారికి లోయల లోతులు కూడా తెలుసు. అందుకే ఈ కష్టకాలం కూడా మన మంచికే అని తెలుసుకొని మసలుకుందాం. ఈ కుదుపు మనం మరింత పైకి ఎగిరేందుకే కాని, జారిపోయేందుకు కాదని ఆశావహ దృక్పథంతో ముందడుగు వేద్దాం.

## అంతా అమెరికాయే కాదు...

అంతా అమెరికామయం... అని జపిస్తూ, న్యూయార్క్‌లోనో, న్యూజెర్సీలోనో జీవించడమే విజయంగా ఇన్నాళ్ళూ భ్రమించాం. కానీ తాజా పరిస్థితులు ఆ ఆశల్నీ, ఆలోచనల్నీ తలకిందులు చేశాయి. భౌతికసంపదల పునాదులపై నిలబడి అహంకరిస్తున్న మీరు పరాభవం పాలయ్యే సందర్భం వస్తుందని నూరేళ్ల క్రితమే అమెరికా వాసులను హెచ్చరించారు స్వామి వివేకానంద. సుఖాలు, సౌకర్యాలే పరమావధి కాదని ఆ రోజే హితవు పలికారు ఆ దార్శనికుడు. ఇప్పటికైనా మనం విదేశీ భ్రమల నుంచి బయటపడదాం; అమెరికా ఉదంతంతో, అలాంటి అవకాశం మనకు ముందుగానే కలిగిందని ఆనందపడదాం. సరికొత్త రీతిలో విజయతీరాలను చేరేందుకు శ్రీకారం చుడదాం. మన ఆర్థికవ్యవస్థకీ, జీవన సరళికీ అనువైన మార్గాల్లో పయనించేందుకు ప్రయత్నిద్దాం.

## అనుకరణే అసలు సమస్య...

ఏ చదువుకు జీతమెక్కువో తెలుసుకొని, గుడ్డిగా అనుకరించడం వల్లనే ఇలాంటి ప్రమాదాలు సంభవిస్తున్నాయి. మన అభిరుచికీ, తత్త్వానికీ అనువైన విభాగాలను ఎంపిక చేసుకుంటే, విఫలమయ్యే అవకాశం ఉండదు; కనీసం నిరాశలో కుంగిపోయే పరిస్థితులు ఎదురుకావు. మనకు సాహిత్యాభిరుచి ఉండి, సాఫ్ట్‌వేర్ నేర్చుకుంటే మనం ఆ రంగంలో నైపుణ్యాన్ని సాధించలేం. సాఫ్ట్‌వేర్ అయినా, సన్న్యాసమైనా పూర్తిగా మనకు అటువైపు మనసు మరలాలి; అప్పుడే ఎంచుకున్న మార్గంలో

పూర్తి గమ్యానికి చేరుకోగలం. ఇప్పటికైనా నవతరం స్పందించి, మార్కెట్‌ని అనుసరించి కాకుండా, మనసును అనుసరించి వృత్తిమార్గాల్ని ఎంపిక చేసుకుంటే మంచిది.

### మనం అజేయులం...

Death is not the greatest loss in life, the greatest loss is what dies inside us while we live అంటారు పాశ్చాత్య మేధావి నార్మల్ కాసిస్. వ్యక్తిగతంగా మరణం మనకేమీ నష్టం కలిగించదు; కానీ జీవించి ఉన్నప్పుడే మనలోని చైతన్యం నశించిపోతే, అది ఎంతో ప్రమాదకరం. ఈ మాత్రం ఒడిదుడుకులు లేకపోతే జీవితంలో మాధుర్యం ఉండదు. మన మేధస్సుకు పదును పెట్టే అవకాశం కలిగిందని ఈ పరిస్థితుల్ని సవాలుగా స్వీకరిద్దాం. ఈ కఠినపరిస్థితుల్లో నిబ్బరంగా నిలబడేలా మనసుకు శిక్షణనిచ్చుకోవడం ప్రధానం. భవిష్యత్తు ఎంతో ఆశాజనకంగా ఉంటుందనీ, ఒంటరిగా ఎంతటి ప్రతికూలతలనైనా ఎదుర్కోగలమనీ మనసుకు హితవు చెప్పుకుందాం. రాబోయే కాలమంతా మనదేనని తప్పక అజేయులుగా నిలబడగలమనే ధైర్యంతో ముందుకు నడుద్దాం.

### సంక్షోభమూ సవాలే....

ఆధునిక నాగరకత, విద్యావిధానం మనను సంక్షోభాలను ఎదుర్కొనేలా తీర్చిదిద్దడం లేదు; అంతా సాఫీగా సాగిపోతుందన్న భ్రమల్లో ఉంచుతున్నాయి. ఉదాహరణకు రైతు పంట పుష్కలంగా పండుతుందన్న ఆశలు పెంచుకుంటాడు; అనావృష్టితో పంట ఎండిపోయే, అతివృష్టితో మునిగిపోయే ప్రమాదం కూడా ఉందని ముందే మానసికంగా సిద్ధమవుతాడు. అందుకే ఎంతటి ప్రతికూల పరిస్థితులకు కూడా సాధారణంగా రైతులు దిగాలు పడిపోరు. వారు ఏ స్టీఫెన్ కోవే వ్యక్తిత్వవికాస పుస్తకాలు చదవలేదు; ఏ ఉపన్యాసంతోనో ఉత్తేజం పొందలేదు. వెలుగు అంచునే చీకటి ఉంటుందని జీవితం నేర్పిన పాఠాన్ని వారు నిరంతరం వల్లెవేస్తారు. అదే సిద్ధాంతాన్ని నమ్ముకొని బ్రతుకుతారు.

### విజయీ భవ...

మనస్సుకు, మేధస్సుకు సరయిన శిక్షణ లేకపోవడం వల్లనే ఆటుపోట్లకు తల్లడిల్లిపోతున్నాం; నిరాశానిస్పృహలతో కుంగిపోతున్నాం; మన విద్యలో, జీవితంలో ఆధ్యాత్మిక చైతన్యం లోపించడం వల్లనే ఇది సంభవిస్తుంది; ఈ చైతన్యం మనల్ని ఎంతటి కల్లోల పరిస్థితుల్లోనైనా, నిశ్చలంగా నిలబెడుతుందంటారు స్వామి రంగనాథానంద. కొద్దిపాటి ఎదురుదెబ్బలకి కూడా ధైర్యంగా నిలబడలేక పోతున్నాం. ఇప్పటికైనా అలాంటి బలహీన మనఃస్థితి నుంచి బయటపడదాం. మన ముఖంపై ప్రసన్నతనూ, మందహాసాన్నీ అపహరించే శక్తి ఎవరికీ లేదు; మనం స్థైర్యంగా, ధైర్యంగా నిలబడితే ఈ ఉద్యోగాలూ, ఈ సౌకర్యాలూ కల్పించుకోవడం పెద్ద విషయమేమీ కాదు; అందుకు ఈ కొత్త సంవత్సరంలో మనను మనం ఆశీర్వదించుకుందాం... విజయీ భవ.... దిగ్విజయీ భవ... ❀

## 'మూర్తీ'భవించిన ఆదర్శం....



పేద పండిత కుటుంబంలో పుట్టిన మేధోసంపన్నుడు ఆ కుర్రాడు. 'ఐఐటి' సాధించాలని ఎన్నో కలలు కన్నాడు; ప్రవేశ పరీక్షలో ర్యాంకు సాధించాడు; కాని అయిదుగురు అమ్మాయిలు, ముగ్గురు అబ్బాయిల బాధ్యతల్ని మోస్తున్న తండ్రిపై పెనుభారం వేయకూడదను కున్నాడు. ఎవరినీ నొప్పించని ఆ సౌమ్యమూర్తి, తన స్వప్నాన్ని మనసులోనే సమాధి చేసుకున్నాడు. తన కన్నా తక్కువ ప్రతిభ ఉన్న తోటి విద్యార్థులంతా, ఉత్సాహంగా పై చదువులకు వెళుతుంటే, ఆనందంగా వారికి వీడ్కోలు పలికాడు. మిత్రులందరినీ రైలెక్కించి ఒక్కడే, రైల్వే స్టేషన్‌లో కూర్చున్నాడు; జోరుగా వాన, పరిస్థితికి కించిత్తు కూడా కుంగిపోలేదు; కోపం లేదు, అసూయ లేదు, నిరాశా లేదు; ఒక్క ఆత్మవిశ్వాసం తప్ప! 'అంతా సజావుగా సాగితే, దాంట్లో మన గొప్పతనం ఏముంది? లెక్కలోకి వచ్చేది చదువు, సంస్థ కాదు; నీకు నీవే! నీ జీవితాన్ని నీవే మార్చుకోగలవు' అనుకున్నాడు మనసులో; నిన్ను మించిన మిత్రుడు నీకు లేడు, నిన్ను మించిన శత్రువు కూడా నీకు లేడన్న భగవద్గీత వాక్యాన్ని గుర్తు చేసుకున్నాడు. పరిస్థితులను తనకు అనుకూలంగా మలచుకున్నాడు. తరువాత ఎంతో శ్రమించాడు. తన వ్యక్తిగత జీవితాన్నీ, సౌకర్యాల్నీ పట్టించుకోలేదు. దేశమే గర్వించే ఒక సంస్థనే స్థాపించాడు. ఒక స్కూలు టీచరు కొడుకు, చట్టసమ్మతంగా, నీతిబద్ధంగా ఐశ్వర్యవంతుడు కావచ్చునని భారతీయులకు నిరూపించాడు. ఇండియాలో సాఫ్ట్‌వేర్ పరిశ్రమకు ఆద్యుడైనాడు. సమాచార సాంకేతిక విప్లవాన్ని సృష్టించాడు. ఆయన మూర్తీభవించిన సాదాసీదాతనం, రాజీపడని నాణ్యత, న్యాయబద్ధత అంతకు మించి మంచిదాత. అతనెవరో కాదు... ఇన్ఫోసిస్ సంస్థాపకుడు నాగవర రామారావు నారాయణమూర్తి. ❀

యువవాహిని

# వ్యక్తిత్వ వికాసానికి పంచ సూత్రాలు



– స్వామి ఆత్మవిదానంద

వ్యక్తిత్వ వికాసానికి ఆత్మవిశ్వాసం, ఆత్మశక్తి, ఆత్మనిగ్రహం, ఆత్మత్యాగం, ఆత్మజ్ఞానం అనేవి పంచ సూత్రాలు

**1. ఆత్మవిశ్వాసం :** "భగవంతుణ్ణి నమ్మని వారిని సనాతన ధర్మం నాస్తికులని అన్నది. కానీ తమ మీద తమకి నమ్మకం లేని వారిని నాస్తికులంటుంది ఆధునిక ధర్మం. "పురాణాల్లో చెప్పిన మూడువందల ముప్పై కోట్ల దేవుళ్ళ మీద నమ్మకం ఉన్నా.... మీ మీద మీకు విశ్వాసం లేకుంటే మీకు ముక్తి లభించదు" అని స్వామి వివేకానంద అన్నారు. బధిరత్వం, అంధత్వం గల హెలెన్ కెల్లర్ అనే బాలిక ఆత్మవిశ్వాసంతో ఎన్నో అద్భుతాలను సాధించింది.

సీతాన్వేషణలో వానరులు మహాసాగరాన్ని దాటడానికి సాహసించలేదు. వయోవృద్ధుడైన జాంబవంతునికి హనుమంతుడి శక్తి గురించి తెలుసు; బాల్యంలో హనుమంతునికి గల పరాక్రమాన్ని గుర్తు చేసి, ఆతనిలో ఆత్మవిశ్వాసాన్ని ప్రేరేపించాడు. అతను ఆంజనేయునితో "నీలో అపారమైన శక్తి ఉంది. నువ్వు అద్భుతాలు సాధించగలవు. నీపై నువ్వు విశ్వాసాన్ని పెంచుకో. రామకార్యాన్ని సాధించడానికి సిద్ధమవు, లే, జాగృతుడవవు" అన్నాడు.

జాంబవంతుని మాటలు హనుమంతునిలో ఆత్మ విశ్వాసాన్ని పెంచాయి. ఆ సవాలును ఎదుర్కొనేందుకు హనుమంతుడు సిద్ధపడి, రామకార్యాన్ని నిర్వర్తించాడు. నిరుత్సాహం, దిగులు కలిగినప్పుడు ఆత్మవిశ్వాసాన్ని కోల్పోడానికి బదులు తమ శక్తినంతటినీ కూడదీసుకుని లక్ష్యసాధనకై పరిశ్రమించాలి.

**2. ఆత్మశక్తి :** మనం శారీరకంగా, మానసికంగా, నైతికంగా దృఢంగా ఉండి మన దక్షత, శక్తి సామర్థ్యాల మీద ఆధారపడాలి. మన భవితను మనమే సుగమం చేసుకోవాలి. మన జీవితాలకు మనమే బాధ్యత వహించగలిగితే మనం ఎన్నో సాధించగలం. ద్రోణాచార్యుడు విలువిద్య నేర్పడానికి నిరాకరించినా తనంతట తానే విలువిద్య నేర్చుకుని, అర్జునుణ్ణి మించిన మేటి విలుకాడయ్యాడు ఏకలవ్యుడు.

ఒకమారు ఒక వ్యక్తి రైలునిలయంలో తన సామాను మోయడానికి కూలివాడి కోసం చూస్తున్నాడు. ఇంతలో ఈశ్వర చంద్ర విద్యాసాగర్ అక్కడకు వచ్చి, ఆ వ్యక్తికి సహాయం చేశాడు. ఇంటికి చేరగానే ఆ వ్యక్తి విద్యాసాగర్‌కు కొంత పైకం ఇవ్వబోగా, ఈశ్వరచంద్రుడు నిరాకరించాడు. ఆ వ్యక్తి "నీ పేరేమిటి" అని ప్రశ్నించగా విద్యాసాగర్ తానెవరో తెలియపరచగానే ఆ వ్యక్తి విద్యాసాగర్ కాళ్ళ మీద పడి, క్షమాపణ వేడుకున్నాడు. కాబట్టి మనం ఎప్పుడూ మన స్వశక్తిపై ఆధారపడడం నేర్చుకోవాలి.

**3. ఆత్మనిగ్రహం :** ఆత్మనిగ్రహం అంటే మనోనిగ్రహం కలిగి ఉండడం. ఎవరైతే మనసుని తమ ఆధీనంలో ఉంచుకోగలుగుతారో వారు ఎలాంటి క్లిష్టసమస్యల్ని అయినా ప్రశాంతంగా ఎదుర్కోగలరు.

స్వామి వివేకానంద పశ్చిమ అమెరికాలోని ఒక నగరంలో ఉపన్యసిస్తూ ఇలా చెప్పారు : 'మనోనిగ్రహం కలిగిన వ్యక్తి ఎలాంటి పరిస్థితులలోనైనా నిశ్చలంగా ఉంటాడు. బాహ్యపరిస్థితులు అతని ప్రశాంతతకు భంగం కలగజేయవు'. స్వామీజీ ప్రసంగం విన్న కొంతమంది యువకులు స్వామీజీ చెప్పింది ఆయన జీవితంలో ఎంతవరకు ఆచరణలో పెట్టారో పరీక్షించాలనుకున్నారు. స్వామీజీ వారి గ్రామానికి ఉపన్యాసం ఇవ్వడానికి వెళ్ళినప్పుడు, ఆ యువకులు స్వామీజీని ఒక బోర్లించిన తొట్టి మీద నిలబడి ప్రసగించమన్నారు. స్వామీజీ వారి అభ్యర్థన మేరకు అలాగే నిలబడి ప్రసంగిస్తూ అందులో లీనమయ్యారు. అంతలో ఆ యువకులు తుపాకీ గుళ్ళు వారి

చెవుల మీద నుండి దూసుకుని వెళ్ళేలా తుపాకీ పేల్చసాగారు. అయితే స్వామీజీ కాస్త కూడా చలించలేదు. ప్రసంగాన్ని ఎంత ప్రశాంతంగా ప్రారంభించారో, అదే ప్రశాంతతతో కొనసాగించారు. వారు ఉపన్యాసం ముగించిన వెంటనే ఆ యువకులు స్వామీజీ చుట్టూ చేరి, కరచాలనం చేస్తూ "మీరు చెప్పినది అక్షరాలా నిజం స్వామీజీ. మీరు ఆచరించినదే మీరు బోధిస్తున్నారు" అన్నారు. మనోనిగ్రహం ఉంటే బాహ్యపరిస్థితులు ఎలాంటి ప్రభావం చూపలేవని ఈ సంఘటన వల్ల తెలుస్తుంది.

**4. ఆత్మత్యాగం :** ఏదైనా పొందాలనుకుంటే మనం కొన్ని వదులు కోవాలి. ఇది భౌతిక ప్రపంచంలోని నియమం. పాఠశాలకు కొత్తగా వెళ్తున్నప్పుడు మొదటి రోజు, కొత్తదనం వల్ల చాలా ఆతురతగా, కలవరం చెందుతాం. క్రమంగా చుట్టూ ఉన్న వాతావరణానికి అలవాటు పడతాం. కొత్త విషయాలు ఎన్నో తెలుసుకుంటాం, ప్రశాంతంగా ఉంటాం. అయితే పాఠశాలలో ప్రశాంతంగా ఉందని జీవితాంతం ప్రాథమిక స్థాయిలోనే ఉంటే అభివృద్ధికి అవకాశం ఉండదు కదా! అభివృద్ధి చెందాలంటే ఈ ప్రాథమిక పాఠశాలలోని విద్యార్థి స్థాయిని వదలాలి. ఈ విడిచిపెట్టడం వల్లనే మనకు ఉన్నత పాఠశాలలో విద్యార్థి స్థాయి లభిస్తుంది. అలాగే మనం అంతర్గతంగా అభివృద్ధి చెందాలంటే, మనలోని స్వార్థాన్ని కొంత వదులుకొని మన తోటివారికి సహాయపడడం అలవరచుకోవాలి. సేవాభావం వల్ల మనలో అంతర్గతంగా ఉన్న అనంతశక్తిని వ్యక్తీకరణ చెయ్యగలం. క్లుప్తంగా చెప్పాలంటే ఉన్నతమైనవి పొందడానికి మనలోని అల్పమైన వాటిని విడవాలి. ఆత్మత్యాగం మనకు నిజమైన శాంతి, ఆనందాలను కలుగజేస్తుంది.

**5. ఆత్మజ్ఞానం :** "నేను ఒక నీటి బుడగ, నువ్వు ఒక పర్వతమంత ఎత్తైన అల కావచ్చు కానీ, మన ఇద్దరికీ ఆధారం ఆ అనంత సాగరమే! అందరికీ ఆధారం, అందరిలోనూ ఉన్నది ఒకే ఆత్మ అనే సత్యాన్ని తెలుసుకోవడమే నిజమైన జ్ఞానం" అని స్వామి వివేకానంద బోధించారు. మనం శరీరమనే భ్రాంతిని వదలి మనలో ఉన్న అనంత ఆత్మశక్తిని గుర్తించినప్పుడు నిజమైన ఆనందం పొందగలం.

మనలో అంతర్గతంగా ఉన్న పరమాత్మను గుర్తించక పోవడంవల్ల నిర్బలులుగా వ్యవహరిస్తుంటాం. ఒక పులి పిల్ల, గొర్రెల మందలో పెరిగి తానూ గొర్రెపిల్లనే అని భావించిన కథ స్వామీజీ చెప్పేవారు. ఒకరోజు మరొక పులి గొర్రెల మందలో పెరిగిన పులి పిల్లకు నీళ్ళల్లో దాని ప్రతిబింబాన్ని చూపించింది. నీటిలో తన ప్రతిబింబాన్ని చూసి ఆ పులిపిల్ల తన నిజస్వభావాన్ని తెలుసుకుంది. గొర్రెలా పెరిగిన పులిపిల్లను నిజమైన పులిగా మార్చినది ఆత్మజ్ఞానమే!. ఆత్మజ్ఞానం మనకు మన నిజమైన ఆధ్యాత్మిక తత్త్వాన్ని తెలియచేసి, మనలో అంతర్గతంగా దాగిన అనంతమైన శక్తిని జాగృతం చేస్తుంది.

**అపజయాల పట్ల మనోవైఖరి :** "ఒక వ్యక్తి వెయ్యిమార్లు విఫలుడైనా ఉన్నతమైన ఆదర్శానికి అంటిపెట్టుకుని ఉండాలి. అబద్ధాలు చెప్పడం రాని గోడలా ఉండడం కన్నా, తప్పు చేస్తూ ఆ అనుభవాల నుంచి పాఠాలు నేర్చుకోవడం ఉత్తమం" అని అనేవారు స్వామీజీ. అబ్రహమ్ లింకన్ తమ దేశ పార్లమెంటు సభ్యుడవ్వాలనుకున్నాడు. అయితే అతని మొదటి ప్రయత్నం విఫలమైంది. వ్యాపారంలో భాగస్వామి అతణ్ణి మోసం చేశాడు. వ్యాపారం కోసం చేసిన అప్పుల బారినుంచి బయటపడడానికి 17 సంవత్సరాల కాలం పట్టింది. అతను వివాహం చేసుకున్న కొద్దికాలానికే మొదటి భార్య

> **ఆటపాటల్లో, వేషభాషల్లో, సుఖ దుఃఖాల్లో, నీతి తప్పని ధీరులై జీవించండి. అలాంటి ఆదర్శంతో జీవితాన్ని నిర్మించుకుంటే ఇతరులు కూడా మిమ్మల్ని అనుసరిస్తారు.**
>
> **- స్వామి వివేకానంద**

మరణించింది. గయ్యాళి అయిన రెండవ భార్య అతనికి పెద్ద తలనొప్పిగా మారింది. అయినా అతడు తన లక్ష్యసాధనకై శక్తినంతా ఉపయోగిస్తూ, చేస్తున్న ప్రయత్నాలను మానలేదు. చివరకు అతను ఎన్నికల్లో నెగ్గడమే కాకుండా, అమెరికా అధ్యక్షుడై, చరిత్రపుటల్లోకి ఎక్కాడు. వ్యక్తిగత సమస్యలకు జడవకుండా, ఉన్నత ఆదర్శాన్ని విడవకుండా ప్రయత్నించిన వారే ఏ కార్యాన్నైనా సాధించగలరు.

స్వామీజీ ఆశించింది కేవలం ఆధ్యాత్మిక ఉన్నతి మాత్రమే కాదు. ఆధ్యాత్మిక ఉన్నతితో పాటు భౌతిక, మానసిక, మేధాసంబంధమైన అన్ని రంగాలలోనూ అభివృద్ధిని ఆకాంక్షించారు ఆయన. స్వామీజీ చెప్పిన 'ఆత్మవిశ్వాసం, ఆత్మశక్తి, ఆత్మనిగ్రహం, ఆత్మత్యాగం, ఆత్మజ్ఞానం' అనే పంచసూత్రాల్ని మనం ఆచరించగలిగినప్పుడే సంపూర్ణ వ్యక్తిత్వవికాసం సాధ్యం. ❀



# భవిష్యవాణి

**ఆ**ది శంకరులు చిన్న వయస్సులోనే భారతదేశం నలువైపులా ప్రయాణించి, క్షీణిస్తున్న సనాతన ధర్మాన్ని పరిరక్షించారు. అద్వైత సిద్ధాంతంతో సనాతన ధర్మాన్ని పునఃప్రతిష్ఠించారు. అలాగే 19వ శతాబ్దంలో ఒక యువ సన్న్యాసి ప్రపంచ దేశాలన్నీ పర్యటించి, అద్వైత సింహనాదంతో సనాతన ధర్మకీర్తిని విశ్వవ్యాప్తం చేశాడు. ఆ యువ సన్న్యాసియే – స్వామి వివేకానంద.

ప్రపంచానికి గురువు 'భారతావని' అనీ యుగ యుగాలుగా లౌకిక విద్యలు, ఆధ్యాత్మిక విద్యలు భారత దేశంలో వెల్లివిరిశాయనీ, మన పూర్వులు తమ నిత్య జీవితంలో భౌతికతకూ, ఆధ్యాత్మికతకూ సమతౌల్యం పాటించి వారి జీవితాలను ఆనందమయం చేసుకు న్నారనీ, ఇతర దేశాలకు స్ఫూర్తి ప్రదాతలుగా నిలిచారనీ, అలాంటి భారతదేశాన్ని, అలాంటి ప్రపంచాన్ని మానవాళి మళ్ళీ నిర్మించుకోవాలనీ, ఆ నిర్మించుకొనే ప్రయత్నంలోనే ఈ ఘర్షణలనీ స్వామి వివేకానంద చెప్పిన భవిష్యవాణి ఒక్కసారి తలచుకొని తరిద్దాం.

నేటితరానికి ఈ ఆధ్యాత్మిక రంగంలో మరో మేలుమలుపు, దిశానిర్దేశం కావలసి వచ్చింది. ఈ భౌతిక సుఖసంపద పెరిగిపోతున్న కాలంలో, మనిషి తన ఆధ్యాత్మిక మూలాలు మరచిపోతున్న కాలంలో, తనను తాను ధనం తయారు చేసే యంత్రంగా మార్చుకుంటున్న కాలంలో మనిషి తనను తాను సంస్కరించుకునే అవసరం చాలా ఉంది.

ప్రాచీన భారతదేశం భౌతిక శాస్త్రాలలోనూ, ఆధ్యాత్మిక రంగంలోనూ సమానపురోగతిని సాధించి, ధర్మ అర్థ కామ మోక్షాలనే సన్మార్గంలో విజయవంతంగా పయనించేది. ఇది 2000 ఏళ్ళ నాటి మాట. ఆనాడు భారతదేశం ప్రపంచానికి గురుపీఠంగా, వెలుగు దివ్వెగా నిలిచింది. అందరూ ఆధ్యాత్మికతతో పాటు భౌతిక శాస్త్రాల విజ్ఞానం కోసం కూడా భారత్ వైపు చూసేవారు. దీనికి తక్షశిల, నలంద విశ్వ విద్యాలయాలు, వేద సంస్కృతి, ప్రపంచ వ్యాప్తంగా విస్తరించిన మన వాణిజ్యం తార్కాణాలు. కానీ ఎప్పుడైతే మనం ఈ సమతౌల్యతను కోల్పోయామో మనల్ని మనం రక్షించుకోలేని స్థితికి దిగజారాం. పరాయి వారి దండయాత్రలకు తలొగ్గి, పతనమయ్యాం. చివరకు బానిసలుగా దాదాపు వేయి సంవత్సరాలు కడగండ్లు అనుభవించాం. ఎందరో పుణ్యమూర్తుల స్ఫూర్తితో తిరిగి పుంజుకొని, నేడు అగ్రరాజ్యంగా ఆర్థికంగా ఎదుగుతున్నా, మన సనాతన ధర్మానికి దూరమై పోతున్నాం. జాతి సంస్కృతిని వదలి, పరాయి వారి అనుకరణలో మునిగిపోతున్నాం. గత వేయి సంవత్సరాలుగా మనం పోగొట్టుకున్నది భౌతిక సంపద మాత్రమే. కానీ గత 60 ఏళ్ళుగా 'స్వతంత్రులుగా' మనం పోగొట్టుకుంటున్నది మన 'స్వధర్మం'. మనం మన సంస్కృతికి దూరమవుతున్నాం. ఇది మరీ ప్రమాదకరమైనది.

గతమనే అద్దంలో చూసుకుని మన ప్రాచీన విజ్ఞాన వైభవాన్ని గుర్తించి, తిరిగి మనం 'ఆత్మవిశ్వాసం' పొందాలి. అందుకు "మనకేమీ లేదు." "పాశ్చాత్యుల నుంచే అన్నీ గ్రహిస్తున్నాం అనే న్యూనతాభావం, పరాయి వారల అనుకరణ" విడనాడాలి.

ప్రాచీన భారతీయ శాస్త్ర విజ్ఞాన సంపదను గుర్తించి, ఆధునికతలో రంగరించి ప్రపంచానికి మార్గనిర్దేశం చేయాల్సిన తరుణం ఆసన్నమైంది. మళ్ళీ 'గురుపీఠం'గా నిలిచి, భౌతికత, ఆధ్యాత్మికతల మధ్య సమతూకం పాటించి, ప్రపంచానికి సుఖశాంతులు అందించి, మానవాళి పురోగతికి పాటుపడాల్సిన బాధ్యత మన మీద ఉంది. అందుకు మనమందరం కలిసి ప్రయత్నిద్దాం. ❀

# మనసు - మర్మం

– స్వామి బుధానంద



## ప్రశాంతతతో ప్రగతి!

మనస్సు స్వాధీనంలో లేనివాడు మనశ్శాంతిని పొందలేడు. మనశ్శాంతి లేనివాడు ఆనందంగా ఎలా ఉండగలడు? బలవైన కోరికలు, ఉద్రేకాలు, ఒత్తిళ్ళతో బాధపడే వ్యక్తి దీర్ఘ మానసిక వ్యాధులకు గురవుతాడు.

మనస్సు స్వాధీనమైతే కలిగే ఫలితం – సమగ్ర వ్యక్తిత్వ వికాసం. ప్రతికూల పరిస్థితులలో కూడా అతడు విజయం సాధిస్తాడు. ప్రశాంత చిత్తులు ఎల్లప్పుడూ సంతోషంగా ఉంటారు. సంతోషంగా ఉండే వ్యక్తి ఇతరులను కూడా సంతోషపరచగలుగుతాడు. సంతోషంగా ఉండేవారు చేపట్టిన పనిలో నాణ్యతను ప్రదర్శిస్తారు. అయితే, దీనికి అర్థం అతని జీవితంలో ఎలాంటి చీకూచింతలూ ఉండవని కాదు. కానీ అతడు సమస్యల్ని ధైర్యంగా ఎదుర్కొనే శక్తి కలిగి ఉంటాడు. ఎదురైన కష్టాల్నీ, సమస్యల్నీ విజయానికి సోపానాలుగా మలచుకుంటాడు. వాటివల్ల జీవితంలో అతడు మరింతగా రాణించగలుగుతాడు. అలాంటి వ్యక్తిని సమాజం ఒక ఆదర్శపురుషునిగా కొనియాడుతుంది.

'ప్రపంచాన్ని ఎవరు జయిస్తారు? మనస్సును ఎవరు జయిస్తారో వారే!'

ప్రగతి, అభివృద్ధి, ప్రశాంతత – ఏ రంగంలో వీటిని సాధించాలన్నా మనస్సును స్వాధీనంలో ఉంచుకోవడం అవసరం. మనస్సును స్వాధీనంలో ఉంచుకోలేని జాతి తన అభివృద్ధిని నిలుపుకోలేదు.

అయితే మన ప్రగతికి అవసరమైనది బలమైన సంకల్పశక్తి కలిగి ఉండడమే. ఆ శక్తిని సాధించలేకపోతే అధోగతి పాలవుతామన్న విషయాన్ని మన మనస్సుకు పదేపదే చెప్పాలి. మనస్సుని స్వాధీనపరుచుకున్నామా లేదా అన్న ఒక్క సత్యం మీదే మన భవిష్యత్తు అంతా ఆధారపడి ఉన్నదన్న విషయాన్ని మనకు మనమే స్పష్టంగా తెలియజెప్పుకోవాలి. కనీస అవసరాలు తీరిన తరువాత మనిషికి ఇతర విషయాలు ముఖ్యంగా తోచవచ్చు. కానీ జీవితపు సర్వోత్కృష్ట లక్ష్యమైన జ్ఞానోదయాన్నీ, దైవ సాక్షాత్కారాన్నీ పొందాలనుకుంటే మనస్సును స్వాధీనపరుచుకోవడం కన్నా ముఖ్యమైనది మరొకటి లేదు.

ఒకసారి మనం ఈ విషయాన్ని నిజంగా అర్థం చేసుకుని, దృఢంగా నమ్మగలిగితే మన సంకల్పశక్తి అవసరమైనంత బలాన్ని పుంజుకుంటుంది. మనసుకు ప్రశాంతత చేకూరుతుంది. అలాంటి ప్రశాంత మనసుతో ఏ కార్యాన్నైనా సాధించవచ్చు. ❀






**"Are you growing spiritually? Can you love others? Can you feel oneness with others? Have you peace within yourself? And do you radiate it around you? That is called spiritual growth, which is stimulated by meditation, inwardly, and by work done in a spirit of service outwardly."** ***- Swami Ranganathananda***

- రెంటాల జయదేవ



...గతసంచిక తరువాయి

# శివుడికి ప్రీతికరమైన పుష్పాలు

**శివుడికి ప్రీతికరమైన పుష్పాలు :**

పరమశివుడికి ఏ పుష్పాలతో అర్చన ఇష్టమంటే -

1. ***కరవీరార్క మన్దార । శమీ వకుళ కింశుకమ్ ।***
   ***మధూక బృహతీ బిల్వ । మపామార్గం చ పాటలమ్ ॥***
2. ***అశోకా గస్త్య దత్తూర । కర్ణికార కదమ్బకమ్ ।***
   ***బాణ పున్నాగ తిలకం । కోవిదారం చ చమ్పకమ్ ॥***
3. ***మల్లికా మాధవీ జాతిః । ద్రోణం చ శతపత్రకమ్ ।***
   ***కమలం కైరవం చైవ । తథా నీలోత్పలాని చ ॥***
4. ***తమాలం తులసీపత్ర । మిత్యేతాని శివార్చనే ॥***
   ***పుష్ప పత్రాణి శస్తాని । సర్వపాప హరాణి చ ॥***

*(శివతత్త్వ సార సంగ్రహే)*

*'శివార్చనకు కరవీరం (గన్నేరు), అర్కం (జిల్లేడు), మందారం, శమీ (జమ్మి), బొగడ, మోదుగ, ఇప్ప, వెంపలి, బిల్వం (మారేడు), అపామార్గం (ఉత్తరేణి), కలిగొట్టు, అశోకం, అవిసె, ఉమ్మెత్త, కొండగోగు, కడిమి, నల్ల గోరింట, సురపొన్న, ఎర్ర గోరింట, ఎర్ర దేవకాంచనం, సంపెంగ, మల్లి, పండు గురివెంద, జాజి, తుమ్మి, నూరు రేకుల పద్మం, వెయ్యి రేకుల పద్మం, తెల్ల కలువ, నల్ల కలువ, తాపింఛం, తులసి - వీటికి సంబంధించిన పుష్ప పత్రాలు సర్వదా శ్రేష్ఠాలు. వీటితో పరమ శివుణ్ణి పూజిస్తే, సమస్త పాపాలూ నశిస్తాయి.*

**ఏ దేవుడి అనుగ్రహానికి ఏ పుష్పం వాడాలి?**

ఇంతకు ముందే చెప్పుకున్నట్లు ఒక్కో దేవతా స్వరూపానికి ఒక్కో రకం పుష్పాలు పూజకు ప్రత్యేకమైనవి. ఆ పుష్పాలతో పూజ చేయడం ద్వారా ఆ దేవతా స్వరూపం యొక్క అనుగ్రహాన్ని సులభంగా పొందవచ్చు. సూర్య భగవానుణ్ణీ, విఘ్నేశ్వరుణ్ణీ పూజించడానికి ప్రత్యేకంగా తెల్లజిల్లేడు పువ్వులు వాడడం శుభకరం. విష్ణుమూర్తిని తులసీ దళాలతో పూజించడం శ్రేష్ఠం. శ్రీమహాలక్ష్మీ దేవిని ప్రత్యేకంగా తామర పూలతో పూజించాలి. ఇక, గాయత్రీదేవి విషయానికి వస్తే - ప్రత్యేకంగా మల్లిక, కుటజం (కొండమల్లె, అవిసె), పొగడ, కుశ మంజరి, మందార, మాధవి, జిల్లేడు, కదంబం, పున్నాగ, చంపక, గరిక పుష్పాలతో పూజించడం శ్రేయస్కరమని పెద్దలు చెబుతారు.

పరదేవతా స్వరూపమైన శ్రీచక్రాన్ని ప్రత్యేకంగా తామర పూలు, తులసీ దళాలు, కలువ పూలు, జాజి, మల్లెపూలు, ఎర్ర గన్నేరు, ఎర్ర కలువ పూలు, పున్నాగాలు, కలిగొట్టు పూలు, గురువింద పుష్పాలతో పూజిస్తుంటారు. శివుణ్ణి ప్రత్యేకంగా మారేడు దళాలతో అర్చిస్తుంటారు. ఇలా ఆయా దేవుళ్ళకు ఏ పుష్పాలు అత్యంత ప్రీతికరమో తెలుసుకొని పూజించడం సర్వశ్రేష్ఠం.

**నవగ్రహాలకు పెద్దలు చెప్పిన పుష్పార్చన :**

***హయారి కుసుమైః సూర్యం । కుముదై శ్చంద్ర మర్చయేత్ ।***
***క్షితిజం తు జపా పుష్పై । శ్చంపకేన తు సోమజమ్ ॥***
***శతపత్రై ర్గురుః పూజ్యో । జాజి పుష్పైస్తు భార్గవః ।***
***మల్లికా కుసుమైః పంగుః । కుందపుష్పై ర్విధుంతుదః ॥***
***కేతస్తు వివిధైః పుష్పైః శాంతి కాలేషు సర్వదా ।***

*(భవిష్య పురాణే)*

'సూర్యుణ్ణి పచ్చ గన్నేరులతోనూ, చంద్రుణ్ణి కలువలతోనూ, కుజుణ్ణి దాసాని పూలతోనూ, బుధుణ్ణి సంపెంగలతోనూ, గురు గ్రహాన్ని పద్మాలతోనూ, శుక్రుణ్ణి జాజిపూలతోనూ, శనైశ్చరుణ్ణి మల్లెలతోనూ, రాహువును మొల్లపూలతోనూ, కేతువును వివిధ పుష్పాలతోనూ పూజించాలి.' ❀ *('పుష్పాన్ని బట్టి ఫలితం' వచ్చే సంచికలో...)*

...17వ పేజీ తరువాయి.


8
ఇదేమి అన్యాయం! నా ధోవతిని ఎవరో చింపేశారు.
మన అందరి ధోవతులూ చిరిగి ఉన్నాయి!
ఇదంతా అహంకారి అయిన ఆ మల్లుని పనే అయ్యుంటుంది!
9
అందరూ విల్లిదాసుని బాగా తిట్టుకున్నారు. తమ గురువు వద్ద ఫిర్యాదు చేశారు. గురువు ఆ విషయం పరిశీలిస్తామన్నారు. తర్వాత గురువు శిష్యులతో....
10
ఇదిగో విల్లిదాసు నాతో సత్సంభాషణ కొనసాగిస్తూ ఉంటాడు. మీరు తక్షణం వెళ్ళి అతని భార్య ధరించిన నగలను ఆమెకు తెలియకుండా అపహరించుకుని రండి! అవి మఠ నిర్వాహణకు ఉపయోగపడతాయి.
స్వామీ! ఇది పాపం కాదా!
మీరందరూ వెళ్ళి ముందు నేను చెప్పినట్లు చేయండి!
11
ఇంట్లో విల్లిదాసు భార్య ఒక పక్కకు తిరిగి పడుకొని ఉంది. శిష్యులు లోపలికి వెళ్ళి, ఆమె వేసుకున్న నగలు తీశారు. ఇది గ్రహించిన ఆమె తన మరోవైపు ఉన్న నగలను కూడా వారు తీసుకోవాలనే ఉద్దేశంతో మరొకవైపు తిరిగి పడుకుంది. ఆమె నిద్ర నుంచి మేలుకుందని భయపడిపోయిన శిష్యులు అపహరించిన నగలతో పలాయనం చిత్తగించారు.
12
శ్రీరామానుజులు విల్లిదాసుణ్ణి ఇంటికి వెళ్ళమన్నారు. అతడు వెళ్ళి పోయిన తరువాత శిష్యులందరూ పరుగున వచ్చారు.
శిష్యులారా! ఇప్పుడు వెంటనే మీరందరూ విల్లిదాసు ఇంటికి వెళ్ళి అక్కడ ఏమి జరుగుతుందో ఎవరికీ తెలియకుండా గమనించండి!




విల్లిదాసు జరిగినదంతా రామానుజులకు చెప్పాడు. తన భార్య గొప్పతనాన్ని విల్లిదాసుకి అర్థమయ్యేలా గురువు చెప్పాడు. అందువల్ల విల్లిదాసు తన నిర్ణయం మార్చుకుని మళ్ళీ ఆమెతో కాపురం చేశాడు.






చెకుముకి రాయి కల్పకోటి కాలం నీటిలో మునిగి ఉన్నా, తనలో ఉన్న నిప్పును కోల్పోదు. దాన్ని ఇనుముతో రుద్దితే వెంటనే నిప్పు కణాలు చెలరేగుతాయి. దృఢ చిత్తం గల భక్తుడు కూడా అలానే! అతడు సంసారంలో ఉంటున్నా అతని ప్రేమ, భక్తులు తగ్గవు. భగవంతుని నామాన్ని విన్న మరుక్షణం తనను తాను మరచిపోతాడు.

– శ్రీరామకృష్ణ పరమహంస

# గ్రంథ స్వీకారం



### జయజయహే...

రచన : పురాణపండ శ్రీనివాస్
పేజీలు: 120, వెల: 27/-
ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్,
సిద్ధార్థ హోటల్ ప్రక్కన, కోఠి, హైదరాబాద్



### జయతు జయతు మంత్రం

రచన : పురాణపండ శ్రీనివాస్
పేజీలు: 120, వెల: 27/-
ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్,
సిద్ధార్థ హోటల్ ప్రక్కన, కోఠి, హైదరాబాద్




### జయ భారతి

రచన : పురాణపండ శ్రీనివాస్
పేజీలు: 120, వెల: 27/-
ప్రతులకు: శృంగేరీ సరస్వతి ఆలయం
అవంతీపురం, నల్లగొండ జిల్లా



### త్యాగరాజ కృతులు; స్వరలయ; రసభావపోషణ

రచన : బి. ఉషాలక్ష్మి
పేజీలు: 103, వెల: 30/-
ప్రతులకు: యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనాలు,
తిలక్‌రోడ్, హైదరాబాద్-500 001

### శ్రీ యోగవాశిష్ఠం

రచన : ఓరుగంటి రామకృష్ణప్రసాద్
పేజీలు: 166, వెల: 50/-
ప్రతులకు: నవరత్న బుక్ హౌస్
28-22-20, రహిమాన్‌వీధి,
అరండల్‌పేట్, విజయవాడ- 520002







### శ్రీకృష్ణార్జున సంవాదము

రచన : శ్రీసత్యానందమహర్షులవారు
పేజీలు: 160, వెల: 20/-
ప్రతులకు: శ్రీహరితీర్థస్వాములవారు
శ్రీసత్యానందాశ్రమము,
ఇనమడుగు-524 137, నెల్లూరు జిల్లా

## పండుగలు - పర్వదినాలు

### జనవరి- 2009

| | | | |
|---|---|---|---|
| 01 | గురువారం | : | కల్పతరు దినోత్సవము |
| 02 | శుక్రవారం | : | స్వామి శారదానంద జయంతి |
| 07 | బుధవారం | : | వైకుంఠ ఏకాదశి |
| 10 | శనివారం | : | స్వామి తురీయానంద జయంతి |
| 12 | సోమవారం | : | జాతీయ యువజన దినోత్సవం |
| 14 | బుధవారం | : | సంక్రాంతి |
| 17 | శనివారం | : | స్వామి వివేకానంద జయంతి |
| 28 | బుధవారం | : | స్వామి బ్రహ్మానంద జయంతి |
| 30 | శుక్రవారం | : | స్వామి త్రిగుణాతీతానంద జయంతి |

### ఫిబ్రవరి- 2009

| | | | |
|---|---|---|---|
| 05 | గురువారం | : | ఏకాదశి |
| 09 | సోమవారం | : | స్వామి అద్భుతానంద జయంతి |
| 20 | శుక్రవారం | : | ఏకాదశి |
| 23 | సోమవారం | : | మహా శివరాత్రి (రాత్రి పూజ & భజన) |
| 27 | శుక్రవారం | : | భగవాన్ శ్రీరామకృష్ణ జయంతి |

# వార్తావాహిని

## వివేకానంద ఆరోగ్య కేంద్రానికి పురస్కారం




**హైదరాబాద్ రామకృష్ణ మఠం** వివేకానంద ఆరోగ్య కేంద్రం ద్వారా వైద్యరంగంలో అందిస్తున్న విశిష్ట సేవలకు 'డాక్టర్ కొండా శకుంతలా దేవి వైద్య, ఆరోగ్య సేవల ప్రతిభా పురస్కారం' లభించింది. నవంబరు 19న *'కొండా లక్ష్మణ్ బాపూజీ సంస్థ'* ఆధ్వర్యవంలో జరిగిన సభలో శ్రీ కొండా లక్ష్మణ్ బాపూజీ ఈ పురస్కారాన్ని హైదరాబాద్ రామకృష్ణ మఠం స్వామి గౌరాంగానందజీకి ప్రదానం చేశారు. ఈ పురస్కారం క్రింద లక్ష రూపాయల నగదు, ప్రశంసాపత్రం అందజేశారు. ❀

## యువ మహామండలి వార్షికోత్సవం




**విశాఖపట్నం వివేకానంద యువ మహామండలి** 20వ వార్షికోత్సవం నవంబరు 16న జరిగింది. ఈ కార్యక్రమంలో విశాఖపట్నం రామకృష్ణ మిషన్ ఆశ్రమ స్వామి గుణేశానందజీ 'యువతకు స్వామి వివేకానంద సందేశం'పై ప్రసంగించారు. ఈ సందర్భంగా *'వివేకానందుని మార్గంలో సమస్యల పరిష్కారం'*, *'మూర్తిత్రయ సంక్షిప్త జీవిత చరిత్రలు'* – తెలుగు పుస్తకాల్ని ఆవిష్కరించారు. ❀ **నివేదిక : ఎన్. లక్ష్మీనారాయణ**

## వ్యక్తిత్వవికాస సదస్సు

**రాజమండ్రి రామకృష్ణ మఠం** 2008 నవంబరు 8,9 తేదీల్లో ఉపాధ్యాయుల సదస్సు, యువజన సదస్సు నిర్వహించింది. ఈ కార్యక్రమంలో సుమారు 75 మంది ఉపాధ్యాయులు, 90 మంది విద్యార్థినీ విద్యార్థులు పాల్గొన్నారు. విజయవాడ రామకృష్ణ మిషన్ స్వామి స్వసంవేద్యానంద, విశాఖపట్నం రామకృష్ణ మిషన్ ఆశ్రమ స్వామి గుణేశానంద రెండు రోజుల పాటు జరిగిన ఈ సదస్సుల్లో పాల్గొని స్ఫూర్తిదాయక సందేశాన్ని అందించారు. విద్యార్థులూ, ఉపాధ్యాయులూ సామూహిక చర్చలో ఉత్సాహంగా పాల్గొని ప్రస్తుత విద్యావిధానంలో తీసుకురావాల్సిన మార్పులను గురించి చర్చించారు. ఈ సందర్భంగా నగరంలోని వివిధ పాఠశాల, కళాశాలల విద్యార్థులకు చిత్రలేఖనం, వ్యాసరచన, వక్తృత్వ పోటీలను



మిషన్ నిర్వహించింది. ఈ పోటీల్లో 3000 మంది విద్యార్థులు పాల్గొన్నారు. నవంబరు 16వ తేదీన రాజమండ్రి సెంట్రల్ జైల్ సూపరింటెండెంట్ శ్రీ సాయినాథ్ రెడ్డి విజేతలకు బహుమతి ప్రదానం చేశారు. ❀

**నివేదిక : స్వామి అక్షరాత్మానంద**

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) 'వేదచూడామణి'** : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము

యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.

వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య

స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

**(ఆ) 'వేదార్థచూడామణి'** : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము

యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.

వయస్సు : 15 సం॥, ఆ పైన

స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) వేదాధ్యాపకుడు** : (సామవేదము/ అథర్వవేదము – వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)

కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము

అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవము : 2 సంవత్సరములు

సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

**(ఆ) వేదభాష్యాచార్యుడు** : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)

విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత

అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవార్హత : 5 సం॥

సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

హైదరాబాద్ కులప్రశాసకుడు





Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**



# సురభి

శ్రీశారదాదేవి ఒక సాధారణ స్త్రీలాగే ఉండేవారు. ఒకే పడక మీద నేను (ప్రవ్రాజిక భారతీప్రాణ), రాధు మాతృదేవితో పడుకునేవాళ్ళం. కానీ నేను కలిసిమెలసి ఉంటున్నది ఒక దేవతతో అనే భావన ఎన్నడూ నాలో కలుగలేదు.

మాతృదేవి మహాసమాధి చెందిన తరువాత శరత్ మహారాజ్ (స్వామి శారదానంద) నాతో "శ్రీ శారదాదేవిని ఇప్పటి వరకూ స్థూల దేహంలో దర్శించి సేవించావు. ఇప్పుడు ఆమె నిజ స్వభావాన్ని తెలుసుకునే ప్రయత్నం చెయ్యి" అన్నారు.

మాతృదేవి జీవన విధానం అనుపమానమైనది. ఆమె సమక్షంలో ఎవరైనా ఇతరుల్ని విమర్శిస్తే, వారిపై మాకు కోపం వచ్చేది. కానీ, శారదమ్మ మాత్రం వారిని కోపగించుకునేవారు కాదు. పైగా వారిపై అమిత ప్రేమను చూపేవారు. క్షమాగుణంలో ఆమెకు ఆమే సాటి.

శారదాదేవికి ఏ కోరికలూ ఉండేవి కావు. ఆమె దగ్గర ఒక పాత, విరిగిపోయిన దువ్వెన ఉండేది. శారదమ్మ, రాధు, నేను, మిగిలిన వారు కూడా తలదువ్వుకునేందుకు ఆ దువ్వెననే ఉపయోగించే వాళ్ళం. ఎవరైనా "అమ్మా! చాలా మంది భక్తులు 'మీకేం కావాలి' అని అడుగుతుంటారు. మీరు కనీసం ఒక దువ్వెన కావాలి అని అయినా అడగరెందుకు"? అని అడిగితే శారదమ్మ "ఆ దువ్వెనకి ఏమయింది, బాగానే ఉంది కదా!" అనేవారు. ఆమె ఏనాడూ పాదరక్షలు ఉపయోగించలేదు.

శారదమ్మ దగ్గరకు వచ్చిన ప్రతి ఒక్కరూ అమ్మ తననే ఎక్కువ ప్రేమిస్తున్నారు అనుకునేవారు. ఆమె ప్రేమ గురించి ఏమని చెప్పను? దాన్ని నేను ఎలా వర్ణించగలను? ఆమె ప్రేమ అనంతం, విశ్వజనీనం. ❀

(శ్రీ శారదామఠం ప్రథమ సర్వాధ్యక్షులు
ప్రవ్రాజిక భారతీప్రాణ మాతాజీ స్మృతుల నుంచి)

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

ఫిబ్రవరి 2009
వెల : రూ. 10



హే రామకృష్ణ త్వయి భక్తిహీనే
కృపాకటాక్షం కురు దేవ నిత్యమ్।

# సుబోధ



కొత్తగా నగరానికి వచ్చే వ్యక్తి రాత్రి శయనించడానికి తగిన గదిని ఏర్పరచుకొని, అక్కడ తన సరంజామా పెట్టుకోవాలి. తరువాత స్వేచ్ఛగా నగర విచిత్రాలను చూడడానికి పోవచ్చు. అలా చేయనిపక్షంలో రాత్రి చీకటిలో బస లేక చాలా బాధపడాల్సి వస్తుంది. అలాగే నిత్యశాంతి నిలయమైన భగవంతుడి ప్రాపు ముందుగా సంపాదించ గలిగితే, ఈ లోకంలోకి వచ్చిన కొత్త వ్యక్తి తన నిత్యకృత్యాలను చక్కబరచుకొంటూ సంసారంలో నిర్భయంగా వర్తించగలుగుతాడు.

ఆవేశపూరితులైన కొందరు సంఘ సంస్కర్తలతో గురుదేవులు ఇలా అన్నారు: "లోకోపకారం, లోకోపకారమని మీరేదో ఘోషిస్తూ ఉంటారే, మీరు ఉపకారం చెయ్యబోయే ప్రపంచం అంత క్షుద్రమైనదా? అయ్యా! అదీగాక లోకోపకారం చేయడానికి మీరెవరు? మొదట భక్తిసాధనలు చేసి భగవంతుణ్ణి దర్శించండి. అప్పుడు మీకు భగవదాదేశం కలుగుతుంది; లోక హితం ఒనర్చడానికి శక్తిసామర్థ్యాలు లభిస్తాయి; లోకోపకారాన్ని గురించి మీరప్పుడు మాట్లాడవచ్చు. అంతేగానీ అంత కన్నా ముందు కాదు." ✸

భగవద్భక్తిరహితమైన కర్మ నిలువదు. భగవద్భక్తి లేకుండా చేసే కర్మ ఇసుక మీద భవనాన్ని నిర్మించడం లాంటిది. అందువల్ల మొదట భక్తిని అలవరచుకోవాలి. ఆ తరువాత నీ కిష్టమైతే ఇతరమైనవన్నీ – అంటే పాఠశాలలు, ఆసుపత్రులు మొదలైనవన్నీ నువ్వు ప్రారంభించవచ్చు. మొదట భక్తి, తరువాత కర్మ. భగవద్భక్తి లేని కర్మ పునాది లేని గోడ లాంటిది. అది నిలబడదు.

('శ్రీరామకృష్ణ బోధామృతం' నుంచి)

**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద**
సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**



# సురభి

నేను (స్వామి వీరేశ్వరానంద) బేలూరు మఠంలో ఉండేటప్పుడు మొదటిమారు 1916 జూన్‌లో జయరాంబాటీ వెళ్ళాను. ప్రయాణం చాలా శ్రమకరంగా ఉంది; ప్రయాణంలో నాతో పాటు వచ్చిన వారిలో  కొందరి ఆరోగ్యం పాడవడం వల్ల వాళ్ళు తిరిగి కలకత్తా వెళ్ళాల్సి వచ్చింది; మాలో కేవలం ఇద్దరం జయరాంబాటీ చేరాం.  మమ్మల్ని శారదామాత దగ్గరకు తీసుకుని వెళ్ళారు. అప్పుడు ఆమె తమ పాత ఇంటి వరండాలో కూర్చొని, రాత్రి వంట కోసం కూరలు తరుగుతున్నారు. స్వామి ప్రేమానంద ఇచ్చిన  ఉత్తరాన్ని మాతో  తీసుకొని వెళ్ళాం. దాన్ని ఒక బ్రహ్మచారి ఆమెకు చదివి వినిపించారు. ఆమె "సరే! వాళ్ళకు రేపు దీక్ష ఇవ్వడం జరుగుతుంది" అన్నారు.

మరునాడు ఉదయం గురుమహరాజ్‌కు పూజ చేశాక, మాతృదేవి మాకు దీక్ష ఇచ్చారు.

శారదాదేవిని దివ్యజనని అనడానికి ఆమె రూపురేఖలలో ఏ ప్రత్యేకతా ఉండేది కాదు. ఆమె ఒక సాధారణ పల్లెటూరి స్త్రీలాగే కనపడేవారు. చాలా మంది స్త్రీల మధ్య ఆమె కూర్చొని ఉంటే దివ్యజనని ఎవరో తెలుసుకోవడం కష్టం.

భక్తులు "మాకు ఆధ్యాత్మిక సాధనల వల్ల లాభమేమీ ఉండడం లేదు" అంటే, శారదాదేవి "మీరు రోజుకు 10 – 15 వేల సార్లు మీ మంత్రం జపించి చూడండి. లాభం ఉందో, లేదో నేను చెబుతాను. ఋషులు, మునులు సత్యసాక్షాత్కారం కోసం కొన్ని జన్మల పాటు తపస్సాధనలు చేసేవారు. మీరు ఏమీ చెయ్యకుండా అన్నీ లభించాలంటారు. కష్టపడి ప్రయత్నించనిదే ఏదైనా సాధ్యమవుతుందా?" అనేవారు. అలా అన్నప్పటికీ, "శ్రీరామకృష్ణులు వచ్చి భగవత్సాక్షాత్కారాన్ని మనకు సులభం చేశారు. కనుక ఎవరైనాసరే కాస్త సాధన చేసినట్లయితే భగవత్ సాక్షాత్కారం కలుగుతుంది" అని ఆమె వారిని ప్రోత్సహించేవారు.

"ఎప్పుడు మీకు కష్టాలు, బాధలు ఎదురైనా మీకు ఒక అమ్మ ఉంది అని గుర్తుంచుకోండి" అని అన్నారు.

ఎప్పుడు కష్టాలు ఎదురైనా, మనం అమ్మను ప్రార్థిద్దాం. ఆమె మనల్ని కాపాడుతుంది, మన కష్టాల్ని తొలగిస్తుంది. అందులో సందేహం లేదు. ✸

(రామకృష్ణ సంఘ 10వ సర్వాధ్యక్షులు
స్వామి వీరేశ్వరానంద స్మృతులు)

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 66 సంచిక: 2 ఫిబ్రవరి 2009

**వచసా చరితం వదామి శంభో, రహముద్యోగ విధాసు తేఽపసక్తః**
**మనసాఽకృతిమీశ్వరస్య సేవే, శిరసా చైవ సదాశివం నమామి ॥**

హే శంభో! ఉన్నతమైన యోగ విద్యలో పరిచయం లేనందున నోటితో నీ సద్గుణ గానం చేస్తున్నాను. మనసులో నీ దివ్యరూపాన్ని ధ్యానిస్తున్నాను. శిరస్సుతో నీకు ప్రణమిల్లుతున్నాను. (శివానంద లహరి)





## లోపలి పేజీల్లో...












# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి

 

ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**............ రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాతపేరు / చిరునామా | రూ. |
|---|---|---|
| పోషకులు | : శ్రీ గంగిరెడ్డి, పంగల్, మహబూబ్‌నగర్ జిల్లా - 509 120 | 1,500 |
| " " | : కుమారి కె. సాయి ప్రియ, పుత్తూరు, చిత్తూరు జిల్లా - 517 583 | 1,116 |
| " " | : శ్రీమతి బి. తులసాన, వినాయకపురం, చిత్తూరు -517 002 | 1,116 |
| " " | : శ్రీమతి ఎ. ప్రేమలత, బెస్తవార్ పేట్, నిర్మల్ , అదిలాబాద్ జిల్లా - 504 106 | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం.

భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో

స్వామి జ్ఞానదానంద

అధ్యక్షులు

**ముఖచిత్రం :** యూరప్‌లోని ఆస్ట్రియా దేశానికి చెందిన ఫ్రాంక్ డ్వోరక్ అనే చిత్రకారుడు భగవాన్ శ్రీరామకృష్ణులను స్వప్నంలో దర్శించారు. ఆ స్వప్నం ఆధారంగా ఆయన చిత్రీకరించిన శ్రీరామకృష్ణుల చిత్రాన్ని ఈ నెల 'శ్రీరామకృష్ణ ప్రభ' ముఖచిత్రంగా పాఠకులకు అందిస్తున్నాం.



| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 365 |

గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా: Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకి కుడి భాగంలో మీ చందా గడువు నెల పొందుపరచబడి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ చేయబడుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

- సర్క్యులేషన్ మేనేజర్



**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com





భగవంతుడు ప్రపంచమంతా వ్యాపించి ఉన్నాడని వేదాలు, ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయి. అయినప్పటికీ మనం భగవంతుణ్ణి ఆలయాలకే పరిమితం చేయడం వల్ల మన హృదయాలయాల్ని శూన్యం చేసుకొంటున్నాం. అశాంతినీ, అసంతృప్తినీ నింపుకొంటున్నాం.

మన ఆధ్యాత్మిక చరిత్రలో ఎంతో మంది మహాభక్తులు భగవంతుడు సర్వత్రా ఉన్నాడని నిరూపించినా మనోంత రాళాల్లో గాఢంగా నాటుకుపోయిన సందేహాలు మనల్ని వీడడం లేదు.

శ్రీహరి ఎక్కడున్నాడో చూపించమని తండ్రి హిరణ్య కశిపుడు, ప్రహ్లాదుణ్ణి గద్దించినప్పుడు తన తండ్రితో **"ఇందు గల డందు లేదని, సందేహము వలదు చక్రి సర్వోపగతుం డెం దెందు వెదకి చూచిన నం దందే గలడు దానవాగ్రణి! వింటే"** అని ప్రహ్లాదుడు అంటాడు.

# ఇందు గల డందు లేడని సందేహము వలదు ...

మనం దేవాలయంలో దేవుణ్ణి ప్రార్థిస్తున్నప్పుడూ, జప, ధ్యానాలు చేస్తున్నప్పుడూ పొందే ఆనందం, ప్రశాంతతలను మన గృహాలయంలోనూ, కార్యాలయంలోనూ పొందలేక పోతున్నాం. ప్రదేశం మారేసరికి ప్రశాంతతలోనూ, ప్రవర్తనలోనూ మార్పు వస్తుంది. దేవాలయంలో ఎంతో భక్తి ప్రపత్తులను ప్రదర్శించే వ్యక్తి కుటుంబ సభ్యులతోనూ, సహోద్యోగులతోనూ వ్యవహరించే తీరు భిన్నంగా ఉంటుంది. మనిషిలో ఎలాంటి మార్పూ లేకపోయినా మనోభావాలలో ఊహించని మార్పు కనిపిస్తుంది. దీనికి కారణం ఏమిటి? సరిగ్గా ఆలోచిస్తే, దేవాలయంలో ప్రార్థించే దేవుణ్ణి కేవలం దేవాలయానికే పరిమితం చేయడమే దీనికి కారణమని అర్థమవుతుంది!

విశ్వమంతా వ్యాపించి ఉన్న ఆ విశ్వేశ్వరుణ్ణి విస్మరించడం వల్ల 'పరమాత్మ వేరు, ప్రపంచం వేరు' అనే భావనతో జీవి స్తున్నాం. నిజానికి ఆ జగన్నాథుడు లేని ఈ జగత్తు ఉందా?

**ఊర్ధ్వశ్చ నారాయణః అధశ్చ నారాయణః**
**అంతర్బహిశ్చ నారాయణః నారాయణ ఏ వేదం సర్వం**

(నారాయణోపనిషత్)

'ఊర్ధ్వభాగంలో నారాయణుడే! అధోభాగంలో ఉన్నదీ నారాయణుడే! లోపల, బయట కూడా నారాయణుడే!! ఈ సమస్త ప్రపంచమంతా నారాయణుడే తప్ప మరేదీ లేదు'.

**అంతటా అనంతుని దర్శనమే! :** శ్రీరామకృష్ణ పరమహంస మనందరి లాగే ప్రపంచంలో జీవిస్తూ, స్వధర్మాల్ని నిర్వర్తిస్తూ కూడా అంతటా, అన్ని వేళలా కాళీమాతను దర్శించారు, అమ్మతో భాషించారు. సర్వత్రా ఆ సర్వేశ్వరిని కాంచగలగడం ఆయనకు మాత్రం ఎలా సాధ్యమైంది?

శ్రీరామకృష్ణులు కాళీమాతను కేవలం కాళికాలయానికే పరిమితం చేయలేదు. జగత్తు, జగన్మాత వేరు వేరని ఆయన భావించలేదు. దేవాలయంలో ప్రతిష్ఠితమైన అమ్మను తన హృదయాలయంలో కూడా ప్రతిష్ఠించుకున్నారు. కాబట్టి శ్రీరామకృష్ణులకు అమ్మే లోకమయింది. లోకమే అమ్మమయం అయింది. అమ్మ తప్ప ఈ లోకంలో ఏమీ తెలియని పసివాని స్థితి ఆయనది. ఆ జగజ్జనని చింతనతో చిత్తమంతా నిండి ఉండడం వల్ల ఆయనకు అంతా భగవన్మయమే! భగవంతుడు తప్ప వేరొకటి కనిపించలేదు. అందుకు ఉదాహరణగా శ్రీరామకృష్ణుల జీవితంలోని కొన్ని సంఘటనలను మననం చేసుకుందాం.

- ఒకసారి శ్రీరామకృష్ణులు వీధి నాటకం చూడడానికి వెళ్ళారు. ఆ నాటకంలోని సీతారామాంజనేయుల పాత్ర ధారులను చూడగానే వారిలో సాక్షాత్తూ సీతామాతనూ, శ్రీరాముణ్ణీ, ఆంజనేయ స్వామినీ దర్శించారు.
- కలకత్తాలోని మైదానంలోకి వాహ్యాళికి వెళ్ళినప్పుడు అక్కడ ఓ బాలుడు చెట్టుకు ఆనుకొని నిలుచున్నాడు. ఆ దృశ్యాన్ని

చూసిన శ్రీరామకృష్ణులు ఆ బాలునిలో బాలగోపాలుణ్ణి దర్శించారు.

* పశువుల కాపరులను చూసి, వారిలో బృందావన గోపబాలురను గాంచిన శ్రీరామకృష్ణులు వారికి తన స్వహస్తాలతో మిఠాయిలు తినిపించారు.
* శ్రీరామకృష్ణులు గుఱ్ఱపు బండిలో వెళుతుండగా దారిలో ఒక మద్యం దుకాణం కనిపించింది. అక్కడ కొంతమంది మద్యం సేవించి మత్తులో మునిగి తేలుతున్న తాగుబోతుల్ని చూశారు. వారిని ఆ స్థితిలో చూడగానే భగవన్నామ రసాన్ని సేవించి, భావపారవశ్యంలో ఉన్న భక్తులుగా భావించి ఆయన భావసమాధి పొందారు.
* ఒకసారి శ్రీరామకృష్ణులు ధ్యానంలో ఉండగా కాళీమాత రమణి అనే వేశ్య రూపంలో ప్రత్యక్షమైంది. అప్పుడు ఆయన ఎలాంటి మనోవికారానికీ లోను కాకుండా చిరు నవ్వుతో "అమ్మా! ఈ రోజు నాకు రమణి రూపంలో దర్శ నమిచ్చావా? అంతటా, అందరిలోనూ ఉన్నది నీవేనమ్మా!" అంటూ రమణి రూపంలో ఉన్న అమ్మను పూజించారు.

శ్రీరామకృష్ణులు నాటకం చూసినా, ఉద్యానానికి వెళ్ళినా, పశువుల కాపరులనూ, వేశ్యనూ, తాగుబోతుల్నీ చూసినా - అందరిలోనూ భగవంతుణ్ణే దర్శించగలిగారు.

ఎన్నో ఆకర్షణల మధ్య, ప్రలోభాల మధ్య జీవనం సాగిస్తూ భగవంతుణ్ణి అంతటా, అన్ని వేళలా దర్శించడం, భావించడం, స్మరించడం మనలాంటి వారికి సాధ్యమేనా అనే సందేహం రాక మానదు.

శుద్ధ మనస్సు, శుద్ధ బుద్ధి, శుద్ధ ఆత్మ - ఈ మూడూ ఒక్కటేనని శ్రీరామకృష్ణులు బోధించారు. కాబట్టి మనస్సు పరిశుద్ధమైతే, అలాంటి మనస్సుతో సర్వమూ సాధించవచ్చు.

**పవిత్రమైన మనస్సులో పరమాత్మ ప్రతిష్ఠ :** మనస్సు తెల్లని వస్త్రం లాంటిది. మనస్సనే తెల్లని వస్త్రం విషయ వాంఛలనే మరకలతో ఉన్నంత వరకూ భగవంతుణ్ణి మనస్సులో ప్రతిష్ఠించలేం! ఆయనను దర్శించలేం. మానవుణ్ణి మాధవునిగా చేసినా, దానవునిగా మార్చినా మనస్సే ప్రధాన సూత్రధారి.

**మనోనైర్మల్యానికి సులభ మార్గం :** పవిత్రమైన మనస్సులో భగవంతుడు వసిస్తాడు. అయితే ఈ మనస్సును నిర్మలం చేయడం ఎలా? గుఱ్ఱాల కళ్ళకు గంతలు కడితేగాని అవి ఒక్క అడుగైనా ముందుకు వెయ్యలేవు. అలాగే మనస్సనే గుఱ్ఱానికి వివేక, వైరాగ్యాలనే గంతలు కట్టాలి. అప్పుడే మనస్సు భగవన్మార్గంలో పయనిస్తుంది. భగవద్దర్శనమనే గమ్యాన్ని చేరుకుంటుంది. ఇంద్రియనిగ్రహం లేనిదే భగవంతుణ్ణి మనోఫలకంపై ప్రతిబింబింప చేయడం సాధ్యం కాదు. కాబట్టి ఇంద్రియాలను నిగ్రహించాలి. "భగవన్నామ సంకీర్తన చేస్తే ఇంద్రియ నిగ్రహ శక్తి స్వతఃసిద్ధంగా లభిస్తుంది" అని శ్రీరామకృష్ణులు సరళమైన మార్గాన్ని సూచించారు. కలియుగంలో మనస్సును పవిత్రం చేయడానికి భగవన్నామ స్మరణే ఉత్తమమైనది.

**తత్ ప్రాప్య తదేవావలోకయతి, తదేవ శృణోతి,**
**తదేవ భాషయతి, తదేవ చింతయతి ।**

(నారదభక్తి సూత్రాలు-55)

"ఎవరి మనస్సైతే భగవంతుని పాదపద్మాల మకరందాన్ని పానం చేస్తుందో అలాంటి వారు ఎక్కడ ఉన్నా, ఎలా ఉన్నా, ఏ పనిలో నిమగ్నమై ఉన్నా భగవంతుణ్ణే చూడాలని ఆశిస్తారు. భగవంతుని గురించి తప్ప వేరే విషయాలను వినడానికీ, మాట్లాడడానికీ ఇష్టపడరు" అని 'నారద భక్తిసూత్రాలు' చెబుతున్నాయి.

జీవితమనే ఈ సాగరంలో ఉక్కిరిబిక్కిరి అవుతూ, జీవన వలయంలో చిక్కుకోకుండా భగవంతుణ్ణి నిత్యం స్మరించడం, విశ్వమంతా నిండి ఉన్న పరమాత్ముణ్ణి దర్శించడం దుష్కరమైన పనులే! అయితే, కేవలం భగవన్నామ స్మరణతోనే ప్రహ్లాదుడు శ్రీహరినీ, శ్రీరామకృష్ణులు కాళీమాతనూ సర్వత్రా దర్శించగలిగారు. మనం కూడా ఎన్ని పనుల్లో నిమగ్నమై ఉన్నా శ్రీరామకృష్ణులు సూచించిన 'భగవన్నామస్మరణ' అనే సులభమైన మార్గాన్ని ఆచరించగలిగితే ***'ఇందు గల డందు లేదని సందేహము'*** నుంచి బయటపడగలం. భగవంతుణ్ణి ఆలయంలోనే కాక అంతటా దర్శించగలం! ✸



గోరుముద్ద

# నేను  నా రామకృష్ణ

– స్వామి సుప్రియానంద

'కర్తృత్వం ఉన్నప్పుడు భోక్తృత్వం తప్పనిసరి' అంటారు శంకర భగవత్పాదులు. 'నేను – నాది, అనేది అజ్ఞానం' అంటారు శ్రీరామకృష్ణులు.

ఈ 'నేను' ప్రపంచాన్ని రంగులతో నింపుతుంది, సత్యాన్ని కప్పివేస్తుంది. మానవుడికీ, దైవానికీ మధ్య అడ్డుగోడ అవుతుంది. అనంతుడైన భగవంతుడికి ఒక పరిమితిని ఆపాదిస్తుంది.

ఒకసారి ఒక వ్యక్తి రామకృష్ణ మఠ వరిష్ఠ సాధువొకరి దగ్గరకు వచ్చి తనకున్న వాక్పటిమకు గురుభావాన్ని జోడించి రామకృష్ణుల గురించి అనర్గళంగా మాట్లాడి తన పాండిత్యాన్ని ప్రదర్శించారు. ఆసాంతం విన్న ఆ స్వామీజీ "నీ అహంకారమే నీ రామకృష్ణ అయ్యారు. నీ జపం, ధ్యానం అన్నీ దాన్ని తృప్తిపరచడానికే చేస్తున్నావు. దీని వలన ఎటువంటి ఆధ్యాత్మిక ఉన్నతీ కలుగదు. ముందు 'నేను' అన్న అహంకారం నుండి జాగ్రత్తపడు. అప్పుడే నీలో నిజమైన రామకృష్ణ విరాజిల్లుతాడు.



పాండిత్యం అనుభూతిని ఇవ్వదు''. అని గట్టిగా మందలించారు. ఆ స్వామీజీ మందలింపులోని అంతరార్థం ఏమిటి? 'నా రామకృష్ణ'ను ఒక 'అంశం' గా గిరిగీసి 'నేను'ను చిత్రించుకోవడమే!.

'నేను' నుండి బయటపడి 'నాది' అనే లంపటాన్ని అధిగమించడం ఎలా సాధ్యం? అహంకారం నుండి తప్పించుకోవడం అసాధ్యం. అందువలన మానవుడు దానిని అణిచివుంచడానికి తాను భగవంతుని భక్తుణ్ణి లేక భగవంతుని దాసుణ్ణి అని భావించడం ఉత్తమమైన మార్గంగా శ్రీరామకృష్ణులు తమ జీవితం ద్వారా అభివ్యక్తం చేశారు.

'నేను' రామకృష్ణ భక్తుణ్ణి, ఆయన దాసుణ్ణి అని త్రికరణశుద్ధిగా భావించినప్పుడు శ్రీరామకృష్ణ 'నా రామకృష్ణ' అవుతారు. కాని అధికశాతం తమ కర్తృత్వాన్ని వదలకుండా తమ కర్తవ్యాన్ని మాత్రం రామకృష్ణులకు అర్పిస్తారు. కేవలం 'నేను' కర్తృత్వపు అహంకారానికి చిహ్నం. 'నేను రామకృష్ణ భక్తుణ్ణి' అని భావించినప్పుడు అది మన కర్తవ్యాన్ని గుర్తుచేయాలి. 'శ్రీరామకృష్ణం శిరసా నమామి – మమ రామకృష్ణం మనసా స్మరామి' అని గొంతెత్తి పాడగానే సరిపోదు. స్వామి వివేకానంద ఈ భావనతో ఒనరించిన 'కర్తవ్యపాలన' మనకు మార్గదర్శకం కావాలి. స్ఫూర్తినివ్వాలి. అప్పుడే రామకృష్ణులు మన సొంతం అవుతారు.

స్వామి వివేకానందులే రామకృష్ణుల వారి గురించి ఎక్కువ మాట్లాడలేదు. ఇక మన పాండిత్యం ఏపాటిది? ✸

## పండుగలు - పర్వదినాలు

### ఫిబ్రవరి- 2009

| | | | |
|---|---|---|---|
| 05 | గురువారం | : | ఏకాదశి |
| 09 | సోమవారం | : | స్వామి అద్భుతానంద జయంతి |
| 20 | శుక్రవారం | : | ఏకాదశి |
| 23 | సోమవారం | : | మహా శివరాత్రి (రాత్రి పూజ & భజన) |
| 27 | శుక్రవారం | : | భగవాన్ శ్రీరామకృష్ణ జయంతి |

### మార్చి- 2009

| | | | |
|---|---|---|---|
| 07 | శనివారం | : | ఏకాదశి |
| 11 | బుధవారం | : | శ్రీ చైతన్య మహాప్రభు జయంతి |
| 14 | శనివారం | : | స్వామి యోగానంద జయంతి |
| 22 | ఆదివారం | : | ఏకాదశి |
| 27 | శుక్రవారం | : | ఉగాది |





# పరమేశ్వరుని మూర్తిత్వం పరమహంస అవతారం

**- స్వామి జ్ఞానదానంద**

**ఒ**కసారి శ్రీరామకృష్ణులు రాఖాల్ (స్వామి బ్రహ్మానంద)తో భావపారవశ్యస్థితిలో తనను గురించి "ఈ ఆధ్యాత్మిక అనుభూతుల తీవ్రత వానాకాలంలో ప్రచండంగా కురిసి, ఆగిపోయే వాన కాదు, ఒక శిల్పి చెక్కగా ప్రతిష్ఠించిన శివుని ప్రతిమ కూడా కాదు, ఇది స్వయంభూ లింగం" అన్నారు.

శ్రీరామకృష్ణుల బాల్యంలో, కామార్పుకూర్‌లో ఉండగా ఒక శివరాత్రి నాడు, శివమహిమను తెలిపే నాటికను ప్రదర్శించడానికి ప్రక్క ఊరి నుంచి ఒక నాటక బృందం వచ్చింది. కానీ ఆఖరి క్షణంలో శివ వేషధారికి జ్వరం వచ్చింది. ఆ కారణంగా గ్రామపెద్దలు గదాధర్‌ను శివుని పాత్ర ధరించాల్సిందిగా కోరారు; దానికి అతను అంగీకరించాడు.

శివుని వేషంలో ఉన్న గదాధరుడు తలపై జటాజూటంతో మెడకూ, చేతులకూ రుద్రాక్ష మాలలతో, ఒళ్ళంతా విభూతి పూసుకుని నెమ్మదిగా అడగులు వేస్తూ వేదికపైకి వచ్చి, మధుర దరహాసంతో, రెప్పవాల్చకుండా అంతర్ముఖుడై నిశ్చలంగా నిలబడ్డాడు. శివుని వేషంలో గదాధరుణ్ణి చూసిన ప్రేక్షకులు సంభ్రమానందాలలో తలమునకలయ్యారు. వేదికపై గదాధర్ నిలబడే ఉన్నాడు; అశ్రువులు ధారలు కట్టి ఛాతీ మీదకు కారుతూనే ఉన్నాయి. అలా సమయం గడుస్తోందే కానీ గదాధర్ స్థితిలో మార్పు రాలేదు, అతను ఏమీ మాట్లాడనూ లేదు. చివరకు దర్శకుడు ఇతర గ్రామపెద్దలతో కలసి, గదాధరుని దగ్గరకు వెళ్ళి చూడగా అతడు బాహ్యస్మృతి కోల్పోయినట్లుగా వారు గమనించారు. మర్నాడు సూర్యోదయ మయ్యాక కానీ అతను మామూలు స్థితికి రాలేదు.

వైంకుతనాథ్ సన్యాల్ శ్రీరామకృష్ణునిలో శివుణ్ణి ఎలా గాంచాడో వివరించాడు :

*గురుదేవులు (వైకుంఠ్‌తో) :* "చూడు, భైరవీ బ్రాహ్మణి, వైష్ణవ చరణ్, గౌరీ పండితుడు, పద్మలోచనుడు నేను ఒక అవతారమని ప్రకటించారు. ఇప్పుడు గిరీష్, రామచంద్ర, మనోమోహన్ కూడా నన్ను అవతారమని అంటున్నారు; ఇవన్నీ విని విని నాకు విసుగు వేస్తోంది. సరే కానీ, నా గురించి నువ్వేమని అనుకుంటున్నావు?" అన్నారు.

*వైకుంఠ్ :* 'మీరు ఒక అవతారం' అని అన్నవాళ్ళు మిమ్మల్ని సరిగా అర్థం చేసుకోలేదు.

*గురుదేవులు (చిరునవ్వుతో) :* "ఏమంటున్నావు! వాళ్ళంతా నన్ను సరిగా అర్థం చేసుకోలేదా?

*వైకుంఠ :* నాకు తెలిసినంత వరకూ ఒక అవతారం భగవంతుని గుణాలను పాక్షికంగా ప్రదర్శిస్తుందే తప్ప పూర్తిగా వ్యక్తం చెయ్యదు.

*గురుదేవులు :* నువ్వన్నది నిజమే అయితే నా గురించి నీ అభిప్రాయం ఏమిటి?

*వైకుంఠ :* మీరు స్వయంగా పరమ శివుడే, ఆయన అంశ కాదు. ఎందుకంటే మీరు నన్ను శివుణ్ణి గురించి ధ్యానం చెయ్యమన్నారు. నేను ధ్యానానికి కూర్చున్నప్పుడు మీరు నాకు పరమశివునిగానే దర్శనమిస్తున్నారు. ✹



# ఆదిదేవుని ఆభరణాల అంతరార్థం

( ఫిబ్రవరి 23న మహా శివరాత్రి )

సజ్జన సంరక్షణార్థం పరమేశ్వరుడు బద్ధ కంకణుడై, దుర్జన సంహారార్థం సర్వదా సన్నద్ధుడై ఉంటాడు. శివదేవుడు భోళా శంకరుడే కాదు – భోలానాథుడు కూడా! అందుకే దుష్టుల దుశ్చేష్టలను ఆయన శీఘ్రంగా గ్రహిస్తాడు. ప్రపంచంలోని అమాయకులైన తన భక్తులను దుష్టుల నుండి కాపాడుతుంటాడు. నాస్తికులను సత్కరించడం కూడా ఆ దేవదేవునికి ఇష్టమైన పని కాదు – ఈ విషయాన్ని స్పష్టం చేయడానికే అతడు దక్ష యజ్ఞాన్ని ధ్వంసం చేశాడు.

**సర్పం:** శంకర భగవానుడు శరీరంపై సర్పాలను ధరిస్తుంటాడు. విషయాలకు సర్పం ప్రతీక. విష దంతాలను పీకివేశాక సర్పం ఏ హానీ చేయలేదు. అలాగే నిర్విష విషయాలు కూడా హానికరాలు కావు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలన్న ఈ వికారాలు పోయేవి కావు. వాటిని వశంలో ఉంచుకోగలిగితే అవి హాని చేయవు. వాటితో సునాయాసంగా ఆడుకోవచ్చు. సర్పం లాంటి స్వభావం ఉన్న వ్యక్తుల ద్వారా కూడా కార్యాలను సాధించుకోవచ్చు. విషస్వభావులని పేరుబడ్డ వ్యక్తులు కూడా మహాపురుషుల సన్నిధానంలో కార్యసాధకులై పడి ఉండడం మనం చూస్తుంటాం.

**త్రిశూలం:** మహాదేవుని హస్తంలో త్రిశూలం శోభిల్లుతూ ఉంటుంది. ఆయన చేతిలోని త్రిశూలం సజ్జనావళికి అభయ ప్రదానం చేస్తూ, దుర్జనులను భయకంపితులను చేస్తూ ఉంటుంది.

**డమరుకం:** పాణిని మహర్షికి వ్యాకరణ బీజమంత్రాలు డమరుక నాదం ద్వారానే లభించినట్లు మనీషులు చెబుతుంటారు. శంకర భగవానుడు డమరుకాన్ని పాణిని మహర్షి చెవి దగ్గర వాయించి ఈ జ్ఞానాన్ని అతనికి ప్రసాదించాడట. సృష్టిలో ఇలాంటి రహస్యాలెన్నిటినో భగవానుడు సృష్టి శోధకుల కర్ణరంధ్రాల దగ్గర డమరుక నాదం ద్వారా తెలియజేస్తుంటాడు. ప్రపంచంలోని అధికాధిక అనుసంధానాలు ఈశ్వరకృప ద్వారానే మానవ మాత్రులకు ప్రాప్తమయ్యాయి. పాణినిలో ఉన్న అచంచల ఆత్మ విశ్వాసం, భగవత్కృపా వైభవం లాంటి విషయాలు ఇతరులలో మనకు కనిపించవు.

**నీలకంఠుడు:** 'నీలకంఠుడు' అన్న నామం శంకరునికి ఉన్న నామాలలో ప్రసిద్ధమైనదే. శివుడు అంటే కల్యాణ కార్యేచ్ఛ గలవాడు. ఆయన నిరంతరం విషపానానికి, అంటే భయంకర ఘట్టాలను ఎదుర్కోవడానికి సంసిద్ధంగా, ధైర్యంగా ఉంటాడు. క్షీరసాగర మథనవేళలో ప్రాదుర్భవించిన రత్నాలను అందరూ తీసుకున్నారు. కానీ హాలాహలం పుట్టగానే అందరూ భయంతో పారిపోయారు. కేవలం శంకర భగవానుడు మాత్రమే దాన్ని పానం చేయగలిగాడు. ఆ తరువాత వచ్చిన అమృతాన్ని దేవతలు పానం చేశారు. అమృతాన్ని పానం చేసినవాడు దేవుడైతే, విషాన్ని పానం చేసిన వాడు మహాదేవుడయ్యాడు.

విషరూపాలైన దోషాలను మనలో ప్రవేశించనివ్వకుండా కంఠంలోనే అదిమిపెట్టి బంధించగలవాడు ధైర్యశాలి. పరుల దోషాలను మనలోకి రానీయరాదు. బాహ్యంలోకీ పోనీయరాదు. కనుకనే విషభాగాలకు కంఠమే సరైన స్థానం. విషపానం చేసి దాన్ని లోపలకు పోనీయకుండా, పైకి వ్యాపించనీయకుండా మహాదేవ భగవానుడు కంఠంలోనే బంధించి – నీలకంఠుడయ్యాడు.

జగత్ కళ్యాణం కోసం హాలాహలాన్ని పానం చేసిన ఆ మహాదేవునికి అనంతకోటి ప్రణామాలు అర్పిద్దాం. ✸

# ఓంకారమ్ విశిష్టత

- గౌతమ్



**"ఓం"** (ॐ) శబ్దం 'అ' కారం తో ప్రారంభమై 'మ' కారంతో అంతమవుతుంది. ఈ విశ్వంలోని శబ్దాలన్నీ వీటి మధ్యనే ఉంటాయి. అన్ని ధ్వనులూ ఓంకారంలో పుట్టి, దానిలోనే అంతమవుతాయి. అందుకే ఓంకారాన్ని శబ్ద బ్రహ్మమనీ, నాద బ్రహ్మమనీ, అనాహత శబ్దమనీ చెబుతున్నాయి వేదాలు. ఓంకారమే ప్రణవ మంత్రం, ఆదిమంత్రం. అన్ని బీజమంత్రాలకూ మూలం ఓంకారమే. అందుకే ఓంకారాన్ని 'మహా బీజమంత్రం' అంటారు.

ఓంకారం దేవతల జన్మస్థలం అనీ, అలాగే, ఓంకారం సగుణ, నిర్గుణ బ్రహ్మలను నిర్దేశిస్తుంది అనీ ఋగ్వేదం చెబుతోంది.

### ఉపనిషత్తుల ఉవాచ

"భగవత్ సాక్షాత్కారానికి దరిజేర్చే వాహనం లాంటిది ఓంకారం." – అమృతబిందూపనిషత్

"ఓంకారం పరబ్రహ్మ స్వరూపం. నాలుగు వేదాలూ ఓంకారానికి నాలుగు పాదాలు." – అధర్వశిరోపనిషత్

"ముముక్షువులు పరబ్రహ్మ స్వరూపమైన ఓంకారాన్ని ధ్యానించాలి." – ధ్యానబిందూపనిషత్

"ఓంకారం మోక్ష మంత్రం. దీని వల్ల జీవుడు సంసార సాగరాన్ని దాటగలడు. ఈ మంత్రాన్ని మనస్సులో కానీ, బిగ్గరగా కానీ ఉచ్చరించడం వల్ల ఆలోచనలు, కర్మలు ఓం కారమనే దివ్యసూత్రంలో గుచ్చబడి అది భగవదర్పితం అవుతుంది. జీవాత్మ – పరమాత్మలను అనుసంధానం చేసి, తద్వారా "అసి" అనే పదం ద్వారా ఆ రెండింటినీ ఏకం చేసేది ఓంకారం."

– హయగ్రీవోపనిషత్

"ఓంకారాన్ని జపించడం వల్ల మన అజ్ఞానం దహించబడుతుంది. తద్వారా మనిషి జనన మరణాల నుండి విముక్తుడై, సత్యసాక్షాత్కారాన్ని పొందుతాడు."

– కైవల్యోపనిషత్

### ఓంకార పర్వతం

ఎన్నో అద్భుతాలకు నిలయమైన హిమాలయాలలో ఓంకార పర్వతం ఒకటి. కైలాసనాథుడు ఎల్లప్పుడూ ఓంకార ధ్యానంలో నిమగ్నమై, బ్రహ్మానుభూతి పొందుతూ ఉంటాడు. పరమేశ్వరుడు తాను పొందే నిత్యానందం మానవులందరికీ లభించాలని తలచాడు. ఒకనాడు శివతాండవం ఆడేవేళ తన త్రిశూలంతో ఒక పర్వతం మీద ఓంకారాన్ని చెక్కాడు. శంకరుడు ఓంకారం చెక్కిన పర్వతమే 'ఓంకార పర్వతం'.

భారత సరిహద్దుల్లో నవీధాంగ్ అనే ప్రాంతం ఉంది. కాలా పానీ– లిపూ లేక్ కనుమల మధ్యన భారత – టిబెట్ సరిహద్దులో ఓ చిన్న లోయలోని ప్రాంతమే నవీధాంగ్. ఇది సముద్రమట్టానికి దాదాపు 14వేల అడుగుల (సుమారు 4,200 మీటర్ల) ఎత్తున ఉంది. నవీధాంగ్ మజిలీకి తూర్పు దిక్కున చూస్తే, ఓ అద్భుతం కనిపిస్తుంది. తూర్పు దిక్కున ఉన్న హిమ శిఖరాలపై మంచుతోనే ॐ (ఓం) అనే చిహ్నం చెక్కినట్లుగా కనిపిస్తుంది. ఎవరి ప్రమేయమూ లేకుండా, ప్రకృతి సిద్ధంగా ఏర్పడిన చిహ్నమది. నిరంతరం పేరుకొనే మంచు సరిగ్గా ఆ ॐ అన్న చిహ్నం రూపంలోనే కుదురుకొనే విధంగా అక్కడి పర్వత ఆకారం ఉంటుంది. నవీధాంగ్ మజిలీకి కుడివైపున ఉన్న లోయ గుండా ప్రయాణిస్తే, ఈ 'ఓం పర్వతాని'కి చేరుకోవచ్చు. కైలాస పర్వత దర్శనానికి వెళ్ళేవారు మాత్రం నవీధాంగ్‌కు ఎడమవైపు లోయలో నుంచి పయనం సాగించాలి. ఆ లోయ 'లిపూ లేక్' కనుమకు దారి తీస్తుంది. సముద్ర మట్టానికి 5,070 మీటర్ల ఎత్తున ఉండే లిపూ లేక్ కనుమకు నవీధాంగ్ నుంచి 7 కిలోమీటర్లే దూరం. కానీ, అది చాలా శ్రమతో కూడుకున్న నడక. ✸

# దేవీ వైభవం

ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

**(...గత సంచిక తరువాయి)**

ప్రపంచంలోని శబ్ద స్పర్శ రూప రస గంధాలన్నిటికీ మనస్సు కలిస్తేనే అనుభూతి వస్తుంది. అనుభూతులన్నీ అనుకూలం, ప్రతికూలం అని రెండు రకాలుగా ఉంటాయి. వాటినే సుఖం, దుఃఖం అంటాం. ఈ రెండింటిలో మనకు అనుకూలించిన దాని మీద ఇష్టం ఏర్పడుతుంది; ప్రతికూలించిన దాని మీద ద్వేషం ఏర్పడుతుంది. వీటినే రాగం, ద్వేషం అంటారు. రాగం పాశంలా బంధిస్తే, ద్వేషం అంకుశంలా పొడుస్తుంది. బయటి ప్రపంచంలో ఉన్న విషయాలకు మనస్సు కలిస్తే రాగ ద్వేషాలు కలుగుతాయి. ఇదే మన బ్రతుకంతా! ఈ నాలుగూ తప్ప వేరే బ్రతుకేదీ లేదు.

''నేను'' అనే అహంకారం ఈ నాలుగిటితోనే ముడిపడింది. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలను గ్రహించేది శరీరం, ఈ శరీరం ద్వారా వాటిని గ్రహించేది మనస్సు. ఈ రెండిటితో 'నాది' అనే అనుభూతి ఏది ఉందో అది రాగద్వేషాత్మకం. నా మిత్రుడు అన్నది రాగం అయితే, నా శత్రువు అనేది ద్వేషం. ఈ రెండూ నా (నాది) అనే దానితో ముడిపడి ఉన్నాయి. శరీరం, మనస్సు 'నేను' అనే దానితో ముడిపడి ఉన్నాయి.

ఈ "నేను" అనేది ఎవరి వల్ల నడుస్తోంది? మనస్సు, శరీరం, రాగద్వేషాలు – ఇవన్నీ దేని వల్ల ఉన్నాయి? "నేను" అనే చైతన్యం ఉంటేనే కదా ఉన్నాయి! ఈ చైతన్యం వల్లనే ఇవన్నీ నిర్వహించబడుతున్నాయి అని తెలిశాక, "అమ్మా! ఇవన్నీ నీ చేతిలోవి. కానీ, ఇవన్నీ నా చేతిలోవని నేను అహంకరించుకుంటున్నాను. ఇవన్నీ నీ చేతిలోవే అనే దర్శనం నాకివ్వు! నా చేతిలోవనే అహంకారాన్ని తొలగించు'' అనుకోవాలి. అదే అమ్మ రూపం చూడడంలో ఉన్న అంతరార్థం. ఈ నాలుగూ అమ్మ చేతిలోనే ఉంటే, అప్పుడు నేను అనే అహంకారం ఏమైంది? ఆ 'నేను' అనే అహంకారానికి అసలు చోటేదో తెలిసింది 'అమ్మా' అని అప్పుడు గ్రహించి **"అహమిత్యేవ విభావయే భవానీం"** అని వెళ్ళిపోయాం. ఎప్పుడైతే మనస్సు, పంచ తన్మాత్రలు, రాగద్వేషాలు అమ్మకు ఇచ్చేశామో అమ్మ వాటిని పట్టుకుంది. ఎందుకంటే "ఇవి



నేను అని అహంకారం నిర్వహిస్తున్నంత కాలం నేను పతనమై పోతాను, వీటిని నువ్వు నిర్వహించు" అని అమ్మకు ఇవ్వాలి. ఈ శరీరం తిరుగుతున్నంత కాలం ఈ నాలుగూ తప్పవు. ప్రతీ వాడికీ నాలుగూ ఉండాలి... మనస్సు ఉండాలి, తన్మాత్రలు ఉండాలి, రాగ ద్వేషాలు ఉండాలి. కానీ మనస్సనేది అమ్మ శబ్దాన్నీ, అమ్మ రూపాన్నీ, అమ్మ తత్త్వాన్నీ గ్రహించాలి. అలాగే రాగ ద్వేషాలు అంటే అమ్మ పట్ల రాగములు, అమ్మకి ఇతరములైన విషయాలంటే ద్వేషం ఉండాలి. ఉత్తములకు సత్పురుషుల పట్ల అనురాగం ఉంటుంది; ధర్మ విరుద్ధాలైన వాటి పట్ల ద్వేషం ఉంటుంది. రెండూ ఉండాలి, ఇవన్నీ చైతన్యం యొక్క లక్షణాలే. అమ్మ మాత్రం అధర్మపరులపై కోపం చూపించలేదా? భగవంతుడు కూడా ధర్మాన్ని రక్షిస్తున్నాడు; అధర్మాన్ని శిక్షిస్తున్నాడు; చైతన్యాన్ని చూపిస్తున్నాడు. అందువల్ల ఇవి అమ్మవారికి ఇచ్చేసి అమ్మ ముందు కూర్చుంటే అమ్మే అంతా చూసుకుంటుంది. ఎందుకంటే ఆమె పరిపూర్ణ జ్ఞాన స్వరూపిణి. అందుకే మన చైతన్యాన్ని ఆవిడే నిర్వహించుకుంటుంది. అందుకు ఈ

నాలుగింటితో కూడుకున్న మన జీవితపు చైతన్యమంతా అమ్మ చేతికి అర్పించడమే – అమ్మ ఈ నాలుగు (మనసనే చెరకు విల్లు, పంచతన్మాత్రలనే పువ్వుల బాణాలు, అనురాగమనే పాశం, క్రోధమనే అంకుశం) పట్టుకోవడంలోని ఒక అంతరార్థం. ఇది పరిశీలిస్తే మన శరీరంలో ఉన్న మనస్సు, పంచ తన్మాత్రకమైన ఇంద్రియాలు, మనం పొందే రాగద్వేషాలు ఏ చైతన్యాన్ని ఆధారం చేసుకున్నాయో ఆ చైతన్యమే అమ్మ అనే స్వరూపం ఇక్కడే దర్శనమిచ్చి **"స్వాత్మైవ దేవతా ప్రోక్తా లలితా విశ్వవిగ్రహా"** అని అర్థం అవుతుంది. ఈ నాలుగే మనలో ఉన్నాయి. ఈ నాలుగే బయటి ప్రపంచంలో ఉన్నాయి. అందుకు అనంత విశ్వంలోనూ మనలోనూ కూడా ఈ చైతన్య నిర్వహణ చేసే ఆత్మతత్త్వం ఒక్కటే అనేది ఎరుక కలుగుతుంది. అమ్మ రూపంలో ఎంత తత్త్వముందో!

అమ్మ వారి వర్ణం – 'అరుణాం'. అంటే, ఎర్రని రంగు. దేవతల ఒక్కొక్క రంగుకు ఒక్కొక్క అంతరార్థం ఉంది. కాళీ అంటే నల్లగా ఉంటుంది. అందులో అంతరార్థం ఏమిటంటే ఏవి అందులోకి వెళ్ళినా కనపడవు. ఆ నలుపులోకి అన్నీ వెళ్ళిపోతున్నాయి. అంటే అన్నిటినీ కబళిస్తున్న అనంత కాలం ఆ కాళీ స్వరూపం. అదే నల్లదనంలో ఉన్న వర్ణం.

> **ఓ భవానీదేవీ! నీ మూడు కన్నులు కాటుకపెట్టబడుటచే ఎరుపు, తెలుపు, నలుపు రంగులు వేరుగ కనపడుచున్నవి. అవి మహాప్రళయంలో పరమాత్మ యందు లీనమైన బ్రహ్మ, విష్ణు, రుద్రులను నీవు శివునితో మరల సృజించుటకొరకు ధరింపబడిన రజస్సత్త్వతమోగుణములా అనునట్లు ప్రకాశించుచున్నవి.**
>
> **– సౌందర్యలహరి**

అలాగే ఎర్రదనంలో ఉన్న వర్ణం – అన్నిటికీ ఆదిని నేను అని చెప్పడం. ఆది వర్ణం, అరుణ వర్ణం అన్నారు శాస్త్రాలలో ఎలా అంటే – వర్ణానాం ఆద్యం లోహితం – ప్రాతః కాలంలో మొదట సూర్య భగవానుడి నుండి ఎర్రని వెలుగే వస్తుంది. దాని తరువాత క్రమంగా అన్ని వెలుగులూ వస్తాయి. ఆదివర్ణం, అరుణ వర్ణం అనేది ఇక్కడే మనకు కనపడుతుంది. అరుణ వర్ణం కారుణ్యానికి సంకేతం, అమ్మ కారుణ్యం వల్లే ఈ జగత్తంతా సృష్టి జరిగి, ఉద్ధరణకు గురై, లయం జరుగుతోంది. జగత్తు యొక్క సృష్టి స్థితి లయలన్నిటికీ కూడా అమ్మే కారణం. కనుక అరుణ వర్ణం కరుణకీ, ఆది తత్త్వానికీ అర్థం. ఆదిశక్తి కనుక ఆ తల్లి అరుణ వర్ణ స్వరూపంతో ఉంది. మన దేవతల రంగుల్లో కూడా ఇన్ని తత్త్వాలున్నాయి. భగవంతుడు ధరించిన ప్రతి రంగులో, ప్రతి రూపంలో ఇన్ని అంతరార్థాలుంటాయి. మనకు కనపడే అమ్మ స్వరూపంలో ఎంత అందం కనపడిందో! "నాలో మనస్సును నిగ్రహించి, ఈ పంచతన్మాత్రలను నిగ్రహించి, రాగ ద్వేషాలను నిగ్రహించేటటువంటి తల్లీ" అని మనం ఆశ్రయిస్తే క్రమ క్రమంగా ఇవన్నీ ఉపసంహరణకు గురై, "భవాని" మాత్రమే మనకు గోచరమవుతుంది. ఎంత తత్త్వం ఆ రూపంలో ఉందో!

అమ్మ వారి వైభవం నాలుగు రకాలని చెప్పుకున్నాం. ఇప్పుడు సౌందర్యం నాలుగు రకాలు. రూపంలో నాలుగు రకాలు. ఒకటి స్థూల సౌందర్యం – అది మనం చూసే స్వరూపం. ఆ స్వరూపం తలచుకుంటే చాలు, ఆనందం లభిస్తుంది. అందుకే ధ్యానం చేస్తాం. ఎర్రని కాంతులతో, విశాలమైన నేత్రాలతో, మందహాస వదనంతో, నాలుగు చేతులతో నాలుగు ఆయుధాలూ ధరించి ఆసనంపై కూర్చుని గోచరిస్తున్న కామాక్షీ స్వరూపం 'స్థూల సౌందర్యం'. దీని వెనుక సూక్ష్మ సౌందర్యం ఉంటుంది. 'సూక్ష్మ సౌందర్యం' తరువాత 'సూక్ష్మతర సౌందర్యం', ఆ తరువాత 'సూక్ష్మతమ సౌందర్యం' అని మొత్తం నాలుగు రకాలు. ఈ స్థూల సౌందర్య వర్ణనలో అమ్మ వారి రూపాన్ని ధ్యానిస్తే మరొక అంతరార్థం కనిపిస్తుంది. శంకర భగవత్పాదుల వారు సౌందర్య లహరిలో అమ్మ వారి శిరస్సు మొదలు కుని పాదం వరకూ వర్ణించారు.

ధ్యానించే ముందు అమ్మ వారి స్వరూపం ఎలా వచ్చిందో తెలుసు కోవాలి. భండాసురుడు ఈ ప్రపంచాన్ని క్షోభ పెడుతుంటే దేవతలందరూ వెళ్ళి పరమశివుణ్ణి ఆశ్రయించారట. పరమశివుడు తన దృగగ్ని నుంచి ఒక అగ్నిహోత్రాన్ని రగిల్చి మీరు మీ మీ శక్తులన్నిటినీ ఇందులో ఆహుతి వెయ్యండి అన్నారు. వెంటనే దేవతలు తమను తాము అందులో వేశారట. అలా వేసేస్తే అప్పుడు అందులో నుంచి పుట్టిందట అమ్మ వారు. అంటే దేవతలు తమ అహంకారాన్ని ఈశ్వరార్పణం చేశారు; సర్వవ్యాపిణి అయిన ఆ శక్తి అందులో నుంచి వచ్చిందట. దేవతలందరి శక్తులూ ఆ తల్లిలో ఉన్నాయట. అంటే దేవతలందరూ ఇచ్చిన శరీరంతో అమ్మ వచ్చింది అని కాదు, ఆ అమ్మ ఇచ్చిన శక్తితో దేవతలందరూ బ్రతుకుతున్నారు. అది ఎప్పుడైతే తెలుసుకున్నారో అప్పుడు అమ్మ ఏకంగా కనపడింది. విడివిడిగా చూస్తే తెలియదు, ఏకంగా చూస్తే కనపడింది. అది ఎందులో నుంచి అంటే చిదగ్నికుండం... జ్ఞానాగ్ని కుండం. మనలో జ్ఞానాగ్ని రగిలితే అందులో మన అహంకారం ఆహుతి అయితే అప్పుడు అమ్మ కనిపిస్తుంది. ✹

**(సశేషం)**

# పరిప్రశ్న

**- స్వామి సుకృతానంద**

ఎస్.ఆర్. స్వామి, గిద్దలూరు.

**? : ప్రాతః స్మరణీయులైన చిరంజీవులు ఎంతమంది? వారి పేర్లు తెలపండి?**

✍: చిరంజీవులు ఏడుగురు అని చెబుతారు. ఆ సప్త చిరంజీవులు... 1. అశ్వత్థామ 2. బలి 3. వ్యాసుడు 4. ఆంజనేయస్వామి 5. విభీషణుడు 6. కృపాచార్యుడు 7. పరశురాముడు. మార్కండేయుడు కూడా చిరంజీవియే!

సిహెచ్. వేంకటేశ్వర్లు, నంద్యాల.

**? : ప్రచోదయాత్, ధ్యాయేత్, ఉపాస్మయే, ప్రీత్యర్థే జపే, ఈ పదాలు మంత్రంలో భాగమా లేక వీటికి విశేషార్థాలు ఉన్నాయా?**

✍: "ప్రచోదయాత్" గాయత్రీ మంత్రంలో ఒక భాగం... ధియోయోనః ప్రచోదయాత్ = పరమాత్మ నా బుద్ధిని ప్రేరేపించు గాక, ఆత్మజ్ఞానాన్ని ఇవ్వు గాక అని వేడుకొంటున్నాడు సాధకుడు.



ఇష్టదేవతా ధ్యానం చేసే ముందు ధ్యాయేత్ = ధ్యానం చేస్తాను. ఉపాస్మయే= ఉపాసిస్తాను. ప్రీత్యర్థే జపే= దేవత ప్రీతి కోసం చేసే జపం. మనం ఇష్ట దేవత జపం చేసే ముందు, జపం చేస్తానని సంకల్పం చేసేటప్పుడు ఈ పదాలను ఉపయోగిస్తాం.

సిహెచ్. జనార్దన్‌దాస్, శ్రీకాకుళం.

**? : వేదమంత్రాలను ఓంకార సహితంగానూ, దేవీ దేవతల ప్రార్థనా శ్లోకాలను ప్రణవం లేకుండానూ చదవాలని అనుకుంటున్నాను. అది సరైనదేనా?**

✍: 'ఓంకారం' శబ్దబ్రహ్మకు ప్రతీక. పరబ్రహ్మ వాక్కు మనస్సుకు గోచరం కాదు. ఆ అద్వితీయ బ్రహ్మ ఓంకారం శబ్దం ద్వారా తెలియబడుతుంది. ఓం తత్ సత్ ఇతి బ్రహ్మణ స్త్రివిధః స్మృతః ఓం తత్ సత్ – ఓం కారం, తత్= అది, సత్= సత్యమైనది. ఈ మూడు పదాల ద్వారా బ్రహ్మ నిర్దేశింపబడుతుంది. ఓంకారం శుభసూచకం కనుక ప్రార్థనా శ్లోకాలకు ముందు దాన్ని చేర్చవచ్చు. సర్వమానవులూ శుభాన్ని కోరుకుంటారు. దుఃఖాన్ని ఎవరూ ఆహ్వానించరు.

ఎన్. శ్రీనివాసరావు, హైదరాబాదు.

**?: జపము చేస్తున్న సమయంలో మనసు పరిపరి విధాల పోతుంది. అలా నిలకడలేని మనసుతో చేసే జపం ఫలిస్తుందా?**

✍: సముద్రంలో అలలు ఉన్నాయి కాబట్టి అవి తగ్గినపుడు స్నానం చేయాలనుకుంటే మనం ఎన్నటికీ స్నానం చేయలేం. అలలు ఉన్నా స్నానం చేయడానికి ప్రయత్నించాలి. అలాగే మనసు నిలకడగా ఉండడం లేదని జపం చేయకపోతే భగవంతుణ్ణి పొందలేం.

మనం తెలిసి నీళ్ళలోకి దూకినా, తెలియక నీళ్ళలో తోయబడినా బట్టలు తడుస్తాయి. అలాగే మనసు పూర్తిగా భగవంతుని యందు నిమగ్నమైనా, కాకపోయినా జపం చేయడం వల్ల ఫలితం ఉంటుంది. ఓర్పుతో కొన్నాళ్ళు ప్రయత్నిస్తే మనసు పవిత్రమవుతుంది. పవిత్రమైన మనసు భగవంతుని యందు లగ్నమవుతుంది.

"స్వల్ప మప్యస్య ధర్మస్యత్రాయతే మహతో భయాత్" – ధర్మకార్యం ఎంత చిన్నదైనప్పటికీ వదలకుండా ప్రయత్నిస్తే అనంత ఫలాన్నిస్తుంది. ఒకసారి శ్రీకృష్ణపరమాత్మ నారదునికి ఒక గిన్నెలో నూనె నింపి, నూనె ఒలకకుండా కొండ చుట్టూ తిరగిరమ్మన్నాడు. తిరిగి వచ్చిన నారదుణ్ణి శ్రీకృష్ణుడు 'కొండ చుట్టూ తిరిగే సమయములో నన్ను ఎన్నిసార్లు స్మరించావు'అని అడిగాడు. 'నూనె ఒక్క చుక్క కూడా క్రింద పడకుండా నడుస్తున్నప్పుడు నా మనసంతా నూనె గిన్నె మీదే ఉంది. ఇంక నీ స్మరణ ఎలా చేయగలను' అని నారదుడు బదులిచ్చాడు. 'ఇంత చిన్న పనిలోనే నీవు నన్ను గుర్తుపెట్టుకోలేకపోయావు. నా గృహస్థ భక్తుడు చూడు, అతడు ఎన్నో సంసార బాధ్యతల్ని నిర్వర్తిస్తూ కూడా నన్ను స్మరిస్తున్నాడు' అని అన్నాడు భగవానుడు. సంసారంలో ఎన్ని పనుల మధ్య ఉన్నా భగవంతుణ్ణి స్మరిస్తే తప్పక ఆయన అనుగ్రహం ఉంటుంది. ✸

**ధీరవాణి**

– స్వామి వివేకానంద



# ఆ మహోన్నత మూర్తికి జోహార్లు!

పాశ్చాత్య దేశాల్లో స్త్రీని ఎక్కువగా సమ్మానిస్తారు. కానీ ఆ గౌరవం ఆమె సౌందర్యానికి మాత్రమే! శ్రీరామకృష్ణులు ప్రతి స్త్రీలోనూ ఆనందమయి అయిన జగన్మాతను దర్శించారు. ఆయన సమాజ బహిష్కృతులైన స్త్రీల వద్ద మోకరిల్లి, కంట నీరు పెట్టి, "తల్లీ! నువ్వీ రూపంలో వాకిలి ముందు నిలబడి ఉన్నావు. మరో రూపంలో నువ్వే ఈ విశ్వమంతటా వ్యాపించి ఉన్నావు. నీకు నమోవాకాలు" అంటుంటే నేను ప్రత్యక్షంగా విన్నాను. ఎవరి జీవితం నుండి కామప్రవృత్తి తొలగిపోయిందో, ఎవరు స్త్రీలను కేవలం భక్తిప్రపత్తులతోనే చూస్తున్నారో, ఎవరు స్త్రీ ముఖారవిందాలను జగత్త్రాణకర్త్రి అయిన జగదంబ రూపంగా గాంచుతున్నారో, అలాంటి వారి జీవితం ఎంత ధన్యమో కదా!

జగన్మాతే నియంత్రి అనీ, తాను కేవలం నిమిత్త మాత్రుణ్ణనీ శ్రీరామకృష్ణులు భావించారు. "నా నోటి నుంచి మంచి మాట ఏదైనా వెలువడితే జగన్మాతే పలికిస్తోంది" అనే అభిప్రాయాన్ని ఆమరణ పర్యంతం ఆయన కలిగి ఉన్నారు. 'పద్మం వికసిస్తే తేనెటీగలు తేనె గ్రోలడానికి పిలుపు లేకున్నా వస్తాయి. అలాగే నీ శీలమనే పద్మం సంపూర్ణ వికాసం పొందితే సర్వం సిద్ధిస్తుంది' అని అనేవారు శ్రీరామకృష్ణులు.

వేలమంది జనం శ్రీరామకృష్ణులను దర్శించి వచనామృతాన్ని గ్రోలడానికి రాసాగారు. ఆయన సామాన్యమైన గ్రామ్యభాషలో సంభాషించేవారు. కానీ ప్రతి మాటా శక్తిజనితమై, జ్ఞానదీపికగా వెలువడేది. పదాలు, భాష బాహ్యాడంబరాలు మాత్రమే; వక్త వ్యక్తిత్వమే పలుకుల్లో పొదగబడి హృదయాన్ని స్పృశిస్తుంది. ఈ విషయం ఒక్కొక్కప్పుడు మనకు అవగాహన అవుతుంది. మనం అత్యంత అద్భుతమైన ప్రసంగాలను విని ఇంటికి వెళ్ళగానే మరిచిపోతాం.

నాస్తికులు, అజ్ఞేయవాదులు అయిన పట్టభద్రులే అధికంగా శ్రీరామకృష్ణుల వచనామృతాన్ని వినడానికి వెళ్ళేవారు. నాకు కూడా గురుదేవులు ఓ సామాన్య వ్యక్తిగానే కనిపించారు. ఆయన భాషలో కూడా ప్రత్యేకత ఏదీ లేదు. 'ఇలాంటి వ్యక్తి గురూత్తముడా?' అని నేను అనుకొన్నాను. నేను అందరినీ అడిగినట్లే "మీరు భగవంతుణ్ణి చూశారా?" అని శ్రీరామకృష్ణుల్ని కూడా అడిగాను. "నేను నిన్ను చూస్తున్నంత స్పష్టంగా భగవంతుణ్ణి చూశాను" అని జవాబిచ్చారు వారు. ఈ సమాధానం విని నేను సమ్మోహితుణ్ణి అయ్యాను. ఎందుకంటే మొదటిసారిగా భగవంతుణ్ణి చూశాననీ, అది అనుభవైకవేద్యమనీ – మన లౌకికానుభూతి కన్నా ఈ అనుభూతి సుప్రగాఢమనీ చెప్పే మహనీయుణ్ణి నేను అప్పుడే చూశాను.

నేను నా గురుదేవుడి నుండి తెలుసుకొన్న ముఖ్య సిద్ధాంతం: "ప్రపంచంలోని మతాలు పరస్పర విరుద్ధాలు కావు. అవి సనాతనమైన ఒకే ధర్మసిద్ధాంత వివిధ రూపాలు; దేశకాలపాత్రలను అనుసరించి, భావభూమికలను అనుసరించి, ఆ సనాతన ధర్మమే పాత్రోచితంగా సమన్వితం ఒనర్చబడుతోంది". ఇదే ఆయన బోధనలలోకెల్లా అతి ముఖ్యమైన బోధ, ఆయన ఆవిష్కరించిన మహోన్నత సత్యం. ✸



# గురుమహరాజ్ సేవలో అద్భుతానందం

"సేవ చేయడం చాలా కష్టమైన పని. సేవకుడు ఎన్ని కఠినమైన పదాలూ, చీవాట్లూ, దండనలూ ఎదుర్కోవాలనీ? గురుమహరాజ్ మమ్మల్ని కూడా ఎన్నడూ విడిచిపెట్టలేదు. ఆయన తిట్లకు బాధపడినట్లయితే మేము వారి సేవ చేయగలిగి ఉండేవాళ్ళం కాదు. ఆయన అనుగ్రహం పొందేవాళ్ళం కాదు" అని అనేవారు స్వామి అద్భుతానంద (లాటూ) మహరాజ్.

లాటూ మహరాజ్ గురుమహరాజ్‌కి సేవ చేసినప్పుడు జరిగిన కొన్ని సంఘటనల్ని ఇలా వివరించారు:

శ్రీరామకృష్ణులు ఏ లోహాన్నీ తాకలేకపోయేవారు. వారు అలాంటి స్థితిలో ఉన్నప్పుడు, గురుదేవులకు అవసరమైనప్పుడు నీళ్ళున్న లోహపుపాత్రను నేను పట్టుకొని, గురుమహరాజ్‌తో పాటు వెళ్ళేవాణ్ణి. ఒక రాత్రి గురుమహరాజ్ ఎవరికీ ఏమీ చెప్పకుండా బయటకు వెళ్ళారు. నేను జపం చేస్తున్నానే కానీ ఏకాగ్రత కుదరలేదు. అప్పుడు గురుమహరాజ్ గదికి వెళ్ళాను. వారు అక్కడ లేకపోయేసరికి నాకు ఆతురత అధికమైంది. అప్పుడు నేను గట్టిగా "మీరెక్కడ ఉన్నారు?" అని అరిచాను. అప్పుడు నాకు వారు బహిర్భూమికి వెళ్ళారేమో అని అనుమానం వచ్చి, వెంటనే చెంబుతో నీళ్ళు పట్టుకొని ఉత్తరం వైపుగా ఉన్న అడవిలోకి వెళ్ళాను. తిరిగి వస్తున్నప్పుడు వారేమన్నారో తెలుసా? ''నువ్వు ఎవరికైనా సేవ చేయదలచుకుంటే వాళ్ళ అవసరాలు, ఇష్టాలు ఏమిటి అన్నది గ్రహించగలగాలి. అలా చేస్తేనే నువ్వు లబ్ధి పొందుతావు" అన్నారు. ఆ రాత్రి వారు హరీశ్‌తో "బాబూ! నువ్వు ధ్యానం చేస్తున్నావు. అయితే నువ్వు ఎవర్ని ధ్యానిస్తున్నావో వారికి ఒక చెంబుడు నీళ్ళయినా దొరకలేదు. అలాంటి ధ్యానం వల్ల నువ్వు ఎలాంటి లబ్ధి పొందగలవు?" అన్నారు.

గురుమహరాజ్ అనారోగ్యం వల్ల నడవలేని స్థితిలో ఉండగా ఒకసారి ఆయన నాతో తాను మలవిసర్జనం చేసే తొట్టిని శుభ్రం చేయమని చెప్పారు. అప్పుడు అమితానందంతో 'గురుదేవా! నేను మీ సేవకుణ్ణి. మీరు ఏది ఆజ్ఞాపిస్తే అది చేస్తాను' అని చెప్పాను. గురుదేవుల సేవయే ఆధ్యాత్మిక సాధనగా భావించాను. ఆయనకు సేవ చేయడం ద్వారా ఎన్నో ఆధ్యాత్మిక అనుభూతులను పొందాను.

ఒకసారి గురుదేవులు నన్ను తన తల మర్దన చేయమన్నారు. నేను ఆయన తల మర్దన చేస్తున్నప్పుడు నా శరీరం నిశ్చలమైపోయింది. మనసు భావాతీత లోకాలకు వెళ్ళిపోయింది.

సేవ అంటే భౌతికంగా శుశ్రూషలు చేయడం ఒక్కటే సేవ కాదనీ, తాను అడిగిన దానిని అర్పించడం కూడా సేవయే అనీ అంటూ గురుదేవులు భక్తమాల నుంచి నాకు ఒక కథ చెప్పారు. ఒక రోజు గౌరాంగ మహాప్రభు చిత్రపటం కావాలని నాతో చెప్పారు. మరుసటి రోజే నేను, కలకత్తా వెళ్ళి రాంబాబు ఇంటి నుంచి గౌరాంగుని చిత్రపటాన్ని తెచ్చి, వారి గది గోడకు తగిలించాను. గురుమహరాజ్ దాన్ని చూడగానే చాలా ఆనందించారు.

లాటూ మహరాజ్ శ్రీరామకృష్ణుల పట్ల పరిపూర్ణ వినయ విధేయతలతో భక్తి శ్రద్ధలతో సేవ చేశారు. గురుదేవుల సేవలో అద్భుతానందాన్ని పొందారు. ✹

(ఫిబ్రవరి 09న శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన **స్వామి అద్భుతానంద జయంతి**)

**ఒకరోజు శిష్యుడు తన పాదాలను ఒత్తుతుండగా శ్రీరామకృష్ణులు ఆ శిష్యునితో తన దేహాన్ని ఉద్దేశించి "నీవు దీనికి చేస్తున్న శుశ్రూష వల్ల దీన్లో (నాలో) ఉన్న దివ్యత్వం నీలో అవిద్య (అజ్ఞానాన్ని)ను పూర్తిగా నశింపజేస్తుంది" అన్నారు.** ✹



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -20

(...గత సంచిక తరువాయి)

## మార్గదర్శకుడైన బందిపోటు!

**క**ఠియావాడ్‌లో జరిగిన సంఘటన ఇది. శీతకాలం చాలా చలిగా ఉంది. ఆ సంవత్సరం శీతల పవనాలు బలంగా వీస్తున్నాయి. స్వామి జపానంద బావరా ప్రావిన్స్ దగ్గరలో ఉన్న చిన్న గ్రామం పొలిమేరల్లో ఉన్నారు. అక్కడ ఎవరినో సోమనాథ్ వెళ్ళడానికి దగ్గర తోవ అడిగితే అడవిలో నుంచి వెళ్ళే మార్గం చూపించారు.

చలికాలంలో తొందరగా పొద్దుపోతుంది. చూస్తుండగానే చీకటి పడిపోయింది. వెన్నెల రాత్రి, దట్టమైన అటవీ ప్రాంతం. మానవమాత్రుడెవరూ కనిపించలేదు. దరిదాపుల్లో ఊరు ఏదీ ఉన్నట్లు లేదు. తోవ తప్పిపోయానేమో అని మనస్సులో బెంగగా ఉన్నా ముందుకు సాగిపోతున్నారు. దాహం వేస్తున్నది. ఎక్కడా మంచి నీళ్ళు దొరకలేదు. ఎక్కడైనా మంచినీళ్ళు దొరికితే అక్కడే రాత్రి గడపవచ్చు అని మనస్సులో అనుకుంటున్నారు.

'దగ్గర అగ్గిపెట్టె ఉంది, ఎండుటాకులు, పుల్లలు ఏరి పోగుచేసి మంట పెట్టుకుంటే చలి వేయదు. అడవి మృగాలేవీ దగ్గరకి రావు'... ఇలా ఆలోచిస్తూ ఉండగా ఎవరో అటు వైపు వస్తున్నారనిపించింది. ఆరడుగుల బలిష్ఠుడు తలపాగా చుట్టుకొని, చేతిలో తుపాకీ పట్టుకొని ఎదురుగా వస్తున్నాడు. దూరం నుంచి స్వామిని చూసి, 'ఎవరక్కడ' అని గట్టిగా అరిచాడు. స్వామి జపానంద భయపడకుండా, 'నువ్వెవరు' అని అడిగారు.

దగ్గరగా వస్తున్న ఆ వ్యక్తి, చేతి కర్ర తప్ప మరే ఆయుధమూ లేని స్వామిని చూసి తుపాకీ కిందకు దించాడు. అప్పుడు సన్న్యాసి, "అయ్యా! బాగా దాహంగా ఉంది. మంచి నీళ్ళు కావాలి. రాత్రి గడపడానికి అనువైన స్థలం కావాలి. దగ్గరలో ఏదైనా ఊరు ఉందా?" అని అడిగారు. "సుమారు ఒక మైలు దూరంలో ఒక అగ్రహారం ఉంది. ఈ దారినే వెళితే మీరు అక్కడికి చేరుకుంటారు" అని బందిపోటు చెప్పాడు.

"అయ్యా! నేను ఈ ప్రదేశానికి కొత్త వాణ్ణి. దోవలు తెలియవు. మళ్ళీ ఇటూ అటూ నడిచానంటే చాలా ఇబ్బంది పడిపోతాను. దయచేసి మీరు నాతో అక్కడికి వస్తే మీ మేలు మరచిపోను" అన్నారు స్వామి. అతను ఒక్కక్షణం ఆలోచించి, "సరే, పదండి" అని సన్న్యాసిని ముందు నడవమని, తుపాకీ పట్టుకుని వెనక కదిలాడు. కొంత దూరం నుంచే అగ్రహారాన్ని చూపించి సన్న్యాసిని వెళ్ళమని చెప్పాడు.

సన్న్యాసి "బాబూ! నేను కొత్తవాడిని కదా! ఇంత రాత్రి వేళ అతిథిగృహం ఎక్కడ ఉందో ఎలా వెతుకుతాను. రాత్రి నాకెవరు చెబుతారు? అందరూ నిద్రపోతున్నారు కదా!" అన్నారు.

దానికి ఆ బందిపోటు "నేను ఊళ్ళోకి రాను! మీరు ఈ దోవలో తిన్నగా వెళ్ళండి అక్కడ పొలాల్లో బాబరా దర్బార్ నుంచి పంట కోసం వచ్చిన మనుష్యులు ఉన్నారు. వారిలో మామాజీ అనే వ్యక్తి ఉంటాడు. అతను మీకు సహాయపడతాడు" అని చెప్పి, తిరిగి అడవిలోకి వెళ్ళిపోయాడు.



సన్న్యాసి అతను చెప్పిన దోవలోనే వెళ్ళి పొలం దగ్గరకు చేరుకున్నారు. అక్కడ కొంతమంది మనుష్యులు చలిమంట వేసుకుని చుట్టూ కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. వాళ్ళు స్వామిని చూసి మామాజీకి "ఎవరో సన్న్యాసి వచ్చారు"అని చెప్పారు. సన్న్యాసి గురించి వివరాలన్నీ అడిగి తెలుసుకుని మామాజీ లోపలికి పిలిచారు. సాదరంగా స్వామిని కూర్చోబెట్టి, "ఈ స్థలం మీకెవరు చూపించారు" అడిగారు. ఆయన చెప్పిన వివరాలు విని అందరూ తుపాకులు తీసి నాలుగు వైపులా గురిపెట్టి పేల్చడం ప్రారంభించారు. "ఏమిటీ హడావిడి! అసలు సంగతి ఏమిటి?" అని సన్న్యాసి అడిగారు. "వాడు పెద్ద బందిపోటు. ఎన్నో హత్యలు చేశాడు. చిటికెలో దొంగతనం చేసి పారిపోతాడు. మీకేమీ హాని చెయ్యలేదు కదా!" అన్నారు. "లేదు, లేదు. నా దగ్గర ఏముందని అతను తీసుకోడానికి! ఒక మైలు దూరం వరకూ నాకు దోవ చూపిస్తూ వచ్చి సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు" అని స్వామి చెప్పారు. బందిపోటు దొంగ కూడా మానవత్వాన్ని ప్రదర్శించినందుకు జపానందజీ సంతోషించారు. ✹

(మిగతా వచ్చే సంచికలో...)

అనువాదం : శ్రీమతి జి.ఎస్. లక్ష్మి

# అనుగ్రహానికి అవరోధం అహంకారం!

కథ: స్వామి విమూర్తానంద    చిత్రాలు : పద్మవాసన్    తెలుగుసేత : స్వామి జ్ఞానదానంద










4
సురేంద్రుడు భక్తులతో...
భక్తులారా! ఇంత చక్కని పూలమాలను అందరం కలసి గురుదేవుల మెడలో వేద్దాం, రండి.
భావపారవశ్యంలో ఉన్న గురుదేవులకు సురేంద్రుడు పూలమాలను మెడలో వేశాడు. అప్పుడు ఎవరూ ఊహించని విధంగా...
5
భక్తులందరి ఆరాధ్య దైవము, కరుణామూర్తి అయిన గురుదేవులు ఆ పూలమాలను, తీసి పారవేసి, సంకీర్తనం కొనసాగించారు.
(సురేంద్రుడు తనలో తానే) హా! ఈయన ఎందుకిలా చేశారు?
6
అందరి సమక్షంలో గురుదేవులు తనను అవమానించినట్లుగా సురేంద్రుడు భావించాడు. వెంటనే గదిలోకి వెళ్ళి కోపంగా...
పల్లెటూరి బ్రాహ్మణుడికి ఈ పూలమాలను గురించీ, దాని మూల్యం గురించీ ఏమి తెలుస్తుంది? ఆయన అందరి సమక్షంలో నన్ను అవమానించారు.
7
గురుదేవులు తనను అవమానించారనే బాధతో సురేంద్రుడు విలపించసాగాడు. కానీ...., సురేంద్రుడు, కొన్ని క్షణాల్లోనే తన తప్పును గ్రహించాడు.
అవును, నేను చేసింది తప్పే, అహంకారంతో పూలమాలను వేసి ఆయన్ని ఆకర్షించాలని తలచాను. కేవలం డబ్బుతో భగవంతుణ్ణి కొనగలమా?

మిగతా 36వ పేజీలో...

# గురువు అవసరం ఏమిటి? – స్వామి రంగనాథానంద

**మా**నవ సమాజం మనుగడకూ, వికాసానికీ కొన్ని శాశ్వతమైన విలువలు అవసరం. ఆ శాశ్వత విలువలను నిరంతరం పాటింపజేసేందుకు అవతరించిన యుగపురుషులు – శ్రీరామకృష్ణ పరమహంస. వారు తమ జీవితంలో ఆచరణ ద్వారా, ప్రబోధాల ద్వారా మానవ జాతికి శాశ్వత ధర్మాలను విపులీకరించారు. మోక్ష మార్గంలో పయనించడం సులభతరం చేసి చూపారు.

**సర్వాంతర్యామి సందర్శనం :** శ్రీరామకృష్ణుల వద్దకు ఒక మహిళ వచ్చి, "స్వామీ! కళ్ళు మూసుకొని బాలకృష్ణుణ్ణి



ధ్యానం చేస్తుంటే నా మనుమడే కనిపిస్తున్నాడు కానీ బాలకృష్ణుని రూపం దర్శనం కావడం లేదు" అని తన సమస్యను చెప్పారట! గురుదేవులు చిరునవ్వు నవ్వి "సర్వంతర్యామిని ధ్యానం చేస్తున్నావు. నీ మనుమడిలో బాలకృష్ణుడు లేడంటావా?" అని ప్రశ్నించారట. అప్పటి నుంచి బాలుడైన తన మనుమడిలో ఆమెకు చిన్నికృష్ణుడి దర్శనం అయిందట. ఆ బాలుడి ప్రతి చర్యలోనూ చిన్నికృష్ణుణ్ణి దర్శనం చేసుకోగలిగింది. గురుదేవుల ఉపదేశాలలోని ఒక్క మాట చాలు అజ్ఞానపు పొరలు తొలగి, జ్ఞాన దీపం వెలగడానికి!

**భగవత్ తత్త్వాన్ని భక్తులకు అందించే గురువు :** ప్రతి జీవీ దైవ స్వరూపమే. భగవంతుని కృప అందరికీ ఉంటుంది. అయితే, అది అందుకొనే శక్తి గురువు ద్వారా లభిస్తుంది. సేద్యపు భూమి, కావలసినంత నీరు ఉన్నాయనుకోండి. ఈ రెండూ ఉన్నంత మాత్రాన పంట పండదు. విత్తు నాటి, సేద్యం చేసే రైతు ఉంటేనే అందులో వ్యవసాయం చేసి పంటను పండించి ప్రజలకు అందించగలడు. ఆ భూమి, నీరు భగవంతుని కృప అయితే, సేద్యం చేసి పంట పండించే రైతు లాంటి వాడు గురువు. ఆయన సన్నిధిలోనే భగవత్ తత్త్వం అర్థమవుతుంది. సూర్యకిరణాలను ప్రతిఫలింప చేసే అద్దంలా గురువు భగవత్ తత్త్వాన్ని ప్రతిఫలింపజేస్తాడు.

'గురువు, గోవిందుడు – ఇద్దరూ కనిపిస్తే ముందుగా నేను గురువుకే నమస్కారం చేస్తాను' అని గురువు ప్రాశస్త్యాన్ని వివరించారు కబీర్ దాస్. దైవతత్త్వం, ప్రాపంచిక విషయాలు గురువు ద్వారానే తెలుసుకోగలుగుతాం. భౌతిక శరీరాన్ని తల్లితండ్రులు ఇస్తే జ్ఞాన శరీరాన్ని గురువు ప్రసాదిస్తాడు.

**గురు తత్త్వం :** సత్యం తెలుసుకొమ్మని మేల్కొల్పడమే గురువు కర్తవ్యం. 'వివేక చూడామణి'లో శంకరాచార్యులు చెప్పినట్లు **'యస్మాత్ బంధ విమోక్షణం'** – ఎవరి వల్ల మనిషి బంధ విముక్తుడు కాగలడో ఆయనే గురువు! మనిషిని ద్రవ్యత్వం నుంచి దివ్యత్వం వైపు నడిపించే వారధిగా గురుతత్త్వం పనిచేస్తుంది. గురువు స్థానానికి శంకరాచార్యులు చెప్పిన నిర్వచనం బహు సుందరమైనది.

**అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా**
**చక్షురున్మీలితం ఏన తస్మై శ్రీగురవే నమః**

"ఆధ్యాత్మికమైన అంధత్వంతో అల్లాడేవాడి కళ్ళకు జ్ఞాన లేపనం ఇచ్చి, కళ్ళను తెరిపించి వెలుగును ప్రసాదించే గురువుకు ప్రణామాలు".

**గురదేవుల సందేశం :** "ఆధునిక ప్రపంచానికి శ్రీరామకృష్ణులు ఇచ్చే సందేశం ఒక్కటే – సిద్ధాంతాలు, వర్గాలు, చర్చిలు, దేవాలయాలు అంటూ గిరి గీసుకుని కూర్చోవద్దు. మనిషి జీవన పరమార్థంతో పోలిస్తే వాటి విలువ స్వల్పం. ఆధ్యాత్మికత ఎంతగా వికసిస్తే వ్యక్తి అంతగా ఎదుగుతాడు. మంచిని పెంచే శక్తిశాలి అవుతాడు. ముందు దాన్ని సాధించండి" అని స్వామీజీ గురుదేవుల ఉపదేశాన్ని అందించారు. ✹

(స్వామి రంగనాథానందజీ ఉపన్యాసాల నుంచి)

**సేకరణ : ఆర్. కృష్ణ**



# మనస్సు - దృశ్యం

**శ్రీరాముడు :** ఈ మనస్సు యొక్క రూపమేమిటి? ఎక్కడ, ఎందుచేత, ఎలా ఉంటోంది? మాకు వివరించండి.

**శ్రీవసిష్ఠ మహర్షి :** ఆకాశం అని మనం పిలుస్తున్నది దేనిని? అక్కడ శూన్యత్వం కాకుండా మరింకేదైనా ఉందా? నీలపు రంగుగల ఏదైనా పదార్థముందా? లేదు! అదే విధంగా శూన్యాకాశాత్మకమైన మనస్సుకు కూడా వేరే రూపం అంటూ ఏదీ లేదు. దాని వెలుపల కానీ, లోపల కానీ ఏదీ కాన రాకుండానే ఉంది. అయినప్పటికీ ఆకాశం లాగ సర్వత్రా వెలయుచునే ఉంది. 'మృగతృష్ణ'లో నీటి అనుభవం లాగ, మనస్సు నుంచి ఈ జగత్తు యొక్క అనుభవం ప్రాప్తిస్తోందనే మాట నిజమే.

### సంకల్పించే వాడు - సంకల్పాలు

సంకల్పమే మనస్సు యొక్క రూపం. సంకల్పం అనే దాని కన్నా ముందే సంకల్పించు వాడు ఉన్నాడు కదా! సర్వానికీ ముందే ఉన్న శుద్ధత్వం 'చిత్తు' అనీ, ఆ చిత్తు సంకల్పిస్తున్నప్పుడు 'మనస్సు' అనీ చెప్పబడుతోంది.

నీరు, ద్రవత్వం; వాయువు, వాయుచలనం ఎలా వేరుకాదో అలాగే సంకల్పం, మనస్సు వేరుకాదు. ఎక్కడ సంకల్పం ఉంటే అక్కడ మనస్సు ఉంటుంది. ఈ రెండూ వేరువేరుగా ఎక్కడా ఎవ్వరూ అనుభవించి ఉండలేదు.

### మననం చేసే స్వభావమే మనస్సు

ఈ దృశ్యప్రపంచం కాక మనస్సుకి వేరే రూపమే లేదు. మనస్సు సంకల్పించ బడినప్పుడు ఉంటోంది. అందువల్ల "అది ఇప్పుడు ఇట్లు ఉత్పత్తి అయింది" అని మనం నిర్దేశించలేం. అలాగే "ఈ దృశ్యానికి కూడా వాస్తవానికి 'ఉత్పత్తి' అనేదే లేదు" అని చెప్పబడుతోంది.

తామరపువ్వు యొక్క బీజంలో ఆ పువ్వు యొక్క సూక్ష్మభావమంతా సంస్కారరూపంలో ఇమిడి ఉంది. అంటే ద్రష్టలోనే దృశ్యత్వం ఇమిడి ఉందని గ్రహించు. అయితే, "బంగారానికి ఆభరణత్వం ఉందా? లేదు. కానీ ఆభరణం, బంగారం కన్నా వేరైనది కాదు కదా! ఎండమావులలో జలమెక్కడ? కానీ జలం యొక్క ఆకారమే కదా ఎండమావులలో స్ఫురించేది? స్వప్నపురంలో కనబడే గోడలకు పునాది ఉందా? అదే విధంగా ద్రష్ట యందున్న ఈ దృశ్యత్వ బుద్ధి కూడా భ్రమాత్మకమే. కార్యానికి కారణం కన్నా వేరైన 'సత్త' లేదు. అదే విధంగా... "ఈ దృశ్యం యొక్క ఉనికికి కారణం "నీవు దీనిని ఈ రీతిగా దర్శించడమే సుమా!" ఇది నీ కన్నా వేరు కాదు. అనగా నీ మనస్సు నీ కన్నా వేరు కాదు. మనస్సు ఉన్నది నీ యందే! నీ స్వరూపం చేతనే అది తయారవుతోంది.

ఈ దృశ్యాలన్నీ ద్రష్ట యందే ఉన్నాయనేది పరిశీలించి చూసి గ్రహించినప్పుడు నీకే అవగతం కాగలదు. ఈ విషయం సుస్పష్టపడడానికే నీ చిత్తదర్పణాన ఉన్న మాలిన్యాన్ని ఈ బోధతో తొలగించే ప్రయత్నం చేస్తున్నాను. చిత్తమాలిన్యం చేతనే ఈ విశ్వం ఒక 'దృశ్యం'గా తోస్తోంది. చిత్తంలో ఉన్న మాలిన్యం తొలగించి వేస్తే దృశ్యం ఉండదు. అప్పుడీ జీవుడు నిర్మలుడై, స్వచ్ఛంగా ప్రకాశించగలడు. ఆత్మతో ఏకత్వం సంభవించినప్పుడే చిత్తం యొక్క స్పందనం ఆగి ఉంటుంది. అప్పుడు ఈ చిత్తంలో ఉన్న రాగ-ద్వేషాలు, వాసనలు తొలగిపోతాయి.

చైతన్యమయ జ్ఞానం వల్లనే ఈ దిక్కులు, భూమి, ఆకాశం మొదలైనవి ప్రకాశిస్తున్నాయి కదా! ఆ చైతన్యం యొక్క ప్రకాశంలో దిక్కులు మొదలైనవన్నీ లేకపోయి నప్పుడు దానినే ''ఆత్మప్రకాశం'' అంటున్నాం. "నీవు-నేను-లోకాలు" మొదలుగా గల దృశ్యాలన్నీ అసత్తే". ద్రష్టకి 'నేను-నీవు-జగత్తు' మొదలైన భావాలు లేకపోయినప్పుడు ఆ ద్రష్ట కూడా కేవలుడు అవుతున్నాడు. ✹

('శ్రీవసిష్ఠ రామ సంవాదం' ఉత్పత్తి ప్రకరణం ప్రథమార్థం నుంచి) **అనువాదం : వై.హెచ్. రామకృష్ణ**



శ్రీరామకృష్ణ పరమహంస నివసించిన ఇల్లు



శ్రీరామకృష్ణులు ప్రాథమిక విద్యను అభ్యసించిన పాఠశాల



శ్రీరామకృష్ణ పరమహంస ధ్యానం చేసిన శ్మశానవాటిక



కామార్పుకూర్‌లోని పెద్ద చెరువు - హల్దార్పుకూర్



# పరమహంస పావన ధామ

## శ్రీరామకృష్ణ పరమహంస జన్మస్థలం 'కామార్పుకూర్' - ఛాయాచి

**పశ్చిమ బెంగాల్‌లోని కలకత్తాకు వాయవ్య దిశలో 112 కి.మీ. దూరంలో కామార్పుకూర్ గ్రామం ఉంది. ఆ గ్రామంలో 1836 ఫిబ్రవరి 18వ తేదీన శ్రీరామకృష్ణ పరమహంస (గదాధర్) జన్మించారు. ఆయన జన్మదిన సందర్భంగా (ఈ సంవత్సరం తిథి ప్రకారం 27 ఫిబ్రవరి 2009) పరమహంస పావనం చేసిన ఆ పుణ్యధామం చిత్రమాలికను 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు అందిస్తున్నాం.**

Ⅱ శ్రీరామకృష్ణుల తండ్రి క్షుదీరామ్ కార్యార్థం వేరే గ్రామానికి వెళ్ళి తిరిగి వస్తున్నప్పుడు ఒక చెట్టు క్రింద విశ్రమించారు. అప్పుడు



రఘువీరుని (సాలగ్రామ శిల) మందిరం



రామకృష్ణుల ఇంటి దగ్గ

శ్రీరామచంద్రుడు ఆయనకు దర్శనమిచ్చి 'నన్ను నీ ఇంటికి తీసుకువెళ్ళు' అని చెప్పి అదృశ్యమయ్యాడు. అప్పుడు క్షుదీరామ్‌కు వరి పొలంలో రఘువీరుని సాలగ్రామ శిల కనిపించింది. ఆ సాలగ్రామ శిలను క్షుదీరామ్ తీసుకువెళ్ళి, తన ఇంట్లో ప్రతిష్ఠించి నిత్యం పూజలు చేస్తూండేవాడు. కామార్పుకూర్‌లో నేటికీ ఆ శ్రీరామచంద్రుడు సాలగ్రామ శిల రూపంలో 'రఘువీర్ మందిరం'లో శ్రీరామకృష్ణుల వంశస్థులతో పూజలు అందుకుంటున్నాడు.

క్షుదీరామ్‌కు గయలో శ్రీమహావిష్ణువు కలలో కనిపించి 'క్షుదీరామ్! నేను నీకు బిడ్డగా జన్మిస్తాను' అన్నాడు. స్వప్నంలో విష్ణుమూర్తిని చూసి ఆయన పరవశించిపోయాడు. అదే సమయంలో శ్రీరామకృష్ణుల తల్లి చంద్రాదేవి తన ఇంటి పక్కనే ఉన్న శివాలయం ముందు నిలబడి, ప్రార్థన చేస్తుండగా శివలింగం నుంచి దివ్యజ్యోతి వెలువడి ఆమెలో ప్రవేశించింది. నేటికీ ఆ యుగి శివాలయాన్ని కామార్పుకూర్‌లో దర్శించవచ్చు.

కామార్పుకూర్‌లో శివరాత్రి పర్వదినాన శివలీల నాటక ప్రదర్శనకు అన్నీ సిద్ధమయ్యాయి. కానీ శివపాత్రధారి అనారోగ్యం వల్ల రాలేదు. అప్పుడు శివుని పాత్రను పోషించాల్సిందిగా మిత్రులు గదాధరుణ్ణి కోరారు. గదాధరుణ్ణి శివునిలా అలంకరించారు. ప్రశాంత వదనంతో బాల చంద్రాదిక జటాజూటంతో గదాధరుడు వేదిక పైకి వెళ్ళేసరికి, సాక్షాత్తూ ఆ పరమేశ్వరుడే కైలాసం నుంచి దిగివచ్చాడా! అన్నట్లు ప్రేక్షకులు అతణ్ణి రెప్పవాల్చకుండా చూడసాగారు. గదాధరుడు బాహ్యస్మృతిని కోల్పోయి పరమేశ్వరుని ధ్యానంలో లీనమైపోయాడు. గదాధరుడు శివునిగా నటించిన ఆ ప్రదేశంలో నేడు శివ మండపం దర్శనమిస్తుంది.

గదాధరునికి చిన్నప్పటి నుంచీ దైవభక్తి అధికం. 'పొట్ట కూటి విద్య కన్నా పరమాత్ముని దర్శింపజేసే విద్యే మిన్న' అని భావించిన గదాధరుడు భగవన్నామ సంకీర్తనకే ప్రాధాన్యం ఇచ్చేవాడు. తన మిత్రులతో కలిసి మాణిక్ రాజ్ అనే ధనవంతుని మామిడి తోటలో భగవన్నామ సంకీర్తనం చేస్తూ, శ్రీరామ, శ్రీకృష్ణుల జీవిత ఘట్టాలను నటిస్తూ భావసమాధి పొందేవాడు.


రామకృష్ణుల జన్మస్థలంలో వెలసిన 'శ్రీరామకృష్ణ మందిరం'


కామార్పుకూర్ 'రామకృష్ణ మందిరం'లోని పాలరాతి విగ్రహం


రామకృష్ణులు శివరాత్రి పర్వదినాన శివునిగా నటించిన వేదిక


...రున్న 'యుగి శివాలయం'


రామకృష్ణులు నాటిన మామిడి చెట్టు


రామకృష్ణులు ఆడుకున్న మాణిక్ రాజా మామిడి తోట, ఇల్లు.



# సానుకూల భావాలతో విజయ సాధన

– స్వామి అనుపమానంద

స్వామి వివేకానంద "మీరు ఎలా ఆలోచిస్తారో, అలాగే అవుతారు" అంటారు. అందుకే జీవితంలో సానుకూల ఆలోచన ఉండాలి. కార్యరంగంలోనూ, పాఠశాలల్లోనూ, కళాశాలల్లోనూ ఎన్నో సమస్యలు, సవాళ్ళు ఎదురవుతాయి. వాటిని సమర్థంగా ఎదుర్కోవడానికి సానుకూలమైన ఆలోచనా విధానం అవసరం. ఆత్మ విశ్వాసం, సానుకూల ఆలోచనా విధానం లేకపోతే జీవిత లక్ష్యాన్ని సాధించలేం. జీవన యాత్రను అర్థవంతంగా మలచుకోలేం.

**అనంత శక్తి మనలోనే ఉంది:** "భారత్ గురించి తెలుసుకోవాలంటే స్వామి వివేకానంద (జీవితం – సందేశం)ను చదవండి"అని రవీంద్రనాథ్ టాగూర్ అంటారు. 'నువ్వు ఒక అసాధారణ వ్యక్తివి, ఆ అసాధారణతను పొందడానికి కావాల్సిన శక్తి నీలోనే ఉంది. ప్రయత్నిస్తే ఏదైనా సాధించవచ్చు' అంటారు స్వామీజీ.

**యువతకు ఆదర్శం స్వామీజీ:** మన దేశ యువతరానికి జాతి మత ప్రాంత విచక్షణ లేకుండా అందరిలో ప్రేరణ కలిగించే ఒక ఆదర్శ నాయకుడు కావాలి. అలాంటి జాతీయ నాయకుడెవరు అనే చర్చ 1985లో వచ్చింది. అప్పటి భారత ప్రధాని అయిన రాజీవ్ గాంధీతో సహా అందరూ భారత యువతరానికి ఆదర్శప్రాయుడు 'స్వామి వివేకానంద' అని ఏకగ్రీవంగా తీర్మానించారు. అందుకే స్వామీజీ జన్మించిన (ఆంగ్ల క్యాలండర్ ప్రకారం) జనవరి 12వ తేదీని 'జాతీయ యువజన దినోత్సవం'గా జరపడానికి నిశ్చయించారు.

స్వామీజీ గురించి సుభాష్ చంద్రబోస్ ఇలా అన్నారు: ***"స్వామి వివేకానందుని బహుముఖ ప్రజ్ఞాపాటవాల్ని వివరించటానికి నేను అశక్తుడను. స్వామి వివేకానంద తన ప్రసంగాల ద్వారా మా కాలపు విద్యార్థుల్ని ప్రభావితం చేసినట్లు దేశంలోని ఏ ఇతర నాయకులు చేయలేదు. స్వామీజీ జీవించి ఉంటే ఆ మహాత్ముణ్ణి నేను నా గురువర్యునిగా ఆమోదించి పూజించేవాణ్ణి".***

సుభాష్ చంద్రబోస్ లాంటి మహానాయకులకే మార్గదర్శిగా నిలిచారు స్వామి వివేకానంద.

**సానుకూలంగా ఆలోచించడమంటే!:** మీరందరూ భగవద్గీత గురించి వినే ఉంటారు. శ్రీకృష్ణుడు అర్జునుడికి యుద్ధరంగంలో చేసిన ఉపదేశమే భగవద్గీత. అర్జునుడు గొప్ప యోధుడు. మహాభారత సంగ్రామంలో మొదటి రోజున అతని ఎదురుగా దుర్యోధనుడి సైన్యం ఉంది. తన ఎదుట మహాసముద్రంలా ఉన్న కౌరవ సైన్యాన్ని చూసిన అర్జునుడికి ముచ్చెమటలు పట్టాయి. ముల్లోకాలలోనూ గొప్ప యోధుడని పేరు గాంచిన అర్జునుడు పిరికివాడిలా ప్రవర్తించాడు. "కౌరవులంటే మా పెదతండ్రి పిల్లలే కదా! వారితో యుద్ధం ఎలా చేస్తాం? భీష్ముడు మా తాత, ద్రోణాచార్యులు మాకు గురువు... వారందరితో ఎలా పోరాడగలను?" అన్నాడు అర్జునుడు శ్రీకృష్ణునితో. ఆ విధంగా అర్జునుడి మదిలో వ్యతిరేక భావనలు తలెత్తి, అతణ్ణి పిరికివాణ్ణి చేశాయి. రణరంగంలోకి రాక ముందే ఇవన్నీ అర్జునుడికి తెలియవా? అతనొక క్షత్రియుడు. దుష్టులను నిర్మూలించడం క్షాత్ర ధర్మం. అర్జునుడు ఎంతో ధైర్యవంతుడు. అయినా దుర్యోధనుడి సేన ఎదుట నిలబడినప్పుడు అతణ్ణి పిరికితనం ఆవరించింది.

శ్రీకృష్ణుడు ఈ వాదన విని సానుకూలంగా ఆలోచించాల్సిందిగా అర్జునుడికి బోధించాడు.

**"క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే ।**
**క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప"** ॥ (గీత–2:3)

"ఓ అర్జునా! అధైర్యం చెందకు. మనోదుర్బలతను వదలు. శత్రువుతో పోరాడడం క్షత్రియ ధర్మం. చెడు చేసేవారిని శిక్షించాలి. బలహీనతను విడిచి, యుద్ధం చెయ్యి" అని ఆదేశించాడు. శ్రీకృష్ణుడు ఇచ్చిన స్ఫూర్తితో అర్జునుడు సానుకూలంగా ఆలోచించాడు, అర్జునుడు ప్రతికూలంగా

ఆలోచించి ఉంటే రణరంగం నుంచి పారిపోయేవాడు. యువతరానికి ఈ శ్లోకాన్ని భావంతో సహా నేర్పాలి అనేవారు స్వామి వివేకానంద. మీలో కూడా అధైర్యం చోటు చేసుకున్నప్పుడు సానుకూలంగా ఆలోచించడానికి ప్రయత్నించండి.

మనకు సానుకూల ఆలోచనా పద్ధతి లేకపోతే మనం బలహీనులమే అవుతాం. "మీరు బలహీనంగా ఉంటేనే తప్పులు చేస్తారు. బలంగా ఉంటే తప్పులు చెయ్యరు" అంటారు స్వామి వివేకానంద. ఇక్కడ బలం అంటే శారీరక బలం మాత్రమే కాదు, మానసిక బలం! బుద్ధిబలం! ఆధ్యాత్మిక బలం!!

మీరు పరీక్ష వ్రాయడానికి వెళతారు. సరిగ్గా పరీక్ష గదిలోకి వెళ్ళే ముందు మీ స్నేహితుడు ఎదురై, "ప్రశ్నపత్రం చాలా కఠినంగా ఉందట" అంటాడు. వెంటనే మీ మనస్సులో ప్రతికూల భావనలు చోటు చేసుకుంటాయి. ప్రశ్నపత్రంలో అడిగిన అంశాలన్నీ మీరు చదివినవే అయినప్పటికీ, ప్రతికూల ఆలోచనల వల్ల మీరు పరీక్ష బాగా వ్రాయలేరు.

ప్రతికూలంగా ఆలోచించడం మొదలుపెట్టగానే పిరికితనం ఆవహిస్తుంది. వ్యతిరేకంగా ఆలోచించడం వల్ల బలహీనులవుతారు. పరీక్ష బాగా వ్రాయకపోతే ఇంట్లో తల్లితండ్రులు ఊరకోరు. అందువల్ల ఎలాగోలా వ్రాసెయ్యాలనే తపనతో బుద్ధి పెడదోవ పట్టి, మీ పక్క వారి పేపరు చూసి కాపీ కొట్టాలనుకుంటారు. ఇలాగే మనం తప్పులు చేయడం ప్రారంభిస్తాం. మనకు ఆత్మవిశ్వాసం ఉంటే మనం పక్కవాడి జవాబులు చూసి, కాపీ కొట్టాలనుకోం. స్వామి వివేకానంద "మీరు దృఢంగా ఉంటే తప్పులు చెయ్యరు" అనడంలో వారి భావం ఇదే. అందుకే సానుకూలంగా ఆలోచించడం మనం అలవాటు చేసుకోవాలి.

"ప్రపంచానికి నువ్వు బోధించాలి" అని శ్రీరామకృష్ణులు చెప్పినప్పుడు నరేంద్రుడు అదే ప్రశ్న వేశాడు. "నేనొక కళాశాల విద్యార్థిని. నా వల్ల ఇది సాధ్యమవుతుందా?" అని అడిగాడు. అప్పుడు శ్రీరామకృష్ణులు "నీలోని శక్తి నీ చేత చేయిస్తుంది" అన్నారు. నరేంద్రకున్న శక్తి సామర్థ్యాలు వారికి తెలుసు. అందుకే వారు అతనికి ప్రేరణ కలిగించారు. బాల్యం నుంచీ తల్లి ఇచ్చిన శిక్షణ వల్ల అతను సహజంగానే అద్భుతమైన వ్యక్తిత్వం గలవాడయ్యాడు. దానికి తోడు శ్రీరామకృష్ణులు సానుకూల భావాలను రగిలించారు. ఆ విధంగా స్వామి వివేకానంద ప్రపంచానికే నాయకుడయ్యారు. వారొక అసాధారణ వ్యక్తి, వారి నిఘంటువులో 'అసాధ్యం' అనే పదమే లేదు. అందుకే స్వామి వివేకానంద ప్రపంచానికే స్ఫూర్తిదాత అయ్యారు.

**సానుకూల వైఖరి ఎలా సాధ్యం?:** కార్యరంగంలో, కుటుంబంలో, సమాజంలో – ఇలా అన్ని చోట్లా నిత్యం మనం ఎన్నో సవాళ్ళనూ, సమస్యలనూ ఎదుర్కొంటాం. అలాంటప్పుడు సానుకూలంగా ఆలోచించే మనస్సు అవసరం. దాని వల్ల జీవిత లక్ష్యాన్ని సాధించగలం. అయితే సానుకూల వైఖరి ఎలా సాధ్యం అంటే "ఒక భావాన్ని తీసుకొని, దాని గురించే ఎప్పుడూ ఆలోచిస్తూ, దాని గురించే కలలు కనాలి" అని స్వామీజీ అంటారు. మన మాజీ రాష్ట్రపతి అబ్దుల్ కలామ్ చెప్పేది కూడా అదే!

జీవితంలో ఏదైనా సాధించాలంటే దాని గురించే కలలు కనాలి. ఆ ఒక్క విషయం గురించే ఆలోచించాలి. అదే మీ జీవితం కావాలి. మీ వ్యక్తిత్వమంతా ఆ కలతో.... ఆ భావనతో మమేకం కావాలి. ఇదే విజయానికి మార్గం.

కాబట్టి, సానుకూల భావనతో మీ లక్ష్యాన్ని ఎన్నుకోండి. లక్ష్యాన్ని గురించే ఆలోచిస్తుంటే దాన్ని సాధించే మార్గం తెలుస్తుంది. లక్ష్యసాధనలో అపజయాలు ఎదురుకావచ్చు. మహాత్ములు తమ జీవితాలలో ఎన్ని అపజయాలు ఎదురైనప్పటికీ, పట్టువిడవకుండా తదేక దీక్షతో మళ్ళీ మళ్ళీ ప్రయత్నించి లక్ష్యాన్ని సాధించారు. అపజయాలు ఎదురవడమన్నది సహజం. అంతమాత్రాన మనం పట్టు విడవకూడదు! అపజయాలను విజయానికి సోపానాలుగా భావించి ముందుకు సాగాలి. ✸






**– స్వామి పరిజ్ఞేయానంద**

**ఎస్.వి. నాని, నారాయణ, బి. సత్య, ఆర్. శ్రీదేవి.**

**ప్రశ్న: మేము 'శ్రీరామకృష్ణ ప్రభ' చదువుతున్నాం. చెడు ఆలోచనలను పోగొట్టి, ఉన్నత ఆశయాల వైపు పయనించేలా పత్రిక మమ్మల్ని ఉత్తేజితుల్ని చేస్తోంది. ఇప్పుడు మాకున్న సమస్య ఏమిటంటే చదువు మీద ఏకాగ్రత కుదరడం లేదు, చదివిన విషయాన్ని మరచిపోతున్నాం. మాలో ఏకాగ్రత, జ్ఞాపకశక్తి పెరగాలంటే ఏం చేయాలి?**

**జవాబు:** శ్రీరామకృష్ణ ప్రభలోని 'యువవాణి' శీర్షికకు వస్తున్న ఉత్తరాల్లో అధిక శాతం విద్యార్థులు 'ఎంత చదివినా గుర్తుండడం లేదు, పుస్తకం ముందు కూర్చోగానే మనస్సు పలు దిక్కులు పోతోంది' అని వ్రాస్తుంటారు.

'నాకు జ్ఞాపక శక్తి చాలా తక్కువ, చదివింది వెంటనే మర్చిపోతాను' అని ఓ డిగ్రీ విద్యార్థి, మెమరీ ట్రైనర్ (జ్ఞాపకశక్తి నిపుణుడు)కి చెప్పాడు. అప్పుడు అతడు, ఆ విద్యార్థితో ఇలా సంభాషించాడు–

*మెమరీ ట్రైనర్:* నీకు ఎవరైనా స్నేహితులు ఉన్నారా!

*విద్యార్థి:* కాలేజీలో చదువుతున్న వారికి స్నేహితులు లేకపోవడం ఏమిటి సర్!

*మె.ట్రై:* అయితే, స్నేహితులతో నీకు కలిగిన ఓ అనుభవాన్ని చెప్పు!

*విద్యార్థి:* నా స్నేహితుడికి అత్యవసరమై ఒకసారి 200 రూపాయలు అప్పుగా ఇచ్చాను. ఆ పైకం తిరిగి ఇమ్మని అడిగితే నన్ను నానా మాటలూ అన్నాడు.

*మె.ట్రై :* ఇదంతా ఎప్పుడు జరిగింది?



*విద్యార్థి :* నేను పదో తరగతి చదువుతున్నప్పుడు సర్!

డిగ్రీ చదువుతున్న ఈ విద్యార్థికి ఎప్పుడో పదో తరగతిలో తన మిత్రుడు తిట్టిన తిట్లన్నీ గుర్తున్నాయి కానీ, ఆ రోజు చదివిన పాఠం ఆ రోజే మర్చిపోతున్నానని చెబుతున్నాడు. మరి ఈ విద్యార్థికి 'జ్ఞాపకశక్తి' ఉన్నట్లా? లేనట్లా?

క్రికెట్‌లో ఫలానా ఆటగాడు ఎన్ని బంతుల్లో ఎన్ని పరుగులు చేశాడో జ్ఞాపకం పెట్టుకుంటున్న విద్యార్థికి చదువు దగ్గరకు వచ్చేసరికి చదివేది జ్ఞాపకం ఉండడం లేదు. రెండు గంటల పాటు కళ్ళార్పకుండా సినిమా ప్రపంచంలో మునిగిపోయే విద్యార్థికి పుస్తకం ముందు కూర్చోగానే మనస్సు నిలవదు, ఏకాగ్రత కుదరదు.

ఒక పనిలో కుదిరిన ఏకాగ్రత, ఇంకొక పనిలో ఎందుకు కుదరదు? 'రసవత్తరంగా సాగుతున్న క్రికెట్ మ్యాచ్ వర్షం వల్ల అర్ధంతరంగా రద్దయితే ఆనందిస్తామా? బాధపడతామా?' అని ఏ విద్యార్థినైనా అడగండి. 'బాధపడతాం' అని సమాధానం వస్తుంది. 'ఉదయాన్నే పాఠశాలకు బయలుదేరుతున్నప్పుడు ఎడతెరిపి లేకుండా వర్షం కురిస్తే అప్పుడు ఆనందిస్తామా? బాధపడతామా?' అని ప్రశ్నిస్తే దానికి సమాధానం ఏమిటో వేరే చెప్పనవసరం లేదు.

విద్యార్థికి వర్షం వల్ల క్రికెట్ రద్దయితే బాధ, అదే వర్షం వల్ల స్కూలు లేకపోతే ఆనందం కలుగుతున్నాయి. దీనికి కారణం చేసే పని పట్ల ఉన్న ఇష్టానిష్టాలే! కాబట్టి ఏ పనినైనా ఇష్టపడి చేస్తే, అది కష్టంగా తోచదు. పైగా ఆ పనిలో అభిరుచి పెరుగుతుంది. పనిని ప్రేమించడం నేర్చుకుంటే ఏకాగ్రత, జ్ఞాపకశక్తి సునాయాసంగా అలవడతాయి.

I think it is all a matter of love: The more you love a thing, the memory of it becomes stronger and stronger.

***- Nabokov***

చదవవలసిన అంశాన్ని ఒకసారి మొత్తం చదవడం, రెండోసారి అర్థం చేసుకుంటూ చదవడం, మూడవసారి చదివిన అంశాన్ని అవలోకనం చేసుకోవడం – ఇలా అభ్యాసం చేస్తే 'సాధనమున పనులు సమకూరు ధరలోన' అన్న విషయం మీకు అర్థమవుతుంది. కర్తవ్య నిర్వహణలో సంపూర్ణంగా మనస్సును అర్పించగలిగితే దేనినైనా సాధించవచ్చని అంటారు స్వామి వివేకానంద.

Whatever you do, devote your whole mind, heart, and soul to it.... Let the brain, muscles, nerves, every part of your body, be full of one idea, and just leave every other idea alone. This is the way to success.

***- Swami Vivekananda***

**మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :**

**యువవాణి**

**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**

**దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029**




# మనిషిని మార్చిన మనియార్డర్

**మా** స్వస్థలం ఒంగోలు. కారణాంతరాల వల్ల వేరేచోట ఉంటున్నాను. నేను ప్రతినెలా ఒంగోలులో వెలసిన శ్రీవేంకటేశ్వరస్వామి వారి దేవాలయ అర్చక స్వాములకు రోజు వారీ అర్చన కోసం వంద రూపాయలు మనియార్డర్ చేస్తుంటాను. 2006 మార్చి నెలలో నేను పంపిన మనియార్డర్ ఒంగోలు చేరకుండా, చెన్నై శ్రీరామకృష్ణ మఠంకు చేరింది. నెల తర్వాత మఠం నుంచి పోస్టులో ఓ బ్రహ్మచారి వ్రాసిన కార్డు వచ్చింది. 'మీరు వందరూపాయలు పంపారు. ఏం పుస్తకాలు కావాలో వ్రాయలేదు. ఏం కావాలో వ్రాస్తే, పంపిస్తాం' అన్నది ఆ ఉత్తరం సారాంశం. నాకు దిగ్భ్రమ కలిగింది. దీన్ని స్వామి వారి దివ్యచర్యగానే భావించాను. వెంటనే స్వామి వారి "సోదర సోదరీ మణులారా" పంపాల్సిందిగా మద్రాసు శ్రీరామకృష్ణ మఠానికి జాబు వ్రాశాను. వెంటనే ఆ పుస్తకం వచ్చింది. ఎంతో ఉత్కంఠతో పూర్తిగా చదివాను. చదువు తున్నప్పుడు, చదవడం పూర్తి అయిన తరువాత ఏదో తెలియని అనిర్వచనీయమైన ఆనందం, శాంతి, ఉద్వేగం, వెలుగు, ఈ లోకానుభూతలకు భిన్నమైనవి నా మనస్సును ఆవరించాయి. అక్కడే దిశ మారింది.



పింగళి పాండురంగ రావు

స్వామి వివేకానంద యుగపురుషుడు. విశ్వానికి సద్ధర్మాన్ని బోధించడానికి అవతరించి చేసిన ప్రసంగాలన్నీ దివ్యమైనవి కావడం వల్ల అన్నీ ఉద్వేగభరితమై, ఉత్తేజపరుస్తూ, చదువరులనూ, భక్తులనూ కట్టిపడేశాయి. ప్రసంగాల్లోని ప్రతి అక్షరం మంత్ర సదృశం, వేద విహితం! అందువల్లే ఆయన నిర్గమించి 106 సంవత్సరాలైనా, ఈనాటికీ అవి ప్రజల విశ్వాసాన్ని దృఢపరుస్తున్నాయి. ఉత్తేజపరుస్తున్నాయి. సన్మార్గంలో నడిపిస్తూ, విశ్వ కల్యాణాన్ని సాధిస్తున్నాయి. అందులో సందేహమే లేదు.

మానవ విలువలు దిగజారిపోవడాన్ని నిలువరించడం స్వామీజీ దివ్య బోధల వల్లే సాధ్యం. వేరే మార్గం లేనే లేదు. కారణం – స్వామీజీ అనుష్ఠాన వేదాంతి. వ్యక్తిగత ముక్తి కాదు, సమాజోద్ధరణ కోరి, సర్వసంగ పరిత్యాగి అయిన మహా దేశభక్తుడు, మహాపురుషుడు. ఆయన జన్మతో ఈ దేశం ధన్యమైంది. దేశవాసులు కూడా ధన్యులు కావాలంటే స్వామి బోధలే శరణ్యం! వాటిని వ్యాపింపజేయడమే కర్తవ్యం. ఏ వయస్సు వారినైనా సరే తన బోధనలతో ఉత్తేజపరుస్తూ, సన్మార్గంలో నడిపించే దివ్యస్వరూపుడు స్వామి వివేకానంద.

నా విషయంలోనూ అదే జరిగింది. ఆయన సాహిత్య పఠనంతో అనేక ఆధ్యాత్మిక అనుభవాలు జీవిత దృక్పథాన్ని మారుస్తున్నాయి. స్వామి వివేకానందుని బోధల్లోని విశేషాల్ని అమితంగా నా మిత్రునితో చెబుతూ ఉంటే, "స్వామి వివేకానంద నిన్ను ఆవహించాడు" అన్నాడు. స్వామీజీ దివ్యబోధలు విశ్వరూపం ధరించి, విదేశీ వ్యామోహ పీడితులైన నేటి యువతరాన్ని ప్రభావితం చేస్తే తప్ప, మన దేశానికి ఉజ్జ్వల భవిష్యత్తు లేదు. సంపద పెరగవచ్చు కానీ ధర్మనిష్ఠ లేనిదే సర్వం శూన్యం. స్వామి వివేకానందుని మార్గమే సర్వశ్రేయోమార్గం. సర్వులకూ శరణ్యం. స్వామి వివేకానందకు నేటి యువతరం పైనే దృఢ విశ్వాసం. కనుక నేటి యువతరం వారి బోధలు ఆచరణలో పెట్టి, దేశాభ్యున్నతికి నిర్విరామకృషి చేయాలి. వారు దేశమాత ఋణం తీర్చుకోవాల్సిన సమయం ఆసన్నమైంది. ✸

*పింగళి పాండురంగ రావు, బాలాజీ నగర్, నెల్లూరు.*

# అందరి విజయంతో ఆనందం!

- గంపా నాగేశ్వర్‌రావు

**ఒ**క క్రీడామైదానంలో ఎనిమిది మంది బాలికలు పరుగు పందెంలో పాల్గొనేందుకు సిద్ధంగా నిలబడి ఉన్నారు. ఈల వేయగానే మొత్తం ఎనిమిది మంది బాలికలూ పరుగు ప్రారంభించారు.

పదిహేను అడుగులు కూడా వేశారో లేదో వారిలో ఒక బాలిక కాలు జారి పడింది. ఆ అమ్మాయికి దెబ్బలు తగిలాయి. నొప్పితో ఆమె ఏడుపు ప్రారంభించింది. అది వినగానే మిగిలిన ఏడుగురూ వెనక్కి తిరిగి ఆ బాలిక దగ్గరకు పరుగు పరుగున వచ్చారు.

వాళ్ళలో ఒక బాలిక వంగి, ఏడుస్తున్న బాలికకు మృదువుగా ముద్దుపెట్టి, "ఏడవకు, నీ నొప్పి తగ్గిపోతుందిలే"అని ఓదార్చింది. ఆ ఏడుగురు అమ్మాయిలూ క్రిందపడిన అమ్మాయిని ఎత్తుకొని, సముదాయించారు. వారిలో ఇద్దరు ఆ బాలికను గట్టిగా పట్టుకున్నారు. మిగిలిన వారు కూడా చేతులు కలిపారు. అందరూ కలిసి పరుగెత్తుకుంటూ తుది హద్దుకు చేరారు. ఇదంతా చూస్తున్న నిర్వాహకులు దిగ్భ్రాంతులయ్యారు. వేలమంది ప్రేక్షకుల కరతాళ ధ్వనులతో మైదానం మారుమ్రోగింది. ఎంతోమందికి కళ్ళ నుంచి అశ్రువులు ధారలు కట్టాయి. ఆ పరమేశ్వరుడికి కూడా ఈ వార్త అందే ఉంటుంది.

ఈ పోటీలో పాల్గొనేందుకు ప్రత్యేకంగా వచ్చిన ఈ అమ్మాయిలందరూ మానసిక వికలాంగులు. 'అందరి విజయంలోనే అసలైన ఆనందం ఉంది'అని వీరు నిరూపించారు. వీళ్ళంతా ఈ ప్రపంచానికి బోధించిన విషయం – జట్టుగా కలిసి పని చెయ్యడం ఎలా? మానవత్వంతో మెలగడమెలా? సమానత్వం ప్రదర్శించడమెలా? ఇదొక అద్భుతమైన సందేశం. దీన్ని అందరికీ చాటి చెప్పండి!

'నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెంటల్ హెల్త్' వారు ఇటీవల క్రీడలను నిర్వహించినప్పుడు హైదరాబాద్‌లో జరిగిన సంఘటన ఇది.



యువవాహిని

# విధ్యుక్తధర్మం

మహనీయుల జీవితాల్లో

## మధురఘట్టాలు

- డా॥ కరిమద్దెల నరసింహారెడ్డి

స్వాతంత్ర్య సంగ్రామం జరుగుతున్న రోజులలో ఒకసారి లాల్‌బహాదూర్‌శాస్త్రి కారాగారంలో ఉన్నారు. అనారోగ్యంతో బాధపడుతున్న తన కుమార్తెను చూసివచ్చేందుకు ఆయనను 'పెరోల్' మీద బయటకు వదిలారు. ఆయన ఇల్లు చేరే లోపల కుమార్తె చనిపోయింది. దహన సంస్కారాలు, ధార్మిక విధులు నిర్వహించిన తర్వాత శ్మశానవాటిక నుంచి శాస్త్రిగారు నేరుగా ఇంటికి వెళ్ళారు. స్నానం చేసిన తర్వాత ఎకాయెకిన కారాగారానికి చేరుకున్నారు. "మీకు రెండు వారాలు పెరోల్ మంజూరైంది కదా, అంత త్వరగా ఎందుకు తిరిగివచ్చారు"అని అధికారులు అడిగారు. "నా కుమార్తెకు సేవచేయడానికి నాకు రెండు వారాలు పెరోల్ మీద గడువు ఇచ్చిన మాట నిజమే. కానీ, నేను సేవ చేయడానికి ఆమె లేదు. చనిపోయింది. అందువల్ల తిరిగి వాపసు రావడం నా 'విధ్యుక్తధర్మం' అందువల్ల వచ్చాను" అన్నారు లాల్ బహదూర్ శాస్త్రి. ✸

# సొంత పనికి సొంత ఖర్చు!

అర్థశాస్త్ర రచయిత, మౌర్య చంద్రగుప్తుని గురువు, మంత్రి అయిన చాణక్యుణ్ణి కలవడానికి ఒకసారి ఓ గ్రీకు రాయబారి వచ్చాడు. చాణక్యుడు సాధారణ మైన పూరి గుడిసెలో ఉండడం చూసిన గ్రీకురాయబారి 'మౌర్య చంద్రగుప్తుని మంత్రి పూరి గుడిసెలో ఉండడమా!' అని ఆశ్చర్యపోయాడు.



చాణక్యుడు పూరి గుడిసెలో ఒక మూలన ఒక దీపం వెలుగులో ముఖ్యమైన కాగితాలు ఏవో వ్రాసుకుంటున్నాడు. గ్రీకు రాయబారిని చూసిన వెంటనే చాణక్యుడు ఆ దీపాన్ని ఆర్పివేసి, మరో దీపం వెలిగించి "రండి! కూర్చోండి. మీరొచ్చిన పని ఏమిటో చెప్పండి" అన్నాడు.

"అయ్యా! ఆ దీపాన్ని ఆర్పి ఈ దీపాన్ని మీరు ఎందుకు వెలిగించారో దయచేసి చెప్పండి" అని సందేహం వ్యక్తం చేశాడు గ్రీకు రాయబారి. "నేను దేశానికి సంబంధించిన పనులను ఆ దీపం వెలుగులో చేస్తాను. ఆ దీపం నూనె ఖర్చులను రాజు గారి ఖజానా భరిస్తుంది. ప్రస్తుతం మీరు నాతో సొంతవిషయాలు, వ్యక్తిగతంగా మాట్లాడడానికి వచ్చారు. అందుకని ఆ దీపం ఆర్పేసి, ఈ దీపం వెలిగించాను. ఈ దీపం వెలుగులో మనం మాట్లాడుకుందాం. ఈ దీపం, నూనె నా జీతం డబ్బులతో కొన్నాను" అని చాణక్యుడు వివరణ యిచ్చాడు. చాణక్యుని నిజాయతీకి, దేశభక్తికీ ఆ గ్రీకు రాయబారి ఆశ్చర్యపోయాడు. ✸

**ఎల్లప్పుడూ కార్యనిరతుడవై ఉండు. నిస్సంగుడవై పనిచెయ్యి. ఇది మీ స్వస్థలం కాదనీ, నీవు ఇక్కడ కొంతకాలం ఉండడానికి మాత్రమే వచ్చావనీ గుర్తుంచుకో! ✸**

**స్వార్థరాహిత్యం, పరహితవాంఛయే ధర్మమయ జీవితానికి గుర్తు. ఎవరు నిస్స్వార్థపరులో వారే ఆధ్యాత్మిక సంపన్నులు. అలాంటి వారే భగవంతుడికి అత్యంత ప్రీతిపాత్రులు. ✸ - స్వామి వివేకానంద**

యువవాహిని

# మనసు - మర్మం

- స్వామి బుధానంద




మనసును తమ స్వాధీనంలో ఉంచుకోవాలన్న ఆసక్తి అందరికీ ఉంటుంది. సాధారణంగా మనలో ప్రతి ఒక్కరికీ మనసు నియంత్రణ గురించి ఎంతో కొంత తెలుసు. మనందరం మనసుల్ని నియంత్రించడానికి ప్రయత్నిస్తూనే ఉంటాం. కానీ, దాని గురించి మరికొంత తెలుసుకొని, మరింత మెరుగ్గా, సమర్థంగా మనసును స్వాధీనంలో ఉంచుకోవడానికి మనం ప్రయత్నించాలి.

ఈ విషయంలో మనకు ఎవరు సహాయం చేయగలరు? ఎవరైతే తమ మనసును సంపూర్ణంగా స్వాధీనంలో ఉంచుకున్నారో వారు మాత్రమే మనకు సహాయపడగలరు! అలాంటి మహానుభావుల నుంచి మనం నేర్చుకోవలసిన విషయాలే ఇక్కడ ఒక క్రమపద్ధతిలో, సులభమైన సాధనల రూపంలో పొందుపరుస్తున్నాం.

మనోనిగ్రహం ఎంతో ఆసక్తికరమైన ఆట. అయితే అది మనకు అంతర్గతమైనది. గెలుపు ఓటములను లెక్క చేయని మనస్తత్త్వం (క్రీడాస్ఫూర్తి) ఉంటే, అప్పుడప్పుడు, తాత్కాలికంగా ఓడిపోతున్నట్లు తోచినా, ఈ ఆటను గొప్పగా ఆనందించవచ్చు. ఈ ఆట ఆడడానికి నైపుణ్యం, చురుకుదనం, హాస్యస్ఫూర్తి, మంచి హృదయం, వ్యూహాత్మక శక్తి, ధీరోదాత్తత అవసరం. అప్పుడే నూరుసార్లు అపజయం పాలైనా గుండె జారిపోకుండా నిలదొక్కుకోగలం.

అత్యున్నత యోగస్థితిని ఎలా పొందగలమో శ్రీకృష్ణుడు భగవద్గీతలో వివరించాడు. అర్జునుడు ఆయన చెప్పినది విని నిస్పృహతో భగవానుణ్ణి ఈ క్రింది విధంగా అడిగాడు. అతని నిస్పృహను మనం సులభంగా అర్థం చేసుకోవచ్చు.

"ఓ కృష్ణా! మనసు అత్యంత చంచలమైనది! నువ్వు బోధించే ఈ యోగం సంపూర్ణంగా నిశ్చలమైన మనసును కలిగివున్నప్పుడే సాధ్యం కదా! కాబట్టి ఈ యోగస్థితి మనలో ఏ విధంగా నిలిచి ఉండగలదో నాకు అర్థం కావడం లేదు. అంతేకాక, ఓ కృష్ణా! మనసు అశాంతితో అల్లకల్లోలంగా ఉంటుంది; అది శక్తిమంతమైనది, మూర్ఖమైనది. గాలిని నిగ్రహించడం ఎంత కష్టమో మనసును నిగ్రహించడం కూడా అంతే కష్టమని నాకు తోస్తున్నది" అని అర్జునుడు తన సందేహాన్ని వెలిబుచ్చాడు.

మానవులందరూ సర్వసాధారణంగా అడిగే ఈ ప్రశ్నకు సమాధానంగా శ్రీకృష్ణుడు సర్వమానవాళీ ఎల్లకాలం గుర్తుంచుకోదగిన సందేశాన్నిచ్చాడు. మనసు నియంత్రణకు సంబంధించిన భారతీయ ఆలోచనా ధోరణి, సాధనా విధానం చాలావరకూ ఈ సందేహం మీదే ఆధారపడ్డాయి. శ్రీకృష్ణుడు ఇలా చెప్పాడు: "ఓ అర్జునా! నిస్సందేహంగా మనసు ఎంతో చంచలమైనది. దాన్ని నియంత్రించడం చాలా కష్టం. కానీ అభ్యాస వైరాగ్యాల ద్వారా దాన్ని స్వాధీనం చేసుకోవచ్చు."

'అభ్యాసం', 'వైరాగ్యం' అనే ఈ రెండు మాటలలో శ్రీకృష్ణుడు మనసును స్వాధీనం చేసుకోవడానికి సంబంధించిన రహస్యాన్నంతటినీ మనకు అందించాడు.

కానీ, వాటిని మన జీవనస్రవంతిలోకి తెచ్చేది ఎలా? అదే అసలు సమస్య. దీన్ని పరిష్కరించడానికి:

1. **మనసును స్వాధీనపరచుకోవాలన్న దృఢ సంకల్పం కలిగివుండాలి.**
2. **మనసు స్వభావాన్ని అర్థం చేసుకోవాలి.**
3. **మనోనిగ్రహం కోసం క్రమం తప్పకుండా ప్రయత్నించాలి.** ✹

# మిత్రమా! లే! మేలుకో!!

**- స్వామి సేవ్యానంద**



ఈ జీవితంలో మనకు మనమే మిత్రులం, మనకు మనమే ప్రబల శత్రువులం కూడా! అందుకే, మనల్ని ఉద్ధరించడానికి ఎవరో వస్తారని ఎదురు చూడకుండా మనంతట మనమే స్వయంకృషితో ముందుకు సాగాలి. మన నిత్యజీవితంలో ఇది ఎలా సాధ్యమవుతుంది?

**బాధ్యతనంతా నీపై ఉంచుకో! :** మనం ఉన్నతమైన స్థితిలో ఉంటే దానికి బాధ్యులం మనమే. మనం నీచమైన స్థితిలో ఉంటే దానికి కూడా బాధ్యులం మనమే. అయితే మనం జీవితంలో ఏదైనా సాధిస్తే "నేనే చేశాను"అని చెప్పుకుంటాం. కానీ, మన దోషాలకూ, మనం అనుభవించే దుఃఖానికీ బాధ్యతను వేరొకరి నెత్తిపై వేస్తాం. ఇది బలహీనుల స్వభావం. ఈ బలహీనత కారణంగా వెయ్యి సంవత్సరాల సుదీర్ఘకాలం విదేశీయుల చేతుల్లో బానిసత్వం అనుభవించిన మనం ఇప్పుడు కూడా బానిసల లాగే ప్రవర్తిస్తున్నాం.

"బాధ్యతను అంతా మనపై వేసుకున్నప్పుడు మనం ఏ పని చేసినా చాలా చక్కగా, అత్యున్నతమైన రీతిలో చేయగలం" అని స్వామి వివేకానంద చెప్పారు. మనమంతా ఒక్కటై, బాధ్యత గల పౌరులుగా వ్యవహరించినప్పుడే ఈ దేశాన్ని పట్టి పీడిస్తున్న అవినీతి, అరాచకత్వం, తీవ్రవాదం లాంటి మహమ్మారులను సంపూర్ణంగా రూపుమాపగలం. శాంతికి ప్రతిరూపమైన భారతమాతను ఈ ప్రపంచానికి ఆదర్శంగా నిలపగలం.

**అనుకరణ వదలి, ఆధ్యాత్మికతను సొంతం చేసుకో! :** 1835, ఫిబ్రవరి 2వ తేదీన బ్రిటిష్ పార్లమెంట్‌లో లార్డ్ మెకాలే చేసిన ప్రసంగాన్ని ప్రతి భారతీయుడూ అప్రమత్తుడై మనస్సులో పెట్టుకోవాలి: ".....భారతదేశాన్ని జయించాలంటే దాని ఆయువుపట్టయిన ఆధ్యాత్మిక, సాంస్కృతిక సంపదలను నాశనం చేయాలి.... విదేశీ విధానమంతా మంచిదనీ, గొప్పదనీ భారతీయులు భావించినట్లయితే వారు ఆత్మాభిమానాన్నీ, సంస్కృతినీ కోల్పోతారు. అప్పుడే, మనం అనుకున్నట్లు వారిని జయించగలం".

విదేశీయులు గ్రహించిన ఈ విషయాన్ని మనం ఇప్పటికీ అర్థం చేసుకోలేక, వారినే అనుకరిస్తూ, వెన్ను విరిగిన వానపాముల్లా జీవిస్తున్నాం. ఇప్పటికైనా విదేశీ సంస్కృతి మీద వింతైన మోజును వదిలి, మనం కోల్పోయిన ఆధ్యాత్మిక సామ్రాజ్యాన్ని తిరిగి సాధించినప్పుడే పురోగతి చెందగలం.

**నీ నిజ స్వరూపాన్ని గుర్తుంచుకో! :** మనంతట మనమే ఎలా పురోగతి చెందగలం? ఈ శక్తి మనలో ఉందా?

మనలో అనంతమైన శక్తి ఉంది. సర్వశక్తి స్వరూపిణి జగన్మాత సంతానమైన మనం బలహీనులం ఎలా కాగలం? సింహం సంతానం సింహమే అవుతుంది కానీ, గొర్రె కాదు కదా! దివ్యజనని సంతానమైన మనం దివ్యపుత్రులం, మహాపురుషులం అవుతామే కానీ, ఎన్నటికీ నీచులం కాలేం. మనం ఈ పంచభూత సమ్మేళనమైన శరీరమనే భ్రమలో ఉన్నంత వరకూ బలహీనులమే అవుతాం. అయితే, మన నిజస్వరూపమైన దివ్యత్వాన్ని తలచేకొద్దీ మనం శక్తిమంతులం అవుతాం. అప్పుడు ఈ లోకంలో మనకు అసాధ్యమైనదేదీ ఉండదు. ఇదే ఆధ్యాత్మికబలం. ఈ ప్రపంచంలో ఉన్న రుగ్మతలన్నిటికీ సరైన మందు ఈ ఆధ్యాత్మిక బలమే! ఆధునిక యుగంలో పెద్దల విషయం అలా ఉంచితే, పిల్లల్లో కూడా మానసిక ఇబ్బందులు అధికం కావడం మానసిక వైద్యులను కలవరపెడుతోంది. అందుకే, చిన్నతనం నుంచే మనం ప్రోత్సాహకరమైన, శక్తిమంతమైన ఆలోచనలను ఇచ్చి, వారిలో ఆధ్యాత్మికబలాన్ని పెంచాలి. ఈ ఆధ్యాత్మిక బలంతోనే జీవితంలో వచ్చే ఇబ్బందులను మనం ఎదుర్కోగలం. ఇబ్బందులను తప్పించుకొని, పారిపోయే ప్రయత్నం చేయకూడదు. వాటిని ఎదుర్కోవాలి! ఇదే మనిషి లక్షణం.

ఈ విధంగా మనం బాధ్యతనంతా మన పైనే ఉంచుకొని, విదేశీ అనుకరణను వదిలి, ఆధ్యాత్మిక బలంతో, స్వయంకృషితో గమ్యాన్ని చేరే వరకూ ముందుకు సాగిపోవాలి. ✸

# రామకృష్ణ మిషన్ వివేకానంద విశ్వవిద్యాలయం

(యుజిసి చట్టంలోని విభాగం 3 క్రింద భారత్ ప్రభుత్వం చేత ప్రతిపాదింపబడినది)

**పి.ఒ. బేలూర్ మఠం, జిల్లా హౌరా, పశ్చిమ బెంగాల్–711 202**

## విన్నపం

*ప్రియ మిత్రులారా!*

స్వామి వివేకానంద "బేలూరు మఠంలో ప్రభవించిన ఆధ్యాత్మిక ప్రభంజన ప్రభావం 1500 సంవత్సరాల పాటు ఉంటుంది; అదొక గొప్ప విశ్వవిద్యాలయం అవుతుంది. ఇది నా ఊహ అనుకోవద్దు, నేను దర్శించి చెప్తున్నాను" అన్నారు. మరొక సందర్భంలో వారు "క్రమంగా దీనిని (బేలూరు మఠం) అనేక శాఖలలో సమర్థవంతమైన విశ్వవిద్యాలయంగా తీర్చి దిద్దడమే ప్రస్తుత లక్ష్యం" అని కూడా అన్నారు. వారు దర్శించిన ఈ విశ్వవిద్యాలయమే సుమారు ఒక శతాబ్దంగా స్వామీజీ అనుయాయులకీ, భక్తులకీ శ్రద్ధాపూర్వక ధ్యాన విషయంగా మారింది. దీని తొలిమెట్టు... యుజిసి చట్టంలోని విభాగం 3 కింద భారత ప్రభుత్వ మానవ వనరుల మంత్రిత్వశాఖ రామకృష్ణ వివేకానంద విశ్వవిద్యాలయాన్ని ప్రతిపాదించడం. ఇది 2005, జూలై 4 (స్వామిజీ మహాసమాధి చెందిన రోజు)న ప్రారంభించబడింది.

ఇతర విశ్వవిద్యాలయాలు ప్రాధాన్యతనీయని విభాగాలకు వివేకానంద విశ్వవిద్యాలయం ప్రాముఖ్యత నిస్తుంది. దిగువ సూచించిన ప్రధాన విభాగాలను ఎన్నుకోవడం జరిగింది:

I. డెసెబిలిటీ మేనేజ్ మెంట్ & స్పెషల్ ఎడ్యుకేషన్
II. ఇంటిగ్రేటెడ్ రూరల్ డెవలప్‌మెంట్, ట్రైబల్ డెవలప్‌మెంట్
III. ఇండియన్ కల్చరల్ & స్పిరిట్యువల్ హెరిటేజ్ & వేల్యూఎడ్యుకేషన్
IV. ఫండమెంటల్ సైన్సెస్–ఇంటిగ్రేటెడ్ టీచింగ్ & రిసర్చ్
V. డిజాస్టర్ మేనేజ్‌మెంట్, రిలీఫ్ & రిహాబిలిటేషన్

పైన పేర్కొన్న వాటిలో నాలుగింటిని ఇప్పటికే కోయంబత్తూరు, నరేంద్రపూర్ (ప॥బెం॥), రాంచీ (ఝార్‌ఖండ్), బేలూరు లలోను, స్వామి వివేకానందుని పూర్వీకులు గృహంలోను ఉన్న మా కేంద్రాలలో ప్రారంభించడం జరిగింది. ప్రస్తుతం దిగువ పేర్కొన్న కోర్సులు, ప్రణాళికలను ప్రవేశ పెడుతున్నాము.

1. డిసెబిలిటీ మేనేజ్‌మెంట్ అండ్ స్పెషల్ ఎడ్యుకేషన్ (అంధత్వం, బధిరత్వం, మానసిక వైకల్యం)లో బి.ఎడ్, ఎమ్.ఎడ్ కోర్సులు, ఎమ్.ఫిల్, పిహెచ్‌డి ప్రణాళికలు.

2. ఆసియాలోని ఏ విశ్వవిద్యాలయంలోనూ లేని విధంగా... మానసిక వికలాంగులకి ఒలెంపిక్స్, జనరల్ అండ్ అడాప్టెడ్ ఎడ్యుకేషన్ అండ్ యోగాలో కోర్సులు.

3. ఇంటిగ్రేటెడ్ రూరల్ డెవలప్‌మెంట్ అండ్ మేనేజ్‌మెంట్ లోనూ, ఇంటిగ్రేటెడ్ రూరల్ అండ్ ట్రైబల్ డెవలప్‌మెంట్ లోను ఎమ్.ఎస్‌సి. కోర్సులు.

4. ఎగ్రో బేస్‌డ్ బయోటెక్నాలజీలో పోస్ట్‌గ్రాడ్యుయేట్ డిప్లోమా కోర్సులు.

5. ఇంటిగ్రేటెడ్ సెల్ఫ్ డెవలప్‌మెంట్, భగవద్గీత – సాంప్రదాయిక, ఆధునిక రీతులలో వివరణ, భారతీయ ఆధ్యాత్మిక వారసత్వంలోని అత్యావశ్యక అంశాలు మొదలైన వాటిలో డిప్లొమా కోర్సులు.

6. ఉచిత భోజన, బస వసతులతో గురుకులాల్ని తలపింపచేసే రీతిలో సంస్కృతభాషలో ఇంటిగ్రేటెడ్ ఎమ్.ఎ. కోర్సు; సంస్కృత విద్యలో ఎం.ఫిల్, పిహెచ్‌డి ప్రణాళికలు.

7. వంగ సాహిత్యం, భాషా అధ్యయనాలలో ఎం.ఫిల్, పిహెచ్‌డి ప్రణాళికలు.

8. శుద్ధగణితము, సైద్ధాంతికమైన కంప్యూటర్ సైన్స్‌లలో ఎమ్.ఎస్‌సి,పిహెచ్.డి.లు సైద్ధాంతికమైన భౌతిక శాస్త్రంలో ఎమ్.ఫిల్, పిహెచ్‌డి ప్రణాళికలు.

విశ్వవిద్యాలయ అభివృద్ధి కోసం రాబోయే రెండు సంవత్సరాల లోపు, వీలైనంత త్వరలో కనీసం 25 కోట్ల రూపాయలతో ఒక శాశ్వత నిధిని ఏర్పాటు చేయాల్సి ఉంది. రామకృష్ణ వివేకానంద ఆదర్శాలను అభిమానించే భక్తులు, మిత్రులు, అనుయాయులు, శ్రేయోభిలాషులు అందర్నీ ఉదారంగా విరాళాలిచ్చి ఈ బృహత్పథకానికి తోడ్పడవలసిందిగా కోరుతున్నాము.

వివేకానంద విశ్వవిద్యాలయం కోసం పంపే విరాళాలు ఈ చిరునామాకు, వివరణ లేఖను జతపరచి పంపమనవి.

Vice Chancellor
Ramakrishna Mission Vivekananda University,
P.O. Belur Math, Dist. Howrah - 711 202, West Bengal.

చెక్కులు/ డి.డి.లు Ramakrishna Mission Vivekananda University, Belur Math లేదా RKMVERI, Belur Math పేరున వ్రాసి పై చిరునామాకు పంపవలెను. వివేకానంద విశ్వవిద్యాలయానికి ఇచ్చే విరాళాలన్నిటికీ 1961, ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80(G)లోని సబ్‌సెక్షన్ 2(a) (iiif) కింద **100% పన్ను మినహాయింపు** ఉంది.

ఈ బృహత్పథకానికి ఉదార హృదయులు విరాళాలిచ్చి సహకరిస్తారని ఆశిస్తున్నాం.

మీ సేవలో
**స్వామి ఆత్మప్రియానంద**
ఉపకులపతి



# పరిపూర్ణ విశ్వాసంతోనే ఫలితం

– ఆకెళ్ళ రాఘవేంద్ర

వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, ఇతిహాసాలు – ఇవన్నీ భారతీయ ఆధ్యాత్మిక వేదాంత తత్త్వశాస్త్రాలకు మూలకందాలు. వేదాలు – ఋతాన్ని అంటే సత్యాన్ని బోధిస్తాయి. ఉపనిషత్తులు ఆత్మజ్ఞానాన్ని ఉద్బోధిస్తాయి. పురాణ, ఇతిహాసాలు అత్యంత ప్రాచీనమైన ప్రాకృతిక అంశాలనూ, సృష్టి ప్రతిసృష్టి క్రమాన్నీ వివరిస్తాయి. కొన్ని వందల వేల సంవత్సరాల కిందటి ఈ వైదిక వాఙ్మయమంతా నేటి కాలానికి ఉపకరిస్తుందా!

వేదాలను రక్తంలోకి, ఆత్మలోకి జీర్ణం చేసుకున్న ఘనాపాఠీలను కళ్ళారా దర్శించింది నిన్నటి తరం. వేద పఠనంలోని విశిష్ట శ్రుతిని విని తరించింది ఆ తరం. వేదాలంటే ఏమిటో, ఉపనిషత్తులెన్నో, పురాణాలను ఎవరు రచించారో తెలుసుకొని మిడిమిడిజ్ఞానంతోనే మురిసి పోతోంది నేటి తరం. బహుశా ఈ పదాలనే మరచిపోతుందేమో రేపటి తరం!

అన్ని రంగాల్లోనూ అనూహ్య ప్రగతిని సాధించాం మనం. చంద్రుడిపై కాలు మోపాం. సప్త సముద్రాల ఆనుపానుల్ని చూశాం. పరమాణువులోని అనంత శక్తిని వెలికి తీశాం. ఆ దశలో ఇంతగా అభివృద్ధిని సాధించాక ఇంకా ఈ కాలంలో కూడా ఆ ప్రాచీన వైదిక వాఙ్మయం అవసరమా? అవును, అవసరమే. నాటి తరం నుంచి నేటి తరం వరకూ నిరంతరం ప్రవహించే మౌలిక సత్యం ఆ వాఙ్మయంలో దాగి ఉంది. అది సార్వకాలిక సార్వజనీన మానవ జీవిత సత్యం. ఇది నిజం. దీన్ని కాదనడం ఎవరి తరం!

కష్టం వచ్చినప్పుడు కుంగిపోకూడదు. సుఖం వచ్చినప్పుడు పొంగిపోకూడదు. సర్వకాల సర్వావస్థల్లోనూ సమదృష్టిని సాధించగల స్థితప్రజ్ఞత్వాన్ని అలవరచుకోవాలి. ఈ దేహం శాశ్వతం కాదు. అశాశ్వతమైన వాటి కోసం దుఃఖించడం వృథా. నిష్కామ కర్మను పాటించగల మానసిక పరిణతిని పొందాలి. ఇలా బోధిస్తూ సాగేదే సార్వకాలిక సార్వజనీన మానవ జీవిత సత్యం. ఎటొచ్చీ ఈశ్వరుణ్ణి ఈశాన్య మూలలో కూర్చోబెట్టినట్లు ఈ 'మానవ జీవితసత్యాన్ని' సంస్కృత శ్లోకాల మాటున దాచి ఉంచుతున్నాం. ఆ సత్యాన్ని తెలుసుకోవడమే ఇప్పుడు పరమావధి.

వేదాలు, ఉపనిషత్తులు, పురాణేతిహాసాల్లోని ఉపకథలు చదివితే మానవజీవిత దర్శనం జరుగుతుంది. వ్యక్తిత్వ వికాస ఆరోహణం తెలుస్తుంది. ఆ యా కథలే కాదు విష్ణు సహస్రనామాలు, రుద్రం, నమకమ్, చమకమ్, పురుషసూక్తం, మంత్రపుష్పం, భగవద్గీత మొదలైనవన్నీ చివరకు చెప్పేది మనిషిలోని 'ఆత్మ' శక్తిని గురించే! 'నేను – నా కుటుంబం' అనే దశ నుంచి 'నేను – వసుధైక కుటుంబం' అనే దిశలో మనిషిని ప్రయాణింపజేయడమే వీటి ఉద్దేశం.

## గజేంద్రమోక్షం – వ్యక్తిత్వ వికాసం

గజేంద్రమోక్షం కథ వినని తెలుగువారు ఉండరేమో! మహాభాగవతంలోని అష్టమ స్కంధంలోని ఉపాఖ్యానమది. గజేంద్రుడు ఒక మడుగులో మొసలి బారిన పడినప్పుడు విష్ణుమూర్తి ఆ గజరాజును ఎలా రక్షించాడన్నది ఈ కథాసారం. కానీ సంసార మాయ గురించి, విశ్వాసపు విలువ గురించి చెప్పడం ఈ కథలోని అసలు సారం.

ఈ కథ చెప్పే సత్యమేమిటి? ఈ కథలో దాగి ఉన్న నిగూఢ రహస్యాలు, జీవిత సత్యాలు ఏమిటి? ఆ నీటి మడుగు సంసార మాయకు ప్రతీక. ముందుకు సాగిపోతూన్న మానవుణ్ణి వెనక్కి లాగేసే అదృశ్యశక్తి ఈ మాయకు ఉంది. ఈ మాయా మోహిత ప్రపంచంలో అడుగడుగునా ఆకర్షించే అందమైన వస్తువులుంటాయి – ఆ మడుగులోని కలువల్లా, కమలాల్లా!! అందులోకి దిగితే మొసలి బారిన పడతాం. కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలనే అరిషడ్వర్గాలకు

ప్రతీక మొసలి. 'మడుగు'లో పడి 'మొసలి' బారిన పడితే ఇక చెప్పేదేముంది – ఆ జీవుడి వేదన!

ఆ వేదనకు పరిష్కారం ఒక్కటే – భగవత్ జ్ఞానం. 'కలడు కలడందురు... కలడో లేడో...' అని అనుమానిస్తే భగవంతుడు కదలడు; కదలి రాడు. 'నీవే తప్ప...' అంటూ పరిపూర్ణ విశ్వాసంతో శరణు వేడితే దేవదేవుడు పరుగు పరుగున వస్తాడు. ఉన్న పళంగా దిగి వస్తాడు, రక్షిస్తాడు.



బాగా చదువుకోవడం విద్యార్థి కర్తవ్యం. అతని విధి. ఆ చదువుతో ముందుకు సాగాల్సిన ఆ విద్యార్థిని సినిమాలు, షికార్లు, (స్నేహితులు, జల్సాలు) లాంటి 'మాయాప్రపంచం' ఆకర్షిస్తుంది. బలహీనుడైతే 'మడుగు'లో పడతాడు. ఆ పై మొసలి బారిన పడతాడు. దాంతో చదువు పాడయి లక్ష్యం దెబ్బ తింటుంది. జీవితం సర్వనాశనమవుతుంది.

అంతేకాదు. ఫస్టు మార్కు వస్తుందో రాదో, ర్యాంకు వస్తుందో రాదో, ఉద్యోగం వస్తుందో రాదో, ఆశయం సిద్ధిస్తుందో లేదో, ఉదాత్త వ్యక్తిత్వం పొందగలనో లేదో అంటూ సందేహ శరపరంపరతో సాగితే లాభం లేదు. వస్తుంది, వచ్చి తీరుతుంది. కచ్చితంగా నేను విజయం సాధిస్తాను. నిశ్చయంగా నాదే జయం అని పరిపూర్ణ విశ్వాసంతో సాగితే ఫలితం లభిస్తుంది. 'అల వైకుంఠపురంలో నగరిలో ఆ మూలసౌధంలో' ఎక్కడో ఉన్నా సరే విజయలక్ష్మి పరిగెత్తుకు వచ్చి వరిస్తుంది. ఇది సత్యం. ✹

# అమర భారత ప్రతిభ



## స్ట్రింగ్ సిద్ధాంతం

(String Theory)

ఆధునిక అణుభౌతిక శాస్త్రం అణువు, పరమాణువులలో ఉన్న 'Quark' కణములు, 'Lepton' కణములు అనేవి జగత్తు యొక్క ప్రాథమిక నిర్మాణాలని ఇంకా పూర్తిగా నిర్ధారణకు రాలేక పోతున్నది. ఇందుకు కారణం ఏమంటే మూడు మూలశక్తుల ఏకీకరణ – అంటే



1. విద్యుదయస్కాంత శక్తి (Electro Magnetic force)
2. ప్రబలనాభీ కేంద్రక శక్తి (Strong Nuclear force)
3. నిర్బల నాభీ కేంద్రక శక్తి (Weak Nuclear force)

వీటి ఏకీకరణతో ఈ 'Quark', 'Leptons', కణాల ప్రవర్తనా ప్రక్రియలను అవగతం చేసుకోగలిగారు. కానీ, గురుత్వాకర్షణ శక్తి (Gravitational force) ప్రభావం వీటిమీద అనుసంధానం చేసి, అర్థం చేసుకోలేకపోతున్నారు. అందుకని, ఈ మధ్య కాలంలో 'స్ట్రింగ్ థియరీ' అనే ఒక నూతన సిద్ధాంతాన్ని శాస్త్రజ్ఞులు ప్రతిపాదించారు. దీని ప్రకారం ఈ 'Quark', 'Lepton' 'కణములు' (Particles) కావనీ, అవి అతి సూక్ష్మమైన, కంపించే గుణం కలిగిన తీగల వంటివనీ నిర్ధారించారు. ఇది మహత్తరమైన నక్షత్రం నుండీ, అతి సూక్ష్మమైన పరమాణువుల వరకూ వ్యాపించి ఉందని (Super string) నిర్ధారించారు.

### భారతీయ దృక్పథం

వేదంలోని 'శతపద బ్రాహ్మణం' (8,7,3,10) ఇలా అంటున్నది : సూర్యుడు తక్కిన జగత్తు ఒక తీగవలే ఉన్నవి. ఆ 'తీగ'యే వాయువు. వాయువు అనగా, వేదార్థంలో 'గాలి' అని కాదు. 'వ్యాపించినది' అని అర్థం.

భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ ఇలా అంటాడు.

**'మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ।**
**మయి సర్వమిదం ప్రోతం సూత్రేమణిగణా ఇవ॥**

(భగవద్గీత. 7–7)

'ఒక సూత్రంలో మణులు కూర్చినట్లు ఈ జగత్తంతా నాలో ఇమిడి ఉన్నది.'

శ్రీకృష్ణ భగవానుడు చెప్పినట్లు అనంతం నుంచీ అణువు వరకూ జగత్తంతా ఒక సూత్రంలో బంధించ బడింది. దీనినే ఆధునిక శాస్త్రవేత్తలు నేడు Super string అన్నారు.

ఇలా నక్షత్రరాశి ప్రభావం అతి సూక్ష్మమైన పదార్థంతో జగత్తు నిండా అణుసంధానించ బడినప్పుడు, ఆ నక్షత్ర ప్రభావాన్ని మన జ్యోతిష్య శాస్త్రం ఏనాడో గుర్తించి, గ్రహించి విశదీకరించింది కదా!

అనాదిగా భారతీయ సంస్కృతి ప్రతి దానినీ చైతన్య పూరితంగా గుర్తించి, ఆరాధించింది. ఇది ఈ వేదభూమిలో సార్వజనీనం. ఈ దారిలోనే కదా నేటి ఆధునిక విజ్ఞానం పయనిస్తున్నది! ✸

('భారతీయ ప్రతిభా విశేషాలు' నుంచి)

**RAMAKRISHNA MISSION**
P.O. BELUR MATH, DIST. HOWRAH, WEST BENGAL - 711 202
ఫోన్ : 033– 26541144/80, Email : rkmhq@vsnl.com, Website: www.belurmath.org

# రామకృష్ణ మిషన్ పాలక వర్గ సంగ్రహ నివేదిక 2007 - 2008

**రా**మకృష్ణ మిషన్ 99వ వార్షిక సర్వ సభ్య సమావేశం 2008 డిసెంబర్ 7, ఆదివారం మధ్యాహ్నం 3.30 గంటలకు బేలూరు మఠంలో జరిగింది.

ఈ సంవత్సరం జమ్మూ – కాశ్మీర్‌లోని శ్రీనగర్‌లో ఒక కొత్త కేంద్రాన్ని రామకృష్ణ మిషన్ ప్రారంభించింది.

**విద్యారంగం:** కొన్ని ముఖ్య ప్రణాళికలు: వివేకానంద విశ్వవిద్యాలయం కోయంబత్తూరులో గల తమ శాఖా కేంద్రంలో 'జనరల్ & అడాప్టెడ్ ఫిజికల్ ఎడ్యుకేషన్ అండ్ యోగా' అనే విభాగాన్ని ప్రారంభించడం; నరేంద్రపూర్ (పశ్చిమ బెంగాల్) కేంద్రంలోని అంధ బాలుర విభాగంలో సి.డి.లపై పుస్తక ప్రచురణ కోసం 'ఆడియో బుక్ స్టూడియో'ను ప్రారంభించడం; వివేకానంద విశ్వవిద్యాలయం తమ రాంచీ (మోరాబాదీ) శాఖలో గల 'ఇంటిగ్రేటెడ్ రూరల్ అండ్ ట్రైబల్ డెవలప్‌మెంట్' విభాగంలోని 5 ఏళ్ళ ఇంటిగ్రేటెడ్ ఎమ్.ఎస్‌సి. కోర్సులో విజ్ఞానశాస్త్రానికి సంబంధించని విద్యార్థులు చేరేందుకు గాను ముందస్తుగా విజ్ఞానశాస్త్ర పరిజ్ఞానం పొందడానికి అవసరమైన రెండు కోర్సులను ప్రారంభించడం; కోయంబత్తూరు కేంద్రంలో 'సి.ఎన్.సి. (కంప్యూటరైజ్డ్ న్యూమరికల్ కంట్రోల్) ట్రైనింగ్ సెంటర్'ను ప్రారంభించడం! వీటితో పాటు పోర్ట్ బ్లెయిర్‌లోని నిరుపేద – అనాథ బాలుర వసతి గృహం; కడపలోని విద్యార్థి గృహ భవనం; విజయవాడ, చెన్నై (విద్యాపీఠం), మాల్దా, జయరామ్‌బాటీ, (పశ్చిమ బెంగాల్‌లోని) రహరా కేంద్రాలలోని పాఠశాల భవనాల నిర్మాణాలను పూర్తిచేయడం జరిగింది.

**వైద్యరంగం:** కొన్ని ముఖ్య ప్రణాళికలు: సేవాప్రతిష్ఠాన్ కేంద్రంలో ఫిజియోథెరపీ, ఆప్టోమెట్రీలలో పట్టవిద్య (BPT; BO ptom)ను ప్రారంభించడం; లక్నో సేవాశ్రమలో 13 పడకలున్న నెఫ్రాలజీ విభాగం, కార్డియాక్ కేథరైటైజేషన్ ప్రయోగశాల, వాస్తవమైన ప్యాథాలజీ మ్యూజియమ్; నరేంద్రపూర్ కేంద్రంలోని అంధ బాలుర విభాగంలో విజన్ సెంటర్, క్లినిక్; బెల్గామ్ (కర్ణాటక) కేంద్రంలో ఒక ఉచిత నేత్ర వైద్యశాల; సేవా ప్రతిష్ఠాన్‌లోని 7 అంతస్థుల విస్తృత భవన నిర్మాణం, ఆలో (అరుణాచల్‌ప్రదేశ్‌లోని)కేంద్రంలోని విద్యార్థి వసతి గృహం కోసం 10 పడకల వైద్యశాల నిర్మాణం, కంఖల్ వైద్య కేంద్రానికి వచ్చే రోగుల బంధువులు, సేవకుల కోసం మూడు అంతస్థుల భవన నిర్మాణాలను పూర్తి చేయడం జరిగింది.

**గ్రామీణ అభివృద్ధి రంగం:** కొన్ని ముఖ్య ప్రణాళికలు: వివేకానంద విశ్వవిద్యాలయం దూర–విద్య (టెలీ–ఎడ్యుకేషన్), దూర–చికిత్స లాంటి సేవలను కలిపించడం కోసం వివేక్ దిశ (VIVEK DISHA) పథకంలో భాగంగా 14 గ్రామీణ సహాయక కేంద్రాలను ప్రారంభించడం; నరేంద్రపూర్ కేంద్రంలోని లోకశిక్షాపరిషత్తు ద్వారా బయోటెక్నాలజీ ప్రోగ్రామ్, బంజరు భూముల అభివృద్ధి, పాఠశాల పారిశుద్ధ్యం, ఆరోగ్య పరిరక్షణ, మొదలైన అనేక కార్యక్రమాలు, కడప కేంద్రంలో గ్రామీణ ఉన్నత పాఠశాలల బాలురకు ఉచిత విద్యార్థి వసతి గృహం, అరుణాచల్ ప్రదేశ్‌లోని ఆలో కేంద్రం ద్వారా చుట్టుప్రక్కల నాలుగు గ్రామాలలో అనియత పాఠశాలల్ని ప్రారంభించడం, రాంచీ (మోరాబాదీ) కేంద్రంలో గ్రామీణ అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టడం జరిగింది.

**రామకృష్ణ మఠంలోని అభివృద్ధి కార్యక్రమాలు:** పశ్చిమ బెంగాల్‌లోని బాగ్దాలో కొత్త కేంద్రం ప్రారంభమైంది; రాజ్‌కోట కేంద్రంలో ఒక ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ లాంగ్వేజెస్, బెంగుళూరులోని అల్సూరు కేంద్రం బెంగుళూరు నగర శివార్లలోని ఒక గ్రామంలో నాలుగు అంతస్థుల వైద్యశాల, 70 శౌచాలయాల నిర్మాణం, కేరళలోని కాలడి కేంద్రంలో మూడు అంతస్థుల విస్తృత పాఠశాల భవన ప్రారంభం.

**విదేశాలలో అభివృద్ధి కార్యక్రమాలు :** బంగ్లాదేశ్‌లోని కోమిల్లాలో మిషన్ ఒక కొత్త కేంద్రాన్ని ప్రారంభించింది. దక్షిణ ఆఫ్రికాలోని దర్బన్ కేంద్రం ఒక పెద్ద వైద్యశాల, దుఃఖితులైన మహిళల సహాయక కేంద్రం, ఒక కుటుంబ సంక్షేమ కేంద్రం, జీవిత చరమాంకంలో ఉన్న రోగుల కోసం ఒక భవన నిర్మాణం ప్రారంభించింది. బంగ్లాదేశ్‌లోని సిలెట్ కేంద్రం బంగ్లాదేశ్ టెక్నికల్ ఎడ్యుకేషన్ బోర్డ్‌కు సంబంధించిన మూడు కంప్యూటర్ ట్రైనింగ్ కోర్స్‌లను ప్రారంభించింది.

**పునరావాస కార్యక్రమాలు:** ఈ సంవత్సరంలో 3.97 కోట్ల రూపాయల వ్యయంతో పునరావాస కార్యక్రమాల్ని చేపట్టింది.

**సంక్షేమ పథకాలు:** పేద విద్యార్థులకు, వృద్ధుల కోసం 7.08 కోట్లు; గ్రామీణ గిరిజనుల కోసం రూ.23.01 కోట్ల వ్యయంతో అనేక అభివృద్ధి పథకాలను చేపట్టడం జరిగింది.

**వైద్యసహాయం:** వైద్యరంగంలో రూ. 69.44 కోట్ల వ్యయంతో 76.67 లక్షల మందికి వైద్యసేవలు అందించింది.

**విద్యారంగంలో:** మా విద్యాసంస్థల్లోని సుమారు 4.05 లక్షల మంది విద్యార్థుల కోసం రూ. 126.72 కోట్ల వ్యయం అయింది.

నిరంతరం తమ సహాయ సహకారాలను అందిస్తున్న సభ్యులకూ, మిత్రులకూ, శ్రేయోభిలాషులకూ మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు తెలుపుతున్నాం.

ధన్యవాదాలతో

భగవత్సేవలో
**స్వామి ప్రభానంద**
ప్రధాన కార్యదర్శి

ఆచార వ్యవహారాలు - అంతరార్థాలు- 36

- రెంటాల జయదేవ

(...గత సంచిక తరువాయి)



# ఫలితాలనిచ్చే పుష్పాలు!

### ప్రాచీన గ్రంథాల్లో పుష్పాల ప్రాముఖ్యం

పుష్పాలు దేవతలందరికీ ఎంతో ప్రీతికరమైనవి. అందుకే, పూజలో మనం తప్పనిసరిగా పుష్పాలను వినియోగిస్తుంటాం. పుష్పాల పరిమళం దేవీదేవతలకు సంతోషం కలిగింప జేస్తుందని పెద్దల మాట. చూడముచ్చట కలిగించే పుష్పాలను భగవంతుడికి సమర్పించడం కన్నుల పండుగగా ఉంటుంది. అంతేకాకుండా అవి ఆనందానికీ, సంతృప్తికీ ప్రతీకగా నిలుస్తాయి.

పుష్పాల గురించి 'కులార్ణవ తంత్రం'లో ఇలా పేర్కొన్నారు: ***'పుణ్య సంవర్ధనాచ్చాపి పాపౌఘ పరిహారతః పుష్కలార్థ ప్రదానార్థం పుష్ప మిత్యభిధీయతే ।'*** 'పుణ్యాన్ని పెంపొందింప జేసి, పాపాన్ని పరిహరించి, అనేక ప్రయోజనాలను కలిగిస్తుంది కాబట్టి, దాన్ని 'పుష్పం' అంటారు.'

ఇక, 'శారదా తిలక'మనే గ్రంథం ***'దైవస్య మస్తకం కుర్యా త్కుసుమోపహితం సదా ।'*** అని చెబుతోంది. అంటే, 'దేవుని శిరస్సును సదా పుష్పాలతో అలంకరించాల'న్న మాట!

ఇక, 'విష్ణు నారదీయం', 'ధర్మోత్తర పురాణం' ఇలా చెబుతున్నాయి:

*పుష్పై ర్దేవాం ప్రసీదన్తి పుష్పైః దేవాశ్చ సంస్థితాః*
*న రత్నైర్న సువర్ణేన న విత్తేన చ భూరిణా*
*తథా ప్రసాద మాయాతి యథా పుష్పైర్జనార్దన ।*

'బంగారం కానీ, రత్నాలు కానీ సమర్పించినప్పటి కన్నా, పుష్పాలు సమర్పించినప్పుడు దేవతలు ఎంతో సంతుష్టి చెందుతారు.'

### పూజించే పుష్పాన్ని బట్టి ఫలితం

మనం పూజకు ఎంచుకొనే పువ్వును బట్టి కూడా ప్రత్యేక ఫలితాలు సిద్ధిస్తాయి. ఆసక్తికరమైన ఈ అంశానికి సంబంధించి వివరాలు:

1. పవళ మల్లె పుష్పాలతో పూజిస్తే – మంచి ఆలోచనలు, మంచి కోరికలు కలుగుతాయి.
2. మంగిషం పుష్పాలతో పూజిస్తే – ఓర్పు, సహనం పెరుగుతాయి. శాంతి కలుగుతుంది.
3. విరుచి పుష్పాలతో పూజ చేస్తే – శరీరంలోని వేడిని తగ్గించి, మనస్సును ప్రశాంతంగా ఉంచుతుంది.
4. ఎరుకు పుష్పాలతో పూజ చేయడం – మనలోని అధైర్యాన్ని పోగొట్టి, ఆత్మ స్థైర్యాన్ని కలిగిస్తుంది.
5. అరళి పుష్పాలతో పూజించడం – సత్యసంధతను పెంపొందిస్తుంది.
6. తెల్ల తామరలతో పూజిస్తే – భక్తిని ప్రేరేపిస్తుంది.
7. తులసీ దళాలతో పూజ చేయడం – భక్తిని పెంచుతుంది. ఆధ్యాత్మిక మార్గాన్ని చూపుతుంది.
8. గన్నేరు, జీవంతి పుష్పాలతో పూజించడం వల్ల – దైవం మీద భక్తి పెరుగుతుంది. ముక్తి లభిస్తుంది.
9. దవనంతో పూజ చేయడం – వ్యర్థమైన కోరికలను అణచివేసి, సంతోషకరమైన జీవనాన్ని ప్రసాదిస్తుంది.
10. మల్లెపూలతో పూజ – పాపప్రక్షాళన చేస్తుంది. బుద్ధిని నిష్కల్మషంగా ఉంచుతుంది.
11. సంపెంగ పూలతో పూజించడం – అన్ని రంగాల్లో అభివృద్ధిని చేకూరుస్తుంది.
12. నాగలింగ పుష్పాలతో పూజ వల్ల – ఆర్థిక పరిస్థితి మెరుగవుతుంది.
13. ఎర్రమల్లి పుష్పాలతో పూజించినట్లయితే – సకల సంపదలకూ అధిదేవత అయిన శ్రీమహాలక్ష్మి కటాక్షం సిద్ధిస్తుంది.
14. తామర, శంఖ పుష్పాలతో పూజిస్తే – అష్టైశ్వర్యాలు కలుగుతాయి.
15. మారేడు దళాలతో పూజించినట్లయితే – జ్ఞానైశ్వర్యం కలుగుతుంది. ముక్తి లభిస్తుంది. ✸

('ఏ దేవుడికి ఏ పుష్పం పనికిరాదంటే...' వచ్చే సంచికలో...)

...17వ పేజీ తరువాయి.


8
అయ్యా! బాధ పడకండి. గురుదేవులు మిమ్మల్ని తప్పకుండా క్షమిస్తారు.
నేను చేసిన పని నాకే నచ్చలేదు. భగవంతునికి ఇష్టంలేని పని చేసిన తర్వాత నేనింకా ప్రాణాలతో ఎందుకు ఉండాలి.
9
ఇలా సురేంద్రుడు తన గదిలో కలవరపడుతున్నాడు.
ఇంతలో త్రైలోక్యుడనే భక్తుడు పాడటం మొదలు పెట్టాడు. గురుదేవులు ఆ పాటకు తగ్గట్టుగా భక్తులందరితో కలసి నృత్యం చేయసాగారు.
10
అప్పుడు ఒక సంఘటన జరిగింది. గురుదేవులు తాను తీసిపారేసిన పూలమాలను మళ్ళీ తమ మెడలో ధరించారు. అంతే కాకుండా ఆ పూలమాలను చేత్తో పట్టుకొని నృత్యం చేయసాగారు.
11
సురేంద్రబాబూ, ఇలా వచ్చి చూడండి, గురుదేవులు మీరు వేసిన పూలమాలను మళ్ళీ ధరించి నృత్యం చేస్తున్నారు.
(సురేంద్రుడు సంతోషంగా) ఆహా! గురుదేవులకి ఎంత కరుణ! నా అహంకారమే వారి కృపా కటాక్షానికి అడ్డుగా నిలచింది. దానిని నాకు అర్థమయ్యేలా చేసి నన్ను ఆదుకొన్న గురుదేవులకు కోటి నమస్కారాలు.











గురుదేవుల అవసరాల్ని తీర్చిన నలుగురు ప్రధాన శిష్యులలో సురేంద్రుడు ఒకడు. గురుదేవుల మహాసమాధి తర్వాత కూడా అతను శ్రీరామకృష్ణుల శిష్యులకు తన సహాయ సహకారాల్ని అందించాడు. “ప్రపంచంలో శ్రీరామకృష్ణ మఠ కేంద్రాలు పలుచోట్ల నెలకొనడానికి నాంది పలికిన వాడు సురేంద్రుడే” అని కీర్తించారు మహేంద్రనాథ్ గుప్తా (మ). ✸

# గ్రంథ పరిచయం




హైదరాబాద్ రామకృష్ణ మఠం వారి

## నూతన ప్రచురణలు

ప్రతులకు : తెలుగు ప్రచురణల విభాగం
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్- 500 029
Email : rktelugubook@gmail.com
ఫోన్.నెం. 040 - 2763 1149




## భావ చైతన్యం

**(వ్యక్తి నిర్మాణానికి విద్య, పౌరసత్వం, ఆధ్యాత్మికత)**

**ఆంగ్లమూలం : స్వామి రంగనాథానంద**
**అనుసృజన, సంకలనం : నందిరాజు సుబ్రహ్మణ్య శర్మ**
**పేజీలు : 175, వెల : 20/-**

**రా**మకృష్ణమఠం, మిషన్‌ల పదమూడవ సర్వాధ్యక్షులు స్వామి రంగనాథానంద మహరాజ్ జ్ఞానవరిష్ఠులు. అపర వివేకానందగా ప్రపంచమంతా నీరాజనాలందుకున్న ఆ మహనీయులు సమాజానికి ప్రసాదించిన అద్భుతమైన బోధనామృతం 'మారుతున్న సమాజానికి శాశ్వత విలువలు' నాలుగు సంపుటాలుగా గతంలో విడుదలై విశేష ఆదరణను చూరగొంది. ఆ గ్రంథరాజాల్లోని కొన్ని ముఖ్య అంశాల సంకలనమే ఈ 'భావ చైతన్యం'. ✹

## జ్ఞాన తేజం

(The Spark of wisdom)

**స్వామి రంగనాథానందజీ 'గీతా సందేశం' నుంచి సేకరణ.**
**పేజీలు : 96, వెల : 5/-**

**స్వా**మి రంగనాథానందజీ భగవద్గీత ప్రసంగాల సారం 'భగవద్గీతా సందేశం'. భగవద్గీతను నిత్యజీవితంలో ఎలా అనుష్ఠింప చేయాలో వారు వివరించారు. ఆ గ్రంథరాజంలోని జ్ఞానామృత బిందువులను 'జ్ఞానతేజం' పేరుతో ద్విభాషలతో కలిపి రామకృష్ణమఠం విడుదల చేసింది. ఆంగ్లమూలం తరువాత తెలుగు అనువాదంతో కలిపి ఈ పుస్తకం స్వామి రంగనాథానంద శతజయంతి ఉత్సవాలలో ఆవిష్కరణకు నోచుకుంది. ఆ జ్ఞానతపస్వి భావాలు పాఠకులకు మరింత చేరువయ్యేందుకు ఈ 'జ్ఞానతేజం' ఎంతో సాయపడుతుంది. ✹

**- బి. సైదులు**




**శ్రీ గణపతి**
తత్త్వము, స్తోత్రములు
పేజీలు : 86
వెల : 10/-




**శివమహిమ్నః స్తోత్రమ్**
(తాత్పర్య సహితము)
పేజీలు : 47
వెల : 6/-




**లక్ష్మీదేవి**
తత్త్వము, స్తోత్రములు
పేజీలు : 83
వెల : 12/-




**సరస్వతీ దేవి**
తత్త్వము, స్తోత్రములు
పేజీలు : 89
వెల : 12/-




**పార్వతీదేవి-దుర్గాదేవి**
తత్త్వము, స్తోత్రములు
పేజీలు : 121
వెల : 15/-

*గమనిక :* ✹ **ఈ పుస్తకాల కోసం పై చిరునామాను సంప్రతించవలెను.**

✹ **పై పుస్తకాలను పోస్ట్‌లో పొందగోరేవారు పోస్ట్ ఖర్చుల నిమిత్తం రూ.20/- అదనంగా పంపవలెను.**

# వార్తావాహిని



## 'వివేకానంద విద్యా విహార్'లో వ్యక్తిత్వవికాస సదస్సులు

**విజయవాడ రామకృష్ణ మిషన్** 2008 డిసెంబరు 5,6,7 తేదీలలో యువజన, ఉపాధ్యాయుల, తల్లితండ్రుల సదస్సులను 'వివేకానంద విద్యా విహార్' సీతానగరంలో నిర్వహించింది. ఈ సదస్సుల్లో 1400 మంది విద్యార్థులు, 300 మంది ఉపాధ్యాయులు, 400 మంది తల్లితండ్రులు పాల్గొన్నారు. మూడు రోజులపాటు జరిగిన ఈ కార్యక్రమాల్లో చెన్నై వివేకానంద కాలేజ్, స్వామి ఆత్మఘనానందజీ; పూణె రామకృష్ణ మఠం, స్వామి సువిజ్ఞేయానందజీ; గుంటూరు, డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి; బాపట్ల, శ్రీ అమిరపు నటరాజన్ పాల్గొని స్ఫూర్తిదాయక సందేశాన్నిచ్చారు.

యువజన సదస్సు ప్రారంభ ఉపన్యాసంలో విజయవాడ మునిసిపల్ కమీషనర్ శ్రీ ప్రద్యుమ్న, ఐ.ఏ.ఎస్., 'మనకు సుఖశాంతుల్ని ఇచ్చేవి చదువు, హోదా, ధనం కాదు. స్వామి వివేకానంద సూచించిన ఆధ్యాత్మికతను అలవరచుకుంటేనే జీవితంలో నిజమైన ఆనందం పొందగలం'అని పేర్కొన్నారు. ఈ సదస్సుల్లో ఆద్యంతం ఎంతో క్రమశిక్షణతో పాల్గొని, విజయవంతం చేసిన ప్రతినిధులందరికీ విజయవాడ రామకృష్ణ మిషన్ కార్యదర్శి స్వామి శశికాంతానందజీ అభినందనలు తెలిపారు. ✹

– నివేదిక : స్వామి సుప్రియానంద.



## సత్సంగ కార్యక్రమం

**శ్రీకాకుళం జిల్లా, చెట్లతాండ్ర శ్రీరామకృష్ణ సేవాశ్రమం** 2008 నవంబరు 12వ తేదీన 'కార్తీకమాస నగర సంకీర్తనం' ముగింపు సందర్భంగా సత్సంగ కార్యక్రమం నిర్వహించింది. వివిధ గ్రామాలకు చెందిన 1500 మంది భక్తులు పాల్గొన్న ఈ కార్యక్రమానికి విశాఖపట్నం రామకృష్ణ మిషన్ కార్యదర్శి స్వామి అమృతానందజీ అధ్యక్షత వహించారు. పూజ్య స్వామీజీ శ్రీరామకృష్ణ పరమహంస అవతార విశిష్ఠతను, వారి బోధనల సారాంశాన్ని సోదాహరణంగా వివరించారు. ఈ సందర్భంగా పేదలకు వస్త్రదానం, అన్నదానం చేశారు. ✹

– నివేదిక : అట్టాడ నరసింహమూర్తి

## విశాఖపట్నంలో స్వామి రంగనాథానందజీ శతజయంతి ఉత్సవాలు

**భా**రతీయ సనాతన ధర్మాన్నీ, శ్రీరామకృష్ణ – వివేకానంద సందేశాన్నీ ప్రపంచ దేశాలకి అందించిన రామకృష్ణ మఠం, మిషన్‌ల 13వ సర్వాధ్యక్షులు స్వామి రంగనాథానందజీ మహరాజ్ (15.12.1908 – 25.4.2005) శతజయంతి ఉత్సవాలను విశాఖపట్నం శ్రీరామకృష్ణ– వివేకానంద భక్త బృందం 2008 డిసెంబర్ 9వ తేదీన ఆంధ్రా యునివర్సిటీ ప్లాటినమ్ జూబ్లీ హాల్‌లో ఘనంగా నిర్వహించింది.

ఈ కార్యక్రమంలో విశాఖపట్నం రామకృష్ణ మిషన్ ఆశ్రమ కార్యదర్శి, స్వామి అమృతానందజీ; హైదరాబాదు రామకృష్ణ మఠం, స్వామి శ్రీకాంతానందజీ; కలకత్తా బేలూరు మఠం, స్వామి అసీమాత్మానందజీ; రాజమండ్రి రామకృష్ణ మఠం, స్వామి అచింత్యానందజీ; విశాఖపట్నం రామకృష్ణ మిషన్ ఆశ్రమ, స్వామి గుణేశానందజీ పాల్గొని 'పూజ్య స్వామి రంగనాథానందజీ మహరాజ్ జీవితం, సందేశం'పై ప్రసంగించారు. ✹ – నివేదిక : ఎమ్. సత్యనారాయణ రాజు



# మహనీయుని స్మరణలో శత జయంతి ఉత్సవాలు



**రా**మకృష్ణ మఠం, మిషన్‌ల 13వ సర్వాధ్యక్షులైన స్వామి రంగనాథానందజీ మహరాజ్ (15.12.1908 – 25.4.2005) వారి శత జయంతి ఉత్సవాలను **'స్వామి రంగనాథానందజీ మహరాజ్ శతజయంతి ఉత్సవాల పౌర సంఘం'** 2008 డిసెంబరు 15న హైదరాబాద్ రవీంద్రభారతిలో ఘనంగా నిర్వహించింది. ఆ రోజు ఉదయం 8.30 గంటలకు సుందరంగా అలంకరించిన రంగనాథానందజీ చిత్రపటాన్ని భక్తులు ఊరేగింపుగా హైదరాబాద్ దోమల్‌గూడలో నెలకొన్న రామకృష్ణ మఠం నుంచి రవీంద్రభారతికి తీసుకువెళ్ళారు. ఉదయం 10 గంటలకు శ్రీశరత్ గుప్తా భజనలతో కార్యక్రమం ప్రారంభమైంది. ఈ కార్యక్రమంలో రామకృష్ణ మఠ స్వామీజీలు, భక్తులు, అతిథులు పాల్గొని పూజ్య స్వామీజీతో తమ అనుభవాలనూ, అనుభూతులనూ అందరితో పంచుకొన్నారు. ముంబయికి చెందిన శ్రీ సూర్య భట్టాచార్య భక్తి సంగీతంతో మధ్యాహ్న కార్యక్రమం ప్రారంభమైంది. తదనంతరం 'భాగవత తత్త్వం'పై డాక్టర్ గరికపాటి నరసింహారావు ప్రసంగించారు. సాయంత్రం జరిగిన సభలో పద్మభూషణ్ జస్టిస్ ఎమ్.ఎన్. వెంకటాచలయ్య ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. ఈ సందర్భంగా రంగనాథానందజీపై స్మరణ సంచికను విడుదల చేశారు. అంతకు ముందు రోజు కోల్‌కతాలో విడుదలైన ప్రత్యేక తపాలా బిళ్ళను ఇక్కడ కూడా విడుదల చేశారు. శ్రీ భాగవతుల సేతురామ్ వారి బృందంచే భగవద్గీత కూచిపూడి నృత్యరూపకం ప్రదర్శించబడింది. సుమారు 1000 మంది భక్తులు పాల్గొన్న ఈ కార్యక్రమానికి స్వామి జితాత్మానందజీ, ఆత్మవిదానందజీ, జ్ఞానదానందజీ, బ్రహ్మస్థానందజీ, శ్రీకాంతానందజీ, బోధమయానందజీ, శ్రీ కందుకూరి శివానందమూర్తి తదితరులు విచ్చేశారు. ♊

**నివేదిక:** ప్రేమ్‌కుమార్, ఉత్సవ నిర్వాహక కార్యదర్శి.





Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

# సుబోధ

బ్రహ్మసాక్షాత్కారానికి భగవన్నామమే చాలని ఒక ధర్మబోధకుడు పలుకగా శ్రీరామకృష్ణులు ఇలా అన్నారు: "నిజమే, భగవంతుడి దివ్యనామం అఖండశక్తిమంతం, సందేహంలేదు; కానీ భగవంతుడి కోసం పరితపించాలి. కామినీ కాంచనాల మీద మనసు నిలుపుకొని భగవన్నామస్మరణ చేస్తే లాభం ఏమిటి? కేవలం మంత్రంతో తేలుకాటు నొప్పిపోదు, ఆవుపేడ పొగకూడా అక్కడ వెయ్యాలి. ఒక్కసారి భగవన్నామాన్ని ఉచ్చరిస్తే చాలు మానవుడి సమస్త పాపాలూ హరించిపోతాయి, సంశయంలేదు. కానీ వెంటనే మానవుడు మరలా పాప కృత్యాలను ఎందుకు చేస్తున్నాడు? నేను ఎట్టి పరిస్థితుల్లోనూ పాపకార్యాల్ని చేయను అనే దృఢ సంకల్పం లేకపోవడం వల్ల మానవుడు పదే పదే పాపాలు చేస్తున్నాడు.



గంగాస్నానం సమస్త పాపహారం. మానవుడు గంగలో స్నానం చేస్తున్నప్పుడు అతడు చేసిన పాపాలన్నీ నది ఒడ్డునున్న చెట్టు మీద కూర్చుంటాయి. అతడు స్నానంచేసి బయటకు రాగానే చెట్టుమీద ఉన్న ఆ పాపాలు తిరిగి అతడి భుజాల మీదకి వాలతాయి. కాబట్టి నిజమైన భక్తిభావం కలుగచెయ్యమనీ, పేరు ప్రతిష్ఠలు, శరీరసుఖాలు మొదలైన తుచ్ఛక్షణిక విషయాల్లోని మోహం క్షీణింపచెయ్యమనీ, భగవంతుణ్ణి వేడుకొంటూ సదా అతడి నామస్మరణ చెయ్యాలి.

నలుసంత నిప్పు పడగానే కొండంత దూది తగులబడి బూడిదైపోయే విధంగా పవిత్ర భగవన్నామాన్ని భక్తితో కీర్తించినంతనే పాపరాసులన్నీ దగ్ధమైపోతాయి. ❖

('శ్రీరామకృష్ణ బోధామృతం' నుంచి)

**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద**
సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**

# సురభి

మధ్యాహ్నం సుమారు ఒంటిగంటకు మాతృదేవి కాశీలోని అద్వైతాశ్రమానికి విచ్చేశారు. కాసేపు అక్కడ గడిపిన తరువాత కిరణ్‌బాబు కొత్త ఇంటి(లక్ష్మీనివాస్)కి వెళ్ళారు. ఆ ఇల్లు ఆశ్రమానికి చాలా దగ్గరలో ఉంది. విశాలమైన వసారా చూడగానే మాతృదేవి "భాగ్యవంతుడు కాకుంటే ఇలాంటి ఇల్లు లభించదు. చిన్న చోట నివసిస్తే మనసు సంకుచితమైపోతుంది. విశాలమైన చోట నివసిస్తే మనసు కూడా విశాలమవుతుంది''అని వ్యాఖ్యానించారు.

మర్నాడు ఉదయం మాతృదేవి పల్లకీలో వెళ్ళి విశ్వనాథుణ్ణి, అన్నపూర్ణను దర్శించారు. రెండు రోజుల తరువాత మళ్ళీ అద్వైతాశ్రమానికి వెళ్ళారు. సేవాశ్రమానికి కూడా వెళ్ళారు. రాజా మహరాజ్ (స్వామి బ్రహ్మానంద), హరి మహరాజ్ (స్వామి తురీయానంద), చారుబాబు, డాక్టర్ కంజీలాల్ తదితరులు అప్పుడక్కడ ఉన్నారు. కేదార్‌బాబు (స్వామి అచలానంద) పల్లకీతో పాటు వెళ్ళి ఆసుపత్రిలో చికిత్స పొందుతున్న రోగులను మాతృదేవికి చూపించారు. అంతా చూసిన తరువాత మాతృదేవి దక్షిణం వైపు వసారాలోకి వెళ్ళి కూర్చున్నారు. కేదార్‌బాబుతో ఆశ్రమ నిర్వహణను ప్రశంసిస్తూ ఇలా అన్నారు:

"ఇక్కడ శ్రీరామకృష్ణులు నెలకొని ఉన్నారు. సాక్షాత్తూ శ్రీమహాలక్ష్మి అనుగ్రహం సంపూర్ణంగా ఉంది."

మాతృదేవి తమ బసకు తిరిగి వెళ్ళిపోయిన కొంతసేపటికి ఒక భక్తుడు సేవాశ్రమానికి వచ్చి, ఒక పది రూపాయల నోటు ఇచ్చి "ఈ పది రూపాయలను మాతృదేవి సేవాశ్రమానికి విరాళంగా ఇచ్చారు"అని చెప్పాడు.

ఆ పది రూపాయల నోటును ఇప్పటికీ కాశీ రామకృష్ణ సేవాశ్రమంలో పదిలపరచి ఉంచారు. ❖

**(స్వామి అరూపానంద స్మృతుల నుంచి)**



ఆధ్యాత్మిక అమృతవాహిని
# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 66 సంచిక: 3 మార్చి 2009

**సర్వే భవంతు సుఖినః సర్వే సంతు నిరామయాః ।**
**సర్వే భద్రాణి పశ్యంతు మా కశ్చిద్ దుఃఖభాగ్ భవేత్ ॥**

అందరూ సంతోషంగా ఉండాలి. అందరూ సంపూర్ణ ఆరోగ్యంతో జీవించాలి.
మంచియేదో, సన్మార్గమేదో అందరూ తెలుసుకోవాలి.
ఎవరూ బాధలకు గురికాకుండా ఉండాలి.






## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**............ రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాత పేరు చిరునామా | రూ. |
|---|---|---|
| రాజ పోషకులు | : శ్రీ జి.ఎస్. రామచంద్రమూర్తి, విద్యుత్ కాలనీ, రాజమండ్రి - 533 106 | 5,000 |
| పోషకులు | : శ్రీ ఎ. జనార్ధనాచార్యులు, అంగర, తూర్పు గోదావరి జిల్లా - 533 307 | 1,100 |
| " " | : శ్రీ బిజ్జల నారాయణ, తొర్రూరు, వరంగల్ జిల్లా - 506 163 | 1,000 |
| " " | : శ్రీ గోపాలకృష్ణ, శివాజీనగర్, హెచ్.బి. కాలనీ, అనంతపురం -515 001 | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం.

భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో

అధ్యక్షులు

**ముఖచిత్రం :** విశ్వంలోని శోభ అంతా వసంత ఋతువు ఆగమనంతోనే ప్రారంభమవుతుంది. చిగురించిన చెట్లు, లతలతో వికసించిన పూలు, చల్లని గాలులతో ఉగాది నాటి సూర్యోదయ శోభతో 'వసంత లక్ష్మి' గోచరిస్తుంది. అందరికీ ఆహ్లాదాన్నిచ్చే ఆ వసంత లక్ష్మిని 'శ్రీ రామకృష్ణ ప్రభ' ముఖచిత్రంగా పాఠకులకు అందిస్తున్నాం. చిత్రకారుడు : దాకోజు శివప్రసాద్, హైదరాబాద్



| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 365 |

గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి. పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకి కుడి భాగంలో మీ చందా గడువు నెల పొందుపరచబడి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ చేయబడుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

- సర్క్యులేషన్ మేనేజర్




**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com

సంపాదకీయం

# ఆదర్శ జీవనం అనుసరణీయం!

సమాజంలో నీతి నియమాలతో ధర్మబద్ధంగా జీవితాన్ని కొనసాగించాలనుకొనేవారు ఎన్నో సమస్యలను ఎదుర్కోవలసి వస్తుంది. మరెన్నో క్లిష్ట పరిస్థితులను అధిగమించాల్సి వస్తుంది. విలువలకే ప్రాధాన్యమిస్తూ ఆధ్యాత్మిక మార్గంలో పయనించాలనుకొనే వారికి జీవితం మరింత క్లిష్టంగా పరిణమిస్తుంది.

ఆధ్యాత్మిక జీవితాన్ని, సామాజిక జీవితంతో అనుసంధానం చేసి ముందుకు సాగడం నిజంగా సాహసంతో కూడిన పనే అనడంలో సందేహం లేదు. సత్యధర్మాలను ఆచరించేవారు ఏ విషయంలో ఎలా వ్యవహరించాలో, ఏ పరిస్థితుల్లో ఎలాంటి నిర్ణయం తీసుకోవాలో, ఎవరితో ఎలా ప్రవర్తించాలో లాంటి ఎన్నో సందేహాలతో సతమతమవుతుంటారు.

ఒక వ్యక్తి నిజాయతీగా వ్యాపారం చేయాలని నిర్ణయించుకున్నాడు. కానీ కొన్ని సందర్భాల్లో అబద్ధం చెప్పకపోతే వ్యాపారమే దివాలా తీయాల్సి వస్తుంది. అలాంటప్పుడు అతడు పరిస్థితులకు తలొగ్గి అసత్యం చెప్పాలా? లేక సత్యానికే కట్టుబడి ఉండాలా?

ఒకడు ఓ కంపెనీలో గుమస్తాగా పనిచేస్తున్నాడు. ఆ కంపెనీ యజమాని, అతణ్ణి తప్పుడు లెక్కలు వ్రాయమని ఆజ్ఞాపిస్తాడు. ఆ పరిస్థితుల్లో ఆ యజమాని కోరికను మన్నించి తప్పుడు లెక్కలు వ్రాయాలా? లేక నిజాయతీగా జీవించాలని నిర్ణయించుకొని ఉద్యోగానికి రాజీనామా చేయాలా?

ఒక కార్యాలయంలో ఉద్యోగులంతా లంచం తీసుకుంటున్నారు. ఒకతను మాత్రం లంచం తీసుకోకుండా నిజాయతీగా ఉండాలనుకున్నాడు. కానీ లంచం తీసుకోవాల్సిందిగా సహోద్యోగులంతా అతని మీద ఒత్తిడి చేస్తున్నారు. అప్పుడు ఆ ఉద్యోగి పరిస్థితులకు రాజీపడాలా?

సత్యం, ధర్మం, నీతి, నిజాయతీ అంటూ విలువలకే ప్రాధాన్యమిస్తే మన వ్యాపారాలు దివాలా తీస్తాయి, ఉపాధి కోల్పోవాల్సి వస్తుంది, సహోద్యోగులతో సామరస్యంగా పని చేయడం కష్టమవుతుంది. మరి ఇలాంటి పరిస్థితుల్లో మనం ధర్మబద్ధంగా జీవించడమెలా? సత్యాన్నే ఆలంబనగా చేసుకొని జీవన సాఫల్యాన్ని పొందడమెలా? మన మనస్సులోని అంతరాంతరాళాల్లో మెదిలే ఇలాంటి ప్రశ్నలు అనంతం. ఈ ప్రశ్నలకు జవాబుంది. శ్రీరామకృష్ణ పరమహంస ప్రత్యక్ష సన్న్యాస శిష్యులైన స్వామి తురీయానందజీ మహరాజ్ ఇడా అన్సెల్ అనే శిష్యురాలుకు చెప్పిన సూత్రమే మనల్ని ఈ సమస్యల నుంచి తరింపజేసే తారక మంత్రం.

In matters of opinion, swim with the current,
In matters of principle, stand firm as a rock.

'ఇతరుల అభిప్రాయాలను ఆమోదించు. కానీ ఆదర్శాల విషయంలో ఎలాంటి పరిస్థితుల్లోనూ రాజీ పడకుండా స్థిర చిత్తంతో ఉండు!' – స్వామి తురీయానంద

**అభిప్రాయాలకూ, ఆదర్శాలకూ మధ్య తేడా:** మనలో చాలా మందికి అభిప్రాయాలకూ, ఆదర్శాలకూ మధ్య తేడా తెలియకపోవడం వల్ల విభేదాలూ, విరోధాలూ చోటు చేసుకుంటూ ఉంటాయి. సాధారణంగా ఇతరులు మన అభిప్రాయాలను అంగీకరించనప్పుడు మనస్సు కలత చెందుతుంది. నిజానికి ఇతరుల అభిప్రాయాలను ఆమోదించడం వల్ల మనకు కలిగే నష్టం ఏమీ లేదని గ్రహించాలి. ఉదాహరణకు రాబోయే ఎన్నికల్లో ఏ రాజకీయ పార్టీ విజయం సాధిస్తుంది? ఎవరు అధికారంలోకి వస్తారు? ఇలాంటి విషయాల్లో ఎవరైనా తమ అభిప్రాయాలను వ్యక్త పరిచినప్పుడు, వారి భావాలతో మనం ఏకీభవించకపోయినా, వారితో వాదించ కుండా ఉండగలిగితే మనఃస్పర్ధలకు తావుండదు. అభిప్రాయాల్ని ఆమోదిస్తే చాలు, ఆదర్శాలకు తిలోదకాలిచ్చేవారు మనలో చాలా మంది ఉంటారు. ఇలాంటి స్థితి నుంచి బయటపడాలంటే అభిప్రాయాలకూ, ఆదర్శాలకూ మధ్య తేడా తెలుసుకొని జీవించాలి.



**ఆదర్శాల ఆచరణతో అచిర కీర్తి:** సత్య ధర్మాల ఆచరణలో ఎన్ని కష్టాలు ఎదురైనా వాటిని దృఢమైన మనసుతో ఎదుర్కొని ముందుకు సాగడానికి ప్రయత్నించాలి. అంతేకానీ, 'మన కళ్ళ ముందే ఎంతోమంది అవినీతికీ, అన్యాయాలకూ పాల్పడుతూ సుఖంగా జీవిస్తున్నారు కాబట్టి మనం మాత్రం ఆదర్శాలు, విలువలు అంటూ జీవితాన్ని ఎందుకు కష్టాలపాలు చేసుకోవడం' అని భావించరాదు.

కేవలం బాహ్య సంపదల వల్లే ప్రశాంతత చేకూరుతుంది అని అనుకుంటే ధృతరాష్ట్రుడికి కావలసిన సంపదలు అన్నీ

ఉన్నా, అతని మనస్సు మాత్రం అశాంతి జ్వాలతో దహించుకుపోయేది. దానికి కారణం అతని అధర్మ వర్తనమే!

**వృత్తం యత్నేన సంరక్షేత్ విత్తమేతి చ యాతి చ**
**అక్షీణో విత్తతః క్షీణో వృత్తతస్తు హతో హతః**

'విత్తం (ధనం) పోతే ఎలాగైనా సంపాదించుకోవచ్చు. కానీ వృత్తం (సత్ప్రవర్తన) లేని వ్యక్తి మృతతుల్యుడితో సమానం. కాబట్టి సద్వర్తనతో జీవించాలి'అని విదురుడు, ధృతరాష్ట్రునికి బోధించాడు.

**...ఆపత్సు చ న ముహ్యంతి నరాః పండిత బుద్ధయః**

బుద్ధిమంతులు పరిస్థితుల ప్రభావాలకు లోను కాకుండా ధైర్యంగా ముందుకు సాగిపోతారు. 'ఎన్నటికైనా సత్యమే జయిస్తుంది. ఎలాంటి పరిస్థితుల్లోనూ సత్యాన్ని వీడకు' అంటారు స్వామి వివేకానంద.

Stand firm like a rock. Today or tomorrow or ages after truth will conquer. ***- Swami Vivekananda***

ఎలాంటి క్లిష్ట పరిస్థితుల్లోనైనా ఆదర్శాలను విస్మరించనివారే వివేకవంతులు. అలాంటి మహాత్ములే హరిశ్చంద్రుడు, శిబి చక్రవర్తి, బలి చక్రవర్తి, దధీచి, కర్ణుడు మొదలైనవారు.

కష్టాలకు క్రుంగిపోకుండా, అవమానాలకు అధైర్య పడకుండా సత్యాన్నే ఆలంబనగా చేసుకుని జీవించాడు హరిశ్చంద్రుడు. శిబి చక్రవర్తి ఒక పావురాన్ని కాపాడడానికి





తన శరీరాన్నే కోసి ఇచ్చాడు. వామనుడికిచ్చిన మాట ప్రకారం తన ప్రాణమే ఇచ్చాడు బలి చక్రవర్తి. వెన్నెముకను ఇంద్రుడికి ఆయుధంగా ఇచ్చాడు దధీచి. సహజ సిద్ధమైన కవచ కుండలాలను కోసి ఇచ్చాడు కర్ణుడు. వీరంతా ధర్మ పరాయణులు, సత్యవ్రత నిష్ఠులు, సేవానిరతులు, త్యాగధనులు. కాబట్టే వీరి కీర్తి చిరస్థాయిగా నిలిచిపోయింది. వీరి జీవితాలు ఆచంద్రార్కం మనకు ఆదర్శనీయం.

**ధర్మమే జీవనం – అధర్మమే మరణం:** 'సత్యం వద, ధర్మం చర' – సత్యాన్నే పలుకు, ధర్మాన్నే ఆచరించు అనే శాస్త్ర వచనాలను జీవితంలో ఆచరిస్తే, అప్పుడు –'సత్యమేవ జయతే, ధర్మో రక్షతి రక్షితః' – ఎప్పటికైనా సత్యమే జయిస్తుంది, ధర్మమే మనల్ని రక్షిస్తుంది అనే విషయం అవగతమవుతుంది.

'ధర్మాన్ని ఆచరిస్తే, ధర్మమే మనల్ని రక్షిస్తుంది' అని నిరూపించిన అన్నదమ్ముల కథ తెలుసుకుందాం.

ఒక నదీ తీరంలో ఇద్దరు అన్నదమ్ములు రెండు కుటీరాలను నిర్మించుకొని అక్కడ జపధ్యానాలు చేస్తున్నారు. ఒక రోజు ఉదయాన్నే తమ్ముడు అన్నగారి కుటీరానికి ప్రక్కన ఉన్న మామిడి చెట్టు నుంచి రెండు మామిడి పళ్ళను కోశాడు. తమ్ముని చేతిలో మామిడి పళ్ళను చూసిన అన్నయ్య విషయం అడిగి తెలుసుకున్నాడు. తమ్ముని సమాధానం విని, 'తమ్ముడూ! నాతో చెప్పకుండా నా కుటీరం వద్ద ఉన్న మామిడి చెట్టు నుంచి పండ్లు కోశావు. ఇతరుల అనుమతి లేకుండా వారి వస్తువులను తీయడం దొంగతనంతో సమానం. కాబట్టి నీవు ఈ అధర్మ కార్యానికి తగిన శిక్ష అనుభవించి తీరాలి' అని అన్న, తమ్ముడితో అన్నాడు.

ధర్మపరాయణుడూ, సత్యసంధుడూ అయిన తమ్ముడు అన్నయ్యతో 'అన్నయ్యా! నేను చేసిన పని తప్పే. నా తప్పుకు తగిన శిక్ష విధించు' అని అన్నాడు. ప్రజలు తప్పు చేస్తే దండించే అర్హత మహారాజుకే ఉంది కాబట్టి, మహారాజుగారి దగ్గరకు వెళ్ళి శిక్షను పొంది రమ్మన్నాడు అన్నయ్య. అన్నగారి మాట ప్రకారం తమ్ముడు, మహారాజుగారి దగ్గరకు వెళ్ళి జరిగిన విషయాన్నంతా వివరించాడు. 'దొంగతనం చేయడానికి ఉపయోగపడినవి చేతులు కాబట్టి రెండు చేతులనూ ఖండించాలి' అని రాజు తీర్మానించాడు. రాజాజ్ఞ ప్రకారం అతని రెండు చేతులనూ ఖండించారు. మొండి చేతులతో కుటీరానికి తిరిగి వచ్చిన తమ్ముణ్ణి, అన్న గాఢంగా కౌగిలించుకుని 'తమ్ముడూ! నువ్వు నదిలో స్నానం చేసి రా' అని చెప్పాడు. తమ్ముడు నదిలో మునిగి పైకి లేచే సరికి రెండు చేతులూ తిరిగి వచ్చాయి. అప్పుడు తమ్ముణ్ణి చూసి అన్నయ్య ఆనందంతో 'ధర్మాన్ని ఆచరిస్తే, ధర్మమే మనల్ని రక్షిస్తుంది' అనే శాస్త్ర వచనాలు నిత్య సత్యాలని అన్నాడు. ఆ అన్నదమ్ములే శంఖ ధర్మశాస్త్రాన్ని రచించిన శంఖుడు, లిఖితుడు.

Conviction of the powers of goodness- మంచితనానికి ఉన్న అఖండమైన శక్తిపై అచంచల విశ్వాసం ఉంటే నీతి నిజాయతీలతో జీవించడం సాధ్యం. అప్పుడే **'ఆదర్శజీవనం అనుసరణీయం'** అనే సంకల్పం మనలో దృఢతరం అవుతుంది. ❖

గోరుముద్ద



# నేర్చుకోవడం అంటే...

**- స్వామి సుప్రియానంద**

"మా పిల్లలు చదివిన వాళ్ళు చదివినట్టే ఉంటారు. ఎప్పుడు చూసినా పుస్తకాలు ముందేసుకొని కూర్చుంటారు, తెగ వ్రాస్తుంటారు. స్కూల్‌లో టన్నుల కొద్దీ ఇచ్చిన హోమ్‌వర్క్ చేస్తుంటారు. అయినా పరీక్షల్లో మార్కులు మాత్రం రావడం లేదు" – ఇది పిల్లలపై చాలామంది తల్లితండ్రులు చేసే ఫిర్యాదు.

"ఎక్కాలు వస్తే లెక్కలు వస్తాయి" అన్నది ఎంత నిజమో, "హోమ్‌వర్క్ చేస్తే చదువు వస్తుంది" అన్నది అంతే నిజం.

చదువుకోవడం (Study), అర్థం చేసుకోవడం (Understanding), నేర్చుకోవడం (Learning) – ఇవి విద్యార్జనలోని కీలకాంశాలు. చదువుకోవడం, హోమ్‌వర్క్ చేయడం అన్నవి విద్యార్జనకు ఉపకరణాలు మాత్రమేనని మనం గుర్తించాలి. చదువుకోవడం, హోమ్‌వర్క్ చేయడం అనే ప్రక్రియలు పిల్లవాడు నేర్చుకోవడానికి దోహదపడాలి. కానీ అలా జరగడం లేదు. ఉదాహరణకు ఒక అమ్మాయి ఓ పద్యాన్ని కంఠస్థం చేసి, వాళ్ళ అమ్మ దగ్గరకు సంతోషంగా వెళ్ళి, "అమ్మా! నాకు పద్యం వచ్చేసింది. కాసేపు ఆడుకుంటాను" అంది. ఆ తల్లి కోపంగా "నోర్ముయ్! ఆ పద్యం వస్తే ఇంకో పద్యం చదువు పరీక్షలు దగ్గరకొస్తున్నాయి" అని చెప్పి ఆ అమ్మాయిని హడలగొట్టింది. ఇంతకీ ఆ పద్యం ఏమిటంటే "తన కోపమే తన శత్రువు, తన శాంతమే తనకు రక్ష....!"

నిజంగా 'నేర్చుకోవడం'అంటే ఏమిటో మహాభారతంలోని ఈ కథలో చూద్దాం! కురుపాండవులు ద్రోణాశ్రమంలో విద్యార్జన చేస్తున్న కాలం. ఒకసారి ద్రోణాచార్యులు పని మీద కొన్ని రోజులు గురుకులం విడిచి వెళ్ళవలసి వస్తుంది. తాను తిరిగి వచ్చేలోపు కొన్ని పాఠాలను శిష్యులకు 'హోంవర్క్' గా ఇచ్చి వెళతారు. గురువు గారు తిరిగి రాగానే శిష్యులంతా తాము చదివినదంతా ఏకరవు పెడతారు. ధర్మరాజు మాత్రం తాను ఒక వాక్యాన్ని మాత్రమే చదవగలిగానని చెబుతాడు. ఆ సమాధానం విన్న ద్రోణుడు కోపంతో "ఏమిటి? ఇన్ని రోజులు ఒక్క వాక్యమే చదివావా?" అని గద్దించారు. "అవును గురువర్యా! ఒక్క వాక్యమే చదవగలిగాను. అందులోని విషయాన్నే నేర్చుకోవడానికి ప్రయత్నిస్తున్నాను" అన్నాడు ధర్మరాజు. అది విన్న ద్రోణుడు మరింత కోపగించుకొని, శిష్యునికి దండన విధించాడు. అయినప్పటికీ ధర్మరాజు ప్రసన్న వదనంతో ఉండడం చూసి ఆచార్యుడు ఆలోచనలో పడ్డారు. మెల్లగా, "నాయనా! నువ్వు చదివిన ఆ ఒక్క వాక్యం ఏమిటి?" అని అడిగారు. ధర్మరాజు పుస్తకం తీసుకొచ్చి గురువుగారికి చూపాడు. "ఎప్పుడూ కోపం తెచ్చుకోవద్దు" అన్నదే ఆ పుస్తకంలో వ్రాసి ఉన్న వాక్యం. ఆచార్యుడి కళ్ళల్లో ఆనందబాష్పాలు. ప్రేమతో శిష్యుడి తల నిమురుతూ, "నాయనా! నువ్వు నాకు ఈ రోజు "నేర్చుకోవడం" అంటే ఏమిటో తెలియజెప్పావు" అన్నారు ద్రోణాచార్యులు. ❖



## ఉగాది శుభాకాంక్షలు

**'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు, రచయితలకు, రచయిత్రులకు, ఏజెంట్లకు, ప్రకటనకర్తలకు మా హృదయపూర్వక శుభాభినందనలు** - సంపాదకులు

# దుర్గాదేవి దివ్యదర్శనాలు

- స్వామి జ్ఞానదానంద

శ్రీరామకృష్ణులు సర్వవేళలా జగన్మాత చింతనలోనే జీవించేవారు. ఆ జగన్మాత చింతనలో ఆయనకు కలిగిన దర్శన విశేషాల్ని కొన్ని తెలుసుకుందాం.

స్వామి శారదానంద ఇలా వర్ణించారు: "గురుదేవులు ఒక రోజు పంచవటిలో కూర్చొని ఉన్నారు. అప్పుడు దుర్గామాత గంగానదిలో ప్రత్యక్షమై, వారి వైపుగా నడుస్తూ వచ్చి, వారి దేహంలో కలిసి పోయింది. అప్పుడు గురుదేవులు హృదయ్‌తో, "దుర్గామాత వచ్చింది. ఆ తల్లి పాదాల గుర్తులు ఇంకా నేల మీద ఉన్నాయి చూడు" అన్నారు.

దుర్గామాత నీలి కలువ మీద కూర్చున్న దృశ్యాన్ని గురుదేవులు గాంచిన వైనాన్ని రామ్‌లాల్ ఇలా వర్ణించాడు:



"ఒకమారు గురుదేవులు, కేశవ్‌సేన్‌తో కలసి కలకత్తాలోని ఈడెన్ గార్డెన్‌కు స్టీమర్ మీద వెళ్ళారు. అక్కడ ఒక తటాకంలో ఎన్నెన్నో నీలి కలువ పూలను చూశారు వారు. ఒక పెద్ద నీలి కలువ మీద దుర్గామాత కూర్చొని ఉండడం గురుదేవులకు కనపడింది. ఆమె కుడి పాదం క్రిందికి వేలాడుతోంది. ఎడమ పాదం కలువ మీద ఉంది. ఆమె ఒడిలో గణేశుడున్నాడు. కలువ పువ్వు మెల్లగా కదులుతోంది. ఆ దృశ్యాన్ని గాంచగానే గురుదేవులు సమాధిస్థితికి చేరుకున్నారు".

దేవికి నివేదిస్తున్న ప్రసాదాన్ని శ్రీరామకృష్ణులు స్వీకరించిన సన్నివేశాన్ని అక్షయ్‌సేన్ ఇలా వివరించాడు : "ప్రతీ ఏడూ దుర్గాపూజ (శరన్నవరాత్రులు) సమయంలో కలకత్తాలోని జాన్‌బజారులో ఉన్న తన ఇంటికి గురుదేవుల్ని ఆహ్వానించేవాడు మథుర్‌బాబు. ఒకరోజు గురుదేవులు పూజ గదిలోకి వెళ్ళేసరికి పూజారి దేవికి ప్రసాదం నివేదిస్తున్నాడు. పూజారి నైవేద్యం సమర్పిస్తుండగా, గురుదేవులు అతని చేతి నుంచి తీసుకుని తినడం ప్రారంభించారు. అది చూసి పూజారి ఆశ్చర్యపోయాడు. వెంటనే మథుర్ పూజారితోనూ, ఇతరులతోనూ "గురుదేవులు నైవేద్యం స్వీకరించారు కనుక దుర్గాదేవికి చేస్తున్న పూజ జయప్రదమైంది" అన్నాడు.

దుర్గాపూజోత్సవంలో దుర్గాదేవి దర్శనాలు : భక్తులను అనుగ్రహించిన హృదయ్ ఒకమారు సిహోర్‌లో దుర్గాపూజ ఉత్సవం నిర్వహించాడు. కానీ గురుమహారాజ్ అతనితో పాటు వెళ్ళలేకపోయారు. అయినా హారతి సమయంలోనూ, సంధిపూజ జరుగుతుండగానూ దుర్గామాత ప్రతిమ ప్రక్కన గురుదేవులు నిలబడి ఉన్నట్లు హృదయ్‌కు కనపడింది. తరువాత దక్షిణేశ్వర్ తిరిగివెళ్ళాక గురుదేవులకి తాను చూసిన దృశ్యాన్ని వర్ణించి చెప్పాడు హృదయ్. అప్పుడు గురుదేవులు, "ఆరతి సమయంలోనూ, సంధి పూజ జరుగుతున్నప్పుడూ నువ్వు నిర్వహిస్తున్న పూజ చూడాలనే తీవ్రమైన కోరిక కలిగింది. తేజోమయ దేహంతో అక్కడికి వచ్చి పూజలు తిలకించాను" అన్నారు.

శ్రీరామకృష్ణులు క్యాన్సర్ వ్యాధి చికిత్స కోసం శ్యామ్‌పుకూర్‌లో ఉన్నప్పుడు, తమ సూక్ష్మదేహంతో సురేంద్ర మిత్రా ఇంట్లో జరుగుతున్న దుర్గాపూజ చూడడానికి వెళ్ళారు. వారు తమ భక్తులతో "ఇక్కడి నుంచి సురేంద్ర మిత్రా ఇంటి వరకూ ప్రకాశవంతమైన మార్గం ఒకటి కనబడింది. దుర్గా ప్రతిమలో జగజ్జనని ఉనికిని గుర్తించాను. సురేంద్ర భక్తితో తల్లిని ఆహ్వానించాడు. ఆ తల్లి మూడవ కంటి నుంచి ఒక కాంతి కిరణం ముందుకు ప్రసరించింది. పూజ గదిలో జగన్మాత ఎదుట వరుసగా దీపాలు వెలుగుతున్నాయి. ఇంటి ప్రాంగణంలో సురేంద్ర దయనీయంగా "అమ్మా, అమ్మా!" అంటూ విలపిస్తున్నాడు. మీరంతా వెంటనే అతని ఇంటికి వెళ్ళండి. మిమ్మల్ని చూస్తే అతని మనస్సు శాంతిస్తుంది" అన్నారు. నరేంద్ర (స్వామి వివేకానంద), తదితరులు గురుదేవులకు ప్రణామం చేసి, సురేంద్ర ఇంటికి వెళ్ళడానికి బయలుదేరారు. వారు సురేంద్రను ప్రశ్నించగా, గురుదేవులు సమాధి స్థితిలో గాంచినది అంతా నిజమే అని తెలిసింది. సురేంద్రను అనుగ్రహించడానికి గురుదేవులు సూక్ష్మ దేహంలో అక్కడకు వెళ్ళారని వారికి అర్థమైంది.

నిరంతరం అమ్మ నామస్మరణతోనే జీవించిన శ్రీరామకృష్ణులకు జగన్మాత దివ్యదర్శనాలు కలగడంలో ఆశ్చర్యమేముంది! ❖



# శోభాయమానం-సకల శుభకరం 'ఉగాది'

(మార్చి 27న ఉగాది)

తెలుగువారి తొలి పండుగ ఉగాది. నిజానికి, 'యుగాది'కి రూపాంతరం ఉగాది. (కొత్త) యుగానికి ఆది...అంటే ప్రారంభం 'యుగాది'. కలియుగ ప్రారంభాన్ని యుగాది అన్నారు. కృష్ణపరమాత్మ తనువు చాలించిన వెంటనే కలియుగం ఆరంభమైంది అంటారు వేదవ్యాసుల వారు: "యస్మిన్ కృష్ణో దివమ్ వ్యతాహ తస్మాత్ యేవ ప్రతిపన్నమ్ కలియుగమ్."

వసంత ఋతువులో మొదటి నెల అయిన చైత్రమాసంలో మొదటి రోజు యుగాది. వింధ్య పర్వతాలకు ఉత్తరదిశలో ఉన్నవారు బార్హస్పత్యమానాన్ని అనుసరించగా, దక్షిణదిశలో ఉన్నవారు చాంద్రమానాన్ని కానీ, సౌరమానాన్ని కానీ అనుసరిస్తారు. అందువల్లనే ఆ యా ప్రాంతాల వారి క్యాలెండర్లలోని నెలలూ, పండుగలలో తేడాలుంటాయి.

బ్రహ్మదేవుడు వసంత ఋతువులో చైత్ర శుద్ధ పాడ్యమి నాడు ఉషఃసంధ్యలో జగత్తును సృష్టించాడు. కనుక ఆ రోజును ఉగాది అన్నారు. ఉగాదికి సంబంధించిన కథలు పురాణాలలోనూ, చరిత్రలోనూ చాలా ఉన్నాయి. మన పండుగలన్నీ గడచిన సంఘటనలను జ్ఞాపకం చేసుకుంటూ జరిపేవే.

ఉగాది నాడు ఎలా గడిపితే ఆ సంవత్సరమంతా అలా గడుస్తుందని ప్రజల నమ్మకం. ఆ రోజు ఆనందంగా గడిపితే సంవత్సరమంతా సుఖసంతోషాలతో గడుస్తుందనే నమ్మకంతో ఉగాది నాడు ఉదయాన్నే పూజ చేసి, దేవుడికి నివేదించిన ఉగాది పచ్చడిని ప్రసాదంగా స్వీకరిస్తారు. ఉగాది పచ్చడిలోని షడ్రుచులూ మానవ జీవితం సుఖదుఃఖాలు, లాభనష్టాలు, నిందాస్తుతుల మిశ్రమం అని తెలియచేస్తాయి. వీటిని సమదృష్టితో స్వీకరించడం అలవరచుకోవాలన్నదే ఉగాది పచ్చడిని స్వీకరించడంలోని అంతరార్థం. జీవితంలో ఏది ఎదురైనా నిబ్బరంగా, అంతా మన మంచికే జరిగింది అనుకుని మానవ జీవిత లక్ష్యమైన మోక్షాన్ని సాధించాలని కూడా ఈ పండుగ తెలియజేస్తుంది. ఉగాది పచ్చడికి ఔషధ గుణాలు ఉన్నాయి. ఉగాది నాటి పంచాంగ శ్రవణం, కవి సమ్మేళనాలు ప్రాముఖ్యతను సంతరించుకున్నాయి.

చాంద్రమానాన్ని అనుసరించే ఆంధ్రులు, కన్నడిగులు, మహారాష్ట్రీయులకు సంవత్సరంలో మొదటి ఋతువైన వసంత ఋతువు ఆరంభమయ్యే చైత్ర శుక్ల పాడ్యమి నాడు సంవత్సరాది. ఆంధ్రులు, కన్నడిగులూ దీనిని 'ఉగాది' అంటారు, మహారాష్ట్రీయులు 'గుడి పడ్వా' అంటారు.

మన కాలమానం ప్రకారం 60 సంవత్సరాలున్నాయి. వీటిలో మొదటిది ప్రభవ, అరవయ్యోది అక్షయ. ప్రభవతో మొదలైన చక్రభ్రమణం అక్షయతో ముగిసి మళ్ళీ ప్రభవ మొదలవుతుంది. ఆ క్రమంలో ఈ 2009 మార్చి నెల 26వ తేదీతో శ్రీసర్వధారి నామ సంవత్సరం ముగిసి 27వ తేదీ నుంచి శ్రీవిరోధి నామ సంవత్సరం మొదలవుతోంది. ఈ నూతన సంవత్సరంలో విరోధాలు సమసిపోయి, అందరి జీవితాలూ సుఖసంతోషాలతో శోభాయమానం కావాలని ఆశిద్దాం! ❖ – సేకరణ: కుమారి ఎ. శ్రవంతి

# శ్రీకృష్ణుడే శ్రీచైతన్యుడు!

- జి. సతీష్



శ్రీచైతన్య మహాప్రభువు 1486 ఫిబ్రవరి 18వ తేదీ నాడు పశ్చిమ బెంగాల్‌లోని నదియా జిల్లాలో మాయాపూర్ గ్రామంలో జన్మించారు. ఆయన తండ్రి జగన్నాథ మిశ్రా పేద వైదిక బ్రాహ్మణుడు, తల్లి శచీదేవి ఆదర్శప్రాయురాలైన ఇల్లాలు.

శ్రీచైతన్య మహాప్రభువు మాతామహుడు పండిత నీలాంబర చక్రవర్తి గొప్ప జ్యోతిష్య శాస్త్రవేత్త. మనుమడు ముమ్ముందు మహాపురుషుడు కాగలడని గ్రహించిన ఆయన ఆ పిల్లవాడికి 'విశ్వంభరుడు' అని నామకరణం చేశాడు. ఆ పిల్లవాడి దేహచ్ఛాయ బంగారు రంగులో ఉండడంతో, ఇరుగు పొరుగు స్త్రీలు ఆయనకు 'గౌరహరి' అని పేరు పెట్టారు. ఆయన వేప చెట్టు దగ్గర జన్మించడం వల్ల తల్లి ఆయనను 'నిమాయి' అని పిలిచేది.

నిమాయి ఏడ్చినప్పుడు "హరిబోల్" అనగానే ఏడుపు మానేసేవాడట. ఇది భవిష్యత్తులో ఆయన నిర్వహించబోయే నామసంకీర్తనోద్యమానికి సూచన.

మాయాపూర్ గ్రామానికి దగ్గర్లో ఉన్న గంగానగరంలో గంగాదాస పండితుని పాఠశాలలో చైతన్యుడు తన ఎనిమిదో ఏట విద్యాభ్యాసానికి చేరాడు. రెండేళ్ళలో ఆయన సంస్కృత వ్యాకరణం, అలంకార శాస్త్రాలను క్షుణ్ణంగా అభ్యసించాడు. పది సంవత్సరాల వయస్సు దాటేటప్పటికి చైతన్యుడు వ్యాకరణం, అలంకార శాస్త్రం, స్మృతులు, న్యాయశాస్త్రం మొదలైన వివిధ శాఖలలో గణనీయమైన పాండిత్యం గడించాడు.

పదిహేడో ఏట ఆయన శిష్య సమేతుడై గయా క్షేత్రానికి వెళ్ళాడు. అక్కడ ఆయన ఈశ్వరపురి అనే వైష్ణవ సన్న్యాసి నుంచి మంత్రోపదేశం పొందాడు. నదియాకు మరలి వచ్చిన తరువాత నిమాయి పండితుడు ఆధ్యాత్మికతత్త్వ ప్రచారకుడయ్యాడు. ఆయన ఇప్పుడు న్యాయశాస్త్రంలోనూ, స్మృతులలోనూ, అలంకార శాస్త్రంలోనూ వాగ్వివాదానికి సిద్ధపడే విద్వాంసుడు కాడు. కృష్ణ నామం వినగానే తన్మయత్వంతో స్పృహ తప్పి పడిపోయేవాడు.

చైతన్య మహాప్రభువు తల్లి కోరిక మేరకు జగన్నాథ పురీ క్షేత్రంలో ఉండడానికి అంగీకరించాడు. కొన్నాళ్ళ తరువాత ఆయన శాంతిపూర్ నుంచి ఉత్కళ రాష్ట్రానికి ప్రయాణమయ్యాడు.

ఉత్కళాధిపతి అయిన ప్రతాపరుద్రుని సభాపండితులలో ఒకరైన శ్రీవాసుదేవ భట్టాచార్యుడు చైతన్య మహాప్రభువును ప్రసిద్ధమైన 'ఆత్మారామ' శ్లోకాన్ని వ్యాఖ్యానించమనీ, స్వయంగా ప్రభువు నుంచి ఆ వ్యాఖ్యనాలు వినాలని కుతూహలంగా ఉందనీ అర్థించాడు. మొదట భట్టాచార్యుడు ఆ శ్లోకాన్ని తనకు అర్థమైన రీతిలో వ్యాఖ్యానించమనీ, తరువాత తాను వ్యాఖ్యానిస్తాననీ చైతన్య మహాప్రభువు తెలియజేశాడు. భట్టాచార్యుడు తర్క, వ్యాకరణాల ఆధారంగా 'ఆత్మారామ' శ్లోకానికి తొమ్మిది వేర్వేరు అర్థాలను వివరించాడు.

భట్టాచార్యుడు చెప్పిన తొమ్మిది అర్థాలనూ ప్రస్తావించాక చైతన్య మహాప్రభువు ఆ శ్లోకంలోని పదాలను విశ్లేషించి, దానిని వ్యాఖ్యానించాడు. ఆ విధంగా ఆయన ఆ శ్లోకానికి అరవై ఒక్క అర్థాలు చెప్పాడు. చైతన్య మహాప్రభువు వ్యాఖ్యానాన్ని భట్టాచార్యుడు ప్రశంసించాడు. ఆయన సాక్షాత్తూ శ్రీకృష్ణుడే అని భావించాడు. మహాప్రభువును మొదట సామాన్య మానవునిగా భావించి, అపరాధం చేసినందుకు భట్టాచార్యుడు తనను తాను నిందించుకొన్నాడు. చైతన్య మహాప్రభువు చరణారవిందాలపై వాలి, తన అపరాధాన్ని క్షమించి తనపై అవ్యాజమైన కరుణను ప్రసరింపజేయాల్సిందిగా ప్రార్థించాడు. ఆ మహా విద్వాంసునికి గల వినయం చూసి చైతన్య మహాప్రభువు సంతోషించి, మొదట చతుర్భుజాలతోనూ, తరువాత శ్యామ వర్ణంతోనూ, పెదవులపై వేణువుతోనూ కృష్ణునిలా అతనికి తన నిజ స్వరూపాన్ని చూపించాడు. ఈ విధంగా అతనికి చైతన్య మహాప్రభువు షడ్భుజమూర్తి దర్శనం కలిగింది. అప్పుడు సార్వభౌమ భట్టాచార్యుడు మహాప్రభువు పాద కమలాలపై పడి అనేక స్తోత్రాలను రచించాడు. ❖

**(మార్చి 11న శ్రీ చైతన్య మహాప్రభువు జయంతి)**

# దేవీ వైభవం

ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

(...గత సంచిక తరువాయి)

చిదగ్నికుండంలో మన అహంకారమంతా ఆహుతి అయితే అప్పుడు అమ్మ సంపూర్ణ చైతన్య స్వరూపం గోచరిస్తుంది. ఆ రూపం ఎలా వచ్చిందంటే-**చంపకాశోక పున్నాగ సౌగంధిక లసత్కచా, కురువింద మణిశ్రేణి కనత్కోటీర మండితా, అష్టమీ చంద్రవిభ్రాజ దళికస్థల శోభితా ...** అలాగ క్రమ క్రమంగా **నఖదీధితి సంఛన్న నమజ్జన తమోగుణా, పదద్వయ ప్రభాజాల పరాకృత సరోరుహా, శింజాన మణి మంజీర మండిత శ్రీపదాంబుజా...** ఇలా అమ్మ సౌందర్యవంతమైన రూపం వచ్చింది. అలా వచ్చిన రూపంలో ఒక్కొక్క భాగంలో ఒక్కొక్క దేవతా శక్తి ఉంది. అమ్మ యొక్క నల్లని కేశపాశాలలో యముని(కాలం) శక్తి ఉంది. ఇలా ఒక్కొక్క అవయవంలో ఏయే దేవతాశక్తులున్నాయో మనకు లలితోపాఖ్యానం వర్ణించింది. మొత్తంగా అమ్మను ధ్యానిస్తే సర్వదేవతలనూ ధ్యానించినట్లు! ఒక్కొక్క అవయవాన్నీ ధ్యానిస్తుంటే ఒక్కొక్క దేవతా శక్తి మనలో ప్రవేశించి రక్షిస్తుంది. అందుకే శంకరుల వారు – "ధునో ధుద్వాంతం నహ.... అమ్మా నీ నల్లని జుట్టును తలచుకుంటే మా మనస్సులో ఉన్న నలుపు పోతుందమ్మా" అన్నారు. అంటే మనస్సులో ఉన్న చీకటి – అజ్ఞానం పోవాలంటే అమ్మ జుట్టును తలుచుకోవాలి. ఆ కాల స్వరూపమే అందులో గోచరిస్తోంది. భగవంతుడి రూపంలో ప్రతి అవయవం ఒక దివ్యశక్తి; ప్రతి అవయవం ఒక తత్త్వ సంకేతం. ఇలా అమ్మ సర్వదేవతామయి అయి గోచరిస్తున్నటువంటిది స్థూల సౌందర్యం.

రెండవది సూక్ష్మ సౌందర్యం.. ఇది మంత్రం. మంత్రం వాచ్యార్థా దేవతా! శబ్దం వల్ల ఉత్పన్నమయ్యే చైతన్యమే దేవత. ఒక శబ్దం ఉచ్చరించగానే ఒక శక్తి ఉత్పన్నమవుతుంది అదే దేవత. మనం ఒక మంత్రాన్ని లేక ఒక నామాన్ని ఉపాసన చేసి ఒక దేవతను ప్రసన్నం చేసుకుంటున్నాం. "సరస్వతి, సరస్వతి, సరస్వతి..." అనగానే మన మనస్సులో సరస్వతీ రూపం కనిపిస్తుంది. మనం నూతిలో చేద వేసి నీరు తోడితే, చేద ఏ రూపంలో ఉందో నీరు ఆ రూపంలో వస్తుంది. అలాగే విశ్వవ్యాపకమైన మహా చైతన్యాన్ని మనం మంత్రమనే చేద వేసి, ఆ మంత్రం చెప్పిన రూపాన్ని పొందుతున్నాం. అమ్మ వారు ఈ రూపంతో ఉన్నారంటే ఈ రూపంలో ఒక మంత్రం ఉంది. ప్రతీ దేవతా రూపంలో ఆ దేవతా సంబంధమైన మంత్రం ఉంటుంది. అలా అమ్మలో ఉన్న మంత్రం పంచదశీ మహామంత్రం.

పంచదశీ మహామంత్రం – వాగ్భవకూటము, కామరాజ కూటము, శక్తి కూటము అని మూడు భాగాలు. ఇది సూక్ష్మ స్వరూపం. అమ్మ వారిని మనం పరిశీలించగానే ఈ మూడూ మనకు అందులో కనిపిస్తాయి. ఆ రహస్యమే మనకు – **శ్రీమద్వాగ్భవ కూటైక స్వరూప ముఖపంకజా కంఠాధః కటి పర్యంత మధ్యకూట స్వరూపిణీ, శక్తి కూటైక తాపన్న కట్యథో భాగధారిణీ** – అంటూ మూడూ చూపించారు ఇక్కడ. ముఖం వాగ్భవ కూటం, కంఠం నుండి కటి వరకూ కామరాజ కూటం, కటి నుండి పాదం వరకూ శక్తి కూటం మంత్రం. అందుకే **"మూలమంత్రాత్మికా మూలకూట త్రయ కళేబరా"** అని చెప్పబడుతోంది. అందుకు సూక్ష్మరూపం ఏమిటంటే మంత్రం.

సూక్ష్మ తర రూపం మనలో ప్రాణ శక్తి స్వరూపం. మన ఊపిరితో మంత్రం చెబుతున్నాం. శ్వాసలో నిరంతరం సంచరించే కుండలినీ స్వరూపమే ఆ జగదంబిక. ప్రాణశక్తిని ఆధారంగా చేసుకొనే మంత్రం ఉంది. ఊపిరే లేకపోతే మంత్రం లేదు. ప్రాణశక్తి నుంచి

మంత్రం పలుకుతుంది. నాదం ఉత్పత్తి ప్రాణ శక్తి వల్ల జరుగుతోంది. "ప్రాణానల సంయోగముచే ప్రణవనాదము సప్తస్వరములై బలుకే...." అన్నారు త్యాగరాజస్వామి.

ఈ ప్రాణశక్తే కుండలిని. అమ్మవారు కుండలినీ స్వరూపిణి. అందుకే ఆ తరువాతి నామంలో **"కులాంగనా కులాంతస్థా కౌళినీ కులయోగినీ, అకులా సమయాంతస్థా సమయాచార తత్పరా మూలాధారైకనిలయా బ్రహ్మగ్రంధి విభేదినీ"** అక్కడ నుండి వస్తోంది "బ్రహ్మగ్రంధి విభేదినీ, విష్ణుగ్రంధి విభేదినీ, రుద్రగ్రంధి విభేదినీ. మహా శక్తిః కుండలినీ బిసతంతు తనీయసీ... ఇది సూక్ష్మతరరూపం.



ఆ తరువాతది సూక్ష్మతమరూపం. స్థూలం అంటే కంటికి కనిపించేది – శరీరం, సూక్ష్మం అంటే కనిపించనిది – మనస్సు; దాని కన్నా సూక్ష్మం ప్రాణం, దాని కన్నా సూక్ష్మమైనది పరమాత్మ, అందుకు సూక్ష్మతమ రూపం ఏమిటంటే లలితా సహస్రంలో.... **"నిర్లేపా నిర్మలా నిత్యా నిరాకారా నిరాకులా నిర్గుణా నిష్కళా శాంతా నిష్కామా నిరుపప్లవా"** అని నిఃనిః అనే నిశ్శబ్ద శబ్దాలు అన్నీ సూక్ష్మతమ రూపాలు.

నిరాకారా – ఆమెకు ఆకారం లేదట. ముందేమో "చంపకాశోక పున్నాగ సౌగంధిక లసత్కచా" అని వర్ణించారు వశిన్యాది వాగ్దేవతలు. అంత ఆకారం వర్ణించి "నిరాకారా నిరాకులా..." అన్నారు. మనలో ఆకారాలకు ఆధారమై ఉన్న నిరాకారం ఆ తల్లి; ఆ ఆధార చైతన్యం. అసలు తత్త్వం ఏమిటి? "నిర్లేపా నిర్మలా నిత్యా నిరాకారా నిరాకులా.." అమ్మ యొక్క స్థూల రూపాన్ని మనం ఉపాసన చెయ్యగా చెయ్యగా సూక్ష్మ, సూక్ష్మతర, సూక్ష్మతమ భూములలోకి ప్రవేశించి ఆ పరతత్త్వంలో సాయుజ్యం పొందుతున్నాం. ఎలాగో ఒకలా స్థూల రూపాన్ని ఆశ్రయించగలిగితే అమ్మ తన సూక్ష్మతమ సౌందర్యాన్ని కూడా చూపిస్తుంది. ఆ నాలుగూ చూడగలిగిన వాడే అమ్మను పరిపూర్ణంగా చూసినవాడు. కేవలం బయటి రూపాన్ని చూస్తే చాలదు. లలితా సహస్రం చెప్పినదంతా ఇవే – త్రిపురసుందరి... అరుణవర్ణం... ఈ నాలుగు స్వరూపాలు. ఆది శంకరుల వారు ఆ సౌందర్యలహరినే సౌందర్యలహరి గ్రంథంలా చెప్పారు.

చండీవిద్యలో మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతి స్వరూపాలు చెప్పినట్లే శ్రీవిద్యలో మహాకాళీదేవి వారాహీ స్వరూపంగా కనబడుతోంది. మహా సరస్వతీ దేవి శ్యామలా రూపంగా, మహాలక్ష్మీదేవి లలితా స్వరూపంగా కనబడుతుంది. అలాగే దశమహావిద్యల్లో బగళాముఖి మొదలైన శక్తులన్నీ వారాహీదేవి యందు గోచరిస్తున్నాయి. మాతంగీ విద్య శ్యామలాదేవి యందు గోచరిస్తోంది. ఈ శ్యామలా దేవినే మంత్రిణి పరిసేవితా అని మంత్రిణీ దేవత అన్నారు. **"గేయ చక్రరథారూఢ"** అంటే నాద స్వరూపిణి. శ్యామలా అంటే **''మాణిక్యవీణా ముఫలాలయంతీం మదాలసాం మంజుల వాగ్విలాసాం ..."** ఆవిడ దండినీ దేవత అంటే వారాహి లేక వార్తాళి అని చెప్పబడుతున్నది. ఈ వార్తాళి దేవి, శ్యామలా దేవి– ఇద్దరూ రక్షకులు. ఆత్మ చైతన్యం అమ్మ అయితే మనలోని బుద్ధి శక్తి శ్యామల, మన శరీరంలో ఉండే రక్షణ వ్యవస్థ అంతా వారాహీ దేవి. ధర్మ రక్షణ వారాహీ దేవి పని. బుద్ధి, జ్ఞానం ఇవన్నీ శ్యామలా దేవి పని. ఈ రెండిటికీ ఆధారమైన లలితా దేవి ఆత్మ చైతన్యంగా భాసిస్తూ ఉంది. ఆ విధంగా ఇక్కడ కూడా ముగ్గురే. ఎటు చూసినా లలితా త్రిపురసుందరిని దర్శించడమే ప్రధానం. అందుకే హయగ్రీవులవారు అగస్త్యుల వారికి అంతా చెప్పి **"స్వాత్మైవ దేవతా ప్రోక్తా లలితా విశ్వ విగ్రహా"** అన్నారు. ❖

సశేషం

# పరిప్రశ్న

**- స్వామి సుకృతానంద**

జి. సతీష్, వేములవాడ.

**? : ఉదయం నిద్ర లేచినప్పుడు, రాత్రి పడుకునే ముందు, భోజన సమయంలో పఠించవలసిన ప్రార్థనా శ్లోకాలు వివరించండి.**

✍: **ఉదయం మేల్కొనగానే:** మీ ఇలవేల్పు, ఇష్టదేవత, లేదా శివ, దుర్గ, విష్ణువు, శ్రీరామకృష్ణులు, శారదామాత... ఎవరినైనా ముందుగా తలచి, క్రింది శ్లోకాలు పఠించాలి.

*కరాగ్రే వసతే లక్ష్మీ, కర మధ్యే సరస్వతీ,*
*కర మూలే స్థితే గౌరీ, ప్రభాతే కరదర్శనమ్.*

*సముద్రవసనే దేవీ, పర్వతస్తన మండలే, విష్ణుపత్నీ*
*నమస్తుభ్యం, పాద స్పర్శం క్షమస్వమే.*

**భోజన సమయంలో:** *"బ్రహ్మార్పణం బ్రహ్మ హవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్, బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మ కర్మ సమాధినా హరిః ఓం తత్ సత్."*

**రాత్రి నిద్రపోయే ముందు:** "కాయేన వాచా మనసేంద్రియై ర్వా బుద్ధ్యాత్మనా వా ప్రకృతే స్వభావాత్,

*కరోమి యద్యత్ సకలం పరస్మై నారాయణా యేతి సమర్పయామి"*

*"అసతో మా సద్గమయ, తమసోమా జ్యోతిర్గమయ, మృత్యోర్మాஉ మృతంగమయ, ఓం శాంతిః శాంతిః శాంతిః"*

అనునిత్యం కనీసం ఈ విధంగా పరమాత్ముని ప్రార్థన చేస్తే మనసుకు శాంతి సంతోషాలు కలుగుతాయి. నిత్యం చేసే పనులు సవ్యంగా జరుగుతాయి.

కె. వి. రామదుర్గయ్య, నెల్లూరు.

**? : ఆధ్యాత్మిక గురువులు శిష్యులకు మంత్రోపదేశం చేస్తారు. ఓం నమశ్శివాయ, ఓం నమో నారాయణాయ అనే భగవన్నామ స్మరణకు గురుముఖతః ఉపదేశం అవసరమా?**

✍: ఆధ్యాత్మిక జీవితం గడపడానికి మంత్రోపదేశం అవసరం. శ్రీరామ, శ్రీకృష్ణ నామోచ్చారణకు గురువు ద్వారా మంత్రోపదేశం అవసరం లేదనుకొంటారు. అది సరి కాదు. ఉపనయన సమయంలో గాయత్రీ మంత్రాన్ని పురోహితుడు, లేదా తండ్రి ద్వారా స్వీకరించిన వారిలో ఎవరో కొందరు తప్ప మిగతా వారందరూ గురువు ద్వారా మంత్రోపదేశం పొందాలి. గురువు ద్వారా పొందే మంత్రోపదేశంలో, గురుపరంపరగా వస్తున్న గురుశ్శక్తి సాధకుడికి లభిస్తుంది. సాధన సులభమవుతుంది. సందేహ నివృత్తి అవుతుంది. కేవలం భగవన్నామ జపం చేసేవారు ఎక్కువ శ్రమపడాలి. సందేహాలు నివృత్తి కావు. ఒక భగవన్నామం కొంతకాలం చేసి, మరలా ఇంకో మంత్రం, లేదా ఇతర మంత్రాలు జపించే వారు గతి తప్పిన పడవ, గమ్యం లేని గాలిపటంలా ఉంటారు. లక్ష్యసిద్ధికి ఎక్కువ సమయం పడుతుంది. అందువల్ల ఆధ్యాత్మిక సంప్రదాయాల్లో గురువు ద్వారా మంత్రోపదేశం తప్పనిసరి చేశారు. గురువే బ్రహ్మ, గురువే విష్ణువు, గురువే మహేశ్వరుడు, గురువే పరబ్రహ్మ! అలాంటి గురువుకు మళ్ళీ మళ్ళీ నా నమస్కారాలు అని ప్రార్థిస్తున్నాం. పరమాత్మే గురువు రూపంలో వస్తాడంటారు శ్రీరామకృష్ణులు.



జి. హెచ్. రావు, తాలుపూరు.

**? : పాషండుడు, పతితుడు అంటే ఎవరు? వారు దైవసాయుజ్యాన్ని పొందుతారా?**

✍: శీలం, నడవడిక సరిగ్గాలేకుండా తప్పుత్రోవ పడినవారిని పతితుడు అంటారు. వారు ఆదర్శం నుంచి వైదొలగినవారు. సతతం తననే అర్చించి, స్మరించే వారిని సాధువుగా స్వీకరించాలంటాడు కృష్ణ భగవానుడు. పాషండుడు అంటే దక్షిణ భారతదేశంలో ఒక తెగవారిని అలా పిలుస్తారు.

భగవన్నామ స్మరణతో ఎవరైనా ఆయన్ని పొందవచ్చు. ❖



ధీరవాణి
-స్వామి వివేకానంద

# దుఃఖాలకు అసలు కారణం..

మన దుఃఖమంతా మనం కోరి తెచ్చుకొన్నదే. చైనాదేశంలో అరవై సంవత్సరాలు కారాగారంలో బంధించబడిన ఒక వృద్ధుణ్ణి ఒక చక్రవర్తి పట్టాభిషేక మహోత్సవ సందర్భాన విడుదల చేశారు. అతడు బయటకు వచ్చి "ఇక్కడ బ్రతకలేను. కారాగారంలోని చిట్టెలుకలు, చుంచెలుకల మధ్యకు వెళ్ళిపోతాను. ఈ వెలతురు నాకు దుస్సహంగా ఉంది. నన్ను చెరసాలలోకైనా పంపేయండి లేదా చంపేయండి" అని మొరపెట్టుకున్నాడు. తిరిగి అతణ్ణి కారాగారానికి పంపేశారు.

మానవులందరి పరిస్థితీ సరిగ్గా ఇలాగే ఉంది. అనేక రకాలైన దుఃఖాల వెంట పడుతుంటాం. వాటి నుంచి బయటపడటానికి ఇష్టపడం. అనుదినం మనం సుఖం వెంట పరుగెత్తే కొద్దీ అది మనకు లభించకుండా అదృశ్యమై పోతుంది.

నువ్వుల నుండి నూనె తీసే గానుగలను తిప్పడానికి ఎడ్లను కడతారు. ఎద్దు మెడపై కాడి ఉంటుంది. కాడి నుంచి ముందుకు పొడుచుకొని వచ్చినట్లుగా ఒక కొయ్య ముక్క ఉంటుంది. దానిపైన కొంత గడ్డిని వ్రేలాడగడతారు. ఎద్దు కళ్ళకు కట్టిన గంతల వల్ల ఎద్దు ముందుకే చూడగలదు. గడ్డి నందుకోవడానికి అది మెడను ముందుకు చాస్తుంది. ఆ కొయ్య ముక్క ముందుకి కదులుతుండడం వల్ల అది గడ్డిని అందుకోలేదు కానీ, అందుకొనే ఆశతో చుట్టూ తిరుగుతూ ఉంటుంది. అలా తిరగడం వల్ల గానుగ నుండి నూనె వస్తుంది.

అలాగే మనందరం సుఖభోగాలనే ఈ గడ్డి చుట్టను సదా వెంటాడుతున్నాం. మనం తిరిగే చుట్లే మనమెత్తే అసంఖ్యాకమైన జన్మలు. మనం కోరేవేమో మనకు లభించవు. మనం ఎప్పుడూ కోరుకున్నది సుఖాన్ని మాత్రమే. కానీ సుఖం వైపు మనం వెళ్ళేకొద్దీ, అది మనకు దూరమై పోతుంది. ఈ నిజాన్ని మనం తెలుసుకోలేక కష్టాల పాలవుతున్నాం. మీ జీవితాలను పరిశీలించుకోండి. అందులో సుఖమెంత ఉందో గమనించండి. లోక ప్రవృత్తి అనే ఈ అడవిబాతు వేటలో నిజానికి మీకు కలిగిన లాభమెంతో గుర్తించండి.

నిజానికిక్కడ సుఖమెవరికీ లేదు, ఎప్పుడూ లేదు. ఒకడు సంపన్నుడై తినడానికి పుష్కలంగా ఉంటే అతని జీర్ణకోశం పాడై ఉంటుంది. అతడు తినలేడు. ఇంకొకనికి జీర్ణశక్తి బాగున్నా, సముద్రపు కాకిలా జీర్ణించుకోగలిగిన శక్తి ఉన్నా, అతనికి తినడాని కేమీ ఉండదు. ధనం ఉంటే బిడ్డలుండరు. ఆకలితో మాడిపోతున్న పేదవాడికి ఇంటి నిండా పిల్లలుంటారు. వారిని పెట్టుకొని ఏమి చేయడానికీ అతనికి పాలుపోదు. ఇలా ఉండడానికి కారణమేమిటి? అందుకు కారణం - సుఖం, దుఃఖం ఒకే నాణానికి ఉన్న బొమ్మా, బొరుసుల్లాంటి వన్న నిజాన్ని విస్మరించడమే. సుఖాన్ని కోరుకునేవాడు దుఃఖాన్ని కూడా భరించాలి. దుఃఖం లేని సుఖాన్ని కోరుకోవడమే మన దుఃఖాలకు అసలు కారణం. ❖

# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -21

(...గత సంచిక తరువాయి)

# భగవంతుని మీదే భారమంతా!

స్వామి జపానంద పంజాబ్‌లో చంబా కొండ మీద నుంచి పఠాన్‌కోట వెళుతున్నారు. అది వర్షాకాలం. జోరుగా వాన పడుతోంది. చేతిలో గొడుగు లేదు. ఒక పల్చని కంబళి మాత్రం ఉంది. అదే తల మీద నుంచి కప్పుకున్నారు. అయితే అది కూడా వర్షపునీటితో తడిసి పోయి బరువెక్కుతోంది. మాటి మాటికీ దాన్ని పిడిచి, కప్పుకుంటున్నారు. సుమారు పన్నెండు మైళ్ళ దూరంలో ఒక గ్రామం ఉంది. అంతవరకూ ఉండడానికి ఎక్కడా సరి అయిన చోటు లేదు. అలా నడుస్తూ గ్రామం పొలిమేరల్లోకి చేరుకున్నారు. దూరం నుంచి ఇళ్ళు కనిపిస్తున్నాయి. గ్రామంలోకి ప్రవేశించడానికి ఒక చిన్న వంతెన దాటాలి. అయితే అటు దోవ అంతా నీటితో నిండిపోయి ఉంది. ఎక్కడా నేల కనిపించడం లేదు. ఏమిటి చెయ్యడమా అని ఆలోచిస్తూ చుట్టూ చూశారు. ఒక కాలిబాట కనిపించింది. అది నది దగ్గర వరకూ ఉంది. అక్కడ కొండ మీద నుంచి ఒక జలపాతం వచ్చి, కింద నదిలో కలుస్తోంది. గ్రామంలోకి వెళ్ళాలంటే వంతెన దాటాలి. లేదంటే పక్కనే ఎత్తయిన కొండ మీదకు ఎక్కి అటువైపు దిగి వెళ్ళాలి. రెండోది సాధ్యం కానిది. సన్న్యాసి కాలి బాటలో నది దగ్గరకు వెళ్ళారు. నదిలో నీళ్ళు ప్రచండమైన వేగంతో ప్రవహిస్తున్నాయి. వంతెనకు నీళ్ళు తగులుతూ ఉన్నాయి. కొండ మీద నుంచి జలపాతం కూడా తీవ్రమైన వేగంతో కిందకు దూకుతోంది. ఏ మాత్రం కాలు జారినా చంబల్ నదిలో పడే అవకాశం ఉంది. బండల మీద నుంచి దుముకుతూ నది ప్రవహిస్తోంది. హోరున కురుస్తున్న వానలో సాయం చేసే మానవమాత్రుడెవరూ కనిపించ లేదు. వంతెన దాటడమే ఏకైక ఉపాయం అని నిశ్చయించుకున్నారు. ఆ ప్రయత్నంలోనే నది వైపు అడుగులు వేశారు. అయితే మొదటి అడుగుకే కాలు బురదలో కూరుకుపోయింది. చేతిలో ఉన్న కర్ర కూడా సగానికి పైగా బురదలోకి వెళ్ళిపోయింది. ఆయన అక్కడే అలాగే అసహాయంగా నిల్చుండి పోయారు. కాళ్ళ దగ్గర జలపాతం నుంచి నదిలోకి పడుతున్న నీటి వేగం, పైన వాన దేవుడు కురిపిస్తున్న వాన, హిమాలయ ప్రాంతాలలో వీచే చల్లటి మంచుతో కూడిన గాలి, తడిసి ముద్దయిపోయిన వస్త్రాలు, ఇక్కడ నుంచి బయట పడడం అసంభవం. ఇక మృత్యువే దారి అనుకొని, కళ్ళు మూసుకొని దైవస్మరణ చేసుకుంటున్నారు.

ఇంతలో భయంకరమైన శబ్దం అయింది. కళ్ళు తెరిచి చూస్తే తాను నిల్చొని ఉన్న చోట పైన జలపాతంతో పాటు రాళ్ళు, మట్టి, బురద జారి ఆయన వైపుగా వస్తున్నాయి. అంతే ఇంక ఈ రాళ్ళ కింద సమాధి అయిపోవడం ఖాయం అనుకున్నారు. కానీ ఆశ్చర్యం! పెద్ద పెద్ద బండలు వారికి అడుగు దూరం వరకూ వచ్చి ఆగిపోయాయి. అప్పుడే వర్షం తగ్గుముఖం పట్టింది. దగ్గరలోనే వచ్చి ఆగిన బండరాయి మీద చెయ్యి వేసి ఆనుకుని బురదలో కూరుకుపోయిన కాళ్ళు బయటికి తీశారు. రాళ్ళు, మట్టి అంతా చేరి అక్కడ నడవడానికి తోవ ఏర్పడింది. ఆ బాటలోనే నడిచి ఆ జలపాతం దాటి అవతల వైపు వెళ్ళగలిగారు. భగవంతుడి లీలలు అనూహ్యమైనవి అనుకుంటూ వంతెన వైపు నడిచారు. అక్కడ నుంచి గ్రామం కనిపిస్తోంది.



వంతెనకు ఇటువైపు ఒక చిన్న దుకాణం ఉంది. అక్కడ మామూలుగా అవసరమైన కిరాణా సామగ్రి, బట్టలు లాంటివి అమ్ముతారు. అక్కడికి వెళితే ఆ కొట్టు యజమాని ఇలా అన్నాడు: "వంతెన దాటడానికి లేదు. నదిలో నీటి మట్టం పెరగడంతో వంతెన కొట్టుకుపోతుందని భయంతో తాళాలు వేస్తారు. అటు వెళ్ళడం అపాయంతో కూడుకున్న పని". అది విని స్వామి అన్నారు "తాళం చెవి ఉంటే తియ్య కూడదా! ఊళ్ళోకి వెళ్ళిపోతాను. ఇక్కడ ఎక్కడ ఉంటాను?" అన్నారు. అంతలో లోపల నుంచి మరొక వ్యక్తి వచ్చి సాధువును చూసి, "రండి స్వామీజీ రండి! మీరు పూర్తిగా తడిసిపోయి ఉన్నారు. దోవ లేదు కదా ఎలా వచ్చారు? బాగా చలిగా ఉంది. రండి! ఈ మంట దగ్గర కూర్చొని చలి కాచుకోండి. తడి బట్టలు ఆరపెట్టుకోండి. ఇలాగే ఉంటే జలుబు చేసి న్యుమోనియాలోకి దింపుతుంది. మీరు టీ తాగుతారు కదా!" అంటూ ఆయన చెయ్యి పట్టుకుని సాదరంగా లోపలికి తీసుకెళ్ళాడు. "తడి బట్టలు వదిలి ఇదిగో ఇవి కొత్త బట్టలు, ఇవి కట్టుకోండి. ఈ కొత్త కంబళి కప్పుకోండి" అన్నాడు.



చలి మంట దగ్గరలో రెండు, మూడు కంబళీలు పరిచి "ఇలా కూర్చోండి! వెచ్చగా ఉంటుంది" అని చెప్పి, టీ కలిపి ఇచ్చాడు. టీ తాగిన తరువాత, "స్వామీజీ! ఇంక మీరు నిద్రపోండి. అలసట తీరుతుంది. రేపు వంతెన గేటు తెరిస్తే మీరు ఊళ్ళోకి వెళ్ళవచ్చు. ప్రస్తుతం వర్షం ఆగింది. రాత్రంతా వాన పడకపోతే నదిలో నీరు తగ్గుతుంది. వంతెన తెరుస్తారు. ఇప్పుడు మీరు హాయిగా నిద్రపోండి" అన్నాడు.

సన్న్యాసి (స్వామి జపానంద) బాగా అలసిపోయి ఉన్నందువల్ల కంబళి మీద వాలగానే నిద్రపోయారు. సాయంత్రం ఐదు గంటల నుంచి రాత్రి పది గంటల వరకూ బాగా నిద్రపోయారు. నిద్ర లేచేటప్పటికి ఆ దుకాణం యజమాని, అతని తమ్ముడు అక్కడే కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. ఒకతను వచ్చి వేడి నీళ్ళు అందించి "ముఖం కడుక్కుని రండి మహరాజ్! వంట అయింది". అని భోజనానికి పిలిచాడు. స్వామికి చాలా ఆకలిగా ఉంది. కాళ్ళు చేతులూ, ముఖం కడుక్కుని వచ్చి భోజనం చేశారు. వంట అమృతంలా ఉందనిపించింది. మాట్లాడాలని అనిపించలేదు.

మధ్యాహ్నం జరిగిన సంఘటనలే మనస్సులో తిరుగుతున్నాయి. బండరాళ్ళ కింద సమాధి అయిపోతానని అనిపించిన మరుక్షణం అవే జలపాతం దాటడానికి దారి చూపాయి. ఈ అన్నదమ్ముల రూపంలో భగవంతుడు సహాయం అందించాడు. భోజనం అయిన తరువాత స్వామి జపానంద పడుకునేందుకు ఏర్పాట్లు చేశారు. ఉదయం ఆయనకు మెలకువ వచ్చేసరికే వాళ్ళిద్దరూ నిద్ర లేచారు. వర్షం కురుస్తూనే ఉంది. స్వామి బట్టలు, కంబళి ఆరపెట్టి వారి దగ్గరలోనే ఉంచారు. స్నానాదికాలు ముగించుకొని వచ్చాక, వేడి టీ ఇచ్చారు. "వర్షం తగ్గే సూచనలు ఏమీ లేవు. నది దాటలేరు. వంతెన గేటు తెరవరు. మనందరం కూర్చుని సత్సంగం చేసుకుందాం" అన్నారు. మధ్యాహ్నం వరకు అనేక ధర్మసందేహాలు అడిగి తెలుసుకున్నారు. ఆధ్యాత్మిక చర్చలు చేసుకున్నారు. మధ్యాహ్నం భోజనాలు ముగిసేసరికి వర్షం తగ్గింది. అవతలి వైపు నుంచి పోలీసు జవాను గేటు తెరవమన్నాడు. గేటు తెరవగానే వాళ్ళకు ధన్యవాదాలు అర్పించి సన్న్యాసి సెలవు తీసుకున్నారు. ❖

(మిగతా వచ్చే సంచికలో...)

అనువాదం : శ్రీమతి జి.ఎస్. లక్ష్మి

## పండుగలు - పర్వదినాలు

### మార్చి - 2009

| | | | |
|---|---|---|---|
| 07 | శనివారం | : | ఏకాదశి |
| 11 | బుధవారం | : | శ్రీ చైతన్య మహాప్రభువు జయంతి |
| 14 | శనివారం | : | స్వామి యోగానంద జయంతి |
| 22 | ఆదివారం | : | ఏకాదశి |
| 27 | శుక్రవారం | : | ఉగాది |

### ఏప్రిల్ - 2009

| | | | |
|---|---|---|---|
| 03 | శుక్రవారం | : | శ్రీరామనవమి |
| 05 | ఆదివారం | : | ఏకాదశి |
| 21 | మంగళవారం | : | ఏకాదశి |
| 27 | సోమవారం | : | అక్షయ తృతీయ |
| 29 | బుధవారం | : | ఆది శంకరాచార్యుల జయంతి |

# మూగజీవులకూ ముక్తిని ప్రసాదించిన మహర్షి

మూలం : సద్గురు శ్రీరమణ మహర్షి చరిత్ర    చిత్రాలు : గోవి    తెలుగుసేత : స్వామి జ్ఞానదానంద










4
స్వామీ! నా బిడ్డ ప్రాణాపాయ స్థితిలో ఉన్నాడు. దయతో మీరే అతనికి ప్రాణభిక్ష పెట్టండి.
చనిపోయిన కోతిని ఇక్కడకు తెచ్చిన కోతులకు స్వాంతన కలిగించాను, అంతే! మీ బిడ్డను ఒక మంచి వైద్యుని వద్దకు తీసుకెళ్ళండి!
5
స్వామీ! నా భర్త లేకుండా నేను జీవించలేను. దయచేసి మీరే ఆయన్ని కాపాడాలి!
అలాంటి శక్తి నాకు లేదమ్మా!
స్వామీ! మీరు విభూతి మంత్రించి ఇస్తే నా కుమారుడు బ్రతుకుతాడు.
సరేనమ్మా! ప్రయత్నిస్తాను.
6
అందరూ అలా వేడుతుంటే మహర్షికి వారి పట్ల జాలి కలిగింది. పొయ్యిలోంచి కొద్దిగా బూడిదను తీసుకొచ్చి....
అమ్మా! ఇదిగో ఈ బూడిదను నీ బిడ్డకు పూయి! అంతా బాగవుతుంది!
7
ఆ బూడిద పూసిన వెంటనే ఆ యువకుడు పూర్తిగా కోలుకున్నాడు. ఆ యువకుడు అలా హఠాత్తుగా జబ్బు పడినందుకు అతడు ఆ రోజు ఉదయం చేసిన ఒక పనే కారణం. అది...
8
శ్రీరమణ మహర్షి పట్ల భక్తులే కాక జంతువులు కూడా ఆకర్షింపబడేవి. కోతులతో ఆయన సంభాషించేవారు. వారి మాటలను కోతులు కూడా వినేవి. అవి కొట్లాడుకుంటే వాటి తగాదాలను ఆయన తీర్చేవారు!
ఇటు చూడండ్రా! తోటకు వెళ్ళినప్పుడు పోట్లాడుకోకూడదు!
9
కోతులు రోజూ చింతగింజలు తినడానికి తోటకు వెళతాయి. ఆ ఇస్లామ్ యువకుడు ఒక జాటీ పట్టుకుని తోటకు కాపలా కాస్తున్నాడు.

మిగతా 36వ పేజీలో...

# గురువునే పరీక్షించిన శిష్యుడు

**శి**ష్యులకు ఏం బోధిస్తాడో దాన్ని తాను స్వయంగా ఆచరించి చూపేవాడే నిజమైన గురువు. బోధనలకూ, ప్రవర్తనకూ పొంతన లేని గురువును జనం ఎంత మాత్రం విశ్వసించరు. ఈ కారణం వల్లనే, వ్యాపారస్థులు రూపాయి నాణాన్ని ప్రయోగించి పరీక్షించిన విధంగా తనను కూడా పరీక్షించిన తరువాతనే గురువుగా అంగీకరించాల్సిందిగా శ్రీరామకృష్ణులు తన శిష్యులను హెచ్చరించేవారు.



స్వామి యోగానంద

ఒకరోజు యోగీంద్రుడు (స్వామి యోగానంద) శ్రీరామకృష్ణుల గదిలో నిద్రిస్తున్నప్పుడు అర్ధరాత్రి అతడికి మెలకువ వచ్చింది. అప్పుడు గదిలో శ్రీరామకృష్ణులు కనిపించలేదు. ఒకవేళ గురుదేవులు బయట పచార్లు చేస్తున్నారేమో అని యోగీంద్రుడు తలచాడు. కానీ, శ్రీరామకృష్ణులు అక్కడా అగుపించలేదు. అంతలోనే హఠాత్తుగా అతడి మనస్సులో శ్రీరామకృష్ణుల గురించి ఒక ఘోరమైన అనుమానం తలయెత్తింది. 'గురుదేవులు నహబత్‌కి పోలేదు కదా? (ఆ రోజుల్లో శారదాదేవి 'నహబత్'లో నివసించేవారు) ఎల్లప్పుడూ కామినీ కాంచనాల పరిత్యాగం గురించి చెప్పే గురుదేవుల మాటలకు ఆయన చర్యలు విరుద్ధంగా ఉండడం సంభవమా?' అని యోగీంద్రుడు అనుకున్నాడు.

నిజం ఏమిటో నిర్ధారించుకోవాలని యోగీంద్రుడు 'నహబత్' సమీపంలో నిలబడి పరిశీలించసాగాడు. అప్పుడు శ్రీరామకృష్ణులు పంచవటి నుంచి రావడం చూశాడు యోగీంద్రుడు. గురుదేవులు "నువ్వు ఇక్కడ ఎందుకు నిలబడ్డావు?" అని యోగీంద్రుణ్ణి ప్రశ్నించారు. గురుదేవుల శీలాన్ని శంకించినందుకు సిగ్గుతో తలవంచుకుని మౌనంగా ఉండిపోయాడు. యోగీంద్రుని మనసుని గ్రహించిన శ్రీరామకృష్ణులు "నువ్వు చేసింది మంచి పనే. సాధువు విషయంలో విశ్వాసం పెంచుకునే ముందు అతణ్ణి అనేక రోజులు రాత్రింబవళ్ళూ పరీక్షించాలి" అని అన్నారు. ❖

(మార్చి 14న శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన **స్వామి యోగానంద జయంతి**)



# జగత్తుకు కారణం బ్రహ్మమా?

శ్రీరాముడు: మహర్షీ! "మాయ వల్ల విజృంభిస్తున్న ఈ జగత్తుకు మూలకారణం బ్రహ్మమే. సర్వానికీ కర్త బ్రహ్మమే" అని లోకంలో వ్యవహరించబడుతోంది కదా!

శ్రీవశిష్ఠ మహర్షి: అవును. అలా లోకరీతి ఉన్నమాట నిజమే, కానీ అవి బోధించడానికే చెప్పబడుతున్నాయి. "ఈ 'జగత్తు' అనబడేది లేదు" అనే సత్యానికి సంబంధించిన దృఢనిశ్చయం ఏర్పడే వరకే అలా చెప్పడం.

ఇక్కడ నీకు ఒక దృష్టాంతం చెబుతాను విను. దర్పణంలో – ఎదురుగా ఉన్న వస్తుజాలం, ఆ వస్తువుల కదలికలు ప్రతిబింబిస్తాయి కదా! ఆ దర్పణం తనలో ఎలాంటి ఇచ్ఛాద్వేషాలూ, ప్రియ – అప్రియాలూ, రాగ–విరాగాలూ లేకుండానే ప్రతిబింబింపజేస్తోంది. అంటే, "నేను ఈ వస్తువులనే చూపిస్తాను, వాటిని చూపను. ఎందుకంటే, అవి నాకు ఇష్టం కాదు..." అనేది ఆ అద్దానికి ఉండదు. అందుచేత, ఆ ప్రక్రియ యొక్క కర్తృత్వాన్ని దర్పణానికి ఆపాదించలేం. సామీప్యత – సన్నిధానాల వల్లనే దృశ్యం అద్దంలో ప్రతిబింబిస్తోంది. అంతమాత్రం చేత ఆ ప్రతిబింబిస్తున్నది అద్దంలోని భాగమని కూడా అనలేం కదా! అలాగే, సామీప్యత – సన్నిధానం కారణంగా ఈ 'జగత్తు' అనబడేది వెలిగించబడడం వల్ల "ఈ జగత్తుకు కారణం ఆత్మచైతన్యం" అని చెప్పబడుతోంది. అద్దమే లేకపోతే ప్రతిబింబమే లేనట్లు, ఆత్మచైతన్యమే లేకుంటే 'జగత్తు' అనే అనుభవం ఎవరికి? కానీ, ఈ జగత్తు ఆత్మ యొక్క ఒక శరీరభాగమని అనడానికి వీలు లేదు.

ఒక బీజం నుంచి అంకురాలు, ఆకులు, ఫలాలు ఉత్పన్నమైనట్లు, 'చిత్తు' నుండే చిత్తం – జీవులు – మనసులు .... అంతా కలుగుతున్నాయి. ప్రళయసమయంలో సృష్టి – రహితమై 'శుద్ధ చిత్తు' శేషిస్తోంది. ప్రళయానంతరం తిరిగి "సృష్టి"... ఆకారంలో వివర్తం చెందుతోంది. అంకురశక్తి మౌనంగా నిదురించియున్న బీజంలో నుంచి వృక్షంగా, తిరిగి ఆ వృక్షంలో నుంచి బీజంగా ఉత్పన్నమవడం లేదా? ఇది కూడా అలాంటిదే.

బీజంలో ఉన్న "వృక్షాన్ని జనింపజేయగల శక్తి" బ్రహ్మంలో ఉన్నటువంటి "జగత్తును జనింపజేయగల శక్తి".... ఈ రెండూ ఒక రకంగా సమానమైనవే. అయితే ఆ రెండింటి మధ్య ఒక భేదం ఉంది. 'బీజం' కన్నా వేరుగా 'వృక్షం' అనేది ప్రాప్తిస్తోంది కదా! కానీ బ్రహ్మానికి సంబంధించిన జ్ఞానం ఉదయించిన తరువాత "బ్రహ్మం కన్నా వేఱుగా విశ్వం లేదు" అనే బోధ ఏర్పడుతోంది.

దీపం ప్రకాశిస్తూ ఉండగా, ఆ దీపపు కాంతిలో వస్తువులు కనబడతాయి. కానీ "ఆ దీపమే ఈ వస్తువులను మాకు చూపుతోంది" అని అనగలమా? అనలేం. ఎందుకంటే, "ఈ వస్తువులను ఈతనికి చూపాలి. ఇవి ఈతనికి చూపకూడదు" అనే ఇచ్ఛ ఆ దీపానికి లేదు కదా! అయితే దీపమే లేకుంటే చూడనే లేమే! బ్రహ్మం సమక్షంలో ఈ జన్మాదులు, భావాభావాలు ఉంటున్నాయి; లేకుండా పోతున్నాయి కూడా. అయితే "వీటికి బ్రహ్మం కారణం" అని అనలేం. కానీ, బ్రహ్మమే లేకుంటే ఇక ఈ జగత్తు, జన్మ మృత్యువులు మొదలైనవన్నీ పొందేదెవరు? కాబట్టి, బ్రహ్మం ఉన్నందుకే జగద్వ్యవహారం, తదితరాలు ఉంటున్నాయి.

ఒక పిల్లవాడు ఒక అద్దంలోనో, లేక స్ఫటిక శిలాఖండంలోనో ప్రతిబింబిస్తున్న ఆకాశంలోని చంద్రుణ్ణి చూసి "ఈతడే అసలు చంద్రుడు, ఇతనిని మనం పట్టుకోగలం" అని అనుకుంటూ ఉంటాడు చూశావా? అవిద్యా మోహితులైన వారు మాత్రమే బ్రహ్మంలో 'జగత్తు'ను గాంచుతున్నారు. స్ఫటిక శిలాఖండంలో స్ఫటిక పదార్థమే ఉంది కానీ చంద్రుడు ఉన్నాడా?

కాబట్టి ఓ రామచంద్రా! నీకు కనబడుతున్న 'ప్రపంచం నీ స్వస్వరూపానికి ఏ మాత్రం వేరు కానట్టి "బ్రహ్మమే అయి ఉంది. "వేరు"గా కనబడడం స్వకల్పితమైన 'మాయ' వల్లనే. ఈ ఆత్మస్వరూపానికి సంబంధించిన 'ఎఱుక' అంతరంగంలా దృఢీకరణం పొందిన జ్ఞానికి – జన్మ మృత్యువులతో సహా వీటిలో ఏదీ విపరీతమైనదిగా కనిపించదు. ❖

('శ్రీవసిష్ఠ రామ సంవాదం' ఉత్పత్తి ప్రకరణం ఉత్తరార్థం నుంచి) **అనువాదం : వై. హెచ్. రామకృష్ణ**



## కనుల పండువగా

# కర్నూలు భక్త సమ్మేళనం



భక్తసమ్మేళనం ప్రారంభోత్సవంలో పాల్గొన్న స్వామీజీలు, కార్యకర్తలు



స్వామీజీల వేదపఠనం

కర్నూలులో 2009 జనవరి 9,10,11 తేదీల్లో శ్రీరామకృష్ణ-వివేకానంద భావ ప్రచారపరిషత్ 18వ వార్షిక భక్త సమ్మేళనాన్ని 'కర్నూలు శ్రీరామకృష్ణ సేవాసమితి' అత్యంత వైభవంగా నిర్వహించింది. ఈ సమ్మేళనానికి రామకృష్ణ మఠం స్వామీజీలు, శారదా మఠం మాతాజీలు విచ్చేశారు. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల నుంచి వచ్చిన రెండువేల మంది భక్తులు ఈ సమ్మేళనంలో పాల్గొన్నారు. జనవరి 9వ తేదీన మధ్యాహ్నం 2.30 గంటలకు స్వామీజీల వేద పఠనంతో రామకృష్ణ మఠం, మిషన్‌ల సహాయక కార్యదర్శి స్వామి సువీరానందజీ జ్యోతి ప్రజ్వలనతో భక్త సమ్మేళనం ప్రారంభమయింది.



శ్రీరామకృష్ణ కథామృత గీతాలాపన



వక్తలు: అమరేశానందజీ, ఆత్మవిదానందజీ, సువీరానందజీ, జ్ఞానదానందజీ, శశికాంతానందజీ, అక్షరాత్మానందజీ, సుకృతానందజీ, శ్రీకాంతానం



భవానీప్రాణ మాతాజీ, బోధమయప్రాణ మాతాజీ, త్యాగనిష్ఠప్రాణ మాతాజీ, డా॥ కమలా జయరావు, ఛాయామణి, పరాశరం శారద,



రోజూ ఉదయం 6 గంటలకు శ్రీరామకృష్ణ సుప్రభాతం, అష్టోత్తర శతనామ పూజ, రామకృష్ణ కథామృత పఠనం, కీర్తనలు, ధ్యానంతో కార్యక్రమం ప్రారంభమయ్యేది.

స్వామీజీలు, మాతాజీలు, ఇతర వక్తలు తమ ఆధ్యాత్మిక ప్రసంగాలతో భక్తుల్ని మంత్రముగ్ధుల్ని చేశారు. భక్త బృందాల భజనలు, హరికథా గానం భక్తుల హృదయాల్ని రంజింపజేశాయి. విద్యార్థుల కూచిపూడి నృత్యం, భక్తి సంగీతం అందరినీ అలరించాయి. సాయంత్రం భగవాన్ శ్రీరామకృష్ణుల సంధ్యారతి–ఆరాత్రిక గానం అనూహ్య ఆధ్యాత్మిక వాతావరణాన్ని నెలకొల్పింది. యువత కోసం ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన 'యువజన సదస్సు'లో వెయ్యి మంది విద్యార్థులు పాల్గొని స్వామీజీల స్ఫూర్తిదాయక సందేశంతో ప్రేరణ పొందారు.

భక్తులు ఈ మూడు రోజులూ మూర్తిత్రయ స్మరణలో అలౌకిక ఆనందాన్ని అనుభవించారు. అనునిత్యం అదే ఆనందానుభూతులతో మన జీవనయాత్రను కొనసాగించేందుకు తగిన శక్తినీ, యుక్తినీ, భక్తినీ ప్రసాదించవలసిందిగా శ్రీగురుమహరాజ్‌ని ప్రార్థిద్దాం. ❖

నివేదిక : డా॥ శరత్‌చంద్ర



శ్రీరామకృష్ణులకు సాయం సంధ్యారతి, ఆరాత్రిక గానం



'శ్రీరామకృష్ణ లీలామృతం' పుస్తక ఆవిష్కరణ



...నలో స్వామి జ్ఞానదానందజీ, భక్త బృందం







పి. నారాయణాచార్యుల హరికథాగానం, వివేకానంద స్టడీసర్కిల్ విద్యార్థినుల భక్తి సంగీతం



...ందజీ, సుప్రియానందజీ, వినిశ్చలానందజీ, అచింత్యానందజీ, స్వసంవేద్యానందజీ, గుణేశానందజీ, ఈశప్రేమానందజీ, శితికంఠానందజీ, పరిజ్ఞేయానందజీ



డా॥ శరత్‌చంద్ర, డా॥పి. శ్యామసుందరమూర్తి, డి.వి. బ్రహ్మాజీ, డా॥ పి.వి. రెడ్డి, అమిరపు నటరాజన్



కుమారి టి. ప్రవల్లిక కూచిపూడి నృత్యం



# అలౌకిక ఆనందానికి వైరాగ్యం

– గౌతమ్

అన్నింటినీ వెంటాడుతుంది మృత్యువు; మృత్యువు నుంచి తప్పించుకునేందుకు విశ్వప్రయత్నం చేస్తారందరూ. కానీ విరాగి, మృత్యువును వెంబడిస్తాడు. శరీరం, బుద్ధి, మనస్సు అహంకారాల్ని మృత్యువు పాలు చెయ్యాలనుకుంటాడు. విషసర్పం కాటు వల్ల కలిగే నొప్పి కన్నా మనోవ్యథ ఎక్కువ బాధాకరమైనదని గ్రహిస్తాడు. ఆ మనస్సును అంతం చేద్దామనుకుంటాడు విరాగి. తల్లి, తండ్రి, అక్క, అన్న, చెల్లి... ఇలా ప్రపంచంలోని బంధాలన్నింటినీ వివేకమనే ఆయుధంతో చీల్చి చెండాడతాడు. పంజరంలో నుంచి బయటపడి స్వేచ్ఛగా ఎగిరే పక్షిలా విరాగి భవబంధాల నుంచి బయటపడతాడు.

సంపదలు, కీర్తి, అధికారం – ఇవన్నీ అలౌకికానందానికి అటంకాలని గ్రహించిన మహావైరాగ్య సంపన్నులు భగవాన్ బుద్ధ, భగవాన్ రమణ మహర్షి, భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస.

భగవాన్ బుద్ధ : సిద్ధార్థుడికి అన్నీ ఉన్నాయి... కాబోయే మహారాజు. సుగుణవతి శీలవతి సౌందర్యవతి అయిన భార్య, వంశాన్ని నిలబెట్టడానికి పుత్రుడు ఉన్నారు. అయినా కూడా వైరాగ్యంతో అన్నీ విడిచి అడవులకు వెళ్ళాడు. అతనికి మతి భ్రమించిందనీ, అందుకే రాజ్యాన్నీ, ధర్మపత్నినీ, పసివాడైన కుమారుణ్ణీ వదలి వెళ్ళాడనీ లోకం అంది. అందరూ పిచ్చివాడు అన్నటువంటి సిద్ధార్థుడు కాస్తా బుద్ధుడయ్యాడు. అతణ్ణి చూసిన లోకం ఆశ్చర్యంతో అతను సామాన్యుడు కాడనీ, అవతార పురుషుడనీ కీర్తించింది.

భగవాన్ రమణ మహర్షి : ఈ "నేను" ఎవరో తెలియకుండా, తెలుసుకోకుండా ఏది సాధించినా ఏం ప్రయోజనం! భార్య... పిల్లలు... ఈ సంసారం... ఇవన్నీ ఎందుకు! అజ్ఞానిగా సంసారంలో బ్రతకడం కన్నా చావడమే నయం" అనుకున్నాడు వేంకట రమణుడు. ఎవరికీ చెప్పకుండా ఇల్లు విడిచి అరుణాచలం (తిరువణ్ణామలై) చేరాడు. మహావిరాగి అయిన రమణుడు ధరించిన వస్త్రాలను త్యజించాడు. ఆలయంలోని పూజారుల ప్రార్థన మేరకు కౌపీనం ధరించాడు రమణుడు. అతని తల్లి వచ్చి, ఇంటికి రమ్మని బ్రతిమలాడి కంట తడిపెట్టుకుంది. గుండెలు బాదుకుంటూ తల్లి దుఃఖించినా ఆ బాల విరాగి స్పందించలేదు. కనీసం నోరు కూడా విప్పలేదు. చుట్టూ ఉన్న వాళ్ళు ఏదో ఒక జవాబు చెప్పమన్నారు. అప్పుడు ఆ బాలుడు 'నీ తల రాత నీది, నా తల రాత నాది. దక్కేది వద్దన్నా దక్కుతుంది, దక్కనిది ఎంత ప్రయత్నించినా దక్కదు. కాబట్టి ఎవరి దారిన వారు మౌనంగా వెళ్ళడం మంచిది" అని వ్రాసి, మౌనంగా ఉండిపోయాడు. తల్లి మరేమీ చేయలేక వెనుదిరిగింది. ఆ బాలుడు రమణ మహర్షి అయ్యాడు. అతను అక్కడ నివాసం ఉండడం వల్ల అరుణాచల క్షేత్ర కీర్తి విశ్వవ్యాప్తమైంది.

భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస : వివాహం చేసుకున్నా, బ్రహ్మచర్యాన్ని పాటించిన మహావిరాగి శ్రీరామకృష్ణ పరమహంస. ఎప్పుడైనా ధనాన్ని తాకితే ఆయన చేతులు కొంకర్లు తిరిగేవి. వారు వెంటనే గంగాజలంతో చేతులు కడుక్కునేవారు. ధనాన్ని విషం కన్నా భయంకరమైనదిగా భావించేవారు. ఒకరోజు నరేంద్రుడు తన గురువును పరీక్షించడానికి వారు పడుకునే పరుపు కింద ఒక నాణాన్ని ఉంచాడు. శ్రీరామకృష్ణులు వచ్చి పరుపు మీద కూర్చోగానే, వారి శరీరానికి చెప్పలేని బాధ కలిగింది. వారి మనస్సులో అశాంతి కలిగింది. వెంటనే శిష్యులను పిలిచి పరపు, దిండు అన్నీ తీసి చూడమన్నారు. అలా వెతకగా రూపాయి నాణెం కనపడింది. అది తీసేసిన తరువాత ఆయన శాంతిగా పడుకున్నారు. ఇదంతా చూసి నరేంద్రుడు ఆశ్చర్యపోయాడు. కాలాంతరంలో స్వామి వివేకానంద (నరేంద్రనాథ్) అమెరికాలో ప్రసంగిస్తూ తన గురువు అయిన శ్రీరామకృష్ణులు వైరాగ్యంలో రారాజు అని కీర్తించారు.

అజ్ఞాన అస్త్రాలైన కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలు అతని మీదకు దాడి చేస్తాయి. విరాగి నిరంతర సాధనలతో బ్రహ్మజ్ఞానాన్ని పొందుతాడు. ఆ బ్రహ్మజ్ఞాన ప్రకాశానికి అజ్ఞాన అస్త్రాలు మటుమాయమవుతాయి. విరాగి సర్వజ్ఞుడై బ్రహ్మానందంలో లీనమై, భగవంతుడితో సమానుడవుతాడు. ❖

# అందరి పయనం.. ఆ ఉన్నత శిఖరాలకే...

యువవాహిని

– స్వామి సేవ్యానంద

"... నేను నిత్యం స్వామి వివేకానంద పుస్తకాలను చదివి, ఆచరించే ప్రయత్నం చేస్తున్నాను. వీటి ప్రభావంతో నా జీవితంలో ఆశావహ దృక్పథం ఏర్పడిందని నేను శ్రద్ధా, విశ్వాసాలతో చెప్పగలను – మన దేశంలోని యువతరమంతా స్వామీజీ పుస్తకాలను చదివి, ఆచరించే ప్రయత్నం చేస్తే తప్పకుండా మన దేశం పురోగతి చెందగలదు..."

రాజ్‌కోట్ రామకృష్ణ మఠానికి ఈ ఉత్తరం వ్రాసింది ఒక విద్యార్థి కాదు, ఉద్యోగమో, వ్యాపారమో చేసుకుంటున్న సజ్జనుడూ కాదు. జీవితంలో ఆవేశంతో తీసుకున్న తప్పుడు నిర్ణయానికి పశ్చాత్తాపపడుతున్న ఒక ఆశాజీవి. సమాజం దృష్టిలో కారాగారంలో శిక్ష అనుభవిస్తున్న ఒక అపరాధి.

## మనస్సుకు శిక్షణ బాల్యం నుంచే!

మనిషిలో చెడు స్వభావం, వినాశాత్మకమైన భావాలు రావడానికి కారణం ఏమిటి? వీటికి ముఖ్య కారణం మనస్సుకు సరైన శిక్షణ నివ్వకపోవడమే!

"మనస్సు తెల్లని బట్ట లాంటిది. దాన్ని ఏ రంగులో ముంచితే అది ఆ రంగు అవుతుంది" అని శ్రీరామకృష్ణులు చెబుతారు. మనస్సుకు మనం ఏ విధంగా శిక్షణనిస్తే ఆ విధంగానే తయారవుతుంది.

మనస్సు తెల్లని బట్టలా స్వచ్ఛంగా ఉండే పసితనంలోనే వారికి మంచి ఆలోచనలనూ, శక్తిమంతమైన ఆలోచనలనూ అందించి, శిక్షణను ఆరంభించడం తెలివైన పని. పరీక్షలనే ఉద్దేశంగా పెట్టుకొని, పిల్లలను ఒత్తిడికి గురి చేసే విద్యా విధానానికి స్వస్తి చెప్పి, మానవ ప్రతిభను (హ్యూమన్ ఎక్సెలెన్స్) వ్యక్తం చేయగలిగే విద్యావిధానానికి ప్రాధాన్యం ఇవ్వాలి. నిర్మలమైన మనస్సుతో పెరిగిన వీరు భవిష్యత్తులో వినాశాత్మకమైన భావాలకు దూరంగా ఉండి, నిర్మాణాత్మకంగా ఆలోచించగలరు.



## ద్వేషానికి దూరంగా...

మనం సమాజంలో నలుగురితో కలిసి పనిచేసినప్పుడు అభిప్రాయభేదాలు రావడం సహజం. పూర్వం ఎవరితోనైనా మనఃస్పర్థలు వస్తే కొద్దిక్షణాలకే అంతా మరచి కలసిపోయేవారు. నేటి యువతరం ఆ విషయాన్ని పదే పదే ఆలోచిస్తూ, మనస్సులో ద్వేషభావం పెంచుకుంటున్నారు. అహంకారంతో పంతాలు, పట్టింపులకు పోయి, ఏదో విధంగా ప్రతిఘటించే ప్రయత్నం చేస్తున్నారు. చివరికి నేరస్థులుగా, అపరాధులుగా, దేశద్రోహులుగా మారుతున్నారు.

అనంతమైన శక్తికీ, దివ్యానందానికీ అధికారులమైన మనం ఇలాంటి చిన్న విషయాలకే చలించిపోవడం ఎంతవరకు సమంజసం? ద్వేషంతో కలుషితమైన మనస్సుకు ఉత్తమమైన భావాలను అందించి, మన మార్గాన్ని సన్మార్గం వైపు మలచుకోవాలి.

## మన వంతు సహకారం:

ఒకరు చేసిన తప్పును పదే పదే గుర్తుచేసి, వారిని మరింత బలహీనులను చేసే కన్నా వారిలో ఉన్న దివ్యత్వాన్ని గుర్తు చేసే ప్రయత్నం చేయవచ్చు కదా! అందరిలో ఆ దివ్యత్వమే ఉన్నప్పుడు ఎవరు చెడ్డవారు? ఎవరు అపరాధులు? అంతా అమృతానికి వారసులైన భగవంతుని సంతానమే కదా! మనకు తెలిసినా, తెలియకపోయినా అందరూ ఆ అమృతాన్ని ఆస్వాదించడానికే ప్రయత్నిస్తున్నారు.

డబ్బు కోసం మనిషి ప్రాణాల్ని తీయడానికి కూడా వెనుకాడని దోపిడీ దొంగ రత్నాకర్ కాస్తా వాల్మీకి మహర్షి కాలేదా? భోగవిలాసాలే సర్వస్వమని భావించిన స్త్రీలోలుడు 'వేమ బుద్ధారెడ్డి' కాస్తా యోగి వేమన కాలేదా? అందరి జీవితంలో ఆ మార్పు వచ్చే తీరుతుంది. ఈ రోజు కాకపోతే రేపు! ఈ జన్మలో కాకపోతే మరో జన్మలో! అందుకే ఎవరినీ చిన్న చూపు చూస్తూ, నిందించాల్సిన అవసరం లేదు. వీలైతే చేయూతనిచ్చి, వారు ఉన్న స్థితి నుంచి పైకి తీసుకువచ్చే ప్రయత్నం చేయాలి. మనమంతా భగవంతుని సంతానమే! మన అందరి పయనం ఆ ఉన్నత శిఖరాలకే!! ❖

# యువవాణి

– స్వామి పరిజ్ఞేయానంద

మైత్రేయి, హైదరాబాద్.

**ప్రశ్న: నేను ఉద్యోగం చేస్తున్నాను. అందువల్ల పిల్లల పెంపకం విషయంలో తగినంత శ్రద్ధ తీసుకోవడానికి సమయం ఉండడం లేదు. నేను సంపాదించకపోయినా మా ఆర్థిక పరిస్థితికి ఎలాంటి ఇబ్బందీ లేదు. కానీ వృత్తి మీద నాకున్న అభిమానం వల్ల ఉద్యోగం మానడానికి మనస్సు అంగీకరించడం లేదు. ఇలాంటి పరిస్థితుల్లో పిల్లల శ్రేయస్సుకు ప్రాధాన్యం ఇవ్వాలా? లేక ఉద్యోగం చేయాలా? ఈ సందిగ్ధావస్థ నుంచి బయటపడే మార్గాన్ని చూపండి.**

**జవాబు:** మనస్సు ఇలాంటి సందిగ్ధావస్థలో సతమతమవుతున్నప్పుడు మనం నిర్వర్తించవలసిన బాధ్యతల్లో దేనికి ప్రాధాన్యమివ్వాలో, తీసుకునే నిర్ణయం వల్ల కలిగే లాభనష్టాలు ఏమిటో ఒక జాబితాను తయారు చేసుకోవాలి. దాన్నిబట్టి మనకు ఏది ప్రయోజనకరమో ఆ మార్గాన్ని అనుసరించాలి.



మీకు ఉద్యోగం చేయాలనీ ఉంది, మీ పిల్లల బాగోగులకు తగినంత సమయాన్ని వినియోగించుకోలేక పోతున్నామనే బాధా ఉంది. చేస్తున్న వృత్తి మీద అపారమైన ఇష్టం ఉండడం వల్ల ఉద్యోగాన్ని వదులుకోవడానికి మీ మనస్సు అంగీకరించడం లేదు. అలాగే మీ పిల్లల భవిష్యత్తు ఏమవుతుందో అనే ఆందోళన మిమ్మల్ని వేధిస్తోంది.

ఉద్యోగం చేయకపోయినా మీకు ఎలాంటి ఆర్థికసమస్యా లేదు కాబట్టి మీ పిల్లల అభివృద్ధి కోసం మీ సమయాన్ని పూర్తిగా కేటాయించాలని మీరు మనఃస్ఫూర్తిగా అనుకుంటే, ఉద్యోగం చేయాలనే మీ ఇష్టాన్ని మీ పిల్లల శ్రేయస్సుకై త్యాగం చేయడం మంచిది.

The ideal of womanhood in India is motherhood - that marvellous, unselfish, all suffering, ever forgiving mother. *- Swami Vivekananda*

మాతృమూర్తి త్యాగానికి ప్రతిరూపం. అదే మన భారతీయ సంస్కృతి అన్న స్వామి వివేకానందుని వచనాలను ఒక్కసారి గుర్తు చేసుకోండి.

కుటుంబంతో సంతోషంగా జీవించడానికి అందరూ కోటీశ్వరులే కావాల్సిన అవసరం లేదు. జీవితం సాఫీగా సాగడానికి తగినంత ఆదాయం ఉంటే చాలు అన్న విషయాన్ని విస్మరించకండి.

Wealthy people are no happier than those of modest means.

జీవితంలో ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొనే వారికి సంపాదన తప్పనిసరి. కానీ ఉద్యోగాన్ని సరదా కోసం చేసేవారు మాత్రం పిల్లల వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దడంలో పూర్తి సమయాన్ని వినియోగించడం ముఖ్యం. తల్లి ఆలనాపాలనలో పెరిగే పిల్లలే ఉత్తమ పౌరులుగా తయారవుతారు. పిల్లలకు చిన్నప్పటి నుంచీ పెద్దలు నేర్పే సద్విషయాలే జీవితాంతం వరకూ వారి వెంటవుండి సంరక్షించే సహచరులు.

What the mother sings to the craddle goes all the way down to the coffin.

ఏ మహాత్ముని జీవిత చరిత్రను చూసినా వారి మహోన్నత వ్యక్తిత్వం వెనుకగల తల్లి పాత్ర అత్యంత ముఖ్యమైనదని మనకు అర్థమవుతుంది.

స్వామి వివేకానంద, అబ్రహామ్ లింకన్ తమ వ్యక్తిత్వాల్ని తీర్చిదిద్దిన తల్లి ప్రేమ, త్యాగాలను ఎంతగానో కొనియాడారు. మాతృమూర్తిని ఉద్దేశించి వారు పలికిన ఈ పలుకులే మాతృమూర్తి పట్ల వారికున్న అపారమైన గౌరవాభిమానాలకు నిదర్శనం.

If there is any being I love in the whole world, it is my mother. I am indebted to her for my intellectual development. *- Swami Vivekananda*

All that I am or hope to be, I owe to my angel mother *- Abraham Lincoln*

మీ పిల్లల్ని మహోన్నత వ్యక్తులుగా తీర్చిదిద్దాలంటే మీరు భువనేశ్వరీ దేవి (స్వామి వివేకానందుని తల్లి)నీ, నాన్సీ హ్యాంక్స్ (అబ్రహామ్ లింకన్ తల్లి)నీ ఆదర్శంగా తీసుకోండి. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :

**యువవాణి**

**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**

**దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029**

## నా జీవితంలో స్వామి వివేకానంద

# మనస్సును తాకిన 'సాహిత్య సర్వస్వం'

– రాచమడుగు శ్రీనివాసులు



నేను అనంతపురం ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో ఆంగ్ల అధ్యాపకునిగా సేవలందించాను. దాదాపు పాతికేళ్ళ క్రితం మా బంధువు ఒకాయన The Complete works of Swami Vivekananda - Volume- I తెచ్చి నాకు ఇచ్చాడు. ఆ పుస్తకం చదవడం ఆరంభించాను. అంతే! దాన్ని వదలకుండా చదవాలనిపించింది. ఎన్ని ఇబ్బందులున్నా, పనులున్నా తప్పకుండా ప్రతిరోజూ కొన్ని పేజీలైనా చదవకుండా నిద్ర పోయేవాణ్ణి కాదు. ఎన్నెన్నో అద్భుతమైన విషయాలను, చక్కటి భాషలో మనస్సుకు హత్తుకునేలా చెప్పాడు ఆ మహనీయుడు. రోజుకు దాదాపు 100 పేజీల చొప్పున ఎనిమిది సంపుటాలనూ పూర్తిగా చదివాను. తల్లితండ్రుల పట్ల, భార్యాపిల్లల పట్ల, సంఘం పట్ల ఎలాంటి దృక్పథం ఉండాలో తెలిసి వచ్చింది. ప్రతి హిందువు, ప్రతి భారతీయుడే కాదు ప్రతి మనిషీ చదవాల్సిన గ్రంథాలు అవి. కర్మ యోగం, భక్తి యోగం, రాజ యోగం, జ్ఞాన యోగం – అంటే ఏమిటో స్వామి వివేకానంద వివరించిన తీరు అమోఘం. గాంధీజీ, నెహ్రూ, సుభాష్ చంద్రబోస్, అరవింద్ ఘోష్ లాంటి ప్రముఖులను ప్రభావితం చేసిన స్వామి వివేకానంద నా జీవిత దృక్పథాన్నే పూర్తిగా మార్చివేశారు. నా నుంచి ఏ ఒక్కరికైనా ఎంతో కొంత మంచి జరిగి ఉంటే దానికి కారణం స్వామి వివేకానందులే! మూఢ విశ్వాసాలు పోవాలన్నా, నిశిత ఆలోచన కలగాలన్నా, సంస్కృతీ సంప్రదాయాలు తెలియాలన్నా, ప్రేమ, సద్బుద్ధులు అలవడాలన్నా స్వామి వివేకానంద గ్రంథాలు చదవాల్సిందే! నేను గానీ, నా కుటుంబ సభ్యులు గానీ ఉన్నదాంతో తృప్తిపడి, హాయిగా, ఆనందంగా జీవిస్తున్నామంటే దానికి కారణం ముమ్మాటికీ స్వామి వివేకానందులే! ఎన్ని జన్మలెత్తినా ఆయన ఋణం తీర్చుకోలేనిది. ఆయన నుంచి నేను పొందిన లాభమే ప్రతి ఒక్కరూ పొందాలన్న తలంపుతో ఆయన నుంచి నేను తెలుసుకున్న విషయాలను ఇతరులకు చెప్పగల అవకాశాన్ని నేను ఎప్పుడూ సద్వినియోగం చేసుకుంటాను. ఏ ఊరికి వెళ్ళినా అక్కడ మొదట సందర్శించదగ్గ ప్రదేశం శ్రీరామకృష్ణ మఠమేనని అందరికీ చెబుతాను. "మీ వద్ద ఏ మాత్రం డబ్బు ఉన్నా శ్రీరామకృష్ణ మఠం ప్రచురించిన పుస్తకాలు కొనండి" అని మా విద్యార్థులందరికీ చెబుతుంటాను. హైదరాబాద్ వెళ్ళినప్పుడు నాతో పాటు ఉన్న బంధువులందరికీ శ్రీరామకృష్ణ మఠంలో కొంత సమయమైనా గడిపే అవకాశాన్ని కలిగించడమే నా ప్రథమ కర్తవ్యంగా భావిస్తాను. ప్రతి ఒక్కరూ స్వామి వివేకానంద, శ్రీరామకృష్ణ పరమహంస గూర్చి తెలుసుకొని, వారి బోధనలను ఆచరించి, ధన్యజీవులు కావాలని ఆశిస్తున్నాను. ❖

(రాచమడుగు శ్రీనివాసులు, అనంతపురం)

# మీ పురోగతిని ఆపుతున్నదెవరు?

ఒక కార్యాలయంలో పని చేస్తున్న ఉద్యోగులందరూ ఒకరోజు పనికి వచ్చేసరికి, పెద్ద అక్షరాలతో వ్రాసిన నోటీసు కనిపించింది.

"ఈ కంపెనీలో మీ పురోగతిని ఆపుతున్న వ్యక్తి చనిపోయాడు. శవాన్ని కంపెనీ వ్యాయామశాలలో ఉంచాం. చివరిచూపుగా వచ్చి చూడవచ్చు."

అది చదివిన వారికి సహోద్యోగి మరణించాడనగానే మనస్సు చివుక్కుమంది. కానీ తమ పురోగతి ఆపే ఈ ఉద్యోగి ఎవరబ్బా అని ఆశ్చర్యపోయారు. కుతూహలంతో అందరూ వెంటనే వ్యాయామశాలకు బయలుదేరారు. మొత్తం అందరూ ఒకేసారి అక్కడకు చేరేసరికి పరిస్థితి ఉద్వేగపూరితంగా మారింది. వారి తోపులాటను అదుపు చేయడానికి భద్రతా సిబ్బందిని పిలవవలసి వచ్చింది.

శవపేటిక దగ్గరకు చేరుతున్న కొద్దీ ప్రతి ఉద్యోగికీ ఉద్వేగం పెరిగిపోతోంది. అయినా, "నా పురోగతిని ఆపుతున్న ఈ శత్రువు మరణించాడు. అదే చాలు!" అనుకోసాగారు. కానీ శవపేటికలోకి తొంగిచూశాక మాత్రం సంభ్రమాశ్చర్యాలతో నోరు మెదపలేక పోయారు. వారి హృదయాంతరాళాల్ని ఎవరో తాకినట్లు మౌనంగా అలాగే నిలబడిపోయారు.

నిజానికి శవపేటికలో ఉన్నది ఒక అద్దం. అందువల్ల చూసిన ప్రతివారికీ తమ ప్రతిబింబమే కనిపించింది. శవపేటిక ప్రక్కన మరొక నోటీసు వారికి కనిపించింది. "మీ పురోగతిని ఆపగల శక్తి కేవలం ఒక్క వ్యక్తికే ఉంది. అది **మీరే!**"

Men in general lay all the blame of life on their fellowmen, or, failing that, on God, or they conjure up a ghost, and say it is fate... We are responsible for what we are, and whatever we wish ourselves to be, we have the power to make ourselves. ***- Swami Vivekananda***

మీ జీవితంలో విప్లవాత్మకమైన మార్పులు తేగలవారు మీరే! మీ సుఖసంతోషాలను ప్రభావితం చేసి, మీ కలలను సాకారం చేసి, విజయాన్ని ఇవ్వగలిగేదీ మీరే! మీకు నిజంగా సహాయం చేయగలిగేదీ మీరే!

మీ పైఅధికారులు, స్నేహితులు, తల్లితండ్రులు, సహోద్యోగులు – వీరందరినీ మార్చివేసినా, మీ జీవితం మాత్రం మారదు, బాగుపడదు. మీరు మారినప్పుడే మీ జీవితం మారుతుంది. మీ అపనమ్మకాలను అధిగమించి, మీ జీవితానికి మీరే బాధ్యులన్న అవగాహనకు వచ్చినప్పుడే అది మరింత మెరుగవుతుంది.

అన్ని సంబంధ బాంధవ్యాలలోకీ ముఖ్యమైనది – "మీకు మీతోనే ఉండే సంబంధం!" మిమ్మల్ని మీరు గమనించుకోండి. లోతుగా పరీక్షించుకోండి. కష్టనష్టాలనూ, అసాధ్యమైన విషయాలనూ చూసి భయపడవద్దు. విజేతలుగా అవతరించండి. మీ వ్యక్తిత్వాన్ని మీరే నిర్మించుకోండి. మీ జీవితాన్ని మీరే మలచుకోండి. ❖

**– స్వామి అక్షరాత్మానంద**

**అనువాదం : అమిరపు నటరాజన్**



మహనీయుల జీవితాల్లో

# మధురఘట్టాలు

\- ఆర్. కృష్ణ



## కరుణామూర్తికి కనువిప్పు !

అది ఎండాకాలం. బోధి వృక్షం క్రింద కూర్చొని సిద్ధార్థుడు తపస్సు చేస్తున్నాడు. యథాప్రకారం ఆయన ఆ మధ్యాహ్న వేళ సమీపాన ఉన్న కొలను దగ్గరకు వెళ్ళి స్నానం చేశాడు. కొలనులో అక్కడక్కడ తామర పూవులున్నాయి. వాటి అందానికి ఆకర్షితుడై సిద్ధార్థుడు ఒక కమలాన్ని తుంచాడు. ఆయన కమలాన్ని తుంచిన వెంటనే ఆకాశవాణి వినపడింది: "సిద్ధార్థా! ఆ పువ్వు ఏం తప్పు చేసింది? మొక్క నుంచి పువ్వును వేరు చేసి, దాని ప్రాణాన్ని తీసే హక్కు నీకెక్కడిది?" సిద్ధార్థుడు మారుమాట్లాడక కమలాన్ని నీటిలో వదలి తాను చేసిన పొరపాటుకు చింతిస్తూ కొలనుగట్టుకి చేరాడు.

ఇంతలో ఒక వేటగాడు ఆ కొలను దగ్గరకు వచ్చి, నీరు త్రాగి, అందులో ఉన్న తామర మొక్కలు ఈతకు ఆటంకమనుకున్నాడు కాబోలు కొన్ని మొక్కలను వేళ్ళతో సహా పెకిలించి, గట్టు పైన పారవేసి తన దారిన తాను వెళ్ళాడు. ఇది గమనించిన సిద్ధార్థుడు, "ఓ ఆకాశవాణీ! నేను ఒక్క పద్మం తెంపినందుకు నన్ను తప్పుబట్టావు. ఆ వేటగాడు ఎన్నో పద్మాలను వేళ్ళతో సహా పెరికి బయట పడవేశాడు. అతణ్ణి నీవు అస్సలు మందలించనే లేదు. నాకొక న్యాయం, అతనికొక న్యాయమా? చేసిన తప్పు ఒక్కటే అయినప్పుడు అందరికీ ఒకే న్యాయం ఉండాలి గదా?" అని అన్నాడు.

అప్పుడు ఆకాశవాణి, సిద్ధార్థుడితో, "నీవు జ్ఞానివి. వాడొక మూర్ఖుడు. గొప్పవారు చేసే పనులను సామాన్యులు ఆదర్శంగా తీసుకొంటారు. ఒక పామరుడు తెలియక చేసిన తెలివి తక్కువ పనులను పాటించరు, పట్టించుకోరు. మీ లాంటి తాపసులు మీ శ్రేయస్సు కొరకు, లోకకల్యాణం కొరకు తప్పుడు ఆలోచనలు చేయరాదు. తప్పుడు మాటలు మాట్లాడరాదు. తప్పుడు పనులు చేయరాదు. ప్రతి విషయంలోనూ మీరు ఆదర్శప్రాయంగా నడుచుకోవాలి" అంది. సిద్ధార్థునికి కనువిప్పు కలిగింది. ఇలాంటి పొరపాటు మరొకసారి చేయరాదని దృఢంగా నిశ్చయించుకున్నాడు. ❖



## దేశ శ్రేయస్సుకే ప్రాధాన్యత!

ఒక పర్యాయం అమెరికా రాష్ట్రపతి అబ్రహామ్ లింకన్ తనకు బద్ధ విరోధి అయిన ఒక వ్యక్తిని రక్షణ మంత్రిగా నియమించాడు. అతడు లింకన్‌ను నిశితంగా విమర్శిస్తుండే వాడు.

ఒక రోజున లింకన్ వద్దకు కొందరు శ్రేయోభిలాషులు, మిత్రులు వచ్చి లింకన్‌తో "మిమ్మల్ని విమర్శించే వ్యక్తిని రక్షణమంత్రిగా ఎందుకు నియమించారు?" అని అడిగారు. అందుకు లింకన్ వారితో "అతడు యోగ్యమైన వ్యవస్థాపకుడు, సంస్థాపకుడు, సంచాలకుడు, తన క్షేత్రంలో నేర్పుగల కార్యకర్త. అతడు నన్ను అవమానించవచ్చు గాక. కానీ అతని గుణగణాలు, అతని యోగ్యత దేశ శ్రేయస్సుకు ఉపయోగపడతాయి. వ్యక్తిగత ద్వేషం కారణంగా దేశకార్యం కొరకు పనికి వచ్చే ఒక కార్యకుశలుడైన వ్యక్తిని నేను పోగొట్టుకోలేను. అతనికి దూరంగా ఉండలేను. నాకు కావలసింది లింకన్ భక్తులు కాదు, దేశభక్తులు. అతడు స్వచ్ఛమైన దేశభక్తుడని నా దృఢవిశ్వాసం."

నిజమైన దేశభక్తుని ఈ మాటలు విని మిత్రులు ఇక ఏమీ జవాబు చెప్పలేక పోయారు. ❖

# ఊహలకు కళ్ళెం వేద్దాం!

మనస్సును స్వాధీనం చేసుకోవడంలో ఎదురయ్యే కష్టాలు ఊహల వల్లనే! సర్వసాధారణంగా మనం ఊహల గాలిపటాలు ఎగురవెయ్యడంలోనూ, పగటికలలు కనడంలోనూ మునిగి తేలుతూ ఉంటాం. అర్థం లేని వెర్రి మొర్రి ఊహాగానాలు రకరకాలుగా చేస్తూ ఉంటాం. మన ఎదురుచూపులు ఊహించుకున్నవే కావచ్చు, నిరాధారమైనవే కావచ్చు. కానీ అవి మన హృదయంలో నిజమైన బాధలను రగిలిస్తాయి. మన భయాలు నిరాధారమైనవే కావచ్చు. కానీ మన మనస్సులో నిజమైన క్షోభను తీసుకొస్తాయి. మన ఊహాశక్తిని తప్పుగా ఉపయోగించి, లేనివాటిని ఉన్నవిగా చూస్తాం. ఎలాంటి ఆధారమూ లేని చింతలతో బాధపడతాం. ఈ అలవాటు ఎక్కువయ్యే కొద్దీ మనస్సును స్వాధీనం చేసుకోవడం దుర్లభమైపోతుంది. రోజులో ఎక్కువ భాగం కలల ప్రపంచంలోనే బ్రతుకుతున్నామనీ, నిజాల ప్రపంచంలో కన్నా నీడల ప్రపంచంలోనే కాలం గడుపుతున్నామనీ తెలుసుకోలేని స్థితిలో ఉంటాం.

ఈ అలవాటును వదిలించుకుంటే తప్ప మనస్సును స్వాధీనం చేసుకోవడం కుదరదు. మరి ఈ పని ఎలా చెయ్యాలి? ఈ క్రింది కథ మనకు ఒక మంచి సూచనను అందిస్తుంది.



ఒక పెద్దమనిషి నడిచివెళుతున్నాడు. కొద్దిగా తాగిన మైకంలో ఉన్నాడు. ఆయన చేతిలో ఒక పెట్టె ఉంది. దాని మూత మీద, నాలుగు ప్రక్కలా చిన్న చిన్న చిల్లులు ఉన్నాయి. ఆ పెట్టెలో ఏదో జంతువును అతడు తీసుకుపోతున్నట్లుగా చూపరులకు తోస్తోంది. దారినపోయే పరిచయస్థుడు అతణ్ణి ఆపి, 'ఈ పెట్టెలో ఏముంది?' అని అడిగాడు.

'ముంగిస' అని ఆ మైకంలో ఉన్న పెద్దమనిషి సమాధానం చెప్పాడు. 'ముంగీసా? అది ఎందుకండీ?' అని ఆ పరిచయస్థుడు అడిగాడు.

'నా సంగతి నీకు తెలుసు కదా! ఇంకా నేను బాగా తాగలేదు గానీ, ఇప్పుడు పోయి తాగుతాను కదా? అప్పుడు నాకు చుట్టూ పాములు కనబడతాయి. నాకు పాములంటే మహా భయం. అందుకనే ఈ ముంగిసను తీసుకుపోతున్నాను. ఇదయితే నన్ను పాముల నుంచి కాపాడుతుంది!'

'అబ్బా! ఆ పాములు నిజమైనవి కావు గదయ్యా!' అని ఆ పరిచయస్థుడు అన్నాడు.

'ఔను నిజమే! ఈ ముంగిస కూడ నిజమైనది కాదు!' అని ఆ పెద్దమనిషి సమాధానమిచ్చాడు.

నిజానికి ఆ పెట్టెలో ఏమీ లేదు!

అదే విధంగా ఒక ఊహను ఎదుర్కోవడానికి వేరొక ఊహ కావాలి. తప్పుడు ఊహలను తరిమికొట్టడానికి సరైన ఊహల సహాయం మనకు అవసరం. స్వామి వివేకానంద ఇలా బోధించారు: "ఊహాశక్తిని సరిగ్గా వినియోగించుకుంటే అది మనకు గొప్ప స్నేహితుడు కాగలదు. అది మనల్ని తర్కాన్ని కూడా దాటించి తీసుకుపోతుంది. మనల్ని ఎక్కడికైనా చేర్చగలిగిన ఒకే ఒక్క వెలుగు - ఊహాశక్తి మాత్రమే." భగవంతుని గురించిన ఆలోచనలు, ఊహలు మాత్రమే అతి పవిత్రమైనవి. దేవుని ఆలోచనలను ఎంత ఎక్కువగా చేస్తే మన మనస్సు కలిగించే కష్టాలు అంతగా తగ్గిపోతాయి. ❖

# ఆత్మ విశ్వాసం

– డా॥ కరిమద్దెల నరసింహారెడ్డి



ఆత్మవిశ్వాసంతో చంద్రలోకాన్ని ఆక్రమించవచ్చు. ఇంద్రలోకాన్ని జయించవచ్చు. మహిమాలయమైన హిమాలయాన్ని అధిరోహించవచ్చు. సప్తసముద్రాలను అలవోకగా ఈదవచ్చు. విశాల ప్రపంచాన్ని అరచేతిలో చూపించవచ్చు. ప్రళయాగ్నులను గుప్పిట పట్టవచ్చు. ఉద్గ్రంధాలు, సద్గ్రంధాలు వ్రాయవచ్చు. గగనానికి నిచ్చెన వేయవచ్చు. నీలాల నింగిలో జలధారల పరదాలలో దాగుడు మూతలాడవచ్చు. చావు పుట్టుకల రహస్యాన్ని తెలుసుకోవచ్చు.

ఆత్మ విశ్వాసం విజయలక్ష్మిని వరించడానికి ఆటపట్టు, ఆయువుపట్టు. తప్పటడుగులు వేస్తూ, పడుతూ లేస్తూ నడక నేర్చుకునే పాలబుగ్గల పసిపాప మొదలుకొని ఎత్తయిన ఎవరెస్టు శిఖరాన్ని ఎక్కిన టెన్సింగ్ నార్కే వరకు ఆత్మవిశ్వాసంతోనే ఆటంకాల కంటకాలను అధిగమించి విజేతలయ్యారు.

నువ్వుల్లో నూనె దాగి ఉన్నట్లు, చెకుముకిరాయిలో నిప్పురవ్వలున్నట్లు, మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీలో మహాత్ముడు దాగి ఉన్నట్లు, నరేంద్రునిలో వివేకానందుడు దాగి ఉన్నట్లు, సిద్ధార్థునిలో బుద్ధుడు దాగి ఉన్నట్లు, గదాధరునిలో పరమహంస దాగి ఉన్నట్లు – ప్రతివ్యక్తిలోనూ ఆత్మవిశ్వాసమనే శక్తి దాగి ఉంటుంది.

ఆత్మవిశ్వాసమంటే మన మీద మనకు నమ్మకం ఉండడమని అర్థం. ఆత్మ విశ్వాసం అనేది కష్టమైన సమస్యలను సైతం సులభంగా పరిష్కరించుకోవడానికి కొండంత అండగా నిలుస్తుంది. మనిషి జీవించడానికి ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఎంత అవసరమో, ఆత్మ విశ్వాసం కూడా అంతే అవసరం. ఏది లేకున్నా ఆత్మ విశ్వాసం గుండెల నిండుగా ఉన్నవాడు ప్రగతిపథంలో ముందుకు, మునుముందుకు నడుస్తూ జీవితాన్ని విజయవంతం చేసుకుంటాడు. అపూర్వమైన విజయాలను సాధిస్తాడు.

...People say, 'Have faith in this fellow or that fellow', but I say, 'Have faith in yourself first', that's the way. Have faith in yourself - all power is in you - be conscious and bring it out. *- Swami Vivekananda*

భారతీయ ఆధ్యాత్మిక పతాకాన్ని విశ్వవిహాయసంలో రెపరెపలాడించిన స్వామి వివేకానందుడు "ఆత్మవిశ్వాసం గల కొందరు వ్యక్తుల పవిత్ర చరిత్రే ప్రపంచ చరిత్ర" అని చాటి చెప్పారు. ఆత్మవిశ్వాసం మనలో అంతర్గతంగా ఉన్న దివ్యశక్తిని వెలికి తీస్తుంది.

**"ధనము బలము కన్న దైవబలము కన్న**
**గుండె బలము కన్న కండ కన్న**
**అసలు మనిషి బలము ఆత్మవిశ్వాసమే!"**

ఓ యువతా! మేలుకో! ఆత్మ విశ్వాసాన్ని మేలుకొలుపుకో! ❖


Statement about ownership and other particulars about **Sri Ramakrishna Prabha** (according to Form IV Rule 8, circulated by Registrar of Newspapers for India).

| | | | |
|---|---|---|---|
| 1. | Place of Publication | : | Hyderabad - 500 029 |
| 2. | Periodicity of Publication | : | Monthly |
| 3. | Printer's Name | : | Swami Jnanadananda |
| | Nationality | : | Indian |
| | Address | : | Ramakrishna Math Domalguda Hyderabad-500 029 |
| 4. | Publisher's Name | : | Swami Jnanadananda |
| | Nationality | : | Indian |
| | Address | : | Ramakrishna Math Domalguda Hyderabad-500 029 |
| 5. | Editor's Name | : | Swami Parijneyananda |
| | Nationality | : | Indian |
| | Address | : | Ramakrishna Math Domalguda Hyderabad-500029 |
| 6. | Name & Address of the individuals who own the news or shareholder holding more than1% of the capital | : | Ramakrishna Math Domalguda Hyderabad-500029 |

I , Swami Jnanadananda, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Sd.
**Swami Jnanadananda**
Signature of the Publisher

Date: 01.03.2009

# పరిపూర్ణతనిచ్చే 'విద్య'

- స్వామి గుణేశానంద

విద్య అంటే మనసుని కేవలం సమాచారంతో నింపడం మాత్రమే కాదు. మనసుపై సాధికారతను, నియంత్రణను సమకూర్చేదే నిజమైన విద్య. స్వామి వివేకానంద "మానవునిలో ఉన్న పరిపూర్ణతని ప్రకటించడమే విద్య" అన్నారు. అంటే మనం మన జీవితాల్లోని పరిపూర్ణతని వెలికితీయాలి. నేటి విద్యాభ్యాసం వల్ల మనం విద్యని సమగ్రంగా కాక విద్యలోని ఒక పార్శ్వాన్ని మాత్రమే పొందగలుగుతున్నాం. విద్యలో 1. పరిశీలన 2. వివేకం 3. పట్టుదల అనే మూడు అంశాలున్నాయి.

**పరిశీలన:** చాలామంది ఒక సందర్భాన్ని గాని, ఒక విషయాన్ని గాని సరిగ్గా అంచనా వేయలేరు. ఒక విషయాన్ని గాని, ఒక సన్నివేశాన్ని గాని ఉన్నదున్నట్లుగా పరిశీలించినపుడు అనేక సమస్యలకు మనం దూరం కావచ్చు, మనుష్యులను జాగ్రత్తగా పరిశీలిస్తే వారు ఎటువంటివారో మనం అర్థం చేసుకోగలుగుతాం. కాబట్టి 'పరిశీలన' అన్నది మన జీవితంలో ప్రధాన పాత్ర వహిస్తుంది.

**వివేకం :** ఏ పని చెయ్యవచ్చో, ఏ పని చేయకూడదో అనేది వివేకం వల్ల తెలుస్తుంది. మనచుట్టూ ఉన్న విషయాలను గమనించి, పనికిరాని విషయాలను విస్మరించి, అర్థవంతమైన విషయాలను స్వీకరించి మన జీవితాలకి అన్వయించుకోవాలి. కొన్ని ప్రాంతాలలో ప్రవేశద్వారం దగ్గరుండే ఆగు, గమనించు, వేచిఉండు, పొమ్ము అనే హెచ్చరిక బోర్డు ఒక మంచి ఉదాహరణ.

ఎన్ని పనుల్లో ఉన్నా మనం ఆగి, ఆ హెచ్చరికను జాగ్రత్తగా గమనించాలి. అప్పుడు విచక్షణనుపయోగించి ముందుకెళ్ళాలా వద్దా అన్నది నిర్ణయించుకోవాలి. దానినే వివేకం అంటారు.

**పట్టుదల:** ఒక పనిని చేపట్టినప్పుడు ఆ పని పూర్తయ్యేవరకూ మన శక్తి-యుక్తులన్నీ ఆ పనిమీదే కేంద్రీకరించాలి. గమ్యాన్ని నిర్ణయించుకున్నాక దానిని చేరేవరకూ మన సర్వయత్నాలనూ బలోపేతం చేయాలి. మన దృష్టినంతా ఆ విషయంపైనే ఏకాగ్రం చేయాలి. ఒకవేళ విఫలమైతే, మన దృష్టిని ఆ విషయంపైన సరిగ్గా కేంద్రీకరించామా లేదా అని విశ్లేషణ చేసుకోవాలి. మనం పయనించే మార్గాన్ని బాగా స్థిరపరచుకుంటే గమ్యమే మనదగ్గరకు వస్తుంది.



గతం వర్తమానాన్ని రూపొందిస్తే, వర్తమానం భవిష్యత్తు అవుతుంది. రూపాంతరం చెందిన వర్తమానమే భవిష్యత్తు అనీ, వర్తమానమే భవిష్యత్తుకి పునాది అనీ గ్రహించక ఎప్పుడూ భవిష్యత్తులోనే బ్రతుకుతూ ఉంటాము. కనుక వర్తమానంలోనే బ్రతుకుతూ పూర్ణత్వాన్ని పొందడానికి పై గుణాలను అలవరచు కొందాం.

**ఎందుకు చదవాలి?** చాలామంది విద్యార్థులు ఎందుకు చదువుకుంటున్నారని ప్రశ్నిస్తే, ధన సంపాదనకని కొందరు, సమాజంలో గౌరవాన్ని పొందడానికని మరి కొందరు, పేరు ప్రఖ్యాతుల కోసమని ఇంకొందరూ జవాబిస్తారు. వాటి కోసమే చదువుకుంటామా! విద్య యొక్క ప్రధాన లక్ష్యం జ్ఞాన సముపార్జన. ఆ జ్ఞానాన్ని సమాజాభివృద్ధికై వినియోగించాలి. పేరు ప్రఖ్యాతులు, సిరి సంపదలు వాటంతట అవే వస్తాయి. విద్య మనకు సౌశీల్యాన్ని కలుగజేస్తుంది. ఉన్నత విజ్ఞానాన్ని పొందాలని దృఢంగా నిర్ణయించుకుంటే సర్వ మానవుల పట్ల ప్రేమ, సత్యసంధత, ధైర్యస్థైర్యాలు కూడా అలవడతాయి. తద్వారా ఆత్మ వికాసం కలుగుతుంది. మన జీవితాల్ని

తపస్సు, స్వాధ్యాయనాల సంగమంగా చేసుకుంటే స్వీయ క్రమశిక్షణ, ఆత్మవిమర్శ అలవడతాయి.

**ఒత్తిడిని ఎందుకు పొందుతున్నాం :** స్నేహితులారా! మీరెందుకు విలపిస్తారు. మీలోనే అనంతమైన శక్తి ఉంది. మీలోని శక్తినంతా ప్రోగుచేసుకోండి. ఈ విశ్వమంతా మీ పాదాక్రాంతమవుతుంది. మీలోని ఆత్మవిశ్వాసమే మిమ్మల్ని విజయతీరాలకు నడిపిస్తుంది. అనంతమైన శక్తి మీలోనే ఉంది. మనం గొర్రెలం కాము. సింహాలమని గుర్తుపెట్టుకోండి. మనం విశ్వాన్ని శాసించడానికి వచ్చాం. కాని విశ్వంచేత శాసింపబడడానికి కాదు. గొప్ప వారైన వారందరూ ఇలా కష్టనష్టాలను అధిగమించినవారే. పరిస్థితులు అనుకూలంగా లేనప్పుడు ఇతరుల్ని నిందించకూడదు. మన వైఫల్యాలకి ఇతరులను నిందిస్తూ కూర్చోరాదు. మనలోనే మార్పును తెచ్చుకోవడానికి ప్రయత్నించాలి. దీనికి ఉదాహరణ మన నిజ జీవితంలోనే చూడవచ్చు. వర్షం పడుతున్నప్పుడు వర్షాన్ని తిట్టుకుంటూ కూర్చోక, వర్షం నుంచి తప్పించుకోవడానికి ఒక గొడుగును వాడతాం. అలాగే పరిస్థితులు అనుకూలించనప్పుడు మనలోనే కావలసిన మార్పులు చేసుకుంటూ పరిస్థితులను, మనుష్యులను నిందించక ముందుకు పయనించాలి. పరిస్థితులకు అనుగుణంగా మారేవాడు విజ్ఞుడు. విపత్కర పరిస్థితులను అనుకూలంగా మార్చుకోవాలి. పై విషయాలన్నీ దృష్టిలో పెట్టుకుంటే ఒత్తిడిని విజయవంతంగా ఎదుర్కోగలం.



**అపజయాలను జయించడం ఎలా?** ఒక విద్యార్థి పరీక్షలో కృతార్థుడు కాకపోతే ముందుగా ఉపాధ్యాయులను నిందిస్తాడు. ఉపాధ్యాయులు సరిగా బోధించలేదనీ, ప్రశ్నలు చాలా కష్టంగా ఉన్నాయనీ అంటూ కారణాలు చెబుతాడు. "నేను బాగా చదవలేదు"అని మాత్రం ఏ విద్యార్థీ చెప్పడు. "మనకు మనమే మిత్రులం-మనకు మనమే శత్రువులం" అన్న విషయం గుర్తుపెట్టుకోండి. బాధ్యతలను మీ భుజస్కందాలపై వేసుకోండి. "నేనున్న పరిస్థితులకు నేనే బాధ్యుడను"అని అనుకోవాలి. మన వైఫల్యాలను ఇతరుల మీద రుద్దకూడదు. భగవద్గీతలో శ్రీకృష్ణుడు "మానసిక బలహీనతను వదిలి కార్యనిర్వహణలో ముందుకుసాగు'' అంటాడు. మనం మానసికంగా బలహీనమయినప్పుడు మాత్రమే మనం కలత చెందుతాం. మనచుట్టూ ఎంత విషాదం, బాధ ఉన్నా అవి మనల్ని సమీపించ సాహసించలేవు. మన బుద్ధి స్థిరంగా, నిశ్చలంగా ఉన్నప్పుడు బలహీనతలు దరిచేరవు. ఎవరైనా మనల్ని బాధ పెట్టినా, మనం పట్టించుకోనట్లయితే, మనకు ఏమీ భయం లేదు. బాధకు లొంగితే కష్టాలను కొని తెచ్చుకోవడమే అవుతుంది. కష్టాలను అంగీకరించక, అధిగమించడానికి కృషిచేయాలి. మీ అపజయాన్ని గానీ, మీ తప్పులను గానీ మీ పరాజయాలుగా భావింపక, వాటిని ఒక గుణపాఠంగా మలచుకొని, విజయాన్ని సాధించండి.

పరాజయాలే విజయానికి సోపానాలు. క్రీడాకారుడు పెద్ద పెద్ద అంగలు వేయాలనుకున్నప్పుడు, కొన్ని అడుగులు వెనుకకు వేసి అప్పుడు ముందుకు సాగుతాడు. అలాగే అపజయం ఎదురైనపుడు నిరాశతో క్రుంగిపోకుండా సానుకూల దృక్పథంతో ఉన్నట్లయితే, క్రింద పడడం అనేది పైకిలేవడానికే అనే అవగాహన వస్తుంది. అప్పుడు విజయమెంతో దూరం ఉండదు.

పరిశీలనాశక్తి, వివేకం, పట్టుదల – ఈ మూడు లక్షణాలని పెంపొందించేదే 'పరిపూర్ణ విద్య'. అలాంటి విద్య నేడు అత్యంత అవసరం. ❖

**అనువాదం: శ్రీమతి కమల కుమారి.**

# 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

| దాత పేరు | విద్యాసంస్థ |
|---|---|
| శ్రీ పి.ఎ. నాగరాజు, హిందుపూర్, అనంతపురం జిల్లా | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, గోపిదిన్నె, తంబళ్ళపల్లి, చిత్తూరు జిల్లా |
| శ్రీ వై.వి. రమణప్ప, విజయనగర్ కాలనీ కంటోన్మెంట్, బళ్ళారి, కర్నాటక | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, గుండ్రంపల్లి,చిట్యాల, నల్లగొండ జిల్లా |
| " " " | శ్రీ సర్వజన మనోరంజన తెలుగు లైబ్రరి,గారులియ, పారగనాస్,పశ్చిమబెంగాల్ |
| " " " | ఎమ్.పి.పి. పాఠశాల, వంకదోత్ తాండ, పొన్నంపల్లి, ఖమ్మం జిల్లా |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్, నేరెడిగొండ, ఆదిలాబాద్ జిల్లా |
| శ్రీ గాదిరాజు గోపాల కృష్ణంరాజు, బలుసుమూడి, భీమవరం, ప.గో.జిల్లా | ఎమ్.పి.పి. పాఠశాల, మహదేవపట్నం, ప.గో.జిల్లా – 534 109 |
| శ్రీ సి. గోపాల రెడ్డి, సుజాతమ్మ కాలనీ, దర్గామిట్ట, నెల్లూరు– 524 003 | వి. ఆర్. ఉన్నత పాఠశాల, నెల్లూరు – 524 002 |
| " " " | జిల్లా పరిషత్ బాలుర ఉన్నత పాఠశాల, గూడూరు, నెల్లూరు జిల్లా – 524 101 |
| " " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, మనుబోలు, నెల్లూరు జిల్లా – 524 405 |
| శ్రీ ఎస్. జయంత్ రావు, లాలా చెరువు, రాజమండ్రి – 533 106 | సి.వి. రామన్ పబ్లిక్ స్కూల్, హుస్నాబాద్, కరీంనగర్ జిల్లా –505 467 |
| " " " | సరస్వతీ శిశుమందిర్, పండి, కుబీర్, ఆదిలాబాద్ జిల్లా – 504 329 |
| " " " | ఆం.ప్ర. గురుకుల పాఠశాల, సర్వేల్, సంస్థాన్ నారాయణపురం, నల్లగొండ జిల్లా |
| శ్రీ అమిలినేని కృష్ణయ్య | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, రాకెట్ల, ఉరవకొండ, అనంతపురం జిల్లా |
| శ్రీ వెంకటేశ్వర్లు, శ్రీ ప్రశాంతా ఉన్నత పాఠశాల, దర్శి, ప్రకాశం–523 247 | ఎమ్.పి.యు.పి. పాఠశాల, బ్రహ్మేశ్వరం, యెరుకుల్ల, దత్తలూరు, నెల్లూరు జిల్లా |
| సి. వి. చక్రపాణి, దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029 | శ్రీ సరస్వతీ శిశుమందిర్, చెన్నూరు, ఆదిలాబాద్ జిల్లా – 504 201 |
| " " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, పిప్రి, బజార్‌హత్నూర్, ఆదిలాబాద్ జిల్లా |
| " " " | ప్రభుత్వ ఆశ్రమ ఉన్నత పాఠశాల,జటర్ల,బజార్‌హత్నూర్,ఆదిలాబాద్‌జిల్లా |
| శ్రీ కొత్తపల్లి కోటేశ్వరరావు, బాగ్ అంబర్‌పేట్, హైదరాబాద్ | పంచాయత్ లైబ్రరీ, మోదుకూరు, టి. సుందుర్, కృష్ణా జిల్లా |
| శ్రీ లక్ష్మణ స్వామి, గాజువాక, విశాఖపట్నం – 530 006 | శ్రీ రామాలయ అభివృద్ధి సేవా సంఘం, దిమిలి, విశాఖపట్నం జిల్లా |
| శ్రీమతి కె. సుశీల, కర్మన్‌ఘాట్ క్రాస్ రోడ్స్, హైదరాబాద్ | జ్ఞానోదయ పబ్లిక్‌స్కూల్, నాగారం రోడ్, హుస్నాబాద్, కరీంనగర్ జిల్లా |
| శ్రీ బి. మనోహర్, బొల్లారమ్ బజార్, సికింద్రాబాద్ | నృపతుంగా ఉన్నత పాఠశాల, బాగ్ లింగంపల్లి, కాచిగూడ, హైదరాబాద్ |
| " " " | వృద్ధాశ్రమం, స్టేట్ పెన్షన్స్ వెల్ఫేర్ అసోసియేషన్, కుంట్లూరు, రంగారెడ్డి జిల్లా |
| శ్రీమతి & శ్రీ కె.కె. దాస్ & ఫ్యామిలీ, అశోక్‌నగర్, హైదరాబాద్ | న్యూ నాగార్జునా ఉన్నత పాఠశాల, వికారాబాద్, రంగారెడ్డి జిల్లా – 501 101 |
| " " " | ధర్మవిద్యాలయ బాలికల ఉన్నత పాఠశాల, గాంధీనగర్ కాలనీ, వికారాబాద్ |
| శ్రీమతి ఎస్.ఎస్. కూరెళ్ళ, జెర్సీవిల్లే, ఇల్లినాయిస్, యు.ఎస్.ఎ., | శ్రీ సరస్వతీ శిశుమందిర్, పి.జి. సెంటర్, గోదావరి ఖని– 505 289 |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్, కేశవనగర్, గోదావరి ఖని – 505 211 |
| డాక్టర్ వెంకటేశ్వర్లు, సిరిసిల్ల, కరీంనగర్ జిల్లా – 505 301 | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, అనుసముద్రం పేట, నెల్లూరు జిల్లా |
| శ్రీ జయలక్ష్మిరాజు, జూబ్లిహిల్స్, హైదరాబాద్ | శ్రీ సరస్వతీ శిశుమందిర్, మెట్‌పల్లి, కరీంనగర్ జిల్లా – 505 325 |
| శ్రీమతి పి. శోభ, జెమినీ కాలనీ, జమిస్థాన్‌పూర్, ముషీరాబాద్, హైదరాబాద్ | శ్రీ సరస్వతీ శిశుమందిర్, మంచిర్యాల, ఆదిలాబాద్ జిల్లా – 504 208 |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్, బి–జోన్, రామకృష్ణాపురం, ఆదిలాబాద్ జిల్లా |
| " " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, పోచెర, బోథ్, ఆదిలాబాద్ జిల్లా – 504 304 |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్, కోరుట్ల, కరీంనగర్ జిల్లా– 505 326 |
| " " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, కౌఠ్యా బుజుర్గ్, బోథ్, ఆదిలాబాద్ జిల్లా |
| " " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, బోథ్ బుజుర్గ్, బోథ్, ఆదిలాబాద్ జిల్లా |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్, కాపువాడ, కరీంనగర్ జిల్లా – 505 326 |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్, కోరుట్ల, కరీంనగర్ జిల్లా – 505 326 |
| " " " | ది రూరల్ ఎడ్యుకేషన్ అండ్ డెవలప్‌మెంట్ ట్రస్ట్ స్కూల్,అరవిందనగర్,అనంతపురం |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్ ఉన్నత పాఠశాల, బెల్లంపల్లి, ఆదిలాబాద్ జిల్లా |
| " " " | ప్రగతి పబ్లిక్ స్కూల్, హయత్‌నగర్, హైదరాబాద్ – 501 505 |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్ ప్రాథమిక పాఠశాల, బెల్లంపల్లి, ఆదిలాబాద్ జిల్లా |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్ గోదావరి రోడ్, మంచిర్యాల, ఆదిలాబాద్ జిల్లా |
| " " " | శాంతినికేతన్ పబ్లిక్ స్కూల్, హయత్‌నగర్, రంగారెడ్డిజిల్లా |
| " " " | ప్రగతి విద్యానికేతన్ పాఠశాల, బోథ్ బుజుర్గ్, ఆదిలాబాద్ జిల్లా – 504 304 |
| " " " | డాల్స్ పబ్లిక్ స్కూల్, హయత్‌నగర్, రంగారెడ్డి జిల్లా – 501 505 |
| " " " | ప్రభుత్వ ఆశ్రమ ఉన్నత పాఠశాల, పాట్నాపూర్, బోథ్, ఆదిలాబాద్ జిల్లా |

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.

# ప్రాచీన గాథలు : జీవన వికాసం

– ఆకెళ్ల రాఘవేంద్ర



## వామనావతారం - ఆత్మశక్తి సందేశం

మనం కిందటి సంచికలో 'గజేంద్రమోక్షం' కథ అంతరార్థం తెలుసుకొన్నాం. ఒక లక్ష్యాన్ని సాధించేందుకు ముందుకు సాగుతున్నప్పుడు ఎన్నో వ్యామోహాలు అవరోధాలుగా నిలుస్తాయి. వాటన్నింటినీ ఛేదించుకొంటూ అడుగేయడమే విజేత లక్షణం. బాధ, భయం, ఆత్మన్యూనత.... లాంటివన్నీ గజేంద్రమోక్షంలోని మొసలి రూపాలే!

ప్రతివ్యక్తీ తన జీవితంలో ఏదో ఒక సమయంలో భయపడడం సహజం. డబ్బు సంపాదించలేనేమోనన్న భయం కావచ్చు, పరీక్ష తప్పుతానేమోనన్న భయం కావచ్చు, అసలు నేను విజయం సాధించగలనా అన్న భయం కావచ్చు. ఆ భయంవల్ల ఆత్మన్యూనత, దాని వల్ల తీవ్ర మనోవ్యథ, దానివల్ల చివరకు ఆత్మహత్య చేసుకోవాలన్న వెర్రియోచన... ఇలాంటివన్నీ కలగడం సహజం. మనలో ఎంతో శక్తి ఉంది, మనకు మనం వామనుడిలా, మరుగుజ్జులా కనిపించవచ్చు. కానీ మనలోనే ప్రపంచాన్ని జయించగల శక్తి ఉంది. వామనావతారఘట్టం అంతరార్థమిదే.

కంటికి కూడా కనిపించనంత చిన్న సంయుక్తబీజం తల్లి గర్భంలో కణవిభజన చెంది అలా.. అలా.. గర్భస్థశిశువు అవుతుంది. పుట్టిన వెంటనే చూస్తే ఆ శిశువు వేలెడంత ఉంటుంది. కానీ కాలం గడిచేకొద్దీ ఆ శిశువే అయిదారు అడుగుల ఎత్తవుతుంది. కంటికి కూడా కనిపించనంత – వెంట్రుకవాసిలో వెయ్యోవంతు ఉండే పరమాణువులో కోటానుకోట్ల విద్యుచ్ఛక్తి ఉంది. అంటే సూక్ష్మంగా కనిపించే వస్తువులో అనంతమైన శక్తి ఉంటోందన్నమాట. ఆధునిక శాస్త్ర పరిభాషలో చెప్పాలంటే – నానో టెక్నాలజీ అన్నమాట. అల్పమైనది అనుకొనే వస్తువులో అనల్పమైన శక్తి నిబిడీకృతమై ఉంటోంది.

మనం కూడా అప్పుడప్పుడు భయంతో బెంగపెట్టేసుకుంటాం. బాధతో కుంచించుకుపోతాం. మనమీద మనం నమ్మకాన్ని పోగొట్టేసుకుంటాం. 'నా జీవితం ఇంతే, ఇక నేనేమీ చేయలేను' అని ఆవేదన చెందుతుంటాం. నాకు శక్తి లేదు, నా వల్లకాదు, అని నిస్సహాయులమైపోతాం. ఒళ్లంతా నిస్సత్తువ ఆవరిస్తుంది. మెదడు మొద్దుబారిపోతుంది. కష్టాల్ని తట్టుకోలేక కన్నీటి పర్యంతమైపోతాం. కాని ఆత్మన్యూనత అవసరం లేదనీ, మనకు మనం అల్పంగా కనిపిస్తున్నప్పటికీ అనల్పమైన, అనంతమైన శక్తి మనలో దాగి ఉందనీ చెప్పే ఘట్టం వామనావతార ఘట్టం.

పోతన భాగవతంలో ఎనిమిదవ స్కంధంలో వామనావతార కథ ఉంది. శుక్రాచార్యుల అనుమతితో నూరు యాగాలు చేసిన అసుర రాజు బలిచక్రవర్తి. ఆయన సభాస్థలికి వామనుడు రావడంతో– పొట్టివాడు కదా, – యజ్ఞోపవీతం, గొడుగు, కమండలం, చిన్న పంచెతో ఉన్న ఆ మరుగుజ్జుని చూడడంతో సభికులంతా ఫక్కున నవ్వారు. మనల్ని కూడా చూసి చాలా మంది నవ్వి ఉంటారు, ఈసడించుకుని ఉంటారు, మన శక్తిని అంచనా వేయకుండా చిన్న చూపు చూసి ఉంటారు. వామనుణ్ణి కూడా అలాగే చూశారు, చేశారు, కానీ

"ఇంతింతై, వటుడింతయై, మరియు దానింతై, నభోవీథిపై
నంతై, తోయదమండలాగ్రమున కల్లంతై, ప్రభారాశిపై
నంతై, చంద్రునికంతయై, ధ్రువునిపైనంతై, మహర్వాటిపై
నంతై, సత్య పదోన్నతుండగుచు బ్రహ్మాండాంతసంవర్థియై"

అన్నట్లుగా మరుగుజ్జు ఆకారంలో పొట్టిగా ఉన్న ఆ వామనుడు–క్రమక్రమంగా పెరిగి ఆకాశం కంటే, మేఘమండలం కంటే, వెలుగుల రాశికంటే, చంద్రుడికంటే, నక్షత్రాలకంటే, మహర్లోకం కంటే, ఆపై సత్యలోకం కంటే – ఎంతో ఎత్తుకి ఎదిగాడు.

మనం కూడా అంతే – ఎంతో ఎత్తుకు ఎదగగలం. అది ఉద్యోగం కావచ్చు, చదువుకావచ్చు, సమస్యను ఎదుర్కోవడం కావచ్చు.. ఇంకా ఏదైనా కావచ్చు. ఇపుడు మనలోకి మనం కుంచించుకు పోతున్నా, రేపటి రోజున ఇంతింతై, వటుడింతై.. అన్న రీతిలో విజయాల్ని సాధించగలం. అదెలాగో మరో సందర్భంలో ప్రస్తావిద్దాం! ❖

# అసలైన ఆధ్యాత్మికత

- విష్ణుప్రియ

ఆధ్యాత్మిక సాధన అంటే ప్రపంచానికి దూరంగా నిత్య జీవితంతో సంబంధం లేకుండా మానవ సంబంధాలు తెంచేసుకొని, ఏ మారుమూలో జీవితం గడపడం కాదు. ఆధ్యాత్మికత, భౌతికతతో విభేదించదు. భౌతిక జీవనానికి సహాయ సంపత్తులను అందిస్తూ, వ్యక్తి వికాసానికి దారి చూపిస్తూ నిరంతరం మానవ భావనతో కలసి ముందుకుసాగే ఒక అపురూప ధర్మకెరటం 'ఆధ్యాత్మికత'.

"ఒక విజ్ఞాన శాస్త్రవేత్త ఎప్పుడూ ఒక వేదాంతి అయి ఉంటాడు" అన్నారు మహామేధావి ఐన్‌స్టీన్. "ఒక వైజ్ఞానిక పరిశోధనకు ఉద్యమించే శాస్త్రవేత్త తన కార్య నిర్వాహక క్షేత్రాన్ని తయారుచేసుకోవడానికి పూర్తిగా ఆధ్యాత్మిక బలాన్ని ఆధారం చేసుకొని కృతకృత్యుడవుతాడు" అన్నారు డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్.



ఆధ్యాత్మిక సాధనా క్రమంలో జప తప ధ్యానాదులన్నీ చాలా కష్టతరమైనవని ఒక అభిప్రాయం. ఇవి వ్యక్తి ప్రవర్తన సరళంగా సాగి ప్రపంచానికి ఉపయోగపడే విధంగా వ్యక్తిని తీర్చిదిద్దగల శక్తి విడుదల కేంద్రాలు. మన అస్తిత్వాన్ని చైతన్యవంతం చేసుకొని, ప్రపంచ కర్మాగారంలో ఒక క్రమశిక్షణాయుతమైన జీవన శైలితో అద్భుత విజయాన్ని సాధించడానికి మనకు తగిన తర్ఫీదు నిస్తాయి.

భారత దేశంలో ధర్మం తెలియని వారుండరు. ప్రతివారి దృష్టిలోనూ ఒక ఆదర్శ భావ చిత్రం ఉంటుంది. అయితే అది బుద్ధి పరిధిలోనే ఉండిపోతుంది. క్రియారూపంలోకి రావడం లేదు. స్వార్థపరిధిని దాటి మన సంకల్పాలన్నీ అత్యున్నత ప్రమాణాలను అందుకోవడానికి తగిన మానసిక బలం మనకు కావాలి. ఆ బలాన్ని ఆధ్యాత్మిక సాధన ద్వారా మనం సమకూర్చుకోగలం.

వర్తమానాన్ని క్రమబద్ధం చేసుకోగల ప్రశాంతమైన, విశ్వాసపూరితమైన జీవన శైలినీ, జీవన రీతినీ నిర్దేశిస్తుంది ఆధ్యాత్మికత. ఓర్పు, సహనం, శాంతి, సహకారం, స్వచ్ఛత రాజ్యం చేసే స్వర్గ తుల్యమైన సమాజ సంస్థాపనకు కచ్చితంగా అనుసరించవలసిన జీవన సూత్రాలను బోధిస్తుంది ఆధ్యాత్మికత.

సాధారణంగా మనకు అందుబాటులో ఉన్నవాటినీ, మనకు అవసరం అయిన వాటినీ విడిచిపెట్టి మనవి కానివాటినీ, మన దగ్గర లేని వాటినీ, మనకు అక్కరలేని వాటినీ తలుచుకుంటూ తెగ బాధపడిపోతూ ఉంటాం. ఫలితం సమయం వృథా, అశాంతి. మన అవసరాలు తీరక బాధపడుతున్నామా, లేక ఇతరులతో పోల్చుకుని బాధపడుతున్నామా అని ఆలోచించుకోవాలి. ఇది చాలా ముఖ్యం.

"సంతుష్ట స్సతతం యోగి"– తృప్తితో జీవించేవాడే యోగి. తృప్తిగా జీవించడమే ఆధ్యాత్మిక సాధన.

"అద్వేష్టా సర్వ భూతానాం మైత్రః కరుణ ఏవ చ". ఇది భారతీయ ఆధ్యాత్మిక ఔన్నత్యం. ఎవరినీ ద్వేషించని ప్రేమపూరితమైన హృదయం లేనప్పుడు జీవితానికి అర్థం ఉండదు. సంకుచిత భావాలను వీడి, విశ్వ కుటుంబ మధురిమను అనుభూతం చేసుకోగల మానసిక సౌందర్యాన్ని అనుగ్రహిస్తుంది ఆధ్యాత్మిక సాధన. ప్రేమ, సేవలకు సరైన నిర్వచనాన్ని ఇచ్చేది ఆధ్యాత్మిక సాధన.

వివేకంతో వ్యక్తిగత సామర్థ్యాన్ని పెంచుకొని, సుఖసంతోషాలతో, మమత మానవతలతో, ప్రేమ తత్త్వంతో హృదయాన్ని దైవమందిరంగా చేసుకోగలిగితే అదే అసలైన ఆధ్యాత్మికత. ❖

ఆచార వ్యవహారాలు - అంతరార్థాలు- 37

- రెంటాల జయదేవ

(...గత సంచిక తరువాయి)

# పూజకు పనికిరాని పూలు

దేవుళ్ళందరికీ అన్ని రకాల పుష్పాలనూ ఉపయోగించరాదు. ప్రత్యేకించి కొన్నింటిని కొందరు దేవుళ్ళ పూజకు వాడకూడదు. ఆ వివరాలు:

అక్షతలతో-శ్రీమహావిష్ణువును పూజింపరాదు.

గరికతో- దుర్గాదేవిని పూజించకూడదు.

మారేడు దళాలు, తగర పుష్పాలను - సూర్య భగవానుడి అర్చనకు ఉపయోగించరాదు.

ఉమ్మెత్త, అర్క పుష్పాలతో - భైరవుణ్ణి పూజింపరాదు.

తమాల పుష్పాలతో - సరస్వతీదేవిని పూజించకూడదు.

జిల్లేడు, గన్నేరు పూలతో - శ్రీదేవిని పూజింపరాదు.

మొగలి, కుటజ పుష్పాలను - శివుడి పూజకు ఉపయోగించరాదు.



**శంకరుడి పూజకు పనికి రానివి**

***జపాకుంద శిరీషైశ్చ । యూథికా మాలతీ తథా ।***
***కేతకీ భవ పుష్పైశ్చ । నైవార్చ్యః శంకర స్సదా ॥***

(కార్తిక మాహాత్మ్యే)

'దాసాని పుష్పం, వసంత కాలపు మల్లె, దిరిసెన, అడవి మల్లె, సన్నజాజి, మొగిలిపూలతో ఎప్పుడూ శంకరుణ్ణి పూజించకూడదు.'

**విష్ణు, నరసింహ పూజలకు పనికి రానివి**

***మందార మర్క దత్తూరం । శాల్మలీ కాంచనా రజమ్ ।***
***నిషిద్ధం విష్ణు పూజాయాం । పుష్పం వైభీతకం తథా ॥***
***నరసింహస్య పూజాయాం । నిషిద్ధం కేతకీ ద్వయమ్ ॥***

(పుష్ప మాలాయాం)

'మందారం, జిల్లేడు, ఉమ్మెత్త, బూరుగ, దేవకాంచనం, తాండ్ర పుష్పాలు విష్ణు పూజకు నిషిద్ధం. ఇక, నరసింహస్వామి పూజకు తెలుపు, పచ్చని రంగుల మొగిలి పూవులు కూడా నిషిద్ధం.'

**శ్రీకృష్ణుని పూజకు పనికి రానివి**

***న రక్తచందనం జాతు । గృహ్ణీయా ద్రక్తపుష్పకమ్ ।***
***బిల్వపత్రై స్తత్ప్రసూనై । ర్నార్చయే ద్దేవకీ సుతమ్ ॥***

(గౌతమీయే)

'రక్తచందనం లేదా దానిమ్మ పుష్పాలతో కానీ, మారేడు దళాలతో కానీ శ్రీకృష్ణుణ్ణి అర్చించకూడదు.'

**దైవప్రసాద ధారణ**

నిజానికి, ఏ పుష్పాన్ని అయినా సరే అత్యంత భక్తి శ్రద్ధలతో, పరిపూర్ణ విశ్వాసంతో దైవానికి సమర్పించాలి. అంతేతప్ప, అనాసక్తిగా, యాథాలాపంగా, తేలిక భావంతో సమర్పించకూడదు. దేవుడికి పూజ చేశాక అలా పూజకు ఉపయోగించిన పుష్పాలను దైవప్రసాదంగా తీసుకొని, భక్తితో ధరించడం మనకు అలవాటు. దీనికి సంబంధించిన వివరణతో ఓ శ్లోకం ఉంది:

***కర్ణే పుష్పం గళే గంధః, శిఖాయాం***
***తులసీదళం న ధారయేత్॥***

'పుష్పాన్ని చెవిలో, గంధాన్ని కంఠానికి ధరించాలి. జుట్టుముడిలో(శిఖలో)తులసీ దళాన్ని ధరించరాదు' అని అర్థం.

**నిర్మాల్యం తొలగించడమెలా?**

ఇక, భగవంతునికి సమర్పించిన పుష్పాలు, పత్రాలను ఆ మరుసటి రోజు ఉదయం తీసివేసి, తాజా పుష్పాలు, పత్రాలతో అర్చించడం మనకు అలవాటు. ముందు రోజు భగవదర్పితమైన పత్ర పుష్పాలను మరునాటి ఉదయానికి 'నిర్మాల్యం' అంటారు.

దేవునికి పుష్పం సమర్పించి, పూజించే సమయంలో ఏ చేతివేళ్ళతో ఎలా పుష్పాన్ని పుచ్చుకోవాలో గతంలో చెప్పారు. మరి, ఇప్పుడిక నిర్మాల్యాన్ని తీసివేసేటప్పుడు అనుసరించాల్సిన పద్ధతిని కూడా చెబుతున్నారు:

***మధ్యమా నామికా మధ్యే । పుష్పం సంగృహ్యా పూజయేత్ ।***
***అంగుష్ఠ తర్జన్యగ్రాభ్యాం । నిర్మాల్య మపనోదయేత్ ॥*** (స్కాందే)

'చేతిలోని మధ్య వేలు, అనామిక (ఉంగరం వేలు) మధ్యలో పుష్పాన్ని పుచ్చుకొని, పూజించాలి. ఇక, బొటనవేలు, తర్జని (చూపుడువేలు) కొనలతో నిర్మాల్యాన్ని తీసివేయాలి'. ❖

**(అష్ట విధ పుష్పాలు, మానసిక పుష్పాలు... వచ్చే సంచికలో...**

...17వ పేజీ తరువాయి.




**'నేను' ఎప్పుడు ముక్తి పొందుతాను? 'నేను' నశించినప్పుడు!**

'నేను', 'నాది' అన్నది అజ్ఞానం. 'నువ్వు', 'నీది' అన్నది జ్ఞానం. నిజమైన భక్తుడు "ఈశ్వరా! నీవే కర్తవు. నేనొక పరికరాన్ని మాత్రమే! నీవు ఏది చేయిస్తే అది చేస్తాను. ఈ ఇల్లు, ఈ కుటుంబమూ నీకు చెందినవి; నాకు చెందినవి కాదు; నీవు ఆదేశించినట్లు పని చేయడం మాత్రమే నా కర్తవ్యం"అని అంటాడు. – **శ్రీరామకృష్ణ పరమహంస**



## అమర భారత ప్రతిభ

# యంత్ర శాస్త్రం

Machine Science of India

ఆధునిక ప్రపంచ మనుగడ యావత్తూ యంత్రమయం. నాగరిక జీవన విధానంలో యంత్రం సహాయం లేకుండా ఏ పనీ జరగదు. దైనందిన జీవితంలో యంత్రం పాత్ర అవిభాజ్యమైనది. ఇది పారిశ్రామిక విప్లవం తరువాత మరింతగా బలపడింది. పురోగతి సాధించింది. ఇటువంటి అతిముఖ్యమైన యంత్ర శాస్త్రం గురించిన భారతీయ శాస్త్రవిజ్ఞానం ఏమంటున్నది! ఇందులో మన విజ్ఞానం యొక్క స్థాయి ఏమిటి? ఒకసారి పరిశీలిద్దాం.





మన ఋషులు ఈ యంత్రాల గురించి సవివరంగా ప్రస్తావించి ఉన్నారు.

భరద్వాజ మహాముని యొక్క "యంత్ర సర్వస్వం" అనే గ్రంథం చాలా ప్రసిద్ధి గాంచింది. వాల్మీకి రామాయణంలో – బాలకాండ, సర్గ 5, శ్లో. 10లో నగర వర్ణన చేస్తూ యంత్రాగారాల గురించి వివరిస్తాడు. ఇక రాముడు భరతునితో "రాజప్రాసాదము లన్నీ యంత్రములతో చక్కగా సంరక్షింప బడుతున్నాయి కదా" అని అడుగుతాడు. అంటే ఆ నాటికే రక్షణ వ్యవస్థలో యంత్రసామాగ్రి ఉపయోగించటం తెలిసి ఉండాలి కదా! (అయోధ్యకాండ, సర్గ 100, శ్లో. 53)

**దణ్డైశ్చ క్రైశ్చ దన్తైశ్చ సరణి భ్రమణాదిభిః ।**
**శక్తేరుత్పాదనం కిం వా చాలనం యనన్త్రముచ్యతే ॥**
**– యన్త్రార్ణవము**

యంత్రార్ణవము అనే గ్రంథంలో యంత్రవర్ణన చేస్తూ, యంత్రంలో దండ –Lever, చక్ర–Pulley, దంత్–Toothed wheel, సరణి–Inclined plane, భ్రమణ–Screw వంటివి ఉంటాయనీ, శక్తిని జనింపచేయటానికీ, శక్తి దిశను మార్చడానికీ యంత్రాలనూ, అందులోనే వివిధభాగాలనూ ఉపయోగిస్తారనీ యంత్రనిర్వచనం చేశాడు.

భోజరాజు తన 'సమరాంగణ సూత్రధార' అనే గ్రంథంలో ఏ యంత్రానికి ఏయే లక్షణాలు ఉండాలి, యంత్ర భాగాల పరస్పర సంబంధం, ఖచ్చితత్వం, క్షయత (Tuning) శబ్దరహిత చలనం – ఇంధన సామర్థ్యం వంటి 20 లక్షణాల గురించి వివరించి ఉన్నాడు.

హైడ్రాలిక్ శక్తిని ఉత్పత్తి చేయటంలో జలధారను ఉపయోగించే విధానం సమరాంగణ సూత్రధార 31వ అధ్యాయంలో చెప్పబడింది. అలాగే "సూర్యసిద్ధాంతం"లో యంత్రాధ్యాయంలోని 53 నుండి 56 వరకూ గల శ్లోకాలలో జలచక్రం గురించిన వర్ణన ఉంది.

చివరగా భరద్వాజుని "యంత్ర సర్వస్వం"లో 31 రకాల యంత్రాలను, విమానంలో వాటి స్థానం, అవి నిర్వహించే పనినీ పేర్కొన్నారు. వాటిలో విమానం పరిసరాలను విమానంలో నుంచే చూడగలిగే 'విశ్వక్రియా దర్పణం', దిక్కులను సూచించే "దిశాదర్శి", శత్రు విమానాలను పసిగట్టి పక్కకు తప్పుకోగలిగే "వక్ర ప్రసారణ యంత్రం" వంటివి ఉన్నాయి.

జి.ఆర్. జోష్యర్ రచించిన "డైమండ్స్, మెకానిజమ్స్, వెపన్స్ ఆఫ్ వార్, యోగసూత్రాస్" అనే గ్రంథంలో ఎన్నో రకాలయిన ఇంధనాలతో నడపబడే యంత్రాల గురించి వివరింపబడి ఉంది.

– కణాద మహర్షి తన 'వైశేషిక దర్శనం'లో ఐదు రకాల క్రియలు గురించి చెప్పాడు. ఇవన్నీ కూడా ఈనాటి ఆధునిక యంత్ర చలనాలకు సంబంధించినవి.

– ప్రశస్తపాదుడు 'వైశేషిక దర్శనానికి' భాష్యం రచించాడు. అందులో కొన్ని 'గతి సూత్రాలను' సూత్రీకరించాడు.

ఇది న్యూటన్ కంటే దాదాపు వేయి సంవత్సరాల ముందు కాలం నాటిది. అంతటి విలువైన యంత్ర విజ్ఞానం వెల్లివిరిసిన భారతావనిలో, ఆ తరువాత ఆ జ్ఞానం కనుమరుగు కావటం ఆశ్చర్యం కలిగిస్తుంది. కాల మహిమను ధృవపరుస్తుంది. ❖

('భారతీయ ప్రతిభా విశేషాలు' పుస్తకం నుంచి)

# వార్తావాహిని

## గిరిజన సంచార వైద్యశాల

**రాజమండ్రి రామకృష్ణ మిషన్** నిర్వహిస్తున్న గిరిజన సంచార వైద్యశాల కోసం ఆధునిక వైద్యపరికరాలతో



రూపొందించిన వాహనానికి రాజమండ్రి రోటరీక్లబ్, యు.కె. రోటరీక్లబ్ ఆర్థిక సహాయం అందించింది. ఈ వాహనాన్ని జనవరి 28న రోటరీక్లబ్ ప్రతినిధులు లాంఛనప్రాయంగా రామకృష్ణ మిషన్‌కు అందజేశారు. ఈ సంచార వైద్యశాల వాహన ప్రారంభాన్ని పురస్కరించుకుని జనవరి 29న వెలగపల్లిలో ఉచిత వైద్య శిబిరం నిర్వహించడం జరిగింది. ఈ శిబిరంలో 683 మంది రోగులు చికిత్స పొందారు. 37 మందికి కంటి అద్దాలు, 212 మందికి దుప్పట్లు ఉచితంగా పంపిణీ చేశారు. ❖ **నివేదిక : స్వామి అక్షరాత్మానంద**

## చిత్రప్రదర్శన

**చెన్నై రామకృష్ణ మఠం** ఆధ్వర్యంలో తమిళ మాసపత్రిక 'శ్రీరామకృష్ణ విజయం' జాతీయ యువజన దినోత్సవం సందర్భంగా తమిళనాడులోని పాఠశాలల, కళాశాలల విద్యార్థులకు చిత్రలేఖనం పోటీ నిర్వహించింది. సుమారు 20,300 మంది విద్యార్థులు పాల్గొన్న ఈ పోటీల్లో 500 మంది విద్యార్థులు గీసిన చిత్రాల్ని ఎంపిక చేసి 'చెన్నై వివేకానంద ఇల్లమ్'లో చిత్రప్రదర్శన ఏర్పాటుచేశారు. ఈ చిత్రప్రదర్శనను చెన్నై రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి గౌతమానందజీ ప్రారంభించారు. జనవరి 12 నుండి 26



వరకు నిర్వహించబడిన ఈ చిత్రప్రదర్శనశాలను 11,000 మంది సందర్శించారు. ❖ **నివేదిక : స్వామి విమూర్తానంద**

## విద్యార్థులకు వరం 'వివేకవాహిని'

**ఒంగోలు, సూర్యాపేట, హుజూర్‌నగర్, కైకలూరు, పెదకళ్ళేపల్లి, నకిరేకల్-శ్రీరామకృష్ణ సేవాసమితుల ఆధ్వర్యంలో** విజయవాడ రామకృష్ణ మిషన్ 'వివేకవాహిని' 2008 సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు, డిసెంబరు నెలల్లో ప్రకాశం, నల్లగొండ, కృష్ణా, గుంటూరు జిల్లాల్లోని 59 విద్యా సంస్థల్లో వ్యక్తిత్వవికాస సదస్సులను, 13 గ్రామాల్లో సత్సంగాలను నిర్వహించింది. 30,000 మంది విద్యార్థులు



ఈ సదస్సుల్లో పాల్గొని, రూ. 1,80,000లు విలువచేసే వివేకానంద సాహిత్య గ్రంథాలను కొన్నారు. ❖

**సంయుక్త నివేదిక : మాల్యాద్రి, ఒంగోలు, సుబ్రహ్మణ్య శర్మ, హుజూర్‌నగర్.**

**ఉచిత వైద్య శిబిరం** : **తూర్పు గోదావరి జిల్లా, రామచంద్రాపురం శ్రీరామకృష్ణ సేవాసమితి** స్వామి వివేకానంద జన్మదినోత్సవం సందర్భంగా అంధ, బధిర పాఠశాలల విద్యార్థులకు, గ్రామీణులకు ఉచిత వైద్య శిబిరాన్ని నిర్వహించింది. శ్రీ యనమదల రామకృష్ణగారు ఇరవైవేల రూపాయలు విలువచేసే మందులను రోగులకు ఉచితంగా పంపిణీ చేశారు. కళాశాల విద్యార్థులకు వ్యాసరచన, వక్తృత్వ, చిత్రలేఖనం పోటీలను కూడా సమితి నిర్వహించింది. ఈ పోటీల్లో విజేతలైన విద్యార్థులకు బహుమతులు అందజేశారు. ❖ **నివేదిక : బి. వీరభద్రరాజు**



## యువజన సదస్సు

**రంగారెడ్డి జిల్లా, వికారాబాద్ వివేకానంద సమితి** ఫిబ్రవరి 5న యువజన సదస్సును నిర్వహించింది. సుమారు 1300 మంది విద్యార్థులు పాల్గొన్న ఈ కార్యక్రమంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' సర్క్యులేషన్ మేనేజర్ స్వామి రఘునాయకానంద ప్రసంగిస్తూ 'విద్యార్థులు పాశ్చాత్య సంస్కృతి మోజులోపడి జీవిత లక్ష్యాన్ని మరిచిపోతున్నారు. యువత తమ లక్ష్యసాధనలో విజయం సాధించాలంటే స్వామి వివేకానందను ఆదర్శంగా తీసుకోవాలి' అని అన్నారు. ఆత్మవిశ్వాసం, పట్టుదల ఉంటే దేనిలోనైనా విజయం సాధించవచ్చు అన్న స్వామి వివేకానంద స్ఫూర్తి వచనాలతో స్వామీజీ తమ ప్రసంగాన్ని ముగించారు. ఈ కార్యక్రమంలో స్వదేశీ జాగరణమంచ్ కార్యదర్శి అప్పల ప్రసాద్ 'విద్యార్థులు పుస్తకాన్ని మస్తకంతో కాకుండా హృదయంతో చదవాలి' అని గుర్తుచేశారు. ❖ **నివేదిక : కె. సంతోష్ కుమార్, కార్యదర్శి.**

## జాతీయ యువజన దినోత్సవ ర్యాలీ



**విశాఖపట్నం రామకృష్ణ మిషన్ ఆశ్రమ** జాతీయ యువజన దినోత్సవం సందర్భంగా జనవరి 12న ఊరేగింపు నిర్వహించింది. సుందరంగా అలంకరించిన స్వామి వివేకానందుని చిత్రపటాన్ని వాహనంలో రామకృష్ణ బీచ్ నుంచి నగర వీధుల్లో ఊరేగించారు. ఊరేగింపులో పాల్గొన్న విద్యార్థులకు 'స్వామి వివేకానంద సందేశం' అనే పుస్తకాల్ని ఉచితంగా పంపిణీ చేశారు. ❖ **నివేదిక : స్వామి గరిమానంద**

# గ్రంథ పరిచయం

## శ్రీమద్భాగవత దశమస్కంధ త్రివిధనామావళి



**రచయిత: ఇ.వి.శేషావతారము, వెల : 150/-, పేజీలు : 340, ప్రాప్తిస్థానము : ఇ.వి. శేషావతారము, గిరీశచంద్ర, ప్లాట్ నెం. 25, ఇ.నెం. 11-13-619, రోడ్డు నెం. 2, హరిపురి, హైదరాబాద్-35, ఫోన్.నెం. 20060147**

**శ్రీ** వల్లభాచార్యుల వారు శ్రీమద్భాగవతములోని ద్వాదశ స్కంధములో చెప్పబడిన దశవిధ లక్షణాలను సర్గము, విసర్గము, స్థానము, పోషణము, ముక్తి, ఆశ్రయము.... భగవంతుని లీలల్ని భక్తజనోద్ధరణ కొరకు పురుషోత్తమనామసహస్రం రచించారు. శ్రీమద్భాగవతమును ప్రతినిత్యమూ పారాయణం చేయడం కష్టం కనుక సులభోపాయంగా ఆచార్యులవారు ఈ నామసహస్రాన్ని వ్రాశారు. అక్కడ చెప్పిన నామాలేకాకుండా ఆచార్యులవారు దశమస్కంధం లోని శ్రీకృష్ణలీలలను "త్రివిధనామావళి" గా ప్రత్యేకంగా రచించారు.సంస్కృత భాషలో ఉన్న ఈ గ్రంథాన్ని శ్రీ శేషావతారంగారు తెలుగులోనికి అనువదించి సులభతరం చేసి, సువిస్తరమైన వ్యాఖ్యానాన్ని అందించడం ముదావహం. భక్తులందరూ తప్పక చదువవలసిన గ్రంథమిది. ❖ **– నాగప్రసాద్**

## అమెరికాలో భారతీయ సంస్కృతి



**ఆంగ్లమూలం : చమన్‌లాల్**
**అనువాదం : డా॥ నూతి విక్రమార్క,**
**వెల : రూ.210/-; పేజీలు : 377,**
**ప్రాప్తిస్థానము : నూతి ఇందిర,**
**ప్లాట్ నెం : 61/ఎ, శ్రీనివాసపురం కాలనీ, నాగార్జునా హైస్కూలు వెనుక, వనస్థలిపురం, హైదరాబాద్ -70, ఫోన్.నెం. 24242928**

**చ**రిత్ర పాఠాలలో నేర్పినదీ, నేర్చుకున్నదీ తప్పు అని సాక్ష్యాధారాలతో సహా నిరూపిస్తూ శ్రీ చమన్‌లాల్ "హిందూ అమెరికా" అనే గ్రంథాన్ని రచించారు. వారు తమ గ్రంథంలో ప్రాచీన భారతదేశానికీ, అమెరికాలోని రెడ్ ఇండియన్లకీ మధ్య పోలికలున్నాయని వివరించారు. ఎంతో విస్తృతంగా అధ్యయనం చేసి, అమెరికాలో తొలివలసలను ఏర్పరచినవారు భారతీయులే అని నిర్ధారించారు రచయిత. ఎన్నో ఆసక్తికరమైన అంశాలున్న ఈ గ్రంథానికి డా॥ నూతి విక్రమార్క ఆంధ్రానువాదం కావించారు. భారతీయుల సంస్కృతీ, ఔన్నత్యాలను తెలుసుకోగోరిన వారికి ఇది అత్యంత ఆసక్తికరమైన గ్రంథం. ❖ **– శ్రీమతి ఎన్. శేషు**

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) 'వేదచూడామణి' : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

(ఆ) 'వేదార్థచూడామణి' : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
వయస్సు : 15 సం॥, ఆ పైన
స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) వేదాధ్యాపకుడు : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవము : 2 సంవత్సరములు
సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

(ఆ) వేదభాష్యాచార్యుడు : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవార్హత : 5 సం॥
సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-
హైదరాబాద్ కులప్రశాసకుడు



Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

ఒకరోజు బ్రహ్మసమాజపు యువకులు కొందరు తాము జనకుణ్ణి ఆదర్శంగా తీసుకొని సంసారంలో మెలగుతున్నామని నాతో చెప్పారు. అందుకు నేను వారితో ఇలా అన్నాను: “జనకుడిలా ఉన్నానని చెప్పడం సులువే! కానీ జనకుడి లాగ వర్తించటం కష్టతరం. ఏ విధమైన సంగం లేకుండా, మాలిన్యాన్ని పొందకుండా ఐహిక విషయాల మధ్య మెలగడం చాలా కష్టం. ప్రారంభదశలో జనకుడు ఎటువంటి కఠిన నియమాలను పాటించి, తపస్సు చేశాడో తెలుసా? కానీ మిమ్మల్ని అలా కఠిన నియమాలను పాటించాల్సిందిగా చెప్పను. ప్రశాంతమైన స్థలంలో ఒంటరిగా కొంతకాలం నివసించండని మిమ్మల్ని కోరుతున్నాను. జ్ఞానాన్నీ, భక్తినీ సముపార్జించుకొని అప్పుడు సంసారంలో ప్రవేశించవచ్చు. కదపకుండా ఒకచోట పెట్టినప్పుడే పాలు, గట్టి పెరుగుగా తోడుకుంటాయి. పాలను కదిపినా, ఒక కుండ నుంచి మరో కుండలోకి మార్చినా పాలు తోడుకోవు. జనకుడు నిస్సంగుడు. అందువల్ల అతడికి ‘విదేహుడు’ అనే పేరు వచ్చింది. అతడు జీవన్ముక్తుడై మెలిగాడు. దేహబుద్ధిని నిర్మూలించుకోవడం ఎంతో కష్టం. జనకుడు నిజానికి ఒక వీరుడు. ఒక చేతిలో జ్ఞానాన్నీ, రెండో చేతిలో కర్మలనే ఖడ్గాన్నీ అవలీలగా ధరించిన ధీరుడు!” ❖

(‘శ్రీరామకృష్ణ బోధామృతం’ నుంచి)



## సుబోధ

గృహస్థులు కూడా భగవత్సాక్షాత్కారం పొందవచ్చు. అందుకు జనక మహారాజే నిదర్శనం. అతడు రాజర్షి. కానీ హఠాత్తుగా జనకుడిలా అవడం అందరికీ సాధ్యం కాదు. జనకమహారాజు లోకవ్యవహార కల్లోలానికి దూరంగా ఏకాంతవాసం చేస్తూ, భక్తిసాధనలను ఎన్నో ఏళ్ళు కొనసాగించాడు. కాబట్టి గృహస్థులు అప్పుడప్పుడు ఏకాంతవాసం చేస్తూ ఉండాలి. భగవత్సాక్షాత్కారాన్ని పొందే నిమిత్తం సాధనలు చేయడం ఎంతో శ్రేయస్కరం.

**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029
ఫోన్: 040–2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద**
సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**



## సురభి

**నేను** (నీలకాంత్ చక్రవర్తి), మరో ముగ్గురు మిత్రులం కలిసి జయరాంబాటీ వెళ్ళాం. మధ్యాహ్నం పన్నెండున్నర గంటలకు ప్రసాదం స్వీకరించడం కోసం వసారాలో కూర్చున్నాం. వాతపునొప్పుల కారణంగా మాతృదేవి కాస్త కుంటుతూ నడిచారు. అయినప్పటికీ అందరికీ తామే స్వయంగా వడ్డించారు.

**నేను:** అమ్మా, ఇక్కడ చాలా మంది ఉన్నారు కదా! మీరే స్వయంగా ఎందుకు వడ్డించాలి?.

**మాతృదేవి:** నాయనా! బిడ్డలకు స్వహస్తాలతో వడ్డించి తినిపించకపోతే తల్లి మనస్సు కలత చెందుతుంది.

మర్నాటి ఉదయం స్నానం చేయడానికి నేను చెరువు వద్దకు వెళ్ళాను. దారిలో నేను చూసిన దృశ్యం నన్ను ఆశ్చర్యపరచింది. ఒక పెద్ద బిందెను చంకన పెట్టుకుని చెరువు నుంచి మాతృదేవి నీళ్ళు తీసుకువస్తున్నారు. ఇంతమంది ఉండగా మీ రెందుకు ఇవన్నీ చేస్తున్నారని అడిగినప్పుడు, “నాయనా! దీని వల్ల నా కెలాంటి శ్రమా లేదు. ఇవన్నీ నాకు అలవాటైపోయాయి” అని ఆమె జవాబిచ్చారు. మరునాడు ఉదయం కామార్పుకూర్‌కు వెళ్ళి, గురుదేవుల జీవితంతో ముడిపడివున్న స్థలాలను సందర్శించాం. మాణిక్‌రాజా మామిడి తోటలో చాలాసేపు గడిపాం. అందువల్ల తిరిగి వచ్చేసరికి రాత్రి చాలా పొద్దుపోయింది. పాండుజ్యే చెరువు వద్దకు చేరేసరికి దూరంగా ఎవరో ఒక వ్యక్తి చేత లాంతరు పట్టుకొని నిలబడి ఉండడం కనబడింది. దగ్గరకు వెళ్ళి చూడగా మేం చూసిన దృశ్యం మమ్మల్ని ఆశ్చర్యచకితుల్ని చేసింది. సాక్షాత్తూ శారదాదేవియే లాంతరు పుచ్చుకొని అక్కడ నిలబడి ఉన్నారు.

“అమ్మా! మీరా ఇక్కడ?” అని మేము అడిగినప్పుడు మాతృదేవి ఆప్యాయత ఉట్టిపడే స్వరంతో, “నాయనా! మీరు బయటి ఊరి వాళ్ళు. పైగా చిమ్మచీకటి. దారి తప్పవచ్చు. అందువల్ల నా మనస్సు ఎంతో ఆందోళనకు గురైంది. అందుకే లాంతరు పుచ్చుకుని మీ కోసం ఎదురు చూస్తూ నిలబడి ఉన్నాను” అని చెప్పారు. ఆ మాటలు విని మేం నిశ్చేష్టులమయ్యాం. శిలాప్రతిమలలా నిలబడిపోయాం. ఈ మాతృమూర్తి కారుణ్యానికి సాటి ఉందా? ❖

(నీలకాంత్ చక్రవర్తి స్మృతుల నుంచి)

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 66 సంచిక: 4 ఏప్రిల్ 2009

**ఏవం కృతా యేన విచిత్రలీలా మాయామనుష్యేణ నృపచ్ఛలేన,**
**తం వై మరాలం మునిమానసానాం శ్రీజానకీ జీవనమానతోఽస్మి.**

మాయామానుష రూపంతో, రాజలాంఛన మిషతో, లోకోత్తరమైన లీలల్ని ప్రదర్శించిన మునిమానస రాజహంస అయిన శ్రీజానకీ ప్రాణనాథునికి నమస్కరించుచున్నాను.

(శ్రీజానకీ జీవనాష్టకమ్)



## లోపలి పేజీల్లో...
























# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి







ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

**రాజ పోషకులు**............ రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాత పేరు / చిరునామా | రూ. |
|---|---|---|
| మహారాజ పోషకులు | : శ్రీ గౌరీశంకర బాబు, నుంగంబాకం, చెన్నై - 600 034 | 15,000 |
| పోషకులు | : శ్రీమతి & శ్రీ కెంచె మురుడప్ప, రాయదుర్గ్, అనంతపురం జిల్లా | 1,625 |
| " " | : శ్రీమతి కె. కళావతి, ఆల్వాల్, సికింద్రాబాద్-500 010 | 1,116 |
| " " | : శ్రీ వి.వి.ఎన్. శర్మ, ఉప్పల్, హైదరాబాద్ - 500 039 | 1,116 |
| " " | : శ్రీ కాపర్తి కృష్ణమూర్తి, మాసైపేట్, మెదక్ జిల్లా | 1,116 |
| " " | : శ్రీ కాపర్తి రామచంద్రయ్య, మాసైపేట్, మెదక్ జిల్లా | 1,116 |
| " " | : శ్రీ కాపర్తి శంకరయ్య, మాసైపేట్, మెదక్ జిల్లా | 1,116 |
| " " | : శ్రీ కాపర్తి శివకుమార్, మాసైపేట్, వెల్దుర్తి, మెదక్ జిల్లా | 1,116 |
| " " | : శ్రీ సిలువేరి సుదర్శన్, అరవింద్ నగర్, హైదరాబాద్ | 1,000 |
| " " | : శ్రీ ఎన్.పి. కేశవరెడ్డి, కొల్లగల్లు, బళ్ళారి, - 583 104 | 1,000 |
| " " | : శ్రీ ఎమ్. సుధాకర్, మదనపల్లి, చిత్తూరు జిల్లా (కీ॥శే॥ ఎమ్.వి. లక్ష్మమ్మ శెట్టి జ్ఞాపకార్థం) | 1,000 |
| " " | : శ్రీ నవీన్‌తేజ, జి.ప. ఉన్నత పాఠశాల, పరవాడ, విశాఖపట్నం - 531 021 | 1,000 |

**ముఖచిత్రం :** 'శ్రీ సీతా లక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్ సమేత శ్రీరామచంద్రుని పట్టాభిషేకం'

ఈ సన్నివేశాన్ని చిత్రీకరించిన కళాకారుడు మణియన్ సెల్వమ్, చెన్నై. (చెన్నై, శ్రీరామకృష్ణ మఠం సౌజన్యంతో)



| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 365 |

గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో **Ramakrishna Math, Hyderabad** అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : **Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.**

# లోపలి పేజీల్లో...



## శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకి కుడి భాగంలో మీ చందా గడువు నెల పొందుపరచబడి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ చేయబడుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

*- సర్క్యులేషన్ మేనేజర్*

ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకుడు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.

- సంపాదకులు


**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com

సంపాదకీయం

# హరిణిని స్మరించి  హరిని విస్మరిస్తే...!

'ఆత్మసాక్షాత్కారమే జీవిత పరమార్థం'అని ఆధ్యాత్మిక మార్గంలో పయనించే సాధకులకు మార్గం మధ్యలో ఎన్నో ప్రలోభాలూ, ఆకర్షణలూ ఎదురై వారి గమ్యాన్ని మరిచేలా చేస్తాయి, మనసుని మభ్యపెట్టి మార్గం నుంచి మరల్చేలా చేస్తాయి. సకల రాజభోగాలనూ, రాజ్యాధికారాలనూ త్యజించి ఆత్మ సామ్రాజ్యానికి అధిపతి కావాలనుకున్నాడు భరతుడు. కృతనిశ్చయంతో సాధన చేస్తున్న అతనికి ఒక లేడి పిల్లపై కలిగిన రాగం, అనురాగంగా మారి తన లక్ష్యాన్ని మరచిపోయేలా చేసింది. 'ఇహ ప్రేత్య చ నారీణాం పతిరేకో *గతిః సదా'* – ఇహపరములందు సతికి పతియే దైవమనీ, ఉత్తమగతి అనీ శ్రీరామునికి సతీధర్మాన్ని తెలియజేసిన సీతాదేవి ఒక లేడిని పొందాలనే వాంఛ వల్ల పరమాత్ముని సన్నిధిని కోల్పోయింది.

సాధకులు తమ లక్ష్యసిద్ధిని సాధించడంలో సదా అప్రమత్తులై మెలగాలి అనడానికి పైరెండు ఉదాహరణలే చాలు. సాధకుల్ని పతనం చేయడానికి ప్రలోభాలు శత్రువుల రూపంలో కాకుండా మిత్రుల రూపంలోనే వస్తాయి. భరతునిలోని దయాగుణం లేడి పిల్లపై వ్యామోహాన్ని పెంచి, లక్ష్యాన్ని మరిచేలా చేసింది. అలాగే సీతమ్మలోని దానగుణం సాధురూపంలో వచ్చిన రావణాసురుడికి భిక్ష ఇచ్చి, రామునికి దూరమయ్యేలా చేసింది.

సీతాదేవి జీవితాన్ని మన సాధన జీవితంతో అన్వయించుకొని అప్రమత్తులమై ఎలా వర్తించాలో తెలుసుకుందాం.

**పసిడి లేడిని కోరి పరంధాముణ్ణి కోల్పోయిన సీతమ్మ:**

'యది గచ్ఛసి మాం త్యక్త్వా ప్రాణాంస్త్య క్ష్యామి తేఽగ్రతః'–శ్రీరాముని సహచర్యం లేకపోతే ప్రాణత్యాగం చేస్తాననీ, ఆయన లేని అయోధ్య అరణ్యంతో సమానమనీ, పతిదేవుని చెంతలేని స్వర్గసీమైనా నరకతుల్యమేననీ, దండకారణ్యంలో ఎలాంటి దుర్భర బాధలనైనా భరిస్తాననీ, పతి సన్నిధే పరమ పెన్నిధి అని భావించి రామునితో అరణ్యవాసానికి పయనమైంది సీతమ్మ. పంచవటిలోని పర్ణశాల యందు పతి సాన్నిధ్యంలో ఆనందంగా జీవితాన్ని సాగిస్తున్న సీతమ్మ కళ్ళలో ప్రకాశమానమైన పసిడిలేడి పడింది. ఆ లేడిని పట్టితెమ్మని పంపి నిత్యప్రకాశుడైన పరంధాముణ్ణి దూరం చేసుకుంది. **'తమేవ భాంతమనుభాతి సర్వం తస్యభాసా సర్వమిదం విభాతి'** ఎవరి సన్నిధిలో సకల చరాచర సృష్టంతా ప్రకాశిస్తుందో అలాంటి పరమాత్ముణ్ణి ప్రక్కనే పెట్టుకుని అశాశ్వతమైన ఒక అల్పజీవి తళుకుబెళుకులకు ఆకర్షితురాలైంది సీతమ్మ.

మన ఆధ్యాత్మిక జీవితం కూడా ఒక దండకారణ్యవాసం లాంటిదే. సదా అప్రమత్తంగా లేకపోతే విషయాకర్షణలనే క్రూరమృగాల కోరల్లో చిక్కుకోవడం ఖాయం. 'అతడే మన దిక్కు, అతడే మన గమ్యం' అని ఆధ్యాత్మిక జీవితాన్ని



ప్రారంభిస్తాం. సాధనలో తీవ్రత సన్నగిల్లినప్పుడు మనస్సు నిత్యసత్యుడైన భగవంతుణ్ణి వదలి అనిత్యమూ, అసుఖమైన విషయ వస్తువులవైపు పరుగులు తీస్తుంది. **'ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే సంగాత్సంజాయతే కామః'** విషయ వస్తువుల మధ్య ఉంటే మనసు వాటి ధ్యాసలో పడుతుంది. దానివల్ల వాటిపై రాగం కలుగుతుంది. ఆ రాగం వల్లనే వాటిని పొందాలనే కోరిక బలపడుతుంది. ఆ కోరికను నెరవేర్చుకోవడానికి మనసు ఎన్నో పన్నాగాలు పన్నుతుంది. వాటిని పొందాలనే ఆరాటంలో భగవంతుని

ఆరాధనను విస్మరిస్తుంది. కాబట్టి సాధకుడు విషయ వస్తువులకు దూరంగా ఉండాలి. అలాకాక విషయ వస్తువుల్ని కోరి విశ్వేశ్వరుణ్ణి వదిలితే, పసిడి లేడి కోసం పరంధాముణ్ణి కోల్పోయిన సీతమ్మలా మనం కూడా కష్టాలను అనుభవించాల్సి వస్తుంది.

**కోరికల కొలనులో మునిగిన మనసు :** భగవంతుడు మనల్ని సాధనామార్గం నుండి పతనం కాకుండా అప్రమత్తుల్ని చేస్తూ ఉంటాడు. కానీ కోరికల కొలనులో మునిగిన మనస్సు భగవంతుని హెచ్చరికల్ని పట్టించుకోదు.

సీతమ్మ కోరిక మేరకు లేడిని తీసుకురావడానికి వెళ్ళినప్పుడు, సీతమ్మ రక్షణ బాధ్యతను లక్ష్మణునికి అప్పగించాడు శ్రీరాముడు. కానీ రామునికి ఆపద వాటిల్లిందని అనుకొని లక్ష్మణుణ్ణి రాముని వద్దకు వెళ్ళమని ఆజ్ఞాపించింది సీతమ్మ. లక్ష్మణుడు 'నేను వెళ్ళిపోతే మీకు ఆపద సంభవించవచ్చు'అని ఎంత విశదపరిచినా సీతమ్మ వినలేదు. పైగా కోపోద్రిక్తురాలై లక్ష్మణుణ్ణి దుర్భాషలాడింది.

మనం కూడా సాధనా పథం నుంచి పతనమయ్యే పరిస్థితుల్లో ఉన్నప్పుడు భగవంతుడు మనల్ని రక్షించడానికి ఎవరో ఒకరి ద్వారా హెచ్చరికలు చేస్తూ మన తప్పులను సరిదిద్దడానికి ప్రయత్నిస్తాడు. కానీ కోరికలతో నిండిన మనసు ఇతరుల హితవచనాల్ని స్వీకరించదు. కాబట్టి మన శ్రేయస్సుని కాంక్షించిన వారిపైన కోపాన్ని ప్రదర్శించకుండా వారి సూచనలను స్వీకరించడం శ్రేయస్కరం.

**రాముడులేని ప్రదేశం కాముని నివాసం :** రాముని సన్నిధిలో సీతమ్మ ఉన్నంత వరకూ కాముడైన రావణాసురుడు దరిచేరలేదు. ఎప్పుడైతే పంచవటికి దశరథరాముడు దూరమయ్యాడో వెంటనే దశముఖ రావణుడు ప్రవేశించాడు.

భగవంతుడు మనతో ఉన్నంత వరకూ ఈ మాయా మోహిత ప్రపంచం మనకు ఎలాంటి హానీ తలపెట్టలేదు. జాలరి పాదాల చుట్టూ తిరుగుతున్న చేపలు, ఆయన వేసిన వలలో ఎలా చిక్కవో, అలాగే భగవంతుని పాదాలను ఆశ్రయించిన భక్తులు మాయా వలయంలో చిక్కుకోరు. కాబట్టి సదా మనం దేవుని సన్నిధిలో ఉండడానికి ప్రయత్నిస్తే దానవుడు దరిచేరడు.

**పరితాపమే పరమాత్ముని దరికి చేర్చే వారధి :** శ్రీరామునికి దూరమైన సీతమ్మ రావణాసురుని స్వాధీనమైంది. అశోకవనంలో ఆమె జీవితం శోకమయంగా మారింది. మనం ఎప్పుడైతే భగవంతుణ్ణి విస్మరిస్తామో అప్పుడు కామాసురుడి కబంధహస్తాలలో బందీ అవుతాం. ఒక అల్పమృగాన్ని ఆశించడం వల్ల ఆనందస్వరూపుడైన రాముణ్ణి

ఏప్రిల్ 3న శ్రీరామనవమి



కోల్పోయింది సీతమ్మ. అప్పుడు అశోకవనంలోని శింశుపావృక్షం క్రింద కూర్చొని పశ్చాత్తాప హృదయంతో విలపించింది. శోక సముద్రంలో మునిగి ఉన్న సీతమ్మ స్థితిని (అధ్యాత్మ రామాయణములో) ఆంజనేయస్వామి ఇలా వివరించాడు:

**ఏకవేణీం కృశాం దీనాం మలినాంబరధారిణీమ్**
**భూమౌ శయానాం శోచంతీం రామరామేతి భాషిణీమ్**

"జడలు కట్టిన కేశాలతో ఏకవేణియై, కృశించిపోయి, మలినాంబరధారియై, కటిక నేలపై కూర్చొని శోకిస్తూ 'రామా! రామా!' అని స్మరిస్తూంది సీతమ్మతల్లి".

సీతమ్మ హృదయమంతా రామ చింతనతో నిండిపోయింది. ఒకప్పుడు పసిడిలేడిని చూచి మోహితురాలైన ఆమె ఇప్పుడు రావణాసురుడు వచ్చి "సీతా!నీకు కావలసిన సంపదలన్నీ ఇస్తాను, నువ్వు కోరితే సమస్త ప్రపంచాన్నే నీముందు ఉంచుతాను"అని ఆశ చూపించినా ప్రలోభపడలేదు.

భగవంతుణ్ణి తప్ప అన్యమైనదేదీ ఆశించనప్పుడు బాహ్య ఆకర్షణలు మనల్ని మభ్య పెట్టలేవు. If God were always the only object of our desire; we would not so easily be disturbed by the temptations of the world. పరుల నిధుల కంటే పతి సన్నిధియే మిన్న అని సీతమ్మ దృఢ మనస్కురాలై శ్రీరాముని సాన్నిధ్యం కోసం వెయ్యి కళ్ళతో ఎదురు చూసింది. సీతమ్మ ఆవేదనను విన్న శ్రీరామచంద్రుడు ఆమెను వెతుక్కుంటూ వెళ్ళాడు. పశ్చాత్తాపంతో చేసిన ప్రార్థనలు భగవంతుణ్ణి మన దగ్గరకు తీసుకువస్తాయి అనడానికి ఇదే నిదర్శనం.

మనం కూడా సీతమ్మలాగ **హరిణిని స్మరించి హరిని విస్మరిస్తే** దుఃఖాలను అనుభవించాల్సి వస్తుంది. తప్పులను తెలుసుకొన్న సీతమ్మ పశ్చాత్తాప హృదయంతో ఎలా భగవంతుని కోసం పరితపించిందో అలా మనం కూడా తపిస్తే ఆయన సన్నిధి తప్పక లభిస్తుంది. ❖

గోరుముద్ద

# పతనానికి దారి 'పరనింద'

- స్వామి సుప్రియానంద

*కబీరా నిందక్ నా మిలో పాపీ మిలో హజార్ ।*
*ఏక్ నిందక్‌కే మాథేపర్ లాఖ్ పాపిన్‌కో భార్ ॥*

"కబీరా! వెయ్యి మంది పాపాత్ములు తారసపడినా సరే పరవాలేదు కానీ పరులను నిందించేవాడు మాత్రం ఒక్కడు కూడా ఎదురుపడకూడదు. ఎందుకంటే అతని తలమీద లక్షమంది పాపుల యొక్క భారం ఉంటుంది". పరులను నిందించటం మహాపాపమనీ, పరులను నిందించేవారికి ఆమడ దూరంలో ఉండాలనీ ఈ కబీర్ దోహా సూచిస్తుంది. పరులను నిందించటం మనకు ఎట్టి మేలు చేయకపోగా



కీడును కలిగిస్తుంది. మనస్సును భగవంతుడి నుండి మరల్చి కలుషితం చేస్తుంది. కలుషిత మనస్సు ఇతరులలోని తప్పులను మాత్రమే చూస్తుంది. ఇతరుల దోషాలు చర్చించే చోట ఉన్న అందరూ ఆ పాపంలో కొంతపాలు పంచుకోవలసి ఉంటుంది. ప్రత్యక్షంగా ఇతరులను నిందించనప్పటికీ వారిపై ఉన్న నిందారోపణలు వినటం, విని ఆనందించడం కూడా పతనానికి హేతువులు.

పరనింద పతనానికి ఎలా దారి తీస్తుందో శ్రీరామకృష్ణులు చెప్పిన ఈ భావగర్భితమైన కథలో చూద్దాం! "ఒక దేవాలయం సమీపంలో ఒక సన్న్యాసి నివసించేవాడు. ఎదురుగా ఒక వేశ్య ఇల్లు ఉంది. విటులు నిరంతరం ఆమె ఇంటికి వస్తూపోతూండడం చూసి, సన్న్యాసి ఒక రోజు ఆమెను పిలిచి, ఇలా చీవాట్లు పెట్టాడు: "నువ్వు మహాపాపివి. రేయింబవళ్ళూ నువ్వు పాపాన్నే చేస్తున్నావు. నీ కెలాంటి దుర్దశ రాబోతుందో కదా!". పాపం ఆ వేశ్య తను చేసే పనులను తలుచుకొని తన పాపాలను క్షమించమని విశ్వాసంతో భగవంతుణ్ణి ప్రార్థించేది. పశ్చాత్తాప హృదయంతో తన జీవనాన్ని సాగించేది. ఇక సన్న్యాసి మాటకొస్తే ఆయన మనసంతా వేశ్య గురించిన ఆలోచనలే! ఆమెను నిందించడమే ఆయనకు ఒక దినచర్యగా మారింది. కొన్ని గులకరాళ్ళను పోగు చేసుకున్నాడు. ఆ వేశ్య ఇంట విటుడు ప్రవేశించినప్పుడల్లా ఒక గులకరాయిని తీసి గుర్తుగా ఒక చోట వేయసాగాడు. క్రమంగా ఆ రాళ్ళు ఒక పెద్దగుట్టగా తయారయ్యాయి. ఒకరోజు సన్న్యాసి వేశ్యకు ఆ గుట్టను చూపిస్తూ "చూశావా! ఇది నీ పాపాల గుట్ట. నీ కెలాంటి ఘోరదుర్గతి కలుగుతుందో తెలుసా!" అంటూ నిందించాడు. పాపం ఆ నిర్భాగ్యురాలు తన పాపరాశిని చూసి గజగజ వణికిపోతూ తన అశక్తతను గురించి భగవంతుడికి మొరపెట్టుకుంది. ఆమె ప్రార్థన భగవంతుడు ఆలకించాడు. ఆ రోజే వేశ్య మరణించింది. విధివశాన సన్న్యాసీ ఆరోజే దేహత్యాగం చేశాడు. యమదూతలు సన్న్యాసిని నరకానికి తీసుకెళ్తున్నారు. విష్ణుదూతలు వచ్చి ఆవేశ్యను వైకుంఠానికి గొనిపోయారు. అది చూసి సన్న్యాసి నివ్వెరపోయి ఇలా అరిచాడు "ఇదెక్కడి అన్యాయం, ఇదే కాబోలు భగవంతుడి ధర్మసూక్ష్మత?" ఈ మాటలు విని విష్ణుదూతలు ఇలా అన్నారు: "నువ్వు జీవితమంతా నీ హృదయంలో వేశ్య యొక్క పాపకార్యాలను మననం చేయడం, నిందించడంలోనే గడిపావు. తన శరీరం పాపం చేసినా ఆమె అహర్నిశలూ హృదయపూర్వకంగా భగవంతుణ్ణి ప్రార్థించింది. విధాత నిర్ణయమెప్పుడూ న్యాయంగానే ఉంటుంది." ❖

తనకు గల్గు పెక్కు తప్పులు నుండగా
ఓగు నేరములెంచు నొరులగాంచి
చక్కిలంబు గాంచి జంతిక నగినట్లు
విశ్వదాభిరామ వినురవేమ.



'చక్కిలాన్ని చూసి జంతిక నవ్వినట్లుగా దురాత్ముడు తనలోనే అనేక లోపాలు ఉంచుకొని, ఇతరుల తప్పులను లెక్కిస్తాడు'.

# దాస్యభావంలో దివ్యానుభూతులు

-స్వామి జ్ఞానదానంద



దాస్యభావ సాధనను అనుష్ఠిస్తున్న కాలఘట్టంలో శ్రీరామకృష్ణులకు ఒక అపూర్వ దర్శనం కలిగింది. ఆ దివ్య దర్శనం ఆయన మనోఫలకం మీద గాఢంగా ముద్రించుకు పోయింది. ఆ సంఘటనను శ్రీరామకృష్ణులే స్వయంగా ఇలా వర్ణించారు: "ఒక రోజు నేను పంచవటి కింద కూర్చున్నాను. ఎనలేని కరుణ ఉట్టిపడుతున్న ఒక జ్యోతిర్మయమైన స్త్రీమూర్తి రూపం నా ముందు ప్రత్యక్షమైంది. చుట్టూ ఉన్న పరిసరాలు ఆమె తేజస్సుతో దేదీప్యమానంగా ప్రకాశించాయి. నాకు ఆమె స్పష్టంగా కనిపిస్తోంది. అదే సమయంలో పంచవటిలోని చెట్లు, మొక్కలు, గంగానది – సమస్తమూ కనిపిస్తున్నాయి. ఆమెను మానవ స్త్రీగానే భావించాను; ఎందుకంటే దేవతలకు ఉన్నట్లు మూడు కన్నులు గానీ, నాలుగు చేతులు గానీ ఏవీ లేవు. కానీ దేవతా స్త్రీలలో లేని విశిష్టత ఏదో ఆమెలో గోచరించింది. ఆమె వదనారవిందం నుంచి ప్రేమ, దయ, కరుణ, సహనం, విషాదం – ఇవన్నీ ఒక్కుమ్మడిగా వర్షిస్తున్నాయి. ఆ దివ్య స్త్రీ మూర్తి ప్రసన్నంగా చూస్తూ, నా వైపు నెమ్మదిగా అడుగులు వేస్తూ గంభీరంగా వస్తోంది. ఆమె రావడం చూసి పరమాశ్చర్యంలో మునిగిపోయాను. ఎవరీ దివ్యకాంత? అని అనుకుంటున్నంతలో హఠాత్తుగా ఒక కోతి అక్కడికి వచ్చి, ఆమె పాదాల మ్రోల వ్రాలింది. తక్షణమే నా అంతరంగంలో – ఈమె సీత, జీవితంలో చాలా దుఃఖాలు అనుభవించిన జనకుని ముద్దుల రాకుమారి, రాముని కోసమే జీవించిన సీతామాత అని స్ఫురించింది. వెంటనే 'అమ్మా, అమ్మా' అంటూ ఆమె పాదాల మీద పడబోయాను. కానీ మరుక్షణమే ఆమె మెరపుతీగలా వేగంగా వచ్చి దీన్లో (తమ దేహాన్ని చూపుతూ) ప్రవేశించి, లీనమైపోయింది. ఆశ్చర్యానందాలలో మునిగిపోయిన నేను బాహ్యస్మృతి కోల్పోయాను. ధ్యానం, భావపారవశ్యం లేకుండా పూర్తిగా మెలకువలో ఉన్నప్పుడు ప్రప్రథమంగా నాకు కలిగిన దివ్యదర్శనం ఇదే."

గురుదేవులకు సీతాదర్శనం పలుమార్లు కలిగింది. ఆయన జగజ్జననిని ఇలా ప్రార్థించారు: "అమ్మా! నేను సమస్తం మరచిపోయేలా చేసి నన్ను సీతలా మార్చివేయి. దేహం, కాళ్ళూ, చేతులూ, ఇంద్రియాలూ – వీటి స్ఫురణే ఆమెకు లేదు. కేవలం 'రాముడెక్కడ?' అనే చింతన ఒక్కటే!"

స్వామి రామకృష్ణానంద ఇలా వచించారు: "గురుదేవులు సీతాదేవి గురించి మాట్లాడినప్పుడు సాక్షాత్తు సీతమ్మ తల్లియే మాతో మాట్లాడుతున్నట్లుగా ఉండేది."

గురుదేవుల సునిశిత దృష్టి గురించి మాతృదేవి ఇలా వివరించారు: "గురుదేవులు పంచవటిలో సీతాదేవిని దర్శించారు. అప్పుడు ఆమె అత్యద్భుతమైన ఒక గాజును ధరించి ఉంది. ఆయన అచ్చం అలాంటిదే ఒక గాజును నాకు బహూకరించారు."

ఒకసారి స్వామి తురీయానంద, గురుదేవుల గురించి దిగ్భ్రాంతి కలిగించే కథనం ఒకటి స్వామి శారదానందకు చెప్పారు: ఒకరోజు మథుర్ అందమైన నాలుగు గుర్రాలు పూన్చిన బండిలో గురుదేవులను తోడ్కొని జాన్‌బజార్‌కు వస్తున్నాడు. బండి ఛిత్‌పూర్ వీథికి చేరినప్పుడు గురుదేవులకు ఒక అద్భుత దర్శనం కలిగింది. తాను సీతగా మారినట్లూ, రావణుడు తనను ఎత్తుకు పోతున్నట్లూ ఆయనకు అనిపించింది. ఈ భావోద్వేగంలో ఆయన సమాధి మగ్నులయ్యారు. అదే సమయంలో కళ్ళాలు సడలిపోగా, గుర్రాలు తడబడి కిందపడ్డాయి. ఆ దుర్ఘటనకు కారణమేమిటో మథుర్‌కు అర్థం కాలేదు. శ్రీరామకృష్ణులకు బాహ్యచైతన్యం కలగగానే మథుర్ ఈ దుర్ఘటన గురించి ఆయనకు తెలిపాడు. తాను భావపారవశ్యంలో ఉన్నప్పుడు రావణుడు తనను ఎత్తుకుపోతున్నట్లూ, జటాయువు రావణుని రథాన్ని ధ్వంసం చేయడానికి ప్రయత్నించినట్లూ తాను అనుభూతి చెందినట్లు అప్పుడు శ్రీరామకృష్ణులు చెప్పారు.

మనమంతా గురుదేవుల దాస్యభావంలోని ఈ దివ్యానుభూతులను నిరంతరం స్మరించి తరిద్దాం! ❖

# అనుగ్రహించిన ఆదిపరాశక్తి

- శ్రీమతి గరిమెళ్ళ లక్ష్మి

భూలోకంలో సనాతన ధర్మం నశించిపోయింది. ప్రజలు యజ్ఞయాగాదులు చెయ్యడం, దేవతారాధన అనేవి పూర్తిగా మానేశారు. దేవతలందరూ ఈశ్వరుని దగ్గరకు వెళ్ళి ఆయన దగ్గర మొరపెట్టుకొన్నారు. అప్పుడాయన "నేను స్వయంగా భూమి మీద అవతరించి, యజ్ఞాలు మొదలైనవి చేయించి సనాతన సాంప్రదాయం నిలబడేలా చేస్తాను" అన్నారు.

ఆది శంకరుల వారు శ్రీనందన నామ సంవత్సరంలో పూర్ణానది ఒడ్డున కాలడి అనే గ్రామంలో శివగురువు ఆర్యాంబ దంపతుల ఇంట వైశాఖ శుద్ధ పంచమి నాడు జన్మించారు. అది ఒక దివ్యమైన రోజు.

ఒకరోజు తండ్రిగారు బాలుడితో "నాయనా! నేను రేపు ఉదయం ఒక పని మీద బయటకు వెళ్ళాలి. నువ్వు వేకువతోనే లేచి రోజూ నేను చేస్తున్నట్లుగా అమ్మవారి పూజ చెయ్యాలి. నేను సాయంకాలానికి తిరిగి వస్తాను" అన్నారు.



తండ్రి చెప్పిన ప్రకారం శంకరుడు ఉదయాన్నే లేచి స్నానం చేసి అమ్మవారి పూజకు ఉపక్రమించాడు. పూజ అయిన తరువాత అమ్మవారికి పాలు నివేదన చేసి జగదంబ రాక కోసం ఎదురుచూడసాగాడు. అయినా అమ్మవారు రాలేదు. చాలాసేపు నిరీక్షించి, "అమ్మా! వచ్చి పాలు తాగు" అన్నాడు గట్టిగా. అలా ఎన్ని మార్లు ఎంత గట్టిగా పిలిచినా అమ్మ పలకలేదు. ఎంత పిలిచినా అమ్మవారు రాకపోయేసరికి "అమ్మా! నువ్వు పాలు స్వీకరించలేదంటే మా నాన్నగారు నేను పూజ సక్రమంగా చెయ్యలేదని కోపగిస్తారు" అంటూ బాలుడు పీటకు తల బాదుకోవడం ప్రారంభించాడు; అప్పుడు అమ్మవారి పీఠం (కైలాసంలో) కదలసాగింది.

అమ్మ వారు ప్రత్యక్షమై పాలన్నీ తాగేసి, ఖాళీ చెంబు బాలుడికి ఇచ్చింది. "అమ్మా! నాకేవీ పాలు? మా నాన్నగారు రోజూ నువ్వు తాగాక, ఆ పాలు నా కిచ్చేవారు" అని ఏడుస్తూ అన్నాడు. వెంటనే జగన్మాత బాలునితో "ఊరుకో, ఏడవకు! నీకు చెంబు నిండా పాలు ఇస్తాలే" అని చెంబును స్తన్యంతో నింపి బాలుడికి ఇచ్చింది. ఆ పాలు తాగగానే బాలుడు దివ్య పారవశ్య స్థితికి చేరుకుని అనర్గళంగా అమ్మ వారిని స్తుతిస్తూ కీర్తించసాగాడు. జగన్మాత బాలుణ్ణి దీవించి అదృశ్యమైంది.

ఒకమారు శంకరుల వారు మానస సరోవర పరిక్రమణ చేసి, తరువాత సూక్ష్మశరీరంతో కైలాసంలో ఉన్న పార్వతీ పరమేశ్వరులను దర్శించారు. శంకరులను చూడగానే ఆదిపరాశక్తి అయిన పార్వతి ఆనందంతో వారిని తన ఒడిలోకి తీసుకుని వారి శరీరమంతా నిమిరింది. ఆది శంకరులు పసిబాలుడిలా అమ్మ పాదాల నుండి శిరస్సున ఉన్న కిరీటం వరకూ తడిమారు.

తరువాత మానవళి అంతా పారాయణ చేసి తరించడానికి వీలుగా పరమేశ్వరుని అనుగ్రహంతో సౌందర్యలహరిని తాళపత్రాల మీద శ్లోకరూపంలో వ్రాశారు.

పార్వతీ పరమేశ్వరుల అనుమతితో బయటకు రాగానే తన అనుమతి తీసుకోకుండా కైలాసానికి వెళ్ళినందుకు ఆది శంకరుల వార్ని కొమ్ములతో పొడిచింది నంది. వెంటనే ఆది శంకరుల వారు నందికి నమస్కరించి "నందీశ్వర నమస్తుభ్యం, శాంతానంద ప్రదాయకం..."అంటూ స్తోత్రించారు. "అయినా అమ్మవారి సౌందర్యాన్ని భూలోక వానులకు తెలియ జెయ్యకూడదు" అంటూ కాళ్ళతో తన్నగా, తాళపత్రాలు కిందపడిపోయాయి. కిందపడిన శంకరులు లేస్తూ, కైలాసంలో పరమేశ్వరుడు ఇచ్చిన పంచలింగాలను జాగ్రత్తగా పట్టుకుని, కింద పడిన తాళపత్రాలను ఏరుతూ "అమ్మా" అని అరిచారు. అది విన్న పార్వతి వచ్చి వినాయకుడు, స్కందుడు లాగే ఈ శంకరుడు కూడా తన బిడ్డడే అని, శంకరుల బాల్యంలో జరిగిన సంఘటనను నందికి వివరించింది.

ఆదిశంకరుల వారు సూక్ష్మ దేహంలో కైలాసానికి వెళ్ళినప్పుడు పరమేశ్వరుడు తనకు ఇచ్చిన పంచలింగాలను ఐదు ప్రదేశాలలో ప్రతిష్ఠించారు–అవి: 1. బదరికాశ్రమంలో–ముక్తి లింగం 2. నీలకంఠ క్షేత్రంలో (నేపాల్) – వరలింగం 3. చిదంబర క్షేత్రంలో–మోక్షలింగం 4. శృంగగిరిలో–భోగలింగం 5. కాంచీపురంలో–యోగలింగం. ❖

**ఏప్రిల్ 29న ఆదిశంకరాచార్య జయంతి**



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -22

(...గత సంచిక తరువాయి)

## యాచకుని సేవలు యాదృచ్ఛికం !

సుగ్రీవుని రాజ్యమైన కిష్కింధను దర్శించాలని ఒకమారు స్వామి జపానంద వెళ్ళారు. అక్కడే శ్రీరామలక్ష్మణులు కొంత కాలం నివాసమున్నారు. అక్కడ నుంచే హనుమంతుడు సీతమ్మను వెతకడానికి వెళ్ళాడు. అక్కడ నుంచే వానరసేనను తీసుకుని శ్రీరాముడు రావణుడి మీద దండయాత్రకు బయల్దేరాడు. స్వామి అవన్నీ మననం చేసుకుంటూ పర్వతాల మధ్యలో ఉన్న ఆ అందమైన ప్రాంతానికి చేరుకున్నారు. అక్కడ ఉన్న పాత దేవాలయాన్ని చూడగానే రామాయణంలో కిష్కింధ కాండ అంతా ఒక చలనచిత్రంలా కళ్ళ ముందు కదలాడింది. రాత్రి కిష్కింధలో గడిపి ఉదయమే మాతంగ పర్వత దర్శనం చేసుకోడానికి వెళ్ళారు. అక్కడ అప్పుడే ఎవరో కొబ్బరికాయ కొట్టి వెళ్ళారు. ఆకలి వేస్తోంది. అనుకోకుండా కొబ్బరికాయ ప్రసాదం దొరకడంతో అది తీసుకుని తిన్నారు. అక్కడకు దగ్గరలోనే చక్ర తీర్థం ఉంది. అడవి మార్గంలో నుంచి మధ్యాహ్నానికి చక్రతీర్థం చేరుకున్నారు. అక్కడ నది కొండ చుట్టూ చక్రాకారంలో ప్రవహిస్తుంది. ఆ ప్రాంతం ఒకప్పటి విజయనగర సామ్రాజ్య రాజధాని అయిన హంపి. అక్కడ శ్రీ హంపీశ్వర మహాదేవుని విశాలమైన ఆలయం ఉంది. అది శైవుల ప్రసిద్ధ తీర్థ స్థలం. స్వామి జపానంద అక్కడ నదిలో స్నానం చేశాక తీరంలో ఒక బండ మీద కూర్చుని ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తున్నారు. ఒక వృద్ధురాలు వచ్చి, ఒక కొబ్బరికాయ ఇచ్చి కన్నడ భాషలో ఏదో చెప్పింది. సన్న్యాసికి ఏమీ అర్థం కాలేదు.ఆమె సన్న్యాసికి నమస్కారం చేసి వెళ్ళిపోయింది. ఆ పూట కొబ్బరికాయ తిని కడుపు నింపుకొన్నారు. కొబ్బరి తినడంతో కడుపు నొప్పి వచ్చి, తరువాత జిగట విరేచనాలు మొదలయ్యాయి. ఇక చక్రతీర్థంలో ఉందామన్న ఆలోచన మానుకుని, హోస్పేట వేపు నడక సాగించారు. రాత్రికి హోస్పేట చేరుకున్నారు. విరేచనాల వల్ల విపరీతంగా నీరసం వచ్చి, అక్కడే ఉన్న లింగాయతుల సత్రంలో నిద్ర పోయారు. రాత్రంతా విరేచనాలు అవడంతో చాలా నీరసంగా ఉన్నారు. పొద్దుటికి రక్త విరేచనాలు కూడా మొదలయ్యాయి. లేస్తే కళ్ళు తిరుగుతున్నాయి. దాంతో, రోజంతా అలా పడుకునే గడిపారు.

సాయంకాలానికి ఒక యాచకుడు సారంగీ వాయించుకుంటూ అక్కడకు వచ్చాడు. స్వామి జపానందను చూసి ఆనందంగా రాత్రంతా ఆయనతో సత్సంగం చేయవచ్చనుకున్నాడు. కానీ రాత్రంతా సన్న్యాసి అలా బయలుకు వెళుతూ ఉండడం చూసి చింతిస్తూ, "ఈ అనారోగ్యం ఎప్పటి నుంచి ఉంది? మీరు ఇక్కడకి ఎప్పుడు వచ్చారు? మందు



తీసుకున్నారా? ఏమైనా తిన్నారా?" అంటూ ప్రశ్నలు వేశాడు. "రేపు ఉదయం నేను అన్నం వండి పెడతాను, తగ్గిపోతుంది" అన్నాడు.

ఉదయాన్నే ఆ యాచకుడు అన్నం వండి, ఎండు మిరపకాయలు నెయ్యి వేసి రసం చేసి, భోజనం వడ్డించాడు. ఆ మిరపకాయల రసం చూసి ఇదే ఆఖరి భోజనం ఈ జీవితానికి అనుకుని భగవంతుడికి నమస్కారం చేసి చారు అన్నం తిన్నారు. యాచకుడు కూడా కొంత అన్నం తిని భిక్షకు వెళ్ళిపోయాడు. మొదట కొంచెం బాధ ఉన్నా సాయంత్రం అయ్యేసరికి విరేచనాలు తగ్గి వంట్లో కాస్త శక్తి వచ్చింది. స్వామి పరిస్థితి చెప్పి యాచకుడు ఒక ఇంటి నుంచి నెయ్యి, పెరుగు అడిగి తీసుకొచ్చాడు. రాత్రి మళ్ళీ అన్నం వండి, రసం చేసి, పెరుగు వేసి భోజనం పెట్టాడు. మర్నాటికి పూర్తిగా స్వస్థత వచ్చింది. ఆ రోజు కూడా యాచకుడు సన్న్యాసికి పెరుగు అన్నం పెట్టి భిక్షకు వెళ్ళిపోయాడు. రోజంతా స్వామి విశ్రాంతి తీసుకున్నారు. సాయంత్రం యాచకుడు ఒక భక్తుణ్ణి తీసుకుని వచ్చాడు. అతను సన్న్యాసికి బళ్ళారికి రైలు టికెట్టు కొని ఇచ్చి, బళ్ళారి వెళ్ళమని చెప్పాడు. యాచకుడు, సన్న్యాసిని స్టేషన్ దగ్గర దిగబెట్టి రైలు వచ్చేవరకూ ఉండి సెలవు తీసుకున్నాడు. యాచకుడి సేవకు సన్న్యాసి కృతజ్ఞత తెలుపుకొన్నారు. ❖

(మిగతా వచ్చే సంచికలో...)

అనువాదం : శ్రీమతి జి.ఎస్. లక్ష్మి

# దేవీ వైభవం

ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

**(...గత సంచిక తరువాయి)**

భగవంతుని రూపాలు మన లాంటివి కావు. అవి "సర్వేనిత్యాః శాశ్వతాశ్చ దేహాస్తస్య పరాత్పరః హానోపాధాన రహితాః నైవ ప్రకృతి జా క్వచిత్" – అని పురాణాలు చెబుతున్నాయి. అవి శాశ్వతములు, నిత్యములైనటువంటివి, ఏ కారణం చేత అంటే – నైవ ప్రకృతి జాః = అవి ప్రకృతిజములు కావు. జ్ఞానమాత్రాశ్చ కేవలాః= అవి జ్ఞానంతో కూడినటువంటివి. అవి చిదానందమయమైన విగ్రహములు. ఇది స్థూలంగా మనం ధ్యానించగానే మనకు స్ఫురించిన స్వరూపం. అరుణాం కరుణా తరంగితాక్షీం ధృత పాశాంకుశ... అనగానే సామాన్యులకు కూడా స్ఫురించే స్వరూపం అది; ఇది స్థూల రూపం. ఆ తరువాత చెప్పబడేది సూక్ష్మరూపం, అది మంత్ర స్వరూపం.



అమ్మ యొక్క పంచదశి మంత్రమే మనం చూస్తున్న ఆ స్వరూపంలో ఉంది. ఆ స్వరూపంలో శిరస్సు నుండి కంఠం వరకూ వాగ్భవకూటం, కంఠం నుండి కటి వరకూ కామరాజకూటం, ఆ తరువాత శక్తికూటం–ఇది అమ్మ యొక్క మంత్ర స్వరూపం. అటు తరువాత సూక్ష్మతరమైన కుండలినీ స్వరూపం. ఆ తరువాత పరమార్థమైన తత్త్వ స్వరూపం. ఈ పరమార్థ తత్త్వ స్వరూపమే నిః శబ్దాలుగా చెప్పబడుతుంది. ఒక్కసారి అమ్మను తలచుకోగానే ఈ నాలుగూ స్ఫురించాలి మనకి. అప్పుడే మనం పూర్ణంగా అమ్మను అర్థం చేసుకున్న వాళ్ళమవుతాం. ఈ నాలుగు విధాలైన సౌందర్యలహరుల్ని ప్రవహింపచేసినదే లలితా సహస్రం. దాన్ని సంభావన చేస్తూ సౌందర్య లహరి శ్లోకాలు మనకు అందచేశారు.

త్రిపురసుందరి అనే నామానికి అనేక అర్థాలున్నాయి. త్రిపురముల యందు వ్యాపించిన సుందరి అని ఒక అర్థం. త్రయమయమైన ఈ జగత్తు అంతటికీ పూరణమై ఉన్న సుందరి. అని మరొక అర్థం. త్రిపురసుందరి అంటే త్రిపురుని సుందరి – ఇది మంత్ర శాస్త్రం ప్రకారం చెబుతున్న అర్థం. త్రిపురుడు అంటే శివుడు. శివుడు అనగానే ముగ్గురిలో ఒకడు కాదు, ముగ్గురూ ఒక్కడైన వాడు. మనం ఉపాసన చేసే శివుడు కానీ, శక్తి కానీ ముగ్గురిలో ఒక్కరు కాదు, ముగ్గురూ ఒక్కరైన వారు. అందుకు త్రిపురుడు అంటే బ్రహ్మ, విష్ణు, రుద్రాత్మకుడైన పరమశివుడు అని అర్థం. ఆయన యొక్క సుందరి కనుక త్రిపురసుందరి. మరొక అంతరార్థంలో అమ్మవారు శ్రీచక్ర స్వరూపిణి, శ్రీవిద్యకి అధిష్ఠాన దేవత. శ్రీచక్రం మొత్తం మూడు మండలాలతో భాసిస్తూ ఉంటుంది. శంకర భగవత్పాదుల వారు "ఏడాంక అనల భాను మండల రసత్ శ్రీ చక్ర మధ్య స్థితాం" అన్నారు. ఇదే సౌందర్యలహరిలో "తపన శశి వైశ్వానరమయీం తటిల్లేఖా తన్వీం..." అన్నారు. తపన = సూర్యుడు, శశి= చంద్రుడు, వైశ్వానర=అగ్ని–ఈ మూడు మండలాలూ శ్రీచక్రంలో ఉంటాయట. ఈ మూడు మండలాల యందూ ఎవరు వ్యాపించి ఉన్నారో ఆ చైతన్యమే అమ్మవారు అన్నారు. శ్రీచక్రంలో వ్యాపించిన చైతన్యం, మూడు మండలాల యందు వ్యాపించిన చైతన్యం – రెండూ ఒకటే అని తెలుస్తోంది. మూడు మండలాలలో వ్యాపించిన చైతన్యం పరమాత్మ చైతన్యం. దీనికి సమాధానం భగవద్గీతలో దొరుకుతుంది. గీతలో కృష్ణపరమాత్మ తానేమిటో తన తేజస్సేమిటో చక్కగా చెప్పాడు. కృష్ణ పరమాత్మ ఎవరో

అమ్మ కూడా అదే, అయ్యది కూడా అదే తత్త్వం – పరమాత్మ తత్త్వం. అక్కడ చెప్పినదే ఇక్కడ అన్వయించుకుంటే స్పష్టమవుతుంది.

యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽ ఖిలం।
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్ ॥ (గీత 15:12)

"ఏ తేజస్సు సూర్యుని యందు, చంద్రుని యందు, అగ్ని యందు భాసిస్తూ ఉన్నదో ఆ తేజస్సు నాది" అన్నాడు శ్రీకృష్ణుడు. ఈ మూడు రకాలైన తేజస్సులే మన ప్రపంచానికి అవసరమైనవి. సూర్య చంద్ర అగ్నులు తప్ప మరొక తేజస్సు లేదు. సూర్యుని నుండి వచ్చే ఆ ప్రాణశక్తి అంతా ఆ కిరణాల యందు ఉంది. ఆయనలో ఉన్న ఆర్ద్రత అనే రసత్వశక్తి చంద్రుని ద్వారా మనకు లభిస్తుంది. సూర్యుని యందున్న ప్రకాశ లక్షణం ఉష్ణతా లక్షణం అగ్ని ద్వారా మనకు లభ్యమవుతుంది. అందుకు సూర్యుడు, అగ్ని, చంద్రము అనే మూడింటికి మూలం నేను అని అన్నారాయన. ఆ నేను అనే పరతత్త్వం ఇక్కడ అమ్మగా మనకు చెప్పబడుతున్నది. అందుకు భగవత్ గీత ప్రతిపాదించిన పరమతత్త్వమే శ్రీచక్రము నందు కూడా... "ఏడాంకానల భానుమండల రసత్ శ్రీచక్ర మధ్య స్థితాం" అని చెప్పబడింది. అలాగే మన శరీరంలో ఉన్న ఈ మూడు రకాల తేజస్సులే మనలో ముఖ్యమైన మూడు నాడులకు అధిష్ఠానాలుగా ఉన్నవి. అవే ఇడా, పింగళ, సుషుమ్నా నాడులు. అందుకు మనలో ఉన్న ముఖ్య నాడీ త్రయానికీ జగత్తులో ఉన్న తేజస్త్రయానికీ ఏది మూల చైతన్యమో ఆ మూల చైతన్యమైన ఆత్మ చైతన్యమే అమ్మ అని ఇక్కడ స్పష్టమవుతోంది. త్రిపురసుందరి అంటే ఇలా కూడా మనం అర్థం చెప్పుకోవచ్చు. ఇలా శ్రీచక్రానికీ, విశ్వకారణమైన తేజశ్చక్రానికీ సమన్వయం లభిస్తుంది.

అమ్మ గురించి చెప్పేటప్పుడు వశిన్యాది వాగ్దేవతలు అనేక చోట్ల అమ్మకూ, అయ్యకూ ఉన్న సామరస్యాన్ని చెబుతూ వచ్చారు. అమ్మ వారికి అలా చెబితేనే ఇష్టమట. శివునితో కలిపి చెబితేనే అమ్మకు ఇష్టం, శివుణ్ణి వదిలి అమ్మ గురించి చెబితే అమ్మ వినదట. ఎందుకంటే – "సదాశివ పతివ్రతా సదాశివ కుటుంబినీ" అన్నారు. పాతివ్రత్య ధర్మము, ఏకపత్నీ వ్రతము అనేది వారిద్దరి దగ్గరే చెల్లింది. శివపార్వతులు అన్యోన్య దంపతులు, వారు ఉభయులూ జగతికి తల్లితండ్రులై బోధించిన పరమ ధర్మం అది. సృష్టి అంతా ఆ ధర్మాన్ని అనుసరిస్తేనే తరిస్తున్నది. ఇక్కడ అనేక చోట్ల ఆ స్వారస్యం వశిన్యాది వాగ్దేవతలు మనకు చూపిస్తుంటారు. "కామేశ బద్ధమాంగల్య సూత్ర శోభిత కంధరా" అనీ, "సదాశివ పతివ్రతా" అనీ, "కామేశ జ్ఞాత సౌభాగ్య మార్దవోరుద్వయాన్వితా" ... ఇవన్నీ కూడా అమ్మవారి పాతివ్రత్య వైభవాన్నీ, శివశక్తుల అన్యోన్యతనీ తెలియజేస్తున్న నామాలు. శివప్రియా, శివపరా, శిష్టేష్టా, శిష్టపూజితా... ఇలా అడుగడుగునా అమ్మకీ అయ్యకీ ఉన్న అన్యోన్య అనుబంధాన్ని ప్రస్తావిస్తుంటారు.



శంకర భగవత్ పాదుల వారు కూడా చమత్కారంగా సౌందర్యలహరిని "శివశ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుమ్..." అని ప్రారంభించారు. కావ్యం ఎప్పుడైనా మంగళ శబ్దంతో ప్రారంభమవాలి. శివ అంటేనే మంగళం; అందుకే 'శివః' అనే శబ్దంతో ప్రారంభించారు. అమ్మ వారికి స్తోత్రం చెయ్యాలని ఆయన సిద్ధపడ్డారు. అయితే అమ్మవారికి స్తోత్రం చేస్తే అమ్మ అంత ఏకాగ్రంగా వినరట. ముందు అమ్మవారి దృష్టిని తనవైపు తిప్పుకోవడానికి 'శివః' అన్నారట. అనగానే ఆవిడ వెంటనే తిరిగిందట; అప్పుడు స్తోత్రమంతా చేశారు. "శివః" అంటే ఆవిడ వెంటనే వింటుందట. శివుడంటే అంత ఇష్టం. ❖ సశేషం



# భ్రమలు విడనాడండి!

సర్వజీవులలోనూ వాస్తవ తత్త్వమైన చైతన్యం సర్వదా ఒక్కటిగానే ఉంది; ఏ క్షణంలోనూ అనేకత్వానికి తావే లేదు. కానీ కేవలం భిన్న భిన్న ఉపాధులతో భిన్న భిన్న విధాలుగా తనను తాను సందర్శించుకుంటోంది ఆ చైతన్యం. "ఇతడు తండ్రి, ఇతడు కుమారుడు, ఇతడు మిత్రుడు, వీరంతా తదితరులు"... ఇత్యాది వ్యవహారమంతా కేవలం ఉపాధికి సంబంధించినదే. స్వయంకృతమైన మనఃకల్పితమే! బంగారం సర్వదా ఒక్కటే అయినా, "ఉంగరం – గాజులు– కంకణం" లాంటి ఆకృతులలో భిన్నమైనట్లు కనపడుతోంది కదా! చైతన్యం సర్వదా ఒక్కటే! అది అద్వితీయం! అయినప్పటికీ వేరు వేరు స్థావర జంగమ శరీరాలను ధరించి, భిన్నము, ఖండము అయినట్లు ఒకానొక విచిత్రమైన భ్రమానుభవం తనకు తానుగా కల్పించుకుంటోంది. ఈ శరీరాలకు ఉపాదానకారణం పంచభూతాలు కదా! పంచభూతాల ఉత్పన్నము, రకరకాలైన సమ్మేళనాలు, నానాత్వపు అనుభవం, జ్ఞాన అజ్ఞానాలు, ఇవన్నీ నీటిలోని తరంగాల లాగ ఏర్పడుతున్నాయి. "కెరటము – నిశ్చలంగా ఉండే నీరు" లాగ చింత నిశ్చింతలు అనిత్య సత్య చిద్వస్తువులో స్వప్న సదృశంగా ఏర్పడుతున్నాయి. "శుద్ధ – నిత్య– అనంత" స్వభావం కలిగి ఉన్న ఆ చిద్వస్తువు, "నేను జన్మిస్తున్నాను, మరణిస్తున్నాను" లాంటి భ్రాంతులన్నీ పొందుతోంది. స్వప్నంలో "కాలుజారి పడడం' మిథ్యే అయినా ఆ స్వప్న సమయంలో సత్యంలాగే తోస్తోంది కదా! "నేను – నాది" మొదలైన భ్రాంతులతో కూడిన ఈ చిత్తము..... మిథ్య అయిన ఈ జనన మరణాలను అనుభవిస్తోంది.

ఓ రామచంద్రా! ఇలా జగత్తుగా కనపడేదంతా 'మనోవికారం' మాత్రమే సుమా! ఉల్లాసంతో కూడిన మనోతరంగాలు మననరూపం ధరించి, ఆత్మ కన్నా వేరుగా ప్రవర్తించడమే ఈ సంసార చమత్కారం. అయితే, మనస్సు ఒకానొకప్పుడు ఉద్బోధింపబడినదై, ''స్వసత్త''లో లయించిపోతోంది. అంటే అది స్వరూప స్వభావాల దృష్ట్యా 'ఆత్మే' అవుతోంది.

''చిత్'' అనే నీటితో కూడిన ''బ్రహ్మసాగరం''లో కనబడుతున్న అనేక జీవులు సుడుల లాంటివారు. ఈ దృశ్యంలో పాల్గొంటున్న చిత్తం దానిలోని కెరటం లాంటిది. ఇక్కడ చమత్కారమేమిటంటే... "పరిశీలించి చూడడం జరిగితే, ఏదైతే స్వతహాగా గానీ, లేదా ఉత్తమమైన వాస్తవదృష్టి చేత గానీ లేదో, అలాంటిదే ఇదంతా! అయితే ఇదంతా కూడా "నిర్దుష్టమైన సత్యమా?" అన్నట్లుగా ఉంది. అలాంటి రూపం గల అనుభవాన్నే "మాయ" అంటున్నాం.

**మరి ఈ మాయ తొలగేది ఎట్లా?**

పరబ్రహ్మాన్ని గ్రహించడమే ఈ మాయను ఛేదించే ఉపాయం. పరబ్రహ్మ సమక్షం అచింత్యము, మహాశక్తియుతం కూడా! అలాంటి శుద్ధ పరబ్రహ్మలో 'మాయ' యొక్క విజృంభణం స్వాభావికంగానే ఒక చెట్టు నీడలా ఏర్పడుతోంది. అలాంటి విజృంభణమే ఒక వైపు జీవుని (లేక ద్రష్ట) రూపంగాను, మరొకవైపు జగత్తు (లేక దృశ్యము) రూపంగాను ఒకే సమయంలో ప్రకటితమవుతోంది.

వాస్తవానికి జ్ఞానుల దృష్టికి జీవుడు, సంకల్పాత్మకమైన మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం, మాయ – ఇవన్నీ చిత్తం యొక్క వివిధ నామాలు గానే తోస్తాయి. అంతటికీ కారణం మనస్సే. మనస్సే స్వయంగా తనలో శబ్ద – స్పర్శ – రూప – రస – గంధాలనే పంచ తన్మాత్రలను కల్పించుకొని 'మిథ్య' అయిన జగత్తును నిజంలా విస్తరింపజేస్తోంది. మనస్సు యొక్క ఈ జగద్దర్శనం ఒకడు తన స్వప్నంలో ఆయా వస్తువులను చూడడం వంటిది. నిజానికి శుద్ధము – నిత్యము అయిన ఆత్మ సర్వదా శాంతభావంతో ఉంటుంది. పరమార్థ దృష్టితో చూస్తే... అది దేనినీ చూడడమే లేదు. అయినా కూడా, వ్యావహారికంగా చూస్తే ఈ ఆత్మ 'చిత్తం' అనే స్వభావాన్ని ఆశ్రయించి, తత్ఫలితంగా భ్రమను అనుభవిస్తోంది.ఒకే ఆత్మ చైతన్యం చిత్తాన్ని ఆశ్రయించడం వల్ల వివిధ రూపాలుగా గోచరిస్తుంది.❖

('శ్రీవసిష్ఠ రామ సంవాదం' ఉత్పత్తి ప్రకరణం ఉత్తరార్థం నుంచి) **అనువాదం : వై.హెచ్. రామకృష్ణ**

ధీరవాణి

-స్వామి వివేకానంద



# మనోభావాలెన్నో మతాలన్ని!

ప్రపంచమంతా ఒకే మతాన్ని అవలంబించడాన్ని భగవంతుడు కూడా అంగీకరించడు. ఎందుకంటే ఒకరి ముఖం వేరొకరి ముఖాన్ని పోలనట్లుగా, ఒకరి స్వభావం వేరొకరి స్వభావాన్ని పోలి ఉండదు. కాబట్టి ఎవరికి అనుకూలమైన మార్గంలో వారు వెళ్ళేందుకు తోడ్పడాలి. ఒక నది ఒకానొక దిశగా పారుతోంది. నీవు దాని ప్రవాహాన్ని మార్చి, వేరొక సరళమార్గంలో ప్రవేశపెడితే అది ఎక్కువ వేగంతో ప్రవహిస్తుంది. దాని శక్తి ఎక్కువవుతుంది. కానీ దాన్ని సరళమార్గం నుంచి పూర్తిగా మార్చేయాలని ప్రయత్నిస్తే దాని ఫలితం ఏమవుతుందో చూడు! నీరు తగ్గిపోతుంది. దాని బలం క్షీణిస్తుంది. కాబట్టి ఎవరి సంస్కారం ఎలా ప్రేరణ చేస్తే, అలా ఆ మార్గంలో వారిని నడపాలి. భారతదేశంలో మతవైరం లేదు. ప్రతి మతానికీ స్వాతంత్ర్యం ఈయబడింది. కాబట్టే మతం సజీవమై నిలచింది. ఒక్క మతమే సత్యమనీ, తన మతాన్ని విశ్వసించని వాడు మూర్ఖుడనీ, ఇతరులు కపటులు అనీ, కపటి కాకపోతే తన మతాన్నే అవలంబించేవాడనీ, భావించడం వల్లనే, మత విషయకంగా పోరాటాలు కలుగుతున్నాయనీ జ్ఞాపకం ఉంచుకోవాలి.

ప్రజలందరూ ఒకే మతాన్ని అవలంబించాలనేది భగవదిచ్ఛ అయితే, ఇన్ని మతాలు ఎందుకు పుట్టుకొచ్చాయి? ప్రతి ఒక్కరినీ ఒకే మతం అనుసరించాల్సిందిగా బలవంతపెట్టడానికి అనేకులు ఇదివరకే వ్యర్థప్రయత్నాలు చేశారు. కత్తి ఎత్తి ప్రజలందరినీ ఒకే మతంలోకి చేర్చాలని ప్రయత్నించినప్పుడు కూడా దాని స్థానంలో పది మతాలు పుట్టుకొని వచ్చాయని చరిత్రే సాక్ష్యం చెబుతోంది.

ఒకే మతం అందరికీ సరిపడదు. నరుడు క్రియ, ప్రతిక్రియలనే రెండు శక్తుల సమ్మేళనంతో ఏర్పడుతున్నాడు. ఈ శక్తులు అతనిని జిజ్ఞాసువుగా చేస్తున్నాయి. అలాంటి శక్తులు, మానవుని మనస్సుకు వ్యాయామం కల్పించకపోతే, అతడు జిజ్ఞాస చేయడానికి, అంటే ఊహించడానికి అశక్తుడైపోతాడు. 'మానవుడు' అంటే మననం చేసేవాడని అర్థం. మనుష్యః అంటే మనసు కలవాడని అర్థం. అట్టి మనిషికి మననశక్తి, జిజ్ఞాసశక్తి, లేక ఊహాశక్తి నష్టమైపోయిన తక్షణమే, అతడు పశుసమానుడైపోతాడు. అలా కావాలని ఎవరు కోరుకొంటారు? అలాంటి దుర్దశ భారతదేశ ప్రజలకు వాటిల్లకుండా, భగవంతుడు రక్షించాలి!.

మనిషిగా నిలపడానికి ఏకత్వంలో భిన్నత్వం ఉండడం అవసరం. ప్రతి విషయంలోనూ భిన్నత్వాన్ని అంటే వైవిధ్యాన్ని పోషించాలి. భిన్నత్వం ఉండేంతవరకే ఈ ప్రపంచం నిలువ గలదు. ఒకటి చిన్నదిగా, ఇంకొకటి పెద్దదిగా ఉండడం మాత్రమే భిన్నత్వమని భావించరాదు. ఈ జీవితంలో అన్నీ తమ తమ స్థితిలో సమంగా స్వధర్మాన్ని నిర్వహిస్తే భిన్నత్వం సురక్షితంగానే ఉంటుంది. ప్రతి మతంలోనూ యోగ్యులు, సమర్థులు ఉండి, తమ మతాన్ని గౌరవభాజనం చేస్తున్నారు. ప్రతి మతంలోనూ, అలాంటి వారుంటారు. కాబట్టి, ఏ సంప్రదాయం పట్లా ద్వేషమనేది ఉండరాదు. ❖

# పరిప్రశ్న

**- స్వామి సుకృతానంద**

జి.కె.రావు, కాకినాడ

**? : వాలి సుగ్రీవుల పోరులో సర్వజ్ఞుడైన రాముడు సుగ్రీవుని మెడలో దండ ఎందుకు వేయవలసి వచ్చింది?**

✍: శ్రీరామచంద్రుడు లీలామానుష రూపుడు. తన దివ్యత్వాన్నీ, సర్వజ్ఞత్వాన్నీ, సర్వశ్రేష్ఠత్వాన్నీ, సర్వశక్తిమత్వాన్నీ, అనంతత్వాన్నీ, సకల కల్యాణగుణాల్నీ మరచి మానవునిగా నటించాడు. వైదేహి అగ్నిప్రవేశ సమయంలో బ్రహ్మదేవుడు వచ్చి, "సీత మహాలక్ష్మి, నువ్వు విష్ణుమూర్తివి" అంటే, "నేను మానవుడినే అనుకుంటున్నాను" అంటాడు రామయ్య. దీన్నే లీల అంటారు. భగవంతుడు నిత్యుడై, పంచభూతాత్మకమైన శరీరంలో ప్రవేశించి, జీవునిగా నటిస్తూ లోకకల్యాణం చేస్తాడు. రామబ్రహ్మ, సీతమ్మ చేత అగ్ని ప్రవేశం చేయించాడు. సీతామాత పాతివ్రత్యాన్ని సకల లోకాలకూ నిరూపించడానికే ఆమెను అగ్నిప్రవేశం చేయించానని తానే చెబుతాడు.



"ప్రత్యయార్థం తు లోకానాం
త్రయాణాం సత్య సంశ్రయః
ఉపేక్షా చాపి వైదేహీం ప్రవిశంతీం హుతాశనమ్.
విశుద్ధా త్రిషు లోకేషు మైథిలీ జనకాత్మజా,
న హి హాతుమయం శక్యా కీర్తిరాత్మవతా యథా."

"నేను సత్య పరాధీనుడనై ముల్లోకాలకూ విశ్వాసం కలిగించడం కోసం అగ్నిలో ప్రవేశించే సీతను ఉపేక్షించాను. జనక పుత్రిక అయిన ఈ సీత ముల్లోకాలలోనూ పవిత్రురాలు. ఆత్మాభిమానం కలవాడు కీర్తిని విడువలేనట్లు నేనీమెను విడిచి ఉండజాలను" అన్నాడు రామయ్య. ఇంతకన్నా నిదర్శనం ఇంకేం కావాలి! 'శ్రీరామకృష్ణ పరమహంస' సప్రామాణిక జీవిత గాథ స్వామి శారదానందులవారిచే విరచితమైంది. అందులో పరమాత్మ మానవరూపంలో అవతరించి, దైవ మానవ శక్తులతో వ్యవహరించిన విధం చదవండి. అప్పుడు శ్రీరాముని అవతారలీల అర్థమవుతుంది.

సాయి రామానందస్వామి, గిద్దలూరు

**? : ఆత్మ, మనస్సు ఒక్కటేనా? తప్పక సమాధానం చెబుతారని ఆశిస్తున్నాను.**

✍: మనస్సు అంటే ఆలోచనల పుట్ట. సంకల్ప వికల్పాత్మకం. దూరం నుంచి చూసిన ఒక వస్తువు- మనిషా? కొయ్యా? జంతువా? ఇలా చూసే వస్తువు అది అవునా, కాదా అని నిర్ణయం చేయ ప్రయత్నించేది సందిగ్ధావస్థ. శోకమోహాల ద్వారా మనస్సుకు బాధ కలుగుతుంది. మనోనాశమే మోక్షం అంటారు. అది సూక్ష్మశరీరంలో భాగం.

ఆత్మ నిత్య శుద్ధ బుద్ధ ముక్తమైనది. ఆనంద స్వరూపం. స్వప్రకాశం. ఆత్మను తెలుసుకోవాలి. ఆత్మజ్ఞాని అయితే పరమానందాన్ని పొందుతాడు. 'ఆత్మావారే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యః' అని వేదమాత ఘోషిస్తోంది. ఆత్మ నిత్యం, శాశ్వతం. మనస్సు అనిత్యం. మనస్సు 'మసి' అయితేనే ఆత్మలాభం కలుగుతుంది.

ఎమ్.ఎల్.ఎన్. రావు, హైదరాబాదు

**? : పితృదేవతలు ఎవరు? ఎక్కడుంటారు? ఎంతకాలం వరకు వీరికి కర్మలు ఆచరించాలి?**

✍: బ్రహ్మకుమారుడైన మను ప్రజాపతికి సప్త ఋషులు జన్మించారు. వారు పితృదేవతలను సృష్టించారు. వీరే కాక విరాట్ పురుషుడు, బ్రహ్మదేవుడూ పితృదేవతల్ని ఏర్పరచారు. బ్రహ్మ సంభవుడు రూపాలు గల మూడురకాల దేవతల్నీ, తేజస్సు గల నాలుగు రకాల పితృదేవతల్నీ సృష్టించాడు. మానవులు తర్పణం ద్వారా సమర్పించే పిండాలు వారికి చేరుతాయి. పిండ ప్రదానం ద్వారా వారి ఋణం తీర్చుకోవాలి. అలా చేయని వారికి పాపం వస్తుంది - 'అకరణే ప్రత్యవాయః' అని శాస్త్రం చెబుతోంది. మనిషి తన శరీరాన్ని నిత్యం అన్న పానీయాలతో పోషించినట్లు సంవత్సరానికొకసారి పిండప్రదానం ద్వారా పితృదేవతలను శ్రద్ధా భక్తులతో పూజించాలి. ❖

- రెంటాల జయదేవ

(...గత సంచిక తరువాయి)



# అతి ముఖ్యమైన ఆ ఎనిమిది పుష్పాలు

## అష్ట విధ పుష్పాలు

భగవంతుణ్ణి ఎనిమిది రకాలైన పుష్పాలతో అర్చించాలని పెద్దల మాట. ఆ అష్టవిధ పుష్పాల గురించి ప్రతీకాత్మకంగా చెప్పారు. దీని గురించి ఓ పురాణ కథ ఉంది. శ్రీస్కాంద మహాపురాణంలోని రేవాఖండంలో 51వ అధ్యాయంలో ఇలా ఉంది:

నర్మదా తీరంలో అమరకంటకమనే ఓ పర్వతం ఉంది. అక్కడే నర్మదలో శూలభేద తీర్థం ఉంది. ఆ తీర్థం దగ్గర అమర కంటక పర్వతం మీద ఓ గుహ ఉంది. ఆ గుహలో శ్రీమార్కండేయ మహర్షి వెయ్యి దివ్య సంవత్సరాలు తపస్సు చేశాడు. ఒక శివలింగాన్ని కూడా అక్కడ ప్రతిష్ఠించాడు. ఆ స్వామికి మార్కండేయుడని పేరు.

ఆ లింగమూర్తికి అష్టవిధ పుష్పాలతోనూ, అష్టవిధ మానసిక పుష్పాలతోనూ పూజ చేయాలి. ఆ అష్టవిధ పుష్పాలు-

**వారిజం సౌమ్య మాగ్నేయం**
**వాయవ్యం పార్థివం పునః ।**
**వానస్పత్యం భవేత్ షష్ఠం**
**ప్రాజాపత్యం తు సప్తమమ్ ॥** 31
**అష్టమం శివపుష్పం స్యా**
**త్తేషాం శృణు వినిర్ణయమ్ ।** 31 1/2

పైన చెప్పిన వారిజం, సౌమ్యం మొదలైన అష్టవిధ పుష్పాల వివరణ ఏమిటయ్యా అంటే -

**వారిజం సలిలం జ్ఞేయం**
**సౌమ్యం మధు ఘృతం పయః** 32
**ఆగ్నేయం ధూపదీపాద్యం**
**వాయవ్యం చందనాదికమ్**
**పార్థివం కందమూలాద్యం**
**వానస్పత్యం ఫలాత్మకమ్** 33
**ప్రాజాపత్యం తు పాఠాద్యం**
**శివపుష్పం తు వాసనా** 33 1/2

'వారిజం, సౌమ్యం, ఆగ్నేయం, వాయవ్యం, పార్థివం, వానస్పత్యం, ప్రాజాపత్యం, శివపుష్పం - అని పుష్పాలు ఎనిమిది విధాలు. వివరంగా చెప్పాలీ అంటే -

1. 'వారిజ' పుష్ప సమర్పణమంటే దేవుడికి అభిషేకం చేయడం.
2. 'సౌమ్య' పుష్ప సమర్పణమంటే భగవంతుడికి తేనె, నెయ్యి, పాలు నివేదించడం.
3. 'ఆగ్నేయ' పుష్ప సమర్పణమంటే దేవుడికి ధూప, దీపాలు సమర్పించడం.
4. 'వాయవ్య' పుష్పపూజ అంటే చందనం మొదలైనవి దేవుడికి అలదడం.
5. 'పార్థివ' పుష్పార్చనమంటే కందమూలాదుల్ని నైవేద్యంగా పెట్టడం.
6. 'వానస్పత్య' పుష్పోపహారమంటే దేవుడికి ఫలాదుల్ని సమర్పించడం.
7. 'ప్రాజాపత్య' పుష్ప సమర్పణమంటే దేవుడి ఎదుట వేద పురాణాదుల్ని చదివి, వినిపించడం.
8. 'శివ పుష్ప' సమర్పణమంటే భక్తుడు తన మనో వాసనల్ని సమర్పించడం.

## మానసిక పుష్పాలు

భగవత్ భక్తులు మొదట ఇలా పత్రాలు, పుష్పాలతో పూజిస్తారు. ఇవన్నీ పూజలో ప్రథమ సోపానాలు. అయితే, సాధనా క్రమంలో ముందుకు వెళ్ళాక, ఆత్మ వికాసం పొందిన తరువాత, సర్వాంతర్యామి అయిన ఆ దేవదేవుణ్ణి మనఃపుష్పాలతోనే పూజించవచ్చు.

మానసికంగా కూడా ఎనిమిది పుష్పాలుంటాయి. అవి - 1.అహింసా పుష్పం 2. ఇంద్రియ నిగ్రహ పుష్పం 3. దయా పుష్పం 4. క్షమా పుష్పం 5. ధ్యాన పుష్పం 6. తపః పుష్పం 7. జ్ఞాన పుష్పం 8. సత్య పుష్పం. ❖

(అష్ట మానసిక పుష్పాల వివరణ వచ్చే సంచికలో...)

# రామరాజ్యంలో ధర్మస్థాపన

కథ : స్వామి జ్ఞానదానంద
చిత్రాలు : దాకోజు శివప్రసాద్





ఇందుమూలంగా తెలియజేయునది ఏమనగా.... గత పధ్నాలుగేళ్ళలో ప్రజలు పన్నులు సరిగా చెల్లించనందున కోశాగారం ఖాళీ అయింది. అందుకు ప్రతిగా ప్రతి ఒక్కరూ ఒక గుమ్మడి కాయంత బంగారాన్ని ఖజానాకు చెల్లించాలని శ్రీరాముని ఆజ్ఞ! హో...
హనుమా! నీవు అదృశ్యంగా ఉండి ప్రజలు దీని గురించి ఏమనుకుంటున్నారో తెలుసుకోవాలి! దీని వల్ల ఎవరికీ కష్టం కలగకూడదు సుమా!
అవును ప్రభూ మీకు ఎలాంటి అపకీర్తి రాకూడదు.
రాముడు నిజంగా ధర్మప్రభువు. ఏనుగంత బంగారాన్ని కట్టాల్సిన మనం గుమ్మడి కాయంత ఇస్తే సరిపోతుందట!
అవును నిజం! కొండంత పాపం చేసి ఒక కొబ్బరికాయ కొట్టినట్లుంది!
ప్రజలంతా తమపై అధిక పన్ను భారం పడనందుకు సంతోషంగా ఉన్నారు.
కానీ దీని వల్ల నిజాయతీ పరులెవ్వరికీ నష్టం కలగకూడదని ధర్మదేవతను ప్రార్థిద్దాం!
ఆలయంలో వారిద్దరూ ధ్యానం చేస్తుండగా ధర్మదేవత దర్శనమిచ్చింది.
ధర్మహాని కలగకుండా చూడాలనే మీ తపనకు మెచ్చాను. ఈ కార్యాన్ని నేనే దగ్గరుండి నడిపిస్తాను.


మిగతా 36వ పేజీలో...



# పరిత్యాగంతో పరిపూర్ణత

**– స్వామి రంగనాథానంద**

ఆత్మను ఎలా సాక్షాత్కరించుకోవాలి? మనం మన నిజ స్వరూపాన్ని మరచిపోయాం. ఈ సంసార వ్యూహంలో మనకు దారి కనపడడం లేదు. దారి చూపేదెవరు? మనమే! మనస్సు పరిశుద్ధమైన కొద్దీ అది మన అదుపులోకి వస్తుంది. శుద్ధమై, సుశిక్షితమైన మనస్సు భగవంతుణ్ణి చేరే దారిని కనుక్కొనగలదు. శ్రీరామకృష్ణులు ఇలా అంటారు: 'తిండికి ప్రలోభపడి బోనులో దూరుతుంది ఎలుక. కానీ, అందులో చిక్కుకొని, బయటపడాలని వృథా ప్రయాస పడుతుంది. అది ఏ మార్గం ద్వారా ప్రవేశించిందో అది తెరిచే ఉన్నా, ఆ సంగతి గ్రహించదు. అలాగే మోక్షమార్గం తెరిచే ఉంది. కానీ చాలా కొద్ది మంది మాత్రమే దాన్ని చేరగలరు'. తొలిదశలో మార్గదర్శనం అవసరం. భారతీయ మహర్షుల సుశిక్షితాలైన మనస్సులలో ఆత్మజ్ఞానోదయమైంది. ఆ బలాన్నిచ్చే ఈ సంప్రదాయాన్ని వారు తోటిమానవుల పట్ల గల అనురాగం కారణంగా, భావితరాలకు తరగని ఆస్తిగా దత్తం చేశారు.

ఉపనిషత్తులు స్ఫూర్తిదాయకాలుగా ఉండడంలోని రహస్యమిదే. మనిషి ఎల్లప్పుడూ వెదకుతున్న అంతరాత్మ నిగూఢ రహస్యాల సమాచారాన్ని అవి అతడికి అందజేస్తాయి.

మనిషి జిజ్ఞాసువు కావాలని ఉపనిషత్తులు ఆదేశిస్తున్నాయి. జిజ్ఞాసువుకు ప్రశ్నించే బుద్ధి అవసరం. ఉపనిషత్తులు మానవునికి సత్యాన్వేషణలో తోడ్పడతాయి. కావలసినది శ్రద్ధ. సత్యమార్గంలో సంశయాలు కూడదు. భగవంతుణ్ణి గురించి, సత్యాన్ని గురించి తీరిగ్గా సవాళ్ళు వేయకూడదు. ఈ ధోరణి వల్ల ఉపనిషత్తుల గంభీర తాత్పర్యం విశదం కాదు. మజ్జిగలో వెన్న ఉన్నప్పటికీ, చిలికితేనే అది పైకి తేలుతుంది. జిజ్ఞాస, ధ్యానాలనే కవ్వాలతో చిలికితేనే అనుభూతిలో దాగి ఉన్న సత్యం, పైకి తేలుతుందని ఉపనిషద్వాక్యం.

ఉపనిషత్తులను రహస్యాలుగా పరిగణించేవారు. ఉపనిషత్తులను రహస్య శాస్త్రమని అనడంలో కొంత అర్థం కూడా ఉంది. అవి చాలా గంభీరమైనవి. వాటిని శ్రద్ధానిష్ఠలతో చదవడానికి సిద్ధంగా ఉన్నవారే వాటి నుంచి ప్రయోజనం పొందగలుగుతారు.

ఈశావాస్య మిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్।
తేనత్యక్తేన భుంజీథా మా గృధః కస్య స్విద్ధనం ॥

'క్షణభంగురమైన ఈ జగత్తులో నశ్వరమైనదంతా ఈశ్వరునితో ఆవరింపబడి ఉంది. త్యాగాన్ని ఆలంబన చేసుకొని జీవించు. పరుల ధనాన్ని ఆశించకు'అని ఈశావాస్యోపనిషత్తు చెబుతోంది.

ఈ జగమంతా ఈశ్వరచైతన్యంతో నిండి ఉంది. ఈ విషయ ప్రపంచంలో మన అనుభవంలోకి వచ్చే నానాత్వాన్ని శాశ్వతమైన ఈ వెలుగులో చూడాలి. నీటి బుడగ క్షణంలో మాయమవుతుంది. అది ఏమిటి, ఎక్కడ నుంచి వచ్చింది, ఎక్కడకు పోయింది? నీటి నుంచి వచ్చింది, తిరిగి నీటిలో కలసిపోయింది. మధ్యలో నీటి బుడగగా కనపడినప్పుడూ అది నీరే! ఆ క్షణికమైన నీటి బుడగ నిజస్వరూపం నీరు. అలాగే, జగత్తు నిజస్వరూపం బ్రహ్మం. ఈ సంగతి గ్రహించు. విషయానుభవపు అలలో చిక్కుకొని, దీన్ని విస్మరించకు అంటున్నది ఈ మంత్రం. జీవితపు ప్రతి దశలోనూ మార్పు ఉంటుంది, మరణం ఉంటుంది. జీవితసౌధాన్ని నేర్పుతో కట్టడానికి ఇక్కడ స్థిరమైన పునాది లేదు. కాబట్టి లోతుగా లోనికి చూడమంటోంది ఈ ఉపనిషత్తు. అప్పుడు మృత్యువులో అమరత్వాన్నీ, నశ్వరంలో నిత్యాన్నీ, నానాత్వంలో ఏకత్వాన్నీ చూడగలం. ఇది ఉపనిషత్తుల మహాసందేశం.

'అనిత్య వస్తువుల నడుమ ఉన్న నిత్యుణ్ణి' చూడగలిగితే, ప్రతి వస్తువునూ ఈశ్వరుడు ఆవరించి ఉన్నాడని తెలుసుకొంటే, విశ్వం యొక్క నిజస్వరూపం మనకు

అవగతమవుతుంది. దాని తర్వాత అనత్తును పరిత్యజించాలి. ఈ లోకంలో సుఖాన్ని అనుభవించాలంటే, త్యాగం చేసి అనుభవించు! మనకీ లోకంలో ఆలంబన మిచ్చేది త్యజించిన విషయం కాదు, మనం పట్టుకొని అనుభవించగలిగినదే మనకు ఆసరా. భగవంతుణ్ణి పట్టుకొని ఈ లోకాన్ని అనుభవించాల్సిందిగా ఈ మంత్రం చెబుతోంది. ఈ లోకాన్ని అనుభవించడానికి ముందు, భోగపద్ధతి తెలిసి ఉండాలి. దీన్ని భగవద్గీతలో విపులంగా చెప్పారు. ఈశోపనిషత్తు మొదటి మంత్రం దీనిని సంక్షిప్తంగా, త్యాగం అని ఒక ముక్కలో తేల్చింది.

నీతిశాస్త్రంలోనూ, ఆధ్యాత్మికతలోనూ కూడా త్యాగమే నిత్య సూక్తి. మన దైనందిన జీవితంలోనూ, ఇతరులతో గల సంబంధ వ్యవహారాలలోనూ, బలవంతంగా అనుభవించడం కన్నా వద్దనడమే పరమానంద దాయకం. ఈ మహానత్యానికి వివరణ ఈ మంత్రంలో ఉంది. త్యాగవైరాగ్యాల వల్ల సర్వాంతరాత్మ అయిన పరబ్రహ్మతో తాదాత్మ్యం చెందుతాం. మనస్సు, దృష్టి పరిశుద్ధమైనప్పుడు విశ్వమంతా బ్రహ్మమయంగా తోస్తుంది. కనుక త్యాగమంటే నిరాకరణ మాత్రం కాదు! నిరాకరణ ధ్రువీకరణకు దారి తీస్తుంది. జీవపరిణామ తత్త్వవాదంలా ఉన్న జీవన తత్త్వవాదం కూడా ఒక క్రమపద్ధతిలో నిరాకరణ నుంచి ధ్రువీకరణకు సాగుతుంది. ఈ గతిలో ధ్రువీకరణాంశాలే నైతిక, ఆధ్యాత్మిక జీవితకాలంలో నిజమైన సంతోషాన్ని ఇస్తాయి.



చివరకు, ఈశోపనిషత్తులోని మొదటి మంత్రం, 'మా గృధః కస్య స్విద్ధనం' – పరుల ధనం కోసం ఆశపడరాదు అంటుంది. పైకి సరళంగా తోచినా, ఇందులో ఎన్నో నైతిక ఆధ్యాత్మిక విలువలు ఇమిడి ఉన్నాయి. ప్రతీ గురువూ చెప్పేది ఇదే! నువ్వు నీతీ నిజాయతీలతో ఆర్జించినదే నీ సొత్తు. దానితోనే జీవితాన్ని అనుభవించు. పరుల సొమ్ముకు ఆశపడకు. శంకరాచార్యులు భజగోవింద స్తోత్రంలో ఇలా అంటారు:

**మూఢ జహీహి ధనాగమ తృష్ణాం కురు సద్బుద్ధిం మనసి వితృష్ణామ్!**
**యల్లభసే నిజ కర్మోపాత్తం విత్తం తేన వినోదయ చిత్తమ్!!**

"ఓమూఢుడా! ధనం పై అత్యాశ వలదు; సద్బుద్ధి కలిగి, విరక్తిని పెంచుకో; నీతీ నిజాయతీలతో సంపాదించిన, దానితోనే నీ చిత్తాన్ని రమింపజేయి". ఇప్పుడు మనస్సులో ఈ ప్రశ్న లేస్తుంది: ధనం చెడు చేస్తుంది. మనమందరం యాచకులం కావాలా? కాదంటున్నారు శంకరులు! నీ మనస్సును ధర్మానికి కట్టి ఉంచి, విరక్తిని అలవరచుకో అంటున్నారు. నీది కాని దానిపై, నీవు ఆర్జించని దానిపై మనస్సును నిలువనీయకు. నీతి నిజాయతీలతో ఆర్జించిన భోగాలను ఉల్లాసంగా అనుభవించు. లోభం వలదు, లోభి సర్వాన్నీ స్వప్రయోజనానికి వాడుకుంటాడు. ఈ విధంగా దోపిడీ చేసినవారి జీవితాలు, చేయబడిన వారి జీవితాలు నైతికంగా, ఆధ్యాత్మికంగా దెబ్బ తింటాయి. జీవిత ధ్యేయాలైన నైతిక ఆధ్యాత్మిక స్వభావాన్ని అభివృద్ధి చేసుకోవడానికి స్వలాభాపేక్ష ఉండ కూడదు. నిరాకరణ ద్వారానే నిజమైన ఆనందం దొరుకుతుందని గుర్తు ఉంచుకొని, అహంకృతినీ దాని ఔపాధిక గుణాలనూ నిరాకరించాలి. బ్రహ్మమొక్కటే సత్యమని ధ్రువ పరచుకొని, ధనాన్ని అంకిత భావంతో ఉపయోగించాలి. స్వలాభాపేక్ష, స్వార్థాలను పూర్తిగా విడనాడితేనే జీవితాన్ని నిజంగా అనుభవించగలం. ఈ ప్రపంచమంతా ఆనందస్వరూపమైన బ్రహ్మంతో నిండి ఉంది, దానిని అనుభవించడానికే మనమిక్కడ ఉన్నది. త్యాగభావంతో మన దృష్టి పరిశుద్ధమైనప్పుడే, ఈ ప్రపంచం బ్రహ్మానంద తరంగాలతో నిండి ఉన్నదనీ, అదే దాని నిజస్వరూపమనీ కనుగొంటాం. ఇదే అభివృద్ధి, ఇదే వికాసం, ఇదే సాక్షాత్కారం, ఇదే పరిపూర్ణత, ఇదే జీవపరిణామక్రమపు అంతిమ గమ్యం. ❖

(స్వామి రంగనాథానందజీ ఉపన్యాసాల నుంచి)

**సేకరణ : ఆర్. కృష్ణ**



# ఇదిగో భద్రాద్రి.. గౌతమి అదిగో చూడండి...

శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణ సమేతంగా వనవాసం కోసం దండకారణ్యానికి వెళ్ళి, అక్కడ తిరుగుతూ ఒక శిలమీద విశ్రమించాడు. అప్పుడు ఆ శిలను "మరుసటి జన్మలో నీవు నా భక్తుడిగా ప్రసిద్ధి చెందుతావు" అని ఆశీర్వదించాడు.

**భువిపై వైకుంఠం 'భద్రాద్రి' :** పూర్వం మేరువు అనే పర్వత రాజు తన భార్య మేరుదేవితో కలసి సంతానం కోసం బ్రహ్మనుగురించి ఘోరతపస్సు చేశాడు. సర్వలోక పితామహుడైన బ్రహ్మ వారి తపస్సుకు మెచ్చి ప్రత్యక్షమై వారి కోరిక ఏమిటో చెప్పమన్నాడు. పర్వత రాజు పుత్ర సంతానం కావాలని అడిగాడు. కాలక్రమంలో వారికి నీలుడు, భద్రుడు అనే కవలలు కలిగారు; వారిద్దరూ పెరిగి పెద్దయ్యాక గొప్ప విష్ణు భక్తులయ్యారు. తండ్రి ఆదేశం మేరకు భద్రుడు శ్రీరాముడి అనుగ్రహం కోసం గోదావరీ నది ఒడ్డునా, నీలుడు శ్రీకృష్ణుడి అనుగ్రహం కోసం పూరీలోనూ తపస్సు ప్రారంభించారు. భద్రుని తపస్సుకు మెచ్చి సీతాలక్ష్మణ సమేతుడైన శ్రీరామచంద్రమూర్తి భద్రుడి ఎదుట ప్రత్యక్షమయ్యాడు. శ్రీరామచంద్రుని దివ్యమంగళ రూపాన్ని గాంచి ఆనందాశ్రువులతో భద్రుడు శ్రీరామునికి సాష్టాంగ ప్రణామం చేశాడు. అప్పుడు శ్రీరాముడు ప్రసన్నుడై అమిత కరుణతో భద్రుణ్ణి ఒక వరం కోరుకోమన్నాడు. భద్రుడు సీతా లక్ష్మణులతో సహా అదే రూపంతో తన శిరస్సు మీద నివసించాల్సిందిగా వేడుకున్నాడు. శ్రీరాముడు ఈ నేల, నీరు, నిప్పు, గాలి, నింగి ఉన్నంతకాలం తాను భద్రుడి శిరస్సు పైన నివశించి ఉంటాననీ, కల్పాంతంలో అతనికి తన (శ్రీరాముడి) సాయుజ్యం లభిస్తుందనీ చెప్పి భద్రునికి దర్శనమిచ్చిన రూపంతో ఊర్ధ్వ కరములలో శంఖచక్రాలను ధరించి, అధఃకరములలో ధనుర్బాణాలను ధరించి వామాంకాన సీతతో, చెంత సౌమిత్రితో భద్రుని శిరస్సుపైన స్థిరంగా నిలచిపోయాడు. ఈ భూతలంపై వెలసిన ఆ వైకుంఠమే మన రాష్ట్రంలోని 'భద్రాచల క్షేత్రం'.

**గౌతమ ముని కుమార్తె గౌతమి :** శివపురాణంలోని కోటి రుద్రసంహితలో గౌతమీ నది ఆవిర్భావ వృత్తాంతం ఇలా వర్ణించబడింది: ఒకసారి గౌతమ మహర్షి తన శిష్యులను చెరువు నుంచి నీళ్ళు తీసుకురమ్మని పంపించాడు. అదే సమయంలో అక్కడకు కొందరు ఋషిపత్నులు కూడా నీళ్ళ కోసం వచ్చారు.

సీతమ్మవారి పాదముద్రలు



పచ్చల పతకం



పంచవటిలో శ్రీసీతా



రామలక్ష్మణులు తానీషాకిచ్చిన బంగారు నాణేలు



కానీ తమ కంటే గౌతముని శిష్యులు ముందుగా నీళ్ళు తీసుకు వెళ్ళడాన్ని వారు సహించలేకపోయారు. ఆ ముని భార్యలు ఆశ్రమాలకు వెళ్ళి గౌతమ ముని శిష్యులు వారిని అవమాన పరిచినట్లుగా లేనిపోనివి కల్పించి తమ తమ భర్తలకు ఫిర్యాదు చేశారు. వెంటనే మునులంతా కోపోద్రిక్తులై, గౌతముడిని శాప గ్రస్థుణ్ణి చేయమని విఘ్నేశ్వరుణ్ణి ప్రార్థించారు. గౌతముడు ఉత్తముడని విఘ్నేశ్వరుడు వారికి ఎంత నచ్చచెప్పినా వారు వినలేదు. చివరికి చేసేది ఏమీలేక విఘ్నేశ్వరుడు వారి కోరికను నెరవేర్చడానికి అంగీకరించాడు. ఒకరోజు గౌతమముని ఆశ్రమంలోకి ఒక ఆవు ప్రవేశించి అక్కడి మొక్కలను తినడం ప్రారంభించింది. వెంటనే గౌతమముని కర్రతో ఆవుని కొట్టడంతో ఆవు మరణించింది. ఈ వార్త తెలిసిన వెంటనే మిగిలిన ఋషులంతా గౌతముణ్ణి, అహల్యను అపహాస్యం చేయడం ప్రారంభించారు. గౌతమునికి గోహత్యా పాతకం సంప్రాప్తించిందని చెప్పి వారిని అక్కడ నుండి బహిష్కరించారు. గౌతముడు గోహత్యా పాతకం నుండి విముక్తుడు కావాలని పరమేశ్వరుని గురించి తపస్సు చేయగా, పరమేశ్వరుడు ప్రత్యక్షమయ్యాడు. గౌతముడు తనను గోహత్యా పాతకం నుంచి విముక్తుణ్ణి చేయమని శివుణ్ణి ప్రార్థించాడు. అప్పుడు తన జటాజూటం నుంచి శివుడు గంగను వదలగా గంగాదేవి అంశ బాలిక రూపంలో ప్రత్యక్షమైంది. శివుని ఆజ్ఞ మేరకు గంగాదేవి గౌతముణ్ణి పావనం చేసి ఇక నేను వచ్చిన పని పూర్తి అయింది కాబట్టి తిరిగి నన్ను స్వీకరించమని శివుణ్ణి ప్రార్థించింది. అప్పుడు శివుడు 'ఓ దేవీ! నువ్వు ఈ భువిపై ఉండి రాబోయే యుగాల్లో ఎంతోమందిని పవిత్రుల్ని చేయాల్సి ఉంది'అని గంగాదేవి కర్తవ్యాన్ని బోధించాడు. గౌతముని తపస్సుచే శివుని జటాజూటం నుండి ఆవిర్భవించిన గంగాదేవియే గౌతమీ(గౌతముని కుమార్తె) నదిగా పిలవబడుతోంది. అరణ్యవాస కాలంలో శ్రీసీతారామ లక్ష్మణులు గౌతమీ నదిని దాటి పంచవటికి చేరారని ప్రతీతి.




**దమ్మక్కకు దశరథ రాముని దర్శనం :** 17వ శతాబ్ది ప్రారంభంలో భద్రాచలం దగ్గర ఉన్న భద్రిరెడ్డిపాలెం అనే గ్రామంలో పోకల దమ్మక్క అనే మహాభక్తురాలు ఉండేది. ఆమె ఎప్పుడూ శ్రీరామ నామపారాయణం చేసేది. ఒకమారు శ్రీరాముడు ఆమెకి కలలో కనిపించి "నేను భద్రగిరిపై ఉన్నాను, నన్ను అర్చించు, కొద్ది రోజులలో ఒక భక్తుడు వచ్చి నా ఆలయ గోపుర ప్రాకారాదులు నిర్మిస్తాడు" అని చెప్పాడు. తరువాత ఆమె భద్రగిరి వెళ్ళి అక్కడ వెతకగా దైవ విగ్రహాలు కనపడ్డాయి. అప్పటి నుండీ వాటికి ఆమె రోజూ పూజ చేసి తాటిపండు ఒకటి నైవేద్యంగా పెట్టేది. స్థానికుల సహాయంతో చిన్న మండపం నిర్మించి, ప్రతీ ఏడూ సీతారాముల కల్యాణం చేయించేది.

**గోపన్నను రక్షించిన రామన్న:** భద్రాచల రాముని ఆలయాన్ని క్రీ.శ. 1614లో భక్తరామదాసుగా ప్రసిద్ధికెక్కిన కంచెర్లగోపన్న నిర్మించాడు. గోల్కొండ నవాబు తానీషా దగ్గర పాలవంచ పరగణాకి తహశీల్దార్‌గా పనిచేసేవాడు గోపన్న. ఒకమారు పాలవంచ గ్రామస్థులు భద్రాచలంలో జరుగుతున్న జాతర చూడటానికి వెళ్తుంటే, వారితో గోపన్న కూడా వెళ్ళాడు. అక్కడ సీతారాముల అద్భుతమైన విగ్రహాలను చూశాక, అక్కడ ఒక ఆలయం నిర్మించాలనే ఆలోచన వచ్చింది. గ్రామస్థులని విరాళాలడిగి ఆలయ నిర్మాణం ప్రారంభించాడు, అయితే ఆ పైకం సరిపోలేదు. గ్రామస్థులు, పాలవంచ పరగణాలో వసూలైన సొమ్మును దేవాలయం నిర్మించడానికి వాడమనీ, తమకు పంటలు పండగానే తిరిగి పైకం చెల్లిస్తామనీ దానిని తానీషాకు ఈయవచ్చుననీ సలహా ఇవ్వడంతో వసూలైన ఆరులక్షలతో దేవాలయ నిర్మాణం పూర్తిచేసి, సీతారామలక్ష్మణులకు అనేక ఆభరణాలను కూడా చేయించాడు.

అయితే సర్కారు వారి సొమ్ము వారి అనుమతి లేకుండా ఆలయ నిర్మాణానికి వాడినందుకు గోపన్నకి 12 సంవత్సరాలు కఠిన కారాగారశిక్ష విధించారు. శిక్షాసమయంలో బాధలకి ఓర్వలేక రాముణ్ణి స్తుతిస్తూ ఎన్నో కీర్తనలు పాడాడు. అవన్నీ 'భక్తరామదాసు కీర్తనలు'గా ప్రసిద్ధి చెందాయి.

చివరికి రామలక్ష్మణులు మారువేషాలలో ఒక అర్ధరాత్రి వేళ నవాబుని లేపి, ఆరు లక్షల మొహిరీలు చెల్లించి, రామదాసుని విడిపించమని చెప్పి రశీదు తీసుకున్నారు. ఆ రశీదు రామదాసు దిండు కింద ఉంచి అదృశ్యమయ్యారు. మర్నాడు ఉదయం నవాబు రాత్రి తనకి పైకం చెల్లించినది రామలక్ష్మణులే అని

గ్రహించి, రామదాసుని విడిపించి, ఆ పైకాన్ని అతనికి ఇచ్చాడు. అయితే రామదాసు ఆ పైకం తీసుకోలేదు. కానీ భగవంతుడిచ్చిన పైకంలోంచి గుర్తుగా రెండు మొహర్లు తీసుకున్నాడు. ఆ రెండు మొహర్లూ ఇప్పటికీ భద్రాద్రి రాములవారి దేవస్థానంలో భద్రపరచబడి ఉన్నాయి. ఆనాడు రామదాసు చేయించిన మంగళసూత్రాలు, చింతాకు పతకము, పచ్చల పతకము, బంగారు బిళ్ళల మొలత్రాడు, రత్నకిరీటము, వజ్రాల పోగులు, కలికితురాయి మొదలైన ఆభరణాలన్నీ ఆలయంలోని వస్తుప్రదర్శనశాలలో యాత్రికులు చూడడానికి ఏర్పాటు చేశారు. సీతాదేవికి రామదాసు చేయించిన ఆభరణాల్ని ఇప్పటికీ అమ్మవారికి శ్రీరామనవమి రోజున అలంకరిస్తుంటారు.



**పంచవటిలో పర్ణశాల :** వనవాస కాలంలో సీతారాములు నివసించిన ప్రదేశం ఇది. ఇది భద్రాచలానికి 35 కిలోమీటర్ల దూరంలో ఉంది. ఇక్కడే సీతాపహరణం జరిగింది. పర్ణశాలలో ఇప్పటికీ శ్రీరాముని పాదముద్రలు, సీతాదేవిని భూమితోసహా పెకిలించుకుపోయిన గుర్తులు ఉన్నాయి. ఇక్కడ దగ్గర్లోనే సీతావాగు అనే సెలయేరు ఉంది. అందులోనే సీతారాములు నిత్యం స్నానం చేసేవారని చెప్తారు. స్నానానంతరం సీతమ్మవారు కుంకుమ పసుపు ధరించిన గుర్తుగా అక్కడ పసుపు కుంకుమల రంగులలోని శిలలను చూడవచ్చు. అక్కడి శిలలపై సీతమ్మవారు నార చీరలను ఆరవేసిన గుర్తులుంటాయి.

**పక్షిరాజుని ముక్తిధామం:** ఎటపాక భద్రాచలానికి రెండు కిలోమీటర్ల దూరంలో ఉంది. శ్రీరామభక్తుడైన జటాయువు సీతను అపహరించుకుపోతున్న రావణాసురునితో పోరాడి తన రెక్కలను కోల్పోయాడు. జటాయువు శ్రీరాముడి దర్శనమయ్యే వరకూ కొన ఊపిరితో ఉండి, శ్రీరాముడికి సీతాపహరణ విషయాన్ని చెప్పి ప్రాణాలు విడిచాడు. అప్పుడు ఆ పక్షిరాజుకి శ్రీరాముడు ఇక్కడే ఉత్తర క్రియలు జరిపాడు. జటాయువుకి ముక్తి నిచ్చిన ఈ స్థలాన్ని 'జటపాక' అంటారు. అది క్రమంగా ఎటపాకగా మారింది.

శ్రీరాముడు ఖరదూషణాది 14000 మంది రాక్షసులను సంహరించిన ప్రదేశం 'దుమ్ముగూడెం' (ఇది రాక్షసుల అస్తికలు ఉన్న ప్రదేశం కాబట్టి ఈ ప్రాంతానికి దుమ్ముగూడెం అని పేరు వచ్చింది), శ్రీరాముడు మాతంగ మునితో యోగశాస్త్రాలను చర్చించిన ప్రాంతం 'శ్రీరామగిరి' – ఇలా శ్రీ సీతారాముల అరణ్యవాస ఘట్టాలను స్ఫురణకు తెచ్చే దర్శనీయ స్థలాలు ఎన్నో భద్రాద్రి సమీపంలో ఉన్నాయి. భక్తులు **'భువిపై వైకుంఠం – భద్రాద్రి'ని** దర్శించి తరించెదరుగాక! ❖

---

# ప్రార్థనలోని అసలు రహస్యం

అక్బర్ చక్రవర్తి ఒకసారి వేటాడడానికి అడవికి వెళ్ళాడు. సాయంకాలపు ప్రార్థన సమయం కావడంతో అడవిలోనే మోకాళ్ళ మీద కూర్చొని, నమాజ్ చెయ్యడం మొదలు పెట్టాడు.

"పొద్దున్న అనగా అడవికి వెళ్ళిన తన భర్త ఇంకా ఇంటికి తిరిగి రాలేదే" అన్న కంగారులో ఒక మహిళ తన భర్తను వెతుక్కుంటూ అటుగా వెళుతోంది. ఆ రైతు భార్య కంగారులో అక్కడ ఉన్న చక్రవర్తినీ, ఆయన పరివారాన్నీ చూడలేదు. సరిగ్గా చక్రవర్తి నమాజ్ చేస్తున్న దగ్గరకు రాగానే ఆమె తొట్రుపడి, కింద పడి లేచి గబగబా వెళ్ళిపోయింది. ప్రార్థన చేసుకుంటున్న చక్రవర్తికి ఇదంతా చిరాకనిపించింది. అయినా దైవప్రార్థన చేస్తూ మాట్లాడకూడదు కనుక తిరిగి కన్నులు మూసి ప్రార్థనలో నిమగ్నమయ్యాడు.

తన భర్తను అడవిలో కలిసి, ఆ సంతోషంలో రైతు భార్య భర్తతో కలసి తిరిగి వచ్చే సమయానికి చక్రవర్తి చేస్తున్న ప్రార్థన ముగిసింది. చక్రవర్తి ప్రార్థన ముగిసే సమయానికి రైతు, అతని భార్య అక్కడకు చేరారు. అప్పుడే చక్రవర్తినీ, ఆయన పరివారాన్నీ చూసిన రైతు భార్య భయపడింది.

అక్బర్ చక్రవర్తి కోపంగా "నేను చక్రవర్తిని అనే భయం, గౌరవం లేకుండా, నా ప్రార్థనకు భంగం కలిగించావు. క్షమాపణ కూడా చెప్పకుండా వెళ్ళిపోయావు. ఎంత అహంకారం నీకు? దీనికి సరైన సంజాయిషీ ఇవ్వకపోతే నీకు శిక్ష విధిస్తాం" అన్నాడు. అప్పుడు రైతు భార్య ధైర్యంగా, "అయ్యా! నేను నా భర్తను వెతుకుతూ, ఆ కంగారులో మిమ్మల్ని చూడలేదు. ఆ సమయంలో నా మనస్సులో నా భర్తను వెతకడం తప్ప మరో ఆలోచనే లేదు. అయితే మీరు దైవం మీద మనస్సు ఉంచి ప్రార్థన చేస్తున్నారు. భగవంతుడు, నా భర్త కన్నా చాలా గొప్పవాడు కదా! అయినా మీరు నన్ను ఎలా గమనించగలిగారు?" అని ప్రశ్నించింది.

అది విన్న చక్రవర్తి నోట మాట రాలేదు! తరువాత అక్బర్ చక్రవర్తి "ఇవాళ ఒక రైతు భార్య నాకు ప్రార్థనలోని రహస్యాన్ని చెప్పకనే చెప్పింది" అన్నాడు తన పరివారంతో. ❖

– శ్రీమతి రాజీ రఘునాథన్



# నరహరి గురుభక్తి

"మీ కుమారునిది అద్భుతమైన జాతకం. ఇతనికి మహారాజయోగం, ఆధ్యాత్మిక గురువు అయ్యే యోగం రెండూ ఉన్నాయి"అని జ్యోతిష్కుడు చెప్పగా తండ్రి తల్లివైపు చూసి చిరునవ్వు నవ్వాడు. ఆమె తన బిడ్డవైపు చూసింది, పిల్లవాడు నవ్వు ముఖంతో తల్లిని చూస్తున్నాడు.

తన గురువు కొద్ది రోజులలో అక్కడ నుంచి వెళ్ళిపోతున్నారని ఆరోజు నరహరి చాలా దిగులుగా ఉన్నాడు. నరహరి తన గురువుతో "గురువర్యా! నేనూ మీతో పాటే వస్తాను. నాకు మీ పాదసేవ చేసుకునే భాగ్యం కలగజేయండి" అని అన్నాడు. "నరహరీ! నాకు ఒక కోరిక ఉంది. దాన్ని నెరవేరిస్తే నా సేవ చేసినట్టే" అని గురువు నరహరితో చెప్పాడు. సంతోషంగా గురువుతో "నేను తప్పక మీ కోరికను నెరవేరుస్తాను. అదేమిటో చెప్పండి" అని నరహరి అడిగాడు. "నరహరీ! పూర్వం ఋషులు పూజించిన సీతారాముల విగ్రహాలు రాజుగారి దగ్గర ఉన్నాయి. వాటిని నేను ప్రతిష్ఠించాలి. నువ్వు రాజు దగ్గర నుంచి వాటిని తేవాలి. ఇదే నా కోరిక" అని నరహరితో గురువు చెప్పాడు.

గురువు కోరిక విన్న నరహరి మౌనంగా ఉండిపోయాడు. "నరహరీ! నువ్వు మధన పడకు. భగవంతుణ్ణి ప్రార్థిస్తే అతడే దారి చూపుతాడు. నా మాటలు నమ్ము" అని గురువు నరహరితో అన్నాడు. "గురుదేవా! భగవంతుని కృప, గురువు అనుగ్రహం ఉంటే ఎద్దైనా సాధించవచ్చు" అని నరహరి అన్నాడు. గురువు వెళ్తున్నరోజు నరహరి నయనాలు అశ్రుపూరితాలయ్యాయి,. గురువు కూడా బాధపడుతూ "నాయనా! దిగులు పడకు, భగవంతుణ్ణి ప్రార్థించు. నేను చెప్పిన కార్యం తప్పక సాధిస్తావు. జాగ్రత్తగా ఉండు..." అన్నారు.



నరహరి గజపతి మహారాజుగారి ఆస్థానంలో ఉద్యోగం సంపాదించాడు. అతణ్ణి ప్రజలంతా మంచి నడవడిక కలవాడని గౌరవించేవారు. భగవంతుని లీలలు చాలా విచిత్రమైనవి. గజపతి మహారాజు హఠాత్తుగా మరణించాడు. అతని భార్య గర్భవతిగా ఉంది. రాజ కుమారుడు పుట్టి పెద్ద వాడయ్యే వరకు ఎవరో ఒకరిని మహారాజుగా ఎన్నుకోవాలి. అందుకు పట్టపుటేనుగు ఎవరి మెడలో పూలదండ వేస్తుందో ఆ వ్యక్తి రాజ్యపాలన చెయ్యాలని నిర్ణయించారు. ఆ ఏనుగు తిన్నగా వచ్చి నరహరి మెడలో పుష్పహారాన్ని వేసింది. నరహరి మహారాజు అయ్యాడు. ఆయన పాలనలో ప్రజలంతా సుఖ సంతోషాలతో జీవించారు. నరహరి మంచి రాజుగా పేరు తెచ్చుకున్నాడు. రాణికి మగ శిశువు జన్మించాడు. ఆ రాకుమారుడు అన్ని విద్యల్లో నైపుణ్యాన్ని సంపాదించిన తరువాత నరహరి అతనికి రాజ్యభారాన్ని అప్పగించాడు. రాజకుమారుడు "అయ్యా! మీరు ఎంతో దక్షతతో రాజ్యాన్ని పాలించారు. నేను మీకు ఏమి ఇవ్వగలను" అని అడిగాడు. నరహరి వినయంగా రాజుకు నమస్కరించి "రాజా మీ ఖజానాలో ఉన్న సీతారాముల విగ్రహాలను ఇప్పించండి" అన్నాడు. రాజకుమారుడు వెంటనే ఆ విగ్రహాలను తెప్పించి నరహరికి ఇచ్చాడు. తన గురువుకు విగ్రహాలు ఇవ్వాలని చెప్పి నరహరి రాజు వద్ద సెలవు తీసుకున్నాడు. ఇన్నేళ్ళు రాజ్య పాలన చేసినా ఈయన ఇంత నిరాడంబరంగా ఉన్నాడు. సీతారాముల విగ్రహాలు తప్ప ఏమీ కోరడం లేదే అని రాజు నరహరి త్యాగశీలతను కొనియాడాడు.

నరహరి గురువు వద్దకు వెళ్ళి వారికి పాదాభివందనం చేసి విగ్రహాలను గురువుకి సమర్పించాడు. గురువు భక్తితో వాటిని ఒక పీఠం మీద ఉంచి పూజించాడు. ఆశ్రమంలో మూడు నెలలపాటు ఉత్సవాలు జరిగాయి. 80రోజులు గురువు స్వయంగా ప్రతిరోజూ ఆ విగ్రహాలను పూజించాడు. అన్ని రోజులూ గురువును తృప్తిగా సేవించే భాగ్యం నరహరికి లభించింది. గురువు "నరహరీ! నేను నీ సేవలకు సంతుష్టుణ్ణయ్యాను. నువ్వు కొన్ని రోజులు తీవ్ర తపస్సాధనలు ఆచరించు. నా స్థానాన్ని నువ్వు అధిష్ఠించాలి" అని అన్నాడు.

ఇంత మంది పూజ్యులైన సాధువులుండగా గురువు తనను ఎన్నుకోవడం ఏమిటి అనుకుని "వద్దు గురుదేవా" అని నరహరి సున్నితంగా తిరస్కరించాడు. "గురువు ఆజ్ఞను పాటించవా?"అని అనడంతో నరహరికి గురువాజ్ఞను శిరసావహించక తప్పలేదు. ఆ గురువే ద్వైత మతాన్ని స్థాపించిన మధ్వాచార్యులు. శిష్యుడు నరహరి 'నరహరి తీర్థగా' గురుస్థానాన్ని అలంకరించాడు. నరహరికి మహారాజయోగం, ఆధ్యాత్మిక గురువు అయ్యే యోగం ఉందన్న జ్యోతిష్కుని మాటలు నిజమయ్యాయి. ❖

(రామకృష్ణ సంఘ ఆంగ్ల మాసపత్రిక 'ప్రబుద్ధ భారత' జూన్ 2000 సంచిక నుంచి సేకరణ) అనువాదం: శ్రీమతి కె. జానకి

- ఆకెళ్ల రాఘవేంద్ర

# కష్టం కష్టం కాదనే 'కిరాతార్జునీయం'

మహాభారతం ఆరణ్యపర్వంలో ప్రథమ ఆశ్వాసంలోని కథ 'కిరాతార్జునీయఘట్టం'. అస్త్రశస్త్రాల కోసం అర్జునుడు శివుణ్ణి ప్రార్థించడం, ఘోరతపస్సు చేయడం, పరమేశ్వరుడు స్వయంగా కిరాతుడి వేషంలో రావడం, వారిద్దరి మధ్యా యుద్ధం జరగడం - స్థూలంగా ఇదీ కథ. కిరాతుడు అంటే వేటగాడు. కేవలం కథగా మాత్రమే పైకి కనిపిస్తున్న ఈ ఘట్టంలో మానవ జీవితవికాసానికి కావలసిన 'అస్త్రాలెన్నో'ఉన్నాయి.

కెరటంలేని సముద్రం, కష్టం లేని మానవజీవితం - ఉండమన్నా ఉండవు. అమావాస్య చూడకుండా చంద్రుడు ముందుకు సాగలేడు. కష్టం, బాధ, సమస్య– ఏదైనా కావచ్చు - మనిషికి సహజం. ఎవరి కష్టం వారిది. పీత కష్టం పీతదీ. సీత కష్టం సీతదీ అన్నారు. పదో తరగతిలో ఫస్ట్ ర్యాంక్ రావడం లేదని ఒకరు బాధపడుతుంటే ఫస్ట్ క్లాస్ రావడంలేదని ఇంకొక విద్యార్థి కంగారుపడుతూ ఉండొచ్చు; అసలు పాస్ కావడం ఎలాగో అర్థం కాక మరొకరు తలపట్టుకొని ఉండొచ్చు.

ప్రమోషన్ రావడంలేదని ఒకరు బాధపడుతూంటే అసలు ఉద్యోగమే లేదని మరొకరు ఆందోళనపడుతూ ఉండవచ్చు. సంసారంలో సమస్యలు ఉన్నాయని ఒక ఇల్లాలో, ఇంటాయనో బాధపడుతూ ఉంటే అసలు వివాహమే కావడం లేదన్నది ఇంకొకరి సమస్య.

కష్టాలు, కన్నీళ్ళు, బాధలు, సమస్యలు... ఇవి అన్నీ సహజం. ఎంతటి వారికైనా సహజం, మంచివారికైనా సహజం - అని చెప్పేందుకే మహాభారతంలో పాండవుల అరణ్య, అజ్ఞాతవాసాలు. పాండవులు పడరాని పాట్లు పడ్డారు. రాజసూయయాగం చేసుకొని రాజ్యాన్ని ఏలుకొంటూ భోగాలు అనుభవించాల్సిన పాండవులు నారచీరలు కట్టుకొని, అస్త్రాలన్నీ వదిలేసి, రథాలు, రత్నాలు అన్నింటినీ విసర్జించి కందమూలాలు తింటూ అరణ్యాల్లో ఒకటి రెండు కాదు ఏకంగా పన్నెండేళ్ళు బతకాల్సి వచ్చింది. మారువేషాల్లో తమహోదాల్ని మరచిపోయి వంటవారిగా, పనివాళ్ళగా గడపాల్సి వచ్చింది అజ్ఞాతవాసంలో!

పాండవులకు ఎందుకిన్ని కష్టాలు? జూదంలో ఓడిపోయారు కాబట్టి–అనేది తర్కం ఇచ్చే సమాధానం; జాతక ఫలం అలా ఉంది కాబట్టి అనేది జ్యోతిష్యం ఇచ్చే జవాబు; కర్మఫలం అలా ఉంది అనేది వేదాంతం ఇచ్చే బదులు. కానీ అన్నింటికీమించి - పాండవులకు ఎందుకు కష్టాలు వచ్చాయి అనే అంశం కన్న - కారణంతో సంబంధం లేకుండా 'బాధలు పడక తప్పదు' అనే నగ్న సత్యాన్ని అందివ్వడం ఇందులో కీలకం.

అసలు అరణ్య, అజ్ఞాత వాసాలు వచ్చింది సామాన్య సైనికులకు కాదు - పాండవులకు. అంతిమ విజయం లభించింది మరెవ్వరికో కాదు - పాండవులకు! అంటే మనకు కూడా కష్టాలు వచ్చాయంటే అర్థం - రేపటి విజయం కోసం అడుగులు ముందుకు పడుతున్నాయన్నమాట. ఆ అడుగులు



ఇప్పుడు అష్టకష్టాలుగా మనకు కనిపిస్తున్నాయన్నమాట.

మనం లెక్కలు చేస్తున్నప్పుడు సులువుగా ఉన్న లెక్కలో, అప్పటికే జవాబులు తెలిసిన లెక్కలో చేస్తే - మన మెదడుకి పదునుపెట్టలేం. రెండురెళ్ళు నాలుగు అని చెప్పడానికి బుర్రను వేడెక్కిస్తామా? అలా కాకుండా ఎంతకూ తెగని లెక్క మనకు ఎదురైతే - జవాబు వెతికేందుకు పరిపరి విధాల ఆలోచిస్తాం; శ్రమిస్తాం; మెదడును పదును పెట్టిస్తాం. ఆ లెక్క తేలేందుకు ఎన్ని పరిష్కార మార్గాలున్నాయో అన్నీ వెతికి పట్టుకొంటాం.

జీవితమూ అలాంటి తెగని లెక్కల మొత్తమే!
ఒక్కో కష్టం ఒక్కో లెక్క అని గుర్తించండి!!
అలాంటి లెక్కల అంతు చూడడం ఓ లెక్కా అన్న
ఆత్మవిశ్వాసం పెంచుకొందాం.

టెన్నిస్ ఆడుతున్నప్పుడు బంతి ఎటువైపు వస్తుందో ముందే తెలిసిపోతే - ఇక ఆడేదేముంది? ఆ ఆటలో ఉత్సుకత ఏముంటుంది? అవతలి క్రీడాకారుడు బంతిని ఎటువైపు కొడతాడో తెలీదు, ఆ బంతిని మనం ఎటుగా ఎదుర్కోవాలో తెలీదు, ఆటలో మనం ఓడతామో, గెలుస్తామో తెలీదు ఇన్ని సమస్యలున్నప్పుడు మనం బాగా ఆడేందుకు ప్రయత్నిస్తాం, నిరంతరం ప్రాక్టీసు చేస్తాం. మెదడుకు పదును పెట్టి ఆడతాం,

ఎత్తుకి పై ఎత్తులు వేస్తాం. మనసుపెట్టి ఆడతాం. అన్నింటికీ మించి గెలవాలన్న తపనతో ఆడతాం. జీవితమూ అలాంటి ఆటే!

సమస్యవచ్చినప్పుడే మనం ఆలోచించడం ప్రారంభిస్తాం. ఆలోచించడం ప్రారంభించినప్పుడే నివురు గప్పిన నిప్పులా మనలో ఉన్న శక్తి బయటపడుతుంది. ఆ శక్తి బయటపడితే మనం ఏదైనా సాధించగలం. అంతేకాదు విజయం సాధించడానికి కావలసిన నేర్పరితనం ఆ సమస్య ద్వారా పొందగలుగుతాం.

అరణ్యవాసంలో పాండవులకు జరిగింది అదే!

రాబోయే కురుక్షేత్ర సంగ్రామంలో ఢీకొనవలసింది సామాన్య శత్రువులను కాదు. దుర్యోధన దుశ్శాసన కర్ణాదులను! అరివీరభయంకరులను! అతి బల సంపన్నులను!

మరి అలాంటి బల పరాక్రమవంతులతో పోటీ పడాలంటే పాండవులకు అంతకుమించిన బలం ఉండాలి కదా. అందుకే తమ తమ బలాల మీద నమ్మకం కలిగేందుకు, అస్త్ర శస్త్రాలను ఏర్పరచుకొనేందుకు వచ్చిన బంగారం లాంటి అవకాశం – అరణ్య, అజ్ఞాత వాసాలు అంటే అవి కష్టాలు కావు, శిక్షణా కాలం అన్నమాట.

అందుకే శివుణ్ణి ప్రార్థించి పాశుపతాస్త్రం సమకూర్చుకోమని కృష్ణుడు అర్జునుడికి హితవు పలికాడు–'తక్షణమే మనం యుద్ధం చేయడం లేదు కదా, మరి పాశుపతంతో పనేమిటి కృష్ణా' అని సందేహం వెలిబుచ్చాడు అర్జునుడు. రేపు కురుక్షేత్ర యుద్ధం అంటే ఈరోజు శివుణ్ణి ప్రార్థిస్తావా బావా'అని ఎదురు ప్రశ్న వేశాడు గీతాకారుడు. అంతే కదా–రేపు పరీక్ష పెట్టుకొని ఇవేళ పుస్తకాలు కొనం కదా, ఇవేళ చదవడం మొదలుపెట్టం కదా! పరీక్షలో సత్ఫలితం పొందాలంటే ముందే పుస్తకాలు సమకూర్చుకోవాలి. కృష్ణుడు చెప్పిందదే!



అర్జునుడు శివుడికై తపస్సు చేయడం ప్రారంభించాడు. ఆరంభించిన అర నిమిషానికే పరమేశ్వరుడు ప్రత్యక్షం కాలేదు. మనకూ అంతే! పని మొదలుపెట్టిన వెంటనే ఫలితం వచ్చేయదు.. కఠోరమైన తపస్సు చేయాలి. తదేకదీక్షతో కృషి చేయాలి. పంచేంద్రియాల్నీ, ఆత్మనూ మన లక్ష్యంపై కేంద్రీకరించాలి. అర్జునుడు చేసిందదే. ఘోర తపస్సు చేసిన తరువాతే అర్జునుడికి పరమశివుడు ప్రత్యక్షమయ్యాడు.

ఎలా? కిరాతుడి వేషంలో! పైగా మూకాసురుడు అడవి పంది రూపంలో వచ్చి అర్జునుడి తపస్సుకు భంగం కలిగించడం మొదలుపెట్టాడు. మొదట దాన్ని పట్టించుకోకుండా అర్జునుడు తపస్సును కొనసాగించాడు. కానీ ఆ పంది భీకరారావాలు మరీ పెరిగి పోయాయి. లాభం లేదు అని అర్జునుడు గాండీవం తీసి దాని మీద బాణం వేశాడు. సరిగ్గా అదే సమయంలో కిరాతుకుడి వేషంలోని శివుడి బాణం కూడా దానికి తగిలింది. ఆ సూకరం నేల కొరిగింది.

ఇప్పుడు ఆ సూకరం ఎవరిది? అర్జునుడిదా! శివుడిదా!! నాదంటే నాదని ఇద్దరూ తగవులాడుకొన్నారు. చివరకు వారిద్దరి మధ్య పెద్ద యుద్ధమే జరిగింది. సాక్షాత్తూ శివుడితోనే అర్జునుడి యుద్ధం! చివరకు అర్జునుడే గెలిచాడు. నీ భక్తికే కాదు శక్తికీ మెచ్చానంటూ అర్జునుడికి పశుపతినాథుడు పాశుపతం ఇచ్చాడు.

ఈ కథ అంతరార్థం ఏమిటి?

కష్టం సృష్టించిందీ శివుడే! శివుడి ఆజ్ఞ లేనిదే చీమైనా కుట్టదు కదా! పరీక్ష పెట్టిందీ శివుడే! మారు వేషంలో వచ్చిందీ శివుడే!! యుద్ధం చేసిందీ, చేయమన్నదీ శివుడే!! చివరకు గెలిచినది అర్జునుడు! తన శక్తిమీద తనకు నమ్మకం ఉన్న అర్జునుడు.

మనమూ ఆ విజయుడిలా అజేయులం కావాలి. అర్జునుడు కోరిన వెంటనే అస్త్రాన్ని అందివ్వలేదు శంకరుడు. ముందో పరీక్ష పెట్టాడు. చిన్న పిల్లాడు స్కూటర్ కావాలని అడిగితే ఏ తండ్రి అయినా ఇస్తాడా? కొనగలిగిన శక్తీ ఉంది, పిల్లాడి మీద ప్రేమా ఉంది. అయినా పిల్లాడికి స్కూటర్ ఎందుకివ్వడు ఆ తండ్రి? ఎందుకంటే – స్కూటర్ ఇచ్చినా ఆ పిల్లాడికి దానిని నడపగల సామర్థ్యం లేదు కాబట్టి! కావాలంటే సైకిలిస్తాడు ఎందుకంటే ఆ పిల్లాడి శక్తి అంతే కాబట్టి! భగవంతుడూ అంతే! మనం ఏది కోరితే అది ఇవ్వడు. మన శక్తి సామర్థ్యాల్ని పరీక్షిస్తాడు. అవే కష్టాలు అనుకొంటాం మనం – మనకు శక్తి ఉంటే భగవంతుడు ఆకాశాన్ని బద్దలు కొట్టి ఇస్తాడు – అర్జునుడికి శివుడు ఇచ్చినట్లు!

ఆయుధాల్ని సమకూర్చుకొనేందుకూ, మన శక్తి సామర్థ్యాల్ని వెలికి తీసుకొనేందుకూ ఎదురయ్యే 'కష్టం కష్టం కాదు' అని గుర్తిస్తే మనం చేపట్టిన కార్యంలో తప్పక విజయం సాధించగలం. ❖

యువవాహిని

# వివేకానందకు విలువైన కానుక !

– స్వామి సేవ్యానంద

యువతరాన్ని స్వామి వివేకానంద ప్రేమించినంతగా బహుశా మరెవరూ ప్రేమించలేదేమో! తన అమూల్యమైన ప్రేమతో యువతరాన్ని బంధించిన యువనేత, మార్గదర్శకుడు, మిత్రుడు అయిన స్వామీజీకి నేటి యువతరం ఇచ్చే కానుక ఏమిటి?



**మాతృభూమిలో అరుణోదయం:** పంథొమ్మిదవ శతాబ్దంలో మనకు ఎదురైన విదేశీ సంస్కృతి తళుకుబెళుకులకు ముగ్ధులమై, మన ధర్మాన్ని దూషించడం మొదలుపెట్టాం. 'హిందూ ధర్మం' మూఢనమ్మకాల పుట్ట అనీ, ఆధునిక విజ్ఞానం ముందు ఇది నిలబడడం అసంభవమనీ ప్రచారం చేశాం.

ప్రపంచంలోని ఆధ్యాత్మిక సంపదను రక్షించే దివ్య అరుణోదయానికి మరోసారి సమయం ఆసన్నమైంది. శ్రీరామకృష్ణుల రూపంలో ఈ అరుణోదయం జరిగి, వివేకానందుని ద్వారా 'సనాతన ధర్మం' లోని నిగూఢమైన సత్యాలకు నూతన నిర్వచనాలను చెప్పింది. అంధకారంలో తడుముకుంటున్న ఆధునిక ప్రపంచానికి సరైన ఆధ్యాత్మిక మార్గాన్ని చూపించింది.

ఈ ఆధ్యాత్మికతను పునాదిగా చేసుకొనే మనం భారతమాతను విదేశీయుల బంధాల నుంచి విడిపించి, స్వేచ్ఛా సింహాసనంపై విరాజింపజేసాం. ఈ ప్రయత్నంలో మన యువతరం చూపిన ధైర్యసాహసాలు, త్యాగభావం మనం ఎన్నటికైనా మరచిపోగలమా? మన దేశానికి స్వాతంత్ర్యం తీసుకురావడమే మనం స్వామీజీకి ఇచ్చే కానుకా? దీనితో మన కర్తవ్యం పూర్తయిందా? లేదు. మాతృభూమి పట్ల మన బాధ్యత మరింత పెరిగింది.

**బాధ్యత అందరిదీ....** నేడు ఎన్నో రంగాలలో అభివృద్ధి చెందుతూ ముందుకు సాగుతున్న ఈ పవిత్ర భూమిలో జన్మించినందుకు మనమంతా గర్వపడాలి. అయితే, ఋషులకూ, మహర్షులకూ వారసులైన భారతమాత సంతానంలో చాలా మందికి (సుమారు 35 శాతం) ఇప్పటికీ ప్రాథమిక విద్య, వైద్య సదుపాయాలు అందడం లేదు.

టెలివిజన్, సినిమా, వార్తాపత్రికలు సమాజంలో వ్యతిరేక ఆలోచనలనూ, వినాశాత్మక భావాలనూ ప్రచారం చేయడానికి ప్రాధాన్యమిస్తున్నాయి. వీటి ప్రభావంతో నేటి యువతరం మన విలువైన ఆధ్యాత్మిక, సంస్కృతీ సంపదలకు దూరమై చుక్కాని లేని నావలా లక్ష్యం లేని జీవితాన్ని గడుపుతోంది. ఈ సమస్యలకు సమాధానం ఏమిటి?

దృష్టి మారితే సృష్టి మారుతుంది. అన్ని దోషాలకూ మన దేశాన్ని నిందించే స్వభావాన్ని వదిలిపెట్టి, ముందు మనం మారితే ఈ సమాజంలోని సమస్యలు వాటంతటవే సమసిపోతాయి.

**యువతరం ఇచ్చే కానుక:** ''బలవంతులూ, ఉత్సాహవంతులూ, శక్తిమంతులూ, అత్యంత నిజాయతీ పరులైన, జీవశక్తితో ఉట్టిపడే విశ్వాసపాత్రులైన యువకులు ఒక్క వందమంది లభిస్తే చాలు, యావత్తు ప్రపంచం మారుతుంది'' అని స్వామీజీ చెబుతారు. మనమంతా స్వామీజీ సైనికులమే! సర్వసంపదలకూ నిలయమైన భారతదేశాన్ని ప్రపంచంలో అగ్రస్థానానికి తీసుకువెళ్ళే బాధ్యత మనందరిపైనా ఉంది. మన మాతృభూమికి ఆయువుపట్టయిన ఆధ్యాత్మికతను ఆధారంగా చేసుకొని, స్వామీజీ ఇచ్చిన 'త్యాగము – సేవ' అనే మహామంత్రాన్ని ఆచరణలో పెడితే, కొద్ది రోజులలోనే విజయపతాకాన్ని ఎగురవేయగలం. మనలో ఉన్న అహంకారాన్నీ, స్వార్థస్వభావాన్నీ 'త్యాగం' చేసి, భరతమాతకూ, మానవ రూపంలో ఉన్న మాధవునికీ 'సేవ' చేయడానికై మన జీవితాలను అంకితం చెయ్యాలి. 'అశాంతి'తో వినాశనానికి చేరువవుతున్న నేటి ఆధునిక ప్రపంచానికి 'అభీ! అభీ! (భయపడవద్దు! భయపడవద్దు!!)'' అనే గంభీర సింహగర్జనలతో ధైర్యం చెప్పే వేదాంత వాక్కులను ప్రచారం చేసి, 'శాంతి'ని నెలకొల్పాలి.

ఇదే నేటి యువతరం స్వామి వివేకానందకు ప్రేమతో ఇచ్చే విలువైన కానుక! ❖

# మనసుతో మల్ల యుద్ధం!

'మనస్సు స్వాధీనానికి అడ్డుపడే ఆలోచనలు చెలరేగినప్పుడు, వాటికి వ్యతిరేకమైన ఆలోచనలను ఉపయోగించాలి' అని యోగాచార్యుడు బోధించాడు.

ఉదాహరణకు మీ మనస్సులో ఏదో కారణం వల్ల కోపం ఒక ఉప్పెనలా పైకి లేస్తున్నదనుకోండి. అది చాలాకాలం వరకూ మీ ప్రశాంతతను చెడగొట్టడమే కాక, మీ మానసిక స్థితికి గొప్ప హాని చెయ్యగలదు. దాన్ని చెదరగొట్టడం ఎలా? దానికి వ్యతిరేకమైన మరొక అలను సృష్టించడమే! ప్రేమపూర్వకమైన ఒక ఉత్తుంగ తరంగాన్ని దానికి ఎదురు పంపండి. కామం మీ మనసులో ఒక పెద్ద తరంగం లాగ ఎగిస్తే, దానికి ఎదురుగా పవిత్రమైన ఆలోచనలనే అలను లేపండి. ఒక మహాత్ముని పవిత్ర జీవితాన్ని గురించి గంభీరంగా యోచించడం ద్వారా మీరు అలాంటి తరంగాన్ని సృష్టించవచ్చు.

అయితే చెడు ఆలోచనలు పుట్టీపుట్టకముందే వాటికి వ్యతిరేకమైన మంచి ఆలోచనలను మనం తయారు చెయ్యాలి. కోపం మీ మనస్సులో ఒక చిన్న బుడగగా ఉన్నప్పటిదొక పరిస్థితి. మీరే ఆ కోపంగా మారిపోయినప్పటిది ఇంకొక పరిస్థితి. అవి చిన్న బుడగలుగా ఉన్నప్పుడే వాటికి వ్యతిరేకంగా మంచి ఆలోచనలను మనం తయారు చేసుకోవాలి. లేకపోతే ఈ పద్ధతి పనిచెయ్యదు. ఒకసారి చెడు ఆలోచనలు పెరగడానికి చాలినంత వ్యవధిని ఇచ్చిన తరువాత వాటిని ఎదుర్కోవడం కష్టం. మనం మన ఆలోచనలనూ, ఆవేశాలనూ ఎల్లప్పుడూ సూక్ష్మంగా, నిశితంగా గమనిస్తూ ఉండాలన్నమాట!

ఒక్కొక్కసారి మనం ముందుగా ఏర్పడుతున్న బుడగలను గమనించం. అవి పెద్ద అలలుగా మారిన తరువాతే వాటిని గమనిస్తాం. అలాంటి పరిస్థితులలో ఏం చెయ్యాలి? ఆ స్థితి నుంచి, ఆ ప్రదేశం నుంచి బయటకు వెళ్ళిపోయి, ఏకాంతంలో ఆత్మవిమర్శ చేసుకోవాలి. మన మనస్సును 'ఓ మనసా! ఇది నిన్ను సర్వనాశనం చేస్తుంది. ఈ విషయం నీకు అర్థం కావడం లేదా?' అని అడగాలి. ఈ ఆలోచనను మనస్సుపై బలంగా రుద్దగలిగితే మనస్సు చక్కగా ప్రవర్తించడం నేర్చుకుంటుంది. ఎందుకంటే దాని నాశనాన్ని అదే కొనితెచ్చుకోదు కదా!

ఒకసారి ఒక శిష్యుడు స్వామి బ్రహ్మానందజీని ఇలా ప్రశ్నించాడు: 'మనస్సులో కలవరపెట్టే ఆలోచన ఒకటి వదలకుండా వెంటాడుతూ ఉంటే ఏం చెయ్యాలి?' దానికి ఆయన ఇలా సమాధానమిచ్చారు:

" 'ఈ ఆలోచన నాకు అత్యంత అపాయకరమైనది. ఇది నా నాశనాన్ని కొనితెస్తుంది' అని ఆలోచించండి. ఈ ఆలోచనను మీ మనస్సుపై మళ్ళీ మళ్ళీ బలంగా ముద్రించండి. అప్పుడు మనస్సు ఆ కలవరపరిచే ఆలోచన నుంచి విముక్తి పొందుతుంది."

పదే పదే చెప్పే సూచనలకు మనస్సు లొంగిపోతుంది. దానికి మనం ఏది నేర్పితే అది నేర్చుకుంటుంది. విచక్షణ ద్వారా దానికి ప్రాపంచిక బంధాలలోని దుఃఖాన్నీ, ఆధ్యాత్మిక జీవనంలోని ఆనందాన్నీ, పరిపూర్ణతనూ వివరించి, దానిపై గట్టి ముద్ర వేయగలిగితే అప్పుడు మనస్సు తనను తాను మరింతగా భగవంతునికి సమర్పించుకుంటుంది.

మనస్సుతో జరిపే మల్లయుద్ధం కన్నా మనిషిని అలసిపోయేలా చేసేది మరొకటి లేదు. మనం ఎంతగా అలసిపోతామో మనస్సు అంతగా అల్లకల్లోలమవుతుంది. చివరికి మనమే దానిలో కొట్టుకుపోతాం. అలాంటి పరిస్థితిలో మనస్సును ఎదుర్కొని పోరాడడం సమంజసం కాదు. మరి ఏం చెయ్యాలి? మనల్ని మనం మనస్సుతో ఏకీభవించుకోవడం మానివెయ్యాలి. ఇదే చేస్తే మనం గొప్ప విజయం సాధించినట్లే.

మనల్ని మనం మనస్సుతో ఏకీభవించుకున్నంత కాలం, మన మనస్సును స్వాధీనం చేసుకోలేం. ఎప్పుడైతే మనల్ని మనం మనస్సు నుంచి వేరుగా భావిస్తామో అప్పుడిక దానికి అల్లరి చెయ్యడానికి ఎలాంటి అవకాశమూ దొరకదు. అప్పుడు మనసుతో జరిపే మల్ల యుద్ధంలో విజయం మనదే! ❖



## యువవాణి

**- స్వామి పరిజ్ఞేయానంద**

**డి. వేంకటేశ్వర రావు, పామఱ్ఱు**

**ప్రశ్న: నేను డిగ్రీ ఆఖరి సంవత్సరం చదువుతున్నాను. నాది అతిగా మాట్లాడే స్వభావం. అందువల్ల నా మాటలను ఎవరూ పట్టించుకోవడం లేదు. పైగా అందరూ నన్ను చులకనగా చూస్తున్నారు. నాకు జీవితం మీద అవగాహన ఉంది కానీ ప్రతి విషయాన్నీ తేలిగ్గా తీసుకుంటాను. ఈ సమస్యలకు సూచనలు ఇవ్వగలరు.**

**జవాబు:** ఏ విషయంలోనూ 'అతి' పనికిరాదు. హద్దులు దాటిన 'అతి' సునామీగా మారి మన జీవితాన్ని ముంచుతుంది. 'అతి' వ్యామోహం వల్ల రావణుడూ, 'అతి' రాజ్యకాంక్ష వల్ల దుర్యోధనుడూ, 'అతి' అభిమానం వల్ల కర్ణుడూ తమ వినాశనానికి తామే కారకులయ్యారు. కాబట్టి మన జీవితం తుదివరకూ సాఫీగా సాగాలంటే 'అతి' అనే పదాన్ని మన నిఘంటువు నుంచి తొలగించాలి.

**అతిగా తింటే అజీర్ణం, అసలు తినకపోతే నిర్వీర్యం.**
**అతిగా నిద్రిస్తే జడత్వం, అసలు నిద్రపోకపోతే అలసత్వం.**
**అతిగా మాట్లాడితే అవమానం, అసలు మాట్లాడకపోతే అనుమానం.**

'అతిగా తినడం, అసలు తినకపోవడం; అతిగా నిద్రపోవడం, అసలు నిద్రపోకపోవడం; అతిగా మాట్లాడడం, అసలు మాట్లాడకపోవడం- ఇలా అన్ని వ్యవహారాల్లో అతిగా ప్రవర్తించే వారికి మనోనిగ్రహం సాధ్యం కాదు. అలాంటివారు కార్యసిద్ధిని పొందడం అసాధ్యం'అంటాడు శ్రీకృష్ణుడు.

అతిగా మాట్లాడే అలవాటున్న భార్యాభర్తలిద్దరు భోజనం చేయడానికి కూర్చోగానే భర్త ఏదో వంకతో భార్యను నిందించడం మొదలుపెట్టేవాడు. భార్య కూడా మాటకు మాట బదులు చెప్పేది. అందువల్ల ఆ ఇద్దరి మధ్య రోజూ వాగ్యుద్ధం జరుగుతుండేది. ఈ సమస్య నుండి ఎలా బయటపడాలో చెప్పమని ఆమె ఒక వృద్ధురాలిని సలహా అడిగింది. అందుకు ఆ వృద్ధురాలు ఆమెకు ఒక ఔషధం (tonic) ఇచ్చింది. రోజూ భర్తకు భోజనం వడ్డించిన తరువాత రెండు చెంచాల మందుని తన నోట్లో వేసుకొని, పావుగంట తరువాత మింగమని చెప్పింది. ఆ వృద్ధురాలు చెప్పిన రోజునుంచే ఆమె ప్రయోగం ప్రారంభించింది. ఎప్పటిలాగే భర్త భోజనానికి కూర్చోగానే తిట్ల దండకం మొదలుపెట్టాడు. ఆమె నోటిలో మందు ఉండడం వల్ల భర్త మాటలకు బదులు చెప్పలేకపోయింది. ఇలా కొన్నాళ్ళు గడిచిన తరువాత వారిద్దరి మధ్య గొడవలు తగ్గాయి. అప్పుడు వృద్ధురాలు ఆమెతో ఇకపై మందు వాడనవసరం లేదని చెప్పింది. ఆమె మాట్లాడడం తగ్గిస్తే భర్త మారుతాడనే సంగతి ఆ వృద్ధురాలికి తెలుసు. ఇంతకీ ఆ మందు ఏమిటంటే... గ్లూకోజ్ నీళ్ళే!

అతిగా మాట్లాడడం, ప్రతిదాన్నీ తేలిగ్గా తీసుకొనే స్వభావం గల మీరు స్వామి వివేకానంద ఇచ్చిన ఈ సందేశాన్ని రోజూ నెమరు వేసుకుంటే మీ ఈ సమస్యల నుండి బయటపడగలరు.




Give up the awful disease that is creeping into your blood, that idea of ridiculing everything, that loss of seriousness. Give that up. Be strong and everything else is bound to follow. *- Swami Vivekananda*

జీవితంలో అన్ని అనర్థాలకూ ఆది 'అతి' అని గుర్తుంచుకొని వ్యవహరించిననాడు మనకు లక్ష్యంపై ఒక అవగాహన ఉండడమే కాదు దాన్ని సాధించడంలో పట్టుదల కూడా పెరుగుతుంది. అప్పుడు అందరూ మన మాటలకు విలువనిస్తారు, మనల్ని అభిమానిస్తారు, అభినందిస్తారు. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :
**యువవాణి**
**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**
**దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029**

మహనీయుల జీవితాల్లో

# మధురఘట్టాలు

- జి. సతీష్



## అసంభవమన్నది లేనే లేదు!

ఆల్ప్స్ పర్వతాలకు క్రింది భాగంలో ఉన్న ఒక గుడిసెలో ఒక వృద్ధురాలు నివసిస్తూ ఉండేది. నెపోలియన్ తన సైన్యంతో అటు రావడం చూసి, ఆమె బయటకు వచ్చింది. నెపోలియన్‌ను సమీపించి, "నాయనా! ఏ పని మీద బయలు దేరావు? దుర్గమమైన ఈ కొండను ఎక్కే సాహసం మాత్రం చేయవద్దు. తిరిగి వెళ్ళు. ఇంతకు ముందు అనేక మంది ఇలాగే ప్రయత్నించి ప్రాణాలను కోల్పోయారు" అంది.

నెపోలియన్ దృఢస్వరంతో, "అమ్మా! ఒకసారి అడుగు ముందుకు వేసిన తరువాత నేను వెనుకంజ వేయను. మార్గంలో ఎన్ని ఆటంకాలు, కష్టాలు రానీ! వాటిని అధిగమించి నేను ముందుకు సాగిపోతాను. ఈ కార్యంలో నేనే కనుక విజయం సాధిస్తే ప్రపంచం నన్ను కీర్తిస్తుంది. ఒకవేళ నేను మరణిస్తే కనీసం నీవైనా నా ధైర్య సాహసాలను మెచ్చుకొంటావు కదా. ఇక ఇప్పుడు నేను ఆగేది లేదు. నేను విజయం పొందాలని ఆశీస్సులను అందించు" అని నమస్కరించాడు.

వృద్ధురాలు గద్గదస్వరంతో "నాలోని అణువణువూ నిన్ను ఆశీర్వదిస్తోంది. నా ఆశీర్వాదాన్ని అందుకో. వీరుడవైన నీ కోరికను భగవంతుడు నెరవేరుస్తాడు. వెళ్ళు. సాహసంతో ముందుకు సాగిపో!" అని నెపోలియన్‌తో అంది.

నెపోలియన్ వెంటనే తన సైన్యంతో ఆల్ప్స్ పర్వతాలను దాటి శత్రువులపై దాడి చేశాడు. విజయం సాధించాడు. అసంభవమన్నది తన నిఘంటువులో లేదని నిరూపించాడు ఆ యోధుడు. ❖



## పురోగతికి అవరోధం...

రామానుజాచార్యులు శారీరకంగా చాలా దుర్బల మైనవారు. నదీస్నానం ఆయనకు నిత్యకృత్యం. స్నానానికి వెళ్ళేటప్పుడు ఒక బ్రాహ్మణుని భుజంపై చేయివేసి వెళ్ళేవారు. వచ్చేటప్పుడు ఒక శూద్రుని భుజంపై చేయి వేసి వచ్చేవారు. జనులు ఆశ్చర్యంగా చూసేవారు. ఒకరు ఆయనతో, 'స్వామీ! తమరు స్నానం చేసి ఏం లాభం? శూద్రస్పర్శతో తాము అపవిత్రం అవుతూనే ఉన్నారు కదా!" అని అడిగారు.

ఆచార్యుల వారు మందహాసం చేసి, "స్నానం వల్ల నా దేహం మాత్రమే శుభ్రం అవుతోంది. మనస్సులోని మాలిన్యం పోవడం లేదు. ఇతరుల కన్నా నేను గొప్పవాణ్ణి అనే భావన అహంకారం అనిపించుకుంటుంది. మనిషి పురోగతికి ఈ ఆధిక్యభావన అన్నింటినీ మించిన ఆటంకం. స్నానం చేసి దేహమాలిన్యాన్ని పోగొట్టుకున్న తరువాత నేను శూద్రుణ్ణి తాకి నా అహంకారాన్నీ, మనోమాలిన్యాన్నీ తొలగించు కుంటున్నాను. నేను ఎవరి కన్నా గొప్పవాణ్ణీ కాను. నా కన్నా ఎవరూ తక్కువ వారూ కారు. నా కన్నా శూద్రుడు కూడా శ్రేష్ఠుడే అనే భావన వల్ల నాకు ఆనందం లభిస్తుంది" అన్నారు.

రామానుజాచార్యుల వారి వినమ్ర స్వభావానికి శ్రోతలు ముగ్ధులై, శ్రద్ధాభక్తులతో తలలు వంచి నిలుచుండి పోయారు. ❖







# విద్యలో విలువల ఆవశ్యకత

– డాక్టర్ కమల ఎస్. జయరావు

విలువలు అంటే ఏమిటి? సత్యవచనం, నిజాయతీ, చిత్తశుద్ధి, వినయం, నిర్భయత్వం, మనోస్థైర్యం, దయ, ప్రేమ, ఇంద్రియ నిగ్రహం మొదలైన లక్షణాలే విలువలు అని పేర్కొనవచ్చు. ఈ విలువల్ని జీవితంలో ఆచరించడం వల్లనే శీలనిర్మాణం సాధ్యమవుతుంది.

పిల్లల శీలనిర్మాణంలో విద్యకు ప్రధాన పాత్ర ఉంది. విద్య అంటే సాధారణంగా బడిచదువు–నియత విద్య. నిజానికి, విలువల్ని పెంచే విద్య ఇంట్లోనే ప్రారంభమవుతుంది. "బాలుడు నడవవలసిన తోవ వాడికి నేర్పు, వాడు పెద్దవాడైన పిదప దాని నుండి తొలగిపోడు!" అన్నది బైబిలు వాక్యం. "మొక్కై వంగనిది మానై వంగునా!" అనే సామెత తెలుగులో ఉంది. తల్లి తండ్రులు, ఇంట్లోని ఇతర పెద్దల నుండి పొందిన శిక్షణ పిల్లల శీలనిర్మాణానికి పునాది. మన దేశంలో ప్రస్తుతం పిల్లల్ని రెండు మూడేళ్ల వయస్సులోపే బడికి పంపుతున్నాం. ఇది పొరపాటు. ఆ వయస్సులోని పిల్లలకు ఏది చేయవచ్చునో, ఏది చేయరాదో చెప్పినా అర్థం చేసుకొనే శక్తి ఉండదు. పిల్లలకు సహజంగానే వారి పరిసరాల పట్ల చాలా కుతూహలం ఉంటుంది. శీల నిర్మాణమంటే, ఈ కుతూహలాన్ని నాశనం చేయకుండానే పిల్లల ఇంద్రియాలను అదుపులో పెట్టగలగటం, మరొక విధంగా చెప్పాలంటే "అహం – నేను అనే భావం 18 నుండి 24 నెలల వయస్సులో అభివృద్ధి చెందటం మొదలవుతుంది. ఈ అహంభావాన్ని ఇంటి వాతావరణంలోనే అదుపు చేయ ప్రయత్నించటం శ్రేయస్కరం. బుడి బుడి నడకలు, పరుగులు నేర్చిన 20, 30 మంది పిల్లలను ఒక్క తరగతి గదిలో అదుపు చేయ ప్రయత్నించడం కష్టంతో కూడుకొన్నపని. అందువల్ల పిల్లలు అదుపు తప్పి క్రమశిక్షణా రహితులైనా అవుతారు, లేదా పూర్తిగా అణగారి పోయి వారు స్వతంత్రంగా ఆలోచించే శక్తినైనా కోల్పోతారు. ఈ వయస్సులో బడిలోని శిక్షణ ఇంద్రియజ్ఞానాభివృద్ధికి తోడ్పడుతుందేకాని శీలనిర్మాణానికి ఉపయోగపడుతుందనలేం. 40, 50 సంవత్సరాల క్రితం వరకూ భారతదేశంలో బాల బాలికలకు ఐదు ఏళ్ళ వయస్సులో అక్షరాభ్యాసం చేయించి, బడికి పంపేవారు. ఈ పద్ధతి నేటికీ చాలా పాశ్చాత్యదేశాలలో పాటిస్తున్నారని చెప్పుకుంటారు. మనం పూర్వపద్ధతిని మరలా ఎంత త్వరగా ప్రారంభిస్తే అంత మంచిది.

స్థిరమైన బలమైన శీలం కల జాతి మాత్రమే గొప్పది కాగలదు. పాశ్చాత్య దేశాలలో జాతీయజీవనమనే కట్టడాన్ని బలమైన స్తంభాలు పటిష్ఠంగా నిలిపి ఉంచాయని స్వామి వివేకానంద అన్నారు. అది పంథొమ్మిదవ శతాబ్దం నాటి మాటే కానీ, భారతదేశంతో పోలిస్తే అవి నేటికీ గట్టిగానే ఉన్నాయని చెప్పవచ్చును. పూర్వం మనదేశ పరిస్థితి ఇంత గర్హనీయంగా లేదు. జాతి తన సుదీర్ఘ చరిత్రలో దారుణ విపర్యయాలను, ఒడిదొడుకులను ఎదుర్కొనగలిగిందంటే ఆనాడు ప్రజలకున్న గొప్ప శీలమే కారణం. ఆ శీలం ఈనాడు దుర్బలమైంది. స్వాతంత్ర్యోద్యమ కాలంలో ఈ పుణ్యభూమిపై నడిచిన పురుషులు, స్త్రీలు గొప్ప శీలవంతులు. ఈనాడు జాతి మనోఫలకం నుండి వారి

స్మృతులను, ఉనికిని ఇంత సులభంగా ఎలా తొలగించుకొన్నామో ఆలోచిస్తే దుఃఖమూ, ఆశ్చర్యమూ కూడా కలుగుతాయి. పోతే నడుము విరిగే ఆర్థిక సామాజిక భారాలను మోస్తున్న మన గ్రామీణులలోనూ, చాలావరకు నగర బస్తీ ప్రజలలోనూ నిజమైన భారతీయ శీలం ఇంకా స్పష్టంగా కనవబడుతున్నదన్నది ముదావహం. విద్యావంతులమని చెప్పుకునే నగరవాసులలోనే శీలం క్షీణిస్తున్నది. దీనిని పరమపూజ్యులు స్వామి రంగనాథానంద మహరాజ్ గారు “నాకు, నావారికి, – మిగతా వారేమైతే నాకేమి’ అనే భావంగా పేర్కొనేవారు.

మధ్యతరగతి ప్రజలు జాతి వెన్నెముకవంటి వారు. కనుక వారి పిల్లలకే శీలబోధన ఆవశ్యకత ఎక్కువగా ఉంటుంది. ఈ పిల్లలే ఇంట్లో నేర్పబడిన మంచి విలువలకూ, సమాజంలో కనపడే తద్విరుద్ధ ఆచరణకూ గల భేదం మూలంగా విపరీత సంఘర్షణకు లోనవుతారు. ఈ తరగతి ప్రజలలో శీలం పునాదులు ఎందుకు త్వరితంగా కూలిపోతున్నాయో విశ్లేషించవలసిన ఆవశ్యకత ఉంది. మన జాతి రుగ్మతలకు బ్రిటీషువారు ప్రవేశపెట్టిన విద్యావిధానాన్ని నిందించటం మనకు పరిపాటి అయింది. పోతే స్వామి వివేకానంద, గాంధీ మహాత్ముడు, తదితర మహానుభావులు సైతం ఈ విద్యనే అభ్యసించారన్నది విస్మరించరాదు. కనుక బ్రిటీషు వారినే నిందించడం సరైన పద్ధతి కాదేమో! అసలు సంగతి ఏమిటంటే, నేటి విద్యావిధానంలో విజ్ఞాన శాస్త్రానికి ఇవ్వవలసిన ప్రాధాన్యం కంటే ఎక్కువ ఇస్తున్నాం. తత్కారణంగా, ‘ఆర్ట్స్’గా చెప్పబడుతున్న శాస్త్రాలను చిన్నచూపు చూస్తున్నాం. దేశ చరిత్ర, సంస్కృతి తెలిసి ఉండటం శీలనిర్మాణంలో ప్రముఖపాత్ర పోషిస్తుంది. సాంస్కృతిక వారసత్వానికి పిల్లలకు ఉన్న ప్రవేశద్వారాలు రెండు. ఒకటి మానవ సంబంధ శాస్త్రాలు, రెండు లలిత కళలు. నేడు తల్లితండ్రులు ఈ రెండింటినీ నిర్లక్ష్యం చేస్తున్నారు. శాస్త్ర సాంకేతిక రంగాలే ప్రధానమని, వాటికే పెద్దపీట వేసే అనారోగ్యకరమైన వాతావరణం సమాజంలో నెలకొన్నది. శాస్త్ర సాంకేతిక రంగాలకు మానవీయతతో సంబంధం ఉండదు. శీలం వ్యక్తిగతమైనది.



మా తరం నగర వాసులకు బడిలో ఇంగ్లీషులో నర్సరీ రైమ్స్, మాతృభాషలో సుభాషితాలు, నీతి శతకాలు నేర్పేవారు. అర్థం తెలియకపోయినా, చిలుకల్లాగ ఉల్లాసంగా అన్నీ నేర్చుకునేవారం. ఇంగ్లీషు పద్యాలు భాషాపరిజ్ఞానానికి తోడ్పడుతాయనీ, మాతృభాష పద్యాలు విలువలు బోధించేవిగా ఉన్నాయనీ పెద్దయిన పిదప తెలిసుకొన్నాం. నేటి ప్రపంచంలో ఇంగ్లీషు భాష ఒక ముఖ్యమైన అవసరమే. అయినప్పటికీ, దానిని తలపై పెట్టుకొని మాతృభాషకు దూరమవడం శోచనీయం. తత్ఫలితంగా జాతికి సాంస్కృతిక వారసత్వంతో ఏమాత్రం పరిచయం లేకుండా పోతున్నది. ఈ తరం తల్లితండ్రులకే కాదు, అధిక శాతం తాతా నాయనమ్మలకు, అమ్మమ్మలకు సైతం మన పురాణాలలోను, ఇతిహాసాలలోను ఉన్న ఆసక్తికరమైన కథలు తెలియనే తెలియవు. పూర్వం నీతికథలు, పద్యాలు, జానపదగాథలు తల్లితండ్రులు చెప్పడం పిల్లలు వినడం జరిగేది. ఈ సంప్రదాయం ఇప్పుడు కనుమరుగు అవుతున్నది. ఇటువంటి సాహిత్యం బోధనాంశంగా కాకపోయినా, విలువల్ని పెంచేందుకూ, శీలనిర్మాణానికీ ఉపకరించేది. కొన్ని ప్రచురణ సంస్థలు, ఆధ్యాత్మిక సంస్థలు ఈ సాహిత్యాన్ని సమాజంలో తిరిగి ప్రవేశపెట్టటానికి ప్రయత్నం చేస్తున్నాయి. ఇది ప్రశంసనీయమే కానీ ఇంత మాత్రమే సరిపోదు. ఈ సాహిత్యాన్ని బాలల సాహిత్యంగా భావించి, చిన్నచూపు చూడక దాని విలువను తల్లితండ్రులు గుర్తించాలి.

నేడు శీలనిర్మాణానికి ప్రధాన ఆటంకాలు మూడు:

1. వినియోగదారీ తత్త్వం (కన్స్యూమరిజం).
2. ప్రసార మాధ్యమాలు.
3. అవినీతి, అన్యాయాలు. ❖

**( శీలనిర్మాణానికి ఆటంకాలుగా నిలిచే ఈ మూడు అంశాలపై వివరణ వచ్చే సంచికలో...)**



## నా జీవితంలో స్వామి వివేకానంద

# స్వామీజీ ఇచ్చిన అస్త్రాలు

– మసనం సీతారామయ్య



మా ఊరు కృష్ణా జిల్లా, చాట్రాయి మండలంలో చిట్టచివరి గ్రామం చిన్నంపేట.

మా నాన్న గారైన మసనం సత్యనారాయణకు ఆధ్యాత్మిక చింతన ఎక్కువ. వారు నా చిన్నతనం నుంచి భారత, రామాయణ, భాగవత, భగవద్గీతలలోని అంశాలను పర్వదినాలలో పురాణ కాలక్షేపాలుగా చెబుతూ, గ్రామస్థులకు ఆధ్యాత్మిక చింతన కలుగజేస్తున్నారు. ఆ క్రమంలో నాన్నగారు స్వామి వివేకానందుల 'సందేశ తరంగిణి' మూడు భాగాలు తెప్పించుకొని చదివారు. ఆ రోజుల్లో నేను 10వ తరగతి చదువుతున్నాను. అప్పట్లో చిన్న చిన్న నవలలు చదివే అలవాటున్న నేను 'సందేశ తరంగిణి'ని కూడా చదివాను. నవలల్లో లేని సందేశాత్మక సమాచారం అందులో ఉందని గ్రహించగలిగాను. కర్తవ్యబోధ కొంత, అర్థం కాని వేదాంతం, నవలల్లో లేని కొత్తదనం కనిపించాయి. అలా వివేకానందుల వారి పుస్తకాలు తరచూ చదువుతుండేవాడిని. కాలక్రమంలో బి.కామ్, బి.ఇడి. పూర్తిచేసుకొన్నాను. ఉపాధ్యాయునిగా కృష్ణా జిల్లాలోని విస్సన్నపేట మండలంలో జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాలలో పనిచేస్తున్నాను. అప్పటి నుంచి స్వామి వివేకానందుల భావాలను విద్యార్థులలో జొప్పిస్తున్నాను.

"భారత మాత బిడ్డగా పుట్టి, మాత చల్లని ఒడిలో కమ్మగా పెరిగి, తల్లి స్తన జ్ఞానామృతం తాగి, ఉన్నత శిఖరాలను అధిరోహించి, మాత పరమ వైభవ స్థితి కోసం పాటుపడని ప్రతి వ్యక్తీ దేశద్రోహే" అనే స్వామీజీ ఆవేదనా భరిత సందేశాన్ని నరనరాన జీర్ణింప చేసుకొన్నాను. అప్పటి నుండీ 'ఇనుప కండరాలు, ఉక్కు నరాలు, వజ్రతుల్యమైన మనస్సు, త్యాగం, శీలం, సేవ, అకుంఠిత దీక్ష' అనే అస్త్రాలాంటి స్వామీజీ వచనాలను విద్యార్థులకు అందిస్తున్నాను. స్వామీజీ స్ఫూర్తి భావనలను విద్యార్థులకు అందించగలగడం నా పూర్వజన్మ సుకృతం! ❖

మసనం సీతారామయ్య, విస్సన్నపేట, కృష్ణా జిల్లా

# 'స్ఫూర్తి భావనలకు స్వాగతం'



**జీర్ణమయిన దుస్తుల్ని త్యజించినట్లు ఈ శరీరాన్ని త్యజించినా నా భావాలతో ముందు తరాలను నిరంతరం చైతన్య పరుస్తూనే ఉంటాను అనేవారు స్వామి వివేకానంద. విశ్వానికే ఆత్మవిశ్వాసాన్ని ప్రబోధించిన యుగపురుషుడాయన. ఆబాల గోపాలాన్నీ ఉత్తేజపరిచే ఉత్తుంగ చైతన్య సాగరం స్వామీజీ.**

**స్వామి వివేకానంద ఈ ప్రపంచం నుంచి భౌతికంగా నిష్క్రమించి ఒక శతాబ్దం అయినా వారి స్ఫూర్తి మాత్రం ఆచంద్రార్కం మనల్ని మేల్కొలుపుతూనే ఉంటుంది. అలా ఆ మహనీయుని జీవితంతో ఉత్తేజితులైన వారి అనుభూతులకు, అనుభవాలకు 'శ్రీరామకృష్ణ ప్రభ' స్వాగతం పలుకుతోంది.**

**స్వామి వివేకానంద జీవితంలోని ఒక సంఘటన కావచ్చు, సంభాషణ కావచ్చు.... ఉత్తరం కావచ్చు, ఉపన్యాసం కావచ్చు... ఏదైనా మిమ్మల్ని మహత్తరంగా ప్రభావితం చేసి ఉంటుంది. ఆ అనుభూతిని, అనుపమానమైన స్ఫూర్తిని 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులతో పంచుకోండి.**

**సమస్యల సాగరంలో చిక్కుకొని చుక్కాని లేని అగమ్యగోచరమైన నేటితరానికి స్వామి వివేకానంద సాహిత్యం ఆశాదీపమని మీ అనుభవాలు నిరూపిస్తాయి. మీ అనుభవాలను, అనుభూతులను వ్రాసి మీ ఛాయాచిత్రం (కలర్ ఫోటో)తో సహా పంపిస్తే 'నా జీవితంలో స్వామి వివేకానంద' అనే శీర్షికలో ప్రచురిస్తాం.**

మీ అనుభవాలను, భావనలను పంపవలసిన చిరునామా

**'నా జీవితంలో స్వామి వివేకానంద'**

**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**

**దోమల్ గూడ, హైదరాబాద్ - 500 029**



# అపజయాలు విజయభవనానికి సోపానాలు

– డా॥కరిమద్దెల నరసింహారెడ్డి

ఛిన్నోऽపి రోహతి తరుః
క్షీణోऽ పృపచీయతోపునశ్చంద్రః
ఇతి విమృశంతః సంతః
సంతప్యంతే న విప్లుతా లోకే
– భర్తృహరి

"చెట్టుని నరికినా అది తిరిగి చిగురిస్తుంది. చంద్రుడు క్షీణించినా తిరిగి వృద్ధి చెందుతాడు అని తలచి లోకంలో సజ్జనులైనవారు దుఃఖించరు. కష్టాలు వచ్చినా, అపజయాలు ఎదురైనా బాధపడరు". "No pain no gain, No rain no grain – కష్టాలు లేకుండా ఫలితాలురావు, వర్షాలు పడకుండా పంటలు పండవు" అని అంటారు అనుభవజ్ఞులు.

"Every successful person has a painful story.
Every painful story has a successful ending"

బాధపడకుండా ఎవరూ విజయం సాధించలేరు. విజయం సాధించిన వారందరూ బాధపడినవారే అన్నమాట కేవలం నోటిమాట కాదు, ఉన్నమాటే! విజయాన్ని తెలిపే ప్రతీ కథలోనూ అపజయాన్ని గురించిన కథదాగి ఉంటుంది. చరిత్రను అధ్యయనంచేస్తే విజయాన్ని తెలిపే కథలన్నీ అపజయాన్ని కూడా తెలిపేవిగా ఉంటాయి. విజేతలందరూ అపజయాలను సోపానాలుగా చేసుకొని విజయభవనంలోకి ప్రవేశించినవారే. వారందరిలో అగ్రగణ్యుడు అబ్రహాం లింకన్.

## అధ్యక్ష పదవిని అందించిన లింకన్ పరాజయాల పరంపర

1830 నుంచి 1859 వరకు అబ్రహాం లింకన్ వరుసగా వ్యాపారంలోనూ, ఉద్యోగ ప్రయత్నంలోనూ, రాజకీయాల్లోనూ ఎన్నో అపజయాల్ని చవిచూశాడు. చివరికి 1860లో అమెరికా అధ్యక్షునిగా విజయం సాధించాడు.

ఇన్ని అపజయాలు ఎదురైనా, ఎన్ని ఓటముల పాలైనా లింకన్ బాధపడలేదు. చెట్టును స్ఫూర్తిగా తీసుకున్నాడు. చివరికి విజయభవనంలోకి ధీరగంభీరంగా ప్రవేశించాడు.

## విమానాల రూపకల్పనలో రైట్ సోదరులు

రైట్ సోదరులు విమానాన్ని కనిపెట్టేటప్పుడు చాలాసార్లు అపజయం పాలయ్యారు. 1903 డిసెంబరు 17న ఉదయం వారు తయారు చేసిన విమానం 12 సెకెండ్లు మాత్రమే ప్రయాణించి పడిపోయింది. రెండవసారి 59 సెకెండ్లలో 852 అడుగులదూరం పయనించి పడిపోయింది. మూడవసారి అసలు ఆకాశంలోకి ఎగరనేలేదు. 1908లో రెండు గంటల ఇరవై నిమిషాలపాటు ఆకాశంలో ఎగిరి పడిపోయింది. చివరికి 1909 నాటికి రైటు సోదరులు పలు దేశాల్లో, ప్రదేశాల్లో తమతోపాటు ఇతరులను కూడా తీసుకొని వెళ్ళే విమానాన్ని నడిపించారు. 1911 వరకూ విమానాల తయారీలో వారికి తిరుగులేదు. తర్వాత యూరప్ దేశాలు సొంతంగా విమానాలను తయారు చేసుకోవడం ప్రారంభించాయి.

## 'మిక్కీమౌస్' రహస్యం

కార్టూనిస్టు వాల్ట్‌డిస్నీ తన బొమ్మలను విక్రయించడానికి ఎందరో పత్రికా సంపాదకుల చుట్టూ తిరిగాడు. ఒక్క బొమ్మను కూడా అమ్మలేకపోయాడు. అపజయం అతనిని ఆవరించి బాధించింది. ఒకరోజు అతనిని ఒక చర్చి ఫాదర్ కొన్ని కార్టూన్లు వేసివ్వమని కోరాడు. చర్చిదగ్గర ఒక షెడ్డులో డిస్నీ నివసించేవాడు. ఆ షెడ్డులో ఎలుకలు తిరుగుతూ ఉండేవి. ఒకరోజు ఒక ఎలుక పై నుండి కిందికి దూకింది. దూకేటప్పుడు దానికి చొక్కా ఒకటి తగులుకుంది. దాని నుండి తప్పించుకోవడానికి అది తంటాలు పడుతుండగా డిస్నీ చూశాడు. అతడు దాన్ని కార్టూన్‌గా గీసాడు. అదే ప్రపంచ ప్రఖ్యాతి చెందిన మిక్కీమౌస్.



Failure is the womb of success
Failure is the high way to success
Failure is the stepping stone to success. ❖

# అవకాశం సర్వాంతర్యామి

- గంపా నాగేశ్వర్ రావు



అవకాశాలను గమనించి అందుకోవడంలోనే మన విజయం ఆధారపడి ఉంది.

ఒక కుర్రవాడికి చిన్నతనం నుండీ అతని తల్లితండ్రులు ఎలాంటి కష్టం వచ్చినా భగవంతుడిని ప్రార్థిస్తే ఆయన తప్పక మనల్ని రక్షిస్తాడని బోధించేవారు. కాలగమనంలో అతను పెద్దవాడయ్యాడు. అతని తల్లితండ్రులు కాలధర్మం చెందారు. ఇలా ఉండగా ఒకనాడు తుఫాను వచ్చి వారి ఊరంతా జలమయమయ్యింది. ప్రజలంతా తట్టా బుట్టా సర్దుకుని ఆ ఊరు వదిలి వెళ్ళిపోతున్నారు.

"సోముడూ! మా బండిలోకి ఎక్కు త్వరగా వెళ్ళిపోదాం లేదంటే ఈ నీటిలో మునిగిపోతావు" అంటూ ఆహ్వానించాడు అతని పొరుగువాడు. "లేదు బాబాయ్! నేను దేవుడి కోసం ఎదురుచూస్తున్నాను" అని సమాధానమిచ్చి తన మేడమీదకి ఎక్కాడు అతడు. కొంత సమయానికి ఆ ఊరంతా జలమయమయ్యింది. కొంతమంది పడవలో వెళుతూ అతనిని తమ పడవలోకి ఎక్కమని ఆహ్వానించారు. కానీ అతను అక్కడి నుండి కదలలేదు. నీటి మట్టం పెరుగుతూనే ఉంది. అతను మాత్రం భగవంతుని కోసం ఎదురు చూస్తూనే ఉన్నాడు. చివరికి హెలీకాప్టర్ నుండి నిచ్చెన జారవిడిచి ఎక్కమన్నా అతను ఎక్కలేదు. దాంతో అతను చనిపోయి స్వర్గానికి చేరాడు. అక్కడ దేవుడిని చూడగానే కోపంగా "నేను నిన్ను నమ్ముకొని ఉంటే నువ్వు మాత్రం నన్ను రక్షించడానికి రాలేదు" అని నిందించాడు.

భగవంతుడు చిన్నగా నవ్వి "నాయనా! నేను నీ కోసం ఒక బండినీ, పడవనీ, హెలికాప్టర్‌ని కూడా పంపాను. కానీ వాటిని నువ్వు ఉపయోగించుకోలేదు. దానికి నేనేం చేయను" అని ప్రశ్నించాడు.

అర్థమయిందా? మనలో చాలా మంది పై కథలోని వ్యక్తిలాగ ఎదురుగా ఉన్న అవకాశాలను కూడా పట్టించుకోవడం లేదు. మీ లక్ష్యం ఒక కోటి రూపాయలు సంపాదించడం కావచ్చు. కాని మీ వద్దకు వెయ్యి రూపాయలు సంపాదించగలిగే అవకాశం వచ్చినప్పుడు దానిని ఉపయోగించుకోవాలి. అంతేగాని "ఇది నా స్థాయికి సరిపోని పని" అనో లేక మరొకటో అని మీరు దానిని నిర్లక్ష్యం చేయకూడదు. ఏమీ లేనప్పుడు దొరికిన దానినే మనం ఆలంబన చేసుకోవాలి. ఆ తరువాత అంతకన్నా మంచి అవకాశం దొరికినప్పుడు దానిని అందుకోవాలి. ఇలా వచ్చిన అవకాశాలను ఉపయోగించుకుంటూ వెళ్ళడమే విజేత లక్షణం. కావాలంటే మీరు ఏ విజేతనైనా గమనించండి. వారు తమకు వచ్చిన చిన్న చిన్న అవకాశాలను ఉపయోగించుకుంటూ నేడీ స్థాయికి వచ్చారు. కాబట్టి ఏ అవకాశాన్నీ నిర్లక్ష్యం చెయ్యవద్దు.

అవకాశాలనేవి నిశ్శబ్దంగా వస్తాయి. వాటిని గుర్తించి ఉపయోగించుకునే బాధ్యత మనదే. ❖

## పండుగలు - పర్వదినాలు

### ఏప్రిల్- 2009

| | | |
|---|---|---|
| 03 | శుక్రవారం | : శ్రీరామనవమి |
| 05 | ఆదివారం | : ఏకాదశి |
| 21 | మంగళవారం | : ఏకాదశి |
| 27 | సోమవారం | : అక్షయ తృతీయ |
| 29 | బుధవారం | : ఆది శంకరాచార్యుల జయంతి |

### మే- 2009

| | | |
|---|---|---|
| 05 | మంగళవారం | : ఏకాదశి |
| 07 | గురువారం | : నృసింహ జయంతి |
| 09 | శనివారం | : బుద్ధపూర్ణిమ |
| 19 | మంగళవారం | : హనుమజ్జయంతి |
| 20 | బుధవారం | : ఏకాదశి |

...17వ పేజీ తరువాయి.


ఊరి మధ్యలో ఏర్పాటు చేసిన త్రాసు వద్ద ప్రజలు బంగారంతో బారులు తీరారు. ఒక వ్యక్తి కొంత బంగారాన్ని త్రాసులో వేశాడు. అప్పుడు ఒక అద్భుతం జరిగింది!
అరే! ఎంత బంగారం వేసినా గుమ్మడి కాయకు సరితూడగం లేదే! ఎంత ఆశ్చర్యం!!
ఇంకొక వ్యక్తి కొద్దిగా వేయగానే త్రాసు తులతూగింది.
ఇదేదో అతీత శక్తి ఉన్న ధర్మకాటాలా ఉంది. న్యాయంగా ఎంత బాకీ ఉన్నామో అంత బంగారాన్నీ చెల్లిద్దాం!
ఈ సంగతి రాముడికి తెలిసింది. రాముడు, లక్ష్మణుణ్ణి పిలిచి...
ఒకే గుమ్మడి కాయ బరువు ఇన్ని రకాలుగా తూగుతోందా? అదెలా సాధ్యం! దీనిలో ఏమైనా మోసం ఉందా? ఇందులో మీ ప్రమేయమేమీ లేదు కదా?
అన్నగారూ! ఇదంతా ధర్మ దేవత ఆజ్ఞానుసారమే జరిగింది.


అప్పుడే... "అవును! ఇందులో అధర్మం అంటూ ఏమీ లేదు" అని ఆకాశవాణి పలికింది.
ఎవరెంత చెల్లించాలో, ధర్మ దేవత దగ్గరుండి మార్గదర్శనం చేస్తుంటే హనుమంతుడు త్రాసు ముల్లును సరియైన దిశగా కదిపాడు. కాబట్టి ఎవరికీ అన్యాయం జరిగే అవకాశం లేదు!
లక్ష్మణుడు ఇచ్చిన సమాధానంతో రాముడు సంతుష్టుడయ్యాడు. ప్రజలు చెల్లించిన పన్నులతో ఖజానా అంతా నిండిపోయింది.
అప్పటి దాకా అదృశ్యంగా ఉన్న హనుమంతుడు ప్రత్యక్షమై, శ్రీరాముడికి పాదాభివందనం చేశాడు.
మీ అనుమతి లేకుండా ఈ సాహసం చేసినందుకు క్షమించండి స్వామీ.
లేదు హనుమా! నేనే తొందరపడ్డాను ఎప్పుడూ ధర్మమే జయిస్తుంది.

# గ్రంథ పరిచయం

హైదరాబాద్ రామకృష్ణ మఠం వారి

## నూతన ప్రచురణలు

ప్రతులకు : తెలుగు ప్రచురణల విభాగం
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్- 500 029
Email : rktelugubook@gmail.com ఫోన్. 040-2763 1149

## ముండకోపనిషత్తు



వ్యాఖ్యాత : స్వామి జ్ఞానదానంద
పేజీలు : 96, వెల : 20/-

మన ప్రాచీన ఋషివరేణ్యుల అనుభవపూర్వక సత్యాలే ఉపనిషత్తులుగా పేర్కొనబడ్డాయి. నిజమైన సాధనామయ జీవితాన్ని గడుపుతూ, మనశ్శరీరాలను పావనం చేసుకుని భగవదభిముఖంగా మనం ముందుకు సాగేకొద్దీ ఉపనిషత్తులలోని ఆంతరిక సత్యాలు మనకు అవగతం కానారంభిస్తాయి.

నీడను నిజంగా ఎంచి దాని వెనుక మనం పరుగులెత్తుతున్నాం. అపమార్గంలో చేసే ఈ పయనమే మన నిరాశలకూ, నిస్పృహలకూ, కష్టనష్టాలకూ కారణం. 'నీడను వీడి నిజాన్ని చూడు' అని ఈ ఉపనిషత్తు ఉపదేశిస్తున్నది.

శరీరం, మనస్సు, ఆత్మ ఇత్యాదిచే రూపొందిన వాడు మనిషి. వీటిలో శరీరమూ, మనసు నశించిపోయేవి, నీడ. ఆత్మ నశించనిది, నిజం. నీడలో మనం తాదాత్మ్యం చెందడాన్ని వదలిపెట్టి, నిజంతో తాదాత్మం చెందమంటున్నది ఈ ముండకోపనిషత్తు. సాధారణ జ్ఞానం - ఉన్నత జ్ఞానం, భోగమూ-సన్న్యాసమూ, జ్యోతి-జ్వాల, నిన్ను తెలుసుకో, నీడ-నిజం, భగవదనుభూతి- అనే ఆరు శీర్షికల క్రింద ఈ ఉపనిషత్తు వ్యాఖ్యానించబడింది. ప్రతి ఒక్కరూ అలవోకగా అర్థం చేసుకోవడానికి అనువుగా వ్యాఖ్యానం సులభశైలిలో సాగింది. ❖

- బ్రహ్మచారి హేమంత్

## పరమశివుడు
### తత్త్వము, స్తోత్రములు



పేజీలు :120, వెల:15/-

గమనిక : ప్రతులకు పై చిరునామాను సంప్రతించండి.
పై పుస్తకాలను పోస్ట్‌లో పొందగోరేవారు పోస్ట్ ఖర్చుల నిమిత్తం రూ.20/- అదనంగా పంపవలెను.

స్వయంభువు మల్లాం

## శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి మాహాత్మ్యం

రచయిత : అప్పాజీ వేంకట సుబ్రహ్మణ్యం, పేజీలు : 148, వెల: రూ. 25/-, ప్రాప్తిస్థానము: శ్రీ శరవణభవ నిలయం, 1-4-54, బ్రాహ్మణవీధి, నాయుడుపేట, నెల్లూరు జిల్లా.



యోగసాధకులకు "శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామి'' వారు ఆరాధ్యదైవం. స్వామివారి విశేషాలు శివపురాణం, స్కంద పురాణాల్లో మనం చూడవచ్చు. మల్లాం నెల్లూరు జిల్లాలో ఉంది. ఇక్కడ ఉన్న శ్రీ సుబ్రహ్మణేశ్వర స్వామి స్వయంభువు. రచయత ఈ గ్రంథంలో శ్రీ సుబ్రహ్మణ్యుని పూర్వజన్మవృత్తాంతాన్నీ, జన్మవృత్తాంతాన్నీ పురాణాధారాలతో చక్కగా వివరించారు. అలాగే తమిళనాట గల ఆరు ప్రముఖ సుబ్రహ్మణ్య క్షేత్రాలను గురించి తెలియజేశారు. శ్రద్ధాళువులైన భక్తులకు 'శ్రీ సుబ్రహ్మణ్యేశ్వర స్వామి వారి పూజా విధానాన్ని అనుబంధంగా ఈ గ్రంథంలో అందించటం విశేషం. రచయిత కృషి... భక్తి అభినందనీయం. ❖

- ఎమ్.వి. నాగ ప్రసాద్

## శ్రీ ఇంద్రేశ్వర చరిత్రము



రచయిత : కపిలవాయి లింగమూర్తి
పేజీలు : 90, వెల : 100/-,
ప్రాప్తిస్థానం : కె. కిశోర్ బాబు, వాణీ సదనం, 17-110, విద్యానగర్ కాలనీ, నాగర్‌కర్నూలు-509 209.

## శ్రీరామ-ఆంజనేయ శతకద్వయము



రచన: శ్రీ కాంతం సత్యనారాయణ
పేజీలు : 32, వెల:35/-,
ప్రాప్తిస్థానం: 1-1-650/22, ఎస్.బి.ఐ. కాలనీ రోడ్, గాంధీనగర్, హైదరాబాద్-80

## సేతు రహస్యం



రచన: గంగ శ్రీనివాస్
పేజీలు : 168, వెల:150/-,
ప్రతులకు: శ్రీమతి జి. గంగ శ్రీనివాస్, నెం.953/2, సౌత్ లాలాగూడ, సికింద్రాబాద్-500 017.

# వార్తావాహిని

## రామకృష్ణ మిషన్ కేంద్రాల సంక్షేమ కార్యక్రమాలు

**విజయవాడ రామకృష్ణ మిషన్** 2008 డిసెంబరు నుంచి 2009 మార్చి వరకు గుంటూరు, కృష్ణా, ఖమ్మం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలకు చెందిన 16 మండలాల్లో సంక్షేమ కార్యక్రమాల్ని నిర్వహించింది. ఈ సంక్షేమ పథకం క్రింద ఉచితంగా 1844 మంది విద్యార్థులకు యూనీఫారాలు, 300 మందికి కంచాలు, 197 మంది వికలాంగులు, వృద్ధులు, వితంతువులకు ధోవతులు, దుప్పట్లు, తువ్వాళ్ళు, చీరలు, రవికలు పంపిణీ చేసింది. 240 మంది పదవ తరగతి విద్యార్థులకు శిక్షణా తరగతుల్నీ, 190 మంది విద్యార్థులకు మధ్యాహ్న భోజన సదుపాయాన్నీ ఏర్పాటు చేసింది. విజయనగరం పూల్‌బాగ్ లెప్రసీ కాలనీలో, సీతానగరం అన్నపూర్ణ పాఠశాలలో రెండు గొట్టం బావులను వేయించింది.



ఈ సంక్షేమ కార్యక్రమాల నిమిత్తం మొత్తం 7,78,000/- రూపాయల్ని వెచ్చించింది. ❖ **నివేదిక : స్వామి స్వసంవేద్యానంద**

---

**బెల్గామ్ రామకృష్ణ మిషన్ ఆశ్రమ** ప్రతీ నెల నిరుపేద కుటుంబాలకు కిరాణా సామాగ్రిని ఉచితంగా పంపిణీ చెయ్యాలని 'ద్రవ్యయజ్ఞ' పథకాన్ని చేపట్టింది. ఈ పథకం క్రింద 2009 ఫిబ్రవరి నెలలో 75 నిరుపేద కుటుంబాలకు 375 కిలోల చొప్పున బియ్యం, గోధుమ పిండి; 75 కిలోల చొప్పున వంటనూనె, పప్పుదినుసుల్ని పంపిణీ చేసింది. ❖

**నివేదిక : స్వామి రాఘవేశానంద**



---

పశ్చిమ ఫిజీ-విటిలేవు పట్టణంలో 2009 జనవరిలో సంభవించిన భారీ వర్షాల కారణంగా అనేక ప్రాంతాలు జలమయమయ్యాయి. వరదలకు గురైన ప్రాంతాల్లో **ఫిజీ రామకృష్ణ మిషన్** తక్షణ సహాయక చర్యల్ని చేపట్టింది. సుమారు 1000 మంది బాధిత కుటుంబాలకు నిత్యావసర సామాగ్రిని, మందులను, వస్త్రాలను సరఫరా చేసింది. ఈ సహాయక కార్యక్రమాల కోసం సుమారు నాలుగు లక్షల రూపాయల్ని ఖర్చు చేసింది. ❖ **నివేదిక : స్వామి తదానంద**



---




## 'భక్తి' ఛానల్‌లో రామకృష్ణ మఠ కార్యక్రమం

ప్రతీ సోమవారం సాయంత్రం 5 గంటల నుండి 5.30 వరకు హైదరాబాద్ రామకృష్ణ మఠ అధ్యక్షులు **స్వామి జ్ఞానదానందజీ మహరాజ్** వారి ఆధ్యాత్మిక ప్రసంగం, భజనలు 'భక్తి' ఛానల్‌లో ప్రసారం అవుతాయి. భక్తులు ఈ కార్యక్రమాన్ని తిలకించి ఆనందించగలరు.

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) 'వేదచూడామణి'** : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

**(ఆ) 'వేదార్థచూడామణి'** : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
వయస్సు : 15 సంıı, ఆ పైన
స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) వేదాధ్యాపకుడు** : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవము : 2 సంవత్సరములు
సంభావన : నెలకు రూıı 8,000/- మొత్తము, సౌకర్యములతో

**(ఆ) వేదభాష్యాచార్యుడు** : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవార్హత : 5 సంıı
సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

హైదరాబాద్ కులప్రశాసకుడు



Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

మే 2009

వెల : రూ. 10



కేశవ ధృత బుద్ధ శరీర జయ జగదీశ హరే...

# సుబోధ



ధర్మశాస్త్రాలు భగవంతుణ్ణి పొందేమార్గాన్ని మాత్రమే చూపిస్తాయి. మార్గాన్ని తెలుసుకొన్నాక పుస్తకాలతో పని ఏముంది?

ఓ వ్యక్తికి తన గ్రామం నుంచి ఒక ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరంలో తమకు కొన్ని వస్తువులను కొని పంపాల్సిందిగా బంధువులు కోరారు. అందులో ఇలా ఉంది: "ఐదు సేర్ల మిఠాయి, వంద నారింజ పళ్ళు, ఎనిమిది ధోవతులు పంపు." బంధువులు అడిగిన వస్తువులేమిటో తెలుసుకొన్న తరువాత అతడు ఆ ఉత్తరాన్ని పక్కన బెట్టి వస్తువులు కొంటాడు.

ఆ ఉత్తరం అవసరం ఎంతవరకు? దాన్లోని సంగతులను తెలుసుకొనేంత వరకే! సంగతులు తెలియగానే కావలసిన వస్తువులను కొనడానికి ప్రయత్నించటమే అతడు చేయాల్సిన పని. అలాగే భగవత్ప్రాప్తిని పొందే మార్గాన్ని, అంటే సాక్షాత్కారానికి కావలసిన సాధనలను శాస్త్రాలు మనకు తెలియచేస్తాయి. వాటి పని అంతవరకే! మార్గం తెలిశాక మనం చెయ్యాల్సిన పని సాధన. సాక్షాత్కారమే మన గమ్యం.

దేని సాయంతో మనం భగవంతుణ్ణి తెలుసుకొంటామో అదే బ్రహ్మవిద్య. కేవలం శాస్త్రాలు, వేదాంతం, తర్కం, వ్యాకరణం మొదలైనవన్నీ మనస్సును కలవరపరచేవే. గ్రంథాలు సామాన్యంగా గ్రంథులు (ముడులు). బ్రహ్మజ్ఞానానికి సాధన భూతమైనంత వరకే వాటి ప్రయోజనం. ❖

('శ్రీరామకృష్ణ బోధామృతం' నుంచి)

**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద
సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

# సురభి

ఒకరోజు నేను (స్వామి ఈశానంద) కోల్వారా నుండి జయంరామ్‌బాటీ వస్తున్నాను. ఒక వృద్ధ స్త్రీ కూడా సామాన్లు మోసుకుంటూ మాతృదేవి దగ్గరకు వచ్చింది. మాతృదేవి ఆమెతో, "నువ్వెందుకు చాలా రోజులుగా ఇటు వైపు రాలేదు?" అని ఆప్యాయంగా అడిగారు. అందుకు ఆమె, "ఏం చెప్పమంటావమ్మా! రోజులు గడవడం ఎంతో కష్టంగా ఉంది. కాస్తో కూస్తో సంపాదిస్తున్న నా కుమారుడు కూడా చనిపోయాడు" అంటూ విలపించసాగింది.

ఆమె దుఃఖాన్ని చూసి మాతృదేవి కళ్ళు చెమ్మగిల్లాయి. మాతృదేవి బాధపడడం చూసి ఆమె భోరున ఏడవసాగింది. ఆమె పక్కన కూర్చుని, వసారాలోని స్తంభానికి తల ఆన్చి, ఆమెతో పాటు మాతృదేవి కూడా విలపించసాగారు. ఇద్దరూ ఇలా వెక్కి వెక్కి ఏడవడంతో ఇంట్లోని వారంతా ఒక్క పరుగున వచ్చి ఆ దృశ్యం చూసి విస్తుపోయారు. కాసేపు అలాగే గడిచింది. ఏడుపు ఆగిన తరువాత మాతృదేవి కొబ్బరినూనె తెప్పించి స్వయంగా తామే ఆమె తలకు రాశారు. పిదప మరమరాలు, చక్కెర మొదలైనవి ఒక బట్టలో మూట కట్టి ఆమెకు ఇస్తూ, "మళ్ళీ రా తల్లీ" అన్నారు ఆప్యాయంగా. అప్పటికీ మాతృదేవి కళ్ళు చెమ్మగిల్లే ఉన్నాయి. ఆ స్త్రీ ఎంతో సాంత్వన పొందినట్లు ఆమె ముఖం చెప్పకనే చెప్పింది. ❖

(స్వామి ఈశానంద స్మృతుల నుంచి)



ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 66 సంచిక: 5 మే 2009

**పవన తనయ సంకట హరణ మంగళ మూరతి రూప**
**రామ లఖన సీతా సహిత హృదయ బసహు సుర భూప**

పవన కుమారా! సమస్త క్లేశాలనూ నాశనం చేసేవాడా! మంగళమూర్తీ! హనుమంతా! రామ లక్ష్మణ సీతా సహిత, సర్వ దేవతా గణాలతో నా హృదయంలో నివసించుము. (హనుమాన్ చాలీసా)





## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

| | | |
|---|---|---|
| **మహారాజ పోషకులు**...... | రూ. | 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **రాజ పోషకులు**............ | రూ. | 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **పోషకులు**................. | రూ. | 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |

| | దాత పేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| మహారాజ పోషకులు | : శ్రీ ఎన్. వెంకన్న, | పి.వి. రావ్ వీధి, అమలాపురం - 533 201 | 10,000 |
| పోషకులు | : పి.ఎన్.ఎమ్. ఉన్నత పాఠశాల, | కుకట్‌పల్లి, హైదరాబాద్ | 2,000 |
| " " | : శ్రీ పి. సిద్ధారెడ్డి, | పులికాట్ నగర్, సూళ్ళూరు పేట, నెల్లూరు జిల్లా | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ./డి.డి./చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో

స్వామి జ్ఞానదానంద

అధ్యక్షులు

శ్రీ సాయి బాబా, ఎస్.బి.హెచ్. కాలనీ, తిరుమలగిరి, సికింద్రాబాద్ - 250 పాఠశాలలకు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను స్పాన్సర్ చేశారు.

శ్రీ ఎస్. అనంతకృష్ణ, సూర్యా కేటరర్స్, అంబర్‌పేట్, హైదరాబాద్ - 100 కళాశాలలకు 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను స్పాన్సర్ చేశారు.

**ముఖచిత్రం :** మధ్యప్రదేశ్ రాజధాని భోపాల్‌కు 46 కిలోమీటర్ల దూరంలో ఉన్న సాంచీ గ్రామంలోని బౌద్ధ స్థూపం. అశోక చక్రవర్తి నిర్మించిన ఈ స్థూపం క్రీపూ. 3వ శతాబ్దానికి చెందినది. *ఫోటో : స్వామి అనుపమానంద*

## ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 365 |

గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో **Ramakrishna Math, Hyderabad** అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : **Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.**

# లోపలి పేజీల్లో...



## శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకి కుడి భాగంలో మీ చందా గడువు నెల పొందుపరచబడి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ చేయబడుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

*- సర్క్యులేషన్ మేనేజర్*


**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com



సంపాదకీయం

# కపీశ్వరుని కార్యదీక్ష!

ఏ కార్యాన్నైనా సాధించాలంటే మనిషికి ముఖ్యంగా కావలసింది సంకల్ప బలం. ఈ సంకల్ప బలం ఎవరిలో ఉంటుందో వారు తలపెట్టిన కార్యాన్ని సాధించేవరకూ విశ్రమించరు; ఎలాంటి క్లిష్ట పరిస్థితులనైనా ఉత్సాహంతో ఎదుర్కొని ముందుకు పయనిస్తారు, విజయాన్ని సాధిస్తారు. విజయ సౌధానికి పట్టుదలే పునాది.

The sheer power of the 'will' will do everything. The will is stronger than anything else. Everything must go down before the will. - ***Swami Vivekananda***

సంకల్ప బలం సకల కార్యసిద్ధికి మూలం; దాని ముందు ఎలాంటి పరిస్థితులైనా తలవంచాల్సిందే అంటారు స్వామి వివేకానంద.

జీవితంలో అనుకొన్న కార్యాన్ని సాధించడానికి కావలసిన పట్టుదల పరిపూర్ణంగా ఉన్న ధీమంతుడూ, శక్తిమంతుడూ, కార్యతత్పరుడూ అయిన ఆంజనేయస్వామి జీవితం మనకు ఆదర్శం కావాలి.

**మనసును భ్రమింపజేసే బాహ్య శత్రువులు :** లంకను చేరాలనే ఆరాటంతో ఆంజనేయుడు విరామం ఎరుగని ప్రయాణం సాగిస్తున్నాడు. త్వరగా లంకను చేరాలనీ, సీతమ్మ జాడను తెలుసుకోవాలనే తపన తప్ప వేరే ఆలోచన ఆయనకు లేదు. ఏకనిష్ఠతో వెళుతున్న ఆంజనేయునితో 'రా నాయనా! నా ఆతిథ్యం స్వీకరించు. అమృత తుల్యమైన పండ్లను ఆరగించి, కొంచెం విశ్రమించిన తరువాత నీ ప్రయాణాన్ని కొనసాగించు' అని మైనాకుడు ఆహ్వానించాడు. సంకల్పించిన కార్యంలో జాప్యం జరుగుతుందని భావించిన ఆంజనేయుడు 'నేను రామకార్యార్థమై వెళుతున్నాను. విశ్రాంతి తీసుకోవడానికి నాకు ఇది సమయం కాదు' అని మైనాకుని ఆతిథ్యాన్ని తిరస్కరించాడు. మనం కూడా జాప్యం లేకుండా ఏ పనినైనా సకాలంలో పూర్తిచేయాలంటే సుఖాలను(కోరికలు) త్యజించి విరామం లేకుండా పరిశ్రమించాలి.

సముద్ర లంఘనంలో మరికొద్ది దూరం వెళ్ళగానే సురస అనే రాక్షసి అడ్డుపడి 'ఆంజనేయా! నీవు నాకు ఇప్పుడు ఆహారంగా కావాలి' అని అంది. ఆంజనేయుడు సురసకు వినయపూర్వకంగా నమస్కరించి 'అమ్మా! నేను ఇప్పుడు సీతాన్వేషణ కోసం వెళుతున్నాను. ఆ పని పూర్తిచేసుకుని తిరిగివచ్చి నీ కోరిక తప్పక తీరుస్తాను' అని అన్నాడు. సురస అందుకు అంగీకరించలేదు. ఆంజనేయుణ్ణి మింగాలని తన నోటిని విస్తృతం చేసింది. ఆంజనేయుడు తన శరీరాన్ని ఎంత పెంచితే అంత విశాలంగా సురస తన నోటిని వ్యాపింప చేసింది. అప్పుడు ఆంజనేయుడు సూక్ష్మరూపధారియై సురస విశాలమైన నోటిలోనికి ప్రవేశించి బయటకి వచ్చాడు.

హద్దులు లేకుండా పెరిగే 'ఆశ'యే(లోభమే) మనలో ఉన్న సురస. మనం ఎన్ని సుఖాలను అనుభవిస్తున్నా, ఎంత సంపాదిస్తున్నా వాటితో తృప్తి చెందకుండా ఇంకా సుఖాలను అనుభవించాలనీ, ధనాన్ని ఆర్జించాలనీ రోజు రోజుకీ మనలో పెరిగే ఆశ(కాంచన కాంక్ష) పేరాశగా మారి మనల్ని మింగేస్తుంది. కాబట్టి కాంచన కాంక్ష నుంచి తప్పించుకోవాలంటే ఆంజనేయుడు సూక్ష్మరూపం ధరించినట్లు మన మనోవాంఛల్ని తగ్గించుకోవాలి. అప్పుడే ఆశ అనే సురస బారి నుంచి బయటపడగలం.

**అదృశ్యంగా ఉన్న అంతశ్శత్రువులు:** కార్యసాధనలో ఉత్సాహంగా పయనిస్తున్న ఆంజనేయుణ్ణి సింహిక అనే రాక్షసి(ఛాయాగ్రాహి) బయటకు కనబడకుండా సముద్రంలో నుంచి తనవైపు లాగింది. అందువల్ల త్వరిత గతిన వెళుతున్న ఆంజనేయుని వేగం మందగించింది. అప్రమత్తంగా ఉన్న ఆంజనేయుడు వెంటనే తనకు కలిగే ఆపదను గ్రహించి సింహికను సంహరించాడు.

కర్తవ్యపాలనలో దృఢచిత్తంతో వెళుతున్న మన వేగాన్ని మందగింపజేసేది మనలో అదృశ్యంగా ఉన్న 'అసూయ'యే సింహిక. ఎవరైనా మనకన్నా అభివృద్ధి సాధించి పేరు ప్రఖ్యాతుల్ని సంపాదిస్తే మనలో తెలియకుండానే వారిపట్ల అసూయ కలుగుతుంది. అసూయాగ్నితో దహించుకుపోతున్న మనసు ఆలోచనా శక్తిని కోల్పోయి మన అభివృద్ధిని మందగింప చేస్తుంది. కాబట్టి ఎల్లప్పుడూ అప్రమత్తతతో ఉండి అసూయ అనే సింహికను ఎదుర్కోవాలి.

ఎన్నో విఘ్నాలను ఎదుర్కొని చివరికి లంకలో ప్రవేశిస్తున్న ఆంజనేయునికి మరొక అవరోధం ఏర్పడింది. సింహద్వారం వద్ద లంకిణి ఆంజనేయుణ్ణి అడ్డుకొని 'నేను ఈ లంకా నగరాన్ని రక్షిస్తున్నాను. నన్ను ఎదిరించిన వారే లోపలికి ప్రవేశించాలి' అని అహంకారంతో గర్జించింది. అహంకార పూరితురాలైన లంకిణిని ఒకే ఒక ముష్టిఘాతంతో అంత మొందించాడు హనుమంతుడు.

చేపట్టిన కార్యంలో అభివృద్ధిని సాధిస్తున్నప్పుడు మనలాంటి ధీరులూ, ధీమంతులూ ఇంకెవరూ లేరనే అహంకారం పెరుగుతుంది. మనలో పర్వతాకారంలో ఎదిగిన అహంకారమే లంకిణి. అహంకారపూరితులు ఎదుటి వ్యక్తిలోని గొప్పతనాన్ని గుర్తించలేరు. అనంత శక్తిమంతుడైన ఆంజనేయుణ్ణి ఒక సాధారణ వానరమని తప్పుగా, తక్కువగా అంచనావేసి తన వినాశనానికి తానే కారకురాలైంది లంకిణి. కాబట్టి అహంకారంతో వ్యవహరించేవారికి వినాశనం తప్పదు. ఎలాగైతే ఆంజనేయుడు అహంకార రూపిణి అయిన లంకిణిని జయించి లంకా నగరంలో ప్రవేశించాడో అలాగే మనలోని అహంకారాన్ని జయిస్తేనే విజయ సామ్రాజ్యంలోనికి ప్రవేశించడం సాధ్యమవుతుంది.



**సంకల్ప శక్తికి మనో నియంత్రణే మార్గం:** ఎవరి మనసు, ఇంద్రియాలు తమ స్వాధీనంలో ఉంటాయో వారే కామకాంచనాల్నీ, అసూయా అహంకారాల్నీ అధిగమించగలరు. కాబట్టి సంకల్పించిన కార్యాన్ని సాధించడం కోసం మనో నియంత్రణ అత్యంత ఆవశ్యకం.

**సంసారస్యాస్య దుఃఖస్య సర్వోపద్రవదాయినః**
**ఉపాయ ఏక ఏవాస్తి మనసః స్వస్య నిగ్రహః**

'సమస్త దుఃఖాల్నీ, సమస్యల్నీ అధిగమించాలంటే మనోనిగ్రహమే శరణ్యం'అని వశిష్ఠ గీత బోధిస్తుంది.

**తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ ।**
**పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్॥**

'అర్జునా! నువ్వు ముందుగా ఇంద్రియాలను అదుపులో ఉంచుకొని జ్ఞాన విజ్ఞానాలను నశింపచేసే పాప స్వభావం గల ఈ కామాన్ని జయించు' అని శ్రీకృష్ణుడు అర్జునునికి (గీత 3-41) విజయ రహస్యాన్ని బోధించాడు.

ఆంజనేయుడు మనో నియంత్రణ కలిగి ఉండడం వల్లనే తనకు ఎదురైన కష్టాలన్నింటినీ అధిగమించి లక్ష్యసిద్ధిలో కృతకృత్యుడయ్యాడు.

**సీతాన్వేషణ ఘట్టంలోని అంతరార్థం:** సామాజిక జీవితంతో సీతాన్వేషణ ఘట్టాన్ని అన్వయించుకుంటే ఆంజనేయుడు లంకలో ప్రవేశించి సీతమ్మ జాడను తెలుసుకోవడం ఆయన చేపట్టిన కార్యం. మార్గ మధ్యంలో ఎదురైన అవరోధాలన్నింటినీ అధిగమించి తన గమ్యాన్ని చేరుకున్నాడు ఆంజనేయుడు.

మనం కూడా ఆంజనేయుని లాగే లక్ష్యాన్ని సాధించాలంటే సుఖాల్ని త్యజించి పట్టుదలతో పరిశ్రమించాలి. సన్మానాల వల్ల, అవమానాల వల్ల, విమర్శల వల్ల మనలో పొడచూపే అహంకారాన్నీ, అసూయాద్వేషాలనూ విడనాడాలి.

ఆంజనేయుడు (జీవాత్మ), సీతాదేవి (పరమాత్మ), లంక (దేహం). మనలో ఉన్న కామం (మైనాకుడు), కాంచనం (సురస) అనే బాహ్య శత్రువుల్నీ; అసూయ (సింహిక), అహంకారం (లంకిణి) అనే అంతశ్శత్రువుల్నీ జయించినప్పుడే పరమాత్మ పదసన్నిధికి చేరగలం. ఆధ్యాత్మిక జీవితంలో సీతాన్వేషణ ఘట్టం తెలిపే అంతరార్థం ఇదే!

Every work has got to pass through hundreds of difficulties before succeeding. Those that persevere will see the light, sooner or later. ***- Swami Vivekananda***

సామాజిక జీవితంలోనైనా, ఆధ్యాత్మిక జీవితంలోనైనా లక్ష్యాన్ని సాధించాలంటే అవరోధాల్ని ఎదుర్కోక తప్పదు. ఎదురైన కష్టాలన్నింటినీ అధిగమించాలంటే **'కపీశ్వరుని కార్యదీక్ష'** మనకు ఆదర్శం కావాలి. అప్పుడే కార్యసిద్ధి కరతలామలకం అవుతుంది. ❖

# అంగవైకల్యమంటే...

-స్వామి సుప్రియానంద

కుంటివాళ్ళు, గుడ్డివాళ్ళు, మూగవాళ్ళు ఇంకా ఇలాగ ఎందరో వికలాంగులు మనకు సమాజంలో కనిపించినప్పుడు మనసు స్పందించడం, మనలో సానుభూతి కలగడం సహజం. దీనికి కారణం ఆ వ్యక్తుల అంగవైకల్యం. ఆ వ్యక్తులే ఘనకార్యాలు 'సాధించినపుడు, ఇది ఎలా సాధ్యం' అని మనం ఆశ్చర్యపోతాం!

సగటు మనిషి ఎప్పుడూ తన తెలివి తేటల్ని ప్రదర్శించడానికి ప్రయత్నిస్తాడు. అంటే తనను తాను ప్రకటించుకోవడానికి చూస్తాడు. అతనిలో ప్రకటనా సామర్థ్యం (Advertising ability) తప్ప ఆలోచనా సామర్థ్యం (Thinking ability) ఉండదు.

అంగవైకల్యం గల వారు గొప్ప వారు ఎలా కాగలిగారో మనం పరిశీలించినపుడు వారిలోని 'ఆలోచనా సామర్థ్యం' మనకు ప్రస్ఫుటమవుతుంది. దీనిని బట్టి ఆలోచించలేకపోవడం మనిషి యొక్క నిజమైన 'అంగవైకల్యం' అని అర్థమౌతుంది.

తత్త్వవేత్త బెర్ట్రాండ్ రస్సెల్ అంటారు "Most people would rather die than think, infact, they do so!"



'చాలామంది చావనన్నా చస్తారుగాని ఆలోచించరు. నిజానికి వారు చేసేది అదే!'

ప్రపంచంలో చాలామంది తెలివిగలవారు ఉన్నారు. కాని వారందరూ ఆలోచనా పరులా? ఒక తీవ్రవాది చాలా తెలివిగలవాడు. కాని అతను స్వయంగా ఆలోచించకపోవడంతో అతని ప్రవర్తన వల్ల సమాజంలో కలిగే అరాచకం మనం చూస్తున్నాం! ఇది ఒక తీవ్రవాది విషయంలోనే కాదు, ఇలా ఆలోచనా రాహిత్యం వలన కలిగే అవకతవకలు అనేకం. చెవులు చిల్లులు పడేలా పెద్దపెద్ద లౌడ్ స్పీకర్లు పెట్టి ఒకవైపు 'దేవుడి' పేరుతో, మరొకవైపు 'వినోదం' పేరుతో శబ్దకాలుష్యం చేయడం ఎంత అనాగరికం! ఇది ఒక రకమైన బుద్ధి వైకల్యం కాదా?

ఆలోచనలేని తెలివితేటలు వ్యర్థం అని బాగా అర్థమయ్యే సంఘటన ఒకటి చూద్దాం! ఒకచోట రైలు వంతెన క్రిందుగా వెళుతున్న ట్రక్కు ఇరుక్కుపోయింది. దాని వలన వాహనాల రాక పోకలు స్తంభించిపోయాయి. పెద్ద పెద్ద ఇంజనీర్లు వచ్చి ట్రక్కును బయటకు లాగడానికి ప్రయత్నించారు. కానీ లాభం లేకపోయింది. అప్పుడు జనసమూహం నుండి ఒక పిల్లవాడు ముందుకు వచ్చి ఇంజనీర్లకు ఏదో చెప్పడానికి ప్రయత్నించాడు. వారందరూ పిల్లవాడిని తరిమివేశారు. అయినా ఆ పిల్లవాడు అక్కడనుంచి వెళ్ళకుండా మళ్ళీమళ్ళీ వారి దగ్గరకు వచ్చి ఏదో చెప్పే ప్రయత్నం చేశాడు. వారిలో ఒక పెద్దమనిషి "ఏరా! ఇంత మంది మేధావులు సమస్యతో సతమతమవుతుంటే, నువ్వెందుకు విసిగిస్తున్నావు?" అన్నాడు. అప్పుడు పిల్లవాడు "సార్! నాకు ఒక ఆలోచన వచ్చింది. ట్రక్కు చక్రాలలో ఉన్న గాలి తీసేస్తే దాని ఎత్తు తగ్గుతుంది. అప్పుడు దానిని బయటకు లాగొచ్చు కదా!" అన్నాడు.

ఇప్పుడు మనకు మనం వేసుకోవలసిన ప్రశ్న – We are intelligent, but are we thoughtful? otherwise, thoughtlessness becomes our biggest handicap.

మనం తెలివైనవారమే కానీ చింతనాశీలురమా? ఆలోచనా రాహిత్యమే మనకున్న 'అంగవైకల్యం' ✱

## పండుగలు - పర్వదినాలు

### మే- 2009

| | | |
|---|---|---|
| 05 | మంగళవారం | ఏకాదశి |
| 07 | గురువారం | నృసింహ జయంతి |
| 09 | శనివారం | బుద్ధపూర్ణిమ |
| 19 | మంగళవారం | హనుమజ్జయంతి |
| 20 | బుధవారం | ఏకాదశి |

### జూన్- 2009

| | | |
|---|---|---|
| 03 | బుధవారం | ఏకాదశి |
| 19 | శుక్రవారం | ఏకాదశి |
| 24 | బుధవారం | పూరీజగన్నాథ రథయాత్ర |



# శ్రీరామకృష్ణుల హనుమత్ భావన

-స్వామి జ్ఞానదానంద

హనుమంతుడు ప్రదర్శించిన అచంచల దాస్యభక్తి ద్వారానే శ్రీరాముని దర్శనం సాధ్యమని గురుదేవులు గ్రహించారు. అందుచేత తనలో హనుమంతుణ్ణి ఆవాహన చేసుకొన్నారు. ఆ భావంలో లీనమైపోయి కొంతకాలం గడిపారు. అనుక్షణమూ హనుమత్ చింతన, స్మరణ, ధ్యానంలో నెలకొని ఉండడం వల్ల, తనదైన వ్యక్తిత్వాన్నీ, ఉనికినీ గురుదేవులు మరిచిపోయారు. అప్పటి తన స్థితిని గురుదేవులు ఇలా వర్ణించి చెప్పారు– "వానరం మాదిరే గెంతుతూ నడిచేవాణ్ణి. పళ్ళూ, దుంపలూ తప్ప తక్కినవేవీ రుచించేవి కావు. వానరంలా తొక్క తీయకుండానే వాటిని తినేవాణ్ణి. దాదాపు ఎప్పుడూ చెట్ల మీదనే ఉండేవాడిని. అనుక్షణం భక్తితో 'రామ, రామ' అనేవాణ్ణి. వానరంలా నా కళ్ళూ చంచలమయ్యాయి. ఆశ్చర్యం ఏమిటో తెలుసా? వెన్నెముక కింద భాగం ఒక అంగుళం మేరకు పెరిగింది". ఇది విని "అయ్యా! పెరిగిన వెన్నెముక ఇంకా అలాగే ఉందా?" అని ఒక శిష్యుడు అడిగాడు. అందుకు ఆయన నవ్వి, "లేదులే, ఆ భావం మనసు నుంచి పోయిన వెంటనే అది మళ్ళీ మామూలుగా అయిపోయింది" అన్నారు.

ఆలయ కాపలాదారు అయిన హనుమాన్ సింగ్ గొప్ప హనుమద్భక్తుడు, అంతేకాక అతడొక మల్లయుద్ధ వీరుడు. అతనికి తన ఇష్టదైవమైన హనుమంతుని పట్ల ఎంత భక్తిప్రపత్తులున్నాయో అంత భక్తి ప్రపత్తులు గురుదేవుల పట్ల కూడా ఉన్నాయి. ఒక సందర్భంలో మరొక మల్లయుద్ధ వీరుడు దక్షిణేశ్వరానికి వచ్చి, హనుమాన్ సింగ్‌ను సవాలు చేశాడు. అతడు కనుక గెలిస్తే హనుమాన్ సింగ్ ఉద్యోగం అతడికి దక్కుతుంది, పోటీ రోజున హనుమాన్ సింగ్ గురుదేవుల ముందు ప్రణమిల్లి "అయ్యా! మీరు అనుగ్రహిస్తే, నేను మల్లయుద్ధంలో తప్పక గెలుస్తాను" అన్నాడు. గురుదేవుల ఆశీస్సులతో ఆ పోటీలో అతడు నెగ్గాడు. ✸



స్వామి భూతేశానంద
(1901–1998)

ఒకరోజు గంగాధర్ (స్వామి అఖండానంద) మహరాజ్ సర్గాఛీ నుండి బేలూర్ మఠానికి వచ్చారు. ఆయన బేలూర్ మఠానికి వచ్చినప్పుడల్లా నేను ఆయనకు సేవ చేసేవాడిని. గంగాధర్ మహరాజ్ రోజూ ఉదయం ఒక గ్లాసు టీ సేవించేవారు. ఒకరోజు గ్లాసు ఖాళీ కాగానే గ్లాసులో మరికొంత టీ పోశాను. అలా టీ పోయడంలో నా ఉద్దేశం ఏమిటని సూటిగా ప్రశ్నించారు. నేను ఏమాత్రమూ తడబడకుండా, "పరిపూర్ణ నిస్వార్థ సేవ" అని ఠక్కున జవాబిచ్చాను. నా జవాబు విని గంగాధర్ మహరాజ్ ఆహ్లాదంగా నవ్వారు. ❖

ఒకమారు ఎవరో బేలూర్ మఠానికి కొన్ని కొత్త దుప్పట్లు పంపించారు. అప్పటి మఠ కార్యనిర్వాహకులైన ప్రియదా (స్వామి ఆత్మప్రకాశానంద) మహరాజ్ వాటిని తెచ్చి మహాపురుష్(స్వామి శివానంద) మహరాజ్‌కు చూపించారు. మహరాజ్ ఆ దుప్పట్లను చూసి అవి చాలా బాగున్నాయని మెచ్చుకుని, ప్రతి సాధువుకూ ఒక్కొక్క దుప్పటి ఇవ్వమని చెప్పారు. కాని ప్రియదా, అవి పేదలకు పంపిణీ చేయడానికి అని జవాబిచ్చారు. ఆ జవాబు వినగానే మహాపురుష్ మహరాజ్, "ఓహో! సాధువులు ధనికులన్న మాట!" అంటూ ఆశ్చర్యం వ్యక్తం చేశారు. అది విని అక్కడ ఉన్న సాధువులందరూ బిగ్గరగా నవ్వారు. ❖

(స్వామి భూతేశానందజీ మహరాజ్ స్మృతులు– 'రసబోధ' పుస్తకం నుంచి)



# అంతర్వేది పుణ్యధామం

-ఎన్. శ్రీరామమూర్తి

గోదావరీ నది పాయలలో ఒకటైన వశిష్ట పాయ సముద్రంలో కలిసే స్థలంలో ఉన్న అంతర్వేది గొప్ప నారసింహ క్షేత్రం. ఇక్కడ గోదావరి ఒడ్డున శ్రీలక్ష్మీ నరసింహస్వామి వారి గుడి ఉంది. సముద్రంలో తిరిగే ఓడలు తరచూ అగ్నిప్రమాదాలకు గురి అవుతుండడం వల్ల మొగల్తూరు రాజావారు ఇక్కడ నారసింహ యంత్ర ప్రతిష్ఠ చేయించి ఆలయాన్ని నిర్మించారని చెబుతారు. శ్రీనాథుని రచన 'భీమఖండం'లో ఈ క్షేత్ర ప్రస్తావన ఉంది.

క్రీ.శ. 1582 ప్రాంతంలో స్వామి వారి సుదర్శన చక్రం సముద్రపు ఉప్పెనలో కొట్టుకొని పోయింది. అప్పుడు పేరూరు నివాసి అయిన అంతర్వేది చయనులనే బ్రాహ్మణుడు 11 రోజుల పాటు జపం చెయ్యగా చక్రం ఒడ్డుకు కొట్టుకు వచ్చింది. అప్పటి నుండీ స్వామి వారి కల్యాణ సమయంలో పేరూరు వారిని ఆడ పెళ్ళివారిగా పరిగణించడం ఆచారంగా వస్తోంది.

పూర్వం హిరణ్యాక్షుని కుమారుడైన రక్తలోచనుడనే రాక్షసుడితో స్వామి యుద్ధం చేశాడు. రక్తలోచనుని రక్తపు చుక్క భూమి మీద పడితే మరొక రక్తలోచనుడు పుట్టుకు వస్తాడు. అందువల్ల స్వామి సోదరి అశ్వరూఢాంబ (గుఱ్ఱాలక్క) వచ్చి తన నాలుకను పెంచి, యుద్ధభూమిపై పరచింది. దాంతో రక్తలోచనుని రక్తం నేల మీద పడలేదు. ఆ తరువాత స్వామి ఆ రాక్షసుణ్ణి వధించడం సులభమైంది. రాక్షసవధ జరిగాక గుఱ్ఱాలక్క తన నాలుక పైనున్న రక్తాన్ని ఒక పక్కకు వదిలింది. ఆ రక్తపు కాలువనే నేడు రక్తకుల్య అంటున్నారు. బ్రహ్మ ఇక్కడ యజ్ఞం చేసి (అంతర్వేది) నీలకంఠేశ్వరుణ్ణి ప్రతిష్ఠ చేశాడు. ✸ **(మే7న నృసింహ స్వామి జయంతి)**



# పదకవితా పితామహుడు

- జి. సతీష్

తెలుగు సాహిత్యంలో 'పదకవితా పితామహుడి'గా ప్రసిద్ధికెక్కిన అన్నమయ్య నారాయణసూరి–లక్కమాంబ దంపతులకు శ్రీసర్వధారి నామ సంవత్సర వైశాఖ పౌర్ణమి (క్రీ.శ.1408 మే 9) నాడు కడప జిల్లాలోని తాళ్ళపాక గ్రామంలో జన్మించాడు. పువ్వు పుట్టగానే పరిమళిస్తుందన్నట్లుగా పసితనం నుండే అన్నమయ్య తిరుమలేశుని భక్తుడు. 8 ఏళ్ళ వయస్సులోనే కొండ ఎక్కుతూ అశువుగా 'మంగాంబికా శతకం' పాడాడు. కొండపైకి చేరి స్వామినీ, ఇతర దేవీదేవతలనూ దర్శిస్తూ 'వేంకటేశ శతకం' పాడాడు.

టంగుటూరుని ఏలుతున్న సాళువ నరసింగరాయుడు అన్నమాచార్యుని గొప్పదనం, అతనికి గల ఆధ్యాత్మిక శక్తి గురించి తెలిసి, తన ఆస్థానంలో గురువుగా ఉండమని కోరాడు. అన్నమయ్య అందుకు అంగీకరించాడు. ఒకరోజు అన్నమాచార్య పాడిన మధుర భక్తికి సంబంధించిన పాట విన్న రాజుగారు తన్మయుడై అదే విధమైన పాట ఒకటి తనను (రాజును) స్తుతిస్తూ పాడాల్సిందిగా కోరాడు. తాను భగవంతుడి వైభవాన్ని చాటే పాటలే తప్ప మానవ మాత్రులను పొగడననడంతో రాజు అహం దెబ్బతింది. పట్టరాని కోపం వచ్చింది. వెంటనే అన్నమయ్యను గొలుసులతో బంధించి కారాగారంలో పెట్టించాడు. శ్రీ వెంకటేశ్వర స్వామిని తలచుకుంటూ ఒక పాట పాడాడు. వెంటనే గొలుసులు తెగిపోయాయి. రాజు తనను క్షమించాల్సిందిగా అన్నమయ్యను వేడుకొన్నాడు. భక్తులను అవమానించడం తగని పని అని రాజుకు సలహా ఇచ్చి సంకీర్తనల ద్వారా భగవంతుడి మహిమలను చాటి చెప్పడానికి తిరుపతి వెళ్ళిపోయాడు అన్నమయ్య.

అన్నమయ్య తన జీవితకాలం (95 ఏళ్ళు)లో 32,000 సంకీర్తనలు రచించి పాడగా, నేడు14,000 సంకీర్తనలే లభ్యమవుతున్నాయి. అన్నమయ్య తాళపత్రాల మీద వ్రాసిన ఆ సంకీర్తనలను ఆయన కుమారుడు తిరుమలాచార్య రాగి రేకులపైన చెక్కించాడు. ✸ **(మే9న అన్నమాచార్య జయంతి)**

# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -23

# ఆకల్ని తీర్చిన ఆనందం !

యమునోత్రికి వెళ్ళే మార్గంలో బాటకు కొంచెం మీదుగా మంచుతో కప్పబడి కొండల మధ్య ప్రకృతి సౌందర్యంతో నిండిన ఒక గ్రామం ఉంది. స్వామి జపానంద ఆ గ్రామానికి వచ్చారు. మధ్యాహ్నం అయింది, చాలా ఆకలిగా ఉంది. ముందురోజు కూడా తినడానికి ఏమీ దొరకలేదు. కానీ గ్రామంలో మనుష్య సంచారమే లేదు. "ఆవులు, గేదెలు, కుక్కలు తిరుగుతున్నాయి, అంటే గ్రామంలో మనుష్యులు నివసిస్తున్నారు" అని అనుకుని ముందుకు వెళ్ళారు. ఒక ఇంటి వసారాలో ఒక వృద్ధురాలు కూర్చుని కదురుతో ఊలు తీస్తున్నది. సాధువును చూడగానే ఆమె సాదరంగా ఆహ్వానించి ఆసనం చూపింది. "ఇవాళ మీరు మా ఇంటికి రావడం మా భాగ్యం. మీరు మా ఇంట్లో భిక్ష స్వీకరించి వెళ్ళాలి. ఇంట్లో అందరూ గడ్డి విత్తనాలు ఏరుకోవడానికి అడవిలోకి ఉదయమే వెళ్ళారు. అందరూ సాయంత్రం ఇంటికి వచ్చి వంట చేస్తారు. అప్పుడు మీరు రొట్టెలు తిని వెళుదురు గాని! రెండు సంవత్సరాలుగా పంటలు లేవు. ఏం చేస్తాం" అని ఆమె అంది.

ఇంతలో ఒక వృద్ధుడు వచ్చాడు. అతను గ్రామ పెద్ద. స్వామికి నమస్కారం చేసి "మహరాజ్! మా ఇంటికి రండి. వాళ్ళింట్లో ఎవరూ లేరు. స్త్రీలందరూ గడ్డి విత్తనాలు ఏరుకోవడానికి అడవికి వెళ్ళారు. పురుషులందరూ కూలీ పని చేసుకోవడానికి ముస్సోరీ, డెహరాడూన్ వెళ్ళారు. మా ఇంట్లో రొట్టెలు తయారుగా ఉన్నాయి. భిక్ష తీసుకొని కాస్త విశ్రాంతి తీసుకొందురుగాని రండి" అని పిలిచాడు.

వృద్ధురాలు అందుకు అంగీకరించలేదు. "ఇంటికి వచ్చిన సాధువు ఏమీ తినకుండా వెళితే మాకు అశుభం కలుగుతుంది. సాయంత్రం నా కూతుళ్ళు, కోడళ్ళు వచ్చి వంట చేస్తారు. భోజనం చేసి వెళ్ళండి"అని ఆ వృద్ధురాలు సాధువుని బ్రతిమలాడింది.

గ్రామ పెద్ద "సాధువును ఆకలితో ఉంచకూడదు. మనమందరం ఒక్కటే కదా" అని ఎంతో చెప్పి చూశాడు. నిజమే కానీ ఇంటికి వచ్చిన సాధువు ఏమీ తీసుకోకుండా వెళ్ళడం ఏమీ బాగా లేదు. అంటూ లోపలికి వెళ్ళి, ఇల్లంతా వెతికి చిన్న బెల్లం ముక్క తీసుకువచ్చి, "మహారాజ్! మీకివ్వడానికి ఇంకేమీ లేదు. ఇదే తీసుకోండి" అని చేతులు జోడించింది. స్వామి ప్రేమతో దాన్ని తీసుకుని ఆమెను ఆశీర్వదించి, గ్రామ పెద్దతో కలిసి వాళ్ళ ఇంటికి వెళ్ళారు. గ్రామ పెద్ద ఒక ఆకులో అతనికి నాలుగు చిన్న చిన్న రొట్టెలు తెచ్చి ఇచ్చి, "మహారాజ్! ఇప్పటికి ఇది తినండి, రాత్రికి అడవి నుంచి మా ఇంటి స్త్రీలందరూ వచ్చాక వంట చేస్తారు" అన్నారు.



రొట్టెల రంగు ఆకుపచ్చగా ఉంది. వాటిని చూసి, సన్న్యాసి భయపడి గ్రామపెద్దతో "అయ్యా! నేను ఊరి బయటి వాగు దగ్గర కెళ్ళి తింటాను" అని చెప్పి, వాటిని తీసుకుని కొండ వాగు దగ్గరకొచ్చి ఒక ముక్క తుంచి నోట్లో పెట్టుకున్నారు. క్వినైన్‌లా చేదుగా ఉంది. అసలు తినలేకపోయారు. వాంతి వచ్చేలా ఉంది. కానీ, "సన్న్యాసి రుచి అని అనుకుంటే ఎలా? ఇది తినే ఇక్కడ మనుష్యులు ప్రాణాలతో ఉన్నారు. ఇది దొరకడమే మహాభాగ్యం. భిక్షలో స్వీకరించిన పదార్థాన్ని పారవెయ్యకూడదు" అని తనకు తాను నచ్చజెప్పుకొన్నారు. రొట్టె ముక్కను తినబోతుండగా ఆయన దృష్టి అక్కడకు కొంచెం దూరంగా కూర్చొని ఉన్న బాలుడి మీద పడింది. ఆ బాలుడు ఒక అస్థిపంజరంలా ఉన్నాడు. తిండి తిని ఎన్ని రోజులైందో, ఆ బాలుడి దృష్టి అంతా సన్న్యాసి చేతిలో ఉన్న రొట్టెలు మీదే ఉంది.

సన్న్యాసి అతణ్ణి చేతితో సైగ చేసి పిలిచారు. ఒక్క గంతులో వచ్చి సన్న్యాసి ఇచ్చిన రొట్టెల్ని మిఠాయి తిన్నట్లు సంతోషంగా తిన్నాడు. ఆకలితో ఉన్న బాలుడికి ఆహారం ఇచ్చాననే తృప్తి సన్న్యాసి ఆకలిని తీర్చింది, ఆనందాన్ని మిగిల్చింది. ✸

**అనువాదం : శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**

# దేవీ వైభవం

ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

**(...గత సంచిక తరువాయి)**

"విపంచ్యా గాయంతీ వివిధమపదానం పశుపతేః త్వయారబ్ధే వక్తుం, చలితశిరసా సాధువచనే"

"విపంచ్యా గాయంతీ వివిధమపదానం పశుపతేః" ... సరస్వతీ దేవి కచ్ఛపీ వీణను మీటుతూ అమ్మ వారికి సంగీతం వినిపిస్తున్నది. సరస్వతి కూడా అమ్మ యొక్క శక్తే; అమ్మ నుండే ఆవిర్భవించింది. అమ్మ నుంచి వచ్చిన సరస్వతే అమ్మకు వినోదం కలిగించగలదు. మణిద్వీపంలో అమ్మవారి కోసమని సరస్వతీదేవి కచ్చేరీ చేస్తోందట. ఆమె వీణ అయిన కచ్ఛపికి ఒక ప్రత్యేకత ఉన్నదట. నాదంలో స్వరాలతో పాటు అక్షరాల సంపుటి కూడా వినిపించగలదు – అది దాని ప్రత్యేకత. అంటే ఆ తల్లి స్వరాలతో పాటు అక్షర శక్తుల్ని కూడా ఆవిష్కరింప చేస్తుందట తన వీణతో! ఏదో ఒక పాట పాడితే జగజ్జనని కామేశ్వరీదేవి సంతోషించదు. ఆమెకు ఇష్టమైన పాట... వివిధమపదానం పశుపతేః – అంటే శివుని లీలలు గానం చేస్తోంది. ఆ తల్లికి అదే ఇష్టం. అంటే సంగీతాలైనా, సాహిత్యాలైనా శివమయం కావాలి; శివేతరం చెప్పకూడదు. కావ్యం శివేతరాల్ని పోగొట్టాలి. ఏది శివుడో అదే ఇవ్వాలి కావ్యాలు, అదే ఇవ్వాలి సంగీతం, శివమయమైనవే సంగీత సాహిత్యాలు అంటే మంగళకరమైనవి. సరస్వతీ దేవి శివుని చరిత్రను గానం చేస్తుండగా వింటూ వింటూ అమ్మవారు "సాధు" అన్నారట; సాధు అంటే బాగుంది అని. ఈ మాట వీణానాదం కన్నా చాలా బాగుందట. దానితో సరస్వతీ దేవి తన వీణ అమ్మ పలుకు దగ్గర ఓడిపోయింది అనుకుని తనపైనున్న పయ్యదని వీణపై కప్పారట. అమ్మవారు తనపై ఉన్న బట్టను వీణపై కప్పారట. అదే "నిజ సల్లాప మాధుర్య వినిర్భత్సిత కచ్ఛపి" అన్న మాటను శంకరుల వారు అంత అద్భుతంగా భావించారట.

"గిరిశ చరితే విస్మయవతీ" అన్నారు. అయ్యవారి చరిత్ర చెబితే అంత అద్భుతమా అంటూ ఆనందంగా వింటారట. అయ్యవారంటే అమ్మ వారికి అంత ప్రేమ. ఆ ప్రేమ గురించి తలచుకోవడమే చాలా గొప్పది. దీనినే సమయాచారం అన్నారు. సమయాచారం అంటే శివశక్తుల్ని ఏకంగా దర్శించి ఉపాసించడం. సమయం అంటే సామ్యం అని అర్థం. ఒకరిలో ఉన్న సమత్వం తెలిసి ఆరాధించడం. ఆ ఆరాధన అమ్మవారికి చాలా ఇష్టం. "సమయాచార తత్పర" అనడంలో అంతరార్థం అది. ఈ సమయాచార సంప్రదాయాన్ని అనుసరించి శంకరులు సౌందర్య లహరి రచించారు. శివశక్తుల ఏకం 'సౌందర్యలహరి'లో మొదటి శ్లోకం నుంచీ చూపిస్తారు. 'శివశ్శక్త్యాయుక్తో' అంటే శివుడు శక్తితో కలసి ఉన్నప్పుడు అని. సౌందర్యలహరిలో ఇది మొదటి మాట; అదే లలితా సహస్రంలో చివరిమాట– 'శివ శక్త్యైక్య రూపిణి' అన్నది. సౌందర్యలహరి సారం అంతా చూపడానికి శివఃశక్త్యాయుక్తః అన్న ఒక్క శబ్దం చాలు. మనం శివఃశక్త్యాయుక్తః అని తలచుకున్నప్పుడు లోకక్షేమం అవుతుంది, మనకీ క్షేమం కలుగుతుంది.

శంకరుల వారు శివ శక్త్యైక్య రూపిణీ అనే లలితా సహస్రపు ఆఖరి మాటను ప్రతిపాదిస్తూ ఒక అద్భుతమైన భావన చేశారు. శివ శక్త్యైక్య రూపిణి అనే మాటను మనం అర్థం చేసుకుంటే ఆ రూపంలో ఎక్కడైనా శివుడు కనిపిస్తున్నాడా! కామాక్షీ అమ్మవారి ఎదురుగా కూర్చుంటే అందులో శివుని రూపం ఏది?... అంతా శక్తిరూపమే. కానీ శంకరుల వారు మాత్రం అమ్మా శివశక్తి రూపిణివి నువ్వు అన్నారు. ఎలా కనపడ్డా శివశక్తి రూపమే; ఆయన లేకుండా నువ్వు కనిపించవు, నువ్వు లేకుండా ఆయన రూపం కనిపించదు. ఏ రూపంలో కనిపించినా మీరిద్దరూ కలిసే కనిపిస్తారు అన్నారు. ఇదంతా పెద్ద రహస్యం. దాన్ని మనం కవితా చమత్కారం కింద భావిస్తాం. ఇవి భక్తులు తమ సమాధి స్థితిలో భావించిన దివ్యానుభవాలు.

త్వయా హృత్వా వామం వపురపరితృప్తేన మనసా
శరీరార్థం శంభో రపరమపి శంకే హృతమభూత్,
యదేతత్త్వద్రూపం సకలమరుణాభం త్రినయనం
కుచాభ్యామానమ్రం కుటిలశశి చూడాలమకుటమ్.



అమ్మా 'శివ శక్త్యైక్య రూపిణీ' అనగానే మనకు అర్ధనారీశ్వర స్వరూపం కనిపిస్తుంది. ఆయన తెల్లగా ఉంటారు, అమ్మవారు ఎఱ్ఱగా ఉంటారు. సగం తెలుపు, సగం ఎరుపు కనపడాలి, కానీ అమ్మ రూపం మొత్తం ఎఱ్ఱగా కనిపిస్తోంది. అప్పుడు అయ్యవారు ఎక్కడ ఉన్నట్లు అంటే ఎంత చక్కగా భావన చేశారో చూడండి! ఈ శ్లోకాన్ని భావించడం చేతనైతే ఒక దివ్యానుభూతి లభిస్తుంది. అదేమిటంటే అమ్మవారికి అయ్యవారు సగం ఇచ్చారట. అది ఎలా ఇచ్చారో శివ కల్యాణంలో చూపిస్తారు. "క్రీతోస్మి తవ తపోభిః" – నీ తపస్సుతో నన్ను కొనేశావు అని! "అద్య ప్రభృతి తే దాసః" అని చెప్పి సగం ఇచ్చేశారట. సగం ఇస్తే – నువ్వు సగం ఇచ్చావు కానీ నేను సగంతో తృప్తి పడను అన్నారట (అమ్మవారు). అప్పుడు – 'త్వయా హృత్వా వామం' – సగం తీసుకున్నా, 'వపుః అపరితృప్తేన మనసా' – మనస్సు తృప్తి చెందక నెమ్మదిగా మిగిలిన సగం కూడా నువ్వు దోచుకున్నావు అన్నారు. అంటే భర్త ఇచ్చే ప్రేమలో భార్యకు ఇంక చాలు అనే సంతృప్తి ఉండదు. ఇంకా ప్రేమ కావాలి అనే తపన ఆమెకు ఉంటుంది; ఎందుకంటే ఆయన మీద అంత ప్రేమ ఉంది కనుక. ఆయన పేరే హరుడు, అందరినీ హరించేవాడు ఆయన అయితే ఆయనను హరించేది ఆవిడ.

వేదం ఇద్దరు దొంగలను చెప్పింది. ఒకరు హరుడు, ఇంకొకరు హరి. ఈ దొంగలే మనకి దేవుళ్ళు. అందుకే "తస్కరాణాం పతయే నమః సేనానాం పతయే నమః స్తాయూనాం పతయే నమః" అని రుద్ర నమకంలో మనం స్తోత్రం చేస్తాం. వాళ్ళిద్దరూ దొంగలు. ఎందుకంటే ఇంత జగతిలో ఎన్నో మనకు కనబడకుండానే అలా మాయం చేసేస్తుంటారు. కనిపిస్తున్న వస్తువునే అలా దాచి పెట్టేస్తారు. ఈ దొంగల్ని మనం ఆశ్రయిస్తే, మనది కాదని దేన్ని పేర్చుకున్నామో అదంతా దోచి మనల్ని మిగుల్చుతారు. అందుకు ఆ దొంగల్ని మనం ఆశ్రయించాలి. అయితే ఆయన హరుడు, ఈయన హరి. గుడి మారిందే తప్ప తత్త్వమేమీ మారలేదు. ఈవిడ వాళ్ళను మించి పోయింది, ఏకంగా ఆయన్నే దోచుకుంది. ''త్వయా హృత్వా వామం వపురపరితృప్తేన మనసా శరీరార్థం శంభో రపరమపి శంకే హృతమభూత్" – నువ్వు క్రమంగా మిగిలిన సగం కూడా దోచేసుకున్నావు అన్నారు. తెలుపు మీద ఎరుపు ఆక్రమిస్తే, తెలుపు మరి కనపడదు. అందుకు ఈవిడ మొత్తం ఆక్రమించి ఆయనను కప్పేసింది. "మిగిలిన సగాన్ని నేను దోచుకోలేదు అని నువ్వు చెప్పినా నేను నమ్మను అమ్మా, ఎందుకంటే నీలో ఆయన ఉన్నారని నీ రూపమే నాకు చెబుతోంది" అన్నారు. అది ఎలాగంటే "త్రినయనం కుటిలశశి చూడాలమకుటమ్" అన్నారు. ఆ మూడు నేత్రాలు, సిగ పైన నెలవంక ఆయనవే! అవి చెబితే ఆయనే గుర్తొస్తారు. ఎప్పుడైతే ఆ రెండూ కనిపిస్తున్నాయో అది శివస్వరూపం. శివ స్వరూపాన్ని దోచుకున్నావనడంలో నీ రూపంలో కనిపిస్తున్న చంద్రలేఖ, మూడు నేత్రాలు కూడా నువ్వు అయ్యను తీసుకున్నావు. అయ్య నీలోనే ఉన్నాడని తెలుస్తోంది. మొత్తం అయ్యే అనుకుందామా అంటే నీ మాతృత్వ లక్షణంతో కూడిన రూపం కనిపిస్తున్నది. అది – 'సకలమరుణాభం త్రినయనం కుచాభ్యామానమ్రం కుటిలశశి చూడాలమకుటమ్' ఆ రెండు (పద్య) పాదములలో మొదటి భాగం అమ్మ, రెండవ భాగం అయ్య. అలా సామరస్యాన్ని చూపిస్తున్నారు. – "ఏతద్వత్ రూపం సకల మరుణాభం" మొత్తం అరుణం కనిపిస్తోంది; కనుక నువ్వు అక్కడ ఉన్నావు. ఇక "కుచాభ్యామానమ్రం"... "కుచోన్నతే కుంకుమ రాగశోణే..." సకల జగత్తునూ పోషించే మాతృత్వ చిహ్నం అయిన ఆ దివ్యమైన వక్షఃస్థలంతో నువ్వు శోభిల్లుతూ ఉంటే శక్తివి – అమ్మవి – నువ్వు అక్కడ ఉన్నావని తెలుస్తోంది అన్నారు; కనుక అమ్మ లక్షణం అయ్య లక్షణం ఈ రెండూ నీ రూపంలో కనిపిస్తున్నాయి, ఇది శివ శక్త్యైక్య రూపిణి. ❖

**సశేషం**

# ప్రియ, అప్రియాలకు మూలం మనస్సు

**శ్రీరాముడు:** ఈ మనసులో దుర్భావాలు ఎందుకు వస్తాయి?

**శ్రీవసిష్ఠ మహర్షి:** ప్రబలమైన వాసనలే ఈ జీవుని మోహానికి కారణం.

ఈ సంసారవనంలో మనస్సు అనే మృగం వాసనాజాలం చేత ఈడ్వబడుతోంది. ఫలితంగా అనేక దుఃఖాలను మళ్ళీ మళ్ళీ అనుభవిస్తోంది. ఎవరిలో తత్త్వవిచారణ దృఢత్వాల వల్ల పదార్థాల పట్ల "ఇవి నాకు కలగాలి, ఇవి తొలగాలి"... అనే వాసన (లేక) అభినివేశం నశించిపోతుందో, వారికి జ్ఞానం అత్యంత సులభంగా లభిస్తోంది. మేఘాలు తొలగితే ఆకాశంలో సూర్యుని ప్రకాశం స్వయంగానే ద్యోతక మవుతున్నట్లు "ఏదో పాలించాలి" అనేది విడిచిపెట్టగానే జ్ఞానం ఈ జీవునిలో ప్రకాశిస్తోంది. జ్ఞానమే ఈ జీవుని నిజమైన స్వరూపం, స్వభావం.



ఓ ప్రియ రాఘవా! మనస్సే జీవుడు. అంతేకానీ, ఈ తుచ్ఛమైన దేహం జీవుడు కాదు సుమా! ఎందుకంటావా? ఈ దేహం జడమైనది. ఇక దీనిలోని మనస్సు మాత్రం జడమో, చేతనమో కాక, ఈ రెండింటికీ విలక్షణంగా ఉంటోంది. ఈ మనస్సు ఏ పని చేస్తుందో, అదే వాస్తవంగా ఈ జీవుడు చేస్తాడు. మనసు దేనిని త్యజిస్తుందో, దాన్ని మాత్రమే జీవుడు త్యజిస్తాడు. ఈ భూమండలం, ఆకాశం, వాయువు, మహత్తు... ఇవన్నీ మనస్సు మాత్రమే. ఈ మనస్సు కనుక ఆయా పదార్థాలలో భావన చేయడం జరగకపోతే ఆ యా పదార్థాల ఉనికి అనుభవంలోకి రాదు.

ఎవరి మనస్సైతే అజ్ఞానాన్ని ఆశ్రయిస్తుందో, అట్టివాడు "మూఢుడు" అనీ, అదే మనస్సు వివేకాన్ని ఆశ్రయించినప్పుడు "జ్ఞానయుక్తుడు" అనీ అంటున్నారు. అంతేకానీ ఈ జడ శరీరాన్ని దృష్టిలో పెట్టుకొని, "ఇతడు జ్ఞాని. ఇతడు మూఢుడు" అంటామా? అనలేం.

అలాగే ఎదురుగా ఉన్న దానిని చూసేది మనస్సే కానీ ఈ కనుగుడ్లు కానే కావు. ఆ మనస్సే వినడం అనే పని చేసే చోటును 'చెవులు' అనీ, స్పర్శను పొందే చోటును 'చర్మం' అనీ, సువాసన ఆస్వాదించే చోటును 'ఘ్రాణేంద్రియం' (ముక్కు) అనీ, రుచి చూసే స్థానాన్ని 'నాలుక' అనీ అంటున్నాం. ఆ యా వృత్తులలో ప్రవర్తిస్తున్నట్టి ఈ మనస్సు శక్తి అతి విచిత్రమైనది. మనస్సు లేకపోతే ఇంద్రియాల ఉనికే లేదు. కవిత్వం అల్లుతున్నది కవియే గాని, కలం కాదు కదా! మనస్సే ఇంద్రియాలలో ప్రవేశించి ఆ యా అనుభవాలను రచిస్తోంది.

ఒకే నటుడు అనేక వేషాలు వేస్తూ ఉంటాడు. ఆ వేషాలన్నీ అతడే... కానీ అతను ఆ వేషాలన్నిటికీ విలక్షణంగా ఉంటున్నాడు కదా! అలాగే ఒక వ్యక్తి తండ్రి, తాత, తమ్ముడు, అన్న, కొడుకు, స్నేహితుడు మొదలైనవన్నీ అవుతున్నాడు. అన్నీ అతడే! కానీ అతడు వాటిలో ఒకటి నుంచి మరొకటిగా పరిణమిస్తున్నాడా? లేదే!

ఈ మనస్సు కూడా అన్ని ఇంద్రియాలలోనూ వేరు వేరుగా వర్తిస్తోంది. అందులో ఏ ఒక్కటీ తాను కాకుండా ఉంటోంది. దీనికి వేరుగా ఇంద్రియాలకు అస్తిత్వమే లేదు. ఇది అల్పమైన దాన్ని అధికంగానూ, అధికమైనదాన్ని అల్పంగానూ చెయ్య గలదు. మన మిత్రుల తప్పులు స్వల్ప మైనవిగా, శత్రువుల తప్పులు తీవ్రమైనవిగా కనిపించడమే ఇందుకు తార్కాణం. సత్యాన్ని అసత్యంగా, అసత్యాన్ని సత్యంగా దర్శించ డంలో ఈ మనస్సుకున్న శక్తి మరిక దేనికీ లేదు కదా! ఇది చేదు వస్తువును కూడా మధురంగా భావిస్తే, అట్టి మధురానుభవంగానే పొందగలదు.

ఈ చిత్తం దేనిలో ఏ వృత్తితో ప్రతిభాసిస్తుందో, ఆ వస్తువు అలాగే పరిణమిస్తుంది. "ఇది నాకు ప్రియం" అనే వృత్తితో అది దర్శిస్తున్నప్పుడు, ఆ వస్తువు అలాగే ప్రియమై ప్రాప్తిస్తోంది. ఇలాంటి భావన వల్లనే, వ్యాకులచిత్తుడైన హరిశ్చంద్రుడు ఒకే రాత్రి కొద్ది గంటల కాలంలో పన్నెండు సంవత్సరాల సుదీర్ఘమైన అనుభవం అత్యంత వాస్తవానుభవంలా స్వప్నంలో పొందాడు. మనస్సు వైచిత్ర్యం అది.

దారం తెగిపోతే పూలదండలో ఉన్న పూలన్నీ నేల రాలుతాయి కదా! మనసును జయిస్తే చాలు, ఇక తక్కిన ఇంద్రియాలన్నీ తమంతట తామే అప్రభావితం అవుతాయి. అలాంటి స్థితిలో మనస్సు సుఖదుఃఖాలకూ, ప్రియా ప్రియాలకూ అతీతంగా ఉంటుంది. ❖

('శ్రీవసిష్ఠ రామ సంవాదం' – ఉత్పత్తి ప్రకరణం ఉత్తరార్థం నుంచి) **అనువాదం : వై. హెచ్. రామకృష్ణ**

# మహోన్నత కర్మయోగి!

గౌతముడనే మహాపురుషుడు బౌద్ధమతాన్ని స్థాపించాడు. పరతత్త్వాన్ని గురించిన చర్చ అప్పుడు తీవ్రంగా జరుగుతుండేది. పరతత్త్వం, దేవుడు– వీటిని గురించిన సిద్ధాంతాల విషయమై అతడు పూర్తిగా ఉపేక్షవహించాడు. దేవుడున్నాడా? అని అతణ్ణి పలు మార్లు ప్రశ్నించారు. తనకు తెలియదని అతడు చెబుతూ వచ్చాడు. సద్వర్తనాన్ని గురించి అడిగినప్పుడు "పుణ్యకార్యాలు చేస్తుండండి. సద్భావంతోనే వుండండి" అనేవాడు. ఒకనాడు అతడి వద్దకు ఐదుగురు బ్రాహ్మణులు వచ్చి తమ వివాదాన్ని పరిష్కరించమని కోరారు. వాళ్ళలో ఒకడు, "దేవుడు ఇలాంటివాడు, అలాంటి వాడు, అతణ్ణి పొందటానికి మార్గం ఇదనీ నా గ్రంథం అంటోంది" అన్నాడు. మరొకడు లేచి, "ఆర్యా! అది బొత్తిగా తప్పు. నా గ్రంథం ఇలా అంటోంది. భగవంతుడు ఫలానా లక్షణాలు గలవాడు. అతణ్ణి పొందేమార్గం ఇది" అన్నాడు. అదేవిధంగా తక్కినవారు కూడా చెప్పారు. వారంతా చెప్పింది బుద్ధుడు సావధానంగా ఆలకించి, ఒక్కొక్కరినీ ఈ విధంగా అడిగాడు: "దేవుడు ఆగ్రహిస్తాడని, ఎవరినైనా ఎప్పుడైనా హింసిస్తాడని, అతడు అపవిత్రుడని ఏ గ్రంథాలైనా చెబుతున్నాయా?" "లేదు స్వామీ! అతడు పవిత్రుడని, మంగళస్వరూపుడని గ్రంథాలన్నీ నొక్కి చెబుతున్నాయి" అని వారన్నారు. "ఐతే మీరు పరిశుద్ధులు, సాధుశీలురు కారాదా? అప్పుడే భగవంతుడు ఎలాంటివాడో తెలుసుకోగలుగుతారు" అంటూ బుద్ధుడు హితవు చెప్పాడు.

బుద్ధుడు చెప్పిందేమిటి? "నీ కెవరూ సహాయపడరు; నీకు నువ్వే తోడ్పడాలి. నీ మోక్షాన్ని నువ్వే సంపాదించుకోవాలి." తనను గురించి అతడన్న మాటలివి: "బుద్ధుడనే పదం అనంతమైన జ్ఞానానికి పేరు. అది ఆకాశం మాదిరి అనంతం. గౌతముణ్ణి అయిన నేను ఆ స్థితిని పొందాను; సాధనచేస్తే మీరూ ఆ స్థితిని పొందగలరు." కోర్కెలను పూర్తిగా పరిత్యజించండి. బుద్ధుడు స్వర్గానికి పోవాలని ఆశించలేదు; ధనాన్ని ఆశించలేదు; సమస్తాన్నీ త్యజించి భిక్షాటనం చేస్తూ, సకల ప్రాణుల మేలుకై బోధచేసిన విశాల హృదయుడు ఆయన. అతడొక సారి ఒక రాజుతో ఇలా అన్నాడు: "గొర్రెపిల్లను బలి ఇవ్వటంవల్ల నీకు స్వర్గం లభించేపక్షంలో, మానవుణ్ణి బలియిస్తే అంతకంటే ఎక్కువే లభిస్తుంది కదా! కాబట్టి నన్ను బలియివ్వు." రాజునిర్ఘాంతపోయాడు. నిర్దుష్టం, పరిపూర్ణం అయిన క్రియాశీలానికి నిదర్శనం బుద్ధుడు. అతడు పొందిన మహోన్నత స్థాయినిబట్టి మనం కూడా కర్మమార్గంలో ఆధ్యాత్మిక పరిపూర్ణత్వాన్ని పొందగలమని స్పష్టమవుతోంది.

భగవంతుడిపై విశ్వాసం ఉంటే, ఈ మార్గం అనేకులకు సులభతరమవుతుంది. దేవుడిపై నమ్మకం లేకపోయినా, తత్త్వసిద్ధాంతం లేకపోయినా, ఏ మతశాఖకూ చెందకపోయినా, చర్చికిగాని, దేవాలయానికిగాని వెళ్ళకపోయినా, భౌతికవాదినని చెప్పుకొన్నా పరమపదాన్ని పొందడం ఎవరికైనా సాధ్యమని బుద్ధుని జీవితాన్నిబట్టి తేటతెల్లమవుతుంది. అతన్ని విమర్శించటానికి మనకు అధికారంలేదు. బుద్ధుడి హృదయం– లవలేశమైనా నాకుంటే ఎంత బాగుంటుందో అని అనిపిస్తుంది. ఇతరులు భక్తి, యోగ, జ్ఞానమార్గాల్లో ఏ పరమోన్నత స్థితిని పొందారో, బుద్ధుడూ ఆ స్థితిని పొందాడు. పరిపూర్ణత్వం నిష్కామకర్మవల్ల సాధ్యమని నిరూపించిన మహోన్నత కర్మయోగి బుద్ధుడు. ❖



# పరిప్రశ్న

**- స్వామి మేధానంద పురి**

– కె. శేషప్ప

**? : ఇరవై ఏళ్ళుగా సాధన చేస్తున్నాను. కానీ మనోవాసనలను జయింపలేకున్నాను?**

✍: ప్రతి మనిషికీ ఆరు జన్మల వాసనలు మనసులో నిల్వ ఉంటాయి. క్రిందటి 7వ జన్మలోని వాసనలు ప్రారబ్ధంగా మారి ఈ జన్మలో అనుభవిస్తాడు. లేక పూర్వ వాసనలలో ఫలాన్నివ్వడానికి సిద్ధంగా ఉన్న సంస్కారాల వల్ల ఈ జన్మ కలుగుతుంది. ఇదంతా పురాణాల ఆధారంతో చెప్పింది. దీనినే "ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్" అని గీతలో (2-55) అన్నారు. కనుక వివేక, వైరాగ్య ఏకాగ్రతలు కలగడానికి మనసులో ఉన్న అన్ని వాసనలూ క్షయం అవాలి.



ఉదాహరణకు ఒకపెద్ద బండరాయిని సుత్తితో బ్రద్దలు కొట్టే వ్యక్తి నలభై దెబ్బలు కొట్టిన తరువాత రాయి పగులుతుంది. నలభయ్యో దెబ్బకే రాయి పగిలిందని చెప్పలేం. ముప్పైతొమ్మిది దెబ్బలు సహకరించి నలభయ్యో దెబ్బ ద్వారా ఫలితం కలిగిందని చెప్పవచ్చు. అలాగే సాధకుడు చేస్తున్న సాధన ఫలితం బాహ్యంగా కనిపించక పోయినా అంతరంగంలో ఆధ్యాత్మిక ఉన్నతి కలుగుతూనే ఉంటుంది.

శుద్ధ మనస్సు కలవానికి స్వప్నంలో కూడా నిరంతరం ఇష్టచింతనయే కలుగుతుంది. చెడు స్వప్నాలు రావు. అందరిలోనూ పరమాత్మను చూస్తూ, నిష్కామ కర్మ చేసేవారికి సర్వత్రా ఇష్ట దర్శనం జాగ్రదావస్థలో కలుగుతుంది. అంతవరకూ సాధన చేస్తుండాలి.

– సాయి రామానందస్వామి, పొదలకొండపల్లి

**? : పుత్రులు, పుత్రికలు లేకుంటే వారి జీవన గమ్యమేమిటి?**

✍: పుత్రులు, పుత్రికలు ఋణం తీర్చుకోవడానికి గానీ, చెల్లించడానికి గానీ పుడతారు. "ఋణానుబంధ రూపేణ పశుపత్ని సుతాలయాః" పద్మపురాణంలోని సంతానం లేని భార్యాభర్తల సంవాదంలో సతీమణి, భర్తగారికి సంతానం గురించి ఈ విధంగా చెప్పింది. మొత్తం లోకంలో ఐదురకాల ఋణాల వల్లనే సంతానం కలుగుతుంది.

ఉదాహరణ: ఒక వ్యక్తికి పుత్రుడు జన్మించగా పుత్రుని జాతకం జ్యోతిష్యునికి చూపించారు. జోస్యుడు "నీ కుమారుడు నీ ఋణం చెల్లించడానికి పుట్టాడు. కాబట్టి, ఇతని వద్ద నుంచి ధనం తీసుకోవద్దు" అన్నాడు. కుమారుడు పెరిగి పెద్దవాడై విదేశాలకు వెళ్ళి ధనం సంపాదించి ఇంటికి వచ్చాడు. ధనం ఉన్న పెట్టెను తండ్రి చేతికి ఇచ్చి వెంటనే కుమారుడు ప్రాణం విడిచాడు.

ఋణాలు ఐదురకాలు :

1. దేవదత్తుని వద్ద నుంచి ధనం తీసుకొని యజ్ఞదత్తుడనే వాడు దానిని చెల్లించకుండా మరణించాడు. మరు జన్మలో యజ్ఞదత్తుని పుత్రునిగా దేవదత్తుడు జన్మించి, తండ్రి ధనాన్ని దుర్వినియోగం చేసి, తండ్రిని దుఃఖంలో ముంచి మరణించాడు.

2. దాచిన సొమ్మును తిరిగి ఇవ్వక పోయినా, సొమ్ము దాచినవాడు కుమారునిగా పుట్టి, తల్లి తండ్రులను దుఃఖంలో ముంచి మరణిస్తాడు.

3. అకారణంగా ఇతరులను బాధపెట్టి సంతోషిస్తారు కొందరు. బాధపడిన వాడు తనను బాధపెట్టిన వారి కొడుకుగా మరు జన్మలో జన్మించి, తండ్రి ధనం తీసికొని విరోధిగా ఉండి పితృకర్మలు కూడా ఆచరించడు.

4. మాతా పితరుల సేవ చేసి ఋణ విముక్తులవుతారు కొందరు.

5. కర్మబంధనం చేత పుత్రులై జన్మించి, అంటీముట్టకుండా నిర్లిప్తంగా ఉంటారు మరికొందరు. అలాగే పుత్రికలు కూడా ఋణం తీర్చుకోవడానికీ, లేక ఋణం తీసుకోవడానికీ పుడతారు. "దుహ" "ప్రపూరణే" ధాతువు నుండి 'దుహితా' అనే శబ్దం ఏర్పడింది. దుహితా అంటే కుమార్తె. తల్లితండ్రుల ధన సంపత్తులను తన ఇంటికి చేర్చేది అని అర్థం. పాలు పితకడాన్ని 'దహన'క్రియ అంటారు. అలాగే కూతురు తల్లితండ్రులనే ఆవును పిండి, సొంత ఇల్లు అనే తన పాత్రను నింపుకుంటుంది.

ఏ విధమైన ఋణమూ లేనివారికి సంతానం ఉండదు. అందువల్లనే శ్రీమద్ భగవద్గీతలో "ఉద్ధరేదాత్మనాత్మానమ్" (6-5) అన్నారు. అలాంటి వారు తమ తపః శక్తితో మోక్షం పొందగలరు. వారికి మోక్షం పొందడానికి పుత్రులు కానీ, పుత్రికలు కానీ, మరెవరి సహాయం కానీ అవసరం లేదు. ❖

(...గత సంచిక తరువాయి)

- రెంటాల జయదేవ

# మానసిక పూజే ముఖ్యం!

## మానసిక పుష్పాలు

మానసికంగా కూడా ఎనిమిది పుష్పాలుంటాయి. అవి –

**అహింసా ప్రథమం పుష్పం,**
**పుష్పమింద్రియ నిగ్రహః 34**
**తృతీయం తు దయా పుష్పం,**
**క్షమా పుష్పం చతుర్థకం,**
**ధ్యాన పుష్పం, తపః పుష్పం,**
**జ్ఞాన పుష్పం తు సప్తమం 35**
**సత్యం చైవాష్టమం పుష్ప**
**మేభిః తుష్యంతి దేవతాః 35 1/2**

'దేవుణ్ణి మొదట 'అహింస' అనే పుష్పంతో పూజించాలి. మరోమాటలో చెప్పాలంటే, ఏ ప్రాణికీ మానసికంగా కూడా బాధ కలిగించకుండా ఉండడమే దేవుడికి సమర్పించే ప్రథమ పుష్పం.

'ఇంద్రియ నిగ్రహం' అనేది రెండో పుష్పం. అంటే, చేతులు, కాళ్ళు మొదలైన కర్మేంద్రియాలనూ, మనస్సుతో సహా జ్ఞానేంద్రియాలనూ భక్తుడు తన అదుపులో ఉంచుకోవడమే దేవుడికి అందించాల్సిన రెండో పువ్వు.



'దయ' అనేది మూడో పుష్పం. కష్టాలలో, బాధలలో ఉన్న వారి బాధలను తొలగించడానికి చేసే కృషే 'దయ'. అది దేవుడికి అర్పించాల్సిన మూడో పుష్పం.

'క్షమ' అనేది నాలుగో పుష్పం. ఎవరైనా తనకు అపకారం చేసినప్పటికీ, ఓరిమితో సహించడమే 'క్షమ'. ఇదే భగవంతుడికి ఇవ్వాల్సిన నాలుగో పుష్పం.

'ధ్యానం' అయిదో పువ్వు. ఇష్టదైవాన్ని నిరంతరం మనస్సులో తలచుకొంటూ, ఆయన మీదే మనస్సును లగ్నం చేయడం 'ధ్యానం'. దేవుడికి అర్పించాల్సిన అయిదో పుష్పమిది.

'తపస్సు' ఆరో పుష్పం. మానసిక, వాచిక, కాయిక నియమాలు ఉండడం తపస్సు. ఇదియే దేవుడికి అర్పించాల్సిన ఆరో పుష్పం.

'జ్ఞానం' ఏడో పుష్పం. పరమాత్మను గురించిన సరైన తెలివి ఉండడమే జ్ఞానం. దేవదేవుడికి సమర్పించాల్సిన ఏడో పుష్పం.

'సత్యం' ఎనిమిదో పుష్పం. ఇతరులకు బాధ కలిగించకుండానే యథార్థం పలకడమనేది సత్యమనే ఎనిమిదో పువ్వు. భగవంతుడికి ఇవ్వాల్సిన ఎనిమిదో పుష్పం.

– ఈ ఎనిమిది రకాల పుష్పాలతోనూ పూజిస్తే దేవతలు సంతోషిస్తారు.

భౌతికమైన పుష్పాలతో, ధూపదీపాలతో, ఫలాది నైవేద్యాలతో పూజించడం ప్రాథమికమైన పూజకు సంకేతం. అయితే, ఈ బాహిరమైన పూజలతో పాటు ఆంతరంగికమైన మానసిక పూజ కూడా ఎంతో ప్రధానం. అహింసాది ఉత్తమ గుణాలను అలవరచుకొని, ఈశ్వరార్పణ బుద్ధితో పరోపకారం చేయడమే మానసిక పూజ. ఇదే నిజమైన పూజ. దేవతలను అక్షరాలా ఆనందపరచే పూజ.

ఈ మానసిక పూజ, మానసిక పుష్పాల గురించి కొద్దిపాటి తేడాతో ఆది శంకరాచార్యులు సైతం చెప్పారు.

జ్ఞాని అయిన భక్తుడు మానసిక పూజలో తన హృదయాన్నే ఆ భగవంతుడికి ఆలయంగా చేయాలి. శమ, దమాలతో స్థలాన్ని శుద్ధి చేయాలి. హృదయాలయంలోనే ఆ సర్వేశ్వరుణ్ణి ప్రతిష్ఠించుకోవాలి.

***అహింసా ప్రథమం పుష్పం, పుష్పం ఇంద్రియ నిగ్రహం ।***
***సర్వభూత దయా పుష్పం, క్షమా పుష్పం విశేషతః ॥***
***శాంతి పుష్పం తపః పుష్పం, ధ్యాన పుష్పం తథైవ చ ।***
***సత్య మష్టవిధం పుష్పం విష్ణోః ప్రీతికరం భవేత్ ॥***

*'అహింస, ఇంద్రియ నిగ్రహం, సర్వభూతాల పట్ల దయ, క్షమా గుణం, శాంతిత్వం, తపస్సు, ధ్యానం, సత్యం – అనే ఎనిమిది మనఃపుష్పాలు ఆ భగవంతుడికి అత్యంత ప్రీతికరమైనవి. కాబట్టి, పరిపూర్ణ విశ్వాసంతో, చిత్తశుద్ధితో మనం వాటిని సమర్పించాలి' అని భావం.*

మొత్తం మీద పూజ బాహిరమైనదైనా, మానసికమైనదైనా మనం అర్పించే పుష్పాల ప్రాధాన్యాన్ని తెలుసుకొని, వ్యవహరించడం ముఖ్యం. ❖

*('సకల శుభకరం శంఖం' వచ్చే సంచికలో...)*

# బంగారు బుద్ధుడు

కథ: స్వామి విమూర్తానంద   చిత్రాలు : మ.సె.   తెలుగుసేత : స్వామి జ్ఞానదానంద




4
మరుసటిరోజు, ప్రజలు వేల సంఖ్యలో
గుమిగూడారు. భిక్షువులందరూ కలిసి
బుద్ధుని ప్రతిమను ఉంచిన వాహనాన్ని
ఊరేగింపుగా తీసుకెళ్ళసాగారు.
అసంఖ్యాక జన సమూహం బుద్ధుణ్ణి దర్శించుకోవడానికి వచ్చింది. ఊరేగింపు మందకొడిగా ముందుకు సాగుతోంది.
5
ప్రజలందరూ ఉత్సాహంగా ఊరేగింపులో పాల్గొని
ఆనందపరవశులయ్యారు. ఆకాశం హఠాత్తుగా
మేఘావృతం కావడం వారు గమనించలేదు.
6
అరే! ఆకాశంలో
దట్టమైన మేఘాలు!
భగవాన్! ఇదేమి
విపరీతం!
భిక్షువులారా!
వర్షంలో బుద్ధుని విగ్రహం
తడవకూడదు. అది
మట్టి విగ్రహం,
కరిగిపోతుంది. విగ్రహాన్ని
వెంటనే పరదాలతో
కప్పండి.

మిగతా 36వ పేజీలో...

mఆనవత్వం, దివ్యత్వాల సంగమం

# దివ్యజనని జీవితం

-ప్రవ్రాజిక భవానీప్రాణ



దేవతలు మానవరూపంలో జన్మించి, మనలాగే ప్రవర్తిస్తూ మన మధ్యనే కలసి మెలసి తిరుగుతూ ఈ ప్రపంచంలో ఉంటారు. అయితే వారిని గుర్తించడం చాలా కష్టం.

*నాహం ప్రకాశః సర్వస్య యోగమాయా సమావృతః... (గీత : 7. 25)*

'యోగమాయ ఆవరించడం వల్ల సాధారణ జనులు నన్ను గుర్తించలేరు'అని శ్రీకృష్ణుడు అన్నాడు.

"రాత్రిపూట చంద్రుని ప్రతిబింబం నీటిలో కనిపిస్తుంది. చిన్న చేపలు ఆ ప్రతిబింబాన్ని ఆటవస్తువుగా భావించి ఆనందంగా దానితో ఆడుకుంటాయి. చంద్రాస్తమయం అయ్యాక చేపలు ఆ చంద్రుని ప్రతిబింబమే తమతో ఉన్నదనీ, నిజమైన చంద్రుడు అందుకోలేనంత దూరంలో ఉన్నాడనీ గ్రహిస్తాయి" అని శ్రీశారదామాత అంటారు.

**దివ్యత్వం ధృవీకరణ:** శారదాదేవి దివ్యత్వాన్ని తనంతట తాను దయతో తెలియజేస్తే తప్ప ఆమెను ఎవరు అర్థం చేసుకోగలరు! అందుకనే ఆమె అప్పుడప్పుడూ చిన్న చిన్న మాటలలో తన తత్త్వాన్ని తెలియబరచేవారు. ఉదాహరణకు అమ్మ స్వయంగా చెప్పిన ఈ మాటలనే చూద్దాం: "కొన్ని సార్లు నేను రామ్‌ముఖర్జీ కూతుర్ని మాత్రమే అనుకుంటాను. నా వయస్సు స్త్రీలు జయరాంబాటీలో చాలా మంది ఉన్నారు. వారికీ, నాకూ తేడా ఏమిటి? ఏక్కడి నుంచో భక్తులొచ్చి నమస్కారాలు చేసేవారు. వారి గురించి వాకబు చేస్తే - ఒకరు డాక్టరు, ఒకరు ఇంజనీరు, మరొకరు లాయరు- ఇలా ఉండే వారు. వారందరూ ఇలా ఇక్కడకు ఎందుకు వస్తున్నారు? ప్రజలు నన్ను దేవి అనీ, దైవం అనీ అంటున్నారు. బహుశా అది నిజమేనని నేనూ అను కుంటాను. లేనట్లయితే ఇన్ని దివ్య అనుభూతులు నాకెందుకు కలుగు తాయి? ఇది నిజంగా దివ్య శరీరమే అయి ఉంటుంది. మానవ జన్మ ఎత్తిన వారెవరైనా ఇంతటి అనుభూతులను భరించగలరా?"

ఒకరోజు శారదాదేవి ఉద్బోధన్‌లో పూజ చేస్తుండగా, పిచ్చి అత్త ఆమెను తిడుతున్నారు. పూజ అయిన తరువాత శారదామాత "ఎంతో మంది ఋషులు కఠిన తపస్సు చేసిన తరువాత కూడా నన్ను అందుకోలేరు. కానీ మీరో! నన్ను ఇంత సులభంగా పొందినా చేజార్చుకుంటున్నారు" అన్నారు.

ఒక భక్తురాలు ఒకసారి - "అమ్మా! మిమ్మల్ని దివ్యజననిగా మేమెందుకు గుర్తించ లేకపోతున్నాము?" అని అడిగింది. అమ్మ ఇలా సమాధానమిచ్చారు - "ప్రతి ఒక్కరూ గుర్తించగలరా తల్లీ! ఒక కొలను తీరాన ఒక వజ్రం పడి ఉంది. అందరూ ఆ కొలనులో స్నానం చేసే వారు. ఆ వజ్రం మీదనే తమ కాళ్ళు రుద్దుకొని వెళ్ళేవారు. ఒక రోజు అక్కడకు ఒక వజ్రాల వ్యాపారి వచ్చాడు. అతను దాన్ని చూసిన వెంటనే అది అత్యంత విలువైన వజ్రంగా గుర్తించాడు".

మరి ఆ వజ్రాల వ్యాపారి ఎవరు? అద్భుత వజ్రాల వ్యాపారి అయిన శ్రీరామకృష్ణులకు ఆమె ఎవరో తెలుసు. ఫలహారిణీ కాళీపూజ రోజున ఆయన శారదాదేవిని దివ్యజననిగా పూజించి, జపమాలతో సహా తన సాధనా ఫలాన్నంతా ఆమెకు అర్పించారు. ఆయన ఇలా అన్నారు: "ఆమె శారద, సరస్వతి, జ్ఞానదాయిని. అందరికీ జ్ఞానాన్ని ప్రసాదించడానికే ఆమె వచ్చింది."

**పవిత్రతా స్వరూపిణి :** శ్రీశారదామాత దురాశాపరులైన సోదరులు, పిచ్చిదైన సురబాల, విపరీత ధోరణి గల ఆమె

కూతురు రాధ, నళిని – ఇత్యాది బంధువుల మధ్య జీవించారు. కుటుంబ వ్యవహారాలలో అంతగా ఆమె మునిగి ఉండడం చూసి, 'యోగీన్ మా'కు శారదామాత దివ్యత్వం పట్ల ఒక మారు సందేహం కలిగింది. అప్పుడు శ్రీరామకృష్ణులు ఒక దృశ్యంలో ఒక పసిబిడ్డ మృతదేహం గంగా నదిలో కొట్టుకుపోతున్నట్లు చూపించి, "గంగానది ఈ మృతశరీరం వల్ల అపవిత్రం అవుతుందా? శారదాదేవి కూడా పవిత్ర గంగ లాంటిదే. ఆమె గొప్పతనాన్ని ఎన్నడూ సంశయించకు" అన్నారు.

**మానవత్వం దివ్యత్వాల మేలి కలయిక:** శ్రీశారదాదేవిలో మానవత్వం, దివ్యత్వం ఎంత అత్యద్భుతంగా సమ్మిళిత మైనాయంటే ఆ రెండిటి మధ్య ఉన్న వ్యత్యాసాన్ని గమనించడం చాలా కష్టం. ఈ రెండు తత్త్వాలూ ఆమె వ్యక్తిత్వంలో దర్శనమిస్తాయి. తల్లితండ్రులకు ప్రేమను పంచి ఇచ్చే పుత్రికగా, అపరిమిత శ్రద్ధతో చివరి వరకూ సేవలందించి కర్తవ్యపరాయణ అయిన భార్యగా, వచ్చిన భక్తులందరికీ స్వ–పర భేదం లేకుండా మాతృత్వపు వాత్సల్యాన్ని పంచి ఇచ్చి మాతృ మూర్తిగా ఆమె తన పాత్రను అత్యద్భుతంగా పోషించారు. కఠోర హృదయులైన బందిపోటు దంపతులకు ఆమె కాళీగా దివ్య దర్శనమివ్వడమే గాక, పుత్రికలా ప్రవర్తించి వారి హృదయాలలో తల్లి తండ్రుల ప్రేమనూ, వాత్సల్యాన్నీ రేకెత్తించింది. భర్తకు వంట చేసి పెట్టి సేవ లందించింది. అయినా అతి సహజంగా ఆయన పూజలు అందుకొంది. కనులు మూసుకొనీ, తెరచుకొనీ అద్భుత దివ్య దర్శనాలను ఎల్లప్పుడూ పొందుతున్నా వినయశీలి అయిన కోడలిగా, సంప్రదాయ గ్రామీణ యువతిగా ఇతరుల ముందుకు వచ్చేటప్పుడు ముసుగు కప్పుకొని... కుటుంబంలో తన పాత్రను చక్కగా పోషించేది. తానే స్వయంగా సరస్వతి అయినా ఆమె ఎంత నెమ్మదిగా, వినయంగా, లో గొంతుకతో మాట్లాడేదంటే ఆమె మాటలు ఇతరులు అర్థం చేసుకోవాలంటే – మధ్యలో ఒకరుండి, ఆ మాటలు చెప్పవలసి వచ్చేది. శిష్యులకు అత్యున్నత జ్ఞానాన్నిచ్చి ఆధ్యాత్మిక లక్ష్యం వైపు ఆమె నడపగలిగేది. శ్రీరామకృష్ణుని ప్రత్యక్ష శిష్యులకు సలహాలివ్వడమే గాక వారు ఎదుర్కొనే కఠిన సమస్యలకు అత్యంత సులభమైన పరిష్కారాలను ఆమె సూచించేది. అయినా ఆమె ఎంత అమాయకంగా ఉండేదంటే, గడియారానికి 'కీ' ఇవ్వగలిగిన బాలికను ఆమె ఎంతో మెచ్చుకొన్నారు. లాంతరులో సరిగ్గా వత్తి వేయడం, లాంతరు చిమ్నీ శుభ్రం చేయడం ఎంతో కష్టమైన పనిగా ఆమె భావించేవారు. పంపులో నుంచి నీరు వచ్చే ముందు వచ్చే "హుస్" అనే శబ్దం విని, పంపు లోపల పాము ఉందేమోననుకొని భయపడి పరుగెత్తారామె. ఇవన్నీ ఇలా ఉన్నా ఆమె సంఘ జనని, జ్ఞానదాయిని.



**ముక్తిదాయిని మాతృమూర్తి:** స్వామి వివేకానంద, శ్రీశారదాదేవిని సజీవ దుర్గాదేవిగా పూజించారు. స్వామి బ్రహ్మానంద శ్రీశారదామాతను దుర్గాష్టమి రోజున 108 కలువపూలతో పూజించారు. 'శ్రీమాత చేతిలోనే బ్రహ్మ జ్ఞానమనే ద్వారపు తాళం చెవి ఉంది. దయతో అమ్మ ఆ ద్వారం తెరవకపోతే, ముక్తి సాధ్యం కాదు' అని అంటారు స్వామి బ్రహ్మానంద.

సర్వసాధారణంగా మానవులందరూ అహంకార పూరితులై ఉంటారు. వేలమంది భక్తులు రాత్రింబవళ్ళూ శ్రీశారదామాతను దుర్గా, కాళీ అని పిలుస్తూ పూజించేవారు. కానీ ఆమెలో లేశమంతయినా అహంకారం కనిపించేది కాదు. అంతటి అత్యున్నత గౌరవాన్ని పొంది అహంకరించకుండా ఉండగలగడం మానవ మాత్రులకు సాధ్యం కాదు.

ఒకసారి స్వామి ఈశానందను, 'శ్రీశారదామాత దివ్యత్వాన్ని ఎలా అర్థం చేసుకున్నారు' అని ఒకరు అడిగారు. ఆయన ఈ విధంగా అన్నారు– "ఎలాంటి కోరికలూ లేనివారి నెవరినైనా మీరు చూశారా? మానవులకు కోరికలుంటాయి. దేవునికి ఏ కోరికలూ ఉండవు. ఏ కోరికలూ లేని శ్రీశారదామాత సాక్షాత్తూ దివ్యజనని".

మానవాళి పట్ల అపారమైన కరుణతో దివ్యజనని మానవ జన్మ స్వీకరించింది. వాత్సల్యపూరిత సంబంధాన్ని సులభతరం చెయ్యడం కోసం ఆమె తన దివ్యత్వాన్ని కప్పి పుచ్చుకొని, మానవత్వపు ఛాయలనే ప్రకటించింది. అందువల్లే ఆమె లజ్జాపటావృతగా సౌలభ్యపు ముసుగునూ, సాధారణ స్త్రీలా మాతృత్వపు ముసుగునూ దాల్చింది. మనందరం మానవత్వం దివ్యత్వాల సంగమ తీర్థంలో మునిగి తరిద్దాం, అమ్మ కృపకు పాత్రులమవుదాం. ❖

అనువాదం: డా॥ పన్నాల శ్యామసుందర మూర్తి



# బుద్ధం శరణం గచ్ఛామి!

– బ్రహ్మచారి గౌతమ్

"పురుషులలో పుణ్య పురుషులు వేరయా" అంటాడు యోగి వేమన. క్రీ॥పూ॥ ఆరవ శతాబ్దిలో వేదాలలోని జ్ఞాన కాండను పూర్తిగా విడిచిపెట్టి, కర్మకాండను కలుషితం చేసి, లోకులు పెడతోవ పట్టసాగారు. అందరూ అజ్ఞానం, అధర్మం అనే అంధకారంలో మునిగిపోతున్నారు. అలాంటి సమయంలో ధ్యానమగ్నుడై ఉన్న బోధిసత్త్వుడి దగ్గరకు దేవతలు వెళ్ళి, భూలోకాన్ని ధర్మ ప్రకాశంతో నింపాల్సిందిగా ప్రార్థించారు.

వారి ప్రార్థనను మన్నించి అది తన ఆఖరి జన్మ అని చెప్పి, ఈ జన్మలో బుద్ధత్వం పొంది లోకకల్యాణార్థం తన శాయశక్తులా కృషి చేసి, తరువాత నిర్వాణంలో లీనమవుతానన్నాడు బోధిసత్త్వుడు.

**దివ్యపురుషుని ఆవిర్భావం:** కపిలవస్తు దేశానికి రాజు శుద్ధోదనుడు. అతని పత్ని మాయాదేవి. ఒకరోజు మాయాదేవికి ఒక కల వచ్చింది. ఆ కలలో ఒక దివ్యమైన ఏనుగు దివి నుంచి భువికి రావడం, ఆ ఏనుగుకు దేవతలు అనేకులు పూలు వేస్తూ నమస్కరించడం, ఆ ఏనుగు తన దేహంలో లీనమవడం దర్శించింది. కాలక్రమంలో మాయాదేవి గర్భవతి అయింది. వైశాఖ పూర్ణిమ నాడు ప్రసవానికి పుట్టింటికి బయల్దేరింది. లుంబినీ వనం దాటుతుండగా ప్రసవవేదన ప్రారంభమై, అందమైన బాలుడు జన్మించాడు. మహారాజు చాలా ఆనందించాడు. శాక్యవంశంలో గౌతమ గోత్రంలో పుట్టిన ఆ బాలుడికి సిద్ధార్థుడు అని నామకరణం చేశారు. శుద్ధోధనుడు జ్యోతిష్కులను పిలిపించాడు. వారందరూ ఈ బాలుడు ప్రపంచానికే చక్రవర్తి అవుతాడనీ, అతని కీర్తి ప్రతిష్ఠలు ఆచంద్రార్కం వర్ధిల్లుతాయి అనీ అన్నారు. అయితే అసితుడు అనే మేటి జ్యోతిష్కుడు మాత్రం మౌనంగా ఉండిపోయాడు. మహారాజుగారు అతని అభిప్రాయం అడుగగా, బాలుడు యుక్తవయస్సులో అన్నీ పరిత్యజించి సన్యాసి అవుతాడని చెబుతూ, వెక్కి వెక్కి ఏడవడం మొదలుపెట్టాడు. రాజు దిగ్భ్రాంతుడయ్యాడు. అసితుడు రోదిస్తూనే ఉన్నాడు. శుద్ధోదనుడు, అసితునితో, "ఎందుకు అంతగా కన్నీరు కారుస్తారు! ఇతడు నా పుత్రుడు, మీ కుమారుడు కాదు కదా" అన్నాడు. దానికి జవాబుగా "ఓ రాజా! నీ కుమారుడు సామాన్యుడు కాదు. అతను కాబోయే బుద్ధుడు. ఎందరికో మార్గదర్శి అవుతాడు. అప్పటికి నేను బ్రతికి ఉండను. అతను బోధించే ధర్మం వినడానికి నేనుండను అని బాధగా ఉంది" అన్నాడు అసితుడు.

అది విన్న శుద్ధోదనుడు భయపడ్డాడు. తన కుమారుణ్ణి కంటికి రెప్పలా, ఏ బాధా దుఃఖమూ తెలియకుండా కాపాడుకోవాలనుకున్నాడు. వృద్ధులు, రోగులు, మృతులు రాకుమారుని కంటబడకుండా కట్టుదిట్టం చేశాడు. అతను ఎటు వెళ్ళినా ఉల్లాసకరమైన దృశ్యాలే కనపడేలా జాగ్రత్తలు తీసుకున్నాడు. రాకుమారునికి వేసవి కాలానికీ, వర్షాకాలానికీ, శీతకాలానికీ వేరు వేరుగా మూడు భవనాలను నిర్మింపజేశారు. నిత్యం నృత్య, గానాలతో ఆనందకరంగా ఉండడానికి పలువురు కళాకారుల్ని ఏర్పాటుచేశారు. ఈ ప్రపంచంలో బాధలు, దుఃఖాలు అనేవి ఉంటాయనే సంగతి రాజకుమారుడికి తెలియకుండా జాగ్రత్తపడ్డారు.

**జీవన యాత్రలో మజిలీలు :** యుక్తవయస్సు వచ్చిన సిద్ధార్థుడికి రూపవతి, సుగుణవతి, సౌశీల్యవతి అయిన యశోధర అనే రాజకుమారితో వివాహం జరిపారు. అన్ని సుఖాల మధ్య పెరిగినా సిద్ధార్థుడు అంతర్ముఖుడై ఉండేవాడు. ఒకరోజు సాయంసమయంలో అంతఃపుర ఉద్యానంలో విహరిస్తున్న రాకుమారుడికి పురవీధులలో తిరిగి రావాలనిపించింది. వెంటనే చెన్నుడు అనే రథసారథిని పిలిపించి, రథాన్ని సిద్ధం చెయ్యమన్నాడు. మహారాజు గారి అనుమతి లేనిదే తాను ఆ పని చెయ్యలేనన్న చెన్నుణ్ణి తాను కాబోయే మహారాజుననీ, తన ఆజ్ఞను పాలించాలనీ చెప్పి బలవంతంగా ఒప్పించాడు సిద్ధార్థుడు.

నగర వీధులలో తిరుగుతుండగా సిద్ధార్థుడి దృష్టి ఒక వృద్ధుడి మీద పడింది. అప్పటి వరకూ యువరాజు వృద్ధుల్ని చూడలేదు.

అతను చెన్నుణ్ణి "అతను ఎవరు, ఎందుకు అలా ఉన్నాడు?" అని ప్రశ్నించాడు. అతనొక వృద్ధుడనీ, కాలక్రమంలో అందరూ వృద్ధులవుతారనీ చెన్నుడు చెప్పాడు. "నేను, మా తండ్రిగారు – ఇలా నాకు తెలిసిన వాళ్ళందరూ వృద్ధులవుతారా?" అని అడిగాడు. చెన్నుడు "అవును, అందరూ వృద్ధులవుతారు" అంటూ, యువరాజు ముఖంలో విచారం చూసి రథాన్ని రాజభవనం వైపు తిప్పాడు.

ఇంతలో సిద్ధార్థుడు ఒక రోగిని చూశాడు. "అతను ఎవరు" అని ప్రశ్నించగా, "అతను ఒక రోగి" అని చెప్పి, "ముసలితనంలో రోగాలు వస్తాయి" అని చెన్నుడు అన్నాడు. సిద్ధార్థుడు "నాకూ, మా తండ్రిగారికీ, నీకూ – అందరికీ రోగాలు వస్తాయా?" అని అడిగాడు. చెన్నుడు "అవును" అంటూ రథాన్ని వేగంగా నడిపాడు.

ఈ లోగా సిద్ధార్థుడి కళ్ళకు ఒక మృతదేహం కనపడింది. ఆ మృతదేహాన్ని అంత్యక్రియల కోసం తీసుకుని వెళుతున్నారు. చెన్నుణ్ణి "ఎవరా వ్యక్తి? కదలకుండా ఉన్న అతణ్ణి ఎక్కడికి మోసుకుని వెళుతున్నారు?" అని అడిగాడు సిద్ధార్థుడు. చెన్నుడు "యువరాజా! అతను మరణించాడు. అతని దేహాన్ని దహనం చెయ్యడానికి శ్మశానానికి తీసుకు వెళుతున్నారు" అన్నాడు. "మనందరం కూడా చనిపోతామా?" అని అడిగాడు యువరాజు. "అవును యువరాజా! పుట్టిన ప్రతీ జీవీ చనిపోతుంది" అన్నాడు.

సిద్ధార్థుడి దృష్టి ఒక సాధువు మీద పడింది ఈ మారు. "ఇంటింటికీ వెళ్ళి భిక్ష అడుగుతున్న ఆ వ్యక్తి ఎవరు? ఆయన ముఖం ఎంత ప్రశాంతంగా ఉంది!" అన్నాడు. చెన్నుడు "అతనొక సాధువు. అతను ఈ ప్రపంచాన్ని త్యజించాడు; సన్న్యసించి సత్యాన్వేషణ చేస్తున్నాడు" అన్నాడు. ఇవన్నీ చూశాక ఎప్పుడూ చిరునవ్వుతో ఉండే యువరాజు ముఖంలో చింత, నిరుత్సాహం వ్యక్తమయ్యాయి.



**సత్య శోధనలో ముందుకు...** సత్యాన్వేషణ కోసం ఆ సాధువులా జీవించాలని నిశ్చయించుకున్నాడు. అప్పుడు తనకు మగసంతానం కలిగిందన్న వార్త వచ్చింది. సిద్ధార్థుడు మరొక కొత్త బంధం అని విచారించాడు. ఒక అర్ధరాత్రి వేళ సిద్ధార్థుడు అన్నింటినీ పరిత్యజించి, సత్యాన్వేషణకై వెళ్ళిపోయాడు. సాధు పుంగవులనూ, గురువులనూ ఆశ్రయించి వారి వద్ద ఎన్నో విషయాలను తెలుసుకున్నాడు. అయినా తృప్తి చెందక భయంకరమైన అడవిలో ఆరేళ్ళ పాటు కఠోరమైన తపస్సు చేశాడు. అయినా సత్యసాక్షాత్కారం కలగకపోవడంతో ఒకనాడు బోధిచెట్టు క్రింద కూర్చుని సత్యం సాక్షాత్కరించే వరకూ మృత్యువునైనా ఆహ్వానిస్తాను కానీ ఇక్కడి నుంచి కదలనని దృఢంగా నిశ్చయించుకున్నాడు. ఆ రాత్రే సిద్ధార్థుడికి సత్యసాక్షాత్కారం కలిగింది. శాక్య వంశంలో జన్మించిన సిద్ధార్థుడు బుద్ధుడయ్యాడు.

**శాక్యముని శాంతి సందేశం:** కర్మబంధాల కారణాలు, సృష్టి రహస్యాలు తెలుసుకుని, జనన మరణాలనే చక్రభ్రమణం నుంచి జీవన్ముక్తుడయ్యాడు. తనకు కలిగిన ధర్మజ్ఞానం సూక్ష్మాతి సూక్ష్మమైనదనీ, దానిని లోకులు తెలుసుకోలేరనీ భావించి నిర్వాణంలో లీనం కావాలనుకున్నాడు. అది తెలుసుకుని బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై, లోకహితం కోసం ధర్మస్థాపన చేయాల్సిందిగా కోరాడు; అతడు ధర్మసంస్థాపన చెయ్యకపోతే లోకం అజ్ఞానంలో కూరుకుపోతుందని కూడా అన్నాడు. అది విని బుద్ధుడు లోకంలో ధర్మచక్రం కదిలేలా చేసి, ఆ తరువాత నిర్వాణంలో లీనమవుతానన్నాడు.

బుద్ధుడు ముందు తాను సన్న్యసించిన వెంటనే కలిసిన సాధువుల దగ్గరకు వెళ్ళాడు. వారంతా బుద్ధుడితో మాట్లాడ కూడదనుకున్నా, తమ దగ్గరకు బుద్ధుడు రాగానే అతని ముఖంలోని దివ్యతేజస్సును చూసి తమంతట తామే అతనికి ప్రణామం చేశారు. ప్రపంచం అనిత్యమైనదనీ, పుట్టిన ప్రతీ ప్రాణికీ మరణం తప్పదనీ, దుఃఖాలన్నిటికీ కారణం కోరికలేననీ చెప్పి, అష్టాంగ ధర్మమార్గంలో నడచి కోరికల రూపంలో దాగి ఉన్న సంస్కారాల వాసనలను నిర్మూలించినట్లైతే విముక్తి పొంది నిర్వాణం పొందవచ్చనీ బుద్ధుడు బోధించాడు. ఈ ధర్మబోధ నలుమూలలా వ్యాపించింది. బుద్ధుడు ఎక్కడకు వెళ్ళినా ప్రజలు తండోపతండాలుగా వచ్చి అతని ధర్మబోధ వినేవారు. రాజ్యాధిపతులు మొదలుకొని భిక్షగాళ్ళ వరకూ అందరూ బుద్ధుడి వద్దకు వెళ్ళి, ధర్మబోధ వినేవారు. బుద్ధుడు తన 36వ ఏటి నుంచి 80వ ఏటి వరకూ ధర్మబోధ చేసి తరువాత నిర్వాణంలో లీనమయ్యాడు.

బుద్ధుడి జీవితంలో వైశాఖ పూర్ణిమ విశేషమైన రోజు. వైశాఖ పూర్ణిమ నాడే బుద్ధుడు జన్మించాడు. వైశాఖ పూర్ణిమ నాడే బుద్ధుడు సన్న్యసించాడు. వైశాఖ పూర్ణిమ నాడే బోధిచెట్టు కింద సత్యదర్శనం జరిగింది బుద్ధుడికి. వైశాఖ పూర్ణిమ నాడే తన 80వ ఏట నిర్వాణంలో లీనమయ్యాడు.

ఈ వైశాఖ పూర్ణిమ నాడు బుద్ధ భగవానుణ్ణి తలచుకొని, ఆయన చెప్పిన ధర్మాన్ని పాటించాలని సంకల్పించుకుందాం! ❖

– ఆకెళ్ల రాఘవేంద్ర



# కర్ణుడి చరిత్ర ఓ సాహస యాత్ర

కర్ణుడి గురించి తెలియని వారు ఉండరు. మహాభారతంలో వ్యాసుడు కర్ణుడి పాత్రను సృష్టించడానికి కారణం–ఓ జీవితసత్యాన్ని, ఓ వ్యక్తిత్వసూత్రాన్ని చెప్పేందుకే! ఎన్ని కష్టాలు వచ్చినా, ఎన్ని శాపాలు ఉన్నా, ఎన్ని అవరోధాలు కలిగినా, ఎలాంటి ప్రతి బంధకాలు ఎదురైనా–యుద్ధం చేయడం మానవధర్మం అని చెప్పడమే కర్ణుడి పాత్ర సృష్టి వెనుక దాగిన సత్యం! అందరికీ కూడా ఏవో కష్టాలు ఉంటూ ఉంటాయి. పరీక్షల్లో తప్పడమో, ఉద్యోగం లేకపోవడమో, ఉన్న ఉద్యోగం పోవడమో, అత్తవారింట్లో సాధింపులో, బాస్ పెట్టే వేధింపులో... ఏదైనా కావచ్చు... నిత్యజీవితంలో ఎవరి స్థాయిల్లో వారికి కష్టాలు ఉంటాయి. అయినా వాటన్నింటినీ ధైర్యంగా ఎదుర్కోవడమే వీరుడి లక్షణం!

కవచకుండలాలతో బోసినవ్వులు చిందిస్తూ పసిపాపగా ఉన్న కర్ణుణ్ణి పుట్టగానే కుంతీదేవి పెట్టెలో పెట్టి వదిలేసింది. చిన్నప్పుడే తల్లిని దూరం చేసుకొన్న దురదృష్టవంతుడు కర్ణుడు. బాల్యంలోనే అయిన వాళ్ళని పోగొట్టుకొన్న బాధ చాలా మందికి ఉంటుంది. భౌతిక శాస్త్రంలో ఎన్నో పరిశోధనలు చేసి 'పరావర్తన దూరదర్శిని'ని తయారు చేసిన ఐజాక్ న్యూటన్ పుట్టడానికి మూడు నెలల ముందే అతని తండ్రి మరణించాడు.

పెన్సిలిన్ అనే యాంటిబయోటిక్‌ను రూపొందించిన అలెగ్జాండర్ ఫ్లెమింగ్‌కు ఏడవ ఏట తండ్రి చనిపోయాడు.

అమ్మానాన్నల ఆలనాపాలనా లేకపోయినా–జీవితంలో అడుగులు ముందుకు వేసి విజయాలు సాధించిన వారెందరో! కర్ణుడు కూడా సూత కుటుంబంలో పెరిగి పెద్దవాడయ్యాడు.

అస్త్ర శస్త్రాలను సముపార్జించుకోవాలన్న ఉద్దేశంతో కర్ణుడు ఓ సారి భార్గవరాముణ్ణి తనకు ఆయుధాలను ప్రసాదించ మంటూ వేడుకొన్నాడు. క్షాత్రజాత్యహంకార నిర్మూలనకై ఆ అస్త్రాలను సంధిస్తాననడంతో ఆ పరశురాముడు పరవశ రాముడై సరేనన్నాడు.

అత్యంత శక్తిమంతమైన గరుడాస్త్రం, భార్గవాస్త్రం లాంటివాటిని కర్ణుడికి ప్రసాదించాడు పరశురాముడు. కర్ణుడు మహదానందపడ్డాడు. అంతవరకూ నిరాదరణకు గురైన తనకు ఇంతటి మహోన్నతమైన ఆయుధాలు లభించినందుకు ఎంతగానో ఆనందపడ్డాడు. కానీ ఏం లాభం వెలుగు వెనకే చీకటి ఉంటుంది. అది ప్రకృతి సహజం. ఆనందం వెంటే దుఃఖం ఉంటుంది. ఇది జీవిత సత్యం. కర్ణుడి విషయంలోనూ ఇది నిజం.

అలసిన భార్గవమహర్షి కొంచెం సేపు నిద్రించాలని భావించాడు. ఆ అడవిలో ఎక్కడని పడుకొంటాడు? అందుకనే కర్ణుడు 'నా ఒళ్ళో పడుకోండి గురువర్యా–నా తొడనే తలగడ చేసుకొని శయనించండి ఆచార్యా' అన్నాడు. అదే తన పాలిట శాపమవుతుందని కర్ణుడికేం తెలుసు?

భార్గవుడు కర్ణుడి తొడపై తలపెట్టుకొని అలా... ఓ కునుకు తీశాడో లేదో... ఇంద్రుడు కుమ్మరిపురుగై ఆ తొడను తొలిచేశాడు. రక్తం కారినా, బాధ గుండెల్ని మెలిపెట్టినా–గురువుగారికి నిద్రాభంగం కలుగుతుందని ఓర్పువహించాడు కర్ణుడు. ఆ రక్తం తడిగా తగలడంతో ఒక్కసారిగా లేచాడు పరశురాముడు. 'ఇంత ఓరిమి ఉంది అంటే నీ జాతిని శంకించాల్సిందే' అంటూ తాను ఇచ్చిన అస్త్రాలేమీ ఉపకరించవని శపించాడు పరుశురాముడు.

ఎంత బాధో చూశారా?! అంతవరకూ అస్త్రాలెన్నింటినో సముపార్జించానని సంబరపడ్డాడు కర్ణుడు. అంతలోనే శాపం. పైగా తానేమీ తప్పు చేయకుండానే ఈ దురదృష్టాన్ని మోయాల్సి వచ్చింది. అందరికీ కూడా ఎన్నో కొన్ని కష్టాలు అకారణంగా వచ్చిపడుతుంటాయి.

ఎంతో కష్టపడి ఒక పనిని ప్రారంభించి... ఎన్ని అవరోధాలు ఎదురైనా... ఓపికతో పనిచేసి... పనిచేసి... ఫలితాన్ని పొందాలనుకొంటాం. తీరా చివరి నిమిషంలో... చిట్టచివరి క్షణంలో పరిస్థితులు తారుమారై ఫలితం చేతికి రాకుండా



పోతుంది. ఒక్క మార్కులో... ఒకే ఒక్క మార్కులో ఐ.ఏ.ఎస్. లాంటి ఉన్నత ఉద్యోగాల్ని పోగొట్టుకొనే వారుండొచ్చు; రేపే కోతలుకోసి పంట ఫలాన్ని చేజిక్కించు కోవచ్చు కదా అని అనుకొన్న రైతుకు ఆరోజే... తుఫానొచ్చి పంట కాస్తా నాశనం కావచ్చు. ఇలా ఏదైనా జరగొచ్చు.



కర్ణుడికి జరిగింది అదే! అంతేకాదు– చూసుకోకుండా ఒక గోవుని చంపాడు కర్ణుడు. దాంతో ఆ గోవు యజమాని అయిన బ్రాహ్మణుడు 'నా జీవనాధారాన్ని పోగొట్టావు కాబట్టి నీవు నిరాధారుడివై మరణిస్తావుగాక' అని శపించాడు కర్ణుణ్ణి. ఒక బాలిక చేతిలో ఉన్న నూనె నేలపై పడిపోగా ఆ మట్టిని పిండి తిరిగి నూనెను తీసే ప్రయత్నం చేశాడు కర్ణుడు. 'నా గుండెను పిండావు కాబట్టి యుద్ధసమయంలో నీ రథం నేలలో కుంగిపోతుంది' అని శపించింది భూమాత.

చూడండి కర్ణుడికి ఎన్ని శాపాలో!! ఇదంతా ఒక ఎత్తు. యుద్ధభూమిలోకి వెళ్ళడానికి ముందే, ఏ కవచకుండలాలు ఉంటే తాను యుద్ధంలో విజేత అయ్యేందుకు అవకాశం ఉందో, ఆ కవచకుండలాలను కపట వేషధారి ఇంద్రుడు దానంగా అడిగితే మారుమాట మాట్లాడకుండా, మరో ఉద్దేశం లేకుండా కుండలాల్ని దానం చేసేశాడు కర్ణుడు.

ఇన్ని శాపాలు ఉన్నా యుద్ధభూమిలో తన రథం కుంగిపోబోతోందనీ, నిరాధారుణ్ణీ, నిరాయుధుణ్ణీ కాబోతున్నాననీ ముందే తెలిసినా కర్ణుడు యుద్ధరంగానికి వెళ్ళడం మానలేదు! యుద్ధానికి వెళ్ళాడు. విజయమా, వీరమరణమా అన్నది కాదిక్కడ ఆలోచించాల్సింది. శాపాలు ఉన్నాయని అసలు యుద్ధమే మానని వీరుడూ, ధీరుడూ కర్ణుడు.

మనం కూడా అలాగే ఎన్ని అవరోధాలు ఎదురైనా మన ప్రయత్నం మానకూడదు. ఎన్ని కష్టాలు ఎదురైనా మన కృషిలోపం ఉండకూడదు. కర్ణుడి జీవితం నుంచి నేర్చుకోవాల్సింది ఇదే! కష్టాలు సహజం, అవరోధాలు సహజం; అయినా అడుగు ముందుకే పడాలి.

మండుతున్న కాగడాని కిందకు వంచితే–మంట మాత్రం పైకే ఎగసిపడుతుంది. ధైర్యవంతుడు కూడా అంతే! పరిస్థితులు ఎంతగా ఎదురుతిరుగుతున్నా–మొక్కవోని ధైర్యంతో ముందుకు సాగాలి.

కానీ అలాసాగితే కర్ణుడిలా మరణించక తప్పదు కదా, అన్న సందేహం రావచ్చు. కర్ణుడి మరణానికి కారణం–అతను అధర్మం వైపు నిలవడం!

కాబట్టి ధైర్యం, ధర్మం–అనే ఈ రెండు ఆయుధాల్ని చేతపట్టి ముందుకు సాగండి. ధర్మానికి పిరికితనం లేదు. ధైర్యానికి అపజయం లేదు. మనందరి జీవితాలూ విజయబావుటాలు కాబోతున్నాయి. ఇది తథ్యం! ❖



# అనర్థాలకు మూలం 'అత్యాశ'

– స్వామి రఘునాయకానంద

ఇటీవల ఏ వార్తాపత్రికలను చూసినా ఆర్థికమాంద్యం గురించే చెబుతున్నాయి. ప్రపంచంలో ఆర్థికంగా తలమానికం అనదగ్గ రీతిలో పురోగమిస్తున్న చైనా, అమెరికా, జపాన్, జర్మనీ లాంటి దేశాలను సైతం కుదిపేస్తున్న ఈ ఆర్థికమాంద్యం కారణంగా లక్షల మంది నిరాశ్రయులవుతున్నారు. ఒక్క రోజులో అమెరికాలో 70 వేల మంది నిరుద్యోగులైనట్లు వార్తలు వచ్చాయి. భారతదేశంలోనూ ఇదే స్థితి. ఈ పరిస్థితులలో యువతరం భవిష్యత్తు అగమ్యగోచరంగా మారింది. ఈ ఆర్థిక సంక్షోభానికి గల కారణం గురించి ఆలోచించి ప్రభుత్వాన్నీ, సాంకేతిక నిపుణులనూ, ప్రైవేటు భాగస్వామ్య సంస్థలనూ నిందించే కన్నా పరిష్కారం ఆలోచించాలి. It is better to light a candle than to curse the darkness – అంధకారాన్ని నిందించే కన్నా ఒక చిన్న క్రొవ్వొత్తిని వెలిగించడమే మేలు అని గ్రహించాలి. ఇది మన తక్షణ కర్తవ్యం.

ప్రపంచంలో గల దుఃస్థితిని భౌతిక అవసరాలతో సరి చేయలేం. మనిషికి భౌతిక అవసరాలు కలుగుతూనే ఉంటాయి. దుఃఖం ఉంటూనే ఉంటుంది. మనిషి స్వభావంలో మార్పు రావాలి. మొదట మనుష్యులు మారాలి అంటారు స్వామి వివేకానంద.

## అత్యాశను విడిచి పెట్టాలి!

“ఆశాహిః పరమం దుఃఖమ్ , నైరాశ్యం పరమం సుఖమ్” – ఆశ దుఃఖానికి దారి తీస్తుంది. ఏ విధమైన ఆశలూ లేకుండా ఉండడం పరమ సుఖానికి దారి తీస్తుంది అన్నది ఆర్యోక్తి. ఒక సంపన్న భూస్వామికి ఉదయం నుంచి సూర్యాస్తమయం వరకూ ఎంత దూరం నడిస్తే అంత భూమిని ఇస్తామని బహుమానం ప్రకటించారు. అయితే సూర్యాస్తమయానికల్లా బయలుదేరిన ప్రదేశానికి చేరుకోవాలన్నది షరతు. భూస్వామి ఉదయమే బయలుదేరి త్వరత్వరగా నడవడం ప్రారంభించాడు. మధ్యాహ్నం అయింది. ఎండ తీవ్రత ఎక్కువ అవుతూనే ఉంది. అయినప్పటీ అతడు లెక్క చేయక వేగంగా నడక సాగిస్తున్నాడు. తీవ్రమైన దాహం, అలసట ఉన్నప్పటికీ ఎక్కువ భూమిని సంపాదించాలన్న ఉద్దేశంతో నడకను మాత్రం ఆపలేదు. వచ్చిన సదవకాశాన్ని జారవిడవకూడదు కదా! మధ్యాహ్నం దాటింది. విధించిన షరతు జ్ఞాపకానికి వచ్చింది. సూర్యాస్తమయానికి బయలుదేరిన ప్రదేశానికి చేరుకోవాలి. వేగంగా మరింత శక్తిని కూడగట్టుకుని తిరుగు ప్రయాణం ప్రారంభించాడు. సూర్యాస్తమయం అవుతుండడంతో శక్తికి మించిన శ్రమతో నడిచి గమ్యాన్ని చేరుకొని కుప్పకూలిపోయి చనిపోయాడు. ఇప్పుడు ఆయనకు కావాల్సింది ఆరడుగుల స్థలం మాత్రమే కదా! చూశారా! ఆశ ఎంతటి అనర్థానికి దారి తీసిందో! ఈ విషయం ధనికులు, భూస్వాములు, కార్పొరేట్ సంస్థలు గుర్తించాలి.

## ఉదాత్త జీవనం – ఉన్నత ఆదర్శం

పాశ్చాత్య సంస్కృతీ నాగరకతలను అనుకరిస్తూ క్షణికమైన ఆనందం కోసం పరుగులు పెట్టడం మాని, ఒక ఉన్నతమైన ఆదర్శం కలిగి ఉండాలి. అది ఏమిటంటే – నైతిక విలువలతో కూడిన జీవితాన్ని గడపడం. సంపాదనే ఉన్నత ఆశయం కాదు. జీవన ప్రమాణాలు పెంచుకోవడం కాదు, అవసరాలకు తగ్గట్లు జీవిస్తూ ఉన్నదాంతో సంతృప్తి చెందాలి. అప్పుడే మనశ్శాంతి కలిగేది. జీవన నాణ్యతను పెంచుకొని, ఉన్నతమైన ఆలోచనలు కలిగి ఉండాలి. వారాంతంలో విచ్చలవిడి విందు వినోదాలను వీడి, కుటుంబంలోని పిల్లలు, పెద్దలనూ, వృద్ధులనూ ప్రేమగా పలుకరిస్తూ, వారి కోసం కొంత సమయాన్ని కేటాయించాలి. సమాజంలో హుందాగా జీవించడం ఉన్నత జీవనం కాదు. మనకున్న శీలసంపద, ఆలోచనలే మన జీవనసరళిని నిర్ణయిస్తాయి. 'మన ఆలోచనలే మనల్ని గొప్పవాళ్ళను చేస్తాయి' అంటారు స్వామి వివేకానంద. 'ఆటపాటల్లో, వేషభాషల్లో, సుఖదుఃఖాల్లో, అన్ని దైనందిన కార్యాలలో నీతి తప్పని ధీరులై జీవించండి. అలాంటి ఆదర్శంతో జీవితాన్ని మలచుకుంటే ఇతరులు కూడా మిమ్మల్ని అనుసరిస్తారు' అంటారు స్వామి వివేకానంద.

## స్వశక్తి - దైవభక్తి

జీవితంలో ఒడుదొడుకులనేవి సహజం. అవి లేకపోతే జీవితానికి అందం లేదు. వాటికి భయపడకండి. ప్రయత్నం గురించి ఆలోచించండి. లేచి నిలబడండి. బలవంతులుగా ఉండండి. నా విధికి నేనే కర్తను అన్న వాక్యాన్ని పదే పదే స్మరించండి. 'ఇప్పటి వరకూ హుందాగా జీవించాను, ఏమిటి ఇప్పటి దుఃస్థితి. మా జీవితాలలో మళ్ళీ స్థిరపడతామా' అన్న నిరాశతో కూడిన ఆలోచన విడిచిపెట్టండి.

'విశ్వాసం.. విశ్వాసం, మీ మీద మీకు విశ్వాసం! తరువాత భగవంతుని మీద విశ్వాసం. అదే విజయ రహస్యం' అంటారు స్వామి వివేకానంద. చిన్నా పెద్దా అంటూ పనిలో తేడాలు చూడకుండా ఏ పని చేయడానికైనా ముందంజ వేయండి. ప్రపంచ చరిత్రలో మహాత్ములను పరిశీలిస్తే, వాళ్ళు కూడా



దుఃఖాలు, బాధల నుంచే పాఠాలను నేర్చుకొన్నారన్న విషయం తెలుస్తుంది.

ప్రతి రోజూ లేదంటే కనీసం వారాంతంలోనైనా సరే దేవాలయాలకు వెళ్ళి, మీ కోసం, అందరి కోసం ప్రార్థించండి. మీకు శక్తినీ, బలాన్నీ ఇమ్మని భగవంతుణ్ణి ప్రార్థించండి. అక్కడ జరిగే ఆధ్యాత్మిక సేవా కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొనండి. 'ఆధ్యాత్మికతను విడిచి పాశ్చాత్యుల నాగరకతను అనుసరిస్తే జాతి వినాశం చెందుతుంది. ఈ జాతీయ భవంతి పునాదులు కదిలిపోయి, జాతి సర్వనాశనమవుతుంది' అంటారు స్వామి వివేకానంద.



## స్వార్థరాహిత్యం - సహనం

ఇతరులకు కొంత దానం చేస్తే మనం కొంచెం కోల్పోతామనే స్వార్థాన్ని వీడాలి. స్వార్థరాహిత్యమే విశేష లాభదాయకం. కానీ దాన్ని అలవరచుకొనే మనసు కావాలి. ఆరోగ్యరీత్యా కూడా అది ఎంతో లాభదాయకం అంటారు స్వామి వివేకానంద. ధర్మమార్గంలో సంపాదించిన డబ్బును స్వలాభాపేక్షకే కాక పరుల సేవకూ వినియోగించాలి. 'నేను – నాది' అన్న సంకుచిత భావం నుంచి 'మనం– మనది' అనే విశాల హృదయానికి ప్రయాణం చేయాలి.

సుఖదుఃఖాల సమ్మేళనమే జీవితం. సుఖదుఃఖాలు, జయాపజయాలు అనే ద్వంద్వాలు నాణానికి ఇరువైపులా ఉన్న బొమ్మ, బొరుసుల్లాంటివి. స్వామి వివేకానంద ఇలా అనేవారు: 'సుఖం, దుఃఖమనే కిరీటాన్ని ధరించి వస్తుంది. సుఖానికి స్వాగతం పలికేవాడు దుఃఖాన్ని అనుభవించడానికి కూడా సిద్ధంగా ఉండాలి'. శ్రీరాముడు పట్టాభిషేక వార్త విన్నప్పుడు ఆయన ముఖంలో ఉన్న ప్రశాంతతకీ, ఆ తరువాత కాసేపట్లో నీవు అరణ్యవాసం చేయాలన్నప్పటి ముఖంలో ద్యోతకమైన ప్రశాంతతకీ ఏమీ వ్యత్యాసం లేదని వాల్మీకి రామాయణం చెబుతోంది. 'మేము ఇప్పటి వరకూ ఉన్నత స్థితిలో ఉన్నాం. ఇప్పుడు ఏమిటి మా దుఃస్థితి' అని బాధపడే యువతీ యువకులు పై ఉదాహరణను ఆదర్శంగా తీసుకోవాలి. ద్వంద్వాలను ఎదుర్కొనే సహనాన్ని కలిగి ఉండాలి.

అప్పుడే వ్యక్తికీ, వ్యక్తికీ మధ్య; సమాజానికీ, సమాజానికీ మధ్య సామరస్య భావన కుదురుతుంది. ఆశ, అసూయ, ద్వేషాలు లేని సమాజాన్నీ, తద్వారా అవరోధాలను సైతం దాటిపోయే జీవితాన్నీ రూపొందించుకోగలం. ❖

# యువవాణి

**- స్వామి పరిజ్ఞేయానంద**

ప్రశాంత్, రామిరెడ్డి, నాగరాజారావు, సుప్రియ, శ్రీలత

**ప్రశ్న: రాజకీయ రంగంలో యువత పాత్ర ఏమిటి? స్వామి వివేకానంద 'వంద మంది యువకులతో ప్రపంచాన్నే విప్లవాత్మకం చేయవచ్చు'అని అన్నారు. నేటి రాజకీయాల్లో యువశక్తి వెల్లువై ప్రవహిస్తుంది కాబట్టి మన దేశం ప్రగతి పథంలో ముందంజ వేస్తుందంటారా? దేశనేతలకు స్వామి వివేకానంద ఇచ్చిన సందేశం ఏమిటి?**

**జవాబు:** ప్రజల సంక్షేమమే ధ్యాసగా, దేశాభివృద్ధియే ధ్యేయంగా జీవించేవారే నిజమైన నాయకులు. అలాంటి నాయకుల్ని సృష్టించడంలో యువతే కీలకమైన పాత్రను పోషించాలి.



తండ్రి ఆజ్ఞమేరకు అయోధ్యను వీడి అరణ్యాలకు వెళ్ళిన శ్రీరాముణ్ణి ఎలాగైనా ఒప్పించి తిరిగి అయోధ్యకు తీసుకురావాలని భరతుడు రాముని దగ్గరకు వెళ్ళాడు. అన్నను చూసిన ఆనందంతో రామునికి పాదాభివందనం చేసి పైకిలేచిన భరతుణ్ణి రాముడు మొదట అయోధ్య నగరవాసుల క్షేమ సమాచారాల గురించి విచారించాడట. నిజమైన ప్రజా నాయకుడు వ్యక్తిగత విషయాలకన్నా ప్రజల సంక్షేమానికే ప్రాధాన్యతనివ్వాలన్న రాజనీతిని శ్రీరాముడు ప్రదర్శించాడు.

A politician thinks of the next election and a patriot thinks of the next generation. ***- James F. Clarke***

కాబట్టి ప్రతీ రాజకీయ నాయకుడూ ఎన్నికలలో ఎలా గెలవాలి అని ఆలోచించడం కన్నా ప్రజలకు ఎలా సేవలందించాలో అని ఆలోచించాలి. అప్పుడే రామరాజ్య స్థాపన సాధ్యమవుతుంది.

మన దేశం అన్ని రంగాల్లోనూ ప్రగతిని సాధించాలంటే శీలవంతులైన యువకులు కావాలని స్వామీజీ ఆశించారు.

భారతదేశ స్వాతంత్ర్యం కోసం మీరు పోరాటం సాగించవచ్చుకదా? అని అనేక మంది స్వామీజీని ప్రశ్నించి నప్పుడు 'నేను తలచుకుంటే భారతదేశానికి ఈ క్షణంలోనే స్వాతంత్ర్యం తీసుకురాగలను. కానీ స్వతంత్ర భారతదేశాన్ని సంరక్షించేందుకు శీలవంతులైన మనుష్యులు ఎక్కడ?' అని తిరిగి ప్రశ్నించారు స్వామీజీ.

'ఆత్మవిశ్వాసంగల వీర్యవంతులూ, ధైర్యవంతులూ, శీలవంతులూ అయిన వందమంది యువకులు ఉంటే మొత్తం ప్రపంచాన్నే మార్చవచ్చు' అని స్వామీజీ అన్నారు.

Men, men, these are wanted: everything else will be ready, but strong, vigorous, believing young men, sincere to the backbone, are wanted. A hundred such and the world becomes revolutionised.

***- Swami Vivekananda***

'పేరు ప్రఖ్యాతుల్నీ, ఆస్తి అంతస్తుల్నీ మరిచి పేద ప్రజల కోసం పరితపించడం, అహర్నిశలూ పరిశ్రమించడం'- ఇదే మన దేశ భక్తులకూ, సంస్కర్తలకూ, నాయకులకూ స్వామీజీ ఇచ్చిన సందేశం.

Do you feel that millions are starving today... Does it make you restless? Does it make you sleepless?... have you forgotten all about your name, your fame, your property, even your own bodies? First feel from the heart.That is the first step to become a patriot.

***- Swami Vivekananda***

మహాత్మాగాంధీ నుంచీ అబ్దుల్ కలాం వరకూ ప్రయోగించిన, ప్రయోగిస్తున్న భావాస్త్రాలు స్వామీజీ అంబులపొది నుంచి తీసినవే అన్న విషయం ఆయన ప్రసంగాలు చదివితే అర్థమవుతుంది. కాబట్టి నిత్యనూతనమైన స్వామీజీ సందేశాన్ని ప్రతి ఒక్కరూ ఆచరణాత్మకం చేయాలి. అప్పుడే దేశాభివృద్ధి, శాంతి సమాజ స్థాపన సాధ్యమవుతాయి. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :

**యువవాణి**

**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**

**దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029**



మహనీయుల జీవితాల్లో

# మధురఘట్టాలు

- ఆర్. కృష్ణ

## ఆదేశం కాదు ఆచరణ ముఖ్యం

అప్పుడు లాల్ బహదూర్ శాస్త్రి రైల్వే మంత్రిగా ఉండేవారు. ఆయన వారణాసికి దగ్గరగా ఉన్న సేవాపురికి వెళ్ళవలసి వచ్చింది. ఆయన అక్కడకు రైల్లో వెళ్ళారు. సేవాపురి రైల్వేస్టేషన్‌లో ప్లాట్‌ఫారం ఎత్తుగా లేదు. శాస్త్రిగారు పొట్టిగా ఉండడం వల్ల ఆయనకు రైల్లోంచి ప్లాట్‌ఫారం మీదకు దిగడం చాలా కష్టమైంది. రైల్వేమంత్రి ప్లాట్‌ఫారం మీదకు దిగడానికి ఇన్ని పాట్లు పడడం చూసిన నలుగురు స్త్రీలు గట్టిగా నవ్వుతూ - "సరైన ప్లాట్‌ఫారం లేకపోవడం వల్ల ఆడవారికి ఎంత కష్టంగా ఉంటుందో ఇప్పుడు రైల్వే మంత్రికి తెలుస్తోంది" అన్నారు. అప్పుడే లాల్ బహదూర్ ప్లాట్‌ఫారం మీదకు దిగారు. ఆయన స్టేషన్ మాస్టర్ని పిలిచి, పార కావాలని అడిగారు. పార ఇచ్చిన వెంటనే లాల్ బహదూర్ పార పట్టుకొని, నేలను త్రవ్వడం మొదలుపెట్టారు. త్రవ్విన మట్టిని ఆ ప్లాట్‌ఫారం మీద పోయసాగారు. అది చూసి అక్కడున్నవారు కూడా పారలు మొదలైనవి తెచ్చుకుని తవ్వసాగారు. ప్లాట్‌ఫారం మూడు గంటల్లోపల మామూలు ఎత్తుకి లేచింది.

అధికారం కేవలం ఆజ్ఞలివ్వడానికే కాదనీ, ప్రజల అవసరాలను తీర్చడానికి వారు కల్పించిన ఒక బాధ్యత అనీ ఆచరణలో చూపిన ఆదర్శనేత లాల్ బహదూర్ శాస్త్రి. నేటి మన నేతలందరూ శాస్త్రిగారిని ఆదర్శంగా తీసుకొంటే భారతదేశం సర్వతోముఖాభివృద్ధి చెందుతుంది. ❖

## వినయమే నిజమైన భూషణం

బిరుదులు, అవార్డులు, రివార్డులు ఎన్ని సాధించినా అత్యంత నిరాడంబరంగా చిన్న గదిలో తన పుస్తకాలతో కాలం గడిపే కలామ్‌కి 1990లో యాదవ్‌పూర్ యూనివర్సిటీ వారు డాక్టరేట్ పట్టా ప్రకటించినప్పుడు తన పేరుతో పాటు నెల్సన్ మండేలా పేరు కూడా పేపర్లో చూశాడు. వెంటనే వారికి ఫోన్ చేసి, అంతటి మహనీయుడితో తాను సరితూగననీ, ఆయనతో పాటు తనకు ఇవ్వవద్దనీ కోరాడు. దానికి యూనివర్సిటీ వారు అంగీకరించలేదు.

అలాగే ఒకసారి మదురై కామరాజ్ విశ్వవిద్యాలయంలో స్నాతకోపన్యాసం ఇవ్వడానికి కలామ్ వెళ్ళినప్పుడు, ఆ ఊర్లో తనకు చదువు చెప్పిన దొరై సాలమన్ అనే ఉపాధ్యాయుడు ఉన్నారని తెలిసింది. ప్రభుత్వ వాహనాలున్నా, ఒక ప్రైవేటు టాక్సీ తీసుకొని కలామ్, ఆయన ఇంటికి వెళ్ళి తన ప్రసంగానికి ఆహ్వానించాడు. తన శిష్యుడి మాట కాదనలేక 80 ఏళ్ళ దొరై సాలమన్ ఆ సభకు వెళ్ళారు. కలామ్ ముందుగా ఆయనను మాట్లాడాల్సిందిగా రెండు చేతులూ జోడించి వినమ్రంగా కోరాడు. పక్కనే ఉన్న గవర్నర్ పి.సి. అలెగ్జాండర్ ఆ సన్నివేశాన్ని చూసి ఆశ్చర్యపోయారు.

వినయమే నిజమైన భూషణంగా కలిగిన అబ్దుల్ కలామ్ విద్యార్థి లోకానికి ఆదర్శనీయుడు. ❖



ఆధునిక విజ్ఞానం, సాంకేతిక పరిజ్ఞానాల సహాయంతో ఒక మనిషి సుఖంగా ఉండడానికి అవసరమైన ఎన్నో రకాల సౌకర్యాలనూ, భోగాలనూ కనిపెట్టి మున్ముందుకు సాగుతున్న మనకు ఈ రోజుల్లో 'ఆధ్యాత్మికత' అవసరమా?

**మన దుఃఖానికి కారణం ఏమిటి?** ఈ జీవితంలో మనమెప్పుడూ ఆనందాన్ని కోరుకుంటాం కానీ దుఃఖాన్ని కోరుకోం. అయితే అన్ని రకాల సుఖాలూ మన ముందే ఉన్నప్పటికీ, మనం దుఃఖానికి ఎందుకు బానిసలమవుతున్నాం? ఒకసారి ఒక దేవత, ఒక రాక్షసుడు 'ఆత్మ'ను గురించి తెలుసు కోవడానికి ఒక మహా పురుషుని దగ్గరకు వెళ్ళారు.



# ఆధునిక యుగంలో ఆధ్యాత్మికత అవసరమా?

– స్వామి సేవ్యానంద

చాలా కాలం బోధించిన తరువాత ఆ మహాపురుషుడు "నీవే ఆత్మవు, నీకు నువ్వే తెలుసుకో" అని ఉపదేశించి, వారిని పంపించాడు. తన శరీరమే 'ఆత్మ' అని భావించి, ఇద్దరూ ఆనందంగా తిరిగి వెళ్ళారు. కొన్ని రోజుల తరువాత ఆ దేవతాపురుషుడు 'అనిత్యమైన ఈ శరీరం, శాశ్వతమైన ఆత్మ ఎలా అవుతుంది?' అని ఆలోచించడం మొదలు పెట్టాడు. చివరకు తన వివేచనా శక్తితో శరీరం మనస్సు, బుద్ధి, అహంకారాలకు అతీతమైన 'ఆత్మ'ను తన నిజస్వరూపంగా సాక్షాత్కరించుకొని, అనంతమైన ఆనందాన్ని అనుభవించాడు. తామసిక స్వభావుడైన రాక్షసుడు శారీరక సుఖ భోగాలను అనుభవించడంలోనే జీవితం గడిపాడు.

మనం చాలావరకు రాక్షస స్వభావాన్ని కలిగి, అనిత్యమైన ఈ శరీరమే సర్వస్వమని భావిస్తున్నాం. చివరకు దుఃఖాల పాలవుతున్నాం.

**ఉన్నతమైన ఆనందానికై ప్రయత్నించు:** శారీరక సుఖాలకు మించి ఉన్నతమైన ఆనందం ఏమైనా ఉందా? బాల్యంలో బొమ్మలాటలకు మించిన ఆనందం ఈ ప్రపంచంలో ఏదీ లేదని అనుకున్నాం. వయస్సు పెరిగాక జ్ఞానార్జనలోనే ఆనందం ఉందని తెలుసుకున్నాం. శారీరక ఆనందం కన్నా ఉన్నతమైనది ఈ జ్ఞానానందం. దీని కన్నా ఉన్నతమైనది ఆధ్యాత్మిక ఆనందం. ఈ ఆధ్యాత్మిక ఆనందం కన్నా ఉన్నతమైన ఆనందం ఈ విశ్వంలో మరొకటి లేదు. జంతువులు శారీరక ఆనందంతోనే తృప్తి చెందాల్సి ఉంది. దీనికి మించి ఇతర ఆనందాలను పొందే అవకాశం వాటికి లేదు. మనిషి కూడా క్షణభంగురమైన శారీరక ఆనందంతోనే తృప్తి చెందితే ఆ మనిషికీ, జంతువుకీ తేడా ఏముంది? అందుకే మానవ జీవితంలో ఉన్నతమైన జ్ఞానానందం, ఆధ్యాత్మికానందం పొందే ప్రయత్నం చేయాలి.

**శాశ్వత ఆనందానికి ఉపాయం:** మన అంతరంగంలో ఉన్న దివ్యానందాన్ని మరచి, ఎండమావుల్లాంటి భౌతిక సుఖాలకై మనం నలువైపులా పరుగులు పెడుతున్నాం. ఈ ప్రపంచంలో ఉన్న అన్ని సుఖాలూ, భోగాలూ కలిసినా ఒక్క మనిషిని కూడా తృప్తి పరచలేవు. ఆకలితో అలమటి స్తున్న సింహం నోటికి ఎలుకను ఇచ్చినట్లు, అనంతమైన ఆనందానికి అధికారులమైన మనం తుచ్ఛమైన ప్రాపంచిక సుఖాలతో ఎలా తృప్తి చెందగలం?

"శాస్త్రీయ విజ్ఞానం" ఎక్కడ అంతమవుతుందో, అక్కడ "ఆధ్యాత్మికత" ఆరంభమవుతుంది. మనకు జీవితంలో ఎదురవుతున్న అన్ని దుఃఖాలను సంపూర్ణంగా నివారించే శక్తి ఒక్క ఆధ్యాత్మిక జ్ఞానంలోనే ఉంది. దీన్ని పొందడానికై మన బాధ్యతలన్నీ వదిలిపెట్టి, ఏ దేవాలయంలోనో, ప్రార్థనాలయం లోనో గంటల కొద్దీ సమయం గడపనవసరం లేదు. దీనికి పూర్తి వ్యతిరేకంగా మనం చేసే పనిని మరింత నైపుణ్యంతో చేయాలి. "మన కర్తవ్యాలను నిస్వార్థభావంతో, నిస్సంగభావంతో నిర్వహించడం ద్వారా ఆధ్యాత్మిక జీవితం యొక్క చరమలక్ష్యాన్ని సాధించగలం" అని స్వామి వివేకానంద చెప్పారు.

మనం పశు స్వభావాన్ని వదిలిపెట్టి మనుష్యులుగా జీవించాలంటే, శాశ్వత ఆనందాన్ని ఆస్వాదించాలంటే 'ఆధ్యాత్మికత'ను ఆశ్రయించడం ఒక్కటే ఉపాయం. ఈ మార్గాన్ని అనుసరిస్తే, మనలో ప్రతి ఒక్కరం ఆ దివ్యానందానికి వారసులం కాగలం. ❖

# రామకృష్ణ మిషన్ సేవాశ్రమ (ధార్మిక ఆసుపత్రి)

(రామకృష్ణ మిషన్, పి.ఒ.బేలూర్ మఠ్, హౌరా జిల్లాకు అనుబంధిత శాఖాకేంద్రం)
స్వామి వివేకానంద మార్గ్, బృందావన్, మథుర జిల్లా, ఉత్తర్‌ప్రదేశ్–281 121.
ఫోన్ : 0565–2442310, ఫ్యాక్స్: 2443310
Email : rkmsvrnd@sancharnet.in, Website: www.rkmsvrind.org

## విన్నపం

శ్రీకృష్ణుని దివ్యలీలా క్షేత్రం–యమునా నది ప్రవహిస్తున్న పుణ్య తీర్థం – బృందావనం. ఆ క్షేత్రం పేరు వింటేనే మనసు ఉన్నతమైన భక్తి భావనతో నిండిపోతుంది. శ్రీచైతన్య మహాప్రభువు, శ్రీరామకృష్ణుల సందర్శనం వలనా, మీరాబాయి, సూరదాసు, రూప, సనాతన గోస్వాములు మొదలైన భక్త శిరోమణుల సాధనల వలనా బృందావనం మరింత పవిత్రతను సంతరించుకొంది. ఈ పుణ్యక్షేత్ర వాసులకి రామకృష్ణ మిషన్ సేవాశ్రమ 1907 నుండీ అనేక సేవలు అందిస్తోంది.



**'కాలాబాబు కుంజ్' భవనంలో శ్రీ శారదాదేవి బస చేసిన గది**

శ్రీరామకృష్ణుల భక్తుడైన బలరాంబసుకి ఈ పవిత్ర వ్రజ భూమిలో "కాలాబాబు కుంజ్" అన్న పేరున్న పూర్వీకుల గృహం ఉంది. దివ్యజనని శ్రీ శారదాదేవి శ్రీరామకృష్ణులు మహాసమాధి చెందాక 1886లో బృందావనం వెళ్ళి ఈ "కాలాబాబు కుంజ్"లో సుమారు ఒక సంవత్సరం పాటు ఉన్నారు. ఆ తరువాత కూడా ఆమె అక్కడికి వెళ్ళినప్పుడు ఈ ఇంట్లోనే ఉండేవారు; ఇక్కడే శారదమ్మ మొట్టమొదట సారిగా స్వామి యోగానందకి మంత్రదీక్ష ఇచ్చారు. స్వామి వివేకానంద, స్వామి బ్రహ్మానంద, శ్రీరామకృష్ణుల ఇతర శిష్యులు ఆ ఇంట్లో ఉన్నారు. ఈ ఇంట్లోనే 1907లో రామకృష్ణ మిషన్ సేవాశ్రమ కేంద్రం లాంఛన ప్రాయంగా ప్రారంభమైంది.

మాతృమూర్తి శ్రీ శారదాదేవి పావనం చేసిన ఈ గృహాన్ని (కాలాబాబు కుంజ్) ఒక ఆధ్యాత్మిక స్మారక చిహ్నంగా



**శ్రీ శారదాదేవి బస చేసిన 'కాలాబాబు కుంజ్' భవనం**

తీర్చిదిద్దాలని బృందావనం రామకృష్ణ మిషన్ సేవాశ్రమ సంకల్పించింది. శ్రీ శారదాదేవి దివ్య స్మృతులను జ్ఞాపకం చేసుకొని ఆధ్యాత్మికంగా సన్న్యాసులూ, భక్తులూ లబ్ధి పొందడం కోసం దివ్యజనని ఉన్న 'కాలాబాబు కుంజ్' ఇంట్లోని ఒక భాగాన్ని రూ॥38 లక్షలకు కొనుగోలు చేయడం జరిగింది. కాలాబాబు కుంజ్‌లోని మిగతా భాగాన్ని కొని, మరమ్మత్తులు చేయించి ఈ స్మృతి కేంద్రంలో ఆధ్యాత్మిక సేవా కార్యక్రమాల్ని ప్రారంభించాలని సంకల్పించాం. ఈ భవనం కొనడానికీ, మరమ్మత్తులు చేయించడానికీ సుమారు **ఒక కోటి ముప్ఫై లక్షలు** వ్యయం అవుతుందని అంచనా.

ఈ ఆధ్యాత్మిక స్మృతి కేంద్ర నిర్మాణానికి మీరంతా ఉదారంగా విరాళాలిచ్చి సహకరించాల్సిందిగా కోరుతున్నాం.

"Ramakrishna Mission Sevashrama, Vrindaban" పేరున చెక్కు లేదా డి.డి తీసి క్రాస్ చేసి మీ విరాళాల్ని Ramakrishna Mission Sevashrama, Swami Vivekananda Marg, Vrindaban, Dist: Mathura, Uttar Pradesh-281 121 అనే చిరునామాకు పంపాల్సిందిగా మనవి. ఆదాయపు పన్ను చట్టంలోని 80(జి) విభాగం కింద విరాళాలకు పన్ను మినహాయింపు లభిస్తుంది.

భగవత్సేవలో

**స్వామి సుప్రకాశానంద**

కార్యదర్శి



# శీల నిర్మాణానికి ఆధ్యాత్మికతే ఆధారం!

– డాక్టర్ కమల ఎస్. జయరావు

శీల నిర్మాణానికి నేడు మూడు ప్రధాన ఆటంకాలు కనబడుతున్నాయి.

1. వినియోగదారీ తత్వం (కన్స్యూమరిజం)!
2. ప్రసార మాధ్యమాలు (దృశ్య, శ్రవణ, ముద్రణ)
3. వేళ్ళూనుకొన్న అవినీతి, అన్యాయం

**వినియోగదారీ తత్వం:** పూర్వం అమ్మకాలు రైతుల ద్వారా, చిన్న అంగళ్ళలో జరిగేవి. ఇప్పుడు వాటిని పెద్ద పెద్ద కార్పొరేటు సంస్థలు కైవసం చేసుకున్నాయి. పూర్వం కన్నా ఇప్పుడు మధ్యతరగతి ప్రజల చేతుల్లో నిత్యావసరాలకు కావలసిన దాని కన్నా అధికంగా డబ్బు ఉంది. మునుపటి రోజుల్లో ఏది ఎప్పుడు అవసరమో అది అప్పుడు కొనేవారు. కానీ నేడు కొనుగోళ్ళు ఒక జీవన విధానంగా మరాయి. దాన్ని నేటి యువతరం పరిభాషలో 'కూల్ ఫన్' అంటారు. తినడం, తాగడం లాగే కొనుగోళ్ళు సాగించడం కూడా జీవితంలో విడదీయరాని అంశంగా మారింది. సంపన్నుల లాగ మధ్యతరగతి వారు కూడా 'కామినీ కాంచనాల' గుప్పెట్లో ఉన్నారు. ఇది శీలనిర్మాణానికి పెద్ద సవాలుగా నిలిచింది.

తల్లితండ్రులిద్దరూ బయట ఉద్యోగాలు చేయడం సర్వసాధారణమైంది. ఆర్థిక ఇబ్బందులు లేకున్నా తల్లి ఉద్యోగం చేయడమే రివాజు. పిల్లలతో తగినంత సమయం గడపలేక పోతున్నామనే బాధ తల్లితండ్రుల మనస్సుల్లో ఒక మూల ఎక్కడో నక్కి ఉంటుంది. ఇందుకు పరిహారంగా పిల్లలు ఏది కోరినా కాదనకుండా చేయడం, లేదనకుండా కొని ఇవ్వడం జరుగుతోంది.

అర్థంపర్థం లేకుండా సాగుతున్న వినియోగదారీ తత్వాన్ని ప్రసార మాధ్యమాలు మరింత బలపరచి, ఎగదో స్తున్నాయి. ఈనాడు మారుమూల పల్లెల్లో సైతం టీవీలున్నాయి. వ్యాపార ప్రకటనలన్నీ యువతులనూ, పిల్లలనూ ఉద్దేశించే నిర్మితమవుతున్నాయి. శరీర సౌందర్య పోషణే జీవితంలో అత్యంత ప్రధాన విషయం అనే భావాన్ని ఈ ప్రకటనలు పిల్లల మనస్సులపై గట్టిగా ముద్ర వేస్తున్నాయి. వీటి ప్రభావం వల్ల పిల్లలు తమకు కావలసినవి దబాయించి కొనిపించుకొనడమే కాక ఇంట్లోకి ఏ యే ఆహారపదార్థాలు, సౌందర్య సాధనాలు కొనాలో వారే నిర్ణయించే స్థాయికి చేరారు.

**ప్రసార మాధ్యమాలు (దృశ్య, శ్రవణ, ముద్రణ) :** ప్రసార మాధ్యమాల ప్రభావం నేటి యువతపై చాలా తీవ్రంగా ఉంది. అధిక శాతం పిల్లలు సొంత సెల్‌ఫోను, కంప్యూటర్లు కలిగి ఉండడం ఇప్పుడు ఒక సర్వసాధారణ విషయం. పిల్లలు సెల్‌ఫోన్లో ఎవరితో మాట్లాడుతున్నారో, ఇంటర్నెట్‌పై ఏ సమాచారం పొందుతున్నారో, ఎవరితో సంభాషణలు సాగిస్తున్నారో చాలా మంది తల్లితండ్రులకు తెలియనే తెలియదు.

పిల్లల్లో అనవసర కుతూహలాన్ని రేకెత్తించే పరిస్థితులు సమాజమంతటా కనపడుతున్నాయి. తత్కారణంగా చాలా మంది యువతీ యువకులు దారి తప్పుతున్నారు. వార్తాపత్రికలలోనూ, 'సకుటుంబ' సచిత్ర వారపత్రికలు అనబడే వాటిలోనూ ప్రచురిస్తున్న సినిమాలలోని అసభ్యకరమైన చిత్రాలు యువతరాన్ని పెడదారి పట్టిస్తున్నాయి.

నిత్యజీవితంలోనూ, తెర మీదా కనపడే హింసాకాండ శీల నిర్మాణానికి పెద్ద అవరోధం. చెడుపై మంచిదే అంతిమ విజయమన్నది పురాణేతిహాసాలలోని హింస, వధ ద్వారా తెలియవచ్చే గుణపాఠం. కానీ నిజజీవితంలో మనకు ఇది కనబడడం లేదు. మనదేశంలోనే కాక యావత్ ప్రపంచంలో విస్తరిస్తున్న, కొనసాగుతున్న హింసాకాండలో విజేతలు, పరాజితులు అంటూ ఉండడం లేదు. మతం పేరిట, దేశభక్తి పేరిట, సంస్కృతీ పరిరక్షణ పేరిట మనదేశంలో నేడు చెలరేగుతున్న హింస యువతరాన్ని ఛాందసులుగా, మతోన్మాదులుగా మారుస్తోంది. సినిమాల్లో హీరోకూ, విలన్‌కూ తేడా తెలియడం లేదు. ఈ పాత్ర, ఆ పాత్ర కూడా అందంగా, ఆకర్షణీయంగా కనబడతాయి. ఇదంతా పిల్లలకూ, యువతరానికీ ఎలాంటి సందేశాన్ని అందిస్తున్నాయో ఎవరికైనా తెలుసా?

ఎవరైనా ఆలోచిస్తున్నారా? దృశ్య-శ్రవణ మాధ్యమాలు వినోదం పంచడానికే కానీ విద్యాబోధన వాటి ఉద్దేశం కాదని ఒక వాదన. ఒప్పుకొందాం! కానీ ఇంద్రియాలను ఉద్రేకపరచేది వినోదమా? వినోద కార్యక్రమాలు పిల్లల కళాత్మక దృష్టిని పదునుపెట్టేవిగా ఉండాలి. జానపదమే కానీ, శాస్త్రీయమైనవే కానీ భారతీయ కళలన్నీ భక్తిపూర్వక ఆధ్యాత్మిక నేపథ్యం, సందేశం కలిగి ఉంటాయి. పిల్లలు, నిరక్షరాస్యులు- వీటి ద్వారానే జీవితపు విలువలు నేర్చుకొనేవారు. ఉపాధ్యాయుల శిక్షణలో ఇలాంటి కళలకు స్థానం ఏర్పరచాల్సిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. అర్థం పర్థం లేని రణగొణధ్వని లాంటి శబ్దాన్ని సంగీతం పేరిట నేపథ్యంలో పెట్టి, చిన్న చిన్న పిల్లలచేత అసంఖ్యాకంగా దేహాన్ని వంకర్లు తిప్పించి, ఇదే నాట్యమని పాఠశాల వేడుకలలో ప్రదర్శింపజేస్తుంటే వారి తల్లితండ్రులు అది చూసి మురిసి పోతున్నారు.



**వేళ్ళూనుకొన్న అవినీతి, అన్యాయం:** సర్వత్రా వ్యాపించి, లోతుగా వేళ్ళూనుకొన్న అవినీతి యువతరం మనస్సులకు చాలా హాని కలిగిస్తోంది. సక్రమంగానో, అక్రమంగానో ఎలాగో ఒకలా ధనమార్జించడమే సమాజ ధ్యేయంగా కనబడుతోంది.

రాజకీయ నాయకులు అసత్యాలు పలకడం, వారిలో నిజాయతీ లేమి, దయా రాహిత్యం, ఏదో ఒక విధంగా గెలుపు సాధించాలనే తత్వం, సేవా నిరతి లేమి, స్వార్థం దేశంలో నైతికతను ఛిద్రం చేస్తున్నాయి. వీటికి తోడు భూసామ్యపెత్తందారీ మనస్తత్వం (ఫ్యూడల్ మనస్తత్వం) మూలంగా పెద్దలు, ధనవంతులు, ఉన్నత పదవులలో ఉన్నవారు చేసిన నేరాలకు శిక్ష పడకుండా జాగ్రత్తలు పడి తప్పించుకొంటున్నారు. భూస్వామ్య ధోరణి నశించాలని స్వామి రంగనాథానంద మహరాజ్ పదే పదే వక్కాణించేవారు. పెరిగిన అవినీతి సమాజంలో యువతరం మనస్సును పాడుచేసి, వారిని కూడా అవినీతి పరులను చేస్తోంది. లేదంటే వారిలో నిరాశావాదం, నిస్పృహ, నిర్లిప్తతలను పెంచుతోంది.

పాశ్చాత్యులకు నీతి నియమాలు తక్కువనీ, కనుక ఈ దుష్ఫలితాలు వారు అనుభవిస్తున్నారనీ, భారతీయులం మనం నైతికతకు ప్రాధాన్యత ఇస్తాం కాబట్టి మనం ఈ విషయంలో పాశ్చాత్యుల కన్నా ఉన్నతులమనే ఒక అహంకార ధోరణి మనకుంది. ఈనాడు పాశ్చాత్యులను అనుకరించడంలో అన్ని దేశాల కన్నా మనమే ముందున్నాం. అయితే పాశ్చాత్యులలోని మంచి లక్షణాలైన క్రమశిక్షణ, నిజాయతీ, నిజమైన ప్రజాస్వామ్య పోకడలు మాత్రం మనం నేర్చుకోవడమే లేదు.

**పిల్లల్ని తీర్చిదిద్దాల్సింది పెద్దలే! :** శీల నిర్మాణానికి పునాది వేయగలిగినవారు, వేయవలసినవారు తల్లితండ్రులు, తాత నాయనమ్మలు! వడివడిగా మార్పులు చెందుతున్న సాంకేతిక యుగంలో తమ పాత్ర ఏమిటో వారికి అంతు చిక్కడం లేదు. కాబట్టి, ముందస్తుగా వీరికే ఆధ్యాత్మిక శిక్షణ, ఆత్మబలం అవసరం. ఈనాడు యువతరంలో చాలా మంది యోగాభ్యాసానికీ, ధ్యానం నేర్చుకొనటానికీ పలువురు గురువుల వద్దకు వెళుతున్నారు. అయితే ఇలాంటి శిక్షణా కార్యక్రమాలు చాలామటుకు శారీరక దారుఢ్యానికి ఉపయోగపడుతున్నాయే కానీ ఆధ్యాత్మిక విలువలను అందించడం లేదు.

నేటి పరిస్థితుల్లో శీల నిర్మాణ విద్య ఏటికి ఎదురీత లాంటిది. ఆధునిక నాగరకతలోని ఒత్తిళ్ళను తట్టుకొనే ఆధ్యాత్మిక బలం పిల్లలకు అందించకపోతే వారిని ఈ నాగరకత బలిగొంటుందని పరమపూజ్యులు స్వామి రంగనాథానందజీ మహరాజ్ చెప్పేవారు. ఆ మాటల్లోని వాస్తవం మనకు నేడు కళ్ళకు కట్టినట్లు కనపడుతోంది.

పిల్లలు సహజంగా దుష్ప్రవర్తకులు కారు. నేడు వారు ఎదుర్కొంటున్న సమస్యలన్నిటికీ పెద్దలే కారణం. ఇలాంటి ప్రతికూల పరిస్థితుల్లో సైతం అధికాంశం పిల్లలు మంచి శీలం కలిగి ఉంటున్నారు. అయితే సామాజిక ఒత్తిళ్ళను తట్టుకొనేందుకు వారికి ఒక ఆలంబన అవసరం. విద్యాసంస్థలు ఈ ఆలంబనను ఇచ్చే



స్థితిలో లేవు. నేటి విద్యా విధానంలో విద్యార్థుల మెదళ్ళను పనికిరాని సమాచారంతో ఎక్కువగా నింపుతున్నారని స్వామి వివేకానంద చెప్పారు. ఆయన కాలానికీ, నేటికీ పరిస్థితి ఇంకా దారుణంగా దిగజారింది. పాఠశాలల యాజమాన్యాలు ధనార్జనలోనూ, అధికశాతం విద్యార్థులు మంచి మార్కులతో ఉత్తీర్ణులయ్యేలా చూడడంలోనూ తలమునకలై ఉన్నాయి. ఇలాంటి విద్యాలయాలలో ఎంత మంచి ఉపాధ్యాయులైనా నిస్సహాయులే. ఆరోగ్య రక్షణ మాదిరిగానే విద్యాబోధనను కూడా వ్యాపార సంస్థలు తమ స్వార్థప్రయోజనాలకు ఉపయోగిస్తుంటే ప్రభుత్వం మిన్నకున్నది. అంతేగాక అది లౌకిక (సెక్యులర్) విధానమని చెప్పుకుంటూ, విద్యాబోధనలో నీతిబోధనకు తావు లేకుండా చేసింది ప్రభుత్వం. మరొక వైపు మత సంస్థల నిర్వహణలోని విద్యాసంస్థల విద్యార్థులు మతఛాందసులుగా తయారవుతున్నారు. పాఠశాలలలో నీతి బోధన ఆవశ్యకతను తల్లితండ్రులు కూడా గ్రహించడం లేదు. మంచి వేతనాలు లభించే కోర్సులలో తమ పిల్లలు స్థానం సంపాదిస్తే చాలనే భావం వీరిది.

చాలామంది యువతీ యువకులు దేశాభివృద్ధి, జాతి నిర్మాణాల పట్ల శ్రద్ధ చూపుతున్నారు. ఇందులో ఉడతాభక్తిగానైనా తాము పాలుపంచుకోవాలని ఉత్సాహం చూపుతున్నారు. ఇది ముదావహం. శీలనిర్మాణ పునాదులు పూర్తిగా సడలిపోలేదనేందుకు ఇది నిదర్శనం. ఆధ్యాత్మిక బోధన ద్వారా దీనిని మరింత పటిష్ఠం చేయవచ్చు. తెగులు పట్టిన పండును చూసి, ఆ వృక్షం శక్తిసామర్థ్యాలను అంచనా వేయకూడదన్నారు స్వామి వివేకానంద. పారంపర్యంగా అందివస్తున్న సాంస్కృతిక ఆచార వ్యవహారాల వేళ్ళు మన సమాజంలో ఇప్పటికీ పటిష్ఠంగానే ఉన్నాయని చెప్పవచ్చు. ఆధ్యాత్మిక బోధనలను వాస్తవిక ధోరణిలో స్వీకరించే స్థితిలో మన సమాజం ఉంది. కాబట్టి, పిల్లలు కూడా మంచి శిక్షణను గ్రహించే స్థితిలోనే ఉన్నారు. రామకృష్ణ మఠం వంటి ఆధ్యాత్మిక సంస్థలు బాలల వికాస తరగతులు నిర్వహిస్తున్నాయి. పిల్లలతో పాటు తల్లితండ్రులకు కూడా అంతర్యోగ శిబిరాలు నిర్వహించడం అవసరం. శీలనిర్మాణంలో ఆధ్యాత్మిక శిక్షణ ఆవశ్యకతను తల్లితండ్రులు గ్రహించవలసిన అవసరమే ఇక ఎంతైనా ఉంది. ❖

# మనసును ఎందుకు నియంత్రించాలి?

సాధారణంగా మన మనసు మన చుట్టూ ఉండే వస్తువుల మీద లేదా వ్యక్తుల మీద లగ్నమవుతుంది. ఆ వస్తువులలో ఉండే ఆకర్షణలు మనసును ప్రలోభపెట్టి మనల్ని ఆయా వస్తువులకు బానిసలుగా మారుస్తాయి. మనం పరిస్థితుల ప్రభావానికి లొంగకుండా ఉండాలంటే మనసుపై పట్టు సాధించాలి. అలా కాకుండా పరిస్థితుల ప్రభావానికి మనసు లోనైతే ఏ కార్యాన్నీ సాధించలేం.

మనసుపై ఆధిక్యతను సాధించడం ఎలాగో చూద్దాం. స్వామి వివేకానంద ఇలా బోధించారు:

"ప్రపంచమంతటా 'మంచిగా ఉండు! మంచిగా ఉండు! మంచిగా ఉండు!' అని బోధించడాన్ని మనం వింటూనే ఉంటాం. ఏ దేశంలోనైనా సరే, 'దొంగతనం చెయ్యవద్దు! అబద్ధం చెప్పవద్దు!' అని చెప్పించుకోని పిల్లవాడు లేడంటే అతిశయోక్తి కాదు. అయితే ఎవరూ ఆ పిల్లవాడికి దొంగతనం ఎందుకు చెయ్యకూడదో చెప్పరు. వాడు దొంగ ఎందుకు కాకూడదో, దొంగతనం చెయ్యకుండా ఉండడం ఎలాగో నేర్పించకుండా కేవలం 'దొంగతనం చెయ్యవద్దు!' అని ఊరకే మాటలు చెప్పినంత కాలం ఆ పిల్లవానిలో మార్పుని తీసుకురాలేం. ఎప్పుడైతే పిల్లవాడికి దొంగతనం చేయడం వల్ల నష్టాల్ని వివరిస్తామో అప్పుడు మాత్రమే వాడు మంచిగా ఉండడానికి ప్రయత్నిస్తాడు".



మనసును నియంత్రించక పోవడం వల్ల కలిగే అనర్థాలను ముందుగా తెలుసుకుంటే సులభంగా మనసును స్వాధీనపరచుకోవచ్చు.

మనసు, అవయవాలనే కొన్ని కేంద్రాలతో తనను తాను అనుసంధానం చేసుకున్నప్పుడు మాత్రమే అన్ని పనులూ జరుగుతాయి. ఇష్టపూర్వకంగా కానీ, అనిష్టంగా కానీ మనసు ఆ కేంద్రాల వైపు లాగబడుతుంది. అలాంటప్పుడు మనసును నియంత్రించుకోలేకపోతే అనర్థాలను ఎదుర్కోవలసి వస్తుంది.

వస్తువిషయాలకూ, ఇంద్రియాలకూ అనుసంధానకర్త మనసు. ఎప్పుడైతే మనసును వస్తువుల నుంచి వెనక్కి మరలిస్తామో, అప్పుడు ఇంద్రియాలు కూడా మనసును అనుసరించి తమను తాము వెనక్కి మరల్చుకుంటాయి. కాబట్టి మనసు స్వాధీనమైనప్పుడు బయటకు వెళ్ళే ఇంద్రియాలు వాటంతట అవే స్వాధీనమవుతాయి. దీనికి ఒక ఉదాహరణ చెప్పవచ్చు.

తేనెటీగలు తమ రాణీ ఈగను అనుసరించిపోవడం మనమందరం చూస్తాం. రాణీ ఈగ పైకెగిరితే మిగిలిన ఈగలన్నీ ఎగురుతాయి. రాణీ ఈగ వాలితే అవన్నీ దాన్ని అనుసరిస్తాయి. ఇదే విధంగా మనస్సనే రాణీఈగ స్వాధీనమైనప్పుడు ఇంద్రియాలనే ఈగలన్నీ మనసు చెప్పినట్లు చేస్తాయి.

ఇంద్రియాలను వస్తువుల సంపర్కంలోకి రాకుండా నిరోధించి మనసును అవి అనుసరించేలా చేయడమే ప్రత్యాహారం అంటారు.

మనసుని నిగ్రహించడం సంకల్పశక్తి మీద ఆధారపడి ఉంటుంది. సంకల్పశక్తి గలవారు ఎలాంటి ఉద్రేకాలకూ లొంగకుండా అనుకున్న కార్యంలో విజయాన్ని సాధిస్తారు. ❖




# పరిపూర్ణతనిచ్చే స్వామీజీ సందేశం !

– కె. శంకరయ్య

విశ్వమత మహాసభలో స్వామీజీ ప్రసంగించి వంద సంవత్సరాలు అయిన సందర్భంగా 1993లో బేలూరు మఠం (కలకత్తా)లో ఒక జాతీయ సమ్మేళనం ఏర్పాటు చేశారు. ఆ సమ్మేళనంలో పాల్గొనడానికి వివరాలు తెలుసుకోవడం కోసం హైదరాబాద్ రామకృష్ణ మఠానికి వెళ్ళాను. కానీ అప్పటికే అధిక సంఖ్యలో భక్తులు పేర్లను నమోదు చేసుకోవడం వల్ల నాకు కలకత్తా సమ్మేళనంలో పాల్గొనడానికి అవకాశం లేదన్నారు. అప్పుడు నేను చాలా బాధపడుతూ ఇంటికి తిరిగి వెళ్ళాను. కానీ, ఏం జరిగిందో ఏమో అదే రోజు రాత్రి 'సమ్మేళనంలో పాల్గొనడానికి మీ పేరు నమోదు చేసుకోండి' అని రామకృష్ణ మఠం నుంచి ఫోన్ వచ్చింది. ఆ సంతోషకరమైన వార్త వినగానే భగవంతుడు నా మొర విన్నాడని తెలిసి నా కళ్ళు చెమ్మగిల్లాయి. అలా 1993లో కలకత్తా సమ్మేళనంలో పాల్గొనే భాగ్యం కలిగింది.



స్వామీజీ జీవిత చరిత్రను తొలిసారిగా 1973లో చదివాను. 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను 1975 నుంచి నెలనెలా చదువుతున్నాను. చదవడమేకాక 33 ఏళ్ళ నుంచి ఎంతోమంది విద్యార్థులు, ఉపాధ్యాయులచేత చదివిస్తున్నాను. పదవీ విరమణ తరువాత ఎక్కువగా గ్రామీణ ప్రాంతాల ప్రజలు, విద్యార్థులు, ఉపాధ్యాయులు, యువకులచేత స్వామీజీ సాహిత్యాన్నీ, 'శ్రీరామకృష్ణ ప్రభ'నూ చదివించాలని కృషి చేస్తున్నాను. రామాయణంలోని ఉడుతలా నా శక్తి మేరకు మూర్తిత్రయ సాహిత్యాన్ని ఉచితంగా పంపిణీ చేస్తున్నాను. 35 సంవత్సరాలు ఉన్నతమైన ఉపాధ్యాయ వృత్తిలో పనిచేసిన నాకు ఆదర్శంగా మెలగడానికీ, ఏది మంచో, ఏది చెడో వివరించడానికీ, పాఠ్యాంశాలతో పాటు నైతిక, ఆధ్యాత్మిక విలువల్ని కూడా బోధించడానికీ స్వామీజీ సాహిత్యం ఎంతగానో తోడ్పడింది.

**"భారతదేశాన్ని క్షుణ్ణంగా అర్థం చేసుకోవాలంటే స్వామీజీ సందేశాన్ని చదవాలి"** అన్న విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్ మాటలు నిత్యసత్యాలు. యువతీ యువకులు స్వామీజీ సందేశాన్ని చదివితే పరిపూర్ణ వ్యక్తులుగా తయారవుతారనడంలో సందేహం లేదు. ❖

కె.శంకరయ్య, మాసైపేట్, మెదక్ జిల్లా.

# 'స్ఫూర్తి భావనలకు స్వాగతం'

**జీర్ణమయిన దుస్తుల్ని త్యజించినట్లు ఈ శరీరాన్ని త్యజించినా నా భావాలతో ముందు తరాలను నిరంతరం చైతన్య పరుస్తూనే ఉంటాను అనేవారు స్వామి వివేకానంద. విశ్వానికే ఆత్మవిశ్వాసాన్ని ప్రబోధించిన యుగపురుషుడాయన. ఆబాల గోపాలాన్నీ ఉత్తేజపరిచే ఉత్తుంగ చైతన్య సాగరం స్వామీజీ.**

**స్వామి వివేకానంద ఈ ప్రపంచం నుంచి భౌతికంగా నిష్క్రమించి ఒక శతాబ్దం అయినా వారి స్ఫూర్తి మాత్రం ఆచంద్రార్కం మనల్ని మేల్కొలుపుతూనే ఉంటుంది. అలా ఆ మహనీయుని జీవితంతో ఉత్తేజితులైన వారి అనుభూతులకు, అనుభవాలకు 'శ్రీరామకృష్ణ ప్రభ' స్వాగతం పలుకుతోంది.**

**స్వామి వివేకానంద జీవితంలోని ఒక సంఘటన కావచ్చు, సంభాషణ కావచ్చు.... ఉత్తరం కావచ్చు, ఉపన్యాసం కావచ్చు... ఏదైనా మిమ్మల్ని మహత్తరంగా ప్రభావితం చేసి ఉంటుంది. ఆ అనుభూతిని, అనుపమానమైన స్ఫూర్తిని 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులతో పంచుకోండి.**

**సమస్యల సాగరంలో చిక్కుకొని చుక్కాని లేని అగమ్యగోచరమైన నేటితరానికి స్వామి వివేకానంద సాహిత్యం ఆశాదీపమని మీ అనుభవాలు నిరూపిస్తాయి. మీ అనుభవాలను, అనుభూతులను వ్రాసి మీ ఛాయాచిత్రం (కలర్ ఫోటో)తో సహా పంపిస్తే 'నా జీవితంలో స్వామి వివేకానంద' అనే శీర్షికలో ప్రచురిస్తాం.**



మీ అనుభవాలను, భావనలను పంపవలసిన చిరునామా
**'నా జీవితంలో స్వామి వివేకానంద'**
శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,
దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029

# ధరణిపై వెలసిన దేవత

ఈ సంఘటన 1921లో జపాన్‌లోని 'గోఫు' అనే గ్రామంలో జరిగింది:

కియోకో అనే మహిళ అనారోగ్యంతో ఉన్న తన భర్తను వైద్యుని దగ్గరకు తీసుకువెళ్ళింది. రోగిని పరీక్షించాక ఆ వైద్యుడు 'నీ భర్తకి కుష్ఠువ్యాధి వచ్చింది' అని చెప్పాడు. అది వినగానే కియోకో నిశ్చేష్టురాలైంది. తన భర్తకు అతనికి వచ్చిన వ్యాధి గురించి తెలియనీయకుండా తన మామగారికి విషయమంతా వివరించింది. అది విన్న ఆమె మామగారు "కుష్ఠువ్యాధికి గురైన నా కుమారుడి వల్ల నీ జీవితం కష్టాలపాలైంది" అన్నారు.

1921 మే నెలలో కియోకో తన భర్తతో పాటు గ్రామానికి దూరంగా ఒక ఇల్లు అద్దెకు తీసుకొని భర్తకు సేవలు చేస్తూ జీవితాన్ని కొనసాగిస్తుండేది. కియోకో భర్తకు కుష్ఠు వ్యాధి అని అక్కడ గ్రామస్థులకు తెలియగానే వారంతా భయపడి, వారిని అక్కడ నుంచి వెళ్ళిపోమన్నారు. అప్పుడు కియోకో అక్కడకు చాలా దూరంలో ఉన్న తమ స్వగ్రామం వెళ్ళిపోవాలని నిర్ణయించుకుంది. వాళ్ళిద్దరూ రైలు ఎక్కగానే కియోకో భర్త కుష్ఠు వ్యాధిగ్రస్థుడని తెలిసి తోటి ప్రయాణికులంతా భార్యాభర్తల్ని రైల్లో నుంచి దిగిపొమ్మన్నారు. పక్కస్టేషన్‌లో ప్రయాణికులందరూ కలిసి వీరిద్దర్నీ బలవంతంగా రైల్లో నుంచి దింపేశారు. కియోకో స్టేషన్ మాష్టర్‌ని కలిసి రైల్లో తమ స్వగ్రామం చేరనీయమని వేడుకుంది. స్టేషన్ మాష్టర్ "రైల్వే నిబంధనల ప్రకారం దీర్ఘ వ్యాధులతో బాధపడుతున్న వాళ్ళు రైలు ప్రయాణానికి అనర్హులు" అని చెప్పి, ఆమె అభ్యర్థనను నిరాకరించాడు.

కియోకో స్వగ్రామం అక్కడకు 700 కిలోమీటర్ల దూరంలో ఉంది. అంత దూరం వ్యాధిగ్రస్థుడైన భర్తతో కాలినడకన వెళ్ళడం అసాధ్యం. బజారుకు వెళ్ళి ఒక పాత సైకిల్ రిక్షా కొన్నది. కొన్ని దుప్పట్లు కూడా కొన్నది. భర్తను రిక్షాలో కూర్చోబెట్టి, దుప్పట్లు కప్పి సైకిల్ తొక్కుతూ ప్రయాణం ప్రారంభించింది ఆ ధీరవనిత. విపరీతమైన చలి, అపరిచిత ప్రదేశాలు, ఇంకా అనేకమైన ఇతర ఇబ్బందులు ఒకవైపు నుంచి బాధిస్తే, ఎవ్వరి నుంచీ ఏ విధమైన సహాయ సహకారాలు లేకపోవడం మరోవైపు నుంచి బాధించసాగాయి. ఇలాంటి క్లిష్ట పరిస్థితుల్లో 700 కిలోమీటర్ల ప్రయాణం చేసినప్పుడు మరెన్ని కష్టాలు ఎదురవుతాయో మనం ఊహించాల్సిందే! ఆమె తన శక్తినంతటినీ కూడగట్టుకుని రోజుకు 10-15 కిలోమీటర్లు సైకిల్ తొక్కేది. దోవలో ఆమె అనుభవించిన బాధలకు అంతు లేదు. అన్ని బాధల్నీ సహించి 1922 జనవరి చివర్లో స్వగ్రామానికి చేరింది ఆమె.

కియోకో పరిస్థితి తెలిసిన ఆమె తల్లితండ్రులు ఎంతో దుఃఖించారు. ఆమెను ఇంటికి తీసుకురమ్మని తమ కుమారుణ్ణి పంపించారు. "దైవ నిర్ణయం ప్రకారం మా బాంధవ్యం ఏర్పడింది; ఇప్పుడు నా భర్తను ఈ స్థితిలో విడిచిపెట్టడం అపరాధం. భార్యగా ఆయనకు సేవలందించడం నా కర్తవ్యం" అని తన సోదరునితో చెప్పి పంపించింది. కుష్ఠు వ్యాధితో ఉన్న కియోకో భర్తను చూసి ఇరుగు పొరుగు వారు భయపడసాగారు. కియోకో మాత్రం ఒక సంపూర్ణమైన ఆరోగ్యవంతునితో మెలిగినట్లే ప్రవర్తించేది. ఎవరూ తాకడానికి కూడా ఇష్టపడని అతని బట్టలు ఉతకడం, అతనికి తినిపించడం, అతనికి నిద్రపట్టకపోతే గంటల తరబడి



అతనితో మాట్లాడడం, అతని దేహం శుభ్రం చేయడం-ఇలా విసుగు, విరామం లేకుండా భర్తకు అన్ని సేవలూ ప్రేమతో చేసేది.

శక్తికి మించి శ్రమపడడం వల్ల దురదృష్టవశాత్తూ 1924లో ఆమె కుంటిది అయింది. అయితే అది ఆమె భర్తకు చేస్తున్న సేవలకు ఎలాంటి ప్రతిబంధకమూ కాలేదు. ఒక కర్ర సహాయంతో రోజూ సాయంకాలం తన భర్తను ఒక బండిలో కూర్చోబెట్టి బయటకి తీసుకుని వెళ్ళి తిప్పి తీసుకువచ్చేది. కియోకో తన భర్తకు చేస్తున్న ప్రేమపూర్వక సేవలను చూసి అక్కడి ప్రజలందరూ ఆమెను దేవతగా భావించి గౌరవించేవారు. జీవిత సర్వస్వాన్ని భర్త సేవకే నివేదించిన కియోకో నిజంగానే 'ధరణిపై వెలసిన దేవత'. ❖

...17వ పేజీ తరువాయి.


7
హఠాత్తుగా వర్షం ముంచుకొచ్చింది. బుద్ధుని ప్రతిమను పరదాలతో కప్పినా ప్రయోజనం లేకపోయింది. ప్రచండ వేగంతో గాలులు వీచసాగాయి. ప్రజలందరూ నలుదిక్కులకూ చెదరిపోయారు. ప్రతిమ మాత్రం వర్షంలో తడుస్తోంది. వారి అధ్యక్షునికీ ఇతర భిక్షువులకూ ఏం చెయ్యాలో తోచక నిశ్చేష్టులై పోయారు.
అయ్యో! బుద్ధ భగవానుని విగ్రహం కరిగిపోయేలా ఉందే! నేను ఈ దృశ్యాన్ని చూడలేకపోతున్నాను! భగవంతుడా! ఎన్నో శతాబ్దాలుగా పెద్దలు ఆరాధిస్తూ వచ్చిన మీ విగ్రహాన్ని కాపాడలేకపోయానే!
మనందరం కలిసి బుద్ధ భగవానుణ్ణి ప్రార్థిద్దాం. ఆయన మనల్ని ఈ విపత్తు నుంచి తప్పకుండా ఆదుకుంటాడు.
అందరూ కలసి ప్రార్థన చేయసాగారు.
8
విగ్రహం క్రమంగా కరుగుతోంది. భిక్షువుల కళ్ళు చెమ్మగిల్లాయి. అప్పుడు ఒక అద్భుతం జరిగింది.
అయ్యో! మన కళ్ళ ముందే భగవంతుని ప్రతిమ కరిగిపోతోంది!
ఆహా! ఇదేం ఆశ్చర్యం! భగవంతుని విగ్రహం బంగారంలా ప్రకాశిస్తోందే! రండి! దగ్గరకు వెళ్ళి చూద్దాం!
9
అయ్యా! మట్టి ప్రతిమలాగ ఉండే భగవానుడు బంగారు విగ్రహంగా బయట పడుతున్నాడు.
అవును! బంగారు బుద్ధుడే! మట్టి విగ్రహం లోపల స్వర్ణ విగ్రహమా!






**'తాను ఆరాధించే దేవతా విగ్రహాలు నిజంగానే దివ్యత్వం కలవి' అని విశ్వసించే వాడు దివ్యత్వాన్ని పొందుతాడు. కానీ ఆ విగ్రహాలు కేవలం రాయి, ఇత్తడి అని అనుకునేవాడు అర్చన ద్వారా ఎలాంటి లాభాన్నీ పొందలేడు.**

– శ్రీరామకృష్ణ పరమహంస

# గ్రంథ పరిచయం

## ద్వాదశ నారసింహ క్షేత్రదర్శిని



**రచన : డాక్టర్ చల్లా సత్యవాణి**
**పేజీలు : 188, వెల: రూ.80/-**
**ప్రాప్తిస్థానము: ప్రణవకుటి, 46-18-11, దానవాయిపేట, రాజమండ్రి.**

ప్రహ్లాద, నారద, పరాశర, పుండరీక వరదుడైన శ్రీనరసింహ స్వామి వెలసిన క్షేత్రాలకు సంబంధించిన పురాణాంశాల్నీ, చారిత్రకాంశాల్నీ, ఏయే మహనీయులు ఆ క్షేత్రాలను దర్శించి మోక్షాన్ని పొందారో వివరాల్నీ శ్రీమతి సత్యవాణి గారు ఈ గ్రంథంలో స్పష్టంగా తెలియజేశారు. అంతేకాకుండా నారసింహ భక్తులకు యాత్రికులకు ఆయా క్షేత్రాలకు చేరటానికి ప్రయాణం చేయవలసిన విధానం బస్సు, రైలు, మార్గాల వివరాలు, వసతి, భోజనం, ఏర్పాట్లు సౌకర్యాలు పట్టికగా అనుబంధంగా చేర్చి ప్రయాణాన్ని సులభతరం చేశారు. ఇంత చక్కని యాత్రారచనను తెలుగువారికి అందించిన సత్యవాణిగారు అభినందనీయులు. **- ఎమ్.వి. నాగప్రసాద్**

## లక్ష్మీపుర నరహరి కీర్తనలు



రచయిత : కపిలవాయి లింగమూర్తి
పేజీలు: 52, వెల : రూ. 30/-
ప్రాప్తిస్థానం : కె. కిశోర్ బాబు,
వాణీ సదనం, 17-110, విద్యానగర్ కాలనీ,
నాగర్‌కర్నూలు-509 209.

## బాపూజీ గీతా సందేశం



స్వేచ్ఛానువాదం : రావినూతల శ్రీరాములు
పేజీలు : 48, వెల : రూ. 20/-
ప్రతులకు: రావినూతల శ్రీరాములు
రమణస్థాన్, 10/228, వసంతపురి కాలనీ,
మల్కాజ్‌గిరి, హైదరాబాద్ - 500 047

## విజేత



రచన : మేడిచర్ల ప్రభాకర రావు
పేజీలు : 78, వెల : రూ. 30/-
ప్రతులకు : గీతా భవనము, స్టేషన్‌రోడ్,
నిజామాబాద్

## శ్రీరామకృష్ణ గానలహరి



**రచన: స్వామి అనుభవానంద**
**వెల: రూ. 50/-**

శివకేశవుల అంశలతో జన్మించిన శ్రీరామకృష్ణులు జగద్గురువుగా అందరిచేతా కీర్తింపబడిన దివ్యపురుషుడు. వారి అనుయాయులు స్వామి అనుభవానందులవారు. శ్రీ శారదారామకృష్ణులపై అనేక కీర్తనలను భక్తి ప్రపత్తులతో రచించారు స్వామి అనుభవానంద. ఆ కీర్తనలలో కొన్ని మొదట "శ్రీరామకృష్ణ గానసుధ" పేరుతోనూ, రెండవ మారు "శ్రీరామకృష్ణ గానామృతం" పేరుతోనూ, 2 సిడిలుగా విడుదల అయ్యాయి. ఇప్పుడు స్వామి అనుభవానందులవారి శతజయంతి సందర్భంగా (1908-2008) "శ్రీరామకృష్ణ గానలహరి" పేరుతో ఒక సీడిని విడుదల చేశారు. ❖

ఈ సి.డి.లను పొందగోరే వారు క్రింది చిరునామాను సంప్రతించండి.
శ్రీ రామకృష్ణ భక్త సమాజం
11-1-13, యం.జి.రోడ్, బాపట్ల - 522 101
ఫోన్:94404 49355, 92472 99837

## శ్రీ వివేకానంద చరితామృతం



**రచన: శ్రీ అనుభవానంద స్వామి**
**వ్యాఖ్యానం : శ్రీ మాతాజీ త్యాగీశానంద**
**వెల : రూ॥100/-, (రెండు సి.డి.లు)**

మనదేశ ఔన్నత్యాన్నీ, ఆధ్యాత్మిక జీవిత వైశిష్ట్యాన్నీ, మత ప్రాశస్త్యాన్నీ పాశ్చాత్య దేశాలలో చాటిన యుగ ప్రవక్త స్వామి వివేకానంద. "నా దేశం తన పూర్వ ప్రతిభను పొందే వరకూ విశ్రమించను" అని కంకణం కట్టుకుని యావత్ ప్రపంచాన్నీ ఒక ఊపు ఊపిన దివ్యశక్తి స్వామీజీ. అంతటి దివ్యశక్తి సంపన్నుడి సందేశాన్నీ, ప్రతిభా పాటవాలనీ యువతరాల వారికి అందించాల్సిన బాధ్యత మనందరిదీ! స్వామీజీ జీవితంలోని మహత్కార్యాలనన్నిటినీ కథా-గాన రూపంలో రచించారు స్వామి అనుభవానంద. శ్లోకాలతో పద్యాలతో పాటలతో చెవులకింపుగాసాగే ఈ కథాగానాన్ని రెండు సిడిల ప్యాక్‌గా "శ్రీవివేకానంద చరితామృతం"పేరిట విడుదల చేశారు.

శ్రీమాతాజీ త్యాగీశానందవారి వ్యాఖ్యానంతో, శ్రీ బండారు చిట్టిబాబుగారి సంగీత పర్యవేక్షణలో 'శ్రీరామకృష్ణ గానలహరి' 'శ్రీవివేకానంద చరితామృతం' డా॥ ఎమ్.శారద, శ్రీమతి ఎస్.చంద్రమణి, శ్రీమతి ఎమ్. విమల మొదలైన గాయనీ గాయకులు సుమధురంగా గానం చేశారు. సరళమైన తెలుగులో మధురంగా సాగిన ఈ రెండు సి.డి.లు ప్రతీ ఒక్కరికీ వీనుల విందు చేస్తాయనడంలో సందేహం లేదు.❖**- శ్రీమతి ఎన్. శేష**

# వార్తావాహిని

## రామకృష్ణ మిషన్ కేంద్రాల సంక్షేమ కార్యక్రమాలు

**వరద బాధితులకు సహాయం :** ఫిజీ, బీహార్, ఒరిస్సా రాష్ట్రాల్లోని వరద బాధితులకు ఫిజీ, భువనేశ్వర్, పాట్నా రామకృష్ణ మిషన్ కేంద్రాలు సహాయక చర్యలు చేపట్టాయి.

ఫిజీ రామకృష్ణ మిషన్ విటిలేవు పట్టణంలో వరదలకు గురైన విద్యార్థులకు 1,886 పాఠ్యపుస్తకాలు, 4,018 లేఖన సామాగ్రి, 421 గణవేషలను (యూనీఫారాలను) పంపిణీ చేసింది. 398 మంది విద్యార్థులకు పాఠశాల రుసుము చెల్లించింది.

భువనేశ్వర్ రామకృష్ణ మిషన్ కటక్, పూరీ ప్రాంతాలలో వరదలకు గురైన విద్యార్థులకు 3,612 పాఠ్యపుస్తకాలు, లేఖన సామాగ్రి, గణవేషలను (యూనీఫారాలను) పంపిణీ చేసింది.

పాట్నా రామకృష్ణ మిషన్ వరద బాధితులకు 2,611 చీరలు సరఫరా చేసింది. 10,16,600 మంది రోగులకు వైద్య సేవల్ని అందించింది.

**నేత్రవైద్య సేవలు :** బెల్‌గామ్, చండీఘర్, లక్నో, ముంబయి, పోర్‌బందర్, రాజ్‌కోట్, సేలం, సిక్రా కులింగ్రామ్, అల్వార్, సిల్‌చార్, వడోదర రామకృష్ణ మిషన్ కేంద్రాలు 2009 మార్చి నెలలో ఉచిత వైద్య శిబిరాల్ని నిర్వహించాయి. ఈ శిబిరాల్లో 3,191 మంది చికిత్స పొందారు. 759 మందికి శస్త్రచికిత్సలు జరిగాయి.

**బీదలకు సహాయం :** బెల్‌ఘరియా రామకృష్ణ మిషన్ 6,307 మంది నిరుపేదలకు చీరలు, ధోవతులు పంపిణీ చేసింది. ❖






## స్వామి వివేకానంద విగ్రహావిష్కరణ



**హైదరాబాద్ సాంస్కృతిక, సంక్షేమ సంఘం** అశోక్‌నగర్ పార్క్‌లో నెలకొల్పిన స్వామి వివేకానందుని విగ్రహాన్ని హైదరాబాద్ రామకృష్ణ మఠం స్వామి గౌరంగానందజీ 2009 మార్చి 15న ఆవిష్కరించారు. ఈ సందర్భంగా నిర్వహించిన బహిరంగ సభలో ప్రసంగిస్తూ హైందవ సమాజ ఔన్నత్యాన్ని ప్రపంచానికి చాటిచెప్పిన మహనీయుడు వివేకానందుడనీ, ఆయన బోధనలు సర్వ మానవాళికి ఆదర్శప్రాయమనీ స్వామీజీ గుర్తుచేశారు. బి.జె.పి. రాష్ట్ర ప్రధాన కార్యదర్శి డాక్టర్ లక్ష్మణ్ మాట్లాడుతూ యువత రామకృష్ణ పరమహంస, వివేకానందుల బోధనలను స్ఫూర్తిగా తీసుకొని దేశ ప్రగతిలో భాగస్వాములు కావాలని పిలుపునిచ్చారు. ❖ **నివేదిక : సి.జె. శాస్త్రి**

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) **'వేదచూడామణి'** : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

(ఆ) **'వేదార్థచూడామణి'** : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
వయస్సు : 15 సం॥, ఆ పైన
స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) **వేదాధ్యాపకుడు** : (సామవేదము/ అథర్వవేదము – వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవము : 2 సంవత్సరములు
సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

(ఆ) **వేదభాష్యాచార్యుడు** : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవార్హత : 5 సం॥
సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

హైదరాబాద్ కులప్రశాసకుడు




Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**



# సుబోధ

ఒక్కొక్కప్పుడు సిద్ధులవల్ల గొప్ప అనర్థాలు వాటిల్లుతాయి. ఒక గొప్పసిద్ధుడి గురించి తోతాపురి నాతో ఇలా చెప్పాడు: "ఒకమారు ఆ సిద్ధుడు సముద్రతీరంలో కూర్చుని ఉండగా పెద్ద తుపాను చెలరేగింది. 'తుపాను ఆగిపోవుగాక!' అని ఆ సిద్ధుడు అనగానే తుపాను ఆగిపోయింది. సరిగ్గా ఆ సమయంలోనే పూర్తిగా విప్పిన తెరచాపలతో అమిత వేగంగా సముద్రంలో ఒక ఓడ పోతోంది. హఠాత్తుగా గాలి స్తంభించిపోవటంతో ఆ తాకిడికి ఓడ మునిగిపోయి, అందులోని వారంతా సముద్రం పాలైనారు. అంతమందికి ప్రాణహాని కలిగించిన పాపం సోకటంతో ఆ సిద్ధుడు తన సిద్ధులన్నిటినీ కోల్పోవటమే కాకుండా నరకానికి కూడా వెళ్ళి పాపఫలం అనుభవించవలసి వచ్చింది".

నేను పంచవటి కింద సాధనలు చేసే కాలంలో గిరిజుడు అనే వ్యక్తి అక్కడికి వచ్చాడు. అతడు గొప్పయోగి. ఒక రాత్రి చీకట్లో నేను నా గదికి వెళ్ళాల్సి వచ్చింది. అప్పుడతడు తన చేతిని పైకెత్తగా అతడి బాహుమూలం నుంచి గొప్ప వెలుగు వెలువడి మార్గాన్ని ప్రకాశవంతం చేసింది. నా హితవు విని ఆ మహిమను వినియోగించటం మానేసి అతడు బ్రహ్మసాక్షాత్కారానికై మనస్సు మరల్చుకొన్నాడు. కొన్నాళ్ళకు అతడికి ఆ శక్తిపోయినా ఆత్మోన్నతిని పొందగలిగాడు.

మహారాజుల అంతఃపురాలకు వెళ్ళగలిగే యాచకుడు గుమ్మడి కాయ, పుచ్చకాయవంటి అల్ప వస్తువుల కోసం యాచిస్తే చాలా తెలివితక్కువగా ప్రవర్తించినవాడవుతాడు. రాజరాజేశ్వరుడైన సర్వేశ్వరుడి ద్వారంవద్ద నిలబడి, అమూల్యమైన భక్తి జ్ఞానాలను విడిచి, సిద్ధుల కోసం అర్థించే భక్తుడు అవివేకంగా వర్తించిన వాడవుతాడు. ❖

**('శ్రీరామకృష్ణ బోధామృతం' నుంచి)**


**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద
సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

# సురభి



1888 నవంబరులో మాతృదేవి పూరీ జగన్నాథ యాత్ర చేశారు. ఆమెతో రాఖాల్, యోగీన్, శరత్, యోగీన్‌మా, గోలాప్‌మా, లక్ష్మి ప్రభృతులు వెళ్ళారు. మాతృదేవి గురుదేవుల పటాన్ని తమతో పాటు తీసుకెళ్ళారు. ఆలయానికి వెళ్ళి పూజించినప్పుడు, గురుదేవుల పటాన్ని బయటకు తీసి వారికి కూడా స్వామి దర్శనం చేయించారు. అక్కడ తమకు కలిగిన దివ్యదర్శనం గురించి మాతృదేవి ఇలా చెప్పారు: "వజ్ర వైడూర్యాలతో పొదిగిన సింహాసనంపై పురుష సింహంలాగ" ఆసీనులై ఉన్నారు జగన్నాథస్వామి. నేను ఒక సేవకురాలిగా సపర్యలు చేస్తున్నాను".

వందలాది భక్తులు అక్కడికి వచ్చి జగన్నాథుని దర్శించుకునే దృశ్యం మాతృదేవిని చకితురాలిని చేసింది. "ఆహా! ఏం అద్భుతం! వీరంతా ముక్తి పొందుతారు కదా!" అన్నారు ఆనందబాష్పాలు స్రవిస్తూండగా. కానీ మరుక్షణమే, "ఎక్కడికి వెళ్ళి ఆరాధనలు చేసినా వాసనారహితులు మాత్రమే ముక్తి పొందగలుగుతారు" అని ఆమెకు తెలియజేయబడింది.

తమ దివ్య దర్శనంలో మాతృదేవి జగన్నాథుణ్ణి శివుని రూపంలో చూశారు. ఒక లక్ష సాలగ్రామ శిలలతో నిర్మింపబడిన పీఠం మీద పరమశివుడు లింగ స్వరూపంలో కొలువైవుండడం చూశాను అన్నారామె.

మాతృదేవికి కలిగిన ఈ దర్శనం, ఆ దేవాలయ స్థల పురాణంతో సరిపోతుంది.

పూరీలో మాతృదేవి దేవాలయానికి వెళ్ళి రావడానికి పల్లకీ ఏర్పాటు చేయమని ఆలయ పూజారి చెప్పాడు. అందుకు మాతృదేవి వినమ్రంగా "వద్దు, మీరు దారి చూపుతూ ముందు వెళ్ళండి. నేను మీ వెనుక వస్తాను" అని ఒక సామాన్యురాలిలాగ చెప్పారు. పూరీ జగన్నాథంలోని ఇతర ఆలయాలకు కూడా వెళ్ళి దర్శనం చేసుకున్నారు. మహాలక్ష్మి సన్నిధిలో చాలాసేపు ధ్యానంలో లయించిపోయారు. పూరీ జగన్నాథ యాత్ర మాతృదేవి మనస్సుకు ఎంతో ఆహ్లాదం కలిగించింది. ❖

('శ్రీ శారదాదేవి చరితామృతం' నుంచి)

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 66 | సంచిక: 6 | జూన్ 2009

న వై యాచే రాజ్యం న చ కనకమాణిక్య విభవం
న యాచే௨హం రమ్యాం సకల జనకామ్యాం వరవధూమ్।
సదా కాలే కాలే ప్రమథపతినా గీతచరితో
జగన్నాథః స్వామీ నయనపథగామీ భవతు మే॥



ఓ జగన్నాథ స్వామీ! నాకు రాజ్యం గానీ, ధన సంపదలు గానీ, భోగాలు గానీ వద్దు.
నిత్యం ఆ పరమశివునిచేత కీర్తింపబడే నువ్వు నిరంతరం నా దృష్టిపథంలో ఉండేలా అనుగ్రహించు!
(శ్రీ జగన్నాథాష్టకమ్)




## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**............ రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాత పేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| రాజ పోషకులు | : శ్రీ వి. చంటి, | శాంతినగర్, ఏలూరు - 534 007 | 5,000 |
| పోషకులు | : శ్రీమతి కె. శారద, | మెహిదీపట్నం, హైదరాబాద్ - 500 028 | 2,000 |
| " " | : శ్రీ ఎమ్. వెంకటస్వామి, | ఆనంద్‌నగర్ కాలనీ, హైదరాబాద్ - 500 004 | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు

**ముఖచిత్రం :** పరమ పవిత్రమైన పుణ్యక్షేత్రం పూరీలో వెలసిన జగన్నాథ స్వామి ఆలయం. ఈ ఆలయాన్ని కళింగ దేశ రాజు అనంతవర్మ చోడగంగదేవ 12వ శతాబ్దంలో నిర్మించాడు. ప్రధాన ఆలయ గోపురం ఎత్తు 192 అడుగులు. జగన్నాథస్వామి మూర్తిని దారువు (కర్ర)తో రూపొందించడం వల్ల ఇక్కడ స్వామిని 'దారు బ్రహ్మ' అని పిలుస్తారు.

## ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 365 |

గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకి కుడి భాగంలో మీ చందా గడువు నెల పొందుపరచబడి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ చేయబడుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

– సర్క్యులేషన్ మేనేజర్

ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకుడు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.

– సంపాదకులు


SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com

# మన జీవనయాత్రే ఓ రథయాత్ర !



రథయాత్ర అనగానే అందరికీ ఠక్కున గుర్తుకు వచ్చేది పూరీజగన్నాథ రథయాత్ర. ప్రతీ సంవత్సరమూ అత్యంత వైభవంగా జరిగే ఈ రథయాత్రలో దేశం నలుమూలల నుంచీ అసంఖ్యాక భక్తులు పాల్గొంటారు. అత్యద్భుతంగా అలంకరించిన రథంలో దివ్యమూర్తుల విగ్రహాల్ని ప్రతిష్ఠించి నృత్యగానాలతో పురవీథుల్లో ఊరేగిస్తారు. భక్తులు ఆనందపారవశ్యంతో రథయాత్రను తిలకిస్తారు. ఫల పుష్పాదులను అర్పించి, భక్తి ప్రపత్తులతో రథం ముందు ప్రణమిల్లుతారు. రథానికి వేలాది మంది భక్తులు తమ శిరస్సులు వంచి ప్రణతులర్పించడానికి కారణం అందులో భగవంతుని దివ్య మూర్తులు కొలువుతీరి ఉండడం అని మనకు విదితమే. సంవత్సరానికి ఒకసారి జరిగే ఈ రథయాత్రకు ఇంత ప్రాముఖ్యం ఉంటే, మరి మన జీవన యాత్రలో నిత్యం జరిగే రథయాత్రకు మరెంత ప్రాముఖ్యత ఉండాలి? అయితే మన జీవన యాత్ర కొనసాగించేందుకు ఉపయోగించే రథం ఏది? ఆ రథంలో ఆసీనుడై ఉన్న రథికుడెవరు?

**పశుప్రవృత్తి నుంచి పశుపతి స్థితికి చేర్చే వాహనం :**

బాహ్య ప్రపంచంలో గమ్యాన్ని చేరుకోవడానికి ఎన్నో రకాల వాహనాలు ఉన్నాయి. కానీ అంతర ప్రపంచంలో పయనించి పరమపదాన్ని చేరుకోవడానికి మనకున్న ఒకే ఒక వాహనం ఈ 'శరీరం'. శరీరం అనే రథంలో ఆసీనుడై ఉన్న రథికుడు చైతన్య స్వరూపుడైన భగవంతుడు(ఆత్మ).

రథం యొక్క బాహ్యాలంకారాల్ని తిలకిస్తూ రథికుణ్ణి మరిచిపోతే అలాంటి రథయాత్ర నిష్ప్రయోజనం. అలాగే మనం దేహాలంకారాల్లోనూ, దేహసౌందర్య ఆకర్షణల్లోనూ మునిగి దేహాంతర్గతంగా ఉన్న ఆత్మ స్వరూపాన్ని ఆదమరచిన నాడు మన జీవనయాత్ర నిరర్థకం.

ఆత్మ సాక్షాత్కార యాత్రలో మనిషిని పశుప్రవృత్తి నుంచి పశుపతి స్థితికి చేర్చే ఏకైక సాధనం ఈ మానవ దేహం. ఎన్నో జన్మల సుకృత ఫలమైన ఈ మానవ దేహమనే రథాన్ని బాహ్య విషయాలవైపు పరుగులు తీయనీయకుండా అంతర్ముఖంగా ప్రయాణం కొనసాగించి అంతరాత్మను చేరుకోవడానికి ప్రయత్నించినప్పుడు మానవ జన్మ సార్థకమవుతుంది.

**దేహంలో కొలువై ఉన్న దైవం :** మన దేహంలో ఉన్న ఆత్మశక్తి కారణంగానే మనసు, బుద్ధి, ఇంద్రియాలు చైతన్యవంతమై కర్మలను ఆచరిస్తున్నాయి. ఆ ఆత్మ చైతన్యమే లేకపోతే దేహం నిర్వీర్యం, నిస్తేజం అవుతుంది.

It is strength and strength that we want and the first step in getting the strength is to uphold the upanishads and believe that 'I am the Atman'.

*- Swami Vivekananda*

'నేను ఆత్మస్వరూపుడను' అని మనిషి నిజ తత్త్వాన్ని ప్రతిబోధిస్తున్న ఉపనిషత్తుల వ్యాక్యాలయందు విశ్వాసం కలిగిన నాడు మనలో దేహభ్రాంతి పోయి ఆత్మశక్తి జనిస్తుంది. అయితే దేహంలో దేహి ఎలా ఉంటాడు? ఎక్కడ ఉంటాడు?

**అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి ।**
**ఈశానో భూత భవ్యస్య న తతో విజుగుప్సతే ॥**

(కఠోపనిషత్తు– 2.i.12)

'బొటన వేలి పరిమాణంలో పురుషుడు ఈ శరీరంలో నివసిస్తున్నాడు. భూత భవిష్యత్తులకు ఆయనే అధిపతి. ఈ ఆత్మను తెలుసుకొన్నవాడు భయం చెందడు'.

సర్వవ్యాపకాలకూ ప్రభువు ఆ భగవంతుడే అనీ, ఈ దేహాన్ని నడిపిస్తున్నది ఆ దైవమే అనీ గ్రహించినప్పుడు దేహమే దేవాలయం అవుతుంది. భగవంతుని సన్నిధిలోనే మనం ఉన్నామని భావించినప్పుడు ఇంక భయానికి చోటెక్కడిది?

**ఆత్మానందానికి అంతర్ముఖ యానం :** అరుదైన మానవ దేహమనే రథం సహాయంతో ఆత్మ సాక్షాత్కారాన్ని ఎలా పొందవచ్చో కఠోపనిషత్తు వివరిస్తుంది.

**ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు ।**
**బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ ॥**
**ఇంద్రియాణి హయానాహుర్విషయాంస్తేషు గోచరాన్...**

(కఠోపనిషత్తు– 1.iii.3,4)

శరీరం – రథం; ఇంద్రియాలు – గుర్రాలు; ఇంద్రియ విషయాలు – మార్గం; మనసు – కళ్ళెం; బుద్ధి – సారథి; ఆత్మ – రథికుడు.

శరీరం అనే రథానికి ఇంద్రియాలే గుర్రాలు. గమ్యస్థానానికి చేర్చేందుకు రథానికి గుర్రాలు ఎంత ముఖ్యమో మన గమ్యస్థానమైన మోక్ష స్థానానికి చేర్చడానికి ఇంద్రియాలూ అంతే ముఖ్యం. గుర్రాలకు చంచలత్వం ఎంత సహజమో ఇంద్రియాలకు కూడా చంచలత్వం అంతే సహజం. అదుపులో లేని గుర్రాలు రథికుణ్ణి గమ్యానికి సురక్షితంగా చేర్చలేవు. అధీనంలో లేని ఇంద్రియాలు కూడా మనిషిని పరమపదానికి చేర్చలేవు. కాబట్టి సారథి కళ్ళాన్ని పట్టుకొని నేర్పుతో గుర్రాలను సవ్యమైన మార్గంలో నడిపించినప్పుడే క్షేమంగా గమ్యానికి చేరగలుగుతాం. అలాగే చంచలమైన ఇంద్రియాలను మనసు అనే కళ్ళెంతో అదుపుచేస్తూ బుద్ధి అనే సారథి, రథం అనే శరీరాన్ని నడిపించినప్పుడే మోక్షపదాన్ని చేరుకోవడం సాధ్యమని కఠోపనిషత్తు వివరిస్తుంది.



రథం దృఢంగా ఉండవచ్చు, సారథి నైపుణ్యవంతుడు కావచ్చు, మార్గం సుగమంగా ఉండవచ్చు కానీ గుర్రాలు అదుపులో లేకపోతే గమ్యాన్ని చేరుకోలేం. మన జీవన యాత్రలో ఇంద్రియాలనే గుర్రాలు ఆధీనంలో లేకపోతే ఆత్మసాక్షాత్కారాన్ని పొందడం అసాధ్యం. కాబట్టి బహిర్ముఖమైన ఇంద్రియాలను అంతర్ముఖం కావించి ప్రయాణం కొనసాగించాలి.

**ఆత్మసాక్షాత్కారమే అంతిమ లక్ష్యం :** దివ్యశక్తి అందరిలోనూ ఉంది. అంతర్గతంగా ఉన్న ఆ దివ్యశక్తిని తెలుసుకోవడమే మన జీవిత గమ్యం. ఆ గమ్యాన్ని చేరుకున్నవాడు ధన్యజీవి, దివ్యజీవి అవుతాడు. అంతర్గతంగా ఉన్న దివ్యశక్తిని అభివ్యక్తం చేయడం ఎలాగో స్వామి వివేకానంద బోధించారు.

Each soul is potentially divine. The goal is to manifest this Divinity within by controlling nature, external and internal. ***- Swami Vivekananda***

*'ప్రతి యాత్మ దివ్యంబె తత్వతః దివ్యంబె*
*లోబయళ్ళగల ప్రకృతిని స్వాధీనంబున నుంచుకొని*
*అంతర్గతమగు దివ్యత్వమ్మును అభివ్యక్త పరచుటె జీవితగమ్యం'.*

మనలో ఉన్న దివ్యత్వాన్ని ప్రస్ఫుటం చేయడం ముఖ్యంగా బాహ్య, అంతర ఇంద్రియాలను నియంత్రించడం వల్లనే సాధ్యమవుతుంది అని స్వామి వివేకానంద బోధించారు. కాబట్టి ఇంద్రియ నిగ్రహం ఆత్మసాక్షాత్కారానికి అత్యంత కీలకం.

ఇంద్రియాలను నిగ్రహించడం కోసం శమదమాలను అభ్యసించాలి. పంచ బాహ్యేంద్రియాలను నియంత్రించడం దమం అనీ, అంతరేంద్రియం అయిన మనసును నియంత్రించడం శమం అనీ శాస్త్రాలు చెబుతున్నాయి.

బాహ్య ఆకర్షణలకు లోనయ్యే స్వభావం కలవిగా భగవంతుడు ఇంద్రియాల్ని సృష్టించాడు. అలాంటి బహిర్ముఖమైన ఇంద్రియాలను అంతర్ముఖం చేయడం ఎలా?

Do this either by work, or worship, or psychic control, or philosophy...

*- Swami Vivekananda*

కర్మ, భక్తి, ధ్యాన, జ్ఞాన మార్గాలలో ఏ ఒక్క మార్గాన్నైనా అవలంబించి బాహ్య, అంతర ఇంద్రియాలను నియంత్రించవచ్చని స్వామి వివేకానంద బోధించారు.

నిష్కామ సేవతో (కర్మయోగం)గానీ, జపతప సాధనలతో (భక్తియోగం)గానీ, ధ్యానంతో (రాజయోగం)గానీ, నిత్యానిత్యవస్తు వివేకంతో (జ్ఞానయోగం)గానీ ఇంద్రియాలను నియంత్రించి మన గమ్యస్థానమైన పరమపదాన్ని చేరుకోవడానికి ప్రయత్నించాలి. అలా భగవంతుణ్ణి చేరడానికి నిత్యం సాగే **'మన జీవనయాత్రే ఓ రథయాత్ర'.** ❖

## గోరుముద్ద

# నైతికత

– స్వామి సుప్రియానంద

మనది ప్రపంచంలో అతిపెద్ద ప్రజాస్వామ్యదేశం. ఏ సమాజంలో అయినా భిన్నత్వం సహజం. సమాజం వివిధ జాతుల, మతాల, కులాల సమ్మేళనం; ప్రజల ఆర్థిక స్థితి గతులలోనూ, మానవ మేథలోనూ, సామాజిక సాంస్కృతిక పరిస్థితులలోనూ భిన్నత్వం ఉంటుంది. సమాజంలో భిన్నత్వం ఉన్నప్పటికీ, ప్రజలందరూ ఒకే కుటుంబ సభ్యులవలె సమైక్యంగా శాంతి, సహకారాలతో కలిసి మెలిసి జీవించాలి. బలవంతులు బలహీనులకు సహాయపడాలి. ధనవంతులు పేదవారిని ఆదుకోవాలి. ప్రతి ఒక్కరూ సమిష్టి సంక్షేమం కోసం కృషి చేయాలి. ఇది కలా? నిజమా? ఇది ఎలా సాధ్యం? నిరంతరం తమ రాజకీయ పార్టీల కోసం, తమ స్వార్థ ప్రయోజనాల కోసం ప్రాకులాడే వారి వల్ల ఇది ఎప్పటికీ సాధ్యం కాదు. కేవలం మనిషిలోని నైతిక విలువలు అభివృద్ధి చెంది వ్యక్తమైనప్పుడే ఇది సాధ్యం.



కాలం గతించవచ్చు. తరాలు మారవచ్చు. తుపానుల నుండీ, పెనుగాలుల నుండీ, అలల తాకిళ్ళ నుండీ తీర మైదానాన్ని రాతి కొండలు ఏ విధంగా రక్షిస్తాయో, అదే విధంగా మనిషి 'మనుగడ'ను 'నైతిక' విలువలు కాపాడతాయి.

నైతిక విలువలు ఉన్న మనిషిలో ధార్మిక చింతన ఆ పైన ఆధ్యాత్మిక చింతన కలుగుతాయి. అంటే 'నైతికత' ధార్మికతకూ, ఆధ్యాత్మికతకూ సోపానం.

జీవితంలో నైతిక విలువలు లోపించినప్పుడు అది పతనానికి దారి తీస్తుంది. ఆ సమాజంలో 'అసమతుల్యత' అనే 'ప్రళయం' సంభవిస్తుంది. ఇది సమాజంలోని అన్ని రంగాలలోకీ ప్రవేశించి సమాజాన్ని పీల్చి పిప్పి చేస్తుంది. అప్పుడు పాలనా వ్యవస్థనూ, ప్రభుత్వాలనూ నిందించి ప్రయోజనం ఉండదు. ప్రజలు ఎలాంటి వారో వారికి అలాంటి ప్రభుత్వమే లభిస్తుంది.

చాలా మంది 'రామరాజ్యం' కోసం కలలు కంటుంటారు. కానీ ఆ 'రామరాజ్యం'లోని పాలనా వ్యవస్థను కొంచెం పరికించి చూసినప్పుడు పౌరులుగా మన బాధ్యత తెలిసివస్తుంది.

మహాకవి కాళిదాసు తన 'రఘువంశం' (సూర్యవంశ రాజుల చరిత్ర– సాక్షాత్తు శ్రీరామ చంద్రుడు ఈ వంశానికి చెందిన వారు)లో ఆనాటి పరిపాలనా వ్యవస్థను ఇలా వర్ణిస్తారు:

**ప్రజానాం ఏవ భూత్యర్థమ్**
**సతాభ్యో బలిం అగ్రహీత్ ।**
**సహస్ర గుణాం ఉత్ స్రష్టుమ్**
**ఆదతే హి రసం రవిః ॥**

ఎలాగైతే సూర్యుడు తేమను గ్రహించి వర్షాలు కురిపిస్తాడో, అలాగే ప్రజల సమిష్టి సంక్షేమానికి రాజు పన్నులు కట్టించు కుంటాడు.

ఇందులో మన సమిష్టి సంక్షేమం కోసం పన్నులు కట్టాలి అన్న నైతికత గోచరిస్తుంది. కాని నేటి పరిస్థితి...?

నిజంగా 'రామరాజ్యం' కావాలంటే (రావాలంటే), కౌసల్యా సుప్రజా రామా... అంటూ రాముడికి 'సుప్రభాతం' పాడటమే కాదు మనం 'సుప్రజలం' అవ్వాలి. ❖

## పండుగలు - పర్వదినాలు

### జూన్- 2009

| | | | |
|---|---|---|---|
| 03 | బుధవారం | : | ఏకాదశి |
| 19 | శుక్రవారం | : | ఏకాదశి |
| 24 | బుధవారం | : | పూరీ జగన్నాథ రథయాత్ర |

### జూలై- 2009

| | | | |
|---|---|---|---|
| 03 | శుక్రవారం | : | ఏకాదశి |
| 07 | మంగళవారం | : | గురు పూర్ణిమ |
| 18 | శనివారం | : | ఏకాదశి |
| 20 | సోమవారం | : | స్వామి రామకృష్ణానంద జయంతి |



# జగన్నాథుడే శ్రీరామకృష్ణులు

– స్వామి జ్ఞానదానంద

1885 జూలై 15వ తేదీన శ్రీరామకృష్ణులు, 'మ'తో ఇలా చెప్పారు: "ఒకసారి తీవ్రమైన మధుర భావంతో జగన్నాథుణ్ణి ఆలింగనం చేసుకోబోయి చెయ్యి విరగ్గొట్టుకున్నాను. అప్పుడు నాకు ఇలా వెల్లడయింది: 'నువ్విప్పుడు మానవ దేహం ధరించి ఉన్నావు. కాబట్టి మానవులతో సఖీభావం, వాత్సల్యభావం మొదలైన భావాలను ఏర్పరచుకొని ఉండు."

గురుదేవులు భక్తులతో అనేకసార్లు, "నేను పూరీలో వెలసిన జగన్నాథుణ్ణి" అని చెప్పేవారని 'మ' తెలిపారు. 'మ' ఇంకా ఇలా చెప్పారు:

"ఒకసారి ఆయన నన్ను పూరీ పంపించి అక్కడ ఏం చేయాలో ఆదేశించారు. అక్కడ జగన్నాథుణ్ణి ఆలింగనం చేసుకోవాలని చెప్పారు. అలా చేయడం దాదాపు అసాధ్యం కనుక నేను ఆదుర్దా చెందాను. అప్పుడు నా మనసులో ఒక ఆలోచన వచ్చింది. గర్భగుడిలోకి ప్రవేశిస్తున్నప్పుడు నా జేబులో చాలా చిల్లర నాణేలూ, కొన్ని రూపాయి కాగితాలూ ఉంచుకొన్నాను. అక్కడ కాస్త చీకటిగా ఉంది. నేను ఉద్దేశపూర్వకంగా నాణేలను, రూపాయి కాగితాలను నేలమీద వెదజల్లాను. నాణేల సవ్వడి వినగానే పూజారులు క్రింద పడ్డ ఆ సొమ్మును సేకరించుకోనారంభించారు. అదే అదునుగా నేను దైవపీఠం ఎక్కి జగన్నాథుణ్ణి ఆలింగనం చేసుకొన్నాను. ఎవరో నన్ను చూసి పెద్దగా కేక పెట్టారు. వెంటనే నేను దిగి జనంలో కలిసిపోయి, విగ్రహానికి ప్రదక్షిణ చేయనారంభించాను. ఆ చీకట్లో నన్ను ఎవరూ గుర్తించలేక పోయారు. శ్రీరామకృష్ణులు నన్ను పలుమార్లు పూరీ పంపించారు. ఆయన మాత్రం పూరీ వెళ్ళలేదు. దాని గురించి వారు నాతో ఇలా చెప్పారు : "నేను పూరీ కనుక వెళితే, ఈ దేహం ఉండదు కాబట్టి వెళ్ళలేదు". నేను పూరీ నుంచి తిరిగి రాగానే గురుదేవులు నన్ను ఆలింగనం చేసుకొని, 'ఇదుగో జగన్నాథుణ్ణి ఆలింగనం చేసుకొన్నాను" అన్నారు.

తమ కుమార్తె మరణానంతరం మనోమోహన్ మిత్రా, అతడి భార్య 1900లో పూరీ వెళ్ళారు. కలరా సోకి అతడి భార్య అక్కడే మరణించింది. ఒకరోజు మనోమోహన్ ఆలయంలో ప్రవేశించగానే, దైవపీఠం మీద జగన్నాథునికి బదులు శ్రీరామకృష్ణులు కొలువుదీరి ఉన్నట్లు చూశాడు. గురుదేవులను చూడగానే అతడు, "శ్రీరామకృష్ణుల రూపంలో ఉన్న జగన్నాథస్వామికి జై" అంటూ కేక పెట్టాడు.

1917లో స్వామి తురీయానంద పూరీ వెళ్ళారు. ఒకరోజు జగన్నాథ స్వామి ఆలయానికి వెళ్ళారు. ఆయన సింహద్వారపు మెట్లు ఎక్కుతుండగా, శ్రీరామకృష్ణులు మెడలో పూలమాలను ధరించి మెట్లు దిగుతూ ఎదురు వచ్చారు. స్వామి తురీయానంద ముందుకు పరుగెత్తి ప్రణమిల్లారు. స్వామి తురీయానంద ఇలా చెప్పారు: "శ్రీరామకృష్ణులుగా మెట్లు దిగివచ్చింది సాక్షాత్తూ జగన్నాథుడే! 'నేను అక్కడకు వెళితే నా దేహం మరి ఉండదు' అనేవారు."

గురుదేవుల చిన్నన్నగారి కుమార్తె లక్ష్మి ఇలా గుర్తుకు తెచ్చుకొన్నారు: "ఒకసారి బలరామ్ జగన్నాథ ప్రసాదం గురుదేవులకు ఇచ్చారు. గురుదేవులు తమ తలకు ప్రసాదాన్ని తాకించి భావపారవశ్యంలోకి వెళ్ళిపోయారు. ఆయన ఇలా చెప్పారు. 'నేను పూరీలో ఉన్నట్లు ఉంది. విస్తృత సముద్రం, వెడల్పయిన కాలిబాటలు, అనంతుడైన జగన్నాథుడు ప్రతిదీ పెద్దదే! నేను అక్కడకు వెళితే ఈ శరీరం అంతరిస్తుంది (తాము జగన్నాథుడిలో విలీనమైపోతానని అర్థం)."

1925 వసంత కాలంలో బిపిన్ అనే భక్తునితో కలిసి లక్ష్మి జగన్నాథుణ్ణి దర్శించేందుకు పూరీ వెళ్ళింది. ఆలయంలో ప్రవేశించిన ఆమెకు గర్భగుడిలో గురుదేవుల దర్శనం లభించింది. మరో సందర్భంలో ఆలయంలో సాక్షాత్తూ జగన్నాథుడే ఆమె ఎదుట కనిపించి, "నేనూ మీ రామకృష్ణులూ అభిన్నులం" అని చెప్పాడు.

సర్వదేవదేవీ స్వరూపులైన శ్రీరామకృష్ణులు సాక్షాత్తూ ఆ జగన్నాథస్వామియే అన్న విషయం పై సంఘటనలు నిరూపిస్తున్నాయి. ❖

## జన్మరాహిత్యాన్నిచ్చే

# జగన్నాథుడు



**సేకరణ: కుమారి ఎ. జయంతి**

ప్రతీ సంవత్సరమూ పూరీలో ఆషాఢమాసంలో జరిగే జగన్నాథుని రథయాత్ర చాలా విశేషమైనది. ప్రధాన ఆలయం అయిన శ్రీమందిరంలో నిత్యం ఆరాధింపబడుతున్న జగన్నాథస్వామినీ, బలభద్ర స్వామినీ, సోదరి సుభద్రనీ... వీరితో పాటు సుదర్శన చక్రాన్నీ వారి వారి రథాల్లో ఉంచి ఆలయానికి 2-3 కి.మీ. దూరంలో ఉన్న గుండీచా మందిరానికి తీసుకుని వెళ్ళే ఈ ఉత్సవంలో 5, 6 లక్షల మంది పాల్గొంటారు. ఒక వారం అక్కడ ఉన్నాక తమ నివాసమైన శ్రీమందిరానికి తిరిగి వెళ్తారు ముగ్గురూ, దానిని మారు రథయాత్ర అంటారు.

**రథయాత్ర ప్రాముఖ్యత:** ఈ ఉత్సవానికి గుండీచా యాత్ర, ఘోష యాత్ర, నవదిన యాత్ర, దశావతార యాత్ర... ఇలా చాలా పేర్లున్నాయి. 'రథేతు వామనమ్ దృష్ట్వా పునర్జన్మమ్ న విద్యతే – రథంపై ఉన్న వామనమూర్తిని దర్శించడం వల్ల జనన మరణాలనే చక్ర భ్రమణం నుండి ముక్తి లభిస్తుంది' అని అంటారు.



గర్భగుడిలో నిత్యం పూజలందుకుంటున్న దివ్య మూర్తులు యాత్రలో పాల్గొనడం చాలా అరుదుగా జరుగుతుంది. కలియుగంలో మానవులకి ముక్తిని ప్రసాదించి వారి బాధలనూ, క్లేశాలనూ తొలగించే జగన్నాథుని రథయాత్ర చాలా విశేషమైనది. జగన్నాథ స్వామి స్వయంగా విష్ణుమూర్తే! మొట్టమొదట ఆయన నీలమాధవునిగా మర్రి చెట్టు (న్యగ్రోధ వృక్షం) పైన ఆరాధింపబడినాడు. ఆ చెట్టు శాఖలు అనేక మైళ్ళ దూరం వరకూ విస్తరించి ఉన్నాయి. ఆ ప్రాంతంలో అడుగుపెట్టిన వారికి వెంటనే ముక్తి లభిస్తుంది. పవిత్రమైన పూరీ క్షేత్రంలో యముడు ప్రవేశించలేదు అంటారు. అందువల్ల ఈ క్షేత్రానికి 'యజమనిక తీర్థం' అని పేరుంది.

రథంలో ఆసీనుడైన జగన్నాథుని దర్శనం చాలా శుభప్రదమైనది. రథోత్సవం ఎంత పవిత్రమైనదో చెప్తూ... రథాన్ని తాకినా, కనీసం రథం లాగడానికి కట్టిన తాళ్ళను తాకినా చాలు... అనేక పుణ్యకార్యాలు చేసిన ఫలం లభిస్తుంది, అనేక జన్మల పాపాలు తొలగిపోతాయి అని చెప్తారు. "ఈ ఉత్సవ సమయంలో రథము, చక్రాలు, రథం వెళ్ళే మార్గం కూడా స్వయం జగన్నాథుడే" అనే భావం వచ్చే పాట ఒరియా భాషలో ఒకటి ఉంది.

స్కంద పురాణంలో రథయాత్ర వైశిష్ట్యాన్ని ఇలా స్తుతించారు:

గుండీచామండపం నామం యాత్రాహ మజనమ్
పురా అశ్వమేధ సహస్రస్యా మహావేది తదద్వవత్

"శ్రీమందిరంలో ఉంటూ రథాలపై ఊరేగింపుగా వెళ్ళి గుండీచా మందిరానికి చేరిన దైవాన్ని అక్కడ చూసిన వారు ధన్యులు, వారికి వెయ్యి అశ్వమేధ యాగాలు చేసిన ఫలితం లభిస్తుంది".

**చందన యాత్ర:** రథోత్సవంలో భాగంగా ముందు చందన యాత్ర ... 21 రోజుల పాటు చందనం కలిపిన నీటితో స్నానం చేయించి దేవతా (దారు) ప్రతిమలని నరేంద్ర సరోవరంలో ఒక పడవ మీద యథావిధిగా విహరింపచేస్తారు.

**స్నాన యాత్ర:** ముగ్గుర్నీ స్నానవేదిక పైకి తీసుకుని వెళ్ళి 108 బిందెల నీటితో స్నానం చేయిస్తారు. దీని తరువాత ముగ్గురూ అనారోగ్యం నుండి గర్భగుడిలో కోలుకుంటారనీ, వారికి చికిత్సగా ఆయుర్వేదం మందులు, ఆహారంగా ద్రవపదార్థాలు ఇస్తారనీ అంటారు. ఆ 15 రోజులూ యాత్రికులు, భక్తులు దేవతా ప్రతిమల స్థానే ఉన్న చిత్రపటాలని మాత్రమే దర్శించగలరు.

ఇవన్నీ అయ్యాక ఆ తరువాతి నెల (ఆషాఢ మాసం)లో శుద్ధవిదియ నాడు కనుల పండువగా రథోత్సవం జరుగుతుంది. ❖ **(జూన్ 24న పూరీజగన్నాథ రథయాత్ర)**

## పరమేశ్వరుని పరిరక్షణలో ...
### స్వామి జపానంద స్వీయ అనుభవాలు -24

# పునర్జన్మను ప్రసాదించిన పుణ్యదంపతులు

స్వామి జపానంద హిమాలయాల్లో ఉన్న గంగోత్రిలో కొంతకాలం గడిపిన తరువాత కేదార్‌నాథ్, బద్రీనాథ్ దర్శించి అక్కడ నుంచి హృషీకేశ్, హరిద్వార్ ప్రయాణమయ్యారు. మధ్యలో త్రిగుణీ నారాయణ తీర్థం వెళ్ళి అలాగ కేదార్ వెళదామని కొండల్లో తోవ గురించి వాకబు చేసారు. అలాగ ఒకరి సలహామేరకు నిర్జనంగా ఉన్న కాలిబాటలో వెళ్ళడానికి నిశ్చయించుకున్నారు.



ప్రయాణం మధ్యలో పెద్ద వాన కురిసింది. దగ్గరలోనే ఉన్న పల్లెకి కష్టపడి చేరుకుని అక్కడ సత్రంలో తలదాచుకున్నారు. అక్కడ చాలా మంది యాత్రికులున్నారు. వర్షం కారణంగా ఎవరూ ఎక్కడికీ వెళ్ళలేకపోతున్నారు. ఎవరో పెద్దమనిషి తన పక్కనే సన్న్యాసికి కొంచెం స్థలం చూపించారు. సన్న్యాసి కృతజ్ఞతలు చెప్పి కూర్చున్నారు. రెండు రోజులు ఆ సత్రంలోనే గడిపారు. మూడవరోజు మధ్యాహ్నం వాన వెలిసింది. మంచు బాగా పడింది. నాలుగు వైపులా కొండ శిఖరాలు తెల్లటి దుప్పటి కప్పుకున్నట్లు ఉన్నాయి.

వాన వెలిసిపోయింది. అందుకని సన్న్యాసి ఇంక అక్కడ ఉండదలుచుకోలేదు. యాత్రికుల రాకతో స్థలాభావం కూడా ఏర్పడింది. త్రిగుణీ నారాయణ తీర్థం వెళ్ళడానికి కాలిబాట మీద బయల్దేరారు. తోవలో ఎవరూ కనబడలేదు. ఎటు చూసినా నాలుగు వైపులా మంచు తప్ప మరేమీ కనపడడంలేదు. అందువలన తోవ తప్పిపోయారు. నెమ్మదిగా అదే తోవలో నడుస్తూ కొండ శిఖరానికి చేరుకున్నారు. అక్కడంతా కూడా మంచు ఆవరించి ఉంది. దూదిలాగ మెత్తగా ఉన్న మంచులో నడుస్తూ ఉంటే కాళ్ళు లోపలకి కూరుకుపోతున్నాయి. కాళ్ళు తిమ్మిర్లు ఎక్కడంతో స్పర్శ తెలియడం లేదు,

కర్ర సహాయంతో నడుస్తున్నారు. చేతి వేళ్ళు చలికి కొంకర్లు తిరుగుతున్నాయి. ఎలాగో కాళ్ళు ఈడ్చుకుంటూ నడుస్తున్నారు. ఇలాగే మంచులోనే సమాధి అయిపోతానేమో అని అనుకుంటూ ఉండగా మంచు తగ్గుతున్నట్లు అనిపించింది. ఇంకా ముందుకి వెళితే అక్కడ చిన్న చిన్న మొక్కలు, తుప్పలు కనిపించాయి. దగ్గరలోనే చిన్న గుడిసె కూడా కనిపించింది. ఎలాగో పడుతూ లేస్తూ ఆ సన్న్యాసి ఆ గుడిసె దగ్గరకి చేరుకున్నారు. ఆ గుడిసెలో టిబెట్టుకి చెందిన ఒక కుటుంబీకులు చలిమంట వేసుకుని కాచుకుంటున్నారు. వాళ్ళ గొర్రెలు దగ్గరలోనే తిరుగుతున్నాయి. వాళ్ళు సన్న్యాసిని చూడగానే అతని పరిస్థితి అర్థం చేసుకున్నారు. చలికి, మంచులో తడవడంతోనూ కొయ్య బారిపోయి ఉన్న సన్న్యాసిని చూసి భార్యాభర్తలిద్దరూ త్వరగా లోపలకి తీసుకెళ్ళి మంట దగ్గర కూర్చోమన్నారు. ఇంకా కర్రలు వేసి మంటని ఎగదోసారు. సన్న్యాసికి చాలా సేపటి వరకూ నోట మాట రాలేదు. ఆ దంపతులు వేడి టీ తీసుకొచ్చి సన్న్యాసితో "చాతుమ్, చాతుమ్– టీ తాగండి, టీ తాగండి" అన్నారు. నాలుగో ఐదో కప్పుల వేడి వేడి టీ తాగిన తరువాత సన్న్యాసికి కొంచెం చురుకుదనం వచ్చింది.

మంచులో సమాధి అయిపోవలసిన తనకు పునర్జన్మను ప్రసాదించిన ఆ దంపతులు నిజంగా పార్వతీ పరమేశ్వరులే అని స్వామి జపానంద భావించారు. ❖

అనువాదం : శ్రీమతి జి.ఎస్. లక్ష్మి

# దేవీ వైభవం

ప్రవచనం: శ్రీ సామవేదం షణ్ముఖశర్మ      విలేఖనం: శ్రీమతి ఎన్. శేషు

(...గత సంచిక తరువాయి)

అమ్మవారికి అయ్యవారికి నామసామ్యం, రూపసామ్యం అధిష్ఠానసామ్యం, కృత్యసామ్యం, అవస్థాసామ్యం అని ఐదు సామ్యాలున్నాయి. శివః-శివానీ, భవః-భవానీ, రుద్రః -రుద్రాణీ, శంకర-శాంకరీ, శంభు-శాంభవీ, చంద్రశేఖర - చంద్రశేఖరీ - ఇవి నామ సామ్యములు. రూపసామ్యమంటే - ఆయన ఏరూపం ధరిస్తే దానికనుగుణంగా ఉంటుందావిడ. ఆయన శబరాకృతి ధరిస్తే అమ్మవారు శబరి అని పక్కనే ఉంటుందట వనదుర్గా స్వరూపంలో. ఈ రూపాన్ని తలచుకుంటే ఒక ప్రయోజనం ఉంది. అమ్మ రూపాల్లో ఇదొక దివ్యరూపం. ఆ మహానుభావుడు మహాకాళుడై విహరిస్తే ఆమె మహాకాళిగా దర్శనమిస్తుంది. ఆయన కామేశ్వరుడైతే ఈమె కామేశ్వరి. ఇలాగ నామసామ్య, రూపసామ్యములు కనిపిస్తాయి. తరువాత అధిష్ఠాన సామ్యము. శ్రీచక్రం అమ్మవారికి అధిష్ఠానంగా ఆరాధిస్తున్నాం. "శ్రీచక్రం శివయోర్వపుః"- శ్రీచక్రమంతా కూడా శివశక్తుల స్వరూపం అన్నారు. ఎలా అంటే ... పైకి వెళ్ళే త్రికోణాలు నాలుగూకూడా అయ్యవారి రూపాలనీ, క్రిందికి వచ్చే త్రికోణాలు ఐదూ అమ్మవారి స్వరూపాలనీ చెప్తారు. ఈ రెండిటి సమైక్యత వలన ఏర్పడుతుంది శ్రీచక్రం. అందుకు "చతుర్భిః శ్రీకంఠైః శివయోత్రిభి పంచభిః" అన్నారు.

మరికొందరు వ్యాఖ్యాతలు ఏమిటి చెప్పారంటే... శ్రీచక్రంలో బిందు చక్రాలు నాలుగు, త్రికోణ చక్రాలు ఐదుగా ప్రస్తావించబడుతున్నాయి. త్రికోణ చక్రం అంటే శ్రీచక్రంలో ఉన్న బిందువుని వదిలిపెడితే మొదట వచ్చేది త్రికోణం, తరువాత అష్టత్రికోణం, తరువాత దశ త్రికోణం, ఆ తరువాత మరొక దశ త్రికోణం ఆ తరువాత 14 త్రికోణాలతో కూడిన ఆవరణ. ఈ మొత్తం త్రికోణ ఆవరణలు ఐదున్నాయి. బిందు ఆవరణలు నాలుగున్నాయి. బిందు ఆవరణలు అంటే వృత్తాలు. వృత్తం, బిందువు ఒకటే. బిందువు విస్తరిస్తే వృత్తం; వృత్తం సంకోచమైతే బిందువు. వృత్తం వ్యాపకమవుతే చతురస్రం. ఇందులో బిందు చక్రాలు నాలుగు (మధ్యలో ఉన్న బిందువు ఒకటి, చతుర్దశ ఆవరణలు అయిన తరువాత వచ్చే అష్టదళ వృత్త చక్రము, తరువాత షోడశ దళ వృత్త చక్రము, ఆ తరువాత చతరస్రం) ఈ నాలుగు బిందు చక్రములు అయ్యవారు, ఐదు త్రికోణ చక్రాలు అమ్మవారు. అందుకు "చతుర్భి శ్రీ కంఠైశివయోత్రిభిః పంచభిః త్రికోణ రూపిణిశక్తిః బిందురూపా శివస్మృతా, శివ శక్త్యైశ్చ మేళనం శ్రీచక్రం శివయోర్వపుః" అని లలితాత్రిశతి చదివిన తరువాత ఫలశ్రుతిలో చెప్పబడింది. శ్రీచక్రం ఏమిటో అమ్మవారి స్వరూపం అదే, కనుక అమ్మవారు శివశక్తుల స్వరూపమే. అమ్మవారు మనకి మన శరీరంలో శ్రీచక్రం ఇచ్చి పంపించారు. ఇందులో ప్రతి అణువునా ప్రసరిస్తున్నది అమ్మవారి యొక్క సౌందర్యలహరి. ఒక్కసారి మనం ధ్యానం చేసుకుని ధ్యానభంగిమలో కూర్చుంటే మనమే ఒక మేరు ప్రస్తారపు శ్రీచక్రం లాగ మారిపోతాం. "బైందవం బ్రహ్మరంధ్రంచ" బిందుస్థానం నుండి ఊరువుల వరకూ క్రమంగా మేరు ప్రస్తార శ్రీచక్రం మనలోనే గోచరమవుతుంది. దానికి ఉపదేశాలేవీ అవసరం లేదు. భక్తి, ధ్యానం చాలు. అమ్మవారి పటం ఇంట్లో పెట్టుకున్నా శ్రీచక్రం పెట్టుకున్నట్లే. శ్రీచక్రోపాసనకి మాత్రం గురువు ఉపదేశం కావాలి. యంత్రం, మంత్రం అనుగ్రహం పొందడానికి సాధనలే కాని యంత్రం ద్వారా మంత్రంద్వారా మాత్రమే నేను అనుగ్రహిస్తానని అమ్మవారెక్కడా చెప్పలేదు.

అమ్మవారి అనుగ్రహం ఎలా దొరుకుతుందో లలితా సహస్రం చెప్పింది. లలితా సహస్రం అమ్మకి సంబంధించిన సైన్సు. ఏది కావాలన్నా అందులో నుండి తీసుకోవచ్చు. అమ్మని ఏ విధంగా మనం పొందవచ్చో నాలుగు మార్గాలు అమ్మే చెప్తుంది. భావన, భక్తి, ధ్యానము, జ్ఞానము- ఈ నాలుగింటితో అమ్మవారిని మనం గ్రహించగలం. భావన చెయ్యడం, భక్తిమార్గాన్ని అనుసరించడం అన్నిటికన్నా గొప్పది. భక్తిద్వారానే నన్ను తెలుసుకోగలవని శ్రీకృష్ణుడు గీతలో

బోధించాడు. భక్తికావాలి, భక్తితో కూడిన ధ్యానం కావాలి. ధ్యానం ద్వారా అమ్మ యొక్క ఆ దివ్యచైతన్యం అనుభూతిలోకి వస్తుంది. ఆ చైతన్యానుభవమే జ్ఞానం. ఇక్కడ జ్ఞానం అంటే శాస్త్రజన్య జ్ఞానంకాదు. చైతన్యానుభవమే జ్ఞానం. రుచి అనే అనుభవం నాలుకకి తగిలితేనే అదేమిటో తెలుస్తుంది. అలాగే ఆత్మతత్త్వం అనుభూతిలోకి రావడమే నిజమైన జ్ఞానం. జగదంబిక యొక్క మంత్రం లభించిందా, ఆ బీజాక్షరాలు లభించాయా జన్మ చరితార్థమై పోతుంది. ఎవరిది చరమ జన్మో వారికి శ్రీవిద్య వస్తుంది అన్నారు. అయితే నాకు శ్రీవిద్య రాలేదే అని బాధపడనక్కర్లేదు. విశ్వమే శ్రీ విద్య, విశ్వచక్రమే శ్రీచక్రం. ఈ శరీరమే శ్రీచక్రం అని తెలిసి, అమ్మని ఉపాసిస్తే ఎప్పుడు ఎలాగ అనుగ్రహించాలో ఆ అమ్మ చూసుకుంటుంది, ఎందుకంటే ఆవిడ గురుమండల రూపిణి. "సంప్రదాయేశ్వరీ సాధ్వీ గురుమండల రూపిణీ"... ఇలాగ అమ్మని మనం భక్తి పూర్వకంగా ఆశ్రయిస్తున్నాం. అందుకు ఈ ధ్యానం, భావన బలపడడానికి మనం ఈ స్వరూపాలన్నీ చెప్పుకుంటున్నాం. అమ్మ యొక్క ఆ దివ్య మంగళ విగ్రహాన్ని చూడగానే ఇంత తత్త్వం మనకి స్ఫురణకి రావాలి.



ఇప్పుడు మనం అమ్మ యొక్క దివ్యచరణ కమలాలని భావన చేద్దాం. ఆ పాదాల గురించి శంకరుల వారు ఎంతో వర్ణించి, ఎన్నో భావనలు చేశారు. మూకకవి పంచశతిలో కూడా పాదారవింద శతకం ఉంది. ఆయన పాదాల మీదే వంద పద్యాలు వ్రాసారు. శంకరుల వారు "దదానాం దీనేభ్యః శ్రియమనిసమాసాను సదృశే– దీనులకి కూడా వాళ్ళు ఎంత కోరుకుంటే అంతిస్తాయట ఆపాదాలు" అన్నారు. అందుకే దేవతాస్త్రీలు అమ్మవారి పాదాల దగ్గర రెండు చేతులూ జోడించి నమస్కరిస్తుంటే అమ్మ పాదాల వేళ్ళ గోళ్ళు పరిహాసంగా నవ్వుతున్నట్లు కనిపిస్తున్నాయట. ఎందుకు నవ్వుతున్నాయంటే ఆ దేవతా స్త్రీలకి గొప్ప అవకాశం ఒకటి ఉంది. అదేమిటంటే కల్పవృక్షకుసుమాలని వాళ్ళు కోసి తీసికోగలరు. ఒక కల్ప వృక్షం ఉంటే చాలు మనకి దేముడు అక్కర్లేదు, ఎవరూ అక్కర్లేదు అనుకుంటారు మానవులు. మన కోరికలన్నీ కల్పవృక్షం తీరుస్తుంది. కోరికలే మనకి ప్రధానం, అవి తీరిపోతే ఇంక అమ్మవారు అక్కర్లేదు.

కోరిన వారందరికీ అమ్మవారు దర్శనమివ్వరు. అమ్మవారి పాదాలు చూడడమంటే సామాన్యమైన విషయం కాదు. అమ్మవారి భక్తులం అని చెప్పి అమ్మవారిని ఆశ్రయించిన వారు కూడా అమ్మవారిని చూడలేరు. ఎందుకంటే అమ్మవారు జగదేక సార్వభౌముడు–త్రిపురాసుర సంహారకుడైన ఆ విశ్వేశ్వరుని అంతఃపురమట. అయ్యవారి అంతఃపురంలోకి వెళ్ళి అమ్మవారిని మనం ఎలా చూడగలం!

అందరూ అమ్మవారిని ఆరాధన చేస్తారు, మరి అమ్మవారు అందరికీ దర్శనం ఇస్తారా? ఇవ్వరట. శంకరులవారు "ఇంద్రాది దేవతలు కూడా నీ ద్వారం దగ్గర నువ్విచ్చే సంపదలతో తృప్తిపడి వెనక్కి వెళ్తున్నారమ్మా" అన్నారు. ద్వారం దగ్గర అంటే అమ్మవారి ఆవరణలలో మొదటి ఆవరణ త్రైలోక్య మోహన చక్రం, అణిమాది అష్టశక్తులూ అక్కడే ఉన్నాయి. సర్వ దేవతలకూ మూలములైన బ్రాహ్మీ వైష్ణవీ మొదలైన మాతృకాశక్తులూ అక్కడే ఉన్నాయి; కావలసినవన్నీ అక్కడే దొరుకు తున్నాయి. అందుకు ఇంద్రాది దేవతలు వాటితో తృప్తిపడి వెనక్కి వెళ్ళిపోతున్నారు. ఎందుకంటే వాళ్ళకి కూడా కావల్సినది వాళ్ళ రాజ్యాలు క్షేమంగా ఉండడం, వాళ్ళలోకాలు బాగుండడం, వాళ్ళ పదవులు పదిలంగా ఉండడం, అంతే! అవన్నీ అక్కడే ఇచ్చేస్తోంది. వాళ్ళు అక్కడే తృప్తి పడి వెళ్ళిపోతున్నారు. అమ్మని చూడాలి అంటే ఇవన్నీ దాటి పోవాలి. అమ్మని అందుకోవాలంటే లౌకికమైన ఈ విషయ వాంఛలన్నీ దాటి నాకు ఆత్మ తత్త్వమే కావాలి అనాలి. మనలో 99 మందికి అమ్మ ఇచ్చేవే కావాలి కానీ అమ్మ అక్కర్లేదు. ఎవరైతే "అమ్మా నువ్వే కావాలమ్మా" అని బిడ్డలాగ రోదిస్తారో వారిని అమ్మ తప్పకుండా అంతఃపురంలోకి తీసుకెళ్ళి ఆదరిస్తుంది; అందులో సందేహంలేదు. ఈ విధంగా అమ్మ ఎంత దయామయో శంకరుల వారు భావన చేశారు. ఆ భావనలో అమ్మ చరణాలని ఒకసారి ధ్యానించితే చాలు, మనకి కావలసినవన్నీ లభిస్తాయి. ❖

సశేషం



# మనోవికారాలకు అతీత స్థితి

శ్రీరాముడు: మనసులో ఇష్టాయిష్టాలు ఎందుకు కలుగుతాయి?

శ్రీ వసిష్ఠ మహర్షి: ఏ మనస్సైతే పూర్ణమైన ఆత్మ స్వరూప సాక్షాత్కారాన్ని పొందదో, అప్పుడది "ఇది నాకు ఇష్టం. ఇది నాకు కష్టం" అనే కల్పనలన్నీ చేసుకుంటోంది. అయితే, తత్త్వజ్ఞుల మనస్సు ఇలాగ చపలంగా ఉండదు. మనస్సు అనేది చేతనశక్తి నుండే స్ఫురిస్తోంది. కాబట్టి ఈ వాయు, ప్రకాశ, ద్రవత్వాలూ "మనస్సే", కఠినతనీ, శూన్యతనీ పొందుతున్నదీ అదే. చైతన్యం అనిర్వచనీయమైన తన ఇచ్ఛాశక్తిచేతనే ఇలా మనస్సు యొక్క రూపాన్ని స్వీకరిస్తోంది. అలాంటి మనోరూపంతో భావనామాత్రంగా దేశకాలాదుల అనుభవం తనలోని అంగీకారబుద్ధి వలన పొందుతోంది.

**మనసు - సంలగ్నము :** మనస్సు ఎక్కడ సంలగ్నమైతే అక్కడే ఆ భావనకు సంబంధించిన అనుభవాన్ని పొందుతుంది. ఒకడి మనస్సు ఎక్కడో లగ్నమై ఉన్నప్పుడు, అతడు తాను తింటున్న పదార్థపు రుచిని కూడా గుర్తించడుకదా! ఎదురుగా ఉన్న వస్తువుపై దృష్టి ఉన్నా కూడా, మనస్సు లగ్నం కాకపోతే ఆ వస్తువుని మనం చూడలేం.

ఓ రామా! అజ్ఞానికి ఈ చిత్తం - శరీరం వేరువేరుగా కనిపిస్తాయి. ఈ మనస్సే "నేనిలా అవుతాను" అని భావించి, అటువంటి భావనకు అనుకూలమైన ఆయా ఉపాధులను నిరంతరం పొందుతోంది. ఈ మనస్సుతో ఉపాధులకావల నిశ్చలంగా ఉన్న ఆత్మను గ్రహించేవారు ఉపాధి భావనను అధిగమించి, ఆత్మభావనను స్వీకరించగలుగుతున్నారు. అఖండమైన ఆత్మను ఎరిగినవారు అఖండభావననే పొందుతున్నారు. మహాత్ములు సర్వం గ్రహించడం వలన మనోరహితులై ఉంటున్నారు. కొందరు మహనీయులైన మునులు తమ మనస్సు ఆత్మయందు సంలగ్నమై ఉన్నప్పుడు తమ కాళ్ళూ, చేతులూ ఖండించినా కూడా గ్రహించకపోవటం మనం విన్నాం కదా! మాండవ్య మహామునిని "దొంగ" అనుకొని కొరత వేయటం జరిగినప్పుడు, ఆ శరీరం పొందిన హింస అతడు అనుభవించ లేదు. జ్ఞానులు అభ్యాసబలం చేతనే దుఃఖాలను సుఖాలుగా, స్త్రీ-ధన-వస్తుప్రాప్తులను తుచ్ఛమైనవిగా చూడగలుగుతున్నారు.

ఒకని మనసు ఎక్కడో సంలగ్నమై ఉంటే... నీవు అతనికి ఒక కథ ఎంత వివరంగా చెప్పినా అది గ్రహిస్తాడా? లేదు కదా! ఒకడు ఇంట్లోనే ఉండి "నేనిప్పుడు ఈ కొండను అధిరోహించాను. ఇక్కడ సరస్సు ఉంది. ఆ సరస్సును సమీపించాను చల్లనిగాలి వీస్తోంది. ఆహా! ఈ చెట్టు క్రింద ఇప్పుడు ప్రశాంతంగా విశ్రమిస్తాను..." అని భావిస్తున్నాడనుకో... అప్పుడతడు అక్కడ స్వచ్ఛమైన మేఘాలనూ, గుహలనూ కూడా భ్రాంతి వలన గాంచగలడు. అలాగే మరొకడు సుందరమైన పడకమీద పడుకొని, స్వప్నవశం చేత అనేక దుఃఖకరమైన ప్రదేశాలలో సంచరిస్తూ ఏడవటం, నవ్వటం మొదలైనవి అనుభవిస్తూ ఉంటాడు. స్వప్నంలో మనసు అనేక వ్యక్తులను, సంఘటనలను పొందుతోంది. స్వప్నంలోని ఆయా పదార్థాలన్నీ ఆ స్వప్న సమయంలో వాస్తవంలాగే తోస్తాయి. అవన్నీ ఎక్కడి నుండి వచ్చాయి? ఆత్మ తన స్వస్వరూపం నుండి చ్యుతి చెంది, క్షుభితమైనప్పుడు తన హృదయంలోనే ఆ స్వప్న వ్యవహారాన్ని అలాగ దర్శిస్తోంది.

సముద్రజలం నుండి తరంగాలు ఉత్పన్నమవుతున్నాయి. అలాగే ఈ దేహంలో అంతర్గతంగా ఉన్న మనసు నుండే ఆకార వికారాలు ఏర్పడుతున్నాయి.

ఆత్మతత్త్వాన్ని ఎవరైతే తెలుసుకుంటారో వారు మనోవికారాలకు అతీతులవుతారు. ❖

('శ్రీవసిష్ఠ రామ సంవాదం' - ఉత్పత్తి ప్రకరణం ఉత్తరార్ధం నుంచి) **అనువాదం : వై. హెచ్. రామకృష్ణ**

ధీరవాణి

-స్వామి వివేకానంద

# ఓ సోదరులారా! కార్యశూరులుకండి!!

పాశ్చాత్యదేశాల్లోనూ, యూరోపు ఖండంలోనూ ప్రజలు భోగాలలో మునిగితేలుతున్నారు. భోగాలలో మునిగి వెగటు పుట్టడం వల్ల వారికి శాంతి లభించటం లేదు. ఈ దేశంలో భోగం లేదు, యోగం అంతకంటే లేదు. భోగాలను తనివి తీరా అనుభవించి వెగటు పుడితే కానీ, యోగాన్ని గూర్చిన బోధలు ఎవ్వరూ వినరు, అర్థం చేసుకోరు. రోగానికీ, శోకానికీ, పరితాపానికీ పుట్టినిల్లయి క్షుధార్తులతోను, దుర్బల మనస్కులతోను నిండి పోయిన భారతదేశానికి ఉపన్యాసాలు ఏం మేలు చేస్తాయి?

ధర్మం, మతం అంటే ఏం అర్థమవుతుంది? మొదట కావలసింది కూర్మావతార పూజ. పొట్ట దేవుడే ఈ కూర్మం. ఈ కడుపును శాంతపరిస్తేగాని, మీ ధర్మోపన్యాసాలు ఎవ్వరూ వినరు. ఈ ఆకలిభూతాన్ని ఎలా ఎదుర్కోవాలి అనే ఆలోచనతోనే భారతదేశం సతమతమవుతుంది. దేశ సంపదనంతా విదేశీయులు దోచుకొని పోవటం, అన్నిటికంటే ముఖ్యంగా ఈర్ష్య, అసూయలు భారతదేశపు జీవనాడులను తినేస్తున్నాయి. ఆ ఆకలి మంటలను ఆర్పటం మన ప్రథమ కర్తవ్యం. ఈ కర్తవ్యాన్ని పూర్తిగా నిర్వర్తించేవరకూ మత బోధలు చేయకూడదు. కూడు, గుడ్డ, నీడలను కల్పించకుండా ధార్మికోపన్యాసాలు చేయటంవల్ల ప్రయోజనం లేదు.

ఈ లోకమే సర్వస్వం అనుకుంటూ "నా సంసారం, నా సంసారం" అని దేవురిస్తే ఏం లాభం? దేశంలో ఒకమూల నుండి మరో మూలకూ, ఒక గ్రామం నుండి మరో గ్రామానికీ పోయి, ఇక ఊరికే కాలక్షేపం చేసినందువల్ల ప్రయోజనం లేదని ప్రజలకు అర్థమయ్యేటట్లు చెప్పడమే మీ ప్రస్తుత కర్తవ్యం. వారి నిజస్థితిని వారికి తెలియజేసి ఇలా చెప్పండి: ఓ సోదరులారా! లేవండి మేల్కోండి! ఇంకా ఎంత కాలం 'నిద్రపోతారు?. ఏ విధంగా వారి స్థితి మెరుగుపడుతుందో సరళ మార్గంలో వారికి చెప్పి శాస్త్రాలలోని సత్యాలు అవగతమయ్యేలాగ బోధించండి. వేద మంత్రాలను చండాలునితో సహా అందరికీ ఉపదేశించండి. సరళమైన మాటల్లో జీవితావసరాలైన వ్యాపారం, వ్యవసాయం మొదలైన వాటిని గూర్చి బోధించండి. ఇది మీరు చేయలేకపోతే, మీ విద్య, మీ సంస్కృతి, మీ వేద వేదాంతాధ్యయనాలు ఎందుకు?.

ప్రతిరోజూ ఎందుకూ పనికిరాని క్షుద్రకీటకాలు ఎన్ని పుట్టడంలేదు, చావడంలేదు. ఈ విశాల విశ్వానికి ఆ కీటకాల చావుపుట్టుకల వల్ల ఏ నష్టమూ ఉండదు. కాబట్టి జీవితంలో ఒక ఉన్నత ఆశయ సాధనలో మరణించడమే మేలు.

సోమరులుగా మీరు కాలం గడపడం నాకు బాధ కలిగిస్తోంది. సత్సంకల్పంతో కార్యశూరులుకండి! ఆలస్యం చేయవద్దు. రోజురోజుకూ మృత్యువు సన్నిహితమౌతున్నది. సోమరులుగా ఉంటే ఏ కార్యాన్నీ సాధించలేమని గుర్తుంచుకోండి! ❖



# పరిప్రశ్న

**- స్వామి సుకృతానంద**

**యల్. శాంతామూర్తి, పెద్దకొజ్జిరి.**

**? : విష్ణు సహస్రనామం, లలితా సహస్రనామాలు చదివేటప్పుడు ఏకాగ్రత ఉండక మనసు ఇతర విషయాలపై వెళుతుంది ఏమి చేయాలి?**

✍: సహస్రనామాలు పారాయణం చేసినప్పుడు మనస్సు అన్య విషయాలవైపు పోతుందంటే అందుకు కారణం మనలో భక్తి శ్రద్ధలు లోపించడమే! ఎప్పుడైతే చేసే పని మీద శ్రద్ధ సన్నగిల్లుతుందో ఆ పని యాంత్రికంగా మారుతుంది. కేవలం పూజ, పారాయణ, జపాదులయందే కాదు మనం నిత్యం చేసే ఏ పనిలోనైనా శ్రద్ధ కొరవడితే ఏకాగ్రత ఉండదు. అన్య విషయాలు గుర్తుకు వచ్చే సమయంలో మనసును పారాయణ శ్లోకాల అర్థాల వైపుకు మరలించాలి. ఇదే సాధన.

**పి. శేషు బాబు, రాజమండ్రి.**

**? : పుట్టిన ప్రతి మానవుడూ ఏవో కర్మలు చేస్తాడు. అవే కర్మలు చేయడానికి గల కారణం ఏమిటి? వాటి గురించి భగవంతుడికి ముందే తెలుసా? తెలుసంటే ఆయనే చేయించాడని అనుకోవాలి. తెలియదంటే ఎవ్వరికి తెలుసు?**

✍: ప్రతి జీవీ ప్రారబ్ధవశంగా జన్మను స్వీకరిస్తాడు. అంటే ముందుగానే అతడు ఎక్కడ జన్మించాలి, ఏయే కర్మలు చేయాలో అతడే నిర్ణయిస్తాడు. సంచిత కర్మల నుండి ప్రారబ్ధ కర్మ ఏర్పడుతుంది. అయినా తలిదండ్రుల ప్రభావం శిశువుపై ఉంటుంది. ప్రతి జీవీ తన స్థితికి తానే కారణం. భగవంతుడు కర్మఫల దాత. ఎంతటి మహాత్ములైనా ప్రారబ్ధం అనుభవించాలంటుంది శాస్త్రం. భగవంతుడు ఈ లోకాలన్నింటి సృష్టి, స్థితి, లయలు ప్రత్యక్షంగా కాకుండా ప్రకృతి - త్రిగుణాత్మిక మాయ ద్వారానే చేయిస్తాడు.

'మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్' (భ.గీ. 9-10) జీవుల పుణ్యపాపాలు దేవుడు స్వీకరించడు. 'నాదత్తే కస్యచిత్ పాపం న చైవ సుకృతం విభుః...' (భ.గీ. 5-15) జీవునికి దేశకాలనిమిత్తాలతో ప్రమేయం ఉంది. భగవంతునికి కాదు. ఆయన దేశ కాల నిమిత్తాలకు అతీతుడు. యఃసర్వజ్ఞః సర్వవిత్... ఆయన సర్వజ్ఞుడు, సర్వాంతర్యామి అని వేదం. చెబుతోంది. ప్రస్తుత జన్మ జీవుని అధీనంలో ఉంది. జీవుడు సాధు సాంగత్యం, భగవద్భక్తి, జ్ఞానంతో సత్వగుణ సంపన్నుడై దైవదర్శనం పొందవచ్చు. అది ఇక్కడే, ఇప్పుడే సాధ్యం.



**ఆర్. సురేష్, ఎమ్మిగనూరు**

**? : మనోనిగ్రహం ప్రస్తుత కాలంలో సాధ్యమేనా? నియమాలు వివరించండి? జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలను అదుపులో పెట్టి మనసు పెడద్రోవ పట్టకుండా ఏమి చేయాలి?**

✍: మనస్సు అంటే ఆలోచనల పుట్ట. ఆలోచనల్ని తీసేస్తే మనస్సు లేదు. ఇది మనకు ఎలా తెలుస్తుంది. గాఢ నిద్రలో మనస్సూ లేదు (అది అజ్ఞానంలో ఉంది), ఆలోచనలూ లేవు. మనస్సును నియంత్రించటం సాధ్యమే. ప్రతీ రోజూ ధ్యానంలో మనస్సును నియంత్రించాలి. మనస్సును అదుపు చేయడం అసాధ్యం అన్నాడు అర్జునుడు. శ్రీ కృష్ణుడు నిజమే అని ఒప్పుకొంటూ "మనస్సును అదుపు చేయడం కష్టమే కానీ, అసాధ్యం కాదు" అంటూ ఎవరైతే అభ్యాసం చేస్తారో వారు మనస్సును నిగ్రహించవచ్చు అంటాడు. ప్రపంచంలోని ఋషులు, మునులు, అవతార పురుషులు, ఆధ్యాత్మిక సాధకులు, శాస్త్రవేత్తలు అందరూ మనస్సును అదుపులో పెట్టుకొని అనుకున్న లక్ష్యాన్ని సాధించారు. అలాగే కర్మేంద్రియాల్నీ, జ్ఞానేంద్రియాల్నీ వశపరచుకోవాలి. మనం ఎంచుకొన్న లక్ష్యంవైపుకే "తైలధార"లాగ (ఒక పాత్ర నుండి మరొక పాత్రలో నూనె పోస్తున్నప్పుడు అవిచ్ఛిన్నంగా ధారపడేటట్లు) మనస్సును పంపాలి. ఏకలవ్యుడు, అర్జునుడు మొదలైన వాళ్ళు చేసింది అదే. ధ్యానం ద్వారా మనస్సును నిశ్చల పరచవచ్చు. జీవితంలో అనుకొన్న లక్ష్యాన్ని సాధించిన వారందరూ మనస్సును నిగ్రహించే విజయులయ్యారు. మీరూ ప్రయత్నించండి. ❖

- రెంటాల జయదేవ

# సకల శుభకరం శంఖం

భారతీయ సంస్కృతిలో శంఖానికి ఓ ప్రత్యేక స్థానం ఉంది. ఆలయాల్లో కానీ, ఇళ్ళల్లో కానీ ఏదైనా పూజ చేస్తున్నప్పుడు శంఖం ఊదడం జరుగుతుంటుంది. శుభ సందర్భాన్ని సూచించడానికీ, ఉదయ, సాయంకాల వేళల్లో అర్చన సమయంలోనూ, హారతి సమయంలోనూ శంఖం ఊదడం సర్వసాధారణం. శంఖనాదం లేకుండా పూజ పూర్తయినట్లు కాదు. బెంగాల్ ప్రాంతంలో వివాహ సందర్భంగా శంఖధ్వని తప్పనిసరి. అలాగే, పూర్వకాలంలో యుద్ధ ఆరంభ సమయంలోనూ, యుద్ధంలో సైన్యం విజయం సాధించినప్పుడూ శంఖం ఊదడం ఆనవాయితీ. అంతేకాకుండా, శంఖాన్ని దైవపీఠంపై పెట్టి పూజించడం కూడా కద్దు.

శంఖం ఊదినప్పుడు సామాన్యంగా ఓంకార నాదం వినిపిస్తుంది. సృష్టి ఆరంభించే ముందు భగవానుడు మంగళప్రదమైన ఓంకార ఉచ్చాటన చేసినట్లు కథనం. కాబట్టి, ఆ రకంగా చూస్తే శంఖం, అది చేసే ధ్వని-ఈ ప్రపంచాన్నీ, దాని వెనుక ఉన్న సత్యాన్నీ చాటుతున్నాయి.

**శంఖావిర్భావ గాథ :** శంఖం ఆవిర్భావం గురించి ఓ కథ ప్రచారంలో ఉంది. పూర్వం శంఖాసురుడనే రాక్షసుడు ఉండేవాడట. వాడు దేవతలను ఓడించి, వేదాలను అపహరించి, సముద్రం అడుగున దాక్కున్నాడట. దిక్కుతోచని దేవతలు శ్రీహరిని సాయం వేడారు. అప్పుడు విష్ణుమూర్తి 'మత్స్యావతారం' ధరించి, ఆ శంఖాసురుణ్ణి సంహరించాడట! అప్పుడు ఆ దేవదేవుడు శంఖం ఆకారంలో ఉన్న ఆ రాక్షసుడి చెవినీ, శిరస్సునూ ఊదాడట. దాని నుంచి ఓంకారం వెలువడిందట. ఆ ఓంకార నాదం నుంచి వేదాలు వచ్చాయట. వేదాల్లో ఉన్న జ్ఞానం మొత్తం ఓంకారానికి విస్తృత రూపమే! అలా ఆ శంఖాసురుడి నుంచే 'శంఖం' అనే పేరు వచ్చింది.

**శంఖనాదంలో అంతరార్థం :** దేవదేవుడైన శ్రీకృష్ణ భగవానుడు పూరించే శంఖం పేరు - 'పాంచజన్యం'. చతుర్భుజుడైన విష్ణుమూర్తి చేతుల్లో ఒకదానిలో శంఖం ఉంటుంది. జీవితానికి అత్యంత కీలకమైన చతుర్విధ పురుషార్థాల్లో ఒకటైన 'ధర్మ'నికి అది ప్రతీక. కాబట్టి, శంఖధ్వానం అధర్మం మీద ధర్మం సాధించిన విజయానికి చిహ్నం. మంచి శంఖాన్ని ఎప్పుడైనా మన చెవులకు దగ్గరగా పెట్టుకొని, జాగ్రత్తగా గమనిస్తే, మనకు సాగర ఘోష వినిపిస్తుంది.

అలాగే, శంఖంతో సహా ఇతర మంగళ వాద్యాలతో ధ్వనులు చేయడం వెనుక మరో కీలకం ఉంది. ప్రతికూల వ్యాఖ్యలనూ, శబ్దాలనూ నిర్వీర్యం చేసి, దేవుణ్ణి అర్చిస్తున్న వారికి శుభప్రదమైన ధ్వనులతో సాంత్వన చేకూర్చాలన్నది దీని అంతరార్థం.

పల్లెటూళ్ళు, కుగ్రామాల్లోని ఆలయాల్లో హారతి సమయాల్లో శంఖనాదం చేయడం వల్ల అది అందరికీ వినబడేది. ఆలయానికి వెళ్ళే తీరిక, ఓపిక, అవకాశం లేని వాళ్ళు సైతం క్షణకాలం అన్నీ మరిచి, దైవాన్ని స్మరించుకోవడానికి అది ఓ సూచనగా ఉపకరించేది. తీరిక



లేని జీవితం గడుపుతున్నవారిలో సైతం దైవచింతన బలపడడానికి శంఖారావం తోడ్పడేది.

**శంఖనాద ఫలితం :** అంతరిక్షం, గ్రహ మండలం, సువర్ణాల సమ్మేళనం శంఖమని 'అథర్వణ వేదం' (4/10) పేర్కొంటోంది. శంఖనాదం శత్రువులను భయభ్రాంతులను చేయడమే కాక, రాక్షసులనూ, దుష్టశక్తులనూ నియంత్రిస్తుంది. అజ్ఞానాన్నీ, బద్ధకాన్నీ, వ్యాధినీ పారద్రోలుతుంది. దీర్ఘాయువును ఇస్తుంది. ఇక,

***యస్య శంఖధ్వనిమ్ కుర్యాత్ పూజాకాలే విశేషతః ।***
***విముక్తః సర్వపాపేన విష్ణునా సహ మోదతే ॥***

'పూజా సమయంలో శంఖాన్ని పూరించే వారు అన్ని పాపాల నుంచీ విముక్తులవుతారు, శ్రీమహావిష్ణువు సంతుష్టుడవుతాడు' అని పెద్దల మాట. ❖

*(పాంచజన్య ప్రార్థన వచ్చే సంచికలో...)*

# సుబ్రహ్మణ్యస్వామి లీలా విలాసం

మూలం: కే. అళగరాజా    చిత్రాలు: గోవి    అనుసృజన: స్వామి జ్ఞానదానంద

వీరపాండ్య కట్టబ్రహ్మన, ఆయన పూర్వీకుడైన దిగ్విజయదురై, వడమలైయప్పలనూ, ఉత్తరదేశానికి చెందిన ఒక అంధుణ్ణి ఆదుకున్న సుబ్రహ్మణ్యస్వామి మహత్వం అపారం.













5
17వ శతాబ్దం. తిరుమల నాయకుని పరిపాలనా కాలం. తమిళనాడులో పోర్చుగీసు వారికీ డచ్చి వారికీ మధ్య యుద్ధం జరిగింది. డచ్చివారు తిరుచందూర్ ఆలయాన్ని తమ కార్యాలయంగా మార్చివేశారు.
6
1649వ సంవత్సరం, ఫిబ్రవరి 22. ఆలయాన్ని వదలి బయటకు వెళ్ళమని డచ్చివారితో తిరుమలనాయకుని ప్రతినిధి చెప్పాడు. వారు తిరస్కరించడంతో నాయకుని భటులు భక్తులు కలిసి డచ్చివారితో పోరాడారు.
7
చివరికి డచ్చివారు సుబ్రహ్మణ్యస్వామివీ, నటరాజస్వామివీ, పంచలోహ శిలావిగ్రహాలను కొల్లగొట్టి నౌకలో తీసుకుని వెళ్ళిపోయారు.
8
అప్పుడు హఠాత్తుగా సముద్రంలో భయంకరమైన తుపాను చెలరేగింది.
కెప్టన్, నౌక తుపానులో చిక్కుకుంది. ఇక మనం ఎలా వెళ్ళగలం?
ఇంత భయంకరంగా సముద్రం ఉప్పొంగడం ఇంతవరకూ నేను చూడలేదు!
9
ఒకవేళ, దైవ విగ్రహాల శక్తి వల్లనే మనకు ఈ అగ్ని పరీక్షా?
అవును కెప్టన్, ఈ విగ్రహాల కారణంగానే మనం ఇలా అపాయకరమైన స్థితిలో చిక్కుకున్నాం.
సరే, వెంటనే వీటిని సముద్రంలో విసిరివేయండి.

మిగతా 36వ పేజీలో...



# స్వతంత్రులమవుదాం!

– స్వామి స్వసంవేద్యానంద

శిశువు పుట్టగానే ఏడుస్తుంది. తానేదో బంధంలో చిక్కుకున్నానని తలచి దాని నుండి విడివడాలని పెట్టే కేకయే ఆ ఏడ్పు. మనం పుట్టుకతోనే ప్రకృతి విధించే శాసనాలనుండి స్వతంత్రులం కావాలని ఎలుగెత్తి అరుస్తాం. పుట్టుకతోనే మనం ప్రకృతిపై తిరుగుబాటు చేస్తాం. ప్రకృతి శాసనాలకు లోబడి ఉన్నంత కాలం మనం యంత్రాలతో సమానం. ప్రకృతి బంధాలను ఛేదించడం ద్వారానే ఆత్మ స్వాతంత్ర్యం కలుగుతుంది. తెలిసో తెలియకో ప్రతి ఒక్కరూ ఈ ఆత్మస్వాతంత్ర్యం కోసమే పోరాడుతున్నారు. గ్రామంలోని పసిపిల్లలు వేణుగోపాలుని గానంపట్ల ఆకర్షింపబడినట్లు, మనందరం 'స్వాతంత్ర్యం' అనే వాక్కులోని మాధుర్యానికి ఆకర్షింపబడి దాన్ని అనుసరిస్తున్నాము. మనుష్యులు మాత్రమే కాదు సర్వజీవులూ కూడా దాని దిశగా పరుగెడుతున్నాయి. పుణ్యాత్ముడు, పాపాత్ముడు; పండితుడు, పామరుడు; నిస్వార్థపరుడు, స్వార్థపరుడు– ఇలా ప్రతి ఒక్కరూ ఆ గమ్యం వైపే ప్రయాణిస్తున్నారు. ఈ పయనంలో ఒక్కొక్కరి ప్రయత్నం తీవ్రంగానూ, ఒక్కొక్కరి ప్రయత్నం మందంగాను ఉంటుంది. తీవ్రంగా ప్రయత్నించేవారిని సజ్జనులనీ, మందంగా ప్రయత్నించేవారిని దుర్జనులనీ అంటాం. సాంఘిక జీవనమంతటిలోనూ ఈ స్వాతంత్ర్యం ప్రకటితమవుతూ ఉంటుంది. మన జీవిత వ్యాపారాలూ, ఉద్యమాలూ అన్నీ అందుకోసమే. చిన్న పరిమితిలో స్వాతంత్ర్యం లభిస్తే అవివేకులు తృప్తి చెందుతారు. కానీ వివేకులు నిరపేక్ష స్వాతంత్ర్యం–ఆత్మస్వాతంత్ర్యం లభించే వరకూ తృప్తి చెందరు. ఈ ఆత్మస్వాతంత్ర్యమే మానవుని ఉత్తమోత్తమమైన పరమావధి.

ఈ ఆత్మస్వాతంత్ర్యాన్ని పొందే ముందు వివేకవైరాగ్యాదుల ద్వారా ఇంద్రియ స్వాతంత్ర్యాన్నీ, మనో స్వాతంత్ర్యాన్నీ పొందేందుకు ప్రయత్నించాలి.

**ఇంద్రియ స్వాతంత్ర్యం:** ఇంద్రియాలకు గోచరమైన వాటిని మాత్రమే విశ్వసించి అంగీకరించేవాడు శారీరకంగా బద్ధుడై ఉంటాడు. అలాంటివారికి శరీరమే సర్వస్వం. విషయ సుఖమే జీవిత గమ్యమని తలుస్తాడు. ఇలాంటి వ్యక్తులు భౌతిక సుఖాల్ని పొందగలిగితే వారు పూర్తిగా స్వతంత్రులై హాయిగా జీవిస్తున్నామని భావిస్తారు. ఇంద్రియ భోగాలను అతిగా అనుభవిస్తున్నవారు ప్రతిరోజూ క్రొత్త క్రొత్త సుఖాలకై ఆరాటపడతారు. క్షణకాలపు ఇంద్రియసుఖాలకై ప్రతిరోజూ ఎన్నెన్నో విచిత్రమైన వస్తువులను కనుగొనుటలో అత్యంత విలువైన తమ సమయాన్నీ శక్తి సామర్థ్యాలనూ వృథా పరుస్తున్నామని వారు గ్రహించలేరు. విషయ సుఖాలన్నీ నిస్సారమని తెలియని అవివేకులు అనేక కష్టనష్టాల పాలవుతారు. అందుకే కఠోపనిషత్తులో యమధర్మరాజు మానవలోకంలో విషయసుఖాలకై అతిదుర్లభమైనటువంటి అప్సరాదులను గైకొను... అంటూ నచికేతుని ప్రలోభ పెట్టినప్పుడు, వివేకవంతుడైన నచికేతుడు *శ్వోభావామర్త్య స్య యదంతకైతత్ సర్వేంద్రియాణాం జరయంతి తేజః (కఠ 1-1-28)* "ఓ మృత్యుదేవా! నీవు నాకిస్తానని చెప్పిన విషయ భోగాలు శాశ్వతం కావు. అవి రేపటికి ఉంటాయా, ఉండవా? అని సందేహించాల్సినవి. ఇంతేగాక, ఈ భోగాలు మనిషికి గల సకలేంద్రియ సారాన్నీ హరింపజేస్తాయి" అన్నాడు. భౌతిక సుఖాలకు మనం వశులమైతే అవి మనకు అనేక అనర్థాలను కలిగిస్తాయి. వివేకవంతుడు నచికేతుడు చెప్పినట్లు విషయ సుఖాలు నిస్సారమని గ్రహించి వాటి బంధాలనుండి స్వాతంత్ర్యాన్ని కోరుతాడు.

**మనో స్వాతంత్ర్యం:** మనిషి కేవలం శరీరం, ఇంద్రియాలు మాత్రమే కాదు అని గ్రహిస్తే శారీరక బంధాలను అధిగమించి మానసిక పరిణతికి ప్రాధాన్యతనివ్వగలడు. అన్ని రంగాలలో ప్రగతిని సాధించినా ఈ ప్రగతి అంతా అనాత్మవిషయానికి సంబంధించినది. వీటి ఫలితం క్షణికం. మనస్సు అనేక కార్యాలద్వారా బహిర్గతమవుతుంది. విషయాసక్తి, సంకల్పం,

కామం (కోరిక), క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం, సంశయం, శ్రద్ధ, అశ్రద్ధ, స్థిరత్వం, అస్థిరత్వం, లజ్జ, వివేకం, అవివేకం, భయం, దంబం, అహంకారం మొదలైనవి మనస్సుయొక్క కార్యాలు. ఆత్మస్వాతంత్ర్యాన్ని పొందటానికి మనస్సు అత్యంత విలువైన పరికరం. పవిత్ర మనస్సు ద్వారానే ఆత్మజ్ఞానం, ఆత్మప్రాప్తి సాధ్యమవుతాయి. మనస్సు యొక్క



కార్యాలలో అత్యంత ప్రధానమైనవి కామం, క్రోధం. వీటిని నియంత్రించి మనస్సును దానికంటే శ్రేష్ఠమైన ఆత్మయందు ప్రతిష్ఠింపచెయ్యాలి. అలా చేయకుంటే ఇవి మనిషిని ఇంద్రియాలకు బానిసగా చేసి అధోగతిపాలు చేస్తాయి. దృశ్యవస్తువును గూర్చి మనిషి చింతంచడం మొదలుపెడితే ఆ వస్తువుతో మనస్సుకి ఒక విధమైన సంబంధం ఏర్పడుతుంది. ఆ సంబంధం మనస్సులో దానికనుగుణమైన వాసనను మేల్కొల్పడం వల్ల అది కోరికగా మారుతుంది. కోరిన వస్తువును పొందడానికి ప్రయత్నం జరుగుతుంది. ఆ ప్రయత్నంలో ఎవరైనా, ఏదైనా అడ్డుతగిలితే క్రోధం పుడుతుంది. తద్వారా చిత్తం వికల్పమై ఏది హితం, ఏది అహితం అనే వివేకం లోపిస్తుంది. దీనినే మోహం అంటారు. ఆ మోహం వలన స్మృతి (జ్ఞాపకశక్తి) నశిస్తుంది. అంటే తానెవరో, తన లక్ష్యం ఏమిటో అనే విషయాన్ని విస్మరించడం జరుగుతుంది. అలా స్మృతిభ్రంశం కలిగినపుడు, లక్ష్య భ్రష్టుడైనపుడు మనిషిలో నిశ్చయాత్మికా బుద్ధి (నేను ఇది చేస్తాను, ఇది నా లక్ష్యం అనే నిర్ణయం తీసుకోగల సామర్థ్యం) నశిస్తుంది. అలాంటి బుద్ధి నశించినపుడు మనిషి అధః పతనం చెందుతాడు.

అయితే మనస్సులోని ఈ కామక్రోధాది శత్రువులను జయించి మనస్సును భగవంతుని యందు నిలిపి ఆత్మ స్వాతంత్ర్యాన్ని పొందడమెలాగో శ్రీరామకృష్ణదేవులు చక్కటి ఉపాయాన్ని మనకు ఇలా బోధిస్తున్నారు: "కామక్రోధాది శత్రువులు వదలిపోవు కాబట్టి వాటి దిశను మార్చివేయండి, ప్రాపంచిక సుఖాలను కోరుకొనే బదులు భగవంతుణ్ణి కోరుకోవాలి. భగవంతుడి రూపాన్ని మోహించు. అహంకారం నిలుపుకోవాలంటే 'నేను భగవంతుడి దాసుడను' 'నేను భగవంతుడి బిడ్డను' అనే అహంకారం కలిగిఉండు. ఈ విధంగా ఆరుగురు శత్రువుల దిశను భగవంతుడివైపుకు మరల్చాలి." ఈ ఉపాయాన్ని అమలుపరచి మనస్సును ఆత్మపైన నిలుపడానికి ప్రయత్నించాలి.

**ఆత్మస్వాతంత్ర్యం:** అనేక జన్మార్జితాలైన సంస్కారాలు ఘనీభవించి వాసనారూపంగా చిత్తంలో దృఢపడి ఉంటాయి. ఇంద్రియాలకు శబ్దాది విషయాలు ఆహారం. కనుక ఇంద్రియాలు ఎప్పుడూ మనస్సును బయటికి లాగుతూ ఉంటాయి. మనస్సును వెలుపలికి వెళ్ళనివ్వకుండా నిగ్రహించాలి. అప్పుడే మనస్సు ఆత్మయందు స్థిరంగా నెలకొనగలదు. ఈ సత్యాన్ని పతంజలి మహర్షి "యోగః చిత్త వృత్తినిరోధః; తదాద్రష్టుః స్వరూపేఽవస్థానమ్" (సమాధి పాదము) అనే రెండు సూత్రాల ద్వారా వ్యక్తపరిచాడు. ఎప్పుడు చిత్తం (మనస్సు) విషయ ప్రవృత్తులను త్యజించి, అంతర్ముఖమవుతుందో అప్పుడు మనం మన స్వరూపాన్ని కనుగొంటాం. ఆత్మ స్వరూపులమై ఉంటాం.

విషయాల అనిత్యత్వాన్నీ ఆత్మయొక్క శాశ్వతత్వ, ఆనందత్వాలనీ బాగా తెలుసుకుంటే విషయాలపట్ల ప్రీతి, రాగం క్రమంగా తగ్గుతూ వాసన సన్నగిల్లి చివరికి నశిస్తాయి. ధూళితో కప్పబడి ఉన్న వజ్రాన్ని శుద్ధిచేస్తే ఎలా ప్రకాశిస్తుందో, అలాగే విషయవాసన అనే ధూళిని ఆత్మనుండి తొలగిస్తే మనిషి స్వస్వరూపం ప్రకాశిస్తుంది. ఈ స్వస్వరూపానుసంధానమే 'ఆత్మస్వాతంత్ర్యం'. ❖



# ఓ మహాత్యాగి ఆత్మకథ

## (స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)



**త్యా**గేనైకే అమృతత్వ మానశుః అంటుంది వేదం. త్యాగం వల్లనే అమృతత్వం, మోక్షం సాధ్యం. ప్రపంచాన్ని, సంసారాన్ని త్యాగం చేసి అడవులకో, పర్వతగుహలకో, హిమాలయాలకో వెళ్ళి కఠోర తపోనిష్ఠలో ధ్యానమగ్నులై ఆత్మసాక్షాత్కారం పొంది, బ్రహ్మానందంలో మునిగి ఉండడమే తరతరాలుగా వస్తున్న సాంప్రదాయక సన్యాసం. సప్తర్షిమండలంలో, బ్రహ్మానంద సుఖంలో మునిగి ఉన్న స్వామీజీ విశ్వమానవ శ్రేయస్సుకై స్వీయ బ్రహ్మానంద సుఖాన్నే త్యాగం చేసి "త్యాగం" అనే పదానికే సరికొత్త, సర్వశ్రేష్ఠ నిర్వచనమిచ్చారు. స్వామి వివేకానంద కన్నా 'మహాత్యాగి' ఎవరుంటారు?

ఆ మహాపురుషుడు తాను కావాలనుకుంటే మహాపండితుడుగా, గొప్పవక్తగా, నేతగా మహారాజుగా కోటీశ్వరుడై పేరు ప్రతిష్ఠలు, భోగ భాగ్యాలతో తులతూగుతూ ఒక మహా చక్రవర్తిగా గడిపి ఉండవచ్చు!. కానీ ఈ తుచ్ఛ, అశాశ్వత భోగభాగ్యాలు, పేరు ప్రతిష్ఠలు, మూన్నాళ్ళ ముచ్చట్లుగా భావించి గడ్డిపోచలుగా త్యాగం చేశారు. ఆధ్యాత్మిక ప్రపంచానికి చక్రవర్తిగా, తన భౌతిక శరీరంలో కేవలం 39 1/2 సంవత్సరాలే జీవించినా, విశ్వమానవ హృదయాలలో 39 యుగాలేమిటి, సూర్య చంద్రులుండేంత వరకూ శాశ్వతంగా జీవిస్తున్న జాజ్వల్య తేజోపుంజం. ఆధునిక విశ్వచింతనా శైలిని ఘోర భౌతిక భోగవాదం నుండి ఆధ్యాత్మిక చైతన్యం వైపు మలుపుతిప్పిన మహావీరుడు, మహాత్ముడు స్వామి వివేకానంద.

మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, దేవదూత, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వగాయకుడు ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన తన జీవితానుభవాలను 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు ఈ నెల నుంచి ధారావాహికగా అందిస్తున్నాం.

**స్వీ**య విముక్తి (మోక్షం) కోసం, పరుల సుఖశ్రేయస్సుల కోసం, సన్న్యాసి ఈ లోకంలో జన్మిస్తాడు. తన జీవితాన్ని మానవాళి సేవలో సమర్పించడానికీ, కోట్లాది దీన దుఃఖితుల ఆర్తనాదాలకు స్పందించి వారిని ఆదుకోవడానికీ, వితంతువుల కన్నీటిని తుడవడానికీ, పుత్రశోకంతో తల్లడిల్లుతున్న తల్లి హృదయాన్ని ఓదార్చడానికీ, అజ్ఞానం, నిరాశా, నిస్పృహలతో క్రుంగిపోయిన బీదలకు జీవనోపాధిని కల్పించి వారిని తమ కాళ్ళమీద తాము నిలబడేటట్లు చేయడానికీ, వేదాలు, శాస్త్రాల సందేశాన్ని భేద బుద్ధి లేకుండా అందరికీ బోధించి వారి భౌతిక, ఆధ్యాత్మిక వికాసానికి తోడ్పడటానికీ 'ఆత్మజ్ఞాన జ్యోతి'ని వెలిగించి సకల జీవుల హృదయాలలో నిద్రాణమై ఉన్న 'బ్రహ్మ' సింహాన్ని జాగృతం చేయడానికీ, దీనికి... దీనికే సన్న్యాసి ఈ లోకంలో జన్మిస్తాడు. ఈ లక్ష్యసాధన కోసమే మేము (సన్న్యాసులం) జన్మనెత్తాం; దీనికోసమే మా జీవితమంతా ఆహుతిచేస్తాం.

**తల్లి ఋణం తీర్చలేనిది :** నా తల్లితండ్రులు సంతానం కోసం ఎన్నో ఏళ్ళపాటు ఉపవాసాలు, వ్రతాలు, ప్రార్థనలు చేశారు. నేను పుట్టక ముందు నా తల్లి ఉపవాసాలూ, ప్రార్థనలూ, ఎన్నెన్నో కఠోర వ్రతాలూ చేసింది. వాటిని నేను 5 నిముషాలు కూడా చేయలేను! రెండేళ్ళపాటు ఆమె ఇవన్నీ చేసింది! నాలో ఉన్న

ఆధ్యాత్మిక సంస్కారాలు, సంపద అంతా ఆమె సాధనల ఫలమే అని నా దృఢ విశ్వాసం! నా తల్లి ప్రేరణ, పెంపకమే నన్నింత వాణ్ణి చేసింది! నాకున్న సద్గుణాలన్నీ ఆ తల్లి అనుగ్రహమే! ఎంతో ఓర్పునేర్పుతో ఆమె నన్ను పెంచి పెద్ద చేసింది. ఆమె మాతృప్రేమే నన్ను గొప్పవాణ్ణి చేసింది. నా తల్లి ఋణం నేనెన్నటికీ తీర్చుకోలేను! ఎన్నోసార్లు మా అమ్మ మధ్యాహ్నం రెండు గంటలప్పుడు భోజనం చేయడం చూశాను. మే మంతా 10 గంటలకు భోజనంచేస్తే ఆమె మాకు తినిపించి, ఇంటి పనులన్నీ చూసుకుని 2 గంటలకు తినేది. ఎవరయినా అతిథులు వస్తే తనకోసం మిగిలిన అన్నం కూడా వారికి ఎంతో ప్రేమతో పెట్టి తాను తర్వాత ఏదో వండుకుని తినేది. అలాంటి త్యాగమయ జీవితం ఆమెది! ఇవన్నీ కూడా ఆమె చిరునవ్వుతో సంతోషంగా చేసేది. అందువల్లనే భారతదేశంలో మనం తల్లిని దైవంగా (మాతృదేవోభవ) పూజిస్తాం!

**ప్రశాంతతనిచ్చే పరమశివుని నామం:** రెండేళ్ళ చిరుప్రాయంలోనే నేను బూడిద పూసుకుని, కౌపీనధారినై నా మిత్రులతో 'బైరాగి'గా ఆడుకునేవాణ్ణి. సాధు, బైరాగులంటే మహా అభిమానం! వారు మా ఇంటికి భిక్షకోసం వస్తే ఇంట్లోని వస్తువులన్నీ దానం చేసేస్తానని మా అమ్మ నన్ను మేడ మీద గదిలో ఉంచి తాళం వేసేసేది! అయినా నేను (నరేంద్రుడు) మేడ మీద కిటికీలోంచి వస్త్రమో, ఏదో ఒక వస్తువో సాధువులకు ఇచ్చేవాణ్ణి! కైలాసంలో ఏదో అల్లరిపని చేసినందువల్ల నన్ను శివుడు తనకు దూరంగా పంపేశాడని మా ఇంట్లో వాళ్ళు అనేవారు. నేనూ నమ్మేవాణ్ణి! నేను అతిగా అల్లరి చేసినప్పుడు మా అమ్మ "శివా, శివా! ఎంతో తపస్సూ, నోములూ చేసి నీలాంటి ఒక మంచి పుత్రుణ్ణి ఇవ్వు స్వామీ! అని ప్రార్థిస్తే ఆ శివుడు తన దగ్గరున్న ఈ భూతాన్ని పంపేశాడు. నా ఖర్మ!" అని వాపోయేది! నా అల్లరి శ్రుతిమించినపుడు మా అమ్మ చన్నీళ్ళు నా తలపై 'శివా, శివా' అంటూ గుమ్మరించేది! నేనూ శాంతంగా మారేవాణ్ణి. ఇప్పటికీ (పెద్దవాణ్ణయినా), అలజడిగా అనిపిస్తే ఆ "శివ, శివ" నామమే నన్ను శాంత పరుస్తుంది!.

**ప్రకృతిమాత ఒడిలో పారవశ్యస్థితి :** నాకు (నరేంద్రనాథ్) 14 ఏళ్ళ వయస్సులో మా తండ్రి ఉద్యోగరీత్యా మధ్యప్రదేశ్‌లోని రాయపూర్‌కు వెళ్ళారు. అప్పట్లో రైలు సౌకర్యాలు అంతగాలేనందున ఎడ్ల బళ్ళల్లోనే కొంత భాగం ప్రయాణం సాగింది. రాయపూర్ వెళ్ళే అడవి దారిలో నేను చూసిన ప్రకృతి దృశ్యాలూ, అనుభూతులూ... ముఖ్యంగా ఓ నాటి అద్భుత సంఘటన నాకు మరుపురానిది. ఆ రోజు మేము వింధ్య పర్వతశ్రేణుల పాదాల దగ్గర ప్రయాణిస్తున్నాము. ఆ పర్వత శిఖరాలు దారికి ఇరువైపులా చాలా ఎత్తుగా నింగికెగిసాయి. రకరకాల వృక్షాలు, లతలు వాటి రంగురంగుల పువ్వులు, ఫలాల భారంతో వంగిపోయాయి, ఆ పర్వత శ్రేణుల మధ్య అద్భుత ప్రకృతి సౌందర్యాన్ని కురిపిస్తున్నాయి! రంగురంగుల పక్షులు చెట్టు నుండి చెట్టుకు ఎగురుతూ ఆ ప్రాంతాన్ని మధురమైన తమ కిలకిలారావాలతో నింపేశాయి!.. ఇదంతా చూస్తున్న నాకు ఓ అనిర్వచనీయ ప్రశాంతత కలిగింది. ఎడ్లబండి మెల్లగా సాగుతుండగా హఠాత్తుగా ఆ అడవి మార్గంలో ఓ చోట దారికిరువైపులా ఉన్న రెండు పర్వత శిఖరాలు ముందుకు వంగి, పెనవేసుకున్నట్లుగా కనిపించాయి. ఆ రెండు పర్వత శిఖరాలు కలిసే ప్రదేశాన్ని జాగ్రత్తగా గమనిస్తే ఒక వైపు పర్వత శిఖరం నుండి కొండ క్రిందవరకూ పెద్ద చీలిక కనిపించింది. ఆ చీలికను నింపివేస్తూ, ఒక పెద్ద తేనె పట్టు వ్రేలాడుతూ ఉంది! ముల్లోకాధిపతి ఆ పరమాత్ముని అనంత సృష్టి, శక్తి వైభవం గురించి గాఢంగా తలపోస్తూ, బాహ్యస్మృతిని పూర్తిగా కోల్పోయాను. ఎంతసేపు ఆ ఎడ్లబండిలో ఆ అద్భుత పారవశ్యస్థితిలో ఉన్నానో నాకు గుర్తులేదు! బాహ్యస్మృతి కలిగాక ఆ ప్రదేశం నుండి చాలా దూరం వచ్చేశామని తెలుసుకున్నాను.

**సేవా ఫలం:** ఈ ప్రపంచంలో చాలా దుఃఖం ఉందనే సత్యాన్ని కాదనలేం; మరి మనమేం చేయాలి? శాయశక్తులా ఇతరులకు సహాయం చేయడమే మనం చేయగలిగిన ఉత్తమ కార్యం. అలా చేయడం వల్ల మనకు మనం మేలు చేసుకోవడమేనని గ్రహిస్తాం. నా బాల్యంలో నావద్ద కొన్ని తెల్ల ఎలుకలుండేవి. వాటిని ఒక్క చిన్న పెట్టెలో ఉంచాం, అందులో చిన్న చిన్న చక్రాలున్నాయి; ఎలుకలు ఆ చక్రాలను దాటడానికి ప్రయత్నిస్తే, ఆ చక్రాలు ఇంకా వేగంగా తిరిగేవి. దాంతో ఆఖరికి ఆ ఎలుకలు ఎక్కడున్నవి అక్కడే ఉండిపోయేవి! ఈ ప్రపంచమూ, మనం దానికి చేసే సహాయమూ అలాంటిదే! ఈ సేవా ప్రక్రియ ద్వారా మనకు కలిగే ఫలితమేమిటంటే మనం నైతికంగా బలవంతులమవుతాం! ❖ సశేషం

అనుసృజన :
**స్వామి అర్చనానంద**



# ప్రయత్నమంతా ప్రశాంతత కోసమేనా!



– ఆకెళ్ల రాఘవేంద్ర

సుఖానికి పొంగిపోకుండా, దుఃఖానికి కుంగిపోకుండా ఎవరైనా ఉండగలరా? దాదాపు ఎవ్వరూ ఉండలేరనే చెప్పవచ్చు. ఎందుకంటే మనం మానవులం. రాగద్వేషాలకు అతీతంగా ఉండగలగడం సామాన్యమైన విషయం కాదు. బాధ, కోపం, అసహనం, శోకం, భయం, ప్రేమ, మోహం... లాంటి మానసిక చాంచల్యాలేమీ లేకుండా బతకడం మాటలు కాదు. అయితే తీవ్రమైన భావోద్వేగాలు కలిగి ఉండడం మాత్రం మంచిది కాదు. శ్రుతి మించిన భావావేశం వల్ల మానసిక స్థితే కాదు శారీరక ఆరోగ్యమూ దెబ్బతింటుందని ఆధునిక వైద్యశాస్త్రం చెబుతోంది. ఒకప్పుడు మేధస్సును ప్రమాణంగా స్వీకరిస్తూ ఇంటిలిజెన్స్ కోషంట్ (ఐ.క్యూ) గురించి ఆలోచించేవాళ్ళం. కానీ నేడు ఎమోషనల్ కోషంట్ గురించి ఆధునిక మేనేజ్‌మెంట్ సూత్రాలు చెబుతున్నాయి. మనోనియంత్రణ ఎంతటి ప్రాధాన్యం సంతరించుకొందో దాన్నిబట్టి అర్థం చేసుకోవచ్చు.

ఎలాంటి పరిస్థితులలోనయినా తీవ్రభావోద్వేగానికి గురి కాకుండా ఉండాలంటే ఏం చేయాలి? పురాణ సాహిత్యంలో ఇందుకు సంబంధించిన కథలు అనేకం ఉన్నాయి. వాటిలో అజగరుడు అనే మునికి సంబంధించిన ఉపాఖ్యానం ఒకటి. ఇది పోతన భాగవతం సప్తమస్కంధంలో 'ప్రహ్లాద అజగర సంవాదం' అనే పేరుతో ఉంది. ఒత్తిళ్ళకు నిలయమైన ఆధునిక జీవనంలో భావోద్వేగాలను అదుపులో ఉంచుకొని మానసిక ప్రశాంతతను పొందే జీవన విధానాన్ని అందించే కథ ఇది.

ఒకసారి ప్రహ్లాదుడు లౌకిక తత్త్వం తెలుసుకోవాలని లోకసంచారం చేయడం మొదలుపెట్టాడు. అలా ప్రయాణిస్తూ కావేరీ నదీ తీరానికి చేరుకొన్నాడు. అక్కడ ఒళ్ళంతా దుమ్ము కొట్టుకు పోయి ఉన్న అజగరుడు అనే ముని కనిపించాడు దేహమంతా ధూళిధూసరాలతో నిండి ఉన్నప్పటికీ ఆ ముని కళ్ళల్లో, మోములో... మొత్తంగా శరీరంలో అద్భుతమైన తేజస్సు ఉంది. మరో విశేషం – ఆ ముని కొండ చిలువలాగ నిర్వికారంగా నేలపై పడుకొని ఉన్నాడు.

దీన్ని గమనించి ఆశ్చర్యంతో ప్రహ్లాదుడు ఆ మునిని ఈ విషయమే అడిగాడు–

"లోకంలో ప్రయత్నించిన వారికే కానీ ఇతరులకు సంపద లభించదు. సంపద ఉంటేనే కానీ పోషణ సాధ్యం కాదు. పోషణ ఉంటేనేకానీ శరీరపుష్టి, తేజస్సు సాధ్యం కాదు. కానీ ఎటువంటి ప్రయత్నం లేకుండానే, ధన భోగాలు లేకుండానే కటిక రాతి నేలపై పడుకొని నిద్రించే మీకు ఇంతటి అసమాన తేజోమయ దేహం ఎలా వచ్చింది?"

ప్రహ్లాదుడి ప్రశ్నకు అజగరుడు చిన్న మందహాసం చేశాడు. సృష్టిని లోతుగా పరిశీలించిన అనుభవంతో ఆ ముని ఇలా జవాబిచ్చాడు:

"నేను కూడా మొదట్లో దురాశ వెంటపడిన వాడినే నాయనా, కర్మబంధాల్లో చిక్కుకొని సంసార చక్రంలో తిరిగిన వాణ్ణే. అందుకే సుఖాలకు పొంగిపోయేవాణ్ణి; దుఃఖాలకు కుంగిపోయేవాణ్ణి. బాధకూ, ఆనందానికీ, కోపానికీ, ఆవేశానికీ అన్నింటికీ లోబడే ఉండేవాణ్ణి. కానీ చివరకు సమస్త క్రియల నుండీ నివృత్తి పొందిన జీవుడు స్వతంత్రుడై ప్రకాశిస్తాడని తెలుసుకొన్నాను. అంటే దుఃఖమైనా, సుఖమైనా, బాధ అయినా, ఆనందమైనా – దేన్నయినా సమానంగా స్వీకరించే స్థితికి చేరుకొన్నాను. ప్రయత్నం లేని, కోరిక లేని నిర్వికల్ప స్థితికి చేరుకొన్నాను. అలాగని జీవించకపోవడం కాదు. తామరాకుపై నీటి బొట్టులా జీవనాన్ని సాగిస్తున్నాను. ఒక్కమాటలో చెప్పాలంటే – మానుషతత్త్వం నుంచి బయటపడి మునితత్త్వాన్ని పొందాను".

అజగరుడు కాసేపు ఆగి మళ్ళీ ఇలా అన్నాడు:

"అజగరమును జుంటీగయు నిజ గురువులుగా దలచి నిశ్చింతుడనై, విజనస్థలి కర్మంబుల, గజిబిజి లేకున్నవాడ గౌరవ వృత్తిన్"

అంటే– "అజగరము (కొండచిలువ), తేనెటీగ – ఈ రెండూ నాకు గురువులు. వీటి నుంచి జీవితానికి కావలసిన గుణపాఠాన్ని నేర్చుకొని నేను జీవితంలో గజిబిజి లేకుండా బతుకుతున్నాను".

**తేనెటీగ నుంచి నేర్చుకొనే జీవితతత్త్వం:** తేనెటీగ ఎంతో శ్రమపడి, ఎన్నెన్నో ప్రదేశాలు తిరిగి.. తిరిగి... ఒక్కో తేనెబొట్టునూ సేకరిస్తుంది. నిరంతరం అదే పరిశ్రమలో ఉంటుంది. కష్టపడే గుణాన్ని దీని నుంచి నేర్చుకోవచ్చు. కానీ అజగరుడు చెబుతున్న తత్త్వం అది కాదు. తేనెటీగ అంతలా శ్రమిస్తుంది. జీవితమంతా కష్టపడి తేనెపట్టు కడుతుంది. ఎన్నో వేల మైళ్ళు తిరిగి ఇదంతా సాధిస్తుంది. కానీ ఏం లాభం? తాను సముపార్జించిన మకరందాన్ని తేనెటీగ ఏనాడైనా ఆస్వాదించిందా? జీవితాన్ని గందరగోళ పరచుకొని, సంపాదన వెనక పరుగులు పెడుతూ – బతుకును వెళ్ళదీసే తత్త్వంపై విమర్శ ఇందులో కనిపిస్తుంది.

మనిషి యంత్రం కాదు, కాకూడదు. అనుక్షణం ఒత్తిడితో సావాసం చేయకూడదు. ప్రతీ క్షణం ఏదో 'కూడబెట్టాలన్న' వ్యర్థ తాపత్రయంతో మసలకూడదు. దీనివల్ల అనవసర



కోరికలు, ఆ కోరికల్ని తీర్చుకొనేందుకు ప్రయాస, తద్వారా యంత్రంగా మారిపోయిన మనిషి జీవనం, ఈ కారణంగా తలెత్తే భావోద్వేగాలు... ఇలా సాగిపోతోంది నేటి మానవ జీవితం.

జీవితం లభించేది ఒక్కసారే! మళ్ళీ మళ్ళీ వచ్చేది కాదు. ఆచితూస్తే జీవితం అల్పమైంది. తూచి చూస్తే బహు స్వల్పమైంది. ఇంత చిన్న జీవితాన్ని అనవసర భావోద్వేగాలతో – కోపంతో, తాపంతో, ఆవేశంతో – మరింత కుదించు కొనే ప్రయత్నం చేయడం తప్పు కాదా? మనిషి జీవితానికి పరమార్థం ఉండాలి కదా. అందుకనే వయసుకు తగ్గ కార్యకలాపాలను చేస్తూ మొత్తంగా మానవ జీవితాన్ని ఒక అందమైన వనంలా తీర్చిదిద్దుకునే సూత్రాన్ని ప్రాచీన వాఙ్మయం అందించింది. బ్రహ్మచర్యం, గృహస్థం, వానప్రస్థం, సన్న్యాసం–అంటూ చతుర్విధ ఆశ్రమాల ద్వారా చతుర్విధ పురుషార్థాలను సాధించాలని చెప్పింది.

**కొండచిలువ నుంచి అజగరుడు నేర్చుకొన్నదేమిటి?:** ఎన్నెన్నో పాట్లుపడి సంపాదన కోసం అగచాట్లు పడే జీవి తేనెటీగ కాగా – ఆహారం కోసం ఎక్కడికీ తిరగకుండా, ప్రాప్తించిన ఆహారాన్ని మాత్రం తీసుకొంటూ – దీర్ఘకాలం బతికేది – కొండచిలువ.

దీనిని దృష్టిలో పెట్టుకొని అజగరుడు ఇలా అంటాడు – "నేను ఏది లభిస్తే అది ధరిస్తాను. ఏదీ లభించకపోతే దిగంబరంగా ఉంటాను. కట్టుకొన్నాననే సంతోషం కానీ, లేదే అనే బాధ కానీ పొందను. పల్లకీల మీదగానీ, రథాల మీద కానీ, అశ్వాలమీద కానీ, ఏనుగులమీద కానీ ప్రయాణం చేయగలను, లేదా ఏదీ లేకుండా కాలి నడకన వెళ్ళిపోగలను. కస్తూరి, చందనం లాంటివి శరీరానికి పూసుకొని ఆనందిచనూ గలను, లేదా దుమ్ముని ఒంటికి పూసుకోనూగలను. బంగారు తల్పాలపై శయనించనూగలను. రాయిరప్పలమీద, బూడిద నేలలో ఎక్కడైనా సరే నిశ్చింతగా నిద్రపోనూ గలను. ఎవరైనా గౌరవిస్తే గర్వపడను. అవమాన పరిస్తే ఆందోళన చెందను. ఏది లభిస్తే దాన్నే భుజిస్తాను. అది తియ్యగా ఉండొచ్చు. కటిక చేదుగా ఉండొచ్చు. ఏదీ లభించకపోయినా అలాగే ఉండిపోనూ గలను. మనసులో దేనిని గురించీ ఆలోచించను. ఏదీ మానను. ఏదీ కోరను. ద్వేషం లేదు, అలాగని ప్రేమా లేదు. సుఖం లేదు, దుఃఖం లేదు. ఒకరిని నిందించను, ఒకరిని స్తుతించను. ఎన్ని సంపదలు వచ్చినా ఆనందపడను. ఎన్ని కష్టాలు వచ్చినా బాధపడను".

అజగరుడు పలికిన పలుకుల్లో – స్థూలంగా చూస్తే – మెట్టవేదాంతం కనిపిస్తుంది. ఏ భావమూ లేకుండా ఉంటే మనిషికీ మానుకీ తేడా ఏముంటుంది అనిపిస్తుంది? కానీ సూక్ష్మ దృష్టితో చూస్తే– మానవుడు చేయాల్సిన ప్రయత్నం చేస్తూనే అందిన ఫలాల్ని అందుకొంటూనే తీవ్రభావోద్వేగాలకు లోను కాకుండా ప్రశాంతంగా జీవించడం అనే సత్యం–ఈ మాటల వెనుక దాగి ఉంది. మనసుపై ఏ ప్రభావమూ లేని జీవన విధానాన్ని అలవరచు కోవాలన్న సూత్రం ఇమిడి ఉంది. ❖

# యువవాణి

**– స్వామి పరిజ్ఞేయానంద**

**శీలా కోటేశ్వరరావు, కొత్తవలస, విజయనగరం జిల్లా.**

**ప్రశ్న: నేను ఒక కళాశాలలో అధ్యాపకునిగా పనిచేస్తున్నాను. నేటి విద్యావిధానం స్వామి వివేకానంద ఆశించిన విధంగా లేదు. అందువల్ల విద్యార్థుల్లో నైతిక, ఆధ్యాత్మిక విలువలు కొరవడుతున్నాయి. ఇలాంటి పరిస్థితుల్లో నాలాంటి అధ్యాపకులు అనుసరించాల్సిన పద్ధతులను తెలుపండి.**

**జవాబు:** ఏ దేశమైనా సుస్థిరంగా, సుసంపన్నంగా ఉండాలంటే ఏమిటి చేయాలి అని ఒకసారి రఘు మహారాజు సభలో చర్చసాగింది. ఆ సభలో 'దేశంలోని ప్రజలు ఎలాంటి భయమూ లేకుండా ఆనందంగా ఉండాలంటే శత్రుదేశాల బారి నుంచి రక్షించుకునేందుకు సైన్యాన్ని బలోపేతం చేయాలి. దానివల్ల దేశానికి పటిష్ఠమైన భద్రత ఏర్పడుతుంది' అని కొంతమంది సలహా ఇచ్చారు.

'ప్రజల్ని విలువలతోకూడిన వ్యక్తులుగా తీర్చిదిద్దిన నాడు సుఖసంతోషాలు సర్వత్రా తాండవిస్తాయి. శీలవంతుడైన ప్రతి పౌరుడూ దేశానికి ఓ కోటలాంటివాడు' అని రెండో వర్గం వారు సలహా ఇచ్చారు. పౌరుల్ని శీలవంతులుగా సంస్కరించడం వల్లనే దేశం సుస్థిరంగానూ, సుసంపన్నంగానూ ఉంటుందని రఘు మహారాజు విశ్వసించాడు. శీలవంతులుగా తీర్చిదిద్దే విలువలతో కూడిన విద్యే అత్యంత అవసరమని దీన్ని బట్టి మనకు అర్థమవుతుంది.



ఆధ్యాత్మిక విలువలులేని లౌకిక విద్య వల్ల ఎలాంటి ప్రయోజనం ఉండదు అన్న స్వామి వివేకానందుని సందేశాన్ని నేటి మన విద్యాసంస్థలూ, ప్రభుత్వం, అధ్యాపకులూ అర్థం చేసుకొని ఆచరించాల్సిన సమయం ఆసన్నమైంది.

...If you attempt to get the secular knowledge without religion, I tell you plainly, vain is your attempt in India, it will never have a hold on the people.

*- Swami Vivekananda*

శీలనిర్మాణం, మనోబలం, విశాల దృక్పథాలను పెంచే విద్యే నేడు మనకు కావలసిన విద్య అని స్వామి వివేకానంద చెప్పారు. ఎప్పుడైతే మన విద్యా విధానంలో స్వామీజీ ఆశించిన విలువలతో కూడిన విద్యకు ప్రాధాన్యతను ఇస్తామో అప్పుడు మాత్రమే యువత నైతికంగానూ, ఆధ్యాత్మికంగానూ పరిపుష్టులవుతారు.

అబ్రహాం లింకన్ తన కుమారుడికి ఎలాంటి విద్య బోధించాలో వివరిస్తూ కళాశాల అధ్యాపకునికి కొన్ని సూచనలతో ఒక ఉత్తరం వ్రాశాడు. అందులో కొన్ని:

1. మోసం చేసి విజయం సాధించడం వల్ల వచ్చే కీర్తి ప్రతిష్ఠల కన్నా అపజయం పొందినప్పటికీ నిజాయితీగా వ్యవహరించడం ఉత్తమమని బోధించండి.
2. ఎలాంటి క్లిష్ట పరిస్థితులు ఎదురైనా మనోదుర్బలతకు గురికాకుండా ఆత్మవిశ్వాసం కలిగి ఉండేలా బోధించండి.
3. బుద్ధిబలాన్ని ఉపయోగించి ధనార్జన చేయవచ్చు కానీ లోభత్వం వల్ల స్వార్థపరుడై తన వ్యక్తిత్వాన్ని కోల్పోయేలా వ్యవహరించ వద్దని బోధించండి.

స్వామి వివేకానంద ఆశించిన విలువలు–శీలనిర్మాణం, మనోబలం, విశాల దృక్పథం అనే మూడు అంశాలను అబ్రహాం లింకన్ కూడా తన ఉత్తరంలో పొందుపరచడం గమనార్హం.

ప్రతి అధ్యాపకుడూ విద్యార్థులకు ఇతర పాఠ్యాంశాలతో పాటు పైన వివరించిన విలువల్ని మహాత్ముల జీవితాల్లోని స్ఫూర్తిదాయక సంఘటనల ద్వారా సోదాహరణగా బోధించాలి. అప్పుడే స్వామి వివేకానంద ఆశించిన శీలవంతులైన ఆదర్శ యువకులు తయారుకాగలరు. ఏ మార్పునైనా ఒక్కరోజులో తీసుకురాలేమన్న విషయాన్ని గుర్తుంచుకొని పట్టుదలతో పరిశ్రమిస్తే దేనినైనా సాధించవచ్చని విశ్వసించండి. విద్యా విధానంలో ఎవరో మార్పును తెస్తారని ఎదురుచూడడం కన్నా ఆ మార్పుకు మనమే నాంది పలుకుదాం. ❖


మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :

**యువవాణి**

**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**

**దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029**

## మనసు-మర్మం - స్వామి బుధానంద

# పవిత్ర ఆలోచనలతో మనోనిర్మలత!

మనందరి జీవితాలలో కనపడే వింతైన విషయం ఒకటి ఉంది. మనకు మంచి ఏదో తెలుసు కానీ ఆ పనిని చెయ్యలేం; మనకు చెడు ఏదో కూడా తెలుసు కానీ దాన్ని చెయ్యకుండా ఉండలేం. మనం చాలా మంచి నిర్ణయాలు తీసుకుంటాం. కానీ మనకు తెలిసే లోపలే, పెను ఉప్పెన ముందు నిలువలేని మట్టిగోడలాగ, అవన్నీ కొట్టుకుపోతాయి. మనం దిగ్భ్రాంతి చెందుతాం; నిస్పృహ చెందుతాం.

ఈ విషయాన్ని జాగ్రత్తగా పరిశీలిద్దాం. మనసులో ఒక భాగమైన చైతన్య స్థితిలో మనం ఆ నిర్ణయాలు తీసుకుంటున్నాం. మనమే మన మనస్సులోని మరొక భాగమైన చైతన్యరహిత స్థితితో వాటిని కాలరాస్తున్నాం. ఈ చైతన్యరహిత స్థితిని గురించి మనకు తెలిసింది చాలా తక్కువ. అక్కడంతా కారుచీకట్లు కమ్ముకుని ఉన్నాయి.



మనస్సును స్వాధీనం చేసుకోవడానికి ఉపక్రమించిన క్షణం నుండీ అంతర్గతమైన సమస్యలతో మనం సతమతమైపోతాం. కొంతకాలం వరకూ, మనం ఎంత ఎక్కువగా ప్రయత్నిస్తే మన కష్టాలు అంత ఎక్కువ అవుతాయి. మనం పనికట్టుకొని చైతన్యస్థితిలోని మనస్సును స్వాధీనం చేసుకోవాలని ప్రయత్నించినప్పుడు చైతన్యరహితస్థితిలో ఉండి, మనకు వ్యతిరేకంగా పనిచేసే శక్తులతో ఢీకొంటాం. మన పూర్వసంస్కారాలు, పాత తలంపులు, జ్ఞాపకాలు, స్వభావాలు– ఇవే ఈ వ్యతిరేక శక్తులు. మనం ఏది ఆలోచించినా, అది మన మనస్సుపై శక్తిమంతమైన ఒక చెరగని ముద్రను వేస్తుంది. ఈ ముద్రలు చైతన్యరహిత స్థితిలో నుంచి పైకిలేచి కార్యరూపం దాల్చడానికి ప్రయత్నిస్తాయి. ఎప్పుడైతే చైతన్యస్థితిలో ఉన్న మన ఆలోచనలకు ఇవి సరిపడవో అప్పుడు మనస్సులో సంఘర్షణ మొదలవుతుంది.

ఈ చైతన్యరహిత స్థితి ఇళ్ళలో ఉండే నేలమాళిగ లాంటిది. దానిలో ఎంత చెత్త పేరుకుపోయి ఉందో, దాన్ని శుభ్రం చేద్దామనుకునే వరకూ మీకు తెలియదు. ఆ పని ప్రారంభించే ముందు దానిలో ఎటువంటి సామాను ఉందో, పురుగుపుట్రా ఉన్నాయో కూడా మీకు తెలియదు. త్వరలోనే నీరసం వచ్చి ఆ పనిని అర్ధాంతరంగా ఆపివేస్తారు. ఆ నేలమాళిగ అలాగే ఉండిపోతుంది. ఇక అది ఎప్పటికీ నివాసయోగ్యం కాదు. కానీ ఎప్పటివరకూ ఈ చైతన్యరహిత స్థితి అనే నేలమాళిగను శుభ్రం చెయ్యమో, అంతవరకూ చైతన్య స్థితిలో ఉన్న మనస్సు యొక్క స్వాధీనత గురించి నిబ్బరంగా ఉండలేము. కాబట్టి తప్పనిసరిగా మనస్సులోని ఈ చీకటిమూలల్ని శుభ్రం చేసే పద్ధతిని మనం కనుక్కోవలసిందే. ఆ పని చెయ్యడం ఎలా?

ఒక సిరాబుడ్డిని శుభ్రం చెయ్యాలనుకున్నారనుకోండి! అది ఎలా? మంచి నీళ్ళని ఆ బుడ్డిలో పోస్తాం. లోపల ఎండిపోయిన సిరా నీళ్ళలో నాని, కరిగిన కొద్దీ నల్లగా ఉన్న నీరు బయటకు వస్తుంది. క్రమక్రమంగా బయటకు వచ్చే నీటి రంగు తగ్గుతుంది. చిట్టచివరికి స్వచ్ఛమైన నీరు మాత్రమే సిరాబుడ్డిలో నుంచి బయటకు వస్తుంది.

ఈ చైతన్యరహిత స్థితిలో ఉన్న మనస్సుని శుభ్రం చెయ్యడానికి దానిలో పవిత్రమైన ఆలోచనలను నింపడం అనేది ఒక పద్ధతి. ఆలోచనలను మన మనస్సు లోతుల లోనికి చొచ్చుకు పోనివ్వాలి. ఈ పవిత్రమైన ఆలోచనలు మంచినీటిలాగ పనిచేస్తాయి. అయితే మనలోంచి నల్లటి మురికినీరు బయటకు రావడం చూసి బెదిరిపోకూడదు. మనస్సును పవిత్రమైన ఆలోచనలతో నింపడం కొనసాగిస్తే ఒకానొక సమయానికి పవిత్రమైన ఆలోచనలు మాత్రమే మనలో నుంచి బయటకు రావడం గమనిస్తాం. అప్పుడు చైతన్యరహిత స్థితిలో ఉన్న మనస్సు శుభ్రపడిందని మనం తెలుసుకోవచ్చు. ఆపైన చైతన్య స్థితిలోని మనస్సును స్వాధీనం చేసుకోవడం పెద్ద కష్టం కాదు. ❖



స్వామి వివేకానందుని దృష్టిలో

# ఆదర్శ విద్యార్థి

-స్వామి రఘునాయకానంద

ఇది చదువుల యుగం. పిల్లవాడు పుట్టిన వెంటనే డాక్టర్ని చేయాలనో లేక ఇంజనీర్ని చేయాలనో కలలు కంటూ తమ ఆలోచనలను పసిపిల్లవాని లేత మనస్సుపై చొప్పించ ప్రయత్నించే తల్లితండ్రులూ; పోటీ ప్రపంచానికి దీటుగా విద్యార్థులను తయారుచేయాలని తపన పడే విద్యాసంస్థలూ ఆదర్శ విద్యార్థులను సమాజానికి అందించడం లేదు. ఆదర్శ వ్యక్తిత్వాలే దేశ ఔన్నత్యానికి ప్రతీకలు; ఆదర్శ విద్యార్థులే దేశ ప్రగతికి చిహ్నాలు.

విశ్వవిద్యాలయంలో విద్యను పూర్తి చేసుకొని నేడు బాహ్య ప్రపంచంలోకి అడుగిడుతున్న భారతీయ విద్యార్థి నుంచి సమాజం ఆశించేదేమిటి? విద్యార్థి నేర్చుకొనే ముఖ్యమైన అంశాలు: లక్ష్యాలు, పరీక్షలు, ఉద్యోగాలు అనే మూడు సంకుచిత భావాలతో కూడుకొన్నవే. ఆ విధంగా విద్య అనేది జీవనోపాధిని కల్పించడమే నేర్పిస్తుంది తప్ప జీవించడం నేర్పటం లేదు. విద్యార్జన అనేది జీవనోపాధిని కల్పించడంతో పాటు జీవించడం నేర్పాలి. విద్యార్జన కేవలం ఒక ఉద్యోగం సంపాదించడంతోనే ఆగిపోకూడదు. ఇది జీవితాంతం సాగే ప్రక్రియ. "నేను బ్రతికి ఉన్నంతకాలం నేర్చుకుంటూనే ఉంటాను" అంటారు శ్రీరామకృష్ణులు. ఇటువంటి భావంతో కూడిన విద్య నిరంతరం వ్యక్తిత్వ వికాసానికి దోహద పడుతుంది. అలాంటి విద్యను ఆర్జించేవారు ఆదర్శ విద్యార్థులు.

## సద్గుణాలతో శీల నిర్మాణం

ఒక ప్రఖ్యాత శిల్పి అందమైన శిల్పాన్ని చెక్కాడు. ఆయన స్నేహితుడు ఆ అద్భుతమైన శిల్పాన్ని చూసి ఆశ్చర్యచకితుడై ఆ శిల్పితో నీవు ఎంత అద్భుతమైన శిల్పాన్ని మలిచావన్నాడు. దానికి శిల్పి సమాధానం చెబుతూ నేను చేసింది ఏమీ లేదు. నాకు పనికిరానిది రాయి నుంచి తీసిపడేశాను అంతే. శిల్పం ఆ రాయిలో గర్భితంగా ఉంది అన్నాడు. క్రమశిక్షణ, నిజాయతీ, దయ, పరోపకారత, పట్టుదల, అంకిత భావం, సహనం, పవిత్రత మొదలైన లక్షణాలు మనలో ఉన్నాయి. ఏవిధంగా అయితే శిల్పి తనకు పనికిరానిది తీసివేశాడో అదే విధంగా మనలో ఉన్న చెడు లక్షణాలు తీసివేసినప్పుడే మనం శీలవంతులం కాగలం. వేల సంవత్సరాల క్రితమే మన వేదాలలో ఋషులు "భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః, భద్రం పశ్యే మాక్షభిర్యజత్రాః ...స్థిరైరంగైస్తుష్టు వాగ్ంం సస్తనూభిః – శుభకరమైన విషయాలనే మా చెవులతో విందుముగాక, శుభకరమైన దృశ్యాల్నే మా కళ్ళతో చూచెదముగాక, దృఢమైన ఈ శరీరంతో మంచి పనులే చేసెదము గాక" అని చెప్పడం జరిగింది. మన ప్రతీ ఆలోచనా, చేసే ప్రతీ పనీ మన మనస్సు మీద ఒక చెరగని ముద్రను వేస్తుంది. అంటే మన ఆలోచనలు, పనులు మన శీలం మీద ప్రభావం చూపిస్తాయి కనుక మనం శీలవంతులమా కాదా అన్నది ఈ సంస్కారాల ప్రభావం మీద ఆధారపడి ఉంటుంది. ధనం వల్ల, పేరు ప్రతిష్ఠల వల్ల, పాండిత్యం వల్ల ఎటువంటి ప్రయోజనం లేదు. మంచి శీలం మాత్రమే దుస్సాధ్యమైన కష్టాల అడ్డుగోడల్ని పగులగొట్టుకొని ముందుకు చొచ్చుకొని పోతుంది అంటారు స్వామి వివేకానంద. మంచి పనుల ద్వారా , మంచి ఆలోచనల ద్వారా, మంచి అలవాట్ల ద్వారా మంచి సంస్కారాలను కనుక తయారుచేసుకోగలిగితే మనం శీలవంతులుగా మారుతాం. ఇది అర్థం చేసుకొన్నప్పుడే మన ఆలోచనలకు, పనులకు ప్రాముఖ్యాన్ని ఇవ్వగలం. శీలవంతులుగా మారాలంటే సద్గుణాలను తప్పక అలవరచుకోవాలి. శీలవంతులే బాధ్యతనంతా మోయగలరు. పరిస్థితులు అనుకూలించనప్పుడు వ్యక్తి ప్రవర్తనను బట్టి వాడు శీలవంతుడా కాదా అన్నది నిర్ణయించ బడుతుంది. ఇనుములో కార్బన్ శాతం ఇనుము నాణ్యతను నిర్ణయించినట్లుగా విద్యార్థికున్న శీలమే అతని గొప్పతనాన్ని నిర్ణయిస్తుంది.

## ధైర్యసాహసాలు

సమస్యలకు సమాధానం సాహసం. ఏదైనా సమస్యగానీ, ప్రమాదం గానీ ఎదురైనప్పుడు ధైర్యంతో ఎదుర్కోవాలి. సమస్యలకు పరిష్కారం వాటినుండి పారిపోవడం కాదు, ప్రతిఘటించి నిలబడడం అనేవారు స్వామి వివేకానంద. ఒకసారి స్వామి వివేకానంద కాశీలో ఒక దేవాలయం నుండి తిరిగి వస్తున్నప్పుడు కోతుల మూక ఆయన్ని వెంబడించగా ఆయన వెనుదిరిగి పరుగెత్తనారంభించారు. ఇది గమనిస్తున్న ఒక వృద్ధ సన్న్యాసి 'ఆగు, ఆగి ఎదుర్కో, వాటిని ప్రతిఘటించు" అన్నాడు. ఆ మాటలు విన్న స్వామి వివేకానంద నూతనో

త్సాహంతో ధైర్యంగా ఎదురుతిరిగి నిలబడ్డారు. వెంటనే కోతిమూక వెనక్కు తిరిగింది.

ఈ సంఘటన తనకు జీవితంలో ఒక గుణపాఠం నేర్పిందని కాలాంతరంలో చెబుతూ, "సమస్యను ధైర్యంతో ఎదుర్కోవాలి. పిరికితనం ప్రదర్శించకూడదు, ఎంత భయంకర సన్నివేశాన్నైనా సాహసంతో ఎదుర్కోవాలి" అన్నారు స్వామి వివేకానంద.

### ఆత్మగౌరవం - ఆత్మవిశ్వాసం

మనగురించి మనకున్న అభిప్రాయాన్నే ఆత్మగౌరవం అంటారు. మనం ఈ విధంగా తయారుకావడానికి మన ఆలోచనలే కారణం. మీరు మంచి విద్యార్థిగా, నిజాయతీ పరుడిగా ఉన్నప్పుడు, మీ శక్తిసామర్థ్యాలు, బలహీనతల



మీద మీకున్న అంచనాయే ఆత్మగౌరవంగా చెప్పబడుతుంది. స్వామి వివేకానందకు తల్లి భువనేశ్వరీ దేవి ఇలా హిత బోధ చేసింది: "పవిత్రంగా ఉండు. స్వచ్ఛమైన జీవితాన్ని జీవించు. ఆత్మగౌరవాన్ని సంరక్షించుకో. ఇతరులను గౌరవభావంతో చూడు." అందుకే నచికేతుని శ్రద్ధ మీద ఆయనకు ఎనలేని గురి ఉండేది. నచికేతుడి తండ్రి యాగంలో దక్షిణగా ఎందుకూ పనికిరాని ఆవులను బ్రాహ్మణులకు ఇస్తున్నప్పుడు ఆ తప్పిదాన్ని భరించలేక "మరి నన్ను ఎవరికి ఇస్తావు" అన్నప్పుడు తండ్రి యథాలాపంగా యముడికి అన్నాడు. అది విన్న నచికేతుడు తన ఆత్మగౌరవాన్ని కించపరచుకోకుండా "చాలామందిలో ఉత్తముణ్ణి అయినా అవుతాను. లేదా చాలా మందిలో మధ్యముణ్ణి అయినా అవుతాను; నేను అందరికంటె అధముణ్ణి మాత్రం కాను మరి నాన్న ఇలా అన్నాడు ఏమిటి" అని ఆలోచిస్తాడు.

ఆత్మగౌరవంలో ఆత్మవిశ్వాసం నిండి ఉంది. తన మీద తనకున్న నమ్మకం కారణంగా ఉత్సాహంతో ఏ కార్యంలోనైనా ముందంజ వేయగలరు. వారు చేసే పని ఏదైనా దృఢ నిశ్చయంతో, గొప్ప ఉత్సాహంతో చేస్తారు.

అన్ని దౌర్బల్యాలనూ అవతలికి నెట్టి వేయండి!! "నువ్వు సుదృఢంగా ఉన్నావు" అని శరీరానికి చెప్పండి. "నువ్వు బలమైనదానవు" అని మనస్సును ప్రేరేపించండి. అనంత ధైర్యాన్నీ, అపార విశ్వాసాన్నీ కలిగి ఉండండి.

### బలవంతులు కండి

స్వామి వివేకానంద ప్రతి విద్యార్థికీ ముఖ్యంగా ఉండవలసినవి మూడు బలాలు అంటారు. కండ బలం, బుద్ధిబలం, ఆత్మబలం. మొదట కావల్సింది కండ బలం – దేశానికి కావల్సింది బలిష్ఠులే. శారీరక బలం కోసం ప్రతిరోజూ క్రమం తప్పక వ్యాయామం చేయాలి. తద్వారా మానసిక ప్రశాంతతను పొందవచ్చు. అప్పుడు మాత్రమే సరైన నిర్ణయాలను తీసుకోగలం. మహాత్ముల జీవితాలను చదవడం ద్వారా మానసిక బలాన్ని పెంపొందించుకోవచ్చు. ముఖ్యంగా స్వామి వివేకానందుల ఆలోచనలను జీవితంలో ఆచరణలో పెట్టగలిగితే మనలో మానసిక బలం పెంపొందడంతో పాటు ఆ ఆలోచనలే మనల్ని ప్రేరేపితులను చేసి శీలవంతులుగా మారుస్తాయి. ఇక ముఖ్యంగా కావల్సింది ఆత్మబలం. "ప్రతీ మనిషిలో ఉన్న దివ్యత్వం గురించి తెలియజేసి దానిని దైనందిన జీవితంలో ఏ విధంగా ప్రకటితం చేయాలో తెలియజేయడమే నా ఆదర్శం" అంటారు స్వామి వివేకానంద. ఆ దివ్యత్వమే ఆత్మబలం. అందరిలో ఉన్న ఆ ఆత్మ (శక్తి)ని ధ్యానం, ప్రార్థనల ద్వారా తట్టి లేపాలి. ఈ ఆత్మబలంతో కూడిన పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రాన్ని భారతీయ విద్యార్థులు నేర్చుకోవాలి. ఈ ఆత్మబలం అసమానతలను, కుల వర్గ వైషమ్యాలను తొలగించి ఉన్నతమైన విలువలను ప్రసాదిస్తుంది. సమాజంలో గల అన్ని రకాల బలహీనతలకూ ఇదే పరిష్కారం.

ఈ వేదాంతభావాన్ని (ఆత్మ బలాన్ని) ప్రతి ఒక్కరూ దైనందిన జీవితంలో ఆచరణలో పెట్టినప్పుడు చేపలు పట్టేవాడు మరింత నైపుణ్యంగల చేపలు పట్టేవాడిగా, వ్యాపారి మంచి వ్యాపారిగా, విద్యార్థి ఒక ఆదర్శమైన విద్యార్థిగా మారుతారు. సౌశీల్యం, ధైర్య సాహసాలు, ఆత్మగౌరవం, ఆత్మవిశ్వాసం, శారీరక బలం, మానసిక బలం, ఆత్మబలం వంటి విలువలు గల ప్రతీ విద్యార్థీ ఆదర్శ విద్యార్థే. రండి! స్వామి వివేకానందుని భావాలను ఆచరణలో పెట్టి ఆదర్శ విద్యార్థులుగా తయారవుదాం!!. ❖

# చదవండి... చదివించండి!

**– స్వామి సేవ్యానంద**



ఆధ్యాత్మిక పుస్తకాలు జీవితపు చివరి రోజుల్లో చదవడానికై ఉద్దేశించబడ్డాయని చాలా మంది అనుకుంటారు. కానీ, వీటిని ఎంత చిన్నతనంలో చదవడం ఆరంభిస్తే అంత మంచిది. మన నిత్యజీవితంలో ఇవి ఎలా ఉపయోగపడగలవు?

**బాల్యంలో బంగారుబాట:** తమ పిల్లల భవిష్యత్తును ఉన్నతంగా తీర్చిదిద్దే బాధ్యత తల్లితండ్రుల పైనే వుంది. క్లాసు పుస్తకాలతోపాటు బాలల ఆధ్యాత్మిక కథల పుస్తకాలను వారికి ఇచ్చి, వారికి అర్థమయ్యే రీతిలో చెప్పే ప్రయత్నం చేయాలి. ఈ కంప్యూటర్ల యుగంలో కథలు చెప్పే సమయం ఎవరికుందని అడగవచ్చు. అయితే, నేడు తల్లితండ్రులు తమ పిల్లలకు ఉన్నతమైన నైతిక విలువలు అందించలేకపోతే, రేపు వారి పిల్లలు కూడా తల్లితండ్రులకై సమయం వెచ్చించడం వ్యర్థమని భావించి, వారిని ఏ వృద్ధాశ్రమాల్లోనో చేర్పించే అవకాశం వుంది. నేడు మన దేశంలో పుట్టగొడుగుల్లాగ పెరుగుతున్న ఈ వృద్ధాశ్రమాల సంస్కృతికి ఇదే కదా కారణం! జీవితంలో చివరి రోజులు కాస్తా వృద్ధాశ్రమాల్లో గడపాలని ఎవరు కోరుకుంటారు?

**యువతరానికి శక్తినిచ్చే టానిక్ :** రామకృష్ణమఠం రామకృష్ణ మిషన్‌ల 13వ సర్వాధ్యక్షులైన శ్రీమత్ స్వామి రంగనాథానందజీ మహారాజ్ 1949 వ సంవత్సరంలో హైదరాబాద్ వెళ్ళినపుడు రాష్ట్ర మిలటరీ గవర్నర్ జనరల్ జె.ఎన్.చౌదరీని కలవడం జరిగింది. అతని టేబిల్‌పై 'భగవద్గీత' పుస్తకం చూసి, మహరాజ్ "జనరల్ చౌదరీ, మీరు 'గీత' చదువుతారా?" అని అడిగారు. "నాకు అలసటగా ఉన్నపుడు కొంత శాంతి కోసం ఈ పుస్తకాన్ని చదువుతాను" అన్నది ఆయన సమాధానం. "ఆ పుస్తకం యొక్క ఉద్దేశ్యం అది కాదు....." అంటూ మహరాజ్ తన సంభాషణను కొనసాగించారు. "..... ఈ పుస్తకం శాంతినివ్వడానికి మాత్రమే కాదు. మనల్ని బాధ్యతగల పౌరులుగా తయారుచేసి, మానవసేవ చేయడానికి కావలసిన శక్తి, సామర్థ్యాలను మనకు ఇవ్వడమే ఈ పుస్తకం యొక్క ఉద్దేశ్యం....".

నేటి యువతరం అర్థంలేని ఆందోళనలకు, ఆవేశాలకు, ప్రతికూల శక్తులకు (Negative powers) దూరంగా వుండి, తమలో దాగివున్న సానుకూల యువశక్తి (Positive youth power) ని ఆధునిక యుగానికి అందించాలంటే ఆధ్యాత్మిక పుస్తకాలనూ, స్వామి వివేకానందుని ఉపదేశాలనూ చదవడం తప్పనిసరి.

**వృద్ధాప్యంలో ఉన్నతమైన జీవితం:** ఒక రాజ్యంలో మొదటి నుంచీ వస్తున్న ఒక వింతైన ఆచారం ఉంది. ఎంత గొప్ప రాజైనా ఐదు సంవత్సరాలు పరిపాలించాక తన రాజ పదవితోపాటు రాజ్యాన్ని కూడా వదిలి, దూరంగా ఉన్న అడవిలో మిగిలిన జీవితాన్ని గడపాలి. ప్రస్తుతానికి ఈ రాజ్యాన్ని పరిపాలిస్తున్న విజయుడు తెలివైనవాడు. తన గడువు పూర్తికాకముందే అడవిలో అవసరమైన అన్ని సదుపాయాలనూ ఏర్పాటుచేసి, మరో రాజ్యాన్నే నిర్మించాడు. మిగిలిన జీవితాన్ని తనదైన క్రొత్త సామ్రాజ్యంలో ఆనందంగా గడిపాడు.

పూర్వం వృద్ధాప్యంలో మన పెద్దలు, ఆధ్యాత్మిక పుస్తకాలను చదువుతూ, చిన్నారులకు నాలుగు మంచి మాటలు చెబుతూ, ఉన్నతమైన మన సంస్కృతిని ముందు తరాలవారికి అందించే సారథులుగా ఉండేవారు. నేడు నాయనమ్మలు, తాతయ్యలు కూడా మూన్నాళ్ళ ముచ్చటైన భౌతిక సుఖాలకు బానిసలై స్టార్ ఛానల్ చూడాలో లేదా స్పోర్ట్స్ ఛానల్ చూడాలో నిర్ణయించుకోలేక సతమత మవుతున్నారు. మనల్ని భయంకరమైన మృత్యువు ఆలింగనం చేసుకోకముందే మనకంటూ ఒక ఆధ్యాత్మిక సామ్రాజ్యాన్ని నిర్మించుకుంటే, మన భవిష్యత్తుకూడా ఆ విజయునిలాగే ఆనందమయం కాగలదు. అప్పుడే మనిషిగా జన్మించినందుకు ఈ జీవితానికి అర్థం, పరమార్థం ఉంటాయి. ❖



(1884–1967)

# ముందుకు సాగిపో!

– స్వామి ప్రేమేశానంద

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884 – 1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ –వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావంతో ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి.

స్వామి ప్రేమేశానంద లేఖల్లో ప్రేమపూర్వక అభినందనలే కాక, వ్యక్తిగత సమస్యలకు తగిన సూచనలు కూడా ఉంటాయి. అవి అన్ని తరగతుల వారినీ ప్రభావితం చేస్తాయి. స్వామి ప్రేమేశానందజీ లేఖలు సహజమైన భావ గాంభీర్యంతో, హాస్య చతురతతో, స్వతఃసిద్ధమైన రచనా శైలితో పాఠకుల హృదయాలను సూటిగా తాకుతాయి. ఒక వ్యక్తి శీలాన్ని అవగాహన చేసుకొని, అతడు ఏ 'తరగతి'కి చెందినవాడో విశ్లేషించి, అందుకు తగిన రీతిలో స్వామీజీ సూచనలు ఇచ్చేవారు. ఒక వ్యక్తి తన జీవితాన్ని మలచుకొని, జీవిత పరమలక్ష్యాన్ని దర్శించేందుకు ఆ సూచనలు, సలహాలు దోహదపడ్డ ఘటనలు ఎన్నెన్నో! ప్రేమేశానందజీ వేర్వేరు సందర్భాల్లో వేర్వేరు మందికి వ్రాసిన లేఖలైనప్పటికీ, వీటిని ఇప్పుడు చదువుతున్నా సరే, సాక్షాత్తూ ఆత్మీయుడో, ప్రియబాంధవుడో ఎదుట నిలబడి తనతో ముచ్చటిస్తున్న అనుభూతిని పాఠకుడు పొందుతాడు. ఈ లేఖలను చదివిన వారందరూ వీటిని 'అమూల్య నిధులు'గా అభివర్ణించారు.

ఆధ్యాత్మిక పథంలో పయనించే ముందుతరాల తెలుగు పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖల తెలుగు అనువాదాలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో నెల నెలా ధారావాహికంగా ప్రచురించదలచాం. వీటి ద్వారా పాఠకులు లబ్ధి పొందగలరని ఆశిస్తున్నాం. ❖

**తెలుగుసేత : కె. త్రివిక్రమరావు**

బెరహమ్‌పూర్,
15–3–1940.

ప్రియమైన విపత్ భంజన్!*

మానవుని పురోభివృద్ధికి అతనిలోనే దాగి ఉన్న అనంతశక్తిని గురించి నీకు ఎరుక కలిగించాలనుకుంటున్నాను. పూర్వులు తమ కలలో కూడా అనుకోని గొప్ప పనులు ఈ ఆధునిక యుగంలోని మానవులు సాధిస్తున్నారు. మానవుని ప్రతిభను గురించి స్వామి వివేకానంద మనకు ఎంతో దయతో బోధపరిచారు. ఆ బోధనల్ని ప్రజల్లో మారుప్రయోగించాలన్నదే మన కోరిక. ఏమైనప్పటికీ ప్రస్తుత పరిస్థితుల్లో అది సాధ్యం కాదు.

ఉదాహరణకు ఖగోళశాస్త్ర సత్యాన్నొకదాన్ని నువ్వు కనుగొన్నావనుకో, సాధారణ మానవునికి అర్థమయ్యేటట్లు దాన్ని వివరించడం నీకు కష్టం. ఖగోళశాస్త్రం గురించిన అవగాహన ఉన్నవాడు మాత్రమే దాన్ని అర్థం చేసుకోగలడు. అలాగే ఈ యుగంలో శ్రీరామకృష్ణులు, స్వామి వివేకానంద అనేక విశ్వజనీన సత్యాలను కనుగొన్నారు. యువకులు చాలా మంది యాంత్రిక జీవనం గడుపుతున్నారు. వారికి ఏ ఉన్నత ఆశయమూ లేదు. నువ్వు మహోన్నత వ్యక్తిగా ఎదగాలని నేను ఆశిస్తున్నాను. ఏ రంగంలోనైనా విజయాన్ని సాధించాలంటే శ్రీరామకృష్ణులు చెప్పిన 'ముందుకు సాగిపో...' అనే కథలోని బ్రహ్మచారిలా దృఢ సంకల్పం కలిగి ఉండాలి. ఇదే నీకు పరమ మంత్రం అని తెలుసుకో. ఈ అనంత విశ్వాన్ని సృజించిన ఆ సృష్టికర్త యొక్క ఘనమైన ప్రబోధాలపై ధ్యానం చెయ్యి. 'ముందుకు సాగిపో... ముందుకు సాగిపో'

"మిమ్మల్ని మీరు బోధపర్చుకోండి. ప్రతి ఒక్కరికీ వారి వారి స్వస్వరూపాన్ని బోధపర్చండి. నిద్రాణమైన ఆత్మను తట్టి లేపితే ఎలా మేల్కొంటుందో గమనించండి. నిద్రాణమైన ఆత్మను మేల్కొల్పితే శక్తి ఉద్భవిస్తుంది, ప్రకాశం ఉద్భవిస్తుంది, పవిత్రత ఉద్భవిస్తుంది. ప్రతిభావంతమైనవన్నీ ఉద్భవిస్తాయి"

– స్వామి వివేకానంద

మీరంతా లాభనష్టాలు, చావు పుట్టుకలు బేరీజు వేసే పనికిమాలిన ఆలోచనలకు స్వస్తి చెప్పి, శ్రీరామకృష్ణుల సేవాపరికరాలుగా రూపొందడానికి మీ శాయశక్తులా ప్రయత్నించండి. ప్రపంచం యావత్తూ మీ నుంచి ఆశిస్తున్నది ఇదే!

ప్రేమాశీస్సులతో...
స్వామి ప్రేమేశానంద

(*కాలాంతరంలో రామకృష్ణ సంఘంలో 'స్వామి స్వాహానంద'గా ప్రసిద్ధులు)

# 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

| దాత పేరు | విద్యాసంస్థ |
|---|---|
| శ్రీ శ్రీనివాస వెంకటరమణా రావు, | ప్రాథమిక పాఠశాల, బండివారి గూడెం, పశ్చిమగోదావరి జిల్లా |
| శ్రీ పొన్నం లక్ష్మీనారాయణ, గుమ్మడిముర్రు | మండల పరిషత్ ఉన్నత పాఠశాల, గుమ్మడిముర్రు, కృష్ణా జిల్లా |
| శ్రీ జయా నైక్, ఓబులదేవ్ నగర్, అనంతపురం | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, పెద్దపల్లి, అనంతపురం జిల్లా |
| శ్రీ నారాయణ రెడ్డి, చిరుక్యపూర్ కాలనీ, కర్నూలు | శేషారెడ్డి ఉన్నత పాఠశాల, బేతంచర్ల, కర్నూలు జిల్లా |
| శ్రీ కోటపాటి హనుమంత రావు, కల్యాణ్ నగర్, హైదరాబాద్ | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, చిన్న లింగాయపాలెం, గుంటూరుజిల్లా |
| శ్రీమతి & శ్రీ ప్రసాద్ ఎ.బి.ఎస్.ఆర్, బేగంపేట్, హైదరాబాద్ | పుణ్యలోక్ వృద్ధాశ్రమం, చిన్న అవుతపల్లి, కృష్ణాజిల్లా |
| శ్రీ గంగిరెడ్డి ఉన్నత పాఠశాల, కల్వరాల, మహబూబ్‌నగర్ జిల్లా | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, కల్వరాల, మహబూబ్ నగర్ జిల్లా |
| శ్రీ కె. నీలకంఠ రెడ్డి, బచ్చులివారి పల్లి, అనంతపురం జిల్లా | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, పులికుంటపల్లి, అనంతపురం జిల్లా |
| శ్రీ కె. ధనంజయ రెడ్డి, బచ్చులివారి పల్లి, అనంతపురం జిల్లా | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, ఈత్తోడు, అనంతపురం జిల్లా |
| శ్రీ బోయెల్ల జనార్ధన్ (కీ॥శే॥ఎన్. సుబ్బరాజు జ్ఞాపకార్థం), రేవూరు, నెల్లూరు జిల్లా | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, రేవూరు, నెల్లూరు జిల్లా |
| శ్రీ హరీష్ (కీ॥శే॥ బి. వెంకట కృష్ణారెడ్డి జ్ఞాపకార్థం), ఎ.కె.నగర్, నెల్లూరు జిల్లా | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, పామిరెడ్డిపాడు, నెల్లూరు జిల్లా |
| " " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, వారికుంటపాడు, నెల్లూరు జిల్లా |
| శ్రీ అడబాల నరేంద్ర, | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, మొగల్తూరు, పశ్చిమ గోదావరి జిల్లా |
| శ్రీ రాజారెడ్డి, పైడి, (కీ॥శే॥ పైడి ప్రశాంతి, అల్లూరి రాజారెడ్డి, | పి.వి.పి ఓరియంటల్ స్కూల్, కామారెడ్డి, నిజామాబాద్ జిల్లా, |
| చిలుకూరి సంగారెడ్డిల జ్ఞాపకార్థం) శ్రీరామ్ నగర్ కాలనీ, నిజామాబాద్ జిల్లా | ప్రభుత్వ ఉన్నత పాఠశాల, కల్వరాల, సదాశివనగర్, నిజామాబాద్ జిల్లా |
| " " " | ప్రభుత్వ ఉన్నత పాఠశాల, తాడ్వాయ్, నిజామాబాద్ జిల్లా - 503 120 |
| " " " | ప్రభుత్వ ఉన్నత పాఠశాల, ఎర్రపహాడ్, నిజామాబాద్ జిల్లా - 503 120 |
| " " " | బాలుర ప్రభుత్వ ఉన్నత పాఠశాల, కామారెడ్డి, నిజామాబాద్ జిల్లా - 503 111 |
| " " " | ప్రభుత్వ ఉన్నత పాఠశాల, దేమికలన్, తాడ్వాయ్, నిజామాబాద్ జిల్లా |
| " " " | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, బ్రాహ్మన్‌పల్లి, తాడ్వాయ్, నిజామాబాద్ జిల్లా |
| శ్రీ జలగం గోపాల్ రావు (కీ॥శే॥ జె. లింబా రావు) | ప్రభుత్వ పాఠశాల, సంగమేశ్వర్, దోమకొండ, నిజామాబాద్ జిల్లా |
| " " " | శ్రీ సరస్వతీ శిశుమందిర్ ఉన్నత పాఠశాల, కామారెడ్డి, నిజామాబాద్ జిల్లా |
| " " " | కాలేజ్ ఆఫ్ ఆర్ట్స్ & సైన్స్, కామారెడ్డి, నిజామాబాద్ జిల్లా |
| శ్రీ మంద శ్రీధర్ రెడ్డి (కీ॥శే॥ ఎమ్. కమలా రెడ్డి) | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, భానీపేట్, నిజామాబాద్ జిల్లా - 503 111 |
| ఎమ్/ఎస్ లక్ష్మీనారాయణ ఎంటర్‌ప్రైజెస్, ఖార్ఖానా, సికింద్రాబాద్ | ఎస్.ఆర్.వి.బి.ఎస్.జె.బి.ఎమ్.ఆర్ కాలేజ్ పెద్దాపురం, పశ్చిమగోదావరి జిల్లా |
| " " " | లైబ్రేరియన్, నలంద డిగ్రీ కళాశాల, లబ్బీపేట్, విజయవాడ-520 010 |
| " " " | లైబ్రేరియన్, డా॥ బి.ఆర్. అంబేద్కర్ లైబ్రరీ, గుంటూరు జిల్లా - 522 510 |
| " " " | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, బంటుమిల్లి, కృష్ణాజిల్లా - 501 324 |
| " " " | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, మల్లవోలు, కృష్ణాజిల్లా - 521 149 |
| " " " | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, పోరంకి, పెనమలూరు, విజయవాడ రూరల్ |
| " " " | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, కనుమోలు, కృష్ణాజిల్లా - 521 106 |
| " " " | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, రామవరప్పాడు, నిడమనూరు, విజయవాడ |
| " " " | లైబ్రేరియన్, ప్రభుత్వ జూనియర్ కళాశాల, సామర్లకోట, తూర్పుగోదావరి జిల్లా |
| శ్రీ ఎన్. శివమల్లికార్జున్, రాజమండ్రి, తూర్పుగోదావరి జిల్లా | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, కండవల్లి, పశ్చిమగోదావరి జిల్లా |
| శ్రీ పి. సురేష్, అనకాపల్లి, విశాఖపట్నం | ప్రేమ సమాజం, దాబా గార్డెన్స్, విశాఖపట్నం |
| శ్రీమతి గుణలక్ష్మి, విశాలాక్షి నగర్, విశాఖపట్నం | బి.వి.కె. ఉన్నత పాఠశాల, విశాలాక్షి నగర్, విశాఖపట్నం - 530 043 |

ఈ పథకం ద్వారా శ్రీరామకృష్ణ ప్రభను మరింతమందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.



# అద్భుత గ్రామం ఆయన సృష్టి

– జి. సతీష్

అన్నా హజారే పూనే దగ్గర ఉన్న రాలెగాం సిద్ధి అనే చిన్న గ్రామపు భవితని అద్భుతంగా మార్చివేసారు! అక్కడ ప్రతీ ఒక్కరూ ఎదుటివారి (సం)క్షేమం పట్ల శ్రద్ధ వహిస్తారు; తమ అవసరాలకి మించి ఎక్కువగా పంట పండితే, మరుసటి సంవత్సరం తమ ఉపయోగానికే ఉంటుందిలే అని దాచుకోకుండా తినడానికి ఏమీ లేని వారికోసం ఏర్పాటైన చోట (గ్రేన్‌బ్యాంకులో) పంట ధాన్యాలని నిలవ చేస్తారు; ముఖ్యమైన పనులన్నిటికీ దేవాలయమే కేంద్రంగా ఉంటుంది; సమాజం అక్కడ 4 లక్షల చెట్లను నాటింది. ఆ గ్రామంలో ఏ దుకాణంలోనూ పొగాకుగానీ, మద్యంగానీ అమ్మడం జరగదు. చుట్టు పక్కల ఉన్న గ్రామాల ప్రజలు తాగునీటి కోసం ప్రభుత్వం ఏర్పాటు చేసిన ట్యాంకర్లకై ఎదురుచూస్తుంటారు. అయితే రాలెగాం సిద్ధిలో ఆ గ్రామస్థులకి సరిపడేంత నీరు ఉండడమే కాకుండా, ఆ గ్రామాన్ని సందర్శించే వందలాదిమందికి కూడా సరిపడేటంత నీటి వసతి ఉంది!

అయితే రెండు దశాబ్దాల క్రితం అక్కడి పరిస్థితి ఇందుకు విరుద్ధంగా ఉండేది; ఆ గ్రామం ఆర్థికంగా కానీ, సామాజికంగా కానీ నిలదొక్కుకోలేని దుఃస్థితిలో ఉండేది. ఎప్పుడు చూసినా అనావృష్టి... చవిటినేలలు... ఉద్యోగావకాశాలు లేనేలేవు. కడుపునింపుకోవడానికి వేరే మార్గం లేక నిరాశకి గురైన ప్రాంతీయులు మద్యం తయారు చేయనారంభించారు. మద్యపానం, హత్యలు, పగలు, నేరాలు అక్కడ సహజమయిపోయాయి. ఆ గ్రామ జీవనం చాలా నిస్తేజంగా ఉండేది. ఆ పరిస్థితులలో సైన్యంలో లారీ డ్రైవర్‌గా పనిచేసి రిటైర్ అయిన అన్నాహజారే, **"ఇతరుల కోసం జీవించిన వారే నిజంగా జీవించినట్లు, మిగిలిన వారు మృతతుల్యులు"** అన్న స్వామి వివేకానందుని బోధనతో స్ఫూర్తి పొంది, అక్కడి గ్రామ ప్రజలకు సేవలందించడానికి నడుం బిగించారు. అతి కొద్ది కాలంలోనే ఆ గ్రామ ఆర్థిక వ్యవస్థనూ, ప్రజల నైతిక విలువల్నీ పునరుద్ధరించారు ఆయన. ❖

# రామకృష్ణ మిషన్ సేవాశ్రమ (ధార్మిక ఆసుపత్రి)

(రామకృష్ణ మిషన్, పి.ఒ.బేలూర్ మఠ్, హౌరా జిల్లాకు అనుబంధిత శాఖాకేంద్రం)
స్వామి వివేకానంద మార్గ్, బృందావన్, మధుర జిల్లా, ఉత్తర్‌ప్రదేశ్–281 121.
ఫోన్ : 0565–2442310, ఫ్యాక్స్: 2443310
Email : rkmsvrnd@sancharnet.in, Website: www.rkmsvrind.org

# విన్నపం

శ్రీకృష్ణుని దివ్యలీలా క్షేత్రం–యమునా నది ప్రవహిస్తున్న పుణ్య తీర్థం – బృందావనం. ఆ క్షేత్రం పేరు వింటేనే మనసు ఉన్నతమైన భక్తి భావనతో నిండిపోతుంది. శ్రీచైతన్య మహాప్రభువు, శ్రీరామకృష్ణుల సందర్శనం వలనా, మీరాబాయి, సూరదాసు, రూప, సనాతన గోస్వాములు మొదలైన భక్త శిరోమణుల సాధనల వలనా బృందావనం మరింత పవిత్రతను సంతరించుకొంది. ఈ పుణ్యక్షేత్ర వాసులకి రామకృష్ణ మిషన్ సేవాశ్రమ 1907 నుండీ అనేక సేవలు అందిస్తోంది.



'కాలాబాబు కుంజ్' భవనంలో శ్రీ శారదాదేవి బస చేసిన గది

శ్రీరామకృష్ణుల భక్తుడైన బలరాంబసుకి ఈ పవిత్ర వ్రజ భూమిలో "కాలాబాబు కుంజ్" అన్న పేరున్న పూర్వీకుల గృహం ఉంది. దివ్యజనని శ్రీ శారదాదేవి శ్రీరామకృష్ణులు మహాసమాధి చెందాక 1886లో బృందావనం వెళ్ళి ఈ "కాలాబాబు కుంజ్"లో సుమారు ఒక సంవత్సరం పాటు ఉన్నారు. ఆ తరువాత కూడా ఆమె అక్కడికి వెళ్ళినప్పుడు ఈ ఇంట్లోనే ఉండేవారు; ఇక్కడే శారదమ్మ మొట్టమొదట సారిగా స్వామి యోగానందకి మంత్రదీక్ష ఇచ్చారు. స్వామి వివేకానంద, స్వామి బ్రహ్మానంద, శ్రీరామకృష్ణుల ఇతర శిష్యులు ఆ ఇంట్లో ఉన్నారు. ఈ ఇంట్లోనే 1907లో రామకృష్ణ మిషన్ సేవాశ్రమ కేంద్రం లాంఛన ప్రాయంగా ప్రారంభమైంది.

మాతృమూర్తి శ్రీ శారదాదేవి పావనం చేసిన ఈ గృహాన్ని (కాలాబాబు కుంజ్) ఒక ఆధ్యాత్మిక స్మారక చిహ్నంగా



శ్రీ శారదాదేవి బస చేసిన 'కాలాబాబు కుంజ్' భవనం

తీర్చిదిద్దాలని బృందావనం రామకృష్ణ మిషన్ సేవాశ్రమ సంకల్పించింది. శ్రీ శారదాదేవి దివ్య స్మృతులను జ్ఞాపకం చేసుకొని ఆధ్యాత్మికంగా సన్న్యాసులూ, భక్తులూ లబ్ధి పొందడం కోసం దివ్యజనని ఉన్న 'కాలాబాబు కుంజ్' ఇంట్లోని ఒక భాగాన్ని రూ॥38 లక్షలకు కొనుగోలు చేయడం జరిగింది. కాలాబాబు కుంజ్‌లోని మిగతా భాగాన్ని కొని, మరమ్మత్తులు చేయించి ఈ స్మృతి కేంద్రంలో ఆధ్యాత్మిక సేవా కార్యక్రమాల్ని ప్రారంభించాలని సంకల్పించాం. ఈ భవనం కొనడానికీ, మరమ్మత్తులు చేయించడానికీ సుమారు **ఒక కోటి ముప్ఫై లక్షలు** వ్యయం అవుతుందని అంచనా.

ఈ ఆధ్యాత్మిక స్మృతి కేంద్ర నిర్మాణానికి మీరంతా ఉదారంగా విరాళాలిచ్చి సహకరించాల్సిందిగా కోరుతున్నాం.

"Ramakrishna Mission Sevashrama, Vrindaban" పేరున చెక్కు లేదా డి.డి తీసి క్రాస్ చేసి మీ విరాళాల్ని Ramakrishna Mission Sevashrama, Swami Vivekananda Marg, Vrindaban, Dist: Mathura, Uttar Pradesh-281 121 అనే చిరునామాకు పంపాల్సిందిగా మనవి. ఆదాయపు పన్ను చట్టంలోని 80(జి) విభాగం కింద విరాళాలకు పన్ను మినహాయింపు లభిస్తుంది.

భగవత్సేవలో

**స్వామి సుప్రకాశానంద**

కార్యదర్శి

ADVT.

## నా జీవితంలో స్వామి వివేకానంద

# మాటలు కావు... అవి మహామంత్రాలు!

– వి. శ్రీనివాస్

నా పేరు శ్రీనివాస్. మాది తూర్పుగోదావరి జిల్లా మాన్యంపాలెం అనే చిన్న గ్రామం. నేను మా ఊరిలో ఇంటర్ మొదటి సంవత్సరం వరకూ తెలుగు మీడియంలో చదివాను. మా నాన్నగారు చనిపోయిన కారణంగా చదువు కొనసాగించ లేకపోయాను. తరువాత చిన్న చిన్న పనులు చేసుకొంటూ మా ఊరిలోనే ఒక సంవత్సరం గడిపాను. నాకు ఆ జీవితం ఏ మాత్రం సంతృప్తినివ్వలేదు. మద్రాసు వెళ్ళి అక్కడ ఓ ప్రయివేటు కంపెనీలో ఉద్యోగానికి చేరాను. అలా అక్కడ ఒక సంవత్సరం గడిపాను. అక్కడ నుండే డాక్టర్ బి.ఆర్ అంబేద్కర్ ఓ.యు.లో డిగ్రీ చేయడానికి అర్హత పొందాను. మద్రాసులో ఉండి చదివే అవకాశం ఉండదనుకొని, హైదరాబాద్ వచ్చాను.



ఒక ప్రైవేట్ కంపెనీలో ఉద్యోగం చేస్తూ, ప్రతీ ఆదివారం తరగతులకు హాజరు అయ్యే వాడిని. అలా మూడు సంవత్సరాల్లో డిగ్రీలో ఉత్తీర్ణుణ్ణయ్యాను. డిగ్రీ రెండవ సంవత్సరంలో ఉండగా రామకృష్ణ మఠం గురించి తెలిసింది. ఇంగ్లీష్ నేర్చుకోవాలనే ఉద్దేశంతో నేను ఒకసారి అక్కడకు వచ్చాను. అక్కడికి వచ్చిన స్టూడెంట్స్‌ని చూసి ఆశ్చర్యపోయాను. వివేకానంద ఇన్స్టిట్యూట్ ఇంత గొప్పదా అని ఆలోచించాను. మొదటి ప్రయత్నంలో సీట్ పొందలేకపోయాను. కానీ రెండవసారి స్పోకన్ ఇంగ్లీష్‌లో సీట్ సంపాదించగలిగాను. అప్పటి నుండీ నా జీవితంలో మార్పు మొదలయింది, నా ఆలోచనల్లో, ప్రవర్తనలో, జీవితం గురించి ఒక అవగాహన, స్పష్టత ఏర్పడింది. ఇక్కడిలాగ పాఠాలు బోధించే విధానం నేనెక్కడా చూడలేదు. క్రమశిక్షణ, ప్రార్థన, బోధనా విధానం... ప్రతి అంశం నాకు ఎంతో నచ్చింది. ప్రతి ఉపాధ్యాయుడూ కూడా ప్రతీ విద్యార్థిపట్లా ఎంతో శ్రద్ధ తీసుకొని బోధించేవారు.

స్వామి వివేకానంద బోధనలు ప్రతిరోజూ చదివేవాడిని. అవి నాకు మంత్రాలలాగ అనిపించేవి. Take the whole responsibility on your own shoulders... All power is within you, you can do anything and everything... ఇలా ప్రతీ సందేశం నన్ను ఎంతగానో ప్రభావితం చేసింది. నా ముందు జీవితానికీ ఇప్పటి జీవితానికీ పోల్చి చూస్తే నాలో ఎంతో మార్పు వచ్చింది.

నేను తరగతులకు హాజరు అయ్యేటప్పుడు బస్సులో వస్తే ఆలస్యమై ఇన్స్టిట్యూట్ లోనికి అనుమతించరని తెలిసి రోజూ మౌలాలీ నుండి సైకిల్ మీద వచ్చి తరగతులకు హాజరయ్యేవాణ్ణి, మరలా ఇన్స్టిట్యూట్ నుండి ఎర్రగడ్డ (ఉద్యోగానికి) వెళ్ళేవాడిని. నాకు అసలు అలసటే అన్పించేది కాదు. ఈ విషయం తెలిసిన నా సహోద్యోగులు ఎవరూ నమ్మేవారు కాదు.

నేను ఇప్పుడు ఇంగ్లీష్ మీడియమ్ విద్యార్థుల కంటే బాగా ఇంగ్లీష్ మాట్లాడగలిగే సామర్థ్యం పొందగలిగాను.

నా జీవితం ఎటు వెళుతుందో అనుకొనే సమయంలో స్వామీజీ బోధలు నాకు ఎంతో స్ఫూర్తినిచ్చి మంచి మార్గాన్ని అనురించేలా చేశాయి. ఎందుకంటే హైదరాబాద్‌లో నాకు మంచి చెప్పే వారు ఎవరూ లేరు. నేను ఎలా ఉన్నా మందలించే వారు లేరు. నాలాంటి ఎంతో మంది యువకులకు స్వామీజీ సందేశం మహా మంత్రంగా పనిచేస్తుంది. శ్రీరామకృష్ణ ప్రభ పుస్తకం ముఖ్యంగా యువతకు ఎంతో ఉపయోగకరంగా ఉంటుంది.

స్వామి వివేకానందుని సందేశం మహా మంత్రంలా పనిచేసి నాలో మనోబలాన్ని పెంచింది. ప్రస్తుతం నేను నైట్ షిఫ్ట్స్ చేస్తూ I cet కోచింగ్‌కి వెళ్తున్నాను. స్వామీజీ ఆశీర్వాదంతో నేను ఎమ్.బి.ఎ. తప్పక పూర్తిచేయగలననే విశ్వాసం ఉంది.

Truth, purity, unselfishness- wherever these are present, there is no power below or above the sun to crush the possessor thereoff.

సత్యం, పవిత్రత, నిస్వార్థతలతో జీవించేవారిని ప్రపంచంలో ఏ శక్తీ ప్రతిఘటించలేదన్న స్వామి వివేకానందుని మహత్తర సందేశాన్ని ఒక మంత్రంగా స్వీకరించాను.

నీతీ నిజాయతీలతో జీవితాన్ని కొనసాగిస్తూ నాకు వీలైనంతలో ఇతరులకు సహాయపడతాను. మనసును వక్రమార్గంలోనికి వెళ్ళనివ్వకుండా స్వామీజీ బోధనలు సహాయపడతాయని అనుభవ పూర్వకంగా నేను గ్రహించాను. అందుకే నవతరం స్వామీజీ సాహిత్యాన్ని తప్పక చదవాలని కోరుతున్నాను. ❖

వి. శ్రీనివాస్, మౌలాలీ, హనుమాన్ నగర్, సికింద్రాబాద్

మహనీయుల జీవితాల్లో

# మధురఘట్టాలు

–డా॥ కరిమద్దెల నరసింహా రెడ్డి



## సమయస్ఫూర్తి

ప్రపంచ ప్రఖ్యాత భారతీయ తత్త్వవేత్త, భారత రాష్ట్రపతి అయిన డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ ఒకసారి ఒక విందులో పాల్గొన్నారు. ఆ విందుకు అగ్రశ్రేణి నాయకులెందరో హాజరయ్యారు. ఆ సందర్భంలో ఒక తెల్లజాతీయుడు జాత్యాహంకారంతో "రాధాకృష్ణన్‌గారూ! మేమందరం తెల్లగా ఉంటాం. మీ భారతీయులు రంగు తక్కువగా ఉంటారు. కారణమేమిటి" అని ప్రశ్నించాడు. అప్పుడు రాధాకృష్ణన్‌గారు "చూడండిసార్! ఒకసారి భగవంతుడు రొట్టెలు కాల్చుకోవాలనుకున్నాడు. సరిగ్గా అనుభవం లేకపోవడం వల్ల రొట్టె సరిగా కాలలేదు. తెల్లగా ఉండిపోయింది. దానిని ఎందుకు వ్యర్థం చేయాలని మీ తెల్లజాతివారిని తయారుచేశాడు. ఈసారి చాలా జాగ్రత్తగా రొట్టెను తెల్లగానూ కాకుండా నల్లగానూ అవకుండా తయారుచేశాడు. ఆ విధంగా భగవంతుడు మా భారతజాతిని సృష్టించాడు" అని సమయస్ఫూర్తిని ప్రదర్శించి ఆ జాత్యాహంకారికి చురకలు వేసి మెత్తగా వాతలు పెట్టాడు.

ఆ జాత్యాహంకారి అంతటితో ఆగక మరల "రాధాకృష్ణన్‌గారూ! మేము అందరము ఒకే రంగులో తెల్లగా ఉంటాం. మీ భారతీయులు కొందరు తెల్లగా ఉంటారు, కొందరు నల్లగా ఉంటారు, కొందరు చామనఛాయగా ఉంటారు, ఎందుకు" అన్నాడు. అప్పుడు రాధాకృష్ణన్‌గారు తడుముకోకుండా 'వినండి సార్! కారణం చెప్తాను, భగవంతుని సృష్టి చాలా విచిత్రమైంది. అది ఎవరికీ అర్థంకాదు. ఎందుకోగాని గాడిదలన్నిటినీ ఒకేరంగులో సృష్టించాడు. గుఱ్ఱాలన్నింటినీ రకరకాల రంగుల్లో సృష్టించాడు. మీది గాడిదల జాతి, మాది గుఱ్ఱాల జాతి'' అని సమయస్ఫూర్తితో చెప్పి జాత్యాహంకారి నోరుమూయించాడు. ❖



## కనువిప్పు

డాక్టర్ జాకీర్ హుస్సేన్ స్వతంత్ర భారతదేశ మూడవ రాష్ట్రపతి. ఆయన స్వయంగా జామియా మిలియా విశ్వవిద్యాలయాన్ని స్థాపించారు. ఆయన ఉపకులపతిగా ఉన్న కాలంలో దుమ్ముకొట్టుకుని పాలిష్ చెయ్యని బూట్లతో రావద్దని విద్యార్థుల్ని మందలించారు. అయినా ఫలితం లేకపోయింది. ఒకరోజు జాకీర్ హుస్సేన్ విశ్వవిద్యాలయ ప్రధాన ద్వారం ముందు నిలబడ్డారు. ఆయన్ని చూసిన విద్యార్థులు తమకు చీవాట్లు పెట్టడానికే నిలబడి ఉన్నారని అనుకున్నారు. వారిలో మొదట వచ్చిన విద్యార్థిని చూచి "బాబూ! నీ బూట్లు మాసి, దుమ్ముకొట్టుకొని ఉన్నాయి. నీ కాలు చాపు బూట్లను శుభ్రంగా పాలిష్ చేస్తాను'' అని చేతిలో పాలిష్, బ్రష్‌తో సిద్ధమయ్యారు. ఆ విద్యార్థీ అతని వెనుకనున్న విద్యార్థులూ ఊహించని ఆ సన్నివేశానికి సిగ్గుపడ్డారు. వెంటనే వారు ఆయనకు క్షమాపణ చెప్పినారు. ఇకపైన దుమ్ముతో మాసిపోయిన బూట్లతో విశ్వవిద్యాలయానికి రాము అని శపథం చేశారు. ఈ విధంగా జాకీర్ హుస్సేన్ విద్యార్థులకు కనువిప్పు కలిగించి శుభ్రతకు, క్రమశిక్షణకు అలవాటుపడేలా వారిని తీర్చిదిద్దారు. ❖

# వ్యక్తిత్వ వికాసం

- స్వామి రంగనాథానంద

మనలో రెండు ప్రకృతి శక్తులు పనిచేస్తుంటాయి. ఒకటి బాహ్యపకృతి, రెండవది ఆంతరంగికప్రకృతి.

జీవనయానంలో శారీరక, మానసిక మార్పులు, ఎదుగుదల తద్వారా ఏర్పడిన బంధాలు అన్నీ బాహ్య ప్రకృతి యొక్క యాంత్రిక లక్షణాలు. ఆంతరంగిక ప్రకృతి అన్నప్పుడు మనలో నీతి నియమాలు, మంచిచెడుల విచక్షణా జ్ఞానంద్వారా సంస్కరించుకోవాలి. దీనినే సంస్కృతి లేక వ్యక్తిత్వ వికాసం అంటాం.

**సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేః జ్ఞానవానపి ।**
**ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి ॥**

(భగవద్గీత-3.33)

సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేః... మనలోని ప్రకృతి మనల్ని ఏమి చెయ్యాలో, ఏమి చెయ్యకూడదో ఆదేశిస్తుంది. మనలోని ప్రకృతి, సహజంగా ఇంద్రియ జ్ఞాన వ్యవస్థతో కూడి ఎల్లప్పుడూ బాహ్యంగా వెళ్ళడానికి చూస్తుంటుంది. దానితో పాటు మనస్సు కూడా బాహ్యంగా వెళ్తుంటుంది. ఈ రకంగా జరుగుతున్నప్పుడు మనలో ఇంకొక ప్రకృతి ఉద్భవిస్తుంది. దానినే మనస్తత్వ శాస్త్రంలో 'వాసనలు' అని అంటారు. ఇవి మనసులోనే చేతన మనస్సుకు అడుగున అచేతన మనస్సులో ఉంటాయి. ఆ వాసనలు బయటకు వచ్చి నిన్నూ, నన్నే కాదు 'జ్ఞానవానపి' - జ్ఞానులను కూడా అవి లాగేస్తుంటాయి. ఏ శక్తులు మనల్ని ఇలా చేస్తున్నాయో వేదాంతం మనకు తెలియచేస్తుంది. "ఒకటి బాహ్యశక్తి మరొకటి ఆంతరికశక్తి". చాలామంది ఆంతరిక శక్తులను ఖాతరు చెయ్యరు. అందువల్లనే వారు జీవితంలో పతనమవుతారు. ఆంతరిక శక్తుల గురించి తెలుసుకొని ప్రవర్తిస్తే జీవితం సద్వినియోగం అవుతుంది.

ప్రకృతి శక్తులను నియంత్రించాలంటే వాటికి సరియైన శిక్షణ నివ్వాలి. అందుకు శ్రీరామకృష్ణులు ఇలా చెప్పారు: 'బాహ్యశక్తులను వెనకకు మరల్చు (మోడ్ ఫిరయే దావ్)'. ఆధ్యాత్మిక మార్గాన్ని అనుసరించడం ద్వారా అది సాధ్యమవుతుంది. అలా చేయాలంటే శాస్త్రాధ్యయనం అవసరం. జంతువులు ప్రకృతికి లోబడి జీవిస్తాయి. ప్రకృతిని అధిగమించే శక్తి మానవులకు మాత్రమే ఉంది.

చైతన్యం - జడ పదార్థాల కలయికే మనిషి. ప్రకృతి మనలో జడపదార్థాన్ని ఉంచింది. మనలో నుండి ప్రకటితమయ్యేది చైతన్యమే. ప్రకృతే ఉండి, చైతన్యమే లేకుంటే మనకేమీ కష్టం ఉండేది కాదు. చైతన్యం ఉండడం వల్లనే ప్రకృతికి మనం ఎదురు తిరుగుతున్నాం. నీతి, సంస్కృతి, నాగరకత అన్నీ కూడా ప్రకృతిని ఎదుర్కోవడం వల్లనే సంభవిస్తాయి. ఎల్లప్పుడూ మనలోని శుద్ధ చైతన్యాన్ని మనం ప్రకటించుకోవాలని చూస్తుంటాం. మానవుడు కేవలం జడంగానే ఉన్నట్లయితే ప్రకృతి మాయకు లోబడి పనిచేయాల్సి ఉంటుంది. ఒక్కొక్కసారి భగవన్మాయను తప్పించుకోవడం జ్ఞానికి కూడా దుస్సాధ్యమవుతుంది.

**జ్ఞానినాం అపి చేతాంసి దేవీ భగవతీ హి సా**
**బలాదాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి**

(దేవీమాహాత్మ్యం-1.155)

"జగన్మాత మహామాయగా ప్రపంచంలో ప్రకటితమయినప్పుడు అది జ్ఞానిని కూడా మాయలోకి లాగివేస్తుంది"అని దేవీమాహాత్మ్యంలో చెప్పబడింది. కాబట్టి మనం ఎప్పుడూ చాలా జాగ్రత్తగా ఉండాలి. బాహ్యప్రకృతిని జయించి అంతరంగిక శక్తిని తెలుసుకోవడమే నిజమైన వికాసం. ❖

సేకరణ : ఆర్. కృష్ణ



... 17వ పేజీ తరువాయి.


10
దైవ విగ్రహాలను విసిరి వేయగానే, సముద్రం వెంటనే శాంతించింది. ఏం ఆశ్చర్యం! మర్నాడు ఆలయంలో అర్చకులు దైవ విగ్రహాలు కనబడకపోవడంతో కంగారుపడిపోయారు. విగ్రహాలు లభించనేలేదు.
11
కొన్ని సంవత్సరాలు గడిచిపోయాయి... దైవ విగ్రహాలు కనపడకపోవడంతో తల్లడిల్లిపోయిన ఉడమలైయప్ప అనే భక్తుడు తరువాత, తాను క్రొత్తగా తయారుచేసిన సుబ్రహ్మణ్యస్వామి విగ్రహాన్ని తిరుచందూర్‌కు తీసుకువచ్చాడు. అప్పుడు అతడికి కలలో సుబ్రహ్మణ్య స్వామి కనిపించి...
భక్తా! దిగులు చెందకు. సముద్రం వద్దకు వెళ్ళు. నిమ్మపండు ఒకటి తేలుతున్నచోట నేను ఉన్నాను. పైన ఒక గరుడపక్షి ఎగురుతూ ఉంటుంది.
12
వెంటనే, నిద్రమేల్కొన్న ఉడమలైయప్ప కొంత మంది భక్తులతో సముద్రం వద్దకు వెళ్ళి విగ్రహాల కోసం వెతికాడు.
అదుగో నిమ్మపండు! రండి, అక్కడ మునిగి పోయిన దైవ విగ్రహాలను వెలికితీద్దాం.
భక్తులు సముద్రంలో దూకి విగ్రహాలను బయటకు తీసుకువచ్చారు.
13
రాజు సమక్షంలో విగ్రహాలను మళ్ళీ ఆలయంలో ప్రతిష్ఠించారు.
సుబ్రహ్మణ్యస్వామికి జయం! జయం!!
ఉడమలైయప్ప తయారుచేసిన శిలావిగ్రహం పాలయంకొట్టై త్రిపురాంతీశ్వర ఆలయంలో నేటికీ వెలసి ఉంది.
14
వీరపాండ్య కట్టబ్రహ్మనకి సుబ్రహ్మణ్యస్వామి పట్ల అమిత భక్తి.
మంత్రివర్యా! చందూర్ ఉత్తరం వైపు మాడా వీథిలో నిర్మించిన రాతి మండపంలో, ఈ మాఘమాసంలో సుబ్రహ్మణ్యస్వామికి విశిష్టసేవలు నిర్వర్తించాలి.
రాజా! మన్నించాలి. ఆ రోజు వడమలైయప్ప తరువాత కట్టిన మండపంలోనే సుబ్రహ్మణ్యస్వామి ఎప్పుడూ కొలువుతీరి అనుగ్రహించడం సంప్రదాయం.
లేదు, సంప్రదాయాన్ని మార్చండి.

**15** విశిష్టసేవా దినోత్సవం నాడు తాను నిర్మించిన రాతి మండపంలోకి సుబ్రహ్మణ్యస్వామిని ఆహ్వానించడానికి తమలపాకులు, వక్కలు మొదలైన వాటితో కట్టబ్రహ్మన వేచి ఉన్నాడు. దేవుణ్ణి చిన్నరథం(చప్పరం)లో కూర్చోబెట్టడానికి భక్తులు ప్రయత్నించారు. కానీ ఆయన కించిత్తు కూడా కదలలేదు. వేరే దారిలేక కట్టబ్రహ్మన వడమలైయప్ప మండపంలో ఉంచడానికి అంగీకరించాడు. వెంటనే సుబ్రహ్మణ్యస్వామి కదిలి చిన్న రథం(చప్పరం)లో ఆసీనులైనాడు.

**16** సుబ్రహ్మణ్యస్వామి ఊరేగింపుగా వస్తున్నప్పుడు కట్టబ్రహ్మన మనస్సు మార్చుకుని మళ్ళీ ఆయనను తన మండపంలో అమర్చాలనుకున్నాడు. ఏం ఆశ్చర్యం! మళ్ళీ రథంలోని విగ్రహాన్ని కదల్చలేకపోయారు. కట్టబ్రహ్మన తన పట్టుదల వదల్లేదు.



**17** అప్పుడు హఠాత్తుగా కుంభవృష్టి ప్రారంభమయింది.




**మ**నిషి సమర్పించే సంపదలను భగవంతుడు ఖాతరుచేస్తాడా? చేయడు. భక్తిని, ప్రేమను ఎవరు సమర్పిస్తారో అతడికి మాత్రమే భగవంతుని కృప లభిస్తుంది.

– భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస



# గ్రంథ పరిచయం

## శ్రీ భగవద్గీత



వ్యాఖ్యాత: భాగవతుల సుబ్రహ్మణ్యం
పేజీలు: 661 వెల: రూ. 200/-
ప్రతులకు: నవరత్న బుక్ హౌస్; 28-22-20, రహిమాన్ వీధి, అరండల్‌పేట, విజయవాడ- 520 002

వ్యాస మహర్షి వేదవిజ్ఞానాన్ని అందరికీ అందుబాటులో ఉండేలాగ అందించాలని అన్ని వేదాల సారాన్నీ "మహాభారతం"లో ఇమిడ్చారు. ఉపనిషత్ సారాన్ని తీసి భగవద్గీతగా రూపొందించారు. సాక్షాత్తు భగవానుడే తన అవతార తత్త్వాన్ని అర్జునుని ద్వారా లోకానికి అందించాడు. గీత సర్వధర్మకర్మ మర్మాలను బోధించే ఉత్తమ గ్రంథం. భగవద్గీతను చదివినట్లైతే నిత్యజీవితంలో మనం ఎదుర్కొనే సవాళ్ళకూ, సమస్యలకూ సమాధానాలు దొరుకుతాయి. దీనిని అందరూ సుళువుగా చదివి అర్థం చేసుకునేందుకు వీలుగా శ్రీ భాగవతుల సుబ్రహ్మణ్యంగారు సరళమైన తెలుగులో వ్యాఖ్యానించి అందించారు. వ్యాఖ్యాత తమదైన శైలిలో చేసిన ఈ వ్యాఖ్యానం అందరికీ ఉపయోగపడుతుందని నిస్సందేహంగా చెప్పవచ్చు. ప్రతీ అధ్యాయం చివరనా దాని మహాత్మ్యాన్ని వివరించే ఇతిహాసాన్ని క్లుప్తంగా ఇచ్చారు. ప్రతి ఒక్కరూ చదివి, చదివించాల్సిన గొప్ప గ్రంథం ఇది. ❖ - శ్రీమతి ఎన్. శేషు

## దైవ భైషజ్యము



గ్రంథకర్త: మహర్షి పెద్దశ్యాలన్న
పేజీలు: 176, వెల: 175/-
సంకలనకర్త: కపిలవాయి లింగమూర్తి
ప్రతులకు: కె. ప్రభాకర్ వర్ధన్, ఎల్.ఐ.జి.331, ఎ.పి. హౌసింగ్ బోర్డ్ కాలనీ, గద్వాల - 509 125

భగవంతుడు భక్తులకు కల్ప వృక్షము వంటి వాడని శ్రీరామకృష్ణుల ఉవాచ. దృష్టిననుసరించి భగవంతుని నామ రూపాలు మారుతూ ఉంటాయి. అటువంటి భగవంతుడు పెద్ద శ్యాలన్న గారికి భిషక్కుగా కనిపించటం విశేషం. దేవుడే సంసార సాగరాన్ని దాటించే నావికుడని, భవరోగాన్ని హరించే వైద్యుడని భక్తుల నమ్మకం గదా! శ్యాలన్న గారు రామ నామం ఎలా సర్వ రోగ హరమో చెప్తూ నామం గురించి, నామ మహిమ గురించి, మానసిక శక్తి ద్వారా రోగ నివారణ గురించి, వివరిస్తూ ఆధ్యాత్మిక శక్తులు, జప, ధ్యానాల ద్వారా మానసిక, బాహ్య వ్యాధులెలా నివారించ వచ్చో చక్కగా తెలియచేశారు. ❖ - ఎం.వి. నాగప్రసాద్

---

## శ్రీ మదరల్లకట్ట శ్రీ భ్రమరాంబా మల్లేశ్వరశతకము



తెలుగుసేత : పులవర్తి నూకాలరావు
పేజీలు: 80, వెల : రూ. 30/-
ప్రతులకు : శ్రీ పులవర్తి నూకాలరావు, 23-2-10, శ్రీ పూర్ణ సత్యాంబికా విహార్, వెంపటివారి వీధి, కాకినాడ-533 001.

## ఓంకార తత్త్వము



సంకలనకర్త : తోటపల్లి బాలకృష్ణ శర్మ
పేజీలు: 224, వెల : రూ. 111/-
ప్రతులకు : తోటపల్లి బాలకృష్ణ శర్మ ఇ.నెం. 8-14-47, మజీద్ రోడ్, వనపర్తి, పాలమూరు జిల్లా -509 103.

## భాస్కర శతకము



పండిత పరిష్కృతము
పేజీలు: 40, వెల : రూ. 15/-
ప్రతులకు : భరణి పబ్లికేషన్స్ ఇంటి నెం. 28-20-17/4, జానీ వీధి, అరండల్‌పేట, విజయవాడ - 520 002

## హరిఃఓమ్



రచయిత : మహ్మద్ అబ్దుల్ అజీజ్
పేజీలు: 120, వెల : రూ. 30/-
ప్రతులకు : మహ్మద్ ఫాతిమా అజీజ్ 15-7-12, సంతోషిమాత దేవస్థానం వీధి, నిదానందొడ్డి, అనకాపల్లి - 531 002

## బ్రహ్మర్షి దైవరాత



రచన : రావినూతల శ్రీరాములు
పేజీలు: 48, వెల : రూ. 20/-
ప్రతులకు : శ్రీ రావినూతల శ్రీరాములు, రమణస్థాన్ 10/228, వసంతపురి కాలనీ, మల్కాజ్‌గిరి, హైదరాబాద్ - 500 047

## దయాశతకమ్



సమర్పణ : శారదాకుమార్
పేజీలు: 126, వెల : రూ. 45/-
ప్రతులకు : శ్రీమతి ఎన్. విజయలక్ష్మి, శారదావిహార్, 24/589, రాజాగారి ప్లాట్స్, మూలాపేట, నెల్లూరు - 524 003



# స్వామి సర్వగతానందజీ మహరాజ్ మహాసమాధి

శ్రీమత్ స్వామి సర్వగతానందజీ మహరాజ్ బోస్టన్ (యు.ఎస్.ఏ.) రామకృష్ణ వేదాంత సొసైటీలో 2009 మే 3వ తేదీ ఉదయం 5.30 గంటలకు మహాసమాధి పొందారు. స్వామీజీ వయస్సు 96 ఏళ్ళు. పూజ్య స్వామీజీ తూర్పు గోదావరి జిల్లాలోని ముమ్మిడివరం గ్రామంలో 1912వ సంవత్సరంలో జన్మించారు. స్వామీజీ పూర్వాశ్రమ నామం నారాయణ.

భగవాన్ శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష సన్న్యాస శిష్యులైన స్వామి అఖండానందజీ మహరాజ్ ఆదేశం మేరకు 1934 డిసెంబర్ 3వ తేదీన ముంబాయి నుంచి కాలినడకన బయలుదేరి 1935 ఫిబ్రవరి 7వ తేదీన హరిద్వార్ వెళ్ళి అక్కడ కంఖల్ రామకృష్ణ మిషన్ కేంద్రంలో బ్రహ్మచారిగా చేరారు. 1936వ సంవత్సరంలో స్వామి అఖండానందజీ మహరాజ్ వారి వద్ద నుంచి మంత్రదీక్షనూ, 1944లో మాతృమూర్తి శ్రీశారదాదేవి శిష్యులైన స్వామి విరజానందజీ మహరాజ్ నుంచి సన్న్యాస దీక్షనూ స్వీకరించారు.

పూజ్య స్వామీజీ కంఖల్, కరాచీ, విశాఖపట్నం మిషన్ కేంద్రాలలో ఎనలేని సేవలందించారు. 1954లో స్వామి అఖిలానందజీ మహరాజ్ సహాయకునిగా బోస్టన్ వెళ్ళి అక్కడ రామకృష్ణ వేదాంత సొసైటీలో తమ సేవలను కొనసాగించారు. 1962 నుంచి 2001 వరకు బోస్టన్ కేంద్ర అధ్యక్షులుగా రామకృష్ణ వివేకానంద వేదాంత ప్రచారానికి అవిశ్రాంతంగా కృషి చేశారు. క్రియాశీల కార్యకలాపాల నుంచి వైదొలగినప్పటికీ పరితప్తులైన భక్తులకు సాంత్వన చేకూర్చుతూ, జీవిత పర్యంతం ఆధ్యాత్మికంగా వారికి మార్గదర్శకత్వం వహిస్తూ వచ్చారు.

పూజ్య స్వామీజీ తపోమయ, ప్రేమమయ ఆధ్యాత్మిక అనుభూతులతో కూడిన జీవితం ఎంతో మంది భక్తులకు స్ఫూర్తిప్రదాయకంగా విరాజిల్లినదనడం అతిశయోక్తి కాదు. ❖

## వార్తావాహిని



### అగ్నిప్రమాద బాధితులకు సహాయం

తూర్పుగోదావరి జిల్లా, రాజఒమ్మంగి గిరిజన ప్రాంతంలో 2009 ఏప్రిల్ 1న సంభవించిన అగ్నిప్రమాదంలో 103 కుటుంబాల వారు నిరాశ్రయులయ్యారు. **రాజమండ్రి రామకృష్ణ మిషన్** అగ్నిప్రమాద బాధితులకు లక్ష రూపాయల విలువచేసే దుప్పట్లు, చీరలు, లుంగీలు, బనియన్‌లు, తువ్వాళ్ళు, ప్లాస్టిక్ చాపలు, వంట పాత్రలు పంపిణీ చేసింది. ❖

నివేదిక : స్వామి అక్షరాత్మానంద

### స్వామీజీ స్మారక చిహ్నం



స్వామి వివేకానంద పరివ్రాజక సన్న్యాసిగా భారతదేశమంతా సంచరిస్తూ 1892లో బెంగుళూరు సందర్శించారు. అప్పుడు స్వామీజీ కొద్ది రోజులపాటు కాలప్ప సత్రంలో బస చేశారు. ఆ సమయంలో సుగప్ప అనే నగల వ్యాపారి ఇంటి గోడకి అమర్చి ఉన్న రాతి బల్లపై స్వామీజీ పలుమార్లు విశ్రమించారు. ఆ రాతి బల్లపై విశ్రమించిన యువ సన్న్యాసి కాలాంతరంలో విశ్వవిజేత స్వామి వివేకానంద అని వారికి తెలిసింది. స్వామీజీ స్పర్శచే పావనమైన ఆ రాతి బల్లను సుగప్ప కుటుంబీకులు 1997 జనవరిలో బెంగుళూరు రామకృష్ణ మఠానికి అప్పగించారు. ఇటీవల మఠ ప్రాంగణంలో స్వామీజీ స్మృతి చిహ్నంగా ఓ మండపం నిర్మించడం జరిగింది. అందులో ఆ రాతి బల్లను పదిలపరచి దానిపై స్వామి వివేకానంద విగ్రహాన్ని ప్రతిష్ఠించారు. ❖

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) 'వేదచూడామణి'** : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
- యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
- వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
- స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

**(ఆ) 'వేదార్థచూడామణి'** : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
- యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
- వయస్సు : 15 సం॥, ఆ పైన
- స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) వేదాధ్యాపకుడు** : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
- కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
- అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
- అనుభవము : 2 సంవత్సరములు
- సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

**(ఆ) వేదభాష్యాచార్యుడు** : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
- విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
- అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
- అనుభవార్హత : 5 సం॥
- సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

హైదరాబాద్ — కులప్రశాసకుడు




Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**



# సుబోధ

స్వాతి నక్షత్రం నింగిలో ఉన్నప్పుడు పడే వాన చినుకును గ్రహించడానికి ముత్యపుచేప సముద్రం అడుగు నుంచి ఉపరితలానికి వస్తుంది. అది తన చిప్పలను తెరచుకొని ప్రశస్తమైన స్వాతి వాన చినుకు పట్టుబడేవరకూ నీళ్ళ మీద తేలుతుంటుంది. చినుకు పట్టుబడగానే సముద్రపు అడుగున తన నివాసానికి వెళ్ళి, ఆ చినుకును చక్కని మంచి ముత్యంగా మారేవరకూ స్థిమితంగా అక్కడే ఉంటుంది. అలాగే తారక మంత్రోపదేశం చేసే సద్గురువు లభించడానికి ఒక చోటు నుంచి మరో చోటుకు సంచారం చేసే ముముక్షువులు కొందరు ఉంటారు. అలాంటి సద్గురువును చూసే భాగ్యం కలిగి, అతడి వల్ల తారక మంత్రోపదేశాన్ని పొందగానే, వారు (ముముక్షువులు) సమస్త సంగాలనూ వీడి, హృదయగుహాంతరాళంలో ప్రవేశించి, బ్రహ్మానందప్రాప్తి పర్యంతం (మంత్ర జపం చేస్తూ) అందులోనే నెలకొని ఉంటారు.

బ్రహ్మవేత్త అయిన సద్గురువుకి శాస్త్రపాండిత్యం లేకపోయినంత మాత్రాన నిరాశ చెందనవసరం లేదు. పుస్తకాల్లోని జ్ఞానాన్నంతటినీ మించిన దివ్యజ్ఞానం, సాక్షాత్కార రూపమైన తత్త్వజ్ఞాన సంపదగల సద్గురువు నుంచి పొందిన మంత్రాన్ని జపిస్తే బ్రహ్మానంద ప్రాప్తి తప్పక కలుగుతుంది. ❖

('శ్రీరామకృష్ణ బోధామృతం' నుంచి)

**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029
ఫోన్: 040–2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద**
సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**

# సురభి



భక్తురాలు (క్షీరోద్ బాల) : అమ్మా! నా మనస్సు కుటుంబ వ్యవహారాల వైపు కించిత్తు కూడా పోవడం లేదు. నన్ను లౌకిక వ్యక్తుల మధ్య వదలిపెట్టకండి. ఇదే నా ప్రార్థన.

మాతృదేవి: 'అమ్మాయీ! కుటుంబ జీవితం నిన్ను ఏం చేయగలదు? కుటుంబ జీవితం భగవంతుని కన్నా వేరైనదా ఏమిటి? భగవంతుడు సర్వత్రా ఉన్నాడు. ఆయన ఎక్కడ ఎలా ఏ స్థితిలో ఉంచుతాడో అక్కడే సంతృప్తితో నివసించు. ఆయనను శరణుజొచ్చి నువ్వు జీవించగలిగితే దేనికీ భయపడాల్సిన అగత్యం ఉండదు.

మరొక విషయం! గురుశిష్యులు కలిసి జీవించడం మంచిది కాదు. ఎందుకంటే గురువు దైనందిన జీవితాన్ని పరిశీలించే శిష్యుడు ఆయనను సామాన్య వ్యక్తిలా ఎంచడం కద్దు. ఇది శిష్యునికి చేటవుతుంది. గురువు ఇంటికి సమీపంలో విడిగా శిష్యుడు వసించి, రోజుకొకసారి వచ్చి ఆయనను దర్శించుకొని, ఆయన సాంగత్యంలో ఆనందిస్తూ ఉపదేశాలు స్వీకరించడం మంచిది. అలా శిష్యుడు అప్పుడప్పుడు గురువును కలుసుకోని పక్షంలో ఆయన బోధించింది మరచిపోవచ్చు. రోజూ ఇక్కడకు వస్తూ ఉండు'.

మాతృదేవి చేసిన ఈ ఉపదేశం నా శేషజీవితానికి స్పష్టమైన జీవన విధానాన్ని నిర్దేశించింది. ❖

('క్షీరోద్‌బాలా రాయ్' స్మృతులు)

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 66 | సంచిక: 7 | జూలై 2009



వ్యాసం వసిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషం ।
పరాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిమ్ ॥

కృష్ణద్వైపాయనం వ్యాసం సర్వలోక హితేరతం ।
వేదాబ్జభాస్కరం వన్దే శమాది నిలయం మునిమ్ ॥

వసిష్ఠుని మునిమనుమడూ, శక్తి మహర్షి మనుమడూ, పరాశరుని పుత్రుడూ, శుక మహర్షి తండ్రీ అయిన తపోనిధి వ్యాసునికి వందనం.

సర్వలోక హితాన్ని కోరేవాడూ, వేదాలనే కమలాలను వికసింపజేసిన సూర్యుడూ, అంతరింద్రియ బహిరింద్రియాది శుభగుణాలకు నిలయమైనవాడూ అయిన కృష్ణద్వైపాయనుడనే వ్యాసమునికి వందనం.

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

| | | |
|---|---|---|
| **మహారాజ పోషకులు**...... | రూ. | 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **రాజ పోషకులు**........... | రూ. | 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |
| **పోషకులు**................. | రూ. | 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు. |

| దాత పేరు | చిరునామా | రూ. |
|---|---|---|
| పోషకులు : జయా నాయక్, | విద్యుత్‌నగర్, అనంతపురం (కీ॥శే॥ శ్రీ ఎస్. గాంగే నాయక్ జ్ఞాపకార్థం) | 2,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ./డి.డి./చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు

శ్రీ వై. కృష్ణా రెడ్డి, పాలకల్, చిత్తూరు జిల్లా - 50 పాఠశాలలకు (మూడు సంవత్సరాలకు) 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను స్పాన్సర్ చేశారు.

స్ఫూర్తి వలెంటరీ ఆర్గనైజేషన్, అనంతపురం - 219 కారాగారాలకు (ఒక సంవత్సరానికి) 'శ్రీరామకృష్ణ ప్రభ' మాసపత్రికను స్పాన్సర్ చేశారు.

**ముఖచిత్రం :** విలు విద్యలో శిక్షణనిస్తూ అర్జునుడి ఏకాగ్రతను పరీక్షిస్తున్న గురువు ద్రోణాచార్యుడు.



| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 365 |

గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకి కుడి భాగంలో మీ చందా గడువు నెల పొందుపరచబడి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకొని, 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ చేయబడుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

- సర్క్యులేషన్ మేనేజర్



SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com

సంపాదకీయం



# విద్యార్థి చేయాల్సిన తపస్సు

యోగులూ, సాధువులూ, భక్తులూ భగవత్సాక్షాత్కారం కోసం చేసే ప్రయత్నమే 'తపస్సు' అని సాధారణంగా అందరూ చెప్పే అర్థం. కానీ ప్రతి ఒక్కరూ తమ తమ రంగాలలో అభివృద్ధిని సాధించడానికీ, బాధ్యతలను సవ్యంగా నిర్వర్తించడానికీ చేసే కృషిని కూడా 'తపస్సు' అని చెప్పవచ్చు. తపస్సు అంటే మనసును నియంత్రించి, చేపట్టిన కార్యంలో సంపూర్ణ ఏకాగ్రతను కలిగి ఉండడమే అని శాస్త్రాలు చెబుతున్నాయి. కాబట్టి ఏకాగ్రతను సాధించడానికి మనం చేయాల్సిన ప్రయత్నమే తపస్సు.

**విద్యకు నూతన నిర్వచనం:** విద్యార్థికి ఏది తపస్సు? 'విద్యార్థులకు చదువే తపస్సు'. విద్యార్థులు చదువనే తపస్సు ద్వారా సాధించవలసింది ఏమిటి? 'ఏకాగ్రత'.

"విద్య అంటే సమాచార సేకరణ మాత్రమే కాదు. ఏకాగ్రతను సాధించడమే విద్య యొక్క సారాంశం. మనస్సుపై సంపూర్ణ సాధికారతను సాధించేందుకు సహకరించేదే నిజమైన విద్య" అంటారు స్వామి వివేకానంద.

మనిషికీ మనిషికీ మధ్య భేదానికి కారణం వారిలో గల ఏకాగ్రతా శక్తిలోని తేడాయే. అందువల్ల విద్యార్థులు విషయ సేకరణ కన్నా ముందుగా ఏకాగ్రతను అలవరచుకోవడానికి ప్రయత్నించాలి. విద్యకు స్వామి వివేకానంద ఇచ్చిన నూతన నిర్వచనం ఇదే.

**నైపుణ్యతకు నిదర్శనం ఏకాగ్రచిత్తం:** సాధారణంగా మన ఆలోచనా శక్తిలో తొంభై శాతాన్ని వృథా చేయడం వల్ల అనుకున్న పనిలో ఆశించిన ఫలితాన్ని పొందలేకపోతున్నాం. ఎవరైతే తమ ఆలోచనలన్నింటినీ ఒకే విషయంపై కేంద్రీకరిస్తారో, వారే చేసే పనిలో అత్యంత నైపుణ్యాన్ని ప్రదర్శించగలరు. అతి తక్కువ సమయంలో అనూహ్యమైన ఫలితాలను పొందగలరు.

"నేను మళ్ళీ విద్యాభ్యాసం చేయాల్సి వస్తే విషయ సేకరణ కోసం సమయాన్ని వెచ్చించను. ముందుగా ఏకాగ్రతను పెంపొందించుకొని అప్పుడు అధ్యయనం చేస్తాను" అని స్వామి వివేకానంద ఏకాగ్రత ప్రాధాన్యాన్ని గురించి తెలిపారు. కాబట్టి విద్యార్థులు పుస్తక పఠనం కన్నా ముందుగా ఏకాగ్రతను అలవరచుకోవడానికి ప్రయత్నించాలి.

కురు పాండు పుత్రులకు ద్రోణాచార్యుడు విలువిద్యలో సమానంగా శిక్షణనిచ్చాడు. విలువిద్యలో శిష్యుల ప్రావీణ్యాన్ని పరీక్షించాలనుకొన్నాడు ద్రోణాచార్యుడు. ఒక పక్షి బొమ్మను తయారుచేసి, చెట్టు చిటారు కొమ్మకు వేలాడదీశాడు. ముందుగా ధర్మరాజును పిలిచి చెట్టు కొమ్మనగల పక్షిబొమ్మను చూపించి "ఆ పక్షితోపాటు ఇంకా నీకు ఏం కనిపిస్తున్నాయి" అని ప్రశ్నించాడు. ధర్మరాజు "గురుదేవా! చెట్టు, చెట్టు కొమ్మలు, పక్షి కనిపిస్తున్నాయి" అన్నాడు. ద్రోణాచార్యుడు మిగతా శిష్యులందరికీ అదే ప్రశ్న వేశాడు. కొందరు చెట్టు కనిపిస్తున్నదనీ, మరికొందరు కొమ్మలు కనిపిస్తున్నాయనీ, మరికొందరు పక్షి కనిపిస్తున్నదనీ... ఇలా వేరు వేరు సమాధానాలు చెప్పారు. చివరిగా అర్జునుణ్ణి ప్రశ్నించగా అందుకు అర్జునుడు "ఆచార్యా! నాకు పక్షి తప్ప మరేదీ కనిపించడం లేదు" అన్నాడు. ఆ పక్షి ఏ రంగులో ఉంది అని ద్రోణుడు మరలా అర్జునుణ్ణి ప్రశ్నించాడు. "ఇప్పుడు నాకు పక్షి కన్ను తప్ప వేరేమీ కనిపించడం లేదు" అని అర్జునుడు బదులిచ్చాడు. అర్జునుడి సమాధానం విన్న ద్రోణుడు వెంటనే "బాణం సంధించు" అని ఆజ్ఞాపించాడు. అప్పుడు అర్జునుడు బాణం వదిలిపెట్టగానే పక్షి కన్నుకు తగిలింది. అర్జునుడి అసమానమైన ఏకాగ్రతకు ద్రోణుడు ఆనందించి, ఆలింగనం చేసుకున్నాడు.

స్వామి వివేకానందకు బాల్యం నుంచీ అసాధారణమైన జ్ఞాపకశక్తి ఉండేది. పాఠశాలలో ఉపాధ్యాయుడు చెప్పిన పాఠాల్ని నరేంద్రుడు (వివేకానందుని బాల్యనామం) కళ్ళు మూసుకుని ఏకాగ్రతతో వినేవాడు. ఒకరోజు నరేంద్రుడు నిద్ర పోతున్నాడనుకొని ఉపాధ్యాయుడు అతణ్ణి మందలించి, అప్పటి వరకూ బోధించిన పాఠం నుంచి ప్రశ్నలడిగాడు. నరేంద్రుడు ఉపాధ్యాయుడు అడిగిన ప్రశ్నలన్నింటికీ సరైన సమాధానం చెప్పడంతో నరేంద్రుని అపార జ్ఞాపకశక్తికి ఉపాధ్యాయుడు దిగ్భ్రాంతుడయ్యాడు.

వివేకానందుని జ్ఞాపకశక్తిని తెలియచేసే ఎన్నో సంఘటనలు ఆయన జీవితంలో చోటుచేసుకున్నాయి. ఆయన జ్ఞాపకశక్తికి ఆశ్చర్యపడిన ఉపాధ్యాయులూ, అధ్యాపకులూ, దేశ విదేశాల్లో అనేక మంది మేధావులూ 'మీ జ్ఞాపక శక్తి వెనుక రహస్యం ఏమిటి' అని అడిగేవారు. అందుకు బదులుగా స్వామీజీ 'ఏకాగ్రతే అసలు రహస్యం' అని సమాధానమిచ్చేవారు. చేసే పనిలో

మనసును సంపూర్ణంగా కేంద్రీకరించగలిగితే ఈ సామర్థ్యాన్ని ఎవరైనా పొందవచ్చని చెప్పేవారు స్వామీజీ.

**ఆకర్షణల మధ్య ఏకాగ్రత సాధ్యమా?** మనస్సును కల్లోలపరిచే సాంకేతిక పరికరాలు- టీ.వీ.లు, సెల్‌ఫోన్లు, కంప్యూటర్లు, ల్యాప్‌టాప్‌లు, పామ్‌టాప్‌లు ఆ కాలంలో లేవు కాబట్టి అర్జునుడికీ, నరేంద్రుడికీ ఏకాగ్రత సాధ్యమైంది. మరి నేడు ఏకాగ్రతను భంగపరిచే ఎన్నో ఆకర్షణలు, ప్రలోభాల మధ్య పెరుగుతున్న మా లాంటి విద్యార్థులకు ఏకాగ్రత ఎలా సాధ్యం! అనే సందేహం నేటి విద్యార్థుల్లో కలుగక మానదు.



ఈనాడు విద్యార్థుల ఏకాగ్రతకు సాంకేతిక పరికరాలు పరోక్షంగా భంగం కలిగిస్తున్నాయి. కానీ ఆనాడు అర్జునుడూ, నరేంద్రుడూ ప్రలోభాల్ని ప్రత్యక్షంగా ఎదుర్కోవలసి వచ్చింది.

దేవతల అనుగ్రహంతో దివ్య అస్త్రాలను సంపాదించడానికి అర్జునుడు హిమాలయ పర్వత ప్రాంతాలకు వెళ్ళి తపస్సు చేయాలనుకున్నాడు. అస్త్రాల కోసం అరణ్యాలలో తపస్సు చేస్తున్న తన కుమారుని దగ్గరకు ఇంద్రుడు వెళ్ళి 'కుమారా! అస్త్రాల వల్ల ఏం ప్రయోజనం? నీకు భోగభాగ్యాలనూ, ఉత్తమ లోకాలనూ ప్రసాదిస్తాను' అన్నాడు. అందుకు అర్జునుడు 'దేవేంద్రా! నాకు భోగభాగ్యాలు వద్దు. అరణ్యంలో కష్టాలను అనుభవిస్తున్న నా అన్నదమ్ములను రక్షించడమే నా కర్తవ్యం. నాకు ఇప్పుడు కావలసిందల్లా దివ్యాస్త్రాలే' అని ఇంద్రుడితో కచ్చితంగా చెప్పాడు. సాక్షాత్తూ దేవేంద్రుడే వచ్చి భోగభాగ్యాలను ప్రసాదిస్తానని చెప్పినా అర్జునుడు ప్రలోభపడలేదు.

నరేంద్రుడు విద్యార్థిగా ఉన్న రోజుల్లో ఎంతోమంది స్నేహితులు అతని ఏకాగ్రతను భగ్నం చేయడానికి ఎన్నో రకాల ఆకర్షణలనూ, ఆశలనూ చూపించారు. మరెన్నో విధాలుగా ప్రయత్నించారు. కానీ విద్యార్థికి విద్యార్జనే కర్తవ్యమని గుర్తించిన నరేంద్రుడు ఆ ఆకర్షణలకు లోబడలేదు.

దివ్యాస్త్రాల్ని సంపాదించి తన అన్నదమ్ములను రక్షించాలనుకున్న అర్జునుడికీ, విద్యార్థిగా చదువే తన కర్తవ్యం అని తలచిన నరేంద్రుడికీ ఆకర్షణలు ఎదురవక తప్పలేదు.

Whatever you do, devote your whole mind, heart, and soul to it... ***- Swami Vivekananda***

అనుకున్న కార్యాన్ని సాధించడానికి మనస్సు, బుద్ధి, చిత్తాలను సంపూర్ణంగా నిమగ్నం చేయగలిగిన నాడు ఎలాంటి ప్రలోభాలైనా మన చిత్త ఏకాగ్రతను సడలించలేవు.

**సాంత్వననిచ్చే నిజమైన స్నేహితులు :** ఆధునిక పరికరాల వినియోగంలో తాత్కాలిక ఆనందాన్ని పొందుతున్న విద్యార్థులు జీవితాంతం అండదండగా ఉండే మంచి మిత్రుల సాంగత్యాన్ని అలవరచుకోవడం ఎంతైనా అవసరం. మరి ఆ మంచి మిత్రులు ఎవరు?

జార్జ్ బెర్నార్డ్ షా విద్యార్థిగా ఉన్న రోజుల్లో ఆటపాటలు, స్నేహితులతో షికార్లు, జల్సాలతో ఎక్కువ సమయాన్ని గడిపేవాడు. ఇదంతా గమనించిన అతని తండ్రి ఒకరోజు షాతో 'నువ్వు స్నేహితులతో ఇలా షికార్లు తిరగడానికి నేను అభ్యంతరం తెలపడం లేదు. కానీ జీవితాంతం నీతోనే ఉంటూ, నిన్ను సన్మార్గంలో నడిపించే మంచి మిత్రులతో సాంగత్యం ఏర్పరచుకో. ఆ మంచి మిత్రులు ఎవరంటే... మంచి పుస్తకాలే!' అని అన్నాడు. తండ్రి సలహాను పాటించిన షా మంచి పుస్తకాలను నిత్యం చదవడం అలవాటు చేసుకున్నాడు. తరువాతి కాలంలో అతడు ఆదర్శ వ్యక్తిగా, ప్రఖ్యాత రచయితగా పేరు గాంచాడు.

విద్యార్థులు ఏకాగ్రచిత్తంతో విద్యార్జన చేయాలంటే ప్రతీ క్షణాన్నీ సద్వినియోగపరచుకోవాలి. **'క్షణే నష్టే కుతో విద్యా, కణే నష్టే కుతో ధనం' –** 'ఒక్క క్షణమైనా వృథా చేసిన వారికి విద్య రాదు, ఒక్క కణాన్ని (ధాన్యపు గింజ) వృథా చేసిన వారికి సంపద కలగదు'. కాబట్టి విద్యార్థులు వ్యర్థ ప్రసంగాలతోనూ; దృశ్య, శ్రవణ పరికరాల వినియోగాల్లోనూ సమయాన్ని వృథా చేయకుండా జాగ్రత్త వహించాలి. పాఠ్యాంశాలతో పాటు మనస్సును మంచి ఆలోచనలతో నింపే పుస్తకాల్ని చదవాలి. ఏకాగ్రచిత్తంతో జ్ఞాన సముపార్జన కోసం ప్రతి క్షణాన్నీ వినియోగించడమే **'విద్యార్థి చేయాల్సిన తపస్సు'**. ❖

# ప్రాథమిక సూత్రాలు

– స్వామి సుప్రియానంద

‘మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ, అతిథిదేవోభవ’ – వీటిని భారతీయ సంస్కృతి యొక్క ప్రాథమిక సూత్రాలంటే బాగుంటుంది. ఎందుకంటే నేటి సమాజంలో మానవతా విలువలను పెంపొందించటానికి వీటి అవసరం ఎంతైనా ఉంది.

**మాతృదేవోభవ :** తల్లి తొలి గురువు. పిల్లవాడికి ప్రేమ, ఆప్యాయతలతో సన్మార్గాన్ని చూపే దేవత తల్లి. అలాకాక తన పిల్లవాడికి తినుబండారాలను ఇచ్చి “ఎవరికీ ఇవ్వవద్దు ఒక్కడివే తిను” అని చెప్పే తల్లి తన కుమారుణ్ణి స్వార్థపరునిగా మారుస్తుందనడంలో ఆశ్చర్యం లేదు.

ఉరిశిక్ష పడిన ఒక ఖైదీ తన తల్లితో చివరి సారిగా మాట్లాడుతూ “అమ్మా! నేను చిన్నప్పుడు పక్కింటి పెరటిలో తోటకూరను దొంగిలించిన రోజు నన్ను మెచ్చుకున్నావు. అలా చేయడం గొప్పపని అనుకొని దొంగగా మారి, చివరికి హంతకుణ్ణయ్యాను. నేను ఈ రోజు ఉరికంబం ఎక్కడానికి నువ్వే కారణం” అంటాడు. కాబట్టి తల్లి పిల్లలకు నేర్పించాల్సినవి అసూయాద్వేషాలను కాదు, ప్రేమాప్యాయతలను.



**పితృదేవోభవ :** క్రమశిక్షణను నేర్పే తండ్రి గురువు. ఒక తండ్రి తన కుమారుడితో “తొందరగా భోజనం చేసి చదువుకో” అని గట్టిగా చెప్పాడు. కానీ పిల్లవాడు ఆ మాటను లెక్క చేయలేదు. కారణం – తండ్రి రోజూ టీ.వీ. చూస్తూ రెండు గంటల సేపు భోజనం చేస్తాడు. క్రమశిక్షణ సహజంగా, క్రమంగా రావాలి. ఆధిపత్యంతో ఒకరిని శిక్షించవచ్చు కానీ వారిలో ‘క్రమశిక్షణ’ను తీసుకురాలేం.

**ఆచార్యదేవోభవ :** ఆచార్యుడు పిల్లవాడికి జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు. ఒక పాఠశాలలో ఉపాధ్యాయుడు, “తల్లితండ్రులు దైవ సమానులు. వారికి నమస్కరించాలి. మీలో ఎంతమంది అలా చేస్తున్నారు”అని అడిగారు. విద్యార్థులు ఎవరూ మాట్లాడలేదు. ఒక కొంటె పిల్లవాడు లేచి, “ప్రక్క తరగతిలోని మీ అబ్బాయి మీకు నమస్కరిస్తున్నాడా?” అని ఎదురు ప్రశ్న వేశాడు. ఉపాధ్యాయుడు ఇంటికి వెళ్ళి తన కుమారుడితో ఆ రోజు పాఠశాలలో జరిగింది చెప్పి, “ఇక నుండి నువ్వు రోజూ మీ అమ్మకూ, నాకూ నమస్కరించు” అని చెప్పాడు. అప్పుడు పిల్లవాడు “నాన్నగారూ! తాతయ్య, నాయనమ్మలకు మీరు ఎప్పుడూ నమస్కరించగా నేను చూడలేదు. ఇదేమిటి కొత్తగా నాకు పనిపెడుతున్నారు” అన్నాడు. దీన్ని బట్టి “మనం ఆచరణలో చూపిన వాటినే పిల్లలు అలవరుచుకుంటారు” అని తెలుస్తుంది.

**అతిథిదేవోభవ :** “నాయనా! ఎవ్వరూ పరాయి వారు కాదు. ఈ ప్రపంచమంతా నీదే!” అంటారు శ్రీశారదాదేవి. ఈ కర్మభూమిలో అందరూ కలిసిమెలసి జీవించాలి. అందుకనే అతిథులూ దేవుళ్ళే!

ఈ నాలుగు ప్రాథమిక సూత్రాలు మనం పాటించినప్పుడు అవే– భక్తి, రాజ, జ్ఞాన, కర్మ యోగాలుగా మన ఆధ్యాత్మిక జీవితంలో పరిణతి చెందుతాయేమో! కొంచెం ఆలోచిద్దాం. ❖



# మనసుంటే మన వెంటే దేవుడు

– స్వామి జ్ఞానదానంద

శ్రీరామకృష్ణులు సజీవులుగా ఉన్న కాలంలోనే అనేక మంది భక్తులకు దివ్య దర్శనాలు ఇచ్చారు. అందులో కొందరు భక్తుల అనుభవాలను తెలుసుకుందాం.

ఒకసారి ఢాకాలో విజయకృష్ణ గోస్వామి తన పూజా మందిరంలో ధ్యానం చేసుకొంటున్నాడు. హఠాత్తుగా గురుదేవులను చూశాడు. నిజానికి అప్పుడు గురుదేవులు దక్షిణేశ్వరంలో ఉన్నారు. ఇది తన భ్రమ అనుకొని అతడు గురుదేవుల దేహాన్ని తాకి చూశాడు. సాక్షాత్తూ గురుదేవులే అని గ్రహించాడు. విజయ్ కలకత్తాకు వచ్చి తన అనుభవాన్ని భక్తులకు తెలియజేశాడు.

నిత్యగోపాల్ ఘోష్ కూడా గురుదేవులను ఢాకాలో దర్శించాడు. ఆ సంఘటనను అతడు ఇలా వర్ణించాడు: "ఢాకాలో ఉన్నప్పుడు నేనెంతో విచారంగా ఉండేవాణ్ణి. నగర శివార్లలో ఉండే అడవి లాంటి ప్రదేశాన్ని శ్మశానంలా వాడుకొనేవారు. నేల మీద ఎవరో వ్యక్తి కూర్చుని ఉండడం కాస్త దూరం నుంచి చూసి ఆశ్చర్యపోయి అతడి వద్దకు వెళ్ళి, 'ఇక్కడ ఏం చేస్తున్నారు?' అని ప్రశ్నించాను. ఆ వ్యక్తి నాతో మాట్లాడాలనే కోరిక వెలిబుచ్చాడు. నాతో చాలా తక్కువే మాట్లాడినప్పటికీ ఆయన పలుకులు నాలోని విషాదాన్నీ, సంశయాన్నీ తొలగించివేశాయి. ఆయన లేచి నడుస్తూ ఆప్యాయంగా, 'నా ప్రియమైన నిత్యగోపాల్! నువ్వు ఇప్పుడు దేనిని ఆలంబనం చేసుకొని ఉన్నావో దానిని వదలకు' అన్నారు. ఆ తరువాత మళ్ళీ ఆయనను నేను చూడలేదు. విజయ్‌కు ఇదంతా పూసగుచ్చినట్లు తెలిపాను. అదే వ్యక్తిని అడవిలో తానూ చూసినట్లు విజయ్ చెప్పాడు. ఆ రోజు రాత్రి నాకొక అద్భుతమైన కల వచ్చింది. ఆ కలలో ఆ దివ్యపురుషునితో మాట్లాడుతున్నట్లూ, ఆయన వచనాలు వింటున్నట్లూ నాకు కనిపించింది. నా ఆనందం వర్ణనాతీతం."

సురేంద్ర మిత్రా తన పూజా మందిరంలో ప్రతి రోజూ ధ్యానం చేసేవాడు. ఒక రోజు అతడికి గురుదేవుల దివ్యత్వాన్ని పరీక్షించాలనే ఆలోచన వచ్చింది. ధ్యానం చేస్తున్నప్పుడు గురుదేవులు కనిపిస్తేనే ఆయనను అవతారంగా పరిగణించాలని నిశ్చయించుకొన్నాడు. ఎంతటి అద్భుతమంటే, కాసేపట్లో గురుదేవులను అతడు తన పూజా మందిరంలో దర్శించాడు. ఆ విధంగా గురుదేవులను పరీక్షించిన తరువాత సురేంద్ర ఆయనను ఆశ్రయించాడు.

ఒకసారి దేవేంద్ర దక్షిణేశ్వరానికి వచ్చినప్పుడు అతడికి మలేరియా జ్వరం సోకింది. వెంటనే గురుదేవులు బాబూరామ్‌ను తోడిచ్చి అతణ్ణి పడవలో కలకత్తాకు తిరిగి పంపించివేశారు. దేవేంద్ర తన బంధువుల ఇంటికి ఎలాగో చేరుకొని, అక్కడ స్పృహతప్పి పడిపోయాడు. నలభై ఒక్క రోజులు అతడు సన్నిపాతంతో పడకపట్టాడు.

తాను ఇంకా దక్షిణేశ్వరంలోనే ఉన్నాననుకొని, అతడు తరచూ శ్రీరామకృష్ణుల నామాన్ని ఉచ్చరించసాగాడు. బాధ విపరీతమైనప్పుడు అతడు కనులు తెరవగా, ఆశ్చర్యకరంగా మంచం పక్కన సాక్షాత్తూ శ్రీరామకృష్ణులు కూర్చుని కనిపించారు.

గురుదేవుల వద్ద మంత్రదీక్ష పుచ్చుకొన్న తరువాత ఏం జరిగిందో దేవేంద్ర ఇలా వర్ణిస్తున్నాడు: "ఆ సమయంలో సర్వత్రా నాకు గురుదేవులు కనిపించారు. వీధిలో నడిచిపోతున్నప్పుడు గురుదేవులు నా ముందు నడిచిపోతూ కనిపించేవారు. కొన్ని సమయాలలో నా వంక చూస్తూ వెళ్ళేవారు. నేను నిలబడ్డప్పుడు, కూర్చున్నప్పుడు ఆయన నా ముందు నిలబడి కనిపించేవారు. గురుదేవులు సదా నాతోనే ఉంటూ తానే నా సర్వస్వం, పరిరక్షకుడు అయినట్లు నాకు అనిపించింది". ❖

భగవానుని సేవలో

# భక్తశిరోమణి



ప్రేమ స్వరూపం అనిర్వచనీయం. నిజమైన ప్రేమికుడు, తాను ప్రేమించే వ్యక్తికి తన సర్వస్వం ధారపోసి, సేవలందిస్తాడు. అతను దాన్లోనే ఆనందం పొందుతాడు; తన జీవితం సఫలం అయిందని భావిస్తాడు. అత్యంత తీవ్రమైన ప్రేమ ద్వారా తన సుఖాల్ని కూడా త్యజించి గురుదేవుల సేవలో తరించిన భక్తశిరోమణి స్వామి రామకృష్ణానంద. ఆయన సేవా తత్పరతను తెలియజేసే రెండు సంఘటనల్ని మననం చేసుకుందాం :

మద్రాసులో శ్రీరామకృష్ణ మఠం నెలకొని ఉన్న భవనం కట్టిన కొద్ది సంవత్సరాలకే చాలాచోట్ల బీటలు వారింది. వాన కురిసినప్పుడల్లా పై కప్పులో ఏర్పడిన పగుళ్ళ నుంచి నీళ్ళు కారేవి.

ఒకనాటి రాత్రి పూజామందిరంలో కూడా పై కప్పు నుంచి వాన నీరు కారడం మొదలైంది. సరిగ్గా శ్రీరామకృష్ణుల చిత్రపటం మీద వాన నీళ్ళు పడుతున్నాయి. వెంటనే స్వామి ఒక గొడుగును తెచ్చి, రామకృష్ణుల చిత్రపటం మీద ఆ గొడుగు తెరిచి పట్టుకున్నారు. రామకృష్ణుల చిత్రపటాన్ని మాత్రం ఉన్నచోటు నుంచి కదల్చలేదు. అలా కదిలిస్తే, గురుదేవులకు నిద్రాభంగమవుతుంది అని వాన వెలిసే వరకూ ఆ రాత్రంతా గొడుగు పట్టుకుని స్వామి రామకృష్ణానంద అలాగే నిలబడ్డారు.

ఒకరోజు స్వామి విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో మధ్యలో ఎందుకో ఆయన మనస్సులో హఠాత్తుగా రామకృష్ణులు ఎంతగానో ఇష్టపడే వేడి వేడి లూచీలు తయారుచేసి, ఆయనకు తినిపించాలని కోరిక కలిగింది. అలా అనుకున్న తక్షణమే ఆయన లేచి పిండి కలిపి, లూచీలు చేసి, వేయించడం మొదలుపెట్టారు. శ్రీరామకృష్ణుల (చిత్రపటం) ముందు ఒక పళ్ళెం ఉంచారు. అప్పటికప్పుడు వేడి వేడిగా కరకరలాడుతున్న లూచీలను ఒకదాని తరువాత మరొకటిగా ఆ పళ్ళెంలో వేస్తూ, గురుదేవులకు వాటిని నివేదించారు. శ్రీరామకృష్ణులు తన ఎదురుగా కూర్చొని, తన కిష్టమైన లూచీలను ఆస్వాదిస్తున్నారనే అనుభూతి ఆయనకు కలిగింది. ❖

(జూలై 20న శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన **స్వామి రామకృష్ణానంద జయంతి**)

---

బలరామ్ బోస్ ఆఖరి కుమార్తె కృష్ణమయి. ఒకరోజు తమ ఇంట్లో స్వామి బ్రహ్మానందజీ (రాజా మహరాజ్), స్వామి శారదానందజీ (శరత్ మహరాజ్) విందు భోజనం చేస్తున్నట్లు ఆమె కలగన్నది. తన కల నిజం కావాలని తలచి ఒకరోజు స్వాములిద్దరినీ తమ ఇంటికి సాదరంగా విందుకు ఆహ్వానించింది. స్వాములిద్దరూ ఆ రోజు బలరామ్ ఇంటికి విచ్చేశారు. రాజా మహరాజ్ వద్ద బలరామ్‌బోస్ మనుమలు, మనుమరాళ్ళకు బాగా చనువు. స్వాములు రావడం వాళ్ళకు ఎంతో ఆనందదాయకమయింది. కృష్ణమయి అమిత భక్తి ప్రపత్తులతో అనేక వంటకాలు చేసి స్వాములకు విందు ఏర్పాటు చేసింది. స్వాములు కూడా ఆమె సేవలను ఎంతో ప్రీతితో స్వీకరించారు. మధ్యాహ్నం కాసేపు విశ్రాంతి తీసుకున్న తరువాత, స్వాములు బేలూర్ మఠానికి బయలుదేరారు. బండి ఎక్కబోతూ రాజా మహరాజ్ బలరామ్‌బోస్ పెద్ద మనుమరాలితో 'మీ అమ్మను తరచూ ఇలాంటి కలలు కనమని చెప్పు!' అని నవ్వుతూ అన్న మాటలు అక్కడున్న వారందరికీ వినోదాన్ని పంచాయి. ❖



స్వామి భూతేశానంద
(1901-1998)

(స్వామి భూతేశానందజీ మహరాజ్ స్మృతులు– 'రసబోధ' పుస్తకం నుంచి)

సేకరణ: బ్రహ్మచారి సేవాచైతన్య



**పరమేశ్వరుని పరిరక్షణలో ...**

**స్వామి జపానంద స్వీయ అనుభవాలు -25**

# దయగల దేవుడు ద్వారకానాథుడు

స్వామి జపానంద చాతుర్మాస దీక్షాకాలం ద్వారకలో గడుపుదామన్న ఆలోచనతో ప్రయాణమయ్యారు. పోరుబందర్ నుంచి సుదామపురి మీదుగా ద్వారక వెళ్ళారు. దోవలో అయోధ్యవాసి అయిన ఒక వైష్ణవ భక్తుడు కూడా కలిశారు. అలా ఇద్దరూ కలసి ద్వారక చేరుకున్నారు.

ద్వారకలో ఇద్దరూ గోమతీనదిలో స్నానం చేసి, దైవ దర్శనం చేసుకున్నారు. ఆ తరువాత అక్కడ ఉండడానికి సరైన వసతి కోసం వెతకడం ప్రారంభించారు. వైష్ణవ సత్రంలో వైష్ణవ భక్తునికి వసతి లభించింది. కానీ జపానంద చాతుర్మాస సమయమంతా అక్కడ గడపాలని అనుకున్నారు. అన్ని రోజులు వైష్ణవసత్రంలో బస ఇవ్వడానికి సత్రం అధికారులు నిరాకరించారు.

శంకర భగవత్పాదులు స్థాపించిన శంకర మఠానికి వెళ్ళారు. పీఠాధిపతి ఆ సమయంలో అక్కడ లేరు. ఆ సమయంలో మఠ కార్యకలాపాలు చూసే అధికారి ప్రవర్తన బాగాలేదు. అందుకని అక్కడ నుంచి వెళ్ళిపోతుండగా అక్కడే ఉన్న మరొక వ్యక్తి "శ్మశానం దగ్గర నదీ తీరంలో ఒక కృత్రిమ గుహ ఉంది. అక్కడ ఉండే సాధువు ఈ మధ్యనే దివంగతులయ్యారు. ప్రస్తుతం అక్కడ ఎవరూ లేరు. పక్కనే ఒక బావి ఉంది. మీరు అక్కడ ఉండవచ్చు" అని స్వామి జపానందతో చెప్పాడు.

నదీతీరంలో ఇటుకలు పేర్చి ఆ గుహ కట్టారు. లోపల అంతా ఇసుకతో నిండి ఉంది. అక్కడకు తీసుకుని వచ్చిన వ్యక్తి గుహ లోపల అంతా శుభ్రం చేశాడు. అక్కడ బావి నీళ్ళు కొంచెం ఉప్పగా ఉండడం వల్ల నది నుంచి నీళ్ళు తెచ్చి కమండలం నిండా నింపి పెట్టాడు. మర్నాడు ఉదయం ఆలయంలో కలుస్తానని చెప్పి అతను వెళ్ళిపోయాడు. ఏకాంతంగా ఉన్న ఆ ప్రదేశం సన్న్యాసికి చాలా నచ్చింది. రాత్రి ప్రశాంతంగా గడిచి పోయింది. ఒక వైపునున్న చిన్న కిటికీలో నుంచి చల్లటి గాలి వీస్తోంది. మర్నాడు ద్వారకాధీశుని దర్శనార్థం ఆలయానికి వెళ్ళారు. వైష్ణవ భక్తుడు కూడా వచ్చాడు. ఇద్దరూ శ్రీకృష్ణుని లీలల గురించి మాట్లాడుకున్నారు. మధ్యాహ్నం అవుతూ ఉండగా వైష్ణవ భక్తుడు తన నివాసానికి వెళ్ళిపోయాడు. సన్న్యాసి కొంచెంసేపు అక్కడే కూర్చొని, తన నివాస స్థానమైన గుహకు తిరిగి వచ్చారు. సన్న్యాసికి ఎవరూ భిక్ష ఇవ్వలేదు. అందువల్ల రోజంతా నీళ్ళు తాగి గడిపారు. శ్రీకృష్ణుని రాజ్యమైన ద్వారకలో మొదటి రోజు ఉపవాసం ఉండాల్సి వచ్చింది.

సన్న్యాసి మర్నాడు ఉదయం లేచి, నదిలో స్నానం చేశారు. ఆలయానికి వెళ్ళి ద్వారకా నాథుణ్ణి దర్శించుకోవాలనుకున్నారు కానీ చాలా నీరసంగా ఉండడం వల్ల గుహకు తిరిగి వెళ్ళిపోయారు. 'ఇలాగే నీరసంతో ఇక్కడే జీవితం ముగిసిపోతుందేమో! తీర్థస్థలంలో అదే అయితే మంచిదే. అంతా భగవంతుడి దయ' అనుకున్నారు.

సమయం మధ్యాహ్నం రెండో మూడో అయి ఉంటుంది. ఇద్దరు స్త్రీలు ఒక బాలుడితో కలసి అక్కడకు వచ్చారు. "మహరాజ్! ఈ రోజు మీరు ఆలయానికి రాలేదేమి? నిన్న కూడా మీరు చాలా నీరసంగా కనిపించారు.



ఆరోగ్యం బాగా లేదా? నిన్న భోజనం ఎక్కడ చేశారు?" అని ఒక స్త్రీ అడిగింది.

సమాధానం చెబుతున్నట్లు సన్న్యాసి కమండలం చూపించారు. వెంటనే ఆమె అర్థం చేసుకుని "అయ్యో! మీరు రెండు రోజులుగా ఏమీ తినలేదు. బాబూ త్వరగా బజారుకి వెళ్ళి వీరికోసం తినడానికి ఏమైనా తీసుకుని రా" అని ఆ బాలుణ్ణి బజారుకి పంపింది. బాలుడు తినుబండారాలు తీసుకొని రాగానే అవన్నీ ప్రేమతో సన్న్యాసికి పెట్టారు. ఆ తరువాత నిత్యం ఆమె వచ్చి, సన్న్యాసి యోగక్షేమాలు కనుక్కునేది; భోజన సదుపాయాలు కూడా చూసేది. ద్వారకానాథుని దయ వల్ల స్వామి జపానందజీ చాతుర్మాస దీక్ష నిర్విఘ్నంగా పూర్తిచేశారు. ❖

**అనువాదం : శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**



# దేవీ వైభవం

ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

(...గత సంచిక తరువాయి)

ఏ దేవత దగ్గరకు వెళ్ళినా ఆ దేవతలో మనకు అభయముద్ర, వరదముద్ర అనే రెండు ముద్రలు కనిపిస్తాయి. అభయముద్ర అంటే నీ భయాలు నేను పోగొడతాననే రక్షణ. వరదముద్ర అంటే కురిపించడం. అభయముద్ర ఊర్ధ్వాన్నీ (పరతత్త్వాన్నీ), వరదముద్ర భగవత్ శక్తి వలన లభించే కోరికల్నీ సూచిస్తాయి. కానీ అమ్మ దగ్గర ఆ ముద్రలు లేవు. ఎందుకంటే ఆవిడ నాలుగు చేతుల్లో మనస్సు, ఇంద్రియాలు, రాగద్వేషాలూ పట్టుకుని ఉంది. అదే ఆత్మ తత్త్వం యొక్క విశేషం. ఎవరైతే ఈ నాలుగింటినీ నిగ్రహిస్తారో వారికి ఆత్మతత్త్వం అవగత మవుతుంది. మన బ్రతుకును బాధ పెట్టే ఈ నాలుగింటినీ అమ్మకి అప్పచెప్తే అమ్మ అదుపు చేస్తుంది.

*త్వదన్యః పాణిభ్యా మభయవ రదోదైవత గణాత్వమేకా నైవాసి ప్రకటితవ రాభిత్య భినయాః భయాత్రాతుం దాతుం ఫలమపిచ వాంఛాసమధికం శరణ్యేలోకానాం తవహి చరణావేవ నిపుణౌ* – 'ఇతర దేవతలు అభయ వరద ముద్రలు రెండూ చూపించాలి. కానీ నువ్వలా అక్కర్లేదు అమ్మా' అని శంకరుల వారు అన్నారు. *భయాత్త్రాతుం దాతుం ఫలమపిచ వాంఛాసమధికం* = భయాల నుంచి రక్షించి, మన అవసరాల్ని తీర్చేది అమ్మ. అమ్మ రెండు చరణాలూ కనపడేలా కూర్చుంటుంది. ఎందుకంటే అమ్మ పాదాలు అభయ, వరద స్థానాలు. సత్య ప్రసాదిని, క్షిప్రప్రసాదిని అనే నామాల మర్మం ఇందులో స్ఫురిస్తుంది. ఆ దివ్య చరణాలు, అమ్మ రూపంలో ఉండే శివశక్త్యైక్య లక్షణం, మన జీవితాన్ని కల్లోలపరిచే మనస్సు, పంచ తన్మాత్రలు, రాగ ద్వేషాలు– వీటిని నియంత్రించి ఆత్మ స్వరూపాన్ని ఆవిష్కరింపజెయ్యడం – ఇన్నీ అమ్మ రూపంలో ఉన్నాయి. అందుకు ఆ తల్లి స్వరూపాన్ని చూసినప్పుడు ఈ భావన అంతా మనస్సుకు పట్టి, ఈ భావనతో అమ్మపై భక్తి పెరిగి, ఈ భక్తి ధ్యానంగా పరిణమించి, ధ్యానం జ్ఞానమై, జ్ఞానం ఆ దేవత కైవల్యమనే స్థితికి తీసుకు వెళ్ళడమే ఉపాసన యొక్క అసలు పరమార్థం.

ఇలా మనం లలితా మహా త్రిపురసుందరీ తత్త్వాన్ని వ్యాఖ్యానించుకున్నాం. అమ్మ యొక్క ఈ దయను మనకు బోధించి అమ్మను ఎందుకు ఆశ్రయించాలి అనే విషయాన్ని చెబుతూ, పురాణాలు, ఆగమాలు ఎన్నో విషయాలు చెప్పాయి. పురాణాలు అమ్మ పేరు కానీ, అమ్మ బీజాక్షరం కానీ తెలిసికానీ తెలియకకానీ – ఎలా అన్నా కూడా అది దివ్యమైన ఫలతాన్నిస్తుందని చెబుతున్నాయి. అమ్మ నామ మహిమ, అమ్మని ఆశ్రయించిన మహిమ, అమ్మ ఆరాధన మహిమలను చెప్పి అనేక పురాణాలు మనకు అభయ మార్గాలనూ, వరద మార్గాలనూ చూపిస్తున్నాయి. ఇహలోక సుఖాలు, పరలోక సుఖాలు, పారమార్థిక సుఖమైన కైవల్యం – ఈ మూడింటినీ ఇవ్వగలిగే తల్లి ఆ జగదంబిక అనే విషయం మనకు అన్ని పురాణాలలోనూ, ఉపాసకుల స్వానుభవంలోనూ స్పష్టంగా అవగతమవుతోంది.

మనకు కావలసిన బ్రహ్మవిద్య అంతా ప్రస్తావితమైన ఒక దివ్యగాథను చెప్పుకోబోతున్నాం.

మార్కండేయ పురాణంలో వేదవ్యాస మహర్షి ఇచ్చిన 'దేవీమాహాత్మ్యం' అది. దీనిని 'సప్తశతి' అంటారు. ఉపాసనా మార్గంలో దీన్ని ప్రయోగాలలో చూపినప్పటికీ ఏడువందల మంత్రాలుగా విభజన చేశారు. దాన్ని ఉపాసనలో వినియోగించినపుడు చండీ సప్తశతి, చండీ హోమం, చండీ యాగం – ఇలా చెప్పారు. చండీహోమం అనగానే అరిష్టాలన్నీ పోతాయి, సుఖాలు వస్తాయి, శత్రునాశనం జరుగుతుంది అని స్ఫురిస్తుంది. బ్రహ్మవిద్య అంతా దీనిలోనే ఉంది. ఈ బ్రహ్మవిద్యను చెప్పిన మరొక సప్తశతి భగవద్గీత.

దేవీ మాహాత్మ్యంలో అపూర్వమైన ప్రారంభం కనిపిస్తుంది. దీనిలో చెప్పిన కథలన్నీ ఇతర పురాణాలలో ఉన్నవే. దీనిలో ముఖ్యమైనవి – మధు కైటభ సంహారం,

మహిషాసుర మర్దనం, చండ ముండ శుంభ నిశుంభ రాక్షససంహారం. కానీ ప్రారంభం 'సావర్ణిః సూర్య తనయౌ యోమను కథ్యతేష్టమః నిశామయ తదుత్పత్తిం విస్తరాద్గతో మమ' అని మొదలుపెడతారు. అంటే మార్కండేయ పురాణం మన్వంతరాల కథను చెబుతూ, సావర్ణి మన్వంతరంలోని కథను చెబుతోంది. సావర్ణి మన్వంత రానికి అధిపతి అయిన సావర్ణి అనే మనువు ఎలా ఉత్పన్నమయ్యాడో చెబుతోంది. 14 మన్వంతరాల మనువులు ఎప్పుడూ ఉంటారు; వాళ్ళ వంతు వచ్చినప్పుడు వాళ్ళు దానికి పాలకులు. ఈ మనువులు సాక్షాత్తూ నారాయణ సౌర శక్తులతో కూడుకున్న వారు.



ఇప్పుడు నడుస్తున్నది వైవస్వత మన్వంతరం, ఇది ఏడవది. దీని తరువాత రానున్నది సావర్ణి మన్వంతరం, దీని అధిపతి అయిన సావర్ణి ఇప్పుడూ ఉన్నాడు. ఇప్పుడు చెప్పబోయే సావర్ణి మన్వంతరం కథ రెండవ మన్వంతరంలో జరిగిందట. అప్పుడు ఒక రాజు ఉండేవాడు. ఆ రాజుకు అమ్మ వారి అనుగ్రహం వల్ల సావర్ణి మనువుగా అయ్యే యోగ్యత లభించింది.

సావర్ణిః సూర్యతనయ – అమ్మ వారి అనుగ్రహం పొందిన తరువాత అతను సూర్య పుత్రుడయ్యాడు. ఇక్కడ సావర్ణి మనువు కథ క్లుప్తంగా ఉంటుంది, అమ్మ కథే ఎక్కువ.

సప్తశతిలో ఒక్కొక్క శ్లోకంలో అమ్మవారికి సంబంధించిన ఒక్కొక్క బీజాక్షరాలున్నాయి. ఋషులు రచించిన శ్లోకాలను అనువదిస్తే, భావం అనువదితమవుతుందే తప్ప శక్తి అనువాదం కాదు; శక్తిని అనువదించలేం! 'భాషా రూపా బృహత్ సేనా' – అని ఊరికే అనలేదు. ఆ పలుకులో ఉన్నది దేవతాశక్తి. మహర్షులు రచించారంటే అందులో ఏవో శక్తులు పెడతారు. అందుకే వాటిని పారాయణ చేస్తే అంత ఫలితం. అప్పయ్య దీక్షితులవారు ఒక్కశ్లోకానికి ఉన్న అంతరార్థం మనకి వివరించారు. "సావర్ణిః సూర్య తనయః యో మనుః కథ్యతేష్టమః" అన్నదానిలో మనుః అంటే మంత్రం. ఇక్కడ ఒక మనువు చెప్పబడుతోంది అంటే ఒక మంత్రాధిదేవత ప్రస్తావితమవుతోంది. ఆ ఉత్పత్తి చెబుతున్నానన్నాడు, ఉత్పత్తి అన్నప్పుడు ఆ మంత్రాధిదేవత అయిన అమ్మ ఉత్పత్తి, సావర్ణి యొక్క ఉత్పత్తి కాదు. అందుకు 'నిశామయ తదుత్పత్తి' – తత్ ఉత్పత్తిం – తత్ యొక్క ఉత్పత్తి – అదెవరు; మనుః = మంత్రం. ఆ మంత్రం ఎలాగ ఉన్నదో అది చెప్తున్నారు. 'సావర్ణిః' అంటూ ప్రారంభమే 'సా'తో మొదలుపెట్టారు. కేనోపనిషత్తులో అమ్మ వారి గురించి 'సా బ్రహ్మేతి' అని వస్తుంది. అలాగే 'సాదేవీ జగదండ మసృజతః సైషా సా యేషా దేవీ' – 'సా' అనేది అమ్మకే, మరెవరికీ లేదు. 'సా' అంటే ఆమె అని అర్థం. సావర్ణి అంటే 'ఈం' అని అర్థం. 'సూర్యతనయః' అంటే సూర్యునికి సంబంధించినది కనుక తేజస్సు అని అర్థం. తేజోవాచకమైన అక్షరం 'ర' కారం తీసుకోవాలి. మంత్రోద్ధారణం అంటే అలా ఉంటుంది. "ఈం", "ర" – రెండు వచ్చాయి. 'యో మనుః కథ్యతే అష్టమః' – య అష్టమః అంటే "య" శబ్దం నుండి ఎనిమిదవది (య, ర, ల, వ, శ, ష, స, హ) – హ. ఇప్పుడు 'ఈం ర హ' – ఇది అటువైపు నుండి చదవాలి. ఋషులు మంత్రం నేరుగా చెప్పరు. కావ్యాల్లో, శ్లోకాల్లో మంత్రం నేరుగా చెప్పరాదు. మంత్ర మర్యాద చాలా జాగ్రత్తగా కాపాడాలి. ఇందులో ఎంత జాగ్రత్తగా మంత్రం నిబద్ధం చేశారో! అలా 'హ ర ఈం' కలిపితే "హ్రీం" అయింది. "హ్రీం" బీజం భువనేశ్వరి అయిన జగదంబికది. హ్రీం బీజస్వరూపిణి. ఆ తల్లి యొక్క 'ఉత్పత్తిం నిశామయ' వివరిస్తున్నారు, విను' అంటున్నాడు మార్కండేయుడు. సావర్ణి మనువు కథ భౌతికార్థాన్ని చెప్తే, అంతరార్థం అమ్మ గురించి తెలియజేస్తుంది. ❖ **సశేషం**

# మనస్సును జయించడానికి మందు!

నాయనా! రామా! ఇప్పుడు ఈ 'చిత్తం' అనే ఘోర వ్యాధిని నిర్మూలించడానికి ఒక గొప్ప 'ఔషధం' మీ అందరి ముందూ ఉంచుతాను. ఈ ఔషధం సేవించడానికి ఎవరూ ఎక్కడికీ వెళ్ళనక్కర్లేదు; ఎవ్వరినీ ఆశ్రయించవలసిన అవసరం లేదు. ప్రతి ఒక్కరి అధీనంలోనూ ఉన్న ఔషధం ఇది. బాహ్య ప్రయత్నాలు, ఇతరుల సహాయం అవసరం ఉండదు. ఇది పురుషార్థ సాధకం. ఉత్తమ సుఖదాయకం కూడా.

ఆ 'ఔషధం' విశేషాన్ని చెబుతున్నాను. శ్రద్ధగా వినండి: "ఇష్ట వస్తువుల పట్ల ఏర్పడే వృత్తిని త్యజించటం". ఈ 'చిత్తం' అనే బేతాళుణ్ణి నిరోధించాలంటే 'వాంఛిత వస్తువు'... అనే దాన్ని త్యజించివేయాలి. మంచి విషయాలను విని, మననం చేయగలిగిన మనస్సు గల ఓ రామచంద్రా! దుఃఖాగ్నిలో పరితప్తమవుతున్న ఈ మనస్సును మరొక మనస్సుతో జయించివేయాలి. మనస్సుతోనే మనస్సును జయించాలి. ఈ రెండవ మనస్సును చింతా రాహిత్యం, శాస్త్ర-సత్సంగాలు, ధీరత్వం, ప్రశాంతతలతో నింపి వేయాలి.



ఒక బాలుడు దుష్ట-తుచ్ఛ కార్యాలు నిరంతరం చేస్తున్నాడనుకో! అప్పుడు ఏం చేస్తాం? అతణ్ణి అనేక ఉపాయాలతో సరిదిద్దడానికి ప్రయత్నిస్తాం. సామ, దాన, భేద, దండోపాయాలను సమయోచితంగా తగినంతగా ఉపయోగించి అతణ్ణి మరొక ఉత్తమ కార్యంలో వినియోగిస్తాం. అలాగే మనస్సుకి గల 'దృశ్యాసక్తి' అనే ఒక భాగాన్ని "దృశ్య తిరస్కృతి.. ఆత్మాంగీకారం" అనే మరొక భాగంతో నియమించాలి. సమయోచితంగా ఈ నాలుగు ఉపాయాలూ ఉపయోగిస్తూ ఉండాలి. ఇందులో కష్టం ఏమీ లేదు. కొంత ప్రయత్నశీలుడవై, "ఈ దృశ్యం వాస్తవం కాదు కదా! దీనిలో నాకు ఆసక్తి ఎందుకు ఉండాలి? కాబట్టి అన్ని పరిస్థితులలోనూ, అన్ని వేళలలోనూ 'ఈ దృశ్యం అవాస్తవమే' అనే ఎరుక కలిగి ఉంటాను" అని నిర్ణయించుకో. నీ దృష్టిలో ఈ దృశ్యం అవాస్తవమైనదిగా సుస్థిరపడినప్పుడు ప్రాప్తించే స్థితినే 'సమాధి' అని అంటున్నాం. అలాంటి నిశ్చల సమాధి స్థితిలో నియమితులై ఉన్నవారు ఇక ఆ యా కార్యక్రమాలను నిశ్చింతగా, అనాసక్తి పూర్వకంగా, సంగరహితంగా, ఉద్వేగరహితంగా నిర్వర్తించవచ్చు.

ఓ రాఘవా! బాహ్య విషయాలను అభిలషించడం అనే జాడ్యాన్ని నిరాకరించడం (లేక) త్యజించడం నీ అధీనంలోనే ఉంది సుమా! దానికి గురువులు గానీ, మరింకెవరో గానీ ఏం చేయగలరు చెప్పు? నీవే దాని కోసం ప్రయత్నించాలి. అలాంటి ప్రయత్నం నీకు సర్వదా హితకరం.

అభిలాషను జయించడం అనే వైరాగ్యవృత్తిని అనుసరించని వాడు కీటకంతో పోల్చదగినవాడు.

శ్రీరాముడు: స్వామీ! ఏవేవో రమణీయమైన వస్తువులు మా ఎదుటకు వస్తూ, పోతూ ఉంటాయి. వాటి పట్ల ఆకర్షణ - వికర్షణలు ఏర్పడకుండా చూసుకోవడం ఎలా సాధ్యం?

శ్రీ వశిష్ఠ మహర్షి: ఆత్మ సాక్షాత్కారరూప భావన వల్ల అది సుసాధ్యమే! రమణీయమైన - అరమణీయమైన వస్తువులు, ఇష్టమైన వారు - అనిష్టమైన వారు తారసపడడం కద్దు! అయితే, ఇవన్నీ కూడా పరమోత్తమమైన పరబ్రహ్మ రూపాలే, పరమాత్మకు చెందినవే కదా!" అని భావిస్తూ ఉండు. అప్పుడు గొప్ప మల్లయోధుడు, ఒక బాలుణ్ణి జయించినట్లు నీవు ఈ చిత్తాన్ని జయించగలవు.

ఓ జనులారా! ధ్యానం, ప్రార్థన, తపస్సు, పూజ, దానం, సత్సంగం, విచారణ లాంటి ఆత్మ సాక్షాత్కారరూప పురుష ప్రయత్నాలను మీరు ఆశ్రయించండి! అప్పుడే మనస్సును తప్పక జయించగలరు. ఆ విధంగా జయించిన మనస్సు అప్రయత్నంగానే బ్రహ్మాన్ని పొందుతుంది. ❖

('శ్రీవసిష్ఠ రామ సంవాదం'
ఉత్పత్తి ప్రకరణం ఉత్తరార్ధం నుంచి)
**అనువాదం : వై. హెచ్. రామకృష్ణ**

ధీరవాణి

-స్వామి వివేకానంద

# ప్రోత్సాహంతో పురోభివృద్ధి!



ఐరోపాలో అనేక నగరాలలో సంచరించాను. అక్కడ పేద ప్రజలకు సైతం లభిస్తున్న చదువు, సౌఖ్యాలను చూశాను. వెంటనే మన పేద ప్రజల స్థితి గుర్తుకి వచ్చి కన్నీరు కార్చేవాణ్ణి. ఈ భేదానికి కారణం ఏమిటి? 'విద్యే' – అనే జవాబు నాకు స్ఫురించింది. చదువు చేత, ఆత్మవిశ్వాసం చేత వారిలోని బ్రహ్మం మేలుకొంటుండగా మనలోని బ్రహ్మం క్రమక్రమంగా నిద్రాణమవుతోంది. న్యూయార్కుకి ఐర్లాండువారు వలస వచ్చేటప్పుడు ఒత్తిళ్ళకు గురై, పీక్కుపోయిన ముఖాలతో, దీనావస్థలో ఉండేవారు. ఒక చేతి కఱ్ఱ, దాని చివర వేలాడే పీలికల మూట... ఇదే వారి ఆస్తి. నడకలో జంకు, చూపులో భయం కాన వచ్చేది. ఆరు నెలల్లో ఆ దృశ్యం మారిపోయి వారంతా ధైర్య ఉత్సాహాలతో కనిపించేవారు. వారి చూపుల్లో, నడకల్లో ఇక ఎలాంటి భీతీ ఉండేది కాదు. కారణం ఏమిటి? ఆ ఐరిష్ వాడికి స్వదేశంలో ఎటు చూసినా తిరస్కారమే. అందరూ ముక్తకంఠంతో 'ఒరేయ్! నీ కిక ఆశ లేదు. బానిసగా పుట్టావు. బానిసగానే ఉంటావు' అనే నిరాశను పెంచే మాటల్నే పుట్టినప్పటి నుంచీ వినేవాడు. అలాంటి మాటల్ని విని విని తాను చాలా అల్పుణ్ణనే భ్రాంతిలో ఉండేవాడు. అందువల్ల అతడిలో ఉన్న ఆత్మశక్తి ముకుళించుకొని పోయేది.

అలాంటి స్థితిలో అతడు అమెరికాలో అడుగుపెట్టాడో లేదో, వెంటనే అన్ని వైపులా అతడికి "అబ్బాయీ! మా లాగ నువ్వూ ఒక మానవుడివి. మానవుడు ఏ పనైనా చెయ్యగలడు. ధైర్యంగా ఉండు" అనే ఘోష వినవస్తుంది. వాడు తలెత్తి చూసి, అది నిజమే అని గుర్తిస్తాడు. అతడిలోని బ్రహ్మం మేలుకొంటుంది.

మన పిల్లలు నేరుస్తున్న విద్య కూడా వ్యతిరేకమైనది. దాని ఫలితంగా శ్రద్ధ అంతరిస్తుంది. వేదవేదాంతాల్లో ప్రముఖంగా ఉద్ఘోషించే శ్రద్ధ... యముడి ముందు నిలబడి ప్రశ్నించే ధైర్యం... నచికేతుడికి వచ్చిన శ్రద్ధ... ఈ జగత్తును నడుపుతున్న శ్రద్ధ – అలాంటి శ్రద్ధ అంతరిస్తుంది! శ్రద్ధారహితుడు, సంశయాత్ముడు నశిస్తాడు. కాబట్టి మనం వినాశానికి అత్యంత సమీపంలో ఉన్నాం. ప్రస్తుతం దానికి విరుగుడు విద్యా వ్యాప్తే!

మొట్టమొదట ఆత్మబోధ. ఆత్మబోధ అనగానే జడలు కట్టిన శిరోజాలు, దండ కమండలాలు, కొండ గుహలు తలపునకు వస్తాయి. కానీ నేను చెప్పదలచింది అది కాదు. మనలో అనంత శక్తి దాగి ఉంది. బ్రహ్మ పిపీలికాది పర్యంతం ఉన్న ఆత్మ అభిన్నం. ప్రకటనలో మాత్రమే భేదం. అవకాశం, సరైన దేశకాల పరిస్థితులు సమకూరినప్పుడు వెంటనే ఆ శక్తి ఆవిష్కృతమవుతుంది. బ్రహ్మాది స్తంభ పర్యంతం వ్యక్తం గానో, అవ్యక్తం గానో ఉన్న శక్తి ఒక్కటే. ప్రతి వారిలో ఉన్న ఆ శక్తిని జాగృత పరిచేందుకు సహకరించేదే నిజమైన విద్య. ❖

# పరిప్రశ్న

**- స్వామి సుక్పతానంద**

**నం.ల. నరసింహారావు, హైదరాబాద్**

**? :హనుమంతుణ్ణి నవ వ్యాకరణ పండితుడు అంటారు. ఎందువలన? నవ వ్యాకరణాలు ఏవి?**

✍: శ్రీమద్రామాయణంలోని కిష్కింధకాండలో మొట్టమొదట రామలక్ష్మణులను ఆంజనేయ స్వామి దర్శించి వారెవరో తెలుసుకోగోరుతాడు. దూతగా వచ్చి వారి వివరాలు అడిగే విధానాన్ని గమనించిన దాశరథి, సౌమిత్రితో 'ఋగ్, యజుర్, సామవేదాలు, వేదాంగాలను అధ్యయనం



చేయనివాడు ఈ విధంగా మాట్లాడలేడు' అని అతణ్ణి అభినందిస్తాడు. శ్రీ సూర్యభగవానుని నుండి రామదూత శాస్త్రాధ్యయనం చేశాడు.

నవ వ్యాకరణాలు అంటే 1. పాణినీయం 2. కలాపం 3. సుపద్మం 4. సారస్వతం 5. ప్రాతిశాఖ్యం 6. ఐంద్రం 7. వ్యాఘ్ర భౌతికం. 8. శకటాటాయనం 9. శాకల్యం (ప్రాతిశాఖ్యానికి కుమార వ్యాకరణం అని మారుపేరు ఉంది.)

**దాలి నాయుడు, రాజాం**

**? : బాబా గుడికి వెళుతూ అక్కడ ధ్యానమందిరంలో రామనామం జపిస్తున్నాను. అలా చేయవచ్చా?**

✍: మామూలుగా అయితే అలా చేయకూడదంటారు కొందరు. ఏ దేవుడి గుడికి వెళితే ఆ దేవతనే స్మరించాలంటారు. అయితే మీరు వెళ్ళే గుడికి భక్తులు వస్తారు, అక్కడ పవిత్ర వాతావరణం ఉంటుంది కనుక ఏ దేవత జపం చేసినా ఫలితం లభిస్తుంది. 'భావగ్రహి జనార్దన' అని కదా పెద్దలు చెబుతారు. శ్రీరామచంద్రుణ్ణి హృదయంలో ధ్యానిస్తూ, హరే రామ జపం చేస్తే తప్పక ఫలితం ఉంటుంది.

**హనుమంతరావు, తలుపూరు**

**? : అ) షట్ సంపత్తి ఆ) అన్వీక్షణి ఇ) ప్రమాత, ప్రమేయం, ప్రమితి, ప్రమాణాలను గురించి వివరించ ప్రార్థన.**

✍: అ) షట్ సంపత్తి అంటే ఆరు సంపదలు, ఐశ్వర్యాలు, విభూతి అనే అర్థాలు ఉన్నాయి. ఏమిటా ఐశ్వర్యాలు? ఆత్మ సాక్షాత్కారానికి శమాది షట్ సంపత్తి అవసరం. 1. 'శమ' అంటే మనసు బాహ్య విషయాలపైకి వెళ్ళకుండా నియంత్రించడం. 2. 'దమ' అంటే జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాల్ని నియంత్రించడం. 3.'ఉపరతి' బాహ్య విషయాలను చిత్తవృత్తులతో ఆశ్రయించకుండా, పూర్వమీమాంసలో చెప్పబడిన విహిత కర్మల్ని వదలిపెట్టడం. 4) 'తితిక్ష' అంటే ఏ దుఃఖాన్ని అయిన ప్రతీకార రహితంగా ఓర్చుకోవడం. అవకారం చేసినవారికైనా హాని తలపెట్టకపోవడం. 5) 'శ్రద్ధ' అంటే శాస్త్రాల్నీ, గురువు ఉపదేశించిన వాక్యాల్నీ సత్యబుద్ధితో అర్థం చేసుకోవడం. 6) 'సమాధానం' అంటే సర్వకాల సర్వావస్థల్లో ధ్యేయ వస్తువు (భగవంతుడి)పై మనస్సును లగ్నం చేయడం. వివేకం, వైరాగ్యం తీవ్ర ముముక్షత్వంతో పై ఆరు ఐశ్వర్యాలూ ఉంటే ఆత్మసాక్షాత్కారం కరతలామలకం అవుతుంది.

ఆ) 'అన్వీక్షణి' అంటే అన్వేషణ అని భావం.

ఇ) ఇక ప్రమాణాది చతుష్టయాన్ని తెలిపే పదాలు– ప్రమాత, ప్రమాణ, ప్రమేయ, ప్రమితి.

'ప్రమాత' – అంతఃకరణాల (మనసు, బుద్ధి, అహంకారం, చిత్తం)తో విషయాన్ని గ్రహించేవాడు. 'ప్రమాణం' – విషయ నిర్ణయానికి సాధనాలు. 'ప్రమేయం'– ప్రమాణాలతో నిర్ణయించబడినది. 'ప్రమితి' – యథార్థ ప్రత్యక్షం.

ఇవన్నీ వేదాంత పరిభాషలోని సాంకేతిక పదాలు, జ్ఞాన యోగసాధనలో అంతర్భాగాలు. యుక్తి విషయాలు కూడా. ❖





# పాంచజన్య ప్రార్థన

- రెంటాల జయదేవ

ఆలయాలలోనూ, ఇళ్ళల్లోనూ దేవునికి సమీపంలో పీఠం మీద శంఖాన్ని ఉంచుతుంటారు. భక్తులను సమున్నత సత్యాన్వేషణ దిశగా మరల్చడం కోసం శంఖంతో తీర్థం ఇస్తుంటారు.

మన ప్రాచీన గ్రంథాల్లో శంఖ ప్రార్థనను ఇలా పేర్కొన్నారు:

*త్వం పురా సాగరోత్పన్నః విష్ణునా విధృతః కరే ।*
*దేవైశ్చ పూజితః సర్వైః పాంచజన్య నమోఽ స్తు తే ॥*

'సముద్రంలో నుంచి పుట్టినదీ, శ్రీమహావిష్ణువు చేతిలో ఉండేదీ, దేవతలందరూ పూజించేదీ అయిన పాంచజన్య శంఖానికి నమస్కరిస్తున్నాను'.

### లక్ష్మీదేవి తమ్ముడే దక్షిణావర్త శంఖం!

సాధారణంగా శంఖాల్లో చాలా భాగం ఎడమ వైపునకు తెరుచుకొని ఉంటాయి. మరో మాటలో చెప్పాలంటే, అవి అపసవ్య దిశలో ఏర్పడినవన్న మాట. ఇక, కుడి వైపునకు తెరుచుకొని ఉండే శంఖాలు, అంటే సవ్య దిశలో ఏర్పడిన శంఖాలు అరుదుగా లభిస్తాయి. ఇలా కుడి వైపునకు తెరుచుకొని ఉన్న శంఖాలనే పండితులు 'దక్షిణావర్త శంఖాలు' అని వ్యవహరిస్తుంటారు. ఇలాంటి శంఖం ఇంట్లో పూజగదిలో ఉండడం శుభప్రదమని హిందువుల విశ్వాసం. అయితే, వీటి ధర చాలా ఎక్కువ.

సమస్త సంపదలకూ సంకేతమైన లక్ష్మీదేవి ఇలా కుడి వైపునకు తిరిగిన (దక్షిణావర్త), తెల్లటి శంఖంలో నివాసమై ఉంటుందని ప్రజల నమ్మకం. తెల్లటి శంఖం, లక్ష్మీదేవి - రెండూ సముద్రంలోనే పుట్టాయని భావిస్తారు. కుడి వైపు తెరచి ఉన్న తెల్లటి శంఖాన్ని లక్ష్మీదేవికి తమ్ముడిగా విశ్వసిస్తారు.

దక్షిణావర్త శంఖం గొప్పదనాన్ని మన శాస్త్రాలు ఇలా వివరించాయి:

*దక్షిణావర్తే శంఖాయం యస్య సద్మని తిష్ఠతి ।*
*మంగళాని ప్రకుర్వన్తే తస్య లక్ష్మీః స్వయం స్థిరా ॥*

*చందనాగరు కర్పూరైః పూజయేద్ గృహేఽ న్వహమ్ ।*
*స సౌభాగ్యే కృష్ణ సమో ధనే స్యాద్ ధనదోపమః ॥*

'ఏ ఇంట్లో అయితే కుడి వైపునకు తెరుచుకొని ఉన్న తెల్లటి శంఖం ఉంటుందో, ఆ ఇంట్లో సంపదలు, సంతోషం వెల్లివిరుస్తాయి. సాక్షాత్తూ లక్ష్మీదేవే ఆ ఇంట్లో వసిస్తుంది. దేవుణ్ణి నిత్యం పూజించడానికి చందనం, కర్పూరం వగైరా ఏ ఇంట్లో వినియోగిస్తారో ఆ ఇల్లు ధనం, సౌభాగ్యాలతో తులతూగుతుంది'.

### దేవతలకు నెలవు దక్షిణావర్త శంఖం

ఇక, 'బ్రహ్మవైవర్త పురాణం' దక్షిణావర్త శ్వేత శంఖం గురించి ఇలా చెబుతోంది:

*శంఖ చంద్రార్క దైవత్వం మధ్యే వరుణ దేవతన్ ।*
*పృష్ఠే ప్రజాపతి ర్విద్యా దగ్రే గంగా సరస్వతీమ్ ॥*

*త్రైలోక్యే యాని తీర్థాని వాసుదేవస్య చాజ్ఞయా ।*
*శంఖే తిష్ఠన్తి విప్రేంద్ర తస్మా శంఖ ప్రపూజయేత్ ॥*

*దర్శనేన హి శంఖస్య కిం పునః స్పర్శనేన తు ।*
*విలయం యాన్తి పాపాని హిమవద్ భాస్కరోదయే ॥*

'దక్షిణావర్తమైన తెల్లటి శంఖం దివ్యత్వంలో సూర్య చంద్రులతో సమానమైనది. ఈ శంఖం అగ్ర భాగంలో గంగ నివాసం ఉంటుంది. మధ్యలో వరుణుడు, పృష్ఠ భాగంలో బ్రహ్మ వసిస్తుంటారు. శ్రీమహావిష్ణువు ఆదేశాల మేరకు ముల్లోకాలలోని అన్ని తీర్థాలూ ఈ శంఖంలో ఉంటాయి. కుబేరుడు సైతం ఈ శంఖంలో కొలువై ఉంటాడు. దీన్ని నిత్యం పూజించాలి. ఈ శంఖాన్ని చూసినంత మాత్రాన సూర్యోదయంతో మంచు కరిగిన రీతిలో అన్ని దోషాలూ నశిస్తాయి. ఇక ఈ శంఖాన్ని స్పృశిస్తే, దివ్యత్వం సిద్ధిస్తుంది'.

### శంఖనాదం ఎప్పుడు చేయాలి?

అయితే, శంఖాన్ని ఎప్పుడు పడితే అప్పుడు ఊదకూడదు. కేవలం ఉదయం, సాయంత్ర వేళల్లోనే శంఖాన్ని ఊదాలి. అదీ సూర్యోదయానికి ముందు, సూర్యాస్తమయం తరువాత అని పెద్దలు చెబుతుంటారు. అలా కాకుండా మిగిలిన సమయాల్లో శంఖం ఊదితే, ఆ నాద తరంగాలకు సూర్య కిరణాలు ఆటంకమవుతాయని అంటారు. ఏమైనా, వాతావరణం ప్రశాంతంగా ఉండే ఉదయ, సాయం వేళల్లో శంఖం ఊదితే, ఆ నాదం చాలా దూరం వినిపిస్తుంది. శంఖనాదం విన్న వారంతా దాని వల్ల ప్రయోజనం పొందుతారు. ❖

('శుభాలనిచ్చే శంఖం' వచ్చే సంచికలో...)

# విశాల హృదయుడు హరగోవిందుడు

కథ: మోహన్ చిత్రాలు: శంకర్ తెలుగుసేత: స్వామి జ్ఞానదానంద

1 సిక్కుల ఐదవ గురువైన అర్జున్‌దేవ్, జహంగీరు చక్రవర్తి క్రూరత్వం వల్ల మరణించారు. సిక్కుల ఆరవ గురువుగా గురు హరగోవింద సింగ్ నియమితులయ్యారు. ఆయన ఆ పవిత్రమైన బాధ్యతను స్వీకరిస్తూ...

2




గురు హరగోవిందసింగ్ శూరత్వంతో నిండిన సైన్యాన్ని రూపొందించి, చక్కగా పరిపాలిస్తూ వచ్చాడు. దానితో పాటు మహా భక్తుడిగా పేరుగాంచాడు.

3




4



5

హరగోవింద సింగ్ గాంభీర్యం, పవిత్రత జహంగీరును బాగా ఆకట్టుకున్నాయి.
ఆయనను ఖైదు చేయాలనే ఉద్దేశాన్ని మానుకొని, జహంగీర్ చాలా మర్యాదగా ప్రవర్తించాడు.
ఎన్నో మత తత్త్వాల గురించి ఆయనతో సంభాషిస్తూ, తన సందేహాలను తీర్చుకున్నాడు.

6

ఒకసారి జహంగీర్ చక్రవర్తితో పాటు హరగోవింద్ వేటకు బయలుదేరాడు. కారడవిలో చక్రవర్తిని ఒక పెద్ద పులి తరుముకుంటూ వచ్చినప్పుడు, ఆయన రక్షక భటులందరూ భయంతో పారిపోయారు. అప్పుడు హరగోవింద్...




హరగోవింద్ ఆ పులితో పోరాడి దాన్ని చంపేశాడు.
దాంతో, చక్రవర్తికి హరగోవింద్ మీద ఉన్న గౌరవమర్యాదలు ఎన్నో రెట్లు పెరిగాయి.

7

హరగోవింద్‌తో చక్రవర్తి చాలా చనువుగా ఉండడం సంతూషాలో అసూయని కలిగించింది.
హరగోవింద్‌నూ, చక్రవర్తినీ విడదీయాలి; సాధ్యమైతే హరగోవింద్‌ను చంపేయాలని కుట్ర పన్నాడు.
అందుకు తగ్గట్లు హఠాత్తుగా జహంగీర్ చక్రవర్తి జబ్బు పడ్డాడు.

8




మిగతా 36వ పేజీలో...

శ్రీరామకృష్ణులు మొదటి నుంచీ శ్రీశారదాదేవికి ఆధ్యాత్మిక మార్గదర్శకత్వం ఇచ్చారు. 'చందమామ అందరికీ మామ. అలాగే భగవంతుడు మనందరకీ తండ్రి' అని చెబుతూ, జపధ్యానాలు, ప్రార్థనలు ఎలా చెయ్యాలో కూడా అమ్మకు నేర్పించారు. తాను భావ పారవశ్యంలో ఉన్నప్పుడు ఏ యే సమయాల్లో ఏ యే మంత్రాలు ఉచ్చరించాలో నేర్పుతూ మంత్రాలకు సంబంధించిన జ్ఞానాన్ని కూడా ఇచ్చారు. షోడశీ పూజ చేసి, తమ సమస్త సాధనా ఫలాన్ని జపమాలతో సహా అమ్మ పాదాల వద్ద సమర్పించారు. రాబోయే కాలంలో అమ్మ ఆదర్శ గురువయ్యేందుకు అలా సాయం చేశారు.

చివరి రోజుల్లో శ్రీరామకృష్ణులు కాశీపూర్‌లో ఉన్నప్పుడు ఒకసారి అమ్మను "నీవేమీ చెయ్యవా? కలకత్తా ప్రజలు పురుగుల్లాగ కొట్టుమిట్టాడుతున్నారే" అంటే, అమ్మ "నేను స్త్రీని ఏం చెయ్యగలను?'' అన్నారు. కానీ శ్రీరామకృష్ణుల ఆదేశానుసారం ఎన్నెన్నో బాధ్యతలను చాలా సహజంగా, ధైర్యంగా

పవిత్రులకూ, శుద్ధ భక్తులకూ దీక్ష ప్రసాదించేటప్పుడు అమ్మ మనస్సుకు ఎంతో ఆనందంగా, తృప్తిగా ఉంటుందనీ; ఘోర సంసారాసక్తులు నమస్కరించినప్పుడు పాదాల్లో మంటపుట్టి, గంగాజలంతో కడుక్కోవలసి వచ్చేదనీ చెప్పేవారు. అత్యంత పవిత్రులైన సన్న్యాస శిష్యులు ఒక వైపు అయితే, ఘోరసంసారాసక్తులు మరొక వైపు; నాగమహాశయ్ లాంటి వినమ్ర భక్తులు ఒక వైపు అయితే, అమ్‌జాద్ లాంటి బందిపోటు దొంగలు మరొక వైపు... ఇలా రకరకాల భక్తులను ఆమె అత్యంత సహనంతో, సమానంగా చూశారు.

"శ్రీరామకృష్ణులేమో రత్నాల వంటి వారిని ఏరుకున్నారు. కానీ నా దగ్గరకు చీమల బారుల్లాగ అసంఖ్యాకులను పంపారు. పచ్చికట్టెలను ఊది ఊది, కళ్ళ నుండి నీళ్ళు కారి, కళ్ళు వాచిపోయాయి" అనేవారు అమ్మ. అయినప్పటికీ ఎవరికీ కాదనకుండా దీక్ష ప్రసాదించేవారు.

# ఆదర్శ గురువు శ్రీ శారదా దేవి

-ప్రవ్రాజిక ధర్మాత్మప్రాణ



విచక్షణతో ఆమె నిర్వహించారు. ఆ బాధ్యతలలో అత్యంత ప్రముఖమైనది 'గురువు పాత్ర'. ఆమె జీవితంలో ఆదర్శ గురువుగా అసంఖ్యాక భక్తులకు మార్గదర్శి ఎలా అయ్యారనేది చూద్దాం:

**రాళ్ళను రత్నాలుగా మార్చిన మాతృ ప్రేమ:** "అమ్మా" అని ఎవరైనా ఆర్తితో ప్రార్థిస్తే, ఎంత కష్టమైనా కూడా లెక్కించకుండా వారికి మంత్రదీక్ష ఇచ్చేవారు. సదాచార బ్రాహ్మణ కుటుంబానికి చెందిన స్త్రీ అయినప్పటికీ, ఏ జాతి, ఏ కులం, ఏ మతం వారినైనా ఆమె దగ్గరకు తీసుకునేవారు. బందిపోటు దొంగ అమ్‌జాద్ కానీ, పాశ్చాత్య వనిత సోదరి నివేదిత కానీ, సాధు బ్రహ్మచారులు కానీ - అందరినీ సమానంగా చూసేవారు. ఒక్కొక్కసారి అమ్మ మాతృభావం గురుభావాన్ని మీరిపోయేది. ఆ మాతృభావంలో మానవులు, జంతువులు, పశుపక్ష్యాదులన్నింటికీ సమాన స్థానం ఉండేది. ఆ కాలంలో ఇలాంటి ఆచరణ సమాజంలో సంచలనాన్ని సృష్టించే విషయమని మనం ఊహించవచ్చు.

**నియమాలకు అతీతం అమ్మ మంత్రదీక్షా విధానం:** మంత్రదీక్ష ఇవ్వడంలో నియమ నిబంధనలను అమ్మ ఎక్కువగా పాటించేవారు కాదు. సాక్షాత్తూ జగజ్జనని, పవిత్రతా స్వరూపిణి అయిన అమ్మకు ఇవి అవసరం లేదు.

ఒకసారి శారదామాత విష్ణుపూర్ రైల్వే స్టేషన్‌లో కలకత్తా వెళ్ళేందుకు వేచి ఉండగా, హఠాత్తుగా ఒక రైల్వే కూలీ అమ్మ పాదాల వద్ద ప్రణమిల్లి 'అమ్మా జానకీమాతా! నీ దర్శనం కోసమే ఇన్నాళ్ళూ వేచి ఉన్నాను. నన్ను కరుణించి కాపాడు తల్లీ!' అంటూ విలపించాడు. అమ్మ అతణ్ణి ఆశీర్వదించి అక్కడే మంత్రదీక్ష ప్రసాదించారు.

దృష్టి ద్వారా, స్పర్శ ద్వారా, స్వప్నంలో కూడా ఎంతో మందికి అమ్మ ఆధ్యాత్మిక అనుభూతిని కలిగించారు. శ్రీరామకృష్ణుల నిర్యాణానంతరం అమ్మకు ఆయన దర్శనమిచ్చి యోగీన్ (స్వామి యోగానంద)కు దీక్ష నివ్వమని చెప్పి ఆమెలో సుప్తంగా ఉన్న గురుశక్తిని మేల్కొల్పారు.

సురేంద్రసేన్ అనే భక్తుడు స్వామి వివేకానందుల ద్వారా ప్రభావితుడై 3 సంవత్సరాలు ఆయన్ని మంత్రదీక్ష కోసం ప్రాథేయపడ్డాడు. స్వామి వివేకానందులు ఆయనకు దీక్ష ప్రసాదించేందుకు ఒప్పుకున్నారు. కానీ ధ్యానంలో ఆయన గురువు వేరే అని తెలుసుకుని “నీకు నాకంటే గొప్ప వారి దగ్గర మంత్రదీక్ష దొరుకుతుంది” అన్నారు. స్వామి వివేకానందుల కన్నా గొప్పవారు ఎవరున్నారని అత్యంత బాధతో నిరాశా నిస్పృహలతో వెళ్ళిపోయారు ఆయన. తరువాత ఆయనకు కలలో అమ్మ కనిపించి, మంత్రదీక్షను ఇచ్చారు.

**అమ్మ అభయం ముక్తిదాయకం:** ఒక భక్తుడు అమ్మ వద్ద మంత్రదీక్ష పొందాడు కానీ తాను సాధనలు సరిగ్గా చేయలేకపోతున్నాను అని దుఃఖంతో 2, 3 సంవత్సరాలు అమ్మ దగ్గరకు వెళ్ళలేదు. చివరికి చాలా బాధతో అమ్మకు వినయంగా ఒక ఉత్తరం వ్రాశాడు. దాన్ని చూసి అమ్మ అతణ్ణి రమ్మని కబురు పంపారు. “నాయనా! చెరువులోని నీరు తనను లాక్కోమని సూర్యుణ్ణి కోరాలా? నీరు కోరినా కోరక పోయినా సూర్యుడు నీటిని పైకి లాక్కొంటాడు. భయపడకు. నీవే సాధనలూ చేయనవసరం లేదు” అని అమ్మ అభయప్రదానం చేసారు. ఒక్క అవతార పురుషులకు మాత్రమే ఇలాంటి అభయమివ్వడం సాధ్యం.

ఇంకొక శిష్యుడు అమ్మ దగ్గరకు వచ్చి, తన కష్టాలను వివరించి మనోవేదనతో ఏడుస్తూ, “అమ్మా! నా జీవితం నాశనమైపోతుందా? నేనేం చెయ్యను? నా గతి ఏమిటి?” అని ఆవేదనతో అడిగాడు. తక్షణమే అమ్మ “ఏమంటున్నావు నాయనా! నా బిడ్డ ఏనాడూ నాశనమవడు. ఇక్కడకు వచ్చిన వారందరికీ ముక్తి నిశ్చయం. భగవంతుడు కూడా నా బిడ్డను ఏమీ చెయ్యలేడు” అన్నారు. “అమ్మా! మరి నన్ను ఏం చెయ్యమంటారు” అంటే, “భారమంతా నా మీద వేసి నిశ్చింతగా ఉండు” అని అమ్మ, ఆ భక్తుడికి అభయదానం చేసారు.

**అమ్మ సూచనతో అద్భుత ఫలితం:** స్వామి విరజానందులు రోజుకు పద్దెనిమిది గంటల సేపు ధ్యానం చెయ్యనారంభించారు. దాంతో ఆయన ఆరోగ్యం బాగా దెబ్బ తిన్నది. తలనొప్పితో ఏమీ చెయ్యలేకపోయేవారు. ఎన్ని చికిత్సలు చేయించినా ఫలితం లేదు. అప్పుడు గురువైన అమ్మ దగ్గరకు ఆయన వచ్చారు. అమ్మ తన శిష్యుణ్ణి చూసిన వెంటనే, “నాయనా! నీవు ఇంత చిక్కిపోయావే! అసలు నీవు ధ్యానంలో మనస్సును ఎక్కడ కేంద్రీకరిస్తావు” అని అడిగారు. “అమ్మా! నా మనస్సును శిరస్సులో కేంద్రీకరిస్తాను” అన్నారు. అప్పుడు అమ్మ, “అందుకే నాయనా! నీకు ఇంత తలనొప్పి. శిరస్సులో మనస్సును కేంద్రీకరించడం అన్నది చిట్టచివరి మెట్టు. నీ మనస్సును హృదయంలో కేంద్రీకరించు” అన్నారు. అలాగే గురువైన అమ్మ ఆదేశానుసారం స్వామి తమ ధ్యాన పద్ధతిని మార్చుకున్నారు. ఆశ్చర్యకరంగా కొద్ది రోజులలోనే ఆయన కోలుకున్నారు.

**సంఘ గురువుగా మాతృమూర్తి:** సంఘ గురువుగా అమ్మ ఎలా తన బాధ్యతను నిర్వహించారో చూద్దాం. ప్లేగు వ్యాధి వచ్చినప్పుడు కలకత్తాలో రామకృష్ణ మఠం వారు సేవ, సహాయ చర్యలు చేపట్టారు. ఆర్థిక వనరులు కొరవడి, పని ఆగేలా ఉన్న స్థితిలో స్వామి వివేకానందులు, ‘అవసరమైతే బేలూరు మఠాన్ని అమ్ముదాం’ అన్నారు. అది విని అమ్మ “ఇదేం మాట! ఒక్క సేవా కార్యంతోనే మఠాన్ని మూసివేస్తారా? మీరేమో చెట్ల క్రింద నైనా ఉండగలరు. కానీ తరువాత కాలంలో వచ్చే నా బిడ్డలు అలా ఉండలేరు?” అన్నారు.

స్వామి వివేకానందుల ఉత్తేజ పూరితమైన ఉపన్యాసాలను విన్న యువకులు మఠంలో చేరి, దేశ భక్తి, దేశ సేవే ముఖ్యమని భావించారు. అయితే మఠంలో ఆధ్యాత్మికతకు ఇచ్చిన ప్రాముఖ్యాన్ని చూసిన వారందరి మనసుల్లో సందేహం కలిగింది. అప్పుడు అమ్మ, “గురుదేవులను ఆదర్శంగా ఉంచుకొని పని చెయ్యండి. అప్పుడు దారి తప్పరు. ఊరకే దేశప్రేమ, దేశసేవ అంటూ ఏం సాధించ గలరు” అని అంటూ ఆ శిష్యులకు మార్గదర్శనం చేశారు.

శ్రీరామకృష్ణ సంఘంలో అమ్మ ఎన్నడూ అధ్యక్షపదవిలోనో, మరే పదవిలోనో లేరు. అయితే అమ్మ తీర్పు అత్యున్నత న్యాయస్థానం తీర్పు లాంటిది. ఒక సన్న్యాస సంఘానికి ఒక స్త్రీ నేతృత్వం వహించడం మన ఇతిహాసాల్లో ఎక్కడా కనీవినీ ఎరుగని విషయం. అమ్మ ఏనాడూ ఉపన్యాసాలు ఇవ్వలేదు, గ్రంథాలు వ్రాయలేదు కానీ అమ్మ జీవితం మొత్తం ఆదర్శప్రాయమే! ❖



# ఓ మహాత్యాగి ఆత్మకథ



(స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

(...గత సంచిక తరువాయి)

**(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, దేవదూత, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన తన జీవితానుభవాలను ధారావాహికగా జూన్,09 సంచిక నుంచి అందిస్తున్నాం.)**

**విద్యలో విలువల బోధ :** ప్రాథమిక పాఠశాలలో కొంచెం సంఖ్యా గణితం, సంస్కృత వ్యాకరణం, భాషా విజ్ఞానం... ఇవన్నీ నేర్పేవారు. ఒక 'నైతిక శిక్షణ' పుస్తకం నుంచి కొన్ని సూక్తులు కంఠస్థం చేసేవాళ్ళం. అందులో నాకు బాగా గుర్తున్న ఒక నీతి: "గ్రామ శ్రేయస్సు కోసం కుటుంబాన్ని విడిచిపెట్టవచ్చు; దేశ శ్రేయస్సు కోసం తన గ్రామాన్నే వదలి వెళ్ళవచ్చు; మానవజాతి శ్రేయస్సు కోసం దేశమైనా విడిచిపెట్టవచ్చు; విశ్వ శ్రేయస్సు కోసం సర్వస్వమూ త్యజించవచ్చు." ఇలాంటి సూక్తులు ఆ పుస్తకంలో ఉండేవి. వాటిని మేము చదవగా ఉపాధ్యాయుడు వివరించేవారు.

మొదటి రోజు నేను పాఠశాలకు వెళ్ళినపుడు నాకు నేర్పిన శ్లోకం అర్థం ఇది: "ఎవరైతే స్త్రీలందరినీ తన సొంత తల్లిలా గౌరవిస్తాడో, పరుల ధనసంపదలను ధూళి మాత్రంగా భావిస్తాడో (ఆశించకుండా ఉంటాడో), ప్రతి జీవినీ ఆత్మస్వరూపంగా దర్శిస్తాడో – అతడే నిజమైన జ్ఞాని".

**అరుదైన దివ్యానుభూతులు :** ప్రతీరోజూ నేను నిద్ర పోవడానికి కళ్ళు మూయగానే, కనుబొమల మధ్య ఒక అద్భుతమైన బిందువును చూసేవాణ్ణి. అది క్రమంగా రంగురంగులతో పెద్దదవుతూ, మెల్లగా ఓ బంతి ఆకారంగా మారి, ఆఖరికి ఆ జ్యోతి పుంజం విస్ఫోటమై నా శరీరాన్ని ఆపాదమస్తకమూ ఓ తెల్లని జ్యోతి ద్రవ్యంతో ముంచివేసేది. వెంటనే నేను స్పృహ కోల్పోయి నిద్రలోకి జారుకునేవాణ్ణి. అందరూ ఈ విధంగానే నిద్ర పోతారని చాలా రోజుల వరకూ అనుకునేవాణ్ణి. నేను పెద్దవాణ్ణి అయి ధ్యానాభ్యాసం ప్రారంభించాక, నేను కళ్ళు మూయగానే ఆ జ్యోతి బిందువు ప్రత్యక్షమయ్యేది. నేను ఆ జ్యోతిపై మనస్సును ఏకాగ్రం చేసేవాణ్ణి. ఆ రోజుల్లో కొందరు మిత్రులతోపాటు మహర్షి దేవేంద్రనాథ్ టాగూర్ గారి సూచన ప్రకారం ధ్యానాభ్యాసం చేసేవాణ్ణి. మాకు కలిగిన దర్శనాలు, అనుభూతుల గురించి మాలో మేము మాట్లాడుకునేవాళ్ళం. అప్పుడే నాకు తెలిసింది – వారెవరికీ అలాంటి జ్యోతిదర్శనం కాలేదనీ, ఎవరూ అలా నిద్రలోకి వెళ్ళలేదనీ!

స్కూల్లో చదువుతున్నప్పుడు ఓ రాత్రి నా గదిలో తలుపులు మూసుకొని ధ్యానం చేస్తున్నాను. మనస్సు గాఢంగా ఏకాగ్రమైంది; అలా ఎంతసేపు ధ్యానించానో చెప్పలేను. ధ్యానం పూర్తయిన తర్వాత కూడా అలాగే కూర్చుండిపోయాను. అప్పుడు ఆ గది దక్షిణం వైపు గోడ నుంచి ఒక దివ్యమూర్తి బయటకు వచ్చి, నా ముందు నిలబడింది. ఆ మూర్తి ముఖంపై అద్భుతమైన తేజస్సు తాండవిస్తోంది! ఆ తేజస్వి వదనం అత్యంత ప్రశాంతంగా ఉంది. చేతిలో దండ కమండలాలు ఉన్నాయి. ఆయన నా వైపు తదేకంగా చూశారు. నాకేదో ఉపదేశింపబోతున్నట్లు కనిపించారు. నేను నిశ్చేష్టుణ్ణై ఆయన వైపు తదేకంగా చూస్తున్నాను. అంతలో హఠాత్తుగా ఒక విచిత్రమైన భయం నన్ను ఆవరించింది. తలుపు తీసుకొని, వడివడిగా బయటకు వెళ్ళిపోయాను. తర్వాత అలా పారిపోవడం నా మూర్ఖత్వమనీ, బహుశా ఆయన నాకేదో ఉపదేశించి ఉండేవారనీ అనిపించింది. కానీ ఆ తర్వాత ఆ దివ్యమూర్తి మరెప్పుడూ కనపడలేదు. చాలాసార్లు మళ్ళీ ఆ సన్యాసి కనిపిస్తే భయపడకుండా మాట్లాడాలని అనుకున్నాను, కానీ మళ్ళీ ఆయనను చూడనేలేదు! ఈ విషయమై మరేం చేయాలో నాకు తోచలేదు.

ఆనాడు నేను చూసింది 'బుద్ధ భగవాను'ణ్ణి అని ఇప్పుడు నాకనిపిస్తోంది. నా బాల్యం నుండే నేనొక వ్యక్తిని కలిసినా, ప్రదేశాన్ని సందర్శించినా నాకు చిరపరిచితమైనట్లు అనిపించేది. మరి ఆ విషయమై వివరాలు గుర్తు చేసుకుందామని ఎంత ప్రయత్నించినా విఫలమయ్యేవాణ్ణి! కానీ ఆ స్ఫురణ మాత్రం వస్తూనే ఉండేది.

**అమోఘమైన ధారణాశక్తి :** ఒకమారు పరీక్షకు కేవలం 2, 3 రోజులకు ముందు నాకు రేఖాగణితంలో ప్రవేశం లేదని గ్రహించాను. వెంటనే రేఖాగణిత పుస్తకం చదవడం ప్రారంభించాను. రాత్రంతా మేలుకుని నిష్ఠతో చదివాను. 24 గంటలలో 4 పుస్తకాల్ని ఆపోశన పట్టేశాను!

ఏ రచయిత పుస్తకమయినా ప్రతీ పంక్తి చదవనవసరం లేకుండానే అర్థం చేసుకునేవాణ్ణి! ప్రతి పేరాలోని మొదటి, ఆఖరి పంక్తులు చదవగానే పేరా మొత్తం అర్థమయ్యేది. ఈ ధారణాశక్తి వృద్ధి పొందే కొద్దీ, పేరాలు చదవడం కూడా అవసరమయ్యేది కాదు. ప్రతీ పేజీలో మొదటి, ఆఖరి పంక్తులు చదవగానే ఆ పేజీలోని విషయమంతా అర్థమయ్యేది. ఆ తర్వాత పుస్తకంలో రచయిత ఏదయినా విషయాన్ని వర్ణించడానికి నాలుగైదు, ఇంకా ఎక్కువ పేజీలు తీసుకున్న సందర్భాలలో ఆ రచయిత చెప్ప దలచుకున్న సారాంశం మొదటి కొన్ని పంక్తులు చదవగానే నాకు తేట తెల్లమయ్యేది.



**శాశ్వతానందానికి సరైన మార్గం:** యౌవనంలో నేను నిద్రకు ఉపక్రమించగానే, ప్రతీ రాత్రీ రెండు ఆదర్శాలు నా కళ్ళ ముందు నిలిచేవి. ఒక దృశ్యం నేను ఎనలేని సంపదలతో ఎంతో మంది సేవకులతో, నాపై ఆధారపడిన వారితో, గొప్ప హోదా, అధికారం, గౌరవం, వైభోగాలతో తులతూగే కోటీశ్వరునిలాగ కనిపించేది. ప్రపంచంలో ధనికులుగా పేరు పొందిన వారందరికీ నాయకత్వం వహించే స్థాయికి నేను చేరుకోగలననే దృఢ విశ్వాసం ఉండేది! మరుక్షణమే నేను సర్వసంగ పరిత్యాగినై, కౌపీనధారినై, సన్న్యాసిగా వైరాగ్య జీవితాన్ని గడుపుతూ, అయాచితంగా దొరికింది తింటూ, రాత్రులు చెట్ల నీడన తలదాచుకుంటూ, సంపూర్ణంగా ఈశ్వరేచ్ఛకు శరణాగతుడనై, ఋషులు, మునుల లాగ జీవిస్తున్నట్లు అనిపించేది! ఈ రకంగా నా భవితను తీర్చిదిద్దుకోవడానికి రెండు పరస్పర విరుద్ధ ఆదర్శాలు నా మనస్సులో మెదిలేవి. కానీ ఈ రెండో ఆదర్శమే నా మనస్సును కట్టిపడేసేది! నిజమైన, శాశ్వతమైన ఆనందాన్ని పొందడానికి ఇదే సరైన మార్గమనీ, ప్రాపంచిక మార్గాన్ని విడిచి, ఈ దారినే నేను నడవాలనీ భావించేవాణ్ణి! ఆ సన్న్యాస జీవితపు ఆనందాన్ని తలపోస్తూ, భగవచ్చింతనలో మునిగిపోయి, అలాగే నిద్ర పోయేవాణ్ణి. అత్యంత ఆశ్చర్యకరంగా చాలా కాలం పాటు ప్రతీ రాత్రీ ఇలాగే జరిగేది!

**తపనను తీర్చే తపస్వి సందర్శనం:** 19వ శతాబ్ది ప్రారంభంలో ఆధ్యాత్మికత, మతం, ధర్మం అంతరించి పోతాయేమో అనే పరిస్థితి ఎదురైంది. తీవ్రమైన ఆధునిక వైజ్ఞానిక పరిశోధనల సమ్మెట పోట్ల క్రింద విశ్వాసాలు నలిగిపోతున్నాయి. ఆధ్యాత్మికత అంటే కేవలం కొన్ని అర్థరహితమైన ఆచారాలుగా, బాహ్యాడంబరాలుగా భావించేవారు. నిరాశతో దిక్కుతోచనివారయ్యారు అంతా తమ చేతుల మధ్య నుండి జారి పోతున్నది; నాస్తికత, భౌతిక వాదం ఉవ్వెత్తున లేచే అలలై, అన్నిటినీ, అందరినీ తుడిచి పెట్టేయడం అనివార్యమనిపించింది!

నా యువావస్థలో ఈ సంశయ భూతం నన్నూ ఆవహించింది. ఆధ్యాత్మికత ధర్మాలు అనే ఆశలు అన్నీ వదులుకోవడం తప్పదని పించింది. కానీ అదృష్టవశాత్తూ నేను క్రైస్తవ, ఇస్లాం, బౌద్ధ మొదలైన మతాలను బాగా అధ్యయనం చేశాను. హిందూ మతం బోధించే మూల సిద్ధాంతాలనే అన్ని మతాలూ బోధిస్తున్నాయని గ్రహించి ఆశ్చర్యపోయాను.

సకల మతాల మూలతత్త్వం ఒక్కటే అని నాకు తోచింది. మరి అసలైన సత్యం ఏమిటి? అని ప్రశ్నించింది నా అంతరాత్మ! ఈ కలకత్తా మహానగరంలో కుర్రవాడిగా ఆధ్యాత్మిక అన్వేషణలో తిరిగేవాణ్ణి! గొప్ప గొప్ప వక్తల ఉపన్యాసాలు విని, వారిని "అయ్యా! మీరు భగవంతుణ్ణి చూశారా?" అని ప్రశ్నించేవాణ్ణి. భగవంతుణ్ణి 'చూడడమా?' అనే ఆలోచనతో ఆ వక్తలు నిర్ఘాంతపోయేవారు. కేవలం ఒకే ఒక్క వ్యక్తి "నేను భగవంతుణ్ణి దర్శించాను. అంతేకాదు, నీకు కూడా భగవంతుణ్ణి దర్శించే మార్గం చూపుతాను" అన్నారు. ఆయనే శ్రీరామకృష్ణ పరమహంస! ❖ సశేషం

అనుసృజన : స్వామి అర్చనానంద

# అణకువతో సాధించిన 'ఆత్మజ్ఞానం'

– స్వామి సమర్పణానంద

ఆయోధ ధౌమ్యుడు గొప్ప వేదాంత ఆచార్యుడు. సేవ, విధేయతలకు సంబంధించి తన శిష్యుల నుండి పూర్తి నిబద్ధతను కోరేవాడు ఆయన. ఆయన అనుకున్న విధంగా నిలచిన వారు మాత్రమే ఆయన అపారకృపకు పాత్రులయ్యేవారు.

ఆరణి, ఉపమన్యుడు ధౌమ్యుడి శిష్యులలో ప్రధానమైన వారు. ఉపమన్యుడి గురించి సామవేదంలోని వంశబ్రాహ్మణ ఖండంలో చెప్పబడింది. అతను వ్యాఘ్రపాదుడనే ముని కుమారుడని కొందరంటే వశిష్ఠముని పుత్రుడైన వాసు కుమారుడని కొందరంటారు. గొప్ప శైవయోగిగా ప్రసిద్ధికెక్కిన ఉపమన్యువు "నమఃశివాయ" మంత్రాన్ని ఆవిష్కరించాడు.

ధౌమ్యుడి పర్ణశాలలోకి అడుగుపెట్టగానే ఉపమన్యుడి ప్రతిభకి మార్గం ఏర్పడింది. పర్ణశాలలో శిక్షణ అనే కొలిమిలో పడి ఆచార్యుడి ఉపదేశాలు అనే సుత్తిదెబ్బలను (తింటూ) స్వీకరిస్తూ పురోగమించాలని అతనికి తెలియదు. గురువుగారి ఆదేశాలని అనుసరించడానికి అణకువ-విధేయతలనే కష్టతరమైన మార్గంలో పయనిస్తూ శాశ్వత కీర్తి అనే వసారాలో తనకి తెలియకుండానే అడుగుపెట్టినట్లు కూడా ఆ బాలుడికి తెలియదు.

సాంప్రదాయ బద్ధమైన భారతీయ శిక్షణాపథంలో వివేకాన్ని గ్రహణధారణా సామర్థ్యం – నేర్చుకున్న దానిని గ్రహించి జ్ఞాపకం ఉంచుకోవడం – అంటారు. చాలామంది తెలివైన వాళ్ళు జ్ఞానసముపార్జనలో విఫలులవడానికి కారణం వారు తాము నేర్చుకున్నదానిని జ్ఞప్తిలో ఉంచుకోలేకపోవడమే. తన గురువుపట్ల, తాను నేర్చుకుంటున్న విషయం పట్ల వినమ్రత కలిగి ఉన్న వ్యక్తికి ఈ ధారణా సామర్థ్యం– నేర్చుకున్న దానిని జ్ఞప్తిలో ఉంచుకునే సామర్థ్యం – వృద్ధి చెందుతుంది. వినమ్రత విధేయతలు అతడి ధారణాశక్తిని నిలపడానికీ, వృద్ధిచేయడానికీ తోడ్పడతాయి. ఇవిలేని వ్యక్తి ఎక్కువ నీటిని నిలువచేయలేని పాత్ర వంటివాడు. శ్రద్ధ, వినయం, పాత్రత... ఇవి విద్యాభ్యాసానికి పునాదుల వంటివి. గురువు ఆజ్ఞను పాటించడానికి శిష్యుడు చూపాల్సిన విధేయతకీ, దానివలన కలిగే ఫలితాలకీ ఉపమన్యుడు మేటి ఉదాహరణ.

గురువు ఆశ్రమానికి వచ్చినప్పటికి ఉపమన్యుడు చిన్న బాలుడు. ఆశ్రమ నియమానుసారం భిక్షాటన చెయ్యడం, ఆశ్రమంలోని ఆవులను మేపడం వంటి నిత్యకృత్యాలను నిర్వహించేవాడు. ఆశ్రమ జీవనానికి తనని తాను సగౌరవంగా నీతి నిజాయతీలతో సమర్పించుకున్నాడు.

**ఉపమన్యుని గురుభక్తి :** ఒకరోజు ఆవుల్ని మేపి తీసుకుని వచ్చిన బాలుణ్ణి "ఆహారం ఏం తీసుకుంటున్నావు"అని ప్రశ్నించాడు గురువు. తాను భిక్షాటన చెయ్యగా వచ్చినది ఆహారంగా స్వీకరిస్తున్నట్లు చెప్పాడు బాలుడు. అప్పుడు గురువు



తనకి సమర్పించకుండా భిక్షని ఆహారంగా తీసుకోకూడదని చెప్పగా శిష్యుడు ఇటుపైన అలా చెయ్యనన్నాడు.

మర్నాడు భిక్ష అంతా గురువుగారికి ఇవ్వగా ఆయన శిష్యుడికి ఏమీ ఇవ్వలేదు.

అలా కొంతకాలమయ్యాక బాలుడు ముందులాగే పుష్టిగా కనపడడంతో గురువు బాలుణ్ణి "ఆహారం ఏం తీసు కుంటున్నావు" అని అడిగాడు. అప్పుడు ఉపమన్యుడు రెండవ మారు భిక్షాటన చేసి దానిని స్వీకరిస్తున్నట్లు చెప్పాడు. దానికి ధౌమ్యుడు అది సరైన పద్ధతి కాదని చెప్పాడు. గురువు మాటలు విన్న ఉపమన్యుడు తనకి లభించిన దానితో సరిపెట్టుకోవడమే ఉన్నత జీవనానికి మార్గం అని గ్రహించాడు.

(జూలై 7న గురు పూర్ణిమ)

కొంతకాలం తరువాత కూడా బాలుడు ఎప్పటి లాగే బలంగా ఉండడంతో గురువు మళ్ళీ అతడి ఆహారం గురించి ప్రశ్నించాడు. ఉపమన్యుడు ఆవుపాలు స్వీకరిస్తున్నట్లు చెప్పాడు. తన అనుమతి లేకుండా తన ఆవుల పాలు పిండి, తాగడం నేరం అన్నాడు గురువు. శిష్యుడు తన తప్పును గ్రహించి ఇకపై అలా చెయ్యకూడదు అనుకున్నాడు.

మర్నాడు ఆవుల్ని మేత నుండి తీసుకుని వచ్చిన శిష్యుడు ఆకలితో అలమటిస్తున్నట్లు కనపడక పోవడంతో గురువు తిరిగి అదే ప్రశ్న వేశాడు. లేగదూడలు తమ తల్లుల వద్ద పాలు తాగుతుండగా ధార కట్టిన నురుగని స్వీకరించానన్నాడు శిష్యుడు. అప్పుడు గురువు అది తప్పుపని అని వివరించాడు. వెంటనే శిష్యుడు ఇకపైన తన ఆహారం ఏమిటి అని కూడా ఆలోచించకుండా తిరిగి అలా చెయ్యకూడదనుకున్నాడు. కాయధాన్యాలు, ద్రవపదార్థాలు... పాలూ... పాలమీద నురుగా... ఏమీలేవు... జీవనమే కష్టతరమవుతోంది బాలుడికి. అయినా తనకు ఎన్ని ఇబ్బందులు కలిగినా అణకువ అనే ఆదర్శం నుండి ఇసుమంత అయినా వైదొలగలేదు.

**గురుభక్తి ప్రయోజనం :** ఒకరోజు ఆకలి బాధతో ఉపమన్యుడు అడవిలోని జిల్లేడు ఆకులని తిన్నాడు. ఆ ఆకుల వగరు, ఘాటు, ఉప్పదనాల వలన అతడు తన దృష్టిని కోల్పోయాడు. దానికి తోడు తడుముకుంటూ త్రోవ వెదుక్కోవడంలో ఒక గోతిలో పడిపోయాడు. పసి వయస్సులో ఆత్మజ్ఞానం కోసం వచ్చి తన కంటి చూపునే కోల్పోయాడు. అలా లోతైన గోతిలో, చీకట్లో పడి ఉండి పోయాడు.

సాయంకాలం శిష్యుడు ఆశ్రమానికి రాలేదని గమనించిన ధౌమ్యుడు గురువు ఆదేశాలకి బాలుడు కోపగించుకున్నాడేమో అనుకుని ఇతర శిష్యులతో అడవికి వెళ్ళి ఉపమన్యుని కోసం వెతకసాగాడు. అలా వెతకగా వెతకగా ఆఖరికి నిస్సహాయంగా కంటి చూపును కోల్పోయి, ఒంటరిగా ఒక గోతిలో కనపడ్డాడు.

జరిగిన విషయం తెలుసుకున్న గురువు దేవవైద్యులైన అశ్వినీ దేవతలను స్తుతించమనీ వారి అనుగ్రహంతో పోయిన చూపును తిరిగి పొందవచ్చనీ చెప్పాడు. ఉపమన్యుడు ఋగ్వేదంలోని మంత్రాలను రాగయుక్తంగా సరియైన ఉచ్చారణతో పఠించాడు. వెంటనే అశ్వినీ దేవతలు ప్రత్యక్షమై ఒక భక్ష్యాన్నిచ్చి అది తింటే పోయిన చూపు వస్తుందని చెప్పారు.

అయితే గురువుకి సమర్పించనిదే తాను ఏదీ తిననన్నాడు ఆ బాలుడు. దానికి జవాబుగా అశ్వినీ దేవతలు "ఇంతకు ముందు నీ గురువు కూడా మమ్మల్ని ప్రార్థించగా మేము అతనికి ఒక తిను బండారాన్ని ఇచ్చాము, అతను తన గురువుకి సమర్పించకుండానే స్వీకరించాడు. అందుకని నువ్వు కూడా అలాగే చెయ్యొచ్చు" అన్నారు.

వెంటనే "గురువు ఏది చేశాడో అది చెయ్యడం కాదు శిష్యుడి విధి; గురువు చెప్పింది ఆచరించడం శిష్యుడి కర్తవ్యం" అని గుర్తుకు తెచ్చుకుని అశ్వినీ దేవతలని తనని క్షమించమని అడిగి, గురువుకి అర్పించనిదే తాను తిననని చెప్పాడు. బాలుడి వినయాన్ని చూసిన అశ్వినీ దేవతలు సంతోషించి అతణ్ణి "నీ గురుభక్తికి మేమెంతో సంతోషించాం. నీ కంటి చూపు తిరిగివస్తుంది. ఆత్మజ్ఞాన సంపన్నుడవవుతావు" అని దీవించారు.

ఉపమన్యుడు పర్ణశాలకి తిరిగివచ్చాక "అశ్వినీ దేవతలు చెప్పినట్లు సకల వేదశాస్త్రాలూ నీ నాలుక చివరనే ఉంటాయి" అని దీవించాడు ధౌమ్యుడు.

గురువు పట్ల అత్యంత అణకువతో ప్రవర్తించడం వల్లనే ఆత్మజ్ఞాని కాగలిగాడు ఉపమన్యుడు. ❖

## పండుగలు - పర్వదినాలు

### జూలై - 2009

| | | | |
|---|---|---|---|
| 03 | శుక్రవారం | : | ఏకాదశి |
| 07 | మంగళవారం | : | గురు పూర్ణిమ |
| 18 | శనివారం | : | ఏకాదశి |
| 20 | సోమవారం | : | స్వామి రామకృష్ణానంద జయంతి |

### ఆగష్టు - 2009

| | | | |
|---|---|---|---|
| 01 | శనివారం | : | ఏకాదశి |
| 05 | బుధవారం | : | స్వామి నిరంజనానంద జయంతి |
| 13 | గురువారం | : | శ్రీకృష్ణ జయంతి |
| 16 | ఆదివారం | : | ఏకాదశి |
| 19 | బుధవారం | : | స్వామి అద్వైతానంద జయంతి |
| 23 | ఆదివారం | : | వినాయక చతుర్థి |
| 31 | సోమవారం | : | ఏకాదశి |



# పూలమ్మినచోట కట్టెలమ్మడం కష్టమా!

– ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి

**ఇమ్ముదప్పు వేళ నెమ్మెలన్నియు దప్పు**
**కాలమొక్కరీతి గడవ వలయు**
**విజయుడనువు దప్పి విరటుని గొల్వడా?**
**విశ్వదాభిరామ వినుర వేమ!**

**భావం :** 'కాలం కలిసిరానప్పుడు మనం ఉన్న పరిస్థితులు తారుమారవుతాయి. అలనాడు అజ్ఞాతవాస సమయంలో అర్జునుడు విరాటుని సేవలో చేరి బృహన్నలగా వ్యవహరించాడు కదా! అందుకే కాలాన్ని అనుసరించి జీవించాలి' అంటారు యోగి వేమన.

అయ్యో ఓడలు బండ్లయ్యాయి అని కొందరు చింతిస్తారు. అవును ధనవంతులు దరిద్రులు కావడం, అధికారుల అధికారం పోవడం, రాజకీయ వాదులు సింహాసనం నుండి దిగిపోవడం, ఒకరి కీర్తి ప్రతిష్ఠలు హఠాత్తుగా అంతరించి పోవడం... అయ్యో ఇలా జరిగిపోయిందే అని ఎందరో డీలా పడిపోతారు. కొందరు తమ మార్గం నుండి తప్పుకొంటారు. అయితే వేమన దీనిని మరీ అంత తీవ్రంగా తీసుకోరాదంటున్నారు. కాలాన్ని అనుసరించి నడవండి – నిలదొక్కుకోండి అని పిలుపు నిస్తున్నారు. అలనాడు పాండవులు (అర్జునుడు) విరాటరాజు కొలువు కూటంలో తమ పేర్లు మార్చుకొని సేవ చేశారు గదా! ధర్మం అడవుల పాలయినా దానిని మళ్ళీ సింహాసనం పైకి ఎక్కించారు.

మన జీవితంలో కూడా పరిస్థితులు తారుమారై పూలమ్మిన (గౌరవ మర్యాదలు పొందిన) చోటనే కట్టెలు అమ్మాల్సి (అవమానకర పరిస్థితుల్ని ఎదుర్కోవల్సి) వస్తే అధైర్య పడకుండా చేసే పనిలో అదే పట్టుదల, కార్యదీక్ష, నిమగ్నతలను ప్రదర్శించాలి. ❖

- ఆకెళ్ల రాఘవేంద్ర



## గమనాన్ని సుగమనం చేసే

# గరుడ పురాణం

తప్పుడు పనులు చేయకూడదని మనందరం అనుకొంటాం. కానీ తప్పులు చేయకుండా ఎంతమంది ఉండగలరు? తెలిసో తెలీకో చిన్నదో పెద్దదో గతిలేకో మతితప్పో...ఏదో ఒక తప్పుపని చేయక తప్పని పరిస్థితే అందరిదీనూ! అందులోనూ నేటి ఆధునిక యాంత్రిక జీవనంలో మరీనూ!! మన ఆలోచనలపై, ప్రవర్తనపై, మాటపై, చేతపై గట్టి పట్టు ఉంటే తప్ప, తప్పుడు పనులు చేయక తప్పని పరిస్థితి అనే చెప్పుకోవాలి.

జీవించి ఉండగా ఇహలోకంలో పాపాలు చేస్తే మరణించాక నరకంలో నానా శిక్షలకూ గురవ్వాల్సి వస్తుందని మనందరికీ తెలుసు. మనిషిలో పాపభీతిని కలగజేసి తద్వారా అతని జీవితాన్ని సన్మార్గంలో పెట్టడమే ఈ విశ్వాసం వెనుక ఉన్న లక్ష్యం. ఏయే పాపాలు చేస్తే ఎలాంటి నరకం అనుభవించాల్సివస్తుందో వివరించేదే 'గరుడ పురాణం'. వ్యాసమహాముని రచించిన అష్టాదశ(18) పురాణాల్లో ఇదొకటి. షోడశ(16)అధ్యాయాలున్నాయి గరుడ పురాణంలో.

ఏ పాపం చేస్తే ఎలాంటి శిక్ష అనుభవించాల్సి వస్తుందో సవివరంగా ఈ పురాణంలో ఉంది. ఇదంతా మనిషిలో నైతిక ప్రవర్తనను పెంపొందింపచేసే ప్రయత్నం. నేటి ఆధునిక ప్రజాస్వామ్య వ్యవస్థల్లో అరాచకాలను నిరోధించేందుకు పోలీసులు, న్యాయవ్యవస్థ లాంటివి ఉన్నాయి. అయినా అరాచకాలు ఏ స్థాయిలో ఉన్నాయో అందరికీ తెలిసిందే. కొన్ని వేల సంవత్సరాల క్రిందట- మనిషిలో మౌలికంగా నైతికాంశాన్ని పెంపొందింప చేసేందుకు-పురాణాది గ్రంథాలు ఉపకరించాయి.

తప్పుపని చేస్తే పాపం చుట్టు కుంటుంది. ఆ పాపానికి ప్రాయశ్చిత్తంగా రౌరవాది నరకాలు అనుభవించాల్సి వస్తుంది-అనే భయంతోనైనా మనిషి దుష్కర్మ మార్గాన్ని విడిచిపెట్టడం జరుగుతుంది. పిల్లవాడు తనంతట తానే బుద్ధిగా చదువుకోక పోవచ్చు. తల్లికొడుతుందన్న భయంతో, గురువు దండిస్తాడన్న భయంతో బాగా చదువుతాడు. సగటు మానవ మనస్తత్వమూ అంతే! అందుకే పాపం-పుణ్యం అనే చింతనను అందించారు.

అయితే... ఈ జన్మలో పాపం చేస్తే... తర్వాతెప్పుడో కదా శిక్ష అనుభవించేది? ఈలోగా జీవితాన్ని అనుభవిద్దాం... తర్వాత సంగతి ఏమయితేనేం? అని కూడా అనిపించడం సహజం. అయితే ఇక్కడ గమనించాల్సిన విషయం ఒకటుంది. మనచుట్టూ ఉన్న అనేక జంతువుల కన్న మానవ జన్మ ఎంత ఉత్కృష్టమైందో తెలిసిందే! అలాంటి జన్మను సాధించిన తరువాత దానిని సార్థకం చేసుకోకపోతే ఎలా?

ఈ జన్మను సార్థకం చేసుకోలేదంటే అర్థం- బాగా చదివి ఉద్యోగం పొందాక లంచం తీసుకొని ఉన్న ఉద్యోగాన్ని పోగొట్టుకోవడం లాంటిది! 'పరోపకారార్థం ఇదం శరీరమ్' అన్నది ఒకనాటి మాట. సొంతలాభం కొంత మానుకొని పొరుగువాడికి పాటు పడాలన్నది నేటి మాట! నాడైనా... నేడైనా... ఏనాడైనా... తోటి వారికి కష్టం కలిగించకుండా సంఘానికి మన వల్ల హాని కలగకుండా సాగడమే ఉత్తమ జీవన లక్షణం. అలాకాకుండా దుష్కర్మలకు పాల్పడితే-ఆ దుష్కృతికి నిష్కృతి లేదని చెబుతోంది ప్రాచీన పురాణ విజ్ఞానం! ❖

# యువవాణి

**– స్వామి పరిజ్ఞేయానంద**

**పి. వీరబాబు, కాకినాడ.**

**ప్రశ్న: స్వామి వివేకానందుని మహోన్నత వ్యక్తిత్వాన్నీ, ఆయనకుగల అసాధారణ మేధాశక్తినీ పొందాలంటే ఆధునిక యువత ఏం చేయాలో సూచించండి.**

**జవాబు:** 'నా జీవితమే నా సందేశం'–My life is my message అన్నారు స్వామి వివేకానంద. అంటే స్వామీజీ పలికిన ప్రతీ మాటా ఆయన జీవితంలో ఆచరించి అనుభవపూర్వకంగా చెప్పినదే. ఆచరించి చెప్పిన ఏ మాటైనా ఇతరుల వ్యక్తిత్వంపై అత్యంత ప్రభావాన్ని చూపుతుంది. అందుకే టన్నుల కొద్దీ మాటలు వల్లె వేయడం కన్నా ఒక ఔన్సు ఆచరణ ఉత్తమం అన్నది ఆయన సందేశం. కాబట్టి స్వామీజీ ఇచ్చిన సందేశాన్ని మన జీవితంలో ఆచరించ గలిగితే ఆయన మహోన్నత వ్యక్తిత్వం మనపై అనూహ్య ప్రభావాన్ని చూపిస్తుంది అనడంలో సందేహం లేదు.



నిజానికి మనందరిలో ఉన్న శక్తి ఒక్కటే– అదే ఆత్మశక్తి. మనం అమృత పుత్రులం, ఆత్మ స్వరూపులం, అనంత శక్తికి వారసులం. మనలో అంతర్గతంగా ఉన్న ఆత్మశక్తిని గ్రహించలేకపోవడం వల్ల గొర్రెల మందలో ఉన్న సింహపు పిల్లలా ప్రవర్తిస్తున్నాం.

స్వామి వివేకానంద సింహగర్జనతో గొర్రెలమనే భ్రాంతి పోయి సింహాలమనే నిజస్వరూపం తెలుసుకొన్ననాడు మనమూ స్వామీజీ అంతటివారం కావచ్చు.

అనంత శక్తీ, అఖండ జ్ఞానమూ మీలోనే ఉంది. ఆ శక్తిని బయటకు తీయగలిగితే మీరూ నా అంతటి వారు కాగలరని స్వామి వివేకానంద స్వయంగా అన్నారు.

If you can think that infinite power, infinite knowledge lie within you, and if you can bring out that power, you also can become like me - ***Swami Vivekananda***

అయితే మనలో ఉన్న ఈ అనంత శక్తిని వ్యక్తం చేయాలంటే మూడు లక్షణాల్ని అలవరచుకోవాలి అని స్వామీజీ సూచించారు. అవి: పవిత్రత, సహనం, పట్టుదల.

ఈ మూడు లక్షణాలూ సంపూర్ణంగాగల మహోన్నత వ్యక్తిత్వం స్వామీజీది. ఆయన ఆదర్శాల బాటలో పయనించ గలిగితే మన వ్యక్తిత్వం కూడా మహోన్నతమవుతుంది.

స్వామీజీ మేధాశక్తిలో గల రహస్యం అఖండ బ్రహ్మచర్య పాలన. బ్రహ్మచర్య పాలన ద్వారా అతి తక్కువ సమయంలో అనంతమైన విజ్ఞానాన్ని పొందవచ్చు. అసాధారణమైన జ్ఞాపకశక్తికి ఆలవాలం పవిత్ర మనస్సు.

Simply by the observance of strict Brahmacharya all learning can be mastered in a very short time - one has an unfailing memory of what one hears or knows but once. - ***Swami Vivekananda***

'బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః' (పతంజలి యోగ సూత్రాలు) బ్రహ్మచర్య వ్రతాన్ని అవలంబించిన వారి మనస్సు, బుద్ధి, ఇంద్రియాలకు అలౌకిక శక్తి లభిస్తుంది. ఆ శక్తితో అసాధారణమైన కార్యాల్ని కూడా సాధించవచ్చు.

బ్రహ్మచర్యం పాటించకపోవడం వల్లనే మన దేశం వినాశపుటంచులకు చేరుకుంది.

It is owing to this want of continence that everything is on the brink of ruin in our country.

- ***Swami Vivekananda***

యంత్రాల యుగంలో మానవ మస్తిష్కపు ఉపయోగాన్ని మరచిన నేటితరం మేధాశక్తిని పెంపొందించు కోవడానికి బ్రహ్మచర్యం అనుసరణీయ మని గ్రహించాలి. ఆధునిక యువత ఆత్మశక్తిని అవగతం చేసుకోవడానికి ముందు బ్రహ్మచర్యం అభ్యసించడంలో ప్రత్యేక శ్రద్ధ వహించడం ఎంతైనా అవసరం. ❖

**మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :**
**యువవాణి**
**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**
**దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029**

# మంచి మాటలు... ముత్యాల మూటలు...

- స్వామి సేవ్యానంద



ఈ రోజుల్లో మనమంతా కాలంతో పోటీపడుతూ తీరిక లేకుండా కాలం గడుపుతున్నాం. ఈ తీరికలేని (బిజీ) జీవితంలో ముఖ్యమైన విషయాలను ఆలోచించడానికి కూడా సమయం దొరకని మనకు, విరామం లేకుండా మాట్లాడడానికి మాత్రం సమయానికి కొదవ లేదు. మనం జీవితంలో ప్రగతిని సాధించాలంటే చెప్పేదాని కన్నా చేసే దానికి ఎక్కువ విలువనివ్వాలి. "పని! పని! పనే చేయి... వ్యర్థప్రసంగాలకు స్వస్తి చెప్పు. భగవత్ప్రసంగాలు చేయి. జీవితం ఎంత చిన్నదంటే మిథ్యా ప్రసంగాలకూ, మోసాలకూ వ్యవధి లేదు" అని స్వామి వివేకానంద చెప్పారు. నిత్య జీవితంలో 'మాటలు' ప్రధానమైన పాత్ర వహిస్తాయి. కాబట్టి, వీటిని సరైన రీతిలో వినియోగించుకుంటే మనకూ, మన సమాజానికీ ప్రయోజనం జరుగుతుంది.

**మాటల మహిమ:** మంచికో, చెడుకో మనం ఎక్కువగా మాట్లాడే దేశీయులుగా (Talkative Indians) ప్రఖ్యాతి చెందాం. నేడు మన దేశంలో మొబైల్ ఫోన్ల ప్రాచుర్యం పొందడంతో ఈ మాట్లాడే అలవాటు మనలో మరింత పెరిగి, ఒక సమస్యగా మారింది. అర్థం లేని మాటలతో మన శరీరాన్నీ, మనస్సునూ అనారోగ్యానికి గురిచేయకుండా, మన మాటలు ఇతరులపై, ఈ సమాజంపై ఎలాంటి ప్రభావాన్ని చూపగలవో ఆలోచించాలి. మన మాటలు ఇతరులను ఆహ్లాదపరిచేవిగా, ప్రోత్సాహపరిచేవిగా ఉండాలి. అంతేకానీ అవహేళన చేసేవిగా, కించపరిచేవిగా ఉండకూడదు. మన మాటల ప్రభావంతో బలహీనులలో ఆత్మవిశ్వాసాన్ని పెంచి, ఉన్నతమైన స్థితికి తీసుకురావచ్చు. ఈ మాటలతోనే శారీరకంగా, మానసికంగా శక్తిమంతులైన యువతరాన్ని ప్రభావితుల్ని చేసి, నీచమైన స్థితికి దిగజార్చవచ్చు.

"నోరు మంచిదైతే ఊరు మంచిదవుతుంది' అన్నారు మన పెద్దలు. ఎప్పుడూ ఇతరుల దోషాలను ఎత్తిచూపే స్వభావాన్ని వదలి పెట్టి, నలుగురితో సరిగ్గా మాట్లాడుతూ, చక్కగా వ్యవహరిస్తే మనం అన్నిచోట్లా సులభంగా సర్దుకుపోగలం. లేదంటే చీకాకులు, గొడవలు, అశాంతి తప్పవు.

**మనస్సు, మాట ఏకం కావాలి!:** 'మనస్సు, మాట ఒక్కటి అవ్వాలి' అని శ్రీరామకృష్ణులు చెబుతారు. ఆధ్యాత్మిక జీవితంలోనే కాకుండా సాంఘిక జీవితంలో కూడా మనం పురోభివృద్ధి చెందాలంటే మనస్సునూ, మాటలనూ ఒక్కటి చేయడం ఎంతైనా అవసరం. మహాపురుషుల జీవితాల్లో ఈ విషయాన్ని స్పష్టంగా చూడవచ్చు. జీవితంలో ఆచరించి, స్వీయ అనుభవంతో తెలుసుకున్న విషయాలనే వారు నలుగురికీ చెబుతారు. అందుకే, వారి మాటలకి అంత గొప్ప శక్తి ఉంటుంది. ప్రాచీన కాలం నాటి ఉపనిషత్తుల వాక్కులు మొదలుకొని నేటి యుగంలో వివేకానందుని వాక్కుల వరకు ఉన్న ఈ అనంతమైన శక్తికి ఇదే కారణం. మన మనస్సులో ఉన్నదొకటి, చెప్పేదొకటి, చేసేది మరొకటి కాకూడదు. మనలో చాలామంది అధికారం వచ్చే ముందు ఎన్నో వాగ్దానాలు చేస్తారు. అయితే, అధికారం లభించాక స్వార్థానికి బానిసలై, అన్నీ మరచి, అంధులవుతారు. అందుకే నేటి సమాజంలో ఒకరిపై మరొకరికి విశ్వాసం తగ్గి, మనిషికీ మనిషికీ మధ్య, దేశానికీ దేశానికీ మధ్య దూరాలు పెరుగుతున్నాయి.

**మాటలు, మనసుకి ప్రతిబింబాలు:** మాటలను బట్టి ఒక మనిషి మనస్సును అంచనా వేయవచ్చు. మన మనస్సు పవిత్రంగా, ఉన్నతంగా ఉన్నప్పుడే మనం ఉన్నతమైన విషయాలను చర్చించడంలో ఆసక్తిని చూపగలం. లేదంటే అల్పమైన విషయాలను చర్చించడంలోనే ఆనందిస్తాం.

Great minds discuss IDEAS.
Mediocre minds discuss EVENTS.
Small minds discuss PEOPLE.

"ఉన్నతులు ఉత్తమ భావాలనూ, మధ్యములు వివిధ సంఘటనలనూ చర్చించగా, అధములు ఎప్పుడూ ఇతరుల గురించే చర్చిస్తారు". మనం ప్రస్తుతం ఏ స్థితిలో ఉన్నామో పరిశీలన చేసుకొని, వీలైనంత వరకు ఉన్నతమైన స్థితికి వెళ్ళే ప్రయత్నం చేద్దాం. ❖



మనసు - మర్మం - స్వామి బుధానంద

# మనోనియంత్రణకు భగవత్ చింతన!

మనస్సు కొన్నిసార్లు తనను తానే మాయ చేసుకుంటుంది. చైతన్యరహిత స్థితిలోని మనస్సు చైతన్య స్థితిని మాయ పుచ్చుతుంది. ఎప్పుడో ఒక పరిస్థితిలో మనం ఒక ఆకర్షణ వల్లనో, బలహీనత వల్లనో బాధపడుతూ, దాన్ని వదిలించుకోవడానికి ప్రయత్నిస్తున్నాం అనుకోండి; అకస్మాత్తుగా అప్పుడే మరింత కష్టమైన పరిస్థితి మన కళ్ళ ఎదుట సాక్షాత్కరిస్తుంది. దాన్ని చూసి మనం భయపడి, 'అలాంటి కష్టం ఎదురైతే నేనేం చెయ్యాలి?' అనుకుంటాం. ఆ విధంగా భవిష్యత్తును గురించి ఆలోచించడం ప్రారంభించి, మన ప్రస్తుత పరిస్థితిని మర్చిపోతాం. ఈ అజాగ్రత్త వల్ల ఎదురుగా ఉన్న ఆకర్షణలో కొట్టుకుపోతాం.

ఈ విధమైన వెన్నుపోట్లను తట్టుకొనేదెలా? కాలం పట్ల సరైన అవగాహనను కల్పించుకోవడం ద్వారా మనం ఆ పని చెయ్యవచ్చు. జర్మనీ దేశస్థుడైన 'మీస్టర్ ఎఖార్ట్' అనే యోగి ఇలా చెప్పాడు:

'ఒక్క క్షణంలో అనంతకాలం దాగి ఉంది'. మనం ఈ క్షణం పట్ల జాగ్రత్తపడితే భవిష్యత్తు అంతటి గురించి జాగ్రత్తపడ్డట్లే!

కాబట్టి, మనం ఎలాంటి పరిస్థితిలో ఉన్నా సరే, ఈ ఒక్క క్షణం పట్టుదలతో, స్థిరంగా మన నిర్ణయాలకు కట్టుబడితే చాలు. మనం నెగ్గుతాం. భవిష్యత్తు కోసం ఆందోళన చెందుతూ, వర్తమానాన్ని వృథా చెయ్యడం తెలివితక్కువతనం.

మనస్సును స్వాధీనం చేసుకోవడానికి సంబంధించినంత వరకూ - భగవంతుణ్ణి నమ్మేవారికి, ఆ నమ్మకం లేనివారి కన్నా కొంత పై చేయి ఉంటుంది. భగవంతుని మీద ఎప్పుడైతే విశ్వాసాన్ని పెంపొందించుకుంటామో అప్పుడు మనస్సు స్వాధీనానికి కావలసిన శక్తి మనకు లభిస్తుంది.

"పెద్దపులి ఇతర జంతువులను తినివేసినట్లు, 'దేవుని కోసం పట్టుదల అనే పెద్దపులి' కామక్రోధాలను తినివేస్తుంది'' అని శ్రీరామకృష్ణులు చెప్పారు.

ఒకసారి ఈ విధమైన పట్టుదల పెరిగిన తరువాత, కామం, క్రోధం మొదలైన మనోవికారాలు మాయమైపోతాయి. ఎప్పుడైతే కామం, క్రోధం మొదలైన మనోవికారాలు పోతాయో అప్పుడు మనస్సు పవిత్రమవుతుంది. పవిత్రమైన మనస్సును స్వాధీనం చేసుకోవడం సులభం. కానీ నమ్మకం లేనివాడు దీని కోసం చాలా కష్టపడాలి.

భగవంతుని మీద నమ్మకం ఉన్నవాడికి మనస్సులో పవిత్రత ఎలా కలుగుతుందన్న విషయాన్ని వివరించడం సులభం. ఎప్పుడైతే అతడు భగవంతుని పట్ల ప్రేమను పెంచుకుంటాడో అప్పుడు అతని మనస్సు భగవంతుని గురించే ఆలోచించడం ప్రారంభిస్తుంది. ఎందుకంటే మనం దేన్ని ప్రేమిస్తామో సహజంగానే దాని మీదే మనస్సును ఏకాగ్రం చేస్తాం. మన మనస్సు దేని మీద ఏకాగ్రమవుతుందో, దాని లక్షణాలనే పుణికిపుచ్చుకుంటాం. కాబట్టి భగవంతుడి మీద మన మనసుల్ని ఏకాగ్రం చేసినప్పుడు భగవంతుని లక్షణాలను జీర్ణించుకుంటాం. భగవద్గీత వాటినే 'దైవీసంపద' (దైవలక్షణాలు) అని పేర్కొంది. నిజమైన భగవద్భక్తుడు హృదయంలో పవిత్రత, ఇంద్రియనిగ్రహం, క్రోధం, చపలత్వాలు లేకపోవడం, ప్రశాంతత, సహనం మొదలైన దైవీ లక్షణాలను ఎలాంటి శ్రమ పడకుండానే పొందుతాడు. మరొకమాటలో చెప్పాలంటే అతడి మనస్సు దానంతట అదే స్వాధీనంలోకి వస్తుంది. ❖



(1884-1967)

# ముందుకు సాగిపో!

– స్వామి ప్రేమేశానంద

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ -వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావంతో ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో జూన్,09 సంచిక నుంచి ధారావాహికగా ప్రచురిస్తున్నాం.

కాశీ

6-4-1943

ప్రియమైన సరోజ్ !*

సైకిలు చక్రం తిరుగుతుంది. కానీ అది దానంతట అదే తిరగలేదు. ఎవరైనా త్రిప్పితేనే అది తిరుగుతుంది. దానికి ఒక గమ్యం అంటూ ఏమీలేదు. అది చైతన్యరహితమైనది. భారతీయుల స్థితికూడా ఇలాంటిదే, వారిని ఆడించేవారు ఎలా ఆడిస్తే అలా ఆడతారు. వారికి తమదైన ప్రణాళిక అంటూ ఏమీ ఉండదు. నీ స్నేహితులలో కొందరితో మాట్లాడి చూడు. వారికంటూ జీవితంలో నిజమైన లక్ష్యం ఏదైనా ఉందేమో గమనించు, ఒక పండితునిగానో, ఒక సంపన్నునిగానో ఒక గాయకునిగానో లేక అధ్యాపకునిగానో అవ్వాలనే ఆలోచనే ఉండదు.

సంవత్సరాల తరబడి ప్రపంచంలోని అన్ని దేశాల ప్రజలూ తమ అస్థిత్వానికి ఏమాత్రం భంగం కలగకుండా ఏ లక్ష్యమూ లేని "పశుప్రాయులైన ఈ భారతీయుల భుజాలపై కెక్కి స్వారీ చేస్తున్నారు". నీకు అర్థమవుతోందా? ఇది మనవాళ్ళు విన్నారు. అర్థం చేసుకొన్నారు. కానీ వారు తమ పశు స్థితి నుండి బయట పడటానికి ఏ మాత్రం ప్రయత్నించరు. నువ్వు జాగరూకుడవై ఉంటావా? మేలుకొని ఉంటావా? నీ శక్తినంతటినీ నీ పురోభివృద్ధికే వెచ్చిస్తావా? ఇతరుల బరువులను మోసే గాడిదలా కాక స్వేచ్ఛగా ఉండి నీ పైన నీవే ఆధారపడతావా? అలా అయితే నీ జీవితానికి ఒక లక్ష్యాన్ని ఏర్పరచుకో. పూజ చేసేటప్పుడు ఏం చేస్తావు? వీరాసనంలో (వీరునివలె) కూర్చుంటావు. సంకల్పం (దృధ నిశ్చయాన్ని) చెబుతావు. శ్లోకాలు పఠిస్తూ నీ దృధ సంకల్పాలను పదేపదే వల్లిస్తావు. అంతేనా? "అదే విధంగా నీ "జీవితార్చన" గురించి కూడా ఒక లక్ష్యంతో కూడిన నిశ్చయం ఉండాలి.

మొట్టమొదట నీ శ్రేయస్సుకై ప్రయత్నం చెయ్యి. తర్వాత ప్రపంచ శ్రేయస్సుకై కృషిచెయ్యి. ఏమీ గడించలేనివాడు ప్రపంచానికి ఏమి ఇవ్వగలడు? అవునా? కాదా? నీ ఉద్దేశం ఏమిటి? గొర్రెల మందలాగ, నీటి ప్రవాహంలో వాలు వెంట కొట్టుకు పోయే గడ్డిపోచల్లాగ ఎంత మంది పుట్టి గిట్టటంలేదు! తెలివితేటలు అన్నది ఒక్కటి మినహాయిస్తే మానవజీవితం జంతువు అస్థిత్వం కన్నా హీనమైనదే సుమా!

నీ జీవిత లక్ష్యాన్ని గూర్చి పూర్తి జాగ్రదావస్థలో ఉండు. ఎంతో ఉన్నతమైనదైన ఈ మానవజన్మను వృధా చేయకు. ప్రపంచం యావత్తూ దాని దారిన దాన్ని పోనీగాక! నీవు మాత్రం నీ అభ్యున్నతిని జ్ఞప్తిలో ఉంచుకొని ముందుకు సాగిపో!

ప్రేమాశీస్సులతో...
స్వామి ప్రేమేశానంద

(*కాలాంతరంలో రామకృష్ణ సంఘంలో 'స్వామి అనామయానంద'గా ప్రసిద్ధులు)

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు



# రామకృష్ణ మిషన్ ఆశ్రమ

ఛాప్రా, బీహార్ - 841 301

ఫోన్ నెం : 06152-220739, 244626

Email : rkmchapra@rediffmail.com



**"భగవంతుడి పట్ల గల భక్తి మానవుల పట్ల ప్రేమగా పరివర్తన చెందాలి. దేవాలయంలో దైవాన్ని పూజించండి. ఆ పూజల ద్వారా పొందిన అనుభూతిని మీ నిత్య జీవితంలో కూడా అనుభవించేలా ప్రయత్నించండి. దేవాలయంలోని దైవ ఆరాధన, సమాజంలోని ప్రజల సేవ వేరు వేరు కాదు. ఉన్నతమైన ఈ సందేశాన్ని దైనందిన జీవితంలో అమలు పరచాలి. ఇదే నేడు మనమంతా అర్థం చేసుకొని ఆచరించాల్సిన సందేశం". *- స్వామి రంగనాథానంద***

## విన్నపం

బీహార్‌లో గల ఛాప్రాలోని రామకృష్ణ మిషన్ ఆశ్రమం 2003లో శ్రీరామనవమి నాడు ప్రారంభించబడింది. శ్రీరాముడి కాలం నుండీ ఈ ప్రాంతం ప్రసిద్ధికెక్కింది. స్వామి అద్భుతానందజీ (లాటూమహరాజ్) ఇక్కడ జన్మించడం వలన ఛాప్రా కేంద్రం చారిత్రకంగా ప్రాముఖ్యతని పొందింది. శ్రీరామకృష్ణుల సన్న్యాస శిష్యులలో లాటూ మహరాజ్ మాత్రమే బీహార్‌లో జన్మించారు. అక్షర జ్ఞానం అస్సలు లేక పోయినా అనాథగా సమాజంలో అట్టడుగు స్థాయిలో ఉన్న లాటూ మహరాజ్ భగవత్కృప వలన కలకత్తా చేరి శ్రీరామకృష్ణుల సన్న్యాస శిష్యుడు అయిన వైనం మీ అందరికీ తెలిసిన విషయమే!

ఛాప్రాలో స్వామి అద్భుతానందజీ స్మారక కేంద్రం ఉండాలనే భక్తుల కోరిక మేరకు రామకృష్ణ సంఘం 13వ సర్వాధ్యక్షులైన పూజ్య స్వామి రంగనాథానందజీ మహరాజ్ అనుగ్రహంతో ఈ మఠ శాఖ ప్రారంభించబడింది. ఈ కేంద్ర అభివృద్ధి కోసం ప్రప్రథమంగా పూజ్య స్వామి రంగనాథానందజీ మహరాజ్ ఆర్థిక సహాయాన్ని అందించారు. అప్పటి నుంచీ ఆధ్యాత్మిక, విద్యా, వైద్య రంగాలలో సేవలు అందిస్తోంది.

ఈ సేవలను సమర్థవంతంగా నిర్వహించడానికి కొన్ని మౌలిక సదుపాయాలు అత్యవసరం.

1. భక్తుల సౌకర్యార్థం ఆశ్రమ భవనం మొదటి అంతస్తు మరమ్మత్తులు చేసి, అందులోనికి శ్రీరామకృష్ణుల ప్రార్థనా మందిరాన్ని మార్చాలి. ఈ మరమ్మత్తులకు అయ్యే ఖర్చు రూ. 5 లక్షలు.

2. ధార్మిక వైద్యశాల భవనం మొదటి అంతస్తు నిర్మాణానికి రూ. 20 లక్షలు వ్యయం అవుతుంది.

3. సాధు నివాసం, భోజనశాల, కార్యాలయ భవన నిర్మాణానికి రూ. 20 లక్షలు ఖర్చు అవుతుంది.

ఆశ్రమంలో సేవలు నిర్విఘ్నంగా కొనసాగేందుకు అత్యవసరమైన మౌలిక సదుపాయాలను సమకూర్చాలి. అందుకు ఉదార హృదయులైన భక్తులు, మిత్రులు, శ్రేయోభిలాషుల నుంచి విరాళాల్ని కోరుతున్నాం.

విరాళాలను Ramakrishna Mission Ashrama, Chapra పేరున చెక్కు/ డి.డి. తీసుకొని, "Ramakrishna Mission Ashrama, Chapra, Dist. Saran, Bihar. Pin - 841301"కు పంపాల్సిందిగా మనవి. అన్ని విరాళాలనూ కృతజ్ఞతతో స్వీకరిస్తాము. విరాళాలన్నిటికీ ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80(జి) కింద పన్ను మినహాయింపు ఉంది.

సదా మీ సేవలో

**స్వామి అసీమాత్మానంద (సుదర్శన్ మహరాజ్)** కార్యదర్శి

(రామకృష్ణ సంఘం 13వ సర్వాధ్యక్షులైన

పూజ్య స్వామి రంగనాథానందజీ మహరాజ్ సేవకుడు)

Advt.

- ఆర్. కృష్ణ

# బోధకులకు ఉద్బోధ!

అబ్రహామ్ లింకన్ తన కుమారుడి ఉపాధ్యాయునికి వ్రాసిన లేఖ నేటి తల్లితండ్రులకూ, ఉపాధ్యాయులకూ, విద్యావంతులకూ ఎంతో స్ఫూర్తిదాయకం. ఆయన వ్రాసిన ఆ లేఖలో అనేక విషయాలను ప్రస్తావించారు. అందులోని అంశాలు స్థూలంగా ఇవి :



1. అందరూ న్యాయశీలురు కారనీ, అందరూ సత్యవంతులు కారనీ వాడు నేర్చుకోవాలి. దుర్మార్గుడు ఉంటాడు; వీరుడు ఉంటాడు, స్వార్థ రాజకీయవేత్త ఉంటాడు, అంకిత భావంగల నాయకుడూ ఉంటాడని నేర్పండి.
2. సంపాదించిన ఒక డాలర్, దొరికిన అయిదు డాలర్ల కన్నా విలువైనదని మీరు వాడికి నేర్పండి.
3. అసూయ నుంచి వాడిని దూరం చేయండి. ప్రశాంతమైన నవ్వులోని రహస్యం నేర్పండి.
4. పుస్తకాల్లో అద్భుతాలుంటాయని వాడికి బోధించండి. అంతేకాదు, ఆకాశంలో ఎగిరేపక్షులు, సూర్యకాంతిలో తిరుగాడే తేనెటీగలూ, పచ్చని కొండపైన పూచే పూవుల అంతుచిక్కని మర్మాల గురించి ఆలోచించ డానికి వాడికి ప్రశాంత సమయం ఇవ్వండి.
5. మోసం చేసే కన్నా తప్పుకోవడం గౌరవప్రదమనీ, మర్యాదస్తులతో మర్యాదగా, మోటువాళ్ళతో మోటుగా ఉండాలనీ బోధించండి.
6. ప్రతి ఒక్కరూ వాడి అభిప్రాయాలు తప్పని చెప్పినా, తన అభిప్రాయాలపై తాను విశ్వాసం ఉంచుకోవాలని వాడికి బోధించండి.
7. మందలో ఒకడిగా కొట్టుకుపోకుండా ఒక్కడిగా నిలిచే బలం వాడికి కలిగేలా, అందరు చెప్పిందీ వినేలా బోధించండి. విన్నదాంట్లో నిజాన్నే స్వీకరించాల్సిందిగా బోధించండి.
8. కష్టాల మధ్య కూడా హాయిగా నవ్వడం ఎలాగో నేర్పండి. బుద్ధి బలంతో ధనార్జన చేయవచ్చు కానీ తన హృదయాన్నీ, వ్యక్తిత్వాన్నీ మాత్రం డబ్బు కోసం అమ్ముకోవద్దని బోధించండి.
9. తాను అనుకున్నది ఒప్పు అని నమ్మితే దాని కోసం పోరాడడం నేర్పండి. తనపై తనకెప్పుడూ పూర్తి విశ్వాసం ఉండాలని బోధించండి.
10. వాడిని ప్రేమగా చూడండి, కానీ ముద్దు చేయవద్దు. ఎందుకంటే వేడి కొలిమి మాత్రమే చక్కటి ఉక్కును తయారు చేయగలదు. ❖

**వ్యక్తి ప్రవర్తనలో మార్పును తీసుకురాని విద్య, దయా దాన గుణాల్నీ, ధైర్య సాహసాల్నీ అలవరచలేని విద్య - విద్యగా పరిగణింప బడదు. వ్యక్తికి స్వావలంబనం చేకూర్చేదే నిజమైన విద్య. - స్వామి వివేకానంద**

# శ్రీరామకృష్ణ మఠం



రిజర్వ్ లైన్, న్యూ నాథమ్ రోడ్, మదురై - 625 014
ఫోన్: 0452-2680224, 2681181, email : rkmath@dataone.in

## విరాళాలకై విన్నపం



ప్రియ మిత్రులకు,

నమస్సులు, హృదయపూర్వక శుభాకాంక్షలు.

**జ**గజ్జనని శ్రీమీనాక్షీదేవి కొలువై ఉన్న మదురై నగరం దక్షిణ భారతదేశంలోని ప్రముఖ యాత్రాస్థలాలలో ఒకటి. మదురైలోని శ్రీరామకృష్ణ మఠశాఖ 1987లో ప్రారంభించబడింది. 1998లో ఈ మఠం ఆవరణలో శ్రీరామకృష్ణులవారి దేవాలయ సంప్రోక్షణ జరిగింది. అప్పటి నుంచి మదురైలోని శ్రీ రామకృష్ణ మఠం అనేక ధార్మిక, సేవా కార్యక్రమాలను నిర్వహిస్తోంది.

**అన్నదాన భవన నిర్మాణం :** దేశ విదేశాల నుంచి ఏడాది పొడుగునా అనేక మంది భక్తులు శ్రీమీనాక్షీ అమ్మవారి దర్శనం కోసం మదురై వస్తుంటారు. వాళ్ళంతా మదురై వచ్చి ఇక్కడి నుంచి రామేశ్వరం, కన్యాకుమారి, ఇంకా ఇతర యాత్రా స్థలాలకి వెళతారు.

ఈ భక్తులు తమ యాత్రలలో మదురై శ్రీరామకృష్ణ మఠాన్ని సందర్శిస్తారు. ఇలా వచ్చే భక్తుల సంఖ్య ఏటా పెరుగుతోంది. భక్తుల భోజన వసతి కోసం ఒక ప్రత్యేకమైన భోజనశాల నిర్మించడం అవసరమైంది.

అన్నదాన భవన (1847 చ॥అ॥) నిర్మాణానికి అయ్యే ఖర్చు రూ. 12 లక్షలు అని అంచనా.

భక్తుల సౌకర్యార్థం నిర్మిస్తున్న అన్నదాన భవనానికి ఉదార హృదయులైన భక్తులు, మిత్రులు, శ్రేయోభిలాషుల నుంచి విరాళాల్ని కోరుతున్నాం.

విరాళాలను Sri Ramakrishna Math, Madurai పేరున చెక్కు/ డి.డి. తీసుకొని, "Sri Ramakrishna Math, Reserve Line, New Natham Road, Madurai - 625014" కు పంపాల్సిందిగా మనవి. అన్ని విరాళాలనూ కృతజ్ఞతతో స్వీకరిస్తాము. ఒక లక్ష అంతకు మించి విరాళాలిచ్చే దాతల పేర్లను ప్రత్యేకంగా ప్రదర్శిస్తాము. విరాళాలన్నిటికీ ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80(జి) కింద పన్ను మినహాయింపు ఉంది.

మీ కోసం, మీ కుటుంబ సభ్యుల సంక్షేమం కోసం మదురైలోని జగజ్జనని శ్రీశ్రీ మీనాక్షి, శ్రీశ్రీ సుందరేశ్వర శివుణ్ణి, భగవాన్ శ్రీరామకృష్ణులు, దివ్యజనని శ్రీ శారదాదేవి, స్వామి వివేకానందులను ప్రార్థిస్తూ,

ధన్యవాదములతో

భగవత్సేవలో
**స్వామి కమలాత్మానంద**
అధ్యక్షులు.

Advt.



# ఈనాటి తపస్సు

- స్వామి రఘునాయకానంద

తపస్సు అనగానే అడవులలోనూ, కొండ గుహలలోనూ, హిమాలయాలలోనూ సాధనలు చేసే యోగిపుంగవులే గుర్తుకు రావడం పరిపాటి. తండ్రి ప్రేమనూ, రాజ్యాన్నీ పొందడానికి ధ్రువుడు తపస్సు చేశాడు. శివుణ్ణి పొందడానికి పార్వతీ, పాశుపతాస్త్రం కోసం అర్జునుడూ తపం ఆచరించారు.

ఏదైనా ఒక వస్తువును పొందడానికి, లేదా లక్ష్యాన్ని సాధించడానికి చేసే తీవ్ర కృషినే తపస్సుగా చెప్పవచ్చు. "ఛాత్రాణాం అధ్యయనం తపః" - విద్యార్థికి చదువుకోవడమే తపస్సు. ఒక వ్యాపారి తన వ్యాపారాన్ని విస్తరించడానికి అకుంఠిత దీక్ష కలిగి ఉండడాన్నే తపస్సుగా చెప్పవచ్చు.

ఇక ఆధ్యాత్మికతకు వచ్చేసరికి, "నా తపస్వినో యోగః సిద్ధ్యతి" - తపస్వి కాని వాడికి యోగం సిద్ధించదు. మనఃశరీరాలను వశం చేసుకొని, వాటిని యథేచ్ఛగా సంచరించనీయకుండా ఉచితరీతిని నిరోధించడమే తపస్సుగా స్వామి వివేకానంద నిర్వచించారు. తైత్తిరీయ ఉపనిషత్తు శంకర భాష్యంలో "మనసశ్చ ఇంద్రియాణాం చ హైకాగ్ర్యం పరమం తపః" - మనస్సునూ, ఇంద్రియాలనూ వశంలోకి తీసుకురావడమే తపస్సు అన్నారు. అసలు 'తపః' అంటే కొలిమిలో పెట్టి కాల్చడం; భూమిని త్రవ్వి తీసిన ముడి లోహాలను కాల్చి, పరిశుద్ధమైన లోహాలుగా మార్చడం. అదే విధంగా ఆధ్యాత్మిక సాధకుడు తపస్సు ద్వారా మనస్సులో ఉన్న మలినాలను తొలగించి పరిశుద్ధం చేయడానికి ఈ తపస్సు ఉపయోగపడుతుంది.

'ఎవరు విజ్ఞానవంతుడో- వశీకృతమైన మనస్సు కలవాడో, సదా పరిశుద్ధుడో అతడు పునర్జన్మ రహితమైన ఆ పరమపదాన్ని చేరుకొంటాడు' అని కఠోపనిషత్తు చెబుతోంది.

భగవద్గీత 17వ అధ్యాయంలో శారీరక, వాచిక, మానసిక తపస్సుల గురించి శ్రీకృష్ణుడు తెలియజేశాడు. దేవతలనూ, గురువులనూ, తత్త్వవేత్తలనూ పూజించడం, శుచిత్వం, సత్ప్రవర్తన, బ్రహ్మచర్యం, అహింసలను శారీరక తపస్సుగా పేర్కొన్నాడు. ఇతరులకు భయాన్నీ, కష్టాన్నీ కలిగించకుండా, వినడానికి కష్టం కలిగించని సత్య వాక్యం, వేదాభ్యాసాలను వాచిక తపస్సుగా తెలిపాడు. చిత్తశుద్ధి, కనికరం, వాక్ నిరోధం, మనఃనిరోధాలను మానసిక తపస్సుగా శ్రీకృష్ణుడు వివరించాడు.

విచక్షణతో, శాంత స్వభావంతో, దయ, ప్రేమలను కలిగి ఉండే మనిషి మంచి పనులు చెయ్యగలుగుతాడు. తద్వారా తనకు తాను మంచి చేసుకోగలుగుతాడని స్వామీజీ చెప్పారు.

హనుమంతుడు శ్రీరామునితో ఏర్పడిన మొదటి పరిచయంలోనే ఆయన మెప్పును పొందాడు. శ్రీరాముడికీ, సుగ్రీవుడికీ మైత్రి కలిపాడు. రామాయణంలో హనుమంతుడి పాత్రను గమనించినట్లయితే ఎవరితో ఏ విధంగా మాట్లాడాలో, ఎక్కడ ఎలా మాట్లాడాలో అలా మాట్లాడడం చూస్తాం. స్వామి వివేకానంద చికాగో సర్వమత మహాసభలలో కేవలం "సోదర సోదరీ మణులారా" అన్న ఒక్క మాటతో మొత్తం ప్రపంచాన్నే జయించారు. స్వామీజీ వాక్చాతుర్యం మానవాళి పట్ల ఆయనకున్న ప్రేమ నుంచి పుట్టుకొచ్చింది. ఆయన మాట్లాడిన దానికి ప్రతిస్పందన కూడా అనూహ్యంగా వచ్చింది. శ్రీశారదాదేవి అవధులు లేని ప్రేమ చెడ్డవారిని సహితం సన్మార్గుల్ని చేసేది.

మాట్లాడడం కూడా ఒక కళే. మాట్లాడడం ఒక్కటే సరిపోదు. ఎవరికీ హాని కలిగించకుండా మాట్లాడాలి. ప్రేమతోనూ, అప్యాయతతోనూ మనం చెప్పదలచుకున్న దాన్ని చెబితే, అది ఇతరులకు నచ్చేలా, సంతోషం కలిగించేలా ఉంటుంది.

కలియుగంలో మనిషి అన్నగత జీవి. అడవులలోనూ, గుహలలోనూ సాధనలు చేయలేరు కనుక కేవలం సత్యాన్ని ఆచరించడమే ఈ కలియుగంలో తపస్సు అని శ్రీరామకృష్ణులు చెప్పారు. అంతేకాకుండా ఆయన స్వయంగా సత్యపాలన చేసి చూపించారు కూడా! ❖




## నవతరానికి నవీన సందేశం

– ఆరుద్ర శ్రీకాంత్

మా ఊరు వరంగల్ జిల్లా, డోర్నకల్ మండలం, ముల్కలపల్లి గ్రామం. నేను ఇంటర్ రెండో సంవత్సరం చదువుతున్న సమయంలో ఒక రోజు ఒక పుస్తకం కొన్నాను. ఆ పుస్తకం పేరు 'నా భారతం అమర భారతం'. అందులో స్వామీజీ ఆధ్యాత్మికతతో కూడిన భారతదేశాన్ని దర్శింప జేశారు. భారతదేశమంతా ఆధ్యాత్మికతతో మేళవింపబడాలనీ, ఆధ్యాత్మికతే భారతదేశానికి పునాది అనీ స్వామీజీ ఉద్ఘాటించారు.



భగవంతుడు ఎక్కడో లేడనీ, ఆకలితో అలమటిస్తున్న నిరుపేదల్లో, రోగుల్లో, అజ్ఞానిలో ఉన్నాడనీ వారికి సేవ చేయడమే నిజమైన పూజ అనే నవీన సందేశాన్ని ఇచ్చారు స్వామీజీ. ఆ సందేశాన్ని నేను పరిపూర్ణంగా స్వీకరించాను.

నేటి యువతరంపై స్వామీజీ ఎన్నో కలలు కన్నారు. ఆ కలలు కల్లలై పోతాయేమోనని నేటి యువతరాన్ని చూస్తే నాకు ఎక్కడో మూల ఒకింత బాధ, ఆవేదన ఉండేవి. కానీ రామకృష్ణమఠం వారు స్వామీజీ అమృత, ఆధ్యాత్మిక నవ భారత సందేశాన్ని అందజేస్తున్నారు. అందువల్ల నాకున్న భయం ఇప్పుడిప్పుడే మెల్లమెల్లగా తొలగి పోతోంది. ఎందుకంటే ఎప్పటికైనా యువత స్వామీజీ ఆదర్శాలను స్వీకరించి, సన్మార్గంలో పయనిస్తుందనే విశ్వాసం నాకుంది.

నేను ఇప్పుడు ఓపెన్ యూనివర్సిటీ ద్వారా డిగ్రీ చేస్తూ, ఒక ప్రైవేటు పాఠశాలలో ఉపాధ్యాయుడిగా పని చేస్తున్నాను. ఉపన్యాసాల ద్వారా నాతోటి మిత్రులకూ, నా విద్యార్థులకూ స్వామీజీ భావాలను అందిస్తున్నాను. 'భారత జాతికి నా హితవు, చికాగో నగర ఉపన్యాసాలు, వ్యక్తిత్వ వికాసం, వే టు సక్సెస్' మొదలైన పుస్తకాలను నేను అధ్యయనం చేశాను. వాటిలోని అంశాలను వీలైనంత వరకూ అందరికీ అందించాలన్నదే నా తపన. ❖

---

## సమస్యల తీరానికి చేర్చే స్వామీజీ సందేశం !

– జి. నర్సిములు

మాది మహబూబ్‌నగర్ జిల్లా, దామర్‌గిద్ద మండలం, మద్దెలబీడు గ్రామం. నేను ఇంటర్మీడియట్ చదువుతున్నప్పుడు చదువుపై ఏకాగ్రత కుదిరేది కాదు. అందువల్ల ఇంటర్‌లో పరీక్ష తప్పాను. ఆ సమయంలో అసలు ఏం చేయాలో తోచలేదు. 2004వ సంవత్సరంలో మా ఊరిలో వివేకానంద గ్రంథాలయాన్నీ, రామకృష్ణ సేవా సమితినీ ఏర్పాటు చేసిన మా శంకర్ రెడ్డి గారికి ధన్యవాదాలు. ఆ గ్రంథాలయానికి వెళ్ళి ఒక పుస్తకం చదివాను.



ఆ పుస్తకంలో ఈ సందేశాలను చదివాను – "మీరు ఎలా ఆలోచిస్తారో అలాగే అవుతారు. అందుకే జీవితంలో సానుకూల ఆలోచన ఉండాలి. కార్యరంగంలోనూ, పాఠశాలల్లోనూ, కళాశాలల్లోనూ ఎన్నో సమస్యలు ఎదురవుతాయి. ఆత్మవిశ్వాసం, పట్టుదల, దృఢ సంకల్పం ఉంటే వాటన్నింటినీ అలవోకగా దాటిపోవచ్చు". "మీ గమ్యాన్ని చేరే వరకూ ఆగకండి. సమస్యలు ఉన్నాయని కూర్చుంటే సమస్యలు తీరవు. ఆ సమస్యల వెంబడి పరుగెత్తండి". "విశ్వాసం ఉన్న వ్యక్తి నేను ఈ సముద్రాన్ని త్రాగేయగలను. కొండలను పిండి చేయగలను అని అనుకుంటాడు".

అసలు ఈ పుస్తకం నా కోసమే వ్రాశారా అన్నట్లు అనిపించింది. ఈ సందేశాలే నాలో ఆత్మవిశ్వాసాన్ని నింపి, విజయపథం వైపు నడిపించేలా చేశాయి. ఈ ఆత్మవిశ్వాసం కల్పించిన మాటలన్నీ స్వామీజీ సందేశాలే! ఆ విశ్వాసమే నేను ఇంటర్ స్థాయి నుంచి పి.జి. స్థాయి వరకూ ఎదగడానికి తోడ్పడింది. నాలో పట్టుదల పెరగడానికి కారణం స్వామి వివేకానందుల వారి సందేశమే! సోదర సోదరీమణులారా! స్వామీజీ చెప్పిన సందేశాలనూ, బోధనలనూ మనందరం ఆదర్శంగా తీసుకొని ఉన్నత శిఖరాలను అధిరోహిద్దాం ! ❖

# కనువిప్పు కలిగించిన కృష్ణుడు!

శ్రీకృష్ణుడు అర్జునుడికి స్నేహితుడు, రథసారధి, గురువు అని అందరికీ తెలిసిన విషయమే. కురుక్షేత్ర సంగ్రామం ముగిశాక తాను చేసిన పాపాలను తొలగించుకోవడానికి గంగాస్నానం చెయ్యాలనుకున్నాడు అర్జునుడు. శ్రీకృష్ణుడికి ఆ విషయం చెప్పి రథాన్ని గంగ ఒడ్డుకు తీసుకువెళ్ళమన్నాడు.

అర్జునుడి మనస్సులోని సంగతి కృష్ణుడికి అర్థమయింది. కృష్ణుడి విశ్వరూపాన్ని దర్శించినప్పటికీ అర్జునుడు, కృష్ణుడు స్వయం భగవానుడు అన్న విషయం విస్మరించాడు. కృష్ణుడు అర్జునుడు చెప్పినట్లే గంగానదీ తీరంలో రథాన్ని ఆపి, “అర్జునా! ఇక్కడ కొంచెం ఆగు. నేను దగ్గర్లోనే ఉన్న నా స్నేహితులను కలుసుకొని వస్తాను” అని చెప్పి, ఎటో వెళ్ళాడు.

ఇంతలో నలుగురైదుగురు వ్యక్తులు అర్జునుడు నిలబడిన చోటికి ఒక మృతదేహాన్ని మోసుకుంటూ వచ్చారు. వాళ్ళు తమలో తాము ఏదో విషయం గురించి కలహించు కుంటున్నారు. వారి సంభాషణ జాగ్రత్తగా విన్న మీదట అర్జునుడికి వాళ్ళు చితి వెలిగించడానికి నిప్పు తెచ్చుకోవడం మరచిపోయారని అర్థమయింది. కాసేపు వాదనలు అయ్యాక



వాళ్ళు శవాన్ని అక్కడే నేల మీద ఉంచి, నిప్పు తేవడానికి వెళ్ళారు.

కాసేపటికే శవం దగ్గరకు ఒక శునకం రావడం గమనించాడు అర్జునుడు. ఆ కుక్క, శవాన్ని వాసన చూడసాగింది. ముందుగా ముఖం, తరువాత చేతులు, ఆఖరున పాదాలు వాసన చూసి వచ్చిన దారినే కుక్క వెనుదిరిగింది. ఇదంతా చూసిన అర్జునుడు ఆశ్చర్యపోయాడు.

ఇంతలో మరొక కుక్క అటుగా వస్తూ, ఆ మొదటి కుక్కతో, “మిత్రమా! ఏమిటి సంగతి? రుచికరమైన ఆహారాన్ని ఆరగించకుండా వెళ్ళిపోతున్నావెందుకు?” అని ప్రశ్నించింది.

అందుకు మొదటి కుక్క, “అయితే విను! పూర్వ జన్మలో చేసుకున్న పాపాల కారణంగా నేను ఇప్పుడు కుక్కగా జన్మించాను. అయినా నేను అపవిత్రమైన ఆహారాన్ని స్వీకరించను. ఈ వ్యక్తి ముఖం, చేతులు, కాళ్ళు వాసన చూసి, ఇతను తన జీవితంలో ఒక్క మంచి పని కూడా చెయ్యలేదని గ్రహించాను. ఇతను ఎన్నడూ భగవన్నామాన్ని ఉచ్చరించలేదు. ఎవరికీ ఒక్క పైసా అయినా దానం చెయ్యలేదు. జీవితంలో ఒక్క మారు కూడా అతని కాళ్ళు దేవాలయం వైపు వెళ్ళలేదు. అందువల్ల నాకు ఇతని దేహం అస్పృశ్యమైనది” అని వివరించింది.

ఇదంతా విన్నాక రెండో కుక్క, “నువ్వు చెప్పినది నిజమే! అజ్ఞానం వల్ల మానవులు ఎలా పొరపాట్లు చేస్తారో చూడు! ఆ పక్కకు చూడు. అర్జునుడు రథంలో కూర్చొని ఉన్నాడు. అతను శ్రీకృష్ణుని సఖుడు, శిష్యుడు అయినా అజ్ఞానం అనే వలలో ఎలా చిక్కుకున్నాడో! అతను తన పాప ప్రక్షాళనానికి గంగానది దగ్గరకు వచ్చాడు. అర్జునుడి గురువు, పరబ్రహ్మ అయిన నారాయణుని పాదపద్మాల నుండే ఈ దేవనది ఉద్భవించిందన్న విషయాన్ని అతను విస్మరించినట్లున్నాడు. భగవంతుడితో సంబంధం కలిగి ఉండడం వల్ల సదరు వ్యక్తి మహా అదృష్టవంతుడు, అతను ఎన్నటికీ పవిత్రుడు. స్వయం శ్రీకృష్ణపరమాత్మతో సంబంధం కలిగి ఉన్నా అర్జునుడు తన పాప నిర్మూలనానికి గంగా స్నానానికి వచ్చాడు. అతడు ఎంతటి అజ్ఞాని!” అన్నది.

అంతా విన్న అర్జునుడు తీవ్రమైన ఉద్వేగానికి గురయ్యాడు. ‘శునకాలు చెబుతున్నది నిజమే. ఆ జగన్నాథునితో అనుబంధం ఉన్నా నా మనస్సులో ఏదో శంక మిగిలిపోయింది. సాక్షాత్తూ దేవదేవుణ్ణి పక్కనే పెట్టుకొని, పాపప్రక్షాళన అంటూ ఎక్కడికో వెళుతున్నాను. నేనెంత మూర్ఖుణ్ణి!’ అనుకున్నాడు అర్జునుడు.

కొద్దిక్షణాలలో శ్రీకృష్ణుడు తిరిగి వచ్చాడు. అర్జునుడు తన శిరస్సు వంచి, శ్రీకృష్ణుని పాదాల చెంత ప్రణమిల్లాడు. వెంటనే అతని తలను గంగాజలం కడిగింది. కృష్ణుడు తన ప్రియ సఖుడూ, శిష్యుడూ అయిన అర్జునుణ్ణి దగ్గరకు తీసుకున్నాడు. తాను విన్నదీ, చూసినదీ ఆ శ్రీకృష్ణుడి మాయ అని గ్రహించిన అర్జునుడు ఆనందాశ్రువులు రాల్చాడు. ❖

... 17వ పేజీ తరువాయి.

9 గ్వాలియర్ కోటలో గల ఒక దేవాలయంలో ఒక మహాత్ముడు విశేష పూజలు చేస్తే మహారాజు వ్యాధి నయమవుతుందని జోస్యులు చెప్పారు. జహంగీరు కోరిక ప్రకారం హరగోవింద్ సింగ్ అక్కడికి వెళ్ళి ప్రార్థనలు చేశాడు. చక్రవర్తి వెంటనే కోలుకున్నాడు.



10 గ్వాలియర్ కోటలో జహంగీరుకు ఎదురు తిరిగిన 52 మంది సామంత రాజపుత్రులు బందీలుగా ఉన్నారు. వారు ఎన్నో చిత్రహింసలకు గురవుతున్నారు. వారిని ఆదుకోవాలని హరగోవింద్ తీర్మానించాడు.

11 కోటకు అధికారి అయిన హరిదాసు, హరగోవింద్ సింగ్ భక్తుడు. అతడు హరగోవింద్ కోరినట్లు చెరలో ఉంటున్న సామంత రాజులను హింసలు పెట్టకుండా ఆప్యాయంగా చూసుకోవడం ప్రారంభించాడు. కొన్ని రోజుల తర్వాత...




12 హరగోవింద్ సింగ్ కోట విడిచి వెళ్ళడానికి జహంగీరు వద్ద అనుమతి పొందాడు వజీర్‌ఖాన్. ఈ విషయాన్ని హరగోవింద్ సింగ్‌తో చెప్పినప్పుడు...



13 వజీర్‌ఖాన్ ఈ విన్నపాన్ని మహారాజు ముందుంచాడు.



ఓ! హరసింగ్! చాలా తెలివిగలవాడే! సరే! నేను కూడా ఒక నిబంధన విధిస్తున్నాను. హరసింగ్ అంగీ (పొడవైన చొక్కా)ని పట్టుకొని, ఎంతమంది బయటకు రాగలిగితే అంతమందికీ విడుదల లభిస్తుంది!

14 హరసింగ్‌కి ఒక అద్భుతమైన ఆలోచన తట్టింది...

హరిదాస్! నువ్వు 52 నాడాలుగల ఒక పెద్ద అంగీ(పొడవైన చొక్కా)ని తయారుచేయి! దాన్ని నేను వేసుకున్న తరువాత సామంతులు తలకొక నాడాను పట్టుకుని బయటకు వచ్చేయవచ్చు!



గురూజీ! మీ విశాల హృదయానికి జోహార్లు!

15 అలానే అందరూ చెరసాల నుంచి విముక్తులయ్యారు. హరసింగ్ వెళ్ళి జహంగీరును కలుసుకున్నాడు.



హరసింగ్ అంగీని పట్టుకుని సామంత రాజులందరూ చెరసాల నుంచి విముక్తులైనది దీపావళి రోజునే! సిక్కులు ఆ శుభ దినాన్ని బందీ ఛోడ్ దివస్ – 'విముక్తినిచ్చే శుభదినం'గా పండుగ జరుపుకొంటారు.

16 హరసింగ్! రండి! తమ ప్రార్థనల వల్లనే నేను కోలుకున్నాను.



అంతా భగవంతుని కృపాకటాక్షం మహారాజా!



చివరికి గురు అర్జునదేవ్ మరణానికి కారణం సంతూషా అందించిన తప్పుడు సమాచారమే అని జహంగీరు తెలుసుకున్నాడు. అతనిని తగిన రీతిగా దండించే బాధ్యతను మహారాజు హరసింగ్‌కు అప్పగించాడు. జీవిత పర్యంతం వారిద్దరూ మంచి స్నేహితులుగా కలిసిమెలసి జీవించారు.

# గ్రంథ పరిచయం

## నారాయణ భట్టు



రచన: నోరి నరసింహశాస్త్రి
పేజీలు: 306, వెల: 135/-
ప్రతులకు: టాగూర్ పబ్లిషింగ్ హౌస్, కాచిగూడా చౌరస్తా, హైదరాబాద్ - 27

"తింటే గారెలు తినాలి. వింటే భారతం వినాలి" అనే సామెత తెలుగు భారతం వల్లనే పుట్టిందని పెద్దల మాట. నన్నయభట్టు భారతాన్ని తెలుగులో వ్రాయడానికి సహాయకుడు సహాధ్యాయి నారాయణ భట్టు. నారాయణ భట్టుకు సంబంధించిన జీవిత విశేషాలు తెలుగు ప్రజలకు అందకుండా మరుగున పడిపోయాయి. ఆయన జీవిత విశేషాలను చారిత్రక ఆధారాల ద్వారా పరిశీలించి, పరిశోధించి, ప్రముఖ రచయిత నోరి నరసింహశాస్త్రి 'నారాయణ భట్టు' నవలను తెలుగు ప్రజలకు అందించారు. 1950 ప్రాంతంలో తెలుగు ప్రజలనెంతో అలరించిన ఈ చారిత్రక నవల పునర్ముద్రణ పొందడం తెలుగు సాహిత్యాభిలాషుల అదృష్టం. ❖

- ఎం.వి. నాగప్రసాద్

## శ్రీ గురు చరిత్ర



రచన : ఓరుగంటి రామకృష్ణ ప్రసాద్
పేజీలు: 328, వెల రూ.90/-
ప్రతులకు: నవరత్న బుక్ హౌస్, 28-22-20, రహిమాన్ వీధి, అరండల్ పేట, విజయవాడ -520 002.

గురువుల గొప్పతనాన్ని లోకానికి వివరించడానికి త్రిమూర్తుల అంశతో దత్తుడు (అత్రి అనసూయల పుత్రుడు దత్తాత్రేయుడు) గురుస్వరూపంగా లోకంలో ప్రసిద్ధిగాంచాడు. దత్ అంటే ఇచ్చేవాడు అని అర్థం; సర్వుల కోరికలు తీర్చే కరుణామయుడు. "శ్రీగురు చరిత్ర" నామధారకునికి సిద్ధయోగీంద్రులు చెప్పున్నట్లుంటుంది. అంటే పరమాత్మ జీవునికి చెబుతున్న కథ ఇది. దీనిని శ్రీ గంగాధర సరస్వతి వ్రాయగా, శ్రీ వాసుదేవానంద సరస్వతి సంస్కృత భాషలో వ్రాశారు. దానిని అందరికీ అర్థమయ్యేలాగ సులభశైలిలో తెనుగించారు రచయిత శ్రీ ఓరుగంటి రామకృష్ణ ప్రసాద్. దత్త క్షేత్రాలలో శ్రావణ మాసంలో దీనిని నిత్యపారాయణ చేస్తారు. ఈ గ్రంథం ప్రతీ ఒక్కరూ నిత్యపారాయణ గానో, సప్తాహపారాయణ గానో చదివి గ్రహ గృహ బాధలన్నీ తొలగించుకోవచ్చు. ❖

-శ్రీమతి ఎన్. శేషు

## ఈశ్వరీయమ్



రచయిత: యముగంటి ప్రభాకర్
పేజీలు: 113, వెల : రూ. 50/-
ప్రతులకు : వై. ప్రభాకర్
టి.ఆర్.టి 284, విద్యానగర్ కాలనీ
హైదరాబాదు - 500 044

## శ్రీ త్యాగరాజు-భాగవతార్థము



గ్రంథకర్త : ఇలపావులూరి కామేశ్వరరావు
పేజీలు: 52, వెల : రూ. 35/-
ప్రతులకు : ఇలపావులూరి పినాకపాణి
ప్లాట్ నెం.4, కామాక్షీ నిలయం,
లక్ష్మీపురం సెంటర్, స్టోన్‌హౌస్‌పేట, నెల్లూరు

## భక్తులకు మంత్రోపదేశం



రామకృష్ణ మఠం, రామకృష్ణ మిషన్‌ల ఉపాధ్యక్షులు **పూజ్య స్వామి స్మరణానందజీ మహరాజ్** 2009 సెప్టెంబరు 9 నుంచి సెప్టెంబరు 23వ తేదీ వరకు హైదరాబాద్ రామకృష్ణ మఠంలో బస చేస్తారు. పూజ్య స్వామీజీ ఆసక్తిగల భక్తులకు **సెప్టెంబరు 13,16,18,20**వ తేదీల్లో మంత్రదీక్ష ప్రసాదిస్తారు. మరిన్ని వివరాల కోసం : **స్వామి జ్ఞానదానంద అధ్యక్షులు, రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029**ను సంప్రతించవలెను.

# వార్తావాహిని

## విద్యార్థులకు వేసవి శిబిరం

**హైదరాబాద్ రామకృష్ణ మఠం** బాలబాలికలకు నెల రోజుల పాటు వేసవి శిబిరాన్ని నిర్వహించింది. 1030 మంది విద్యార్థినీ విద్యార్థులు ఈ శిబిరంలో పాల్గొని యోగాసనాలు, భజనలు, గీతాపారాయణం మొదలైన అంశాలలో శిక్షణ పొందారు. డాక్టర్ ఎమ్.సి.ఆర్. మానవ వనరుల అభివృద్ధి సంస్థ అదనపు డైరెక్టర్ జనరల్ శ్రీ జె.ఎస్.వి. ప్రసాద్, ఐ.ఏ.ఎస్. గారు 2009 ఏప్రిల్ 26న ప్రారంభించిన ఈ శిబిరం మే 23న ముగిసింది. ఈ ముగింపు కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విశాఖపట్నం రేంజ్ డెప్యూటీ ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్, డాక్టర్ సౌమ్య మిశ్ర, ఐ.పి.ఎస్. పాల్గొని సంగీతం, వక్తృత్వ, పారాయణ పోటీల్లో విజేతలైన విద్యార్థులకు బహుమతి ప్రదానం చేశారు. విద్యార్థులు ప్రదర్శించిన సాంస్కృతిక కార్యక్రమాలు అందరినీ అలరించాయి. ❖ నివేదిక : స్వామి శ్రీకాంతానంద
















## ఐలా తుపాను బాధితులకు రామకృష్ణమిషన్ సహాయక చర్యలు

2009 మే నెలలో సంభవించిన ఐలా తుపాను కారణంగా పశ్చిమ బెంగాల్‌లోని పలు ప్రాంతాలు జలమయ మయ్యాయి. తుపానుకు గురైన ప్రాంతాల్లో రామకృష్ణ మిషన్ వేలాది మంది బాధితులకు -ఆహార పొట్లాలనూ, నిత్యావసర సామగ్రినీ, దుస్తులనూ, దుప్పట్లనూ, మందులనూ సరఫరా చేసింది. ఈ సహాయక కార్యక్రమాలు ఇంకా కొనసాగుతున్నాయి. తుపాను బాధితుల సహాయ, సేవా కార్యక్రమాల నిమిత్తం విరాళాలను కోరుతున్నాం. దాతలు



"Ramakrishna Mission" పేరున చెక్కు డి.డి. లేక నగదు రూపంలో విరాళాలను ఈ క్రింది చిరునామాకు పంపగలరు.

**The General Secretary**
**Ramakrishna Mission**
**P.O. Belur Math, Howrah**
**West Bengal - 711 202**
**Ph: 033 - 2654 5702, 2654 9681**
Email: rkmrelief@gmail.com
Website: www. belurmath.org

విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని 80(జి) సెక్షన్ క్రింద పన్ను మినహాయింపు కలదు. ❖

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) 'వేదచూడామణి'** : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

**(ఆ) 'వేదార్థచూడామణి'** : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
వయస్సు : 15 సం॥, ఆ పైన
స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) వేదాధ్యాపకుడు** : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవము : 2 సంవత్సరములు
సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

**(ఆ) వేదభాష్యాచార్యుడు** : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవార్హత : 5 సం॥
సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

హైదరాబాద్ కులప్రశాసకుడు




Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**



# సుబోధ

భగవద్దర్శనానికి తీవ్రపరితాపం ఒక్కటే నిశ్చితమైన మార్గం.

జటిలుడనే బాలుడు ఉండేవాడు. అతడు పాఠశాలకు ఒంటరిగా ఒక చిట్టడవి గుండా పోవలసి వచ్చేది. అడవి దాటడానికి ఆ బాలుడు భయపడేవాడు. ఈ మాట తల్లితో చెప్పగా, ఆమె ఇలా అంది: "నాయనా! నీకు భయం వేసినప్పుడల్లా కృష్ణుణ్ణి పిలువు". "కృష్ణుడు ఎవరమ్మా!" అని బాలుడు అడిగాడు. "కృష్ణుడు నీ అన్న" అని తల్లి చెప్పింది. ఆ తరువాత జటిలుడు అడవిని దాటుతూ "ఓ అన్నా! కృష్ణా! నువ్వెక్కడున్నావు? నాకు భయంగా ఉంది. వచ్చి నన్ను కాపాడు" అని అరిచాడు.

అంత విశ్వాసంతో మొరపెడుతున్న ఆ బాలుడి మొర ఆలకించకుండా, రక్షించకుండా కృష్ణుడు ఉండగలడా? కృష్ణుడొక చిన్నబాలుడి రూపంలో వచ్చి "తమ్ముడూ! వచ్చాను. నేను ఉండగా నీ కెందుకు భయం? నాతో రా! నేను నిన్ను పాఠశాలకు తీసుకువెళతాను" అన్నాడు. అలా ఆ బాలుణ్ణి పాఠశాల వద్ద విడిచిపెట్టి, "నువ్వు నన్ను పిలిచినప్పుడల్లా నేను వస్తాను, భయపడవద్దు" అని కృష్ణుడు అభయం ఇచ్చాడు.

నిజమైన నమ్మకం, భగవత్పరితాపం యొక్క మహిమ అలాంటిది. ❖

('శ్రీరామకృష్ణ బోధామృతం' నుంచి)

**శ్రీరామకృష్ణ ప్రభ**
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద
సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద



# సురభి

మాతృదేవి బృందావనంలో ఉన్నప్పుడు ప్రతిరోజూ రాధారమణుని దర్శించేవారు. ఒకరోజు మాతృదేవి రాధారమణుని ఆలయానికి వెళ్ళి కన్నీటితో "ఓ భగవంతుడా! ఇతరులలో తప్పులు చూసే స్వభావాన్ని నా నుండి పూర్తిగా తొలగించు!" అంటూ హృదయపూర్వకంగా ప్రార్థించారు.

ఈ విషయమై కాలాంతరంలో మాతృదేవి ఇలా అన్నారు: "ఇతరులలో తప్పులు చూసే స్వభావం నాకు కూడా మునుపు ఉండేది. ఆ స్వభావం తొలగిపోవాలని భగవంతుణ్ణి ఎంతో ఆర్తితో ప్రార్థించాను. అప్పటి నుంచి ఇతరుల తప్పులను చూసే స్వభావం నాలో పూర్తిగా తొలగిపోయింది. ఒక వ్యక్తికి మనం వెయ్యి సహాయాలు చేసి ఉండవచ్చు. కానీ పొరపాటుగా మన వల్ల ఒకసారి చెడు జరిగితే వెంటనే అతడు ఆగ్రహించి ముఖం తిప్పుకుంటాడు. ఇతరులలో తప్పులు మాత్రమే చూడడం మనిషి నైజం. కానీ ఇతరులలోని సుగుణాలను కూడా చూసి మెచ్చుకునే స్వభావాన్ని మనం అలవరచుకోవాలి. మానవ జీవితంలో తప్పులు జరగకుండా ఉండవు. కానీ అతడి తప్పులను మాత్రమే ఎప్పుడూ చూస్తూ ఉండకూడదు. నిర్విరామంగా ఇతరులలో తప్పులు చూసే వ్యక్తికి ఎక్కడ చూసినా తప్పులే కనిపిస్తాయి". ❖

(స్వామి యోగానంద స్మృతుల నుంచి)

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 66 సంచిక: 8 ఆగస్టు 2009



ఘనసంసారాహతులగు, జను లాకాంక్షింపఁ గడు నశక్యం బగు శో
భనము సమక్షంబున నహి, గనియెం దామసుఁడు రోషకలితుం డయ్యున్.

సంసార భారం చేత క్రుంగిపోయిన జనులు కోరడానికి కూడా సాధ్యం కాని పరమ శుభం నీ పాదస్పర్శ. అటువంటి భాగ్యాన్ని క్రోధం, రోషం నిండిన సర్పరాజు కాళియుడు పొందగలిగాడు. ఇది నీ సాన్నిధ్య మహిమ!

*('పోతన భాగవతం' దశమ స్కంధం-పూర్వభాగం నుంచి)*

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**........... రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాత పేరు | చిరునామా | రూ. |
|---|---|---|---|
| రాజ పోషకులు : | శ్రీమతి పి. జ్యోతి, | శ్యామలానగర్, గుంటూరు | 7,000 |
| పోషకులు : | శ్రీమతి పోణంగి భుజంగేశ్వరి, | మియాపూర్, హైదరాబాద్ (కీ॥శే॥ కాళ్ళకూరి శతకీర్తి జ్ఞాపకార్థం) | 1,400 |
| " " : | శ్రీ పోణంగి బాబూరావు, | మియాపూర్, హైదరాబాద్ (కీ॥శే॥ పోణంగి వీరభద్రమ్మ జ్ఞాపకార్థం) | 1,000 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు

**ముఖచిత్రం :** శ్రీకృష్ణ లీలలు - *(ఎడమ దిగువ నుంచి సవ్య దిశలో)* కేశి సంహారం, యశోదమ్మకు బ్రహ్మాండ దర్శనం, నవనీత చోరత్వం, గోవర్ధనోద్ధరణం, కాళియమర్దనం, యమళార్జున భంజనం, కంస సంహారం

### ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |

| చందా వివరాలు | | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|---|
| విడి ప్రతి | : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : | రూ. 1500 | $ 365 |

గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో Ramakrishna Math, Hyderabad అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.

## లోపలి పేజీల్లో...



### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

ప్రియ పాఠకులారా!

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

– సర్క్యులేషన్ మేనేజర్




**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com

సంపాదకీయం



# కైవల్యపదాన్నిచ్చే కాళియమర్దనం!

సంసారంలో ఉంటూ మనస్సుని భగవంతునిపై నిలపడం కష్టతరం కాబట్టి అన్ని విధులనూ విడిచిపెట్టి సాధన చేసిన వారికే భగవద్దర్శనం సాధ్యమని సామాన్యుల అభిప్రాయం. సంసారంలో ఉంటూనే భగవల్లాభం పొందిన భక్తుల సంఖ్య ఆధ్యాత్మిక చరిత్రలో అసంఖ్యాకం. గృహస్థులు సంసారంలో ఉంటూనే మానసికంగా నిస్సంగులై తమ కర్తవ్యాల్ని నిర్వర్తించాలని శ్రీరామకృష్ణులు ఉద్ఘాటించారు.

సంసారాన్ని సాగిస్తూ భగవంతుణ్ణి పొందడానికి బురదలో ఉంటూనే బురద అంటకుండా నిగనిగలాడే చేపలా, నీటిలో ఉంటూనే ఒక్క నీటి బొట్టు కూడా అంటని తామరాకులా ఉండాలని శ్రీరామకృష్ణులు బోధించారు. అయితే బురదలో ఉంటూ బురద అంటకుండా, నీటిలో ఉంటూ నీరు అంటకుండా ఉండడం ఎలా సాధ్యమనే ప్రశ్న ఉదయించక మానదు. అది ఎలా సాధ్యమవుతుందో శ్రీరామకృష్ణులే సోదాహరణంగా ఇలా వివరించారు:

'వడ్రంగి భార్య రోట్లో అటుకులు వేసి ఒక చేత్తో రోకలి పట్టుకొని దంపుతూ ఉంటుంది. రెండో చేత్తో బిడ్డకు పాలిస్తూ, అటుకుల్ని కలియబెడుతుంటుంది. అంతేకాకుండా అటుకులను కొనడానికి వచ్చిన వారితో బేరసారాలు చేస్తుంది. ఇలా ఆమె ఇన్ని పనులు చేస్తున్నా, అటుకుల్ని దంచుతున్నప్పుడు రోకలి తన చేతి మీద పడకుండా చూసుకోవడంలో మనస్సును అప్రమత్తంగా ఉంచుతుంది'.

అలాగే నిత్య జీవితంలో మన విధుల్ని నిర్వర్తిస్తూ కూడా సర్వదా భగవంతునిపై మనస్సును లగ్నం చేయాలి. అప్పుడు సంసారంలో ఉన్నా సంసారం అంటకుండా భగవంతుణ్ణి పొందవచ్చు.

ఎన్నో జన్మల సుకృత ఫలం వల్ల పొందిన అరుదైన ఈ మానవ దేహం ముక్తికి మూల సాధనం. ముక్తిని పొందడానికి ఒక అపూర్వ అవకాశాన్నిచ్చిన భగవంతుణ్ణి మరచి మోహాంధకారంలో మునిగి, రాగద్వేషాలు, అసూయా అహంకారాలతో వ్యవహరిస్తూ మానవజన్మ పరమార్థాన్ని మరచిపోతున్నాం.

సకల సౌకర్యాల్నీ సమకూర్చిన భగవంతుణ్ణి స్మరిస్తూ జీవనం సాగించకుండా, అహంకార పూరితుడై మనిషి తన వినాశనానికి తానే ఎలా కారకుడవుతాడో భాగవతంలో శ్రీకృష్ణుని లీలా వైభవాన్ని తెలియజేసే 'కాళియమర్దనం' ఘట్టాన్ని మన జీవితంతో అన్వయించుకోవచ్చు.

**అపాయాన్ని కలిగించే అసుర వృత్తి :** గరుత్మంతుని నుంచి ఎలాంటి అపాయమూ కలుగదని సౌభరి మహర్షి అభయం ఇవ్వడం వల్ల కాళియుడనే సర్పరాజు కాళింది మడుగులో తలదాచుకొన్నాడు. ఈ కాళింది మడుగులో తనను ఎదిరించే వారెవ్వరూ లేరనీ, తానే ఈ రాజ్యానికి మహారాజు అనీ అహంకారంతో అంధుడై ప్రవర్తించడం మొదలుపెట్టాడు. కాళియుడు మొత్తం మడుగులోని జలాన్ని విషపూరితం చేయసాగాడు. మడుగులోని జంతువులూ, ఆ నీళ్ళు త్రాగిన మనుష్యులూ ప్రాణాలను కోల్పోయేవారు.

సంసారమే కాళింది మడుగు. అందులో జీవిస్తున్న కాళియుడే మనిషి. సంసారమనే జనన మరణ చక్ర భ్రమణం నుంచి బయట పడడానికి భగవంతుడు ఇచ్చిన ఒక అపూర్వ అవకాశం ఈ మానవ జన్మ. కాళియునికి గరుత్మంతుని నుంచి ప్రాణహాని కలుగకుండా క్షేమంగా జీవించడానికి సౌభరి మహర్షి అభయమిచ్చాడు. అలాగే మనం సంసారమనే మడుగులో కూరుకు పోకుండా మృత్యువు నుంచి బయటపడి అమరత్వాన్ని పొందడానికి భగవంతుడు మానవ జన్మ ప్రసాదించాడు. ఈ మానవ జన్మ ఆధారంగా ఆనందామృతాన్ని గ్రోల వలసిన మనం మోహం అనే బురదలో కూరుకుపోవడం వల్ల విచక్షణా జ్ఞానాన్ని కోల్పోతున్నాం. మదమాత్సర్యాలనే విషాన్ని కక్కుతూ పరిసరాల్ని కలుషితం చేస్తున్నాం; అందరికీ హాని కలిగిస్తున్నాం.

**మదాన్ని అణచిన మాధవుడు:** కాళింది మడుగులో ఉన్న కాళియుడు అన్ని జీవులకూ హానికరంగా మారాడు. అతణ్ణి అంతమొందిస్తే కానీ రేపల్లె వాసులకు సుఖశాంతులుండవు అని తలచిన అచ్యుత కృష్ణుడు కాళియుని విషపు కోరలను విరిచి, పడగపై తాండవం చేస్తూ అతని మదాన్ని అణచివేశాడు. అప్పుడు కాళియుడు తనను క్షమించి రక్షించాల్సిందిగా శరణాగతి భావంతో చిన్ని కృష్ణుణ్ణి వేడుకున్నాడు. కాళియునిలో కృష్ణుని యందు సంపూర్ణ

శరణాగతి భావం కలగడం వల్ల అతనిలోని అభిమాన అహంకారాలనే అసుర గుణాలన్నీ మటుమాయమైపోయాయి.

మనం కూడా స్థాన, ధన, విద్య, అధికార బలగర్వాలతో మంచీ చెడుల మధ్య విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయి ఇతరులను హింసిస్తుంటాం. అలాంటప్పుడు భగవంతుడే ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ ఎన్నో గుణపాఠాలను నేర్పుతుంటాడు. మనకు తగిలిన ఎదురుదెబ్బల తాకిడితో మన తప్పులను తెలుసుకొని వివేకంతో వ్యవహరిస్తే అసుర గుణాల నుంచి విముక్తుల మవుతాం. ఎప్పుడైతే మనలోని అభిమాన, అహంకారాలు అణుగుతాయో అప్పుడే భగవంతుని యందు సంపూర్ణ



శరణాగతి భావం కలుగుతుంది. అప్పుడు భగవంతుని కృపకు పాత్రులమవుతాం.

సంపూర్ణ శరణాగతి భావం కలిగినప్పుడు మనలోని వాసనలన్నీ తొలగించే బాధ్యతను ఆ భగవంతుడే వహిస్తాడు.

**తదర్పితాఖిలాచారస్సన్ కామక్రోధాభిమా**
**నాదికం తస్మిన్నేవ కరణీయమ్** *(నారద భక్తిసూత్రాలు - 65)*

'తన సర్వస్వమూ భగవదర్పణ గావించిన వాడు, అతని కోర్కెలనూ, కోపాలనూ, అభిమాన దంభాలనూ కూడా ఆయనకే వదలాలి. వాటి బాధ్యత కూడా భగవంతునిదే'.

**మనఃఫలకంపై మాధవుని రూపం:** సంపూర్ణ శరణాగతి పొందిన కాళియునితో శ్రీకృష్ణుడు 'కాళియుడా! ఇప్పుడు కాళింది మడుగు వీడి, నీ స్వస్థలమైన రమణక ద్వీపానికి వెళ్ళు' అని చెప్పాడు. శ్రీకృష్ణునితో 'గరుత్మంతుని వల్ల నాకు ప్రాణహాని పొంచివుంది' అని కాళియుడు విన్నవించుకోగా 'కాళియుడా! ఇక మీదట ఎవరి నుండీ నీకు అపాయం వాటిల్లదు. నీ శిరస్సుపై నా పాద ముద్రలను చూసి గరుత్మంతుడు నీకు హాని తలపెట్టడు' అని అభయమిచ్చాడు శ్రీకృష్ణుడు. అనంత కృష్ణుని పాద ముద్రలు తన శిరస్సుపై ధరించిన కాళియుడు భయం వీడి, తన నిజ ధామానికి వెళ్ళి ఆనందంగా జీవితాన్ని కొనసాగించాడు.

భగవంతుణ్ణి శరణువేడినప్పుడు మనలోని దుర్గుణాలను శ్రీహరి హరింపజేసి, మనల్ని పవిత్రుల్ని చేస్తాడు. అలాంటి పవిత్రమైన మనస్సులో భగవంతుని దివ్య మంగళ రూపాన్ని ప్రతిష్ఠించి, ఆయన్ని ధ్యానిస్తూ, స్మరిస్తూ ఉంటే సంసారంలో అన్ని విధుల్నీ నిష్కామ భావంతో నిర్వర్తించడం సాధ్యమవు తుంది. మనస్సు భగవన్మయమైనప్పుడు ఈ ప్రపంచంలో మనకు ఎవరి నుండీ ఎలాంటి హానీ కలుగదు. సదా భగవంతుని చింతనలోనే చరించినవారు ఆయన పదసన్నిధిని తప్ప అన్యమేదీ కాంక్షించరు.

**ఒల్లరు నిర్జరేంద్రపద మొల్లరు బ్రహ్మపదంబు నొందగా**
**నొల్లరు చక్రవర్తిపద మొల్లరు సర్వరసాధిపత్యము**
**న్నొల్లరు యోగసిద్ధి మతి యొందు భవంబుల నొందనీని నీ**
**సల్లలితాంఘ్రి రేణువుల సంగతి నొందిన ధన్యు లెప్పుడున్**

*(పోతన భాగవతం- దశమ స్కంధం- 678)*

'అతి మనోహరములైన నీ పాదరేణువుల స్పర్శ పొందిన ధన్యులు దేవేంద్ర పదవిని ఇష్టపడరు. బ్రహ్మపదవిని గానీ, చక్రవర్తి పదవిని గానీ కోరరు. వరుణుని పదవిని గానీ యోగసిద్ధిని గానీ కాంక్షించరు. అలాంటి నీ పాదరేణువుల స్పర్శ ఏ జన్మలోనూ ఎవరూ పొందలేనిది (అత్యంత దుర్లభమైనది).'

శ్రీకృష్ణుని పాద ముద్రలు ధరించిన కాళియుడు నిర్భయంగా తన నిజధామానికి చేరుకున్నట్లు మనం కూడా భగవంతుని రూపాన్ని మన మనస్సులో ముద్రించుకొని, జనన మరణాలకు అతీత స్థితి అయిన 'అమరధామం' చేరుకోవడానికి ప్రయత్నిద్దాం. ❖

# ధ్యానం నేర్పుతారా?

**- స్వామి సుప్రియానంద**

ఈనాడు ధ్యానం చాలా ప్రాచుర్యం పొందిన అంశం. ధ్యానం ఎలా చేయాలండీ? ధ్యానం చెయ్యడం నేర్పుతారా? ఇవి రామకృష్ణ మఠాల్లో స్వాములు ఎదుర్కొంటున్న ప్రశ్నలు. దీనికి కారణం "ఎంతో మంది ఆధ్యాత్మిక గురువులు ఒక వారం రోజుల్లో ధ్యానం నేర్పుతాం, అంత సమయం ఇవ్వలేని వారికి మూడేమూడు రోజుల్లో ధ్యానం నేర్పుతాం" అని చెప్పడమే!

ధ్యానం ఎలా చేయాలో తెలుసుకునే ముందు, ధ్యానం ఎందుకు చేయాలి? అన్న ప్రశ్న మనలో ఉదయించాలి. మాటలు రాని పసిపిల్లవాడు ఏడ్చినప్పుడు, తల్లి బుజ్జగిస్తూ మొట్టమొదట పిల్లవాడు ఎందుకు ఏడుస్తున్నాడో తెలుసుకోవడానికి ప్రయత్నిస్తుంది. ఆ తరువాతే ఏం చేయాలి? ఎలా చేయాలి అన్న ఆలోచన.



ఒక అధ్యాపకుడు తన విద్యార్థులకు సైన్సులో ఒక ప్రయోగం నేర్పించారు. పరీక్షలో దాని గురించి "అది ఏమిటి? ఎలా జరుగుతుంది?" అని ప్రశ్నించారు. దానికి సమాధానంగా ఒక విద్యార్థి "ఏమిటంటే ఎలా చెప్పను? ఎలా అంటే ఏమి చెప్పను" అని వ్రాశాడు. ఎందుకా ప్రయోగం చేయాలి అన్న జ్ఞానం లేకపోవడం వల్లనే ఆ విద్యార్థి ఏమిటి? ఎలా? అన్న అంశాలను మర్చిపోయాడు.

ఒక పెద్దమనిషిని ధ్యానం ఎందుకు నేర్చుకోవాలనుకుంటున్నారని అడిగినప్పుడు "ధ్యానం చేస్తే రక్తపోటు (blood pressure) తగ్గుతుందని డాక్టరు గారు చెప్పారని బదులిచ్చాడు. కాబట్టి ఎందుకు అన్న ప్రశ్న మన అంతరంగంలో ఉదయించాలి. అది మన సొంత ఆలోచనవ్వాలి.

పతంజలి మహర్షి యోగానికి అంగాలు ఎనిమిది అని పేర్కొన్నారు. అవి 'యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధి'.

**యమ:** అహింస, సత్యవాక్పాలన, దొంగతనం చెయ్యక పోవడం, బ్రహ్మచర్యం, ఎవరినీ యాచించకపోవడం.

**నియమ:** బాహ్యాభ్యంతర శుద్ధి, దొరికిన దానితో తృప్తి, తపస్సు, వేదాధ్యయనం, భగవద్ధ్యానం.

**ఆసన:** కాసేపు ఒక చోట నిలకడగా కూర్చోగలగడం.

**ప్రాణాయామ:** శ్వాసను లయబద్ధం చేయడం. లయ బద్ధంగా ఉండే శ్వాస మనస్సును ప్రశాంత పరుస్తుంది.

**ప్రత్యాహార:** బాహ్య ప్రపంచం లోని వస్తువులు – పదార్థాల నుండి ఇంద్రియ అవయవాలను మరల్చి అంతర్ముఖం కావించడం.

**ధారణ:** ఒక వస్తువుపై మనస్సును స్థిరంగా ఉంచడం.

**ధ్యానం:** ఏకాగ్రం చేసిన వస్తువుపై అవిచ్ఛిన్న ధారగా చేసే భావనా ప్రవాహమే ధ్యానం.

యమ నియమాలు మొదటి సోపానాలు. వీటిని మనం ఆచరిస్తున్నామా అని గమనించాలి. సత్యవాక్పాలన పాటిస్తున్నామా, దొరికిన దానితో సంతృప్తికర జీవనం గడుపుతున్నామా అని ఆలోచించుకోవాలి.

మందిరంలో భజన జరుగుతున్నప్పుడు కొంతమంది భక్తులు బయట 'ఇష్టాగోష్టి' జరుపుతారు. కాసేపు కూడా కుదురుగా కూర్చోలేనప్పుడు ఆసనసిద్ధి ఎలా లభిస్తుంది? ఈ విధంగా ఆరుమెట్లు ఎక్కకుండా ఒక్కసారిగా ధ్యానం చేయబోవటం ఎంత వరకు సమంజసం? అది సాధ్యమవుతుందా? ఆలోచించండి. ❖

## పండుగలు - పర్వదినాలు

### ఆగస్టు - 2009

| | | | |
|---|---|---|---|
| 01 | శనివారం | : | ఏకాదశి |
| 05 | బుధవారం | : | స్వామి నిరంజనానంద జయంతి |
| 13 | గురువారం | : | శ్రీకృష్ణ జయంతి |
| 16 | ఆదివారం | : | ఏకాదశి |
| 19 | బుధవారం | : | స్వామి అద్వైతానంద జయంతి |
| 23 | ఆదివారం | : | వినాయక చతుర్థి |
| 31 | సోమవారం | : | ఏకాదశి |

### సెప్టెంబరు - 2009

| | | | |
|---|---|---|---|
| 13 | ఆదివారం | : | స్వామి అభేదానంద జయంతి |
| 15 | మంగళవారం | : | ఏకాదశి |
| 18 | శుక్రవారం | : | స్వామి అఖండానంద జయంతి |
| 28 | సోమవారం | : | విజయదశమి -శాంతిజల్ (సాయంత్రం హారతి తర్వాత) |
| 29 | మంగళవారం | : | ఏకాదశి |

# శ్రీరామకృష్ణులే శ్రీకృష్ణుడు!

- స్వామి జ్ఞానదానంద

స్వామి అంబికానందజీ తమ తండ్రి నవగోపాల్‌ఘోష్ శ్రీరామకృష్ణునిలో శ్రీకృష్ణుణ్ణి గాంచిన వైనాన్ని ఇలా వివరించారు:

"మా ఇల్లు కలకత్తాలోని బాదుర్‌బగాన్‌లో ఉండేది. ఒకమారు మా తండ్రి గారు శ్రీరామకృష్ణుల్ని మా ఇంటికి ఆహ్వానించారు. ఒక ప్రఖ్యాత గాయకుడు సంకీర్తన చేస్తుండగా గురుదేవులు హఠాత్తుగా లేచి గాయకుడు ఉన్న దగ్గరకు వచ్చి వారి ప్రక్కన చేతిలో మురళి పట్టుకుని శ్రీకృష్ణునిలా నిలబడ్డారు. ఆ దృశ్యం అత్యద్భుతంగా ఉంది. ఇతర భక్తులందరూ గురుదేవుల్ని చుట్టుముట్టి, సంకీర్తన చెయ్యడం మొదలుపెట్టారు. మా నాన్నగారు పువ్వులదండ ఒకటి పెద్దది తెచ్చి గురుదేవుల మెడలో వేశారు.

సంకీర్తన ముగిశాక గురుదేవులు క్రమంగా భావపారవశ్య స్థితి నుండి సహజ స్థితికి వచ్చారు. మా తండ్రి గారికి గురుదేవుల వదనంలో దీప్తిమంతమైన కాంతి కనపడింది. ముందు ఆయన ఇది తన భ్రమ అని తలచి, కళ్ళను నీటితో కడుక్కొని వచ్చారు. అప్పుడు కూడా అదే కాంతి కనపడింది".



నవగోపాల్ ధర్మపత్ని నిస్తారిణీఘోష్ శ్రీరామకృష్ణుల గురించి తమ అనుభవాన్ని ఇలా వివరించారు: "గురుదేవులు ఒకరోజు మా ఇంటికి వచ్చారు. వారిని చూడడానికి చాలా మంది భక్తులు వచ్చారు. గురుదేవులు రావడంతోనే తిన్నగా మేడ మీదికి వచ్చి నాతో మాట్లాడుతూ కాసేపు కూర్చున్నారు. అప్పట్లో మా పూజ గదిలో కృష్ణుడి విగ్రహం ఉండేది; నేను గురుదేవులతో "నాకు కృష్ణుణ్ణి చూడాలని ఉంది" అని చెప్పాను. వెంటనే వారు సరిగ్గా కృష్ణుడి భంగిమలో సమాధి స్థితికి చేరుకున్నారు. వారిని ఆ స్థితిలో చూడగానే చుట్టూ ఉన్న భక్తులందరూ ఉన్నత చైతన్య స్థితికి చేరుకున్నారు. తరువాత గురుదేవులు "నీకు తృప్తిగా ఉందా?" అని నన్ను అడిగారు. నేను "కృష్ణుడితో పాటు జంటగా రాధను కూడా చూడాలని ఉంది" అన్నాను. గురుదేవులు చిరునవ్వుతో, "ఓ! దాని కోసం నువ్వు కాస్త వేచి ఉండాలి" అన్నారు."

ఒకమారు శ్రీరామకృష్ణులు, స్వామి విజ్ఞానానందతో "కృష్ణావతారంలో గోపబాలకులతోనూ, గోపికలతోనూ బృందావనంలో నేను ఆటలు ఆడాను" అన్నారు. ఆ సంగతులను స్వామి విజ్ఞానానంద ఈ విధంగా జ్ఞాపకం చేసుకున్నారు: "గురుదేవులు అలా అన్న సమయానికి నేనింకా కళాశాల విద్యార్థిని. వారు అన్నది నాకు అర్థం కాలేదు.

గురుదేవులు నా సంశయాన్ని గ్రహించి గోపికల కృష్ణ ప్రేమను వివరించారు: "గోపికల ప్రేమ నిష్కపటమైనదీ, దివ్యమైనదీ, కృష్ణుని మురళీరవం వినగానే వాళ్ళు తమ తమ భర్తలను సైతం వదిలిపెట్టి కృష్ణుణ్ణి వెతుకుతూ పరుగులు తీసేవారు. వాళ్ళు తమ మనస్సులనూ, శరీరాలనూ... సమస్తాన్నీ కృష్ణార్పణం చేశారు. భాగవతంలో శరత్ పౌర్ణమినాటి రాత్రి గోపికలతో కృష్ణుడు రాసలీల సలిపినట్లు వర్ణించారు. రాసలీల సమయంలో కృష్ణుడు సమాధి స్థితికి చేరాడు, గోపికలు కూడా భక్తి పారవశ్యంతో సమాధి గతులయ్యారు."

ఇలా చెబుతూ గురుదేవులు బాహ్యస్మృతి కోల్పోయి సమాధి స్థితికి లోనయ్యారు. నేను కూడా గోపికలతో కృష్ణుడు సలిపిన దివ్యలీలను గురించి ఆలోచిస్తూ, దివ్యమైన మానసిక స్థితికి లోనయ్యాను".

ఒకమారు గురుదేవులు దక్షిణేశ్వర్‌లో రామ్‌లాల్ (తమ అన్న కుమారుడు) తో "కృష్ణుడిలా పచ్చటి వస్త్రం ధరించాలని ఉంది" అన్నారు. అప్పుడు రామ్‌లాల్ ఒక కొత్త బట్ట తెచ్చి శ్రీరామకృష్ణులకు ఇచ్చాడు. ఆ వస్త్రం ధరించి కృష్ణుడి విశేషణాలను ఉచ్చరిస్తూ వారు సమాధిస్థితికి చేరారు.

అనేక మంది భక్తులు శ్రీరామకృష్ణులలో తమ ఇష్ట దైవమైన శ్రీకృష్ణుణ్ణి దర్శించారు, ఎన్నో అనుభూతులను పొందారు. శ్రీరామకృష్ణులు సాక్షాత్తూ శ్రీకృష్ణ అవతారతత్త్వమే అనడానికి పైన ఉదహరించిన సంఘటనలే నిదర్శనాలు. ❖



# పరమహంస మాట పరమార్థానికి బాట

మన మనస్సుకు ఎప్పుడూ ఏదో ఒక ఆలంబనమంటూ ఉండాలి; లేకపోతే అది అశాంతికి లోనవుతుంది. లౌకిక ప్రపంచం పట్ల కలిగే నిరాసక్తత భగవంతుని పట్ల ఆసక్తికి దారి తీస్తుంది. ప్రేతాత్మవాదం పట్ల నిస్పృహ చెంది, నిరాసక్తుడైన నిరంజనుడు (స్వామి నిరంజనానంద) నిజమైన ఆధ్యాత్మికత కోసం అన్వేషిస్తూ దక్షిణేశ్వరం వైపు దారితీశాడు.

మొదటి సారిగా శ్రీ రామకృష్ణులను కలుసుకున్న తర్వాత, కొద్దికాలానికే మళ్ళీ ఆయనను కలుసుకోవాలని ఓ రోజు సాయంత్రం నిరంజనుడు దక్షిణేశ్వరం వెళ్ళాడు. ఆ సమయంలో శ్రీరామకృష్ణులు తన గదిలో చుట్టూ భక్తులు పరివేష్టించి ఉండగా కొలువు తీరి ఉన్నారు. అప్పుడాయన భగవంతుడి గురించీ, ఆయనను ఎలా సాక్షాత్కరించుకోవాలనే అంశం గురించీ ప్రసంగిస్తున్నారు. భక్తులు ఆయన చెప్పేదంతా శ్రద్ధగా వింటున్నారు. శ్రీరామకృష్ణులు నిరంజనుణ్ణి చూసిన వెంటనే అతని దగ్గరకు వచ్చి ఇలా హితవు చేశారు: “అబ్బాయీ! నువ్వు నీ మనస్సును భూతాల మీదా, ప్రేతాల మీదా లగ్నం చేస్తే, నువ్వు కూడా భూతానివే అయిపోతావు. అలా కాకుండా నీ మనస్సును భగవంతుడి మీద లగ్నం చేస్తే, నీ జీవితమంతా భగవన్మయమవుతుంది. మరి ఈ రెండింటిలో నీ కేది కావాలి?” అప్పుడు నిరంజనుడు, “నా మనస్సును భగవంతునికే అర్పిస్తాను” అని బదులు పలికాడు.

శ్రీరామకృష్ణుల ప్రేమపూర్వక బోధతో నిరంజన్ మహరాజ్(స్వామి నిరంజనానంద) తనను తాను సంపూర్ణంగా భగవంతునికి అర్పించుకొని ఆధ్యాత్మిక మార్గంలో అత్యున్నత స్థితికి చేరుకున్నారు. ❖

(ఆగస్టు 5, బుధవారం – శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన **స్వామి నిరంజనానంద జయంతి**)

దుఃఖాలు ప్రపంచపు అశాశ్వతత్వాన్ని అర్థమయ్యేలా చేస్తాయి. చిన్నతనంలో తల్లి మరణం, బాల్యంలో తండ్రి వియోగం, వృద్ధాప్యంలో భార్యావియోగం జీవితాన్ని శూన్యంగా మారుస్తాయి.

భార్యా వియోగ వేదనను భరించలేక గోపాల్ చంద్రఘోష్ (స్వామి అద్వైతానంద) తన స్నేహితుడు డా॥ మహేంద్ర పాల్ వద్దకు వెళ్ళాడు. మహేంద్ర శ్రీరామకృష్ణుల భక్తుడు. అందువల్ల దక్షిణేశ్వరంలో శ్రీరామకృష్ణులను దర్శిస్తే కొంత ఉపశమనం కలుగుతుందని సలహా ఇచ్చాడు.

1884 ఏప్రిల్‌లో గోపాల్ దక్షిణేశ్వరం వెళ్ళాడు. శ్రీరామకృష్ణులు గోపాల్‌కు దుఃఖోపశమనం కలిగేలా అతడి మనస్సును ప్రాపంచిక బంధాల నుంచి సమూలంగా వేరు చేసి, ఉన్నత స్థాయికి తీసుకెళ్ళారు. గోపాల్ ఈ ప్రపంచం ఎండమావిలోని నీటి లాగ అసత్యమనీ, దానికి సరియైన మందు వైరాగ్యమేననీ, దానితోనే దుఃఖాన్నీ ఎదుర్కొన గలననీ తెలుసుకున్నాడు.

స్వామి అద్వైతానంద శ్రీరామకృష్ణులతో తన ప్రథమ దర్శనం గురించి ఇలా గుర్తుచేసుకునే వారు: “అశాశ్వతమైన ప్రపంచం పట్ల గురుదేవుల మాటలు నా మనస్సులో చెరగని ముద్ర వేశాయి. రేయింబవళ్ళూ ఆయన గురించే ఆలోచించే వాణ్ణి. ఆయన వియోగం నాకు బాధ కలిగించేది. ఆయన సుందర వదనాన్ని మరువలేకపోయాను”.

గురుదేవుల సున్నిత వచనాలు గోపాల్ మహరాజ్ (స్వామి అద్వైతానంద) మనస్సుని భగవదున్ముఖం చేశాయి. సుఖదుఃఖాలకు అతీతమైన స్థితిని పొందాలనే తపనను ఆయనలో ద్విగుణీకృతం చేశాయి. ❖

(ఆగస్టు 19, బుధవారం – శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన **స్వామి అద్వైతానంద జయంతి**)



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -26

## ఎవరిచ్చినా, ఏదిచ్చినా బ్రహ్మార్పణమే!

హిందూ మహాసముద్రం, బంగాళాఖాతం, అరేబియా సముద్రాల సంగమ స్థలమైన కన్యాకుమారి ఒక పవిత్ర తీర్థ స్థలం. స్వామి జపానంద అక్కడ ట్రావన్కూర్ రాజ్య అతిథిగృహంలో బస చేశారు. ధర్మపరాయణుడైన ఒక అధికారి సన్న్యాసికి వసతి సౌకర్యాలు కల్పించాడు. ఆయనకు భోజనం ప్రతీరోజూ ఒక బ్రాహ్మణ భక్తుడు తీసుకువచ్చేలా ఏర్పాటు చేశాడు. కానీ అతను తరచూ పౌరోహిత్యం పనుల ఒత్తిడి వల్ల సన్న్యాసికి భోజనం చాలా ఆలస్యంగా తీసుకొచ్చేవాడు. ఉపాహారం పన్నెండు గంటలకూ, మధ్యాహ్న భోజనం సాయంత్రం నాలుగు గంటలకూ తీసుకువచ్చేవాడు. ఒక్కోసారి భోజనం లేకుండా సన్న్యాసి ఆకలితోనే గడపాల్సి వచ్చేది. ఇన్ని అసౌకర్యాలు న్నప్పటికీ సన్న్యాసి మాత్రం ఎన్నడూ అసంతృప్తిని వ్యక్తపరచలేదు.

సన్న్యాసి నివసించే గదికి ఎదురుగా ఉన్న గదిలో ఓ వృద్ధ దంపతులు ఉండేవారు. వారు సన్న్యాసికి కలుగుతున్న అసౌకర్యాన్ని గమనించేవారు. వాళ్ళు సన్న్యాసితో ఎప్పుడూ మాటలు కలపడానికి ప్రయత్నించలేదు. ఒకరోజు ఆ వృద్ధుడు వచ్చి "స్వామీజీ! పన్నెండయినా ఈ రోజు మీకు ఉపాహారం రాలేదు. ఇంట్లో బ్రాహ్మణుడు ఒక్కడే సంపాదించే మనిషి. అతనికి ముసలి తండ్రి ఉన్నాడు. దేవాలయ పనులతో పాటు ఇంటి బాధ్యతల్ని కూడా అతడే చూసుకోవాలి. అతడు ఈ రోజు మీకు భోజనం ఎప్పుడు తీసుకు వస్తాడో తెలియదు కాబట్టి మీరు అనుమతిస్తే భోజనం మేము ఏర్పాటు చేస్తాం" అని సన్న్యాసితో అన్నాడు.

సన్న్యాసి సరే అన్నారు. దాంతో, ఆ వృద్ధుడు ఆనందం పట్టలేక పరుగున తన గదిలోకి వెళ్ళాడు. తన భార్య చేత ముందుగా కాఫీ తయారు చేయించి సన్న్యాసికి ఇచ్చాడు. వాళ్ళు అభిమానంగా కలిపి ఇచ్చిన కాఫీ సన్న్యాసి తాగారు.

అదయ్యాక వృద్ధురాలు సన్న్యాసికి ఒక పళ్ళెంలో నాలుగు ఇడ్లీలు, పచ్చడి వేసి ఇచ్చింది. అవి చాలా రుచిగా ఉన్నాయి. స్వామి వివిధ ప్రాంతాల ఆహార పద్ధతుల గురించి, వంటలు, రుచుల గురించి మాట్లాడుతూ తిన్నారు. అలా కబుర్లు చెబుతూ, ఏడో ఎనిమిదో ఇడ్లీలు తిని, నాలుగు కప్పుల కాఫీ కూడా తాగారు. సన్న్యాసి ఆకలి తీర్చినందుకు ఆ వృద్ధ దంపతుల ఆనందానికి అవధులు లేవు. ఆనందంతో వారి కళ్ళు చెమ్మగిల్లాయి.

వృద్ధుడు సన్న్యాసితో "మేము క్షత్రియులం. బ్రాహ్మణులు కానీ, సన్న్యాసులు కానీ మా చేతి వంట తినరు. వాళ్ళు మమ్మల్ని అంటరానివాళ్ళుగా చూస్తారు. స్వయంగా వండి తన చేతులతో ఎవరైనా సాధువుకు భోజనం వడ్డించాలనే నా భార్య చిరకాలపు కోరిక ఇన్నేళ్ళకు తీరినందు వల్ల అంతులేని ఆనందం పొందుతున్నాం" అన్నారు.

వారి మాటలు విన్న స్వామి జపానంద కూడా కన్నీళ్ళు కార్చారు. "సన్న్యాసి జాతి, కుల, మత భేదాలకు అతీతంగా



ఉండాలి. సన్న్యాసాశ్రమం స్వీకరించేటప్పుడు ఈ భేదాలన్నీ అగ్నికి ఆహుతి ఇస్తాం. మాకు భిక్షగా వచ్చిన ఏ పదార్థాన్నైనా 'బ్రహ్మార్పణం' అనుకొనే, భుజిస్తాం" అన్నారు. దాంతో, ఆ వృద్ధ దంపతులిద్దరూ చేతులు జోడించి, "అయితే స్వామీజీ! మీరు ప్రతి దినం మా ఇంట్లో భోజనం చేయండి" అని సన్న్యాసిని ప్రార్థించారు. ఆప్యాయతతో కూడిన వారి ఆతిథ్యానికి స్వామి జపానందజీ మనస్సు ద్రవించింది. ❖ **అనువాదం: శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**

# దేవీ వైభవం

ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

**(...గత సంచిక తరువాయి)**

స్వారోచిష మనువు కాలంలో సురథుడు అని ఒకరాజు ఉండేవాడు. రాజు చక్కగా పాలన చేస్తూ ఉంటే కొందరు మంత్రులు, శత్రువులు అతణ్ణి వంచించారు. శత్రువుల వల్ల, తన వారి వల్ల కూడా వంచితుడై ఆయన అరణ్యాల పాలయ్యాడు. అరణ్యంలో తిరుగుతూ మనోవేదనతో "ఎలా ఉండేవాణ్ణి, ఇలా ఒంటరిని అయిపోయాను, ఏమయి పోయాయి ఆ సంపదలన్నీ? ఏవి ఎప్పుడు ఉంటాయో, ఎప్పుడు పోతాయో తెలియవు. జ్ఞాని అయినవాడు ఉన్నప్పుడు అహంకరించడం, లేనప్పుడు దిగులుపడడం చెయ్యకూడదు" అని బాధపడుతుండగా ఒక ఆశ్రమం కనిపించిందట.

అది సుమేధ అనే మహాత్ముని ఆశ్రమం. సురథుడు ఆ ఆశ్రమంలోకి వెళ్ళాడట. ఆ ఆశ్రమం ప్రశాంత వాతావరణంతో నిండివుంది. ఆశ్రమంలోని తపస్వులు అతనికి ఆశ్రయమిచ్చారు కానీ అతనికి మనశ్శాంతి లేదు. మనం ఎక్కడ ఉన్నామన్నది కాదు, మనస్సు ఎక్కడ ఉన్నది అనేది ప్రధానం. సురథుడి ఆవేదన "అంత రాజ్యం ఎంత కష్టపడి సమీకరించాను! చతురంగ బలాల్నీ. అవన్నీ ఎలా ఉన్నాయో! నేను లేచిన వెంటనే నాకు జేజేలు చెప్పిన వందిమాగధులూ, సేవకులూ ఏం చేస్తున్నారో..." ఇలా సాగుతోంది. ఆశ్రమంలోని వారంతా ప్రశాంతంగా, ఆనందంగా ఉన్నారు. మోహం కారణంగా ఇతని మొహం ఒక్కటే దిగులుగా ఉంది.

కొద్ది రోజులకు అతనికి మరొక దిగులు ముఖం కనపడింది. అతని దగ్గరకు వెళ్ళి "నీ పేరేమిటి, ఎందుకలా దిగులుగా ఉన్నావు" అని అడిగాడట. "సమాధిర్నామ వైశ్యోహం" – "నా పేరు సమాధి, నేనొక వైశ్యుణ్ణి" అన్నాడట. "నువ్వెందుకిలా వచ్చావు" అని అడిగాడట. "నా పుత్రుల మీద ప్రేమతో వారికి వ్యాపారంలో మెళకువలన్నీ నేర్పాను. వారికి నా మీద నమ్మకం లేక నా భార్యతో కలసి నన్ను ఇంటి నుంచి తరిమివేశారు" అన్నాడు. ఏ మన్వంతరం అయినా మనుష్యుల స్వభావాలు మారవు. రాగాలూ ద్వేషాలూ ఎప్పుడూ ఒకటే. మనిషి అప్పుడూ ఈర్ష్యాసూయలతో మిడిసిపడ్డాడు, ఇప్పుడూ మిడిసిపడుతున్నాడు. లోకంలో ఇది సహజమే. 'పుత్రాదపి ధన భాజాం భీతిః'– ధనవంతులకు పుత్రుల వల్ల కూడా ప్రమాదమే అన్నారు శంకరుల వారు.

"ఎంత విభవము కలుగు అంతయును ఆపదని చింతించుటయే కదా చెడని జీవనము" అన్నారు అన్నమాచార్య. సమాధితో "నువ్వు అక్కరలేదని తరిమికొట్టారు కనుక ఇక్కడ హాయిగా ఉండొచ్చు. ఇక దిగులెందుకు" అని సురథుడు అన్నాడు. "వాళ్ళ గురించి ఆలోచించకూడదనీ, అది మోహమనీ, అజ్ఞానమనీ నాకు తెలుసు. ఎన్ని తెలిసినా వాళ్ళ గురించి మర్చిపోవడం మాత్రం నాకు సాధ్యం కావడం లేదు" అన్నాడట సమాధి. మోహం అనేది మనం వదుల్చుకుంటే వదిలేదా, మనం తగుల్చుకుంటే వచ్చిందా? ఎలా వచ్చిందో ఆలోచిస్తే, ఎలా పోతుందో తెలుస్తుంది!

ఇద్దరూ గురుస్వరూపుడైన సుమేధ దగ్గరకు వెళ్ళి "మోహమని తెలిసి కూడా, దాని నుండి ఎందుకు బయట పడలేక పోతున్నాం" అని అడిగారట.

"మనుజుల ప్రేమలు మబ్బుల మెరుపులు నిలకడ కలవని నమ్మకుమీ" అన్నారు. "తొలుకారు మెరపులు తోచిపోవు గాక మెలకువ చూడ అవి నిలచేనా అలివేలుల ప్రేమలు ఆశపాతేగాక కలకాలం అవి కడదేరేనా ఏడవలపు ఏడ సుద్దులు" అంటారు అన్నమాచార్య. ఇవన్నీ కూడా కలలోని సంపదలట. అవి నిలిచేవా, పెట్టేవా?

ఆయన తెలివిగా ఈ మోహం నుంచి ఎలా బయటపడతానని అడిగాడు. "ఈ మోహం అనేది విశ్వమంతా పరుచుకుంది. జ్ఞానమంటే ఏమిటో ఎప్పుడైనా ఆలోచించావా? జ్ఞానం అంటే ఏమిటనుకుంటున్నావు? ఇంద్రియ జ్ఞానమా? ఇంద్రియజ్ఞానమే గొప్పది అనుకుంటే పశువుల కన్నా నువ్వు గొప్పవాడివని గర్వించడానికి లేదు. సృష్టిలోని ప్రతి జీవికీ కూడా తదింద్రియ గతమైన జ్ఞానం ఉంది. ఒకరిలో ఎక్కువ ఉంటే ఒకరిలో తక్కువ.

"మనుష్యులకు ఒక కుటుంబ వ్యవస్థ పిల్లలు ప్రేమ... ఇవన్నీ ఉంటాయి" అన్నాడట సమాధి. "అలాగా! అయితే అటు చూడు" అన్నాడు సుమేధ. ఏమిటీ అంటే అక్కడ ఒక

గూడు కనిపించిందట. ఆ గూటిలోకి ఒక పక్షి వచ్చి తన నోట్లోంచి ఆహారం పిల్లలకు ఇస్తోందట. "అది చేస్తున్నది, నువ్వు చేసింది ఒకటే కదా - కుటుంబాన్ని పోషించడం. వీళ్ళు నా పిల్లలు, బాగుండాలి అనే మోహం పక్షిలోనూ ఉంది, నీలోనూ ఉంది; అందరిలోనూ ఉంది. నీలో, పక్షిలో ఆ మోహశక్తి ఎవరిచ్చారో ఆలోచించు... ఏ మహామాయ ఈ జగత్తంతా వ్యాపించి నడుపుతున్నదో ఆ తల్లి "తయా విసృజ్యతే విశ్వం జగదేతత్ చరాచరమ్" - ఈ మోహం సర్వ జీవుల్లో ఆ తల్లే పెట్టింది. మోహమే లేకపోతే ప్రపంచం అనాథ అయిపోదా? పుట్టిన పిల్లాణ్ణి చూడగానే గత జన్మలో నేనెవరో, ఇతడెవరో అనుకొని తల్లి పట్టించుకోకపోతే అతడి గతి ఏమిటి? అందుకే మరుపు అనే తెర కప్పి ఉంచి "వీడు నా పిల్లాడు, వీడిని పోషించాలి... వీడు పెరిగి పెద్దవాడయ్యే దాకా చూసుకోవాలి'' అనే మోహం పుట్టిస్తుంది. ఆ మోహమే లేకపోతే జగత్తు అనాథ కాదా? అదే మోహం యొక్క సానుకూల దృక్కోణం. అదే ప్రతికూలత అయితే అమ్మ సృష్టిలో మోహాన్ని ఉంచదు.



శక్నోతీహైవయస్సోఢుం ప్రాక్శరీర విమోక్షణాత్। కామ క్రోధోద్భవం వేగం సయుక్తః ససుఖీనరః॥ అన్నాడు కృష్ణ పరమాత్మ. ఎవరు యోగి, ఎవరు సుఖి అంటే- ఎవరు తన శరీర విమోక్షణం లోపలే కామ క్రోధాల వేగాన్ని నియంత్రిస్తాడో వాడే యోగి, వాడే సుఖి. శరీరం పోయే లోపల అంటే ఈ శరీరం అనే సాధన పోతే ఈ కామ క్రోధాలనే అవిద్యను పోగొట్టుకునే మార్గం మరొకటి దొరకదు. అందుకే భగవానుడిచ్చిన ఈ ఉపాధిని సద్వినియోగం చేసుకుని రజోగుణ, తమోగుణాల్ని నియంత్రించుకోవాలి. రజోగుణం నుంచి ఉద్భవించిన కామక్రోధాల వేగాన్ని నియంత్రించుకునే సాధన ప్రతీ క్షణం చెయ్యాలి. దానికి నిగ్రహం చాలా అవసరం. ఆ కారణం చేతనే ఇక్కడ మోహానికి కూడా కొన్ని పరిమితులున్నాయి. సృష్టిలో ప్రతీ శక్తీ గొప్పదే. సృష్టిలో మోహాన్ని పెట్టింది అమ్మ. మోహం చాలా అవసరమే. మనం "మాతృదేవోభవ" అంటాం. అంటే - జగన్మాత మనల్ని కనికరించి అనుగ్రహించడానికి ముందు మన అమ్మలో "అమ్మ" అనే భావాన్ని పెట్టి, అక్కడ మోహాన్ని పెట్టింది. ఆ మోహం కూడా అమ్మవారి రూపమే. అది లేకపోతే మనం తరించలేం కనుక పెట్టింది. అయితే అది ఎంత వరకూ ఉండాలి - ఒక గృహస్థుగా ఎంత వరకూ అవసరమో అంతవరకే! ఆ తరువాత దానిలో నుంచి బయట పడాలి. మన వల్ల బయటపడడం అవదు అనుకుంటే ఈ మోహాన్ని నింపి ఉంచిన ఆ తల్లి పాదాలు పట్టుకుంటే, ఆవిడే ఆ మోహం నుంచి బయటపడేస్తుంది. పాశం వేసిన వాడే పాశం తీయగలడు. పాశం ఎందుకు వేశాడు, సంసారం లేకపోతే హాయిగా ఉండొచ్చు అనుకునేవాడు బద్ధకస్తుడు. గృహస్థ ధర్మం చెయ్యాల్సిందే! కానీ అందులో ఉంటూనే అది నేను కాదు అని ఉండగలగాలి. జీవుడు దాని నుండి బయట పడడానికి కావలసిన అసంగత్వంలో ఉన్నాడు అని తెలుసుకుంటే అమ్మే ఆ పాశం తీస్తుంది. కనుక "జగజ్జననిని ఆశ్రయించు" అని అప్పుడు అమ్మవారి చరిత్ర చెబుతున్నారు. అదే మహాకాళీ, మహాలక్ష్మీ, మహా సరస్వతీ చరిత్ర. మొదటిది మధుకైటభ సంహారం చేసిన మహాకాళీ చరిత్ర; రెండవది మహిషాసుర మర్దనం చేసిన మహాలక్ష్మి చరిత్ర; మూడవది శుంభ నిశుంభుల సంహారం చేసిన మహా సరస్వతి చరిత్ర. ఈ మూడూ కలిపి ఒకే శక్తి. రాక్షసులు ఉద్భవించి ప్రపంచానికి హాని చేసినప్పుడల్లా వారిని సంహరించి దేవతలనురక్షించడానికి నేను వస్తాను అన్నది అమ్మ. కానీ నిజానికి అమ్మ ఎప్పుడూ ఉన్నదే. జగద్రక్షణ కోసం ఆమె ఎప్పుడెప్పుడు ఆవిర్భవించిందో అన్ని చరిత్రలయ్యాయి, అన్ని రూపాలయ్యాయి, అన్ని నామాలయ్యాయి" అని మూడు చరిత్రలనూ చెప్పి ఇలాంటి జగదంబికను ఆశ్రయించండి అని వారే దగ్గరుండి ఉపాసన, దీక్ష అన్నీ ఇచ్చారు. అప్పుడు సురథుడు, సుమేధ భక్తితో అమ్మ వారిని ఉపాసన చేయగా అమ్మ వారు ప్రత్యక్షమయ్యారు. ❖ **సశేషం**



# సంకల్పంలోనే సమస్తం

ఓ రామచంద్రా! భ్రమకు లోనై పశ్చిమదిక్కును చూసి "ఇది తూర్పుదిక్కు" అనుకుంటే విజ్ఞులు ఏది పశ్చిమమో, ఏది తూర్పో చెప్పాక, అది అతడు గ్రహించడం వల్ల అంతవరకూ ఉన్న దోషజ్ఞానం తొలగిపోతుంది కదా! పురుషప్రయత్నం చేసేవారికి కొంత కాలానికి దోషజ్ఞానం తొలగుతుంది. అప్పుడు మనస్సును జయించడం సులభమే అవుతుంది.

ఒకడు అనుద్వేగంగా, ఓర్పుతో, నేర్పుతో ప్రయత్నిస్తేనే ధనం, పదవి, రాజ్యం లభిస్తాయి. మనోజయం కూడా అలా ప్రయత్నించిన వాడికే సిద్ధిస్తుంది. అయితే రాజ్యం, ధనం, పదవి మొదలైనవాటిలో రాజభయం, చోరభయం, శత్రు భయం లాంటివి ఉంటాయి. స్వర్గలోకంలో కూడా, "నా పుణ్యమంతా ఖర్చయితే, అధోలోకాలకి వెళ్ళాలేమో..." అనే మనోవ్యాధి ఉండవచ్చు. కానీ, "ఈ మనస్సును జయించి, ఆత్మలోనే నిలిపి ఉంచడం" అనే దానిలో అలాంటి క్లేశాలు ఉండవు. అలాంటి "స్వభావమాత్ర వ్యావృత్తి" అయిన 'ఆత్మస్థితి' కోసం ఈ జీవుడు ఎందుకు ప్రయత్నిస్తూ ఉండకూడదు? ఓ జనులారా! అలాంటి చిత్త లయ రూపమైన ఆత్మస్థితి పొందక పోవడానికి కారణం అజ్ఞానమే. "మేము ఈ పనులలో ఉన్నాం. అందుకే ఆత్మస్థితిని పొందలేకపోతున్నాం" అనడం ఏ మాత్రం భావ్యం కాదు. "సర్వం ఆత్మతత్త్వమే" అనుకొని, యథాతథం గానే మీ మీ ధర్మాలను నిర్వర్తిస్తూ ఉండండి. ఆత్మ యొక్క చమత్కారమంతా గ్రహించిన తరువాత, మీకు ఏది ఉచితమని అనిపిస్తే అలా చేయండి. (కర్మలు నిర్వర్తించండి – లేదా త్యజించండి).

కాబట్టి "ఆత్మతత్త్వమైన ఆ భగవంతుడే ఇదంతా" అని గ్రహించి, ఆ సంగ్రహణ శక్తి ద్వారా మనస్సును జయించండి. ఈ మాత్రపు భావన కలిగి ఉండడానికి కష్టమేమిటి?

మన పిల్లలను మనం మంచి పనులలోనే నియమిస్తూ ఉంటాం. అదే విధంగా ఈ మనస్సును కూడా ఉత్తమ మార్గంలోనే నియోగించాలి. లేకుంటే దీనిని జయించడం కష్టమే అవుతుంది. ఏ మహాత్ములైతే ఈ మనస్సును ఒక పద్ధతిగా నియంత్రిస్తూ, క్రమంగా దీనిని నశింపజేస్తారో, వారు ఎక్కడ ఉంటే అక్కడ ఇతరులను కూడా 'ముక్తుల్ని' చేయగలరు.

ఎడారిలోనే ఎండమావులు ఎదురవుతాయి. ఈ "సంకల్పాలు" అనే వ్యవహారం నుండే భయంకరం, భ్రమదాయకం అయిన అనేక విపత్తులు ఉత్పన్నమవుతున్నాయి. అయితే కొందరు మహనీయులు సంకల్పాలకు ఆవల ఉన్న ఆత్మతత్త్వాన్ని సర్వదా పొందుతూనే ఉన్నారు. ఓ రామా! ప్రళయం వచ్చినా, సప్తసముద్రాలూ ఉప్పొంగి లోకాలన్నీ మునిగిపోయినా, ద్వాదశాదిత్యులు ఒక్కసారిగా ప్రజ్వలించినా సరే తమ మనస్సును జయించివేసి సుస్థిరం చేసిన మహాత్ములు దుఃఖించరు. ఆనందాన్నీ పొందరు. తమ నిజస్థితిని వీడరు.

ఈ జగత్తులో, ఈ సృష్టిలో ఉత్తమోత్తమమైనది ఏదైనా ఉందీ అనుకుంటే, అది... అకృత్రిమం, జడరహితం అయిన అమనస్కమే.

ఈ జనులలో చాలామంది, "అయ్యో! ఏదో మహత్తరశక్తి, లేక 'విధి' అనేది మమ్మల్ని ఈ సంసారకూపంలో పడేసి బాధపెడుతోంది" అని అనుకొంటూ ఉంటారు. అది సరి కాదు. ఈ 'మనస్సు' అనే బీజంలో నుంచే సుఖ, దుఃఖాలు సంప్రాప్తిస్తున్నాయి. తన తలను తానే గోడకు బాదుకుంటూ "ఈ గోడ నన్ను హింసిస్తోంది" అనుకోవడం మూర్ఖత్వమే కదా! అలాగే, స్వసంకల్పరచన అయిన ఈ సంసార దోషాలకు ఎవరినో దూషించడం 'మూర్ఖత్వం' అని అనిపించుకుంటుంది. మనస్సు స్వసంకల్పాల నుండే ప్రభవిస్తోంది అని గ్రహించాలి. ❖

('శ్రీవసిష్ఠ రామ సంవాదం'
ఉత్పత్తి ప్రకరణం ఉత్తరార్ధం నుంచి)
**అనువాదం: వై. హెచ్. రామకృష్ణ**

ధీరవాణి

- స్వామి వివేకానంద

# సర్వత్రా ఆ సర్వేశ్వరుడే!

ఎవరెవరు ఏ యే రూపాల్లో ఉపాసిస్తారో, వారందరికీ ఆ యా రూపాల్లోనే విశ్వాసం కలిగిస్తాను. వారి దృక్పథాన్ని అనుసరించి, నేను వారికి దర్శనం ఇస్తాను" అన్నాడు శ్రీకృష్ణుడు.

లోకంలో అనేక రకాలైన ఆరాధనల్ని మనం చూస్తున్నాం. దేవుడి కోసమే దేవుణ్ణి ప్రేమించడం అత్యున్నతమైన ఆరాధన. దేవుడనేవాడు ఒకడుంటే లోకంలో ఇంత దుఃఖం ఎందుకుండాలి అనే ప్రశ్న తలెత్తుతుంది. భక్తుడు ఇలా జవాబిస్తాడు: "లోకంలో దుఃఖం ఉంది. అంతమాత్రం చేత దేవుణ్ణి ప్రేమించడం నేను మానుకోను. నా కష్టాన్ని తొలగించాల్సిందిగా నేను దేవుణ్ణి ప్రార్థించను. అతడు - ప్రేమస్వరూపుడు కాబట్టి నేనతణ్ణి ప్రేమిస్తాను."

ఈ జీవితాన్ని గడుపుతూ పవిత్రులం కావడం ఎలా? మనమంతా అడవులకో, కొండ గుహలకో పోదామా? దాని వల్ల మనకేం ప్రయోజనం? మనస్సు మన అధీనంలో లేనప్పుడు కొండగుహల్లో నివసించినంత మాత్రాన ఉపయోగం ఏమిటి? ఈ మనస్సే అక్కడ కూడా మనకు అవరోధం కల్పిస్తుంది. గుహలో మనకు ఇరవై భూతాలు ప్రత్యక్షమవుతాయి. ఎందుకంటే అవన్నీ మన మనస్సులో ఉన్నవే కాబట్టి, మనస్సు మన అధీనంలో ఉంటే మనం ఉన్న చోటనే గుహను సృష్టించుకోవచ్చు.



మనకు ప్రపంచం కనబడే తీరు మన మానసిక స్థితి మీద ఆధారపడి ఉంటుంది. మన మనోభావాలను అనుసరించి వస్తువులు సుందరంగానో, వికృతంగానో కనబడతాయి. లోకమంతా మన మనస్సులోనే ఉంది. సమ్యక్ దృక్పథంతో వస్తువులను చూడడం అలవరచుకోండి. ముందుగా ప్రపంచం మీద విశ్వాసం ఉంచండి. ప్రతి దానికీ అర్థం ఉందని నమ్మండి. లోకంలోని ప్రతి వస్తువూ మంగళకరమైంది, పవిత్రమైంది, సుందరమైంది. మీకేదైనా చెడు కనబడితే దాన్ని మీరు సరైన దృష్టితో దర్శించలేదని గ్రహించండి. భారం మీ మీదే వేసుకోండి! లోకం భ్రష్టమైపోతున్నట్లు మనకు తోచినప్పుడల్లా మనల్ని మనం విశ్లేషించుకోవాలి. ఆ తరువాత వస్తువుల యథార్థ స్వరూపాన్ని చూసే శక్తి మనలో లోపించిందని తెలియవస్తుంది. రేయింబవళ్ళూ కృషి చెయ్యండి. "చూడండి! ప్రతి కర్మా బంధమే. నేను నిష్కామంగా కృషి చేస్తాను. నిమిషమైనా పని మానుకుంటే అరాచకం, సంక్షోభం ఏర్పడతాయి. కాబట్టి మీరూ నిష్కామంగా పనిచెయ్యండి."

ఈ ప్రపంచం ఒక ఆట. ఆటలో మీరు భగవంతుడి సహచరులు. ఏ విధమైన దుఃఖానికీ, దైన్యానికీ తావివ్వక, మీ కర్తవ్యాన్ని నిర్వర్తించండి. మురికి వాడల్లో, విశాలమైన చావడుల్లో అతడి ఆటను గమనించండి. ప్రజోద్ధరణకు కృషి చేయండి. వారు నికృష్టులు, పతితులు అనే భావంతో మాత్రం కాదు. ❖

# పరిప్రశ్న

**- స్వామి మేధానంద పురి**

- ఎస్.ఆర్.ఎన్. స్వామి, గిద్దలూరు

**? : ధర్మం, అర్థం, కామం, మోక్షం - ఇవి నాలుగు పురుషార్థాలు. కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం - ఇవి ఆరు శత్రువులు. పురుషార్థంలోని కామం, అరిషడ్వర్గాలలోని కామం - ఈ రెండిటి గురించి వివరించగలరు.**

✍ : ధర్మార్థాలలోని కామం అంటే నిషిద్ధకర్మలు వదిలి వేదవిహితకర్మలు ఆచరించి స్వర్గాదులు పొందడం. కర్మఫలం నశించిన తరువాత మిగిలిన కర్మల ఫలం అనుభవించడానికి వీరు తిరిగి భూలోకంలో జన్మిస్తారు. మాటిమాటికీ స్వర్గం నుంచి పతితులు కావడం వల్ల కామ్య కర్మలను నిష్కామభావంతో చేసి, మనస్సు శుద్ధి చెందిన తరువాత మోక్షార్థులు అవుతారు.



'పుత్రకామేష్టి', 'అశ్వమేధం'- కామ్యకర్మలే. "దశపూర్ణ మాసాభ్యం స్వర్గకామోయజేత" - అంటే స్వర్గాన్ని అభిలషించేవాడు దశపూర్ణయాగం చెయ్యాలి. "దధ్నా జుహోతి ఇంద్రియకామః" - ఇంద్రియ పుష్టి కోరేవారు పెరుగుతో హోమం చేయాలి. ఇవి విహిత కర్మలు.

పురుషార్థంలోని అర్థ కామాల్ని ధర్మబద్ధంగా అనుభవిస్తూ, మానవజన్మ పరమార్థమైన మోక్షాన్ని పొందాలి.

ఇక, అరిషడ్వర్గాలలోని కామం 'విషయేంద్రియజన్య సుఖం'. *'ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్...'* - కామవాసనలు గల పురుషుడు శాంతిని పొందలేడు అని గీతోపదేశ భావార్థం. కామం ద్వారా విషయాభిలాషి అయినవాడు మోక్షాన్ని పొందలేడు. మోక్ష ప్రాప్తికి ఈ కామం బంధ హేతువు. కాబట్టి పరమ పథం చేరడానికి అరిషడ్వర్గాలలోని కామాన్ని త్యజించాలి.

- బలివాడ వెంకట సుధాకరరావు, చీపురుపల్లి

**? : చతుష్షష్టి కళలు, షోడశ కళలు వివరించగలరు?**

✍: కళలు అరవై నాలుగు. అవి -

1. ఇతిహాసం 2. ఆగమం 3. కావ్యం 4. అలంకారం. 5. నాటకం 6. గాయకత్వం 7. కవిత్వం 8. కామశాస్త్రం 9.దురోదరం (పాచికలాడుట) 10. దేశభాషా లిపి జ్ఞానం 11. లిపి కర్మం 12. వాచకం 13. అవధానం 14.సర్వశాస్త్రం 15. శాకునం 16. సాముద్రికం 17. రత్నశాస్త్రం 18.రథాశ్వగజకౌశలం 19.మల్లశాస్త్రం 20. సూదకర్మం (పాకశాస్త్రం) 21. దోహదం 22. గంధవాదం 23.ధాతువాదం 24.ఖనివాదం 25.రసవాదం 26.జలవాదం 27.అగ్నిస్తంభం 28. ఖడ్గస్తంభం 29. జలస్తంభం 30. వాక్‌స్తంభం 31.వయుస్తంభం 32.వశ్యం 33.ఆకర్షణం 34.మోహనం 35. పరకాయ ప్రవేశం 36.ఉచ్చాటనం 37. మారణం 38. కాలవంచనం 39. విద్వేషణం 40.పాదుకాసిద్ధి 41.వాక్‌సిద్ధి 42.ఘుటికాసిద్ధి 43.ఐంద్రజాలికం 44. అంజనం 45.దృష్టివంచనం 46.స్వరవంచనం 47. మణిమంత్ర ఔషధాదిసిద్ధి 48. చోరకర్మం 49.చిత్రక్రియ 50.లోహక్రియ 51.అశ్మక్రియ 52.మృత్క్రియ 53. దారుక్రియ 54. వేణుక్రియ 55.చర్మక్రియ 56.అంబరక్రియ 57.అదృశ్యకరణం 58.దూతీకరణం 59. మృగయ 60.వాణిజ్యం 61.పాశుపాల్యం 62 కృషి 63.ఆసవకర్మం 64. ప్రాణిద్యూత కౌశలం

*(ఆధారం: శబ్దరత్నాకరము, రచయిత: బహుజనపల్లి సీతారామాచార్యులు, 17వ ముద్రణ, 2004)*

షోడశ కళలు: ఆ పరబ్రహ్మం ప్రాణాన్ని సృష్టించాడు. ఇక్కడ ప్రాణమంటే హిరణ్యగర్భుడు. 1.ప్రాణం 2. శ్రద్ధా 3. ఆకాశం 4. వాయువు 5. అగ్ని 6. జలం 7. భూమి 8. జ్ఞానేంద్రియ కర్మేంద్రియ దశకం 9. మనస్సు 10. అన్నం 11. బలం 12. తపస్సు (అంతః కరణ శుద్ధి సాధనం) 13. మంత్రాలు 14. కర్మం 15. లోకాలు 16. ప్రాణుల పేర్లు. ❖ *(ఆధారం: 'ప్రశ్నోపనిషత్తు', 6.4)*

- రెంటాల జయదేవ

# శుభాలనిచ్చే శంఖం

ఎవరి ఇంట్లో అయితే, దక్షిణావర్తమైన శ్వేత శంఖాలు రెండు నిత్యపూజలు అందుకుంటూ ఉంటాయో, ఆ ఇంటి యజమాని సదా ఉచ్ఛస్థితిలో ఉంటాడు. ఏ కార్యం చేపట్టినా అందులో విజయం సాధిస్తాడు. అపజయాలు, దుర్దశలు ఆ వ్యక్తి దరిదాపుల్లోకి కూడా రావని ప్రజల నమ్మిక.

వర్తకులు చాలా మంది తమ దుకాణాల్లో తెల్లటి శంఖం ఉంచి, నిత్యపూజలు చేస్తుంటారు. అందువల్ల వ్యాపారం దినదినాభివృద్ధి చెందుతుందనేది చాలా మందికి స్వానుభవం. దక్షిణావర్తమైన తెల్లటి శంఖంలో నీళ్ళు పోసి, ఆ నీటిని ఇంట్లో నలుదిశలా, కుటుంబ సభ్యులందరి మీదా పర్వదినాల్లో చల్లుతుంటారు. ఇలా చేయడం వల్ల ఆ ఇంటిని కానీ, ఇంట్లోని వారిని కానీ ఎలాంటి కష్టాలూ పీడించవని నమ్మకం. దుష్ట గ్రహ ప్రభావం సైతం నిర్వీర్యమై పోతుంది. ఇక, ఈ శంఖంలో పాలు పోసి, లక్ష్మీ యంత్రానికీ, లక్ష్మీదేవికీ నైవేద్యం పెట్టడం వల్ల సిరిసంపదలు లభిస్తాయి.

**శంఖంతో అభిషేకం:** శాస్త్ర ప్రకారం శంఖం లక్ష్మీ స్వరూపం. దేవుడికి అభిషేకం చేసే అధికారం లక్ష్మీదేవికే ఉంది. కాబట్టి, లక్ష్మీదేవి ముఖాంతరంగా మనం పూజ చేయాలనేది నియమం. ఆ రకంగా అభిషేకంలో శంఖానికి ప్రత్యేక స్థానం ఉంది. ఏ యే పూజల్లో శంఖాన్ని వినియోగించాలో మన పెద్దలు చెప్పారు:

***మహాభిషేకం సర్వత్ర శంఖేనైవ ప్రకల్పయేత్।***
***సర్వత్రైవ ప్రశస్తోబ్జః శివ సూర్యార్చనం వినా।***
*(తిథి తత్త్వే బ్రాహ్మే)*

*'సర్వదేవతా పూజల్లోనూ శంఖంతో మహాభిషేకం చేయాలి. శంఖంతో శివ సూర్యులను మాత్రం అభిషేకించ రాదు'.*

**శంఖంలో పోస్తేనే తీర్థం! :** 'శంఖంలో పోస్తే కానీ, తీర్థం కాదు' అని మన వాళ్ళు అంటుంటారు. వైజ్ఞానికంగా చూస్తే మనిషి ఆరోగ్యానికి క్యాల్షియం ఎంతో కీలకం. క్యాల్షియం కార్బొనేట్, తదితర ఖనిజాలతోనే శంఖం తయారవుతుంది కాబట్టి, దానితో అభిషేకం చేసేటప్పుడు శంఖ స్పర్శతో ఆ అభిషేక జలానికి కొద్దిగా క్యాల్షియం వచ్చి చేరుతుంది. శంఖం ద్వారా తీర్థం స్వీకరించినప్పుడు అది మనిషిలోని వాత పిత్త దోషాల్ని హరిస్తుంది. బలాన్నీ, కాంతినీ ప్రసాదిస్తుంది. స్వామి తీర్థాన్ని పుచ్చుకొనేవాళ్ళు ఆరోగ్యంగా ఉంటారనీ, తులసితో కూడిన సాలగ్రామ తీర్థాన్ని శంఖం ద్వారా స్వీకరించినవారిలో అనేక రోగాలు నశిస్తాయనీ 'పరమ పురుష సంహిత' పేర్కొంటోంది. తీర్థాన్ని మూడు సార్లు పుచ్చుకొంటారు. ఒకటి శరీర శుద్ధికి! రెండోది ధర్మసాధనకు! మూడోది పరమ పదం కోసం!! తీర్థాన్ని స్వీకరించే సమయంలో సాధారణంగా -

***అకాల మృత్యు హరణం సర్వవ్యాధి నివారణమ్ ।***
***సమస్త పాప శమనం విష్ణుపాదోదకం శుభమ్ ॥***

అనే శ్లోకం పఠిస్తారు. విష్ణుపాదోదకమైన తీర్థం శుభకారిణి. ఆ తీర్థ సేవనం ద్వారా అకాల మృత్యువును పోగొట్టుకోవచ్చనీ, సర్వ వ్యాధులనూ నివారించుకోవచ్చనీ, సమస్త పాపాలనూ క్షయం చేయవచ్చనీ హిందువుల విశ్వాసం.



**శంఖతీర్థం స్వీకరించడం వల్ల ఫలితం:** శంఖం ద్వారా ఇచ్చే తీర్థాన్ని ఎలా స్వీకరించాలంటే:

***చతుర్గుణీ కృత వస్త్రే పాణిం నిధాయ తేనాదౌ శంఖతీర్థం శిరసి ధారయేత్ ।***
***శంఖ మధ్య స్థితం తోయం ।***
***భ్రామితం కేశవోపరి।***
***అంగ లగ్నం మనుష్యాణాం ।బ్రహ్మహత్యా యుతం దహేత్ ॥*** *(నిత్య కర్మాష్టకే)*

'నాలుగు మడతలు పెట్టిన వస్త్రం మీద కుడి చేతిని ఉంచాలి. ముందుగా అందులోకి శంఖ తీర్థాన్ని తీసుకొని, 'వక్ష్యమాణ' మంత్రం చెప్పి, శిరస్సున జల్లుకోవాలి'.

'శంఖ మధ్యమున ఉండేదీ, విష్ణు ప్రదక్షిణం చేసినదీ అయిన ఈ శంఖ తీర్థం మానవుల శరీరాన్ని స్పృశించి, బ్రహ్మ హత్యల వల్ల కలిగే పాపాన్ని సైతం పోగొడుతుంది'.

**ఏది ఉత్తమ శంఖం?:** సముద్రంలో పుట్టిన శంఖానికి చంద్రుడి ఆశీర్వాదాలు ఉన్నాయి. ప్రతీకాత్మకంగా చూస్తే గాలి, ప్రకృతి, మొత్తం నవగ్రహాలన్నీ శంఖంలో ఉంటాయని మన పూర్వీకులు చెబుతారు. అసాధారణమైన ఈ శంఖం శత్రువులను బలహీనపరిచి, యజమానికి ఆయుర్దాయ మిస్తుంది. వ్యాధులనూ, దారిద్ర్యాన్నీ, అజ్ఞానాన్నీ పారద్రోలుతుంది. ఇక, శంఖాన్ని చెవి దగ్గర ఉంచుకొన్నప్పుడు మంద్రమైన శబ్దాలు వినిపిస్తే, అది ఉత్తమమైన శంఖం. ❖

(వచ్చే సంచికలో... 'మహర్షుల మాట')



# గణపతి చేసిన శివ కేశవ ప్రతిష్ఠ

కథ: టి.ఎం.ఎస్. చిత్రాలు: శంకర్ తెలుగుసేత: స్వామి జ్ఞానదానంద




5
నాయనా! ఈ శివలింగాన్ని కొంతసేపు నీ వద్ద ఉంచు! నేల మీద మాత్రం పెట్టవద్దు. నేను సంధ్యావందనం ముగించుకొని వచ్చి శివలింగాన్ని మళ్ళీ తీసుకుంటాను.
నేను త్వరగానే వచ్చేస్తాను.
అయ్యా! మీరు మరీ ఆలస్యం చేయకుండా తొందరగా వచ్చేసేయాలి. నేను ఎక్కువసేపు ఈ శివ లింగాన్ని పట్టుకోలేను.
రావణుడు సంధ్యావందనం పూర్తి చేసి వచ్చేసరికి కొంత ఆలస్యం అయింది. బాలుని రూపంలో వచ్చిన వినాయకుడు ఆ శివలింగాన్ని నేల మీద ఉంచేశాడు. రావణుడు దాన్ని కదిలించి, చేతితో పెళ్ళగించి తీసుకువెళ్ళాలని ఎంతగానో ప్రయత్నించాడు. కానీ దాన్ని అస్సలు కదల్చలేకపోయాడు.
6
ఏమిటి నాయనా! ఇలా చేశావు?
నన్నేం చేయమంటారు? మీరు తిరిగి రావడానికి చాలా సమయం తీసుకున్నారు. అది సరే! మహాబలశాలి అయిన మీరు కూడా అస్సలు కదల్చలేకపోయిన ఈ శివలింగాన్ని ఇక్కడే “మహాబలేశ్వరుడు” అనే పేరుతో ప్రతిష్ఠ చేయండి.
రావణుడు శివలింగాన్ని పట్టుకుని లాగినప్పుడు అది ఆవు చెవి (గోకర్ణం)లాగ మారి పోయింది. శివలింగం ప్రతిష్ఠింపబడిన ఆ ప్రదేశం కర్ణాటక సరిహద్దులలో ఉన్న గోకర్ణ క్షేత్రం.
7
వినాయకుడి కృపాకటాక్షాన్ని తెలియజేసే మరొక కథ ఉంది. వనవాసం ముగించుకొని తిరిగి వచ్చిన శ్రీరాముని పట్టాభిషేకం వైభవంగా ముగిసింది. విచ్చేసిన అతిథులందరినీ ఆదరంతో సత్కరించి పంపాడు శ్రీరాముడు. విభీషణుని వంతు వచ్చినప్పుడు...
విభీషణా! నువ్వు చేసిన సహాయం మహత్త్వపూర్ణమైనది. నీకేం కావాలో కోరుకో!
స్వామీ! మీ ముత్తాత ఇక్ష్వాకు మహారాజు దేవలోకం నుంచి తెచ్చిన మీ కులదైవమైన శ్రీరంగనాథస్వామి వారి విగ్రహాన్ని నాకొసగి దీవించండి.
8
అలానే! ప్రణవాకారంతో ఉన్న ఈ విమానంతో పాటు మా కులదైవం యొక్క విగ్రహాన్ని నీకు ఇస్తున్నాను. కానీ దీన్ని దారిలో ఎక్కడా ఉంచకుండా తీసుకెళ్ళాలి.
అలాగే ప్రభూ! ధన్యుణ్ణయ్యాను! మీరు చెప్పినట్లే చేస్తాను.
విభీషణుడు శ్రీరంగనాథుని విగ్రహంతో శ్రీరంగం చేరుకున్నారు. అప్పుడు వినాయకుని సంకల్పంతో ఆయనకు కావేరీ నదిలో స్నానం చేయాలని అనిపించింది. చేతిలోని విగ్రహాన్ని ఎక్కడ ఉంచాలి అనుకుంటూ ఉంటే ఒక బ్రహ్మచారి అటు వైపు వచ్చాడు.

మిగతా 36వ పేజీలో...



# విద్యాప్రదాత వినాయకుడు

వినాయకుడి కన్నా అధికులు కానీ, వినాయకుణ్ణి ఆదేశించేవారు కానీ ఎవరూ లేరు. తన పైన మరొక నాయకుడు లేనివాడు వినాయకుడు. ప్రపంచంలో ప్రతీ ఒక్కరికీ వారి కన్నా అధికులు (వారిని శాసించేవారు) ఉంటూనే ఉంటారు. కానీ వినాయకుడు సర్వస్వతంత్రుడు. అందువల్ల భారతీయులు ముందు వినాయకుణ్ణి పూజిస్తారు.

భారతదేశంలో సనాతనకాలం నుండీ వినాయకుడి ఆరాధన ఉంది. ఋగ్వేదంలోనూ, నారాయణోపనిషత్తులోనూ, తైత్తిరీయ ఉపనిషత్తులోనూ వినాయకుణ్ణి స్తుతిస్తూ ఎన్నో స్తోత్రాలున్నాయి.

ఏకదంతాయ విద్మహే వక్రతుండాయ ధీమహి
తన్నో దంతిః ప్రచోదయాత్

వినాయకుడి మహిమను చెప్పే ఈ మంత్రం 'గణపతి అథర్వ శీర్షోపనిషత్తు' లోనిది.

వినాయకుడి ఏనుగు తల బుద్ధి సూక్ష్మత, వివేచన, జ్ఞానాలకు సంకేతం. ఏనుగు ఎప్పుడూ అప్రమత్తంగా ఉండి, పరిసరాలను గురించి ఎరుక కలిగి ఉంటుంది. దానికి జ్ఞాపక శక్తి అత్యధికం. దట్టమైన అరణ్యంలో సంచరించేటప్పుడు నిర్దిష్టమైన మార్గంలో గంభీరంగా నడుస్తుంది. తనకు తెలియకుండానే ఇతర జంతువులకు మార్గనిర్దేశం చేయడం ఏనుగు స్వభావం. వినాయకుడు సర్వ ప్రపంచానికీ మార్గదర్శకుడు. ఆయన విఘ్నాలకు నాయకుడు; అవసరమైనప్పుడు విఘ్నాలను కలిగించేదీ ఆయనే. తనను భక్తితో తలచుకున్న వారి విఘ్నాలను అధిగమించడంలో తోడ్పడేదీ ఆయనే!

బుద్ధి, సిద్ధి మూర్తీభవించిన రూపం వినాయకుడిది. వేదవ్యాసుడు తాను మహాభారతాన్ని చెబుతుంటే వ్రాయాల్సిందిగా వినాయకుణ్ణి ప్రార్థించాడు. అందుకు సమ్మతించి వినాయకుడు వెంటనే తన దంతాన్ని విరిచి మహాభారతం వ్రాయడానికి కూర్చున్నాడు.

వినాయకుడి వాహనం ఎలుక (మూషికం). మూషికం చీకటికీ, అజ్ఞానానికీ గుర్తు. వినాయకుడు చీకటిని (అజ్ఞానాన్ని) నిరోధించగలడు కనుక ఆయనను మూషిక వాహనుడు అంటారు. అజ్ఞానపు చీకటిని పారద్రోలి, ప్రపంచాన్ని జ్ఞాన ప్రకాశంతో నింపుతాడు వినాయకుడు.

మూషికం ఘ్రాణేంద్రియానికి సంకేతం. వాసనను అనుసరించి ఎలుక సంచరిస్తుంటుంది. వాసన(కోరిక)లపై ఆధిపత్యం గలవాడు వినాయకుడు. వాసనల (కోరికల)కు, ప్రతీక అయిన ఎలుక మీద స్వారీ చేస్తాడని చెప్పడమే ఎలుక ఆయన వాహనం అనడంలోని అంతరార్థం.

పవిత్రమైన మనస్సు ఉంటే శాంతిని పొందుతాం – అదే సిద్ధి అంటే! వినాయకుడు బుద్ధి, సిద్ధి (వివేకం, ఆత్మసాక్షాత్కారం)లకు అధిపతి. అందుకే ప్రతి ఒక్కరూ మనస్సును తమ వశంలో ఉంచుకోవాలి.

వినాయకుడు సకల విద్యాధిదేవత. విద్య అంటే కేవలం పుస్తక పాండిత్యమొక్కటే కాదు. విశ్వవ్యవస్థకు సంబంధించిన ప్రతిదీ విద్యయే! అయితే నేటి కాలంలో సమాచార సేకరణను విద్య అంటున్నారు. ఒక వ్యక్తి జీవితం మొత్తం ఒక నిరంతర విద్యాభ్యాస ప్రక్రియ. ఏ విచారణా ప్రక్రియ అయినా విద్యకు సంబంధించినదే. అయితే ప్రధానంగా మన విచారణ ఏది అనిత్య (క్షణిక)మైనది, ఏది శాశ్వతమైనది అనే దానికి సంబంధించి ఉండాలి. అదే నిజమైన జ్ఞానం.

వినాయకుడి ఏనుగు తల, పెద్ద బొజ్జలను చూసి ఆయన రూపం వికారంగా ఉంది అనుకోకూడదు. విశ్వాన్నంతటినీ తనలోనే ఇముడ్చుకున్న దైవం ఆయన. వినాయక చవితి లాంటి పుణ్యదినాలలో భగవత్తత్త్వాన్ని తెలుసుకోవడం, మన మనస్సును పవిత్రంగా ఉంచుకోవడం చెయ్యాలే తప్ప కేవలం విందులూ, వినోదాలతో సెలవు దినాల లాగ గడపడం కాదు. ❖



# సూర శ్యాముని లీలలు

- యం. పార్వతి

శ్రీకృష్ణుని రూపమే మోహనం. ఆ మోహనుని రూపాల్లో బాలకృష్ణుడి రూపం మనోమోహనం. సూర్‌దాస్ దృష్టిలో ఆ మోహన రూపం ఎంత మనోహరంగా ఉందో చూద్దాం:

*శోభిత్ కర్ నవనీత్ లియో, ఘుటురున్ చలత్*
*రేణుతన్ మండిత్ ముఖ్ దధి లేప్ కియె*
*కరులా కంఠ్ బజ్ర్ కే హరి నఖ్ రచత్ రుచిర్ హియె*
*ధన్య సూర్ ఏకో పల్ యా సుఖ్, కా సత్ కల్ప్ జియె*

కృష్ణుడు చేతిలో వెన్నతో శోభాయమానంగా ఉన్నాడట. మోకాళ్ళ మీద దోగాడుతూ ఉన్నందు వల్ల శరీరం ధూళి ధూసరితమైందట. ముఖానికి పెరుగు అంటిందట. అందమైన చెక్కిళ్ళు, అంతలేసి కళ్ళు, నుదుట కస్తూరీ తిలకం, వీటికి తోడు నల్లని ముంగురులు! మొత్తం మీద అందమంతా ఆ చిన్ని కృష్ణుని ముఖార విందంలోనే ఉన్నట్లు ఉందట. నుదిటి మీద కదిలీ కదలక కదలాడుతున్న ముంగురులు, మకరందం త్రాగి మత్తెక్కిన తుమ్మెదల్లా ఉన్నాయట. అంతే కాక వజ్రంతో చేయబడిన పులిగోరు పతకం హృదయం మీద కదులుతూ మరింత శోభాయమానంగా ఉందట. ఇన్ని అందాలతో కూడుకున్న చిన్ని కృష్ణుణ్ణి ఒక్క క్షణం చూసినా చాలు అంటారు సూర్‌దాస్. ఆ దర్శనం వల్ల కలిగే అనుభూతి చాలు, జీవితం ధన్యం కావడానికి అంటారు. ఆ భాగ్యం కలగనప్పుడు ఎన్ని కల్పాలు జీవించి ఏం ప్రయోజనం! మన పోతన "నిన్ను పొడగానగాలేని చక్షురింద్రియముల సత్వమేల? నీకు దాస్యమ్ము సేయని జన్మమేల ఎన్ని జన్మములకు?" అన్నట్లుగానే ఈ కవి కూడా ఆ బ్రతుకు వ్యర్థమే కానీ సార్థకం కాదు కదా అంటారు.

ఇక వెన్న దొంగ కన్నయ్య! తల్లి యశోదమ్మకు పట్టుబడినా తప్పించుకోడానికి ఎన్నెన్ని మాటలు చెప్పాడో ఎన్నెన్ని అలుకలు పోయాడో చెప్పడం సూర్‌దాస్‌కే సాధ్యం.

*మయ్యా, మై నహీం మాఖన్ ఖాయో, భోర్ భయో గయ్యన్ కే పీఛే*
*చార్ పహర్ బంసీవట్ భటక్యో సాంఝ్ పరే ఘర్ ఆయో*
*మై బాలక్ బహియన్‌కో చోటో ఛీకో కెహి విధి పాయో*
*యహ్ లే అపనీ లకుటి కమరియా బహుత హి నాచ్ నచాయో*
*సూర్‌దాస్ తబ్ బిహసి యశోదా లే ఉర్ కంఠ్ లగాయో*

"అమ్మా! నేను వెన్న తినలేదు. ఉదయమనగా ఆవుల్ని మేపడానికి మధువనానికి వెళ్ళాను. సాయంకాలం తిరిగి వచ్చాను. ఇంతేకాక పగలంతా మురళి వాయిస్తూ, చెట్ల నీడల్లో తిరుగుతూ ఉన్నాను. అలాంటి నాకు వెన్న దొంగతనం చేసే సమయం ఎక్కడుంది? పోనీ ఏదో సమయం చూసుకొని చేశాననుకున్నా ఎలా చేస్తాను? నేనా చిన్నవాణ్ణి, నా చేతులూ చిన్నవే! ఇంకెలా అంత ఎత్తున ఉన్న ఉట్టిని అందుకుంటాను? ఉట్టిలోని వెన్న ఎలా దొంగిలిస్తాను? దొంగలించక పోయినా నా ముఖానికి వెన్న ఎలా అంటింది అనుకుంటున్నావేమో! అది నా ఘనకార్యం కాదు. గోప బాలురు ఎందుకో నా పైన వైరం పూనారు. వారు దొంగతనం చేసి, బలవంతంగా నా ముఖానికి వెన్న రాశారు. నా పైన ద్వేషంతో ఇలాంటి పనులు చేసే వీరి మాటలను నమ్మావు. అమ్మా! నువ్వు చాలా అమాయకురాలివి. లేకపోతే వీళ్ళ మాటలను నమ్మగలిగేదానివా? ఇన్ని మాటలెందుకులే! నీ మనసులో ఏదో భేద భావం కలిగింది. అయినవాళ్ళనే పరాయివాళ్ళనుకుంటున్నావు. సరే! ఇక నీ విచ్చిన కంబళి, కర్ర కూడా నాకు వద్దు. నీవే తీసుకో. ఏమైనా చేసుకో. (సాధారణంగా పిల్లలు తమ పంతం లేదా హఠం నెగ్గనప్పుడు తమ దగ్గరున్న వస్తువులను విసిరివేయడం, వద్దనడం చేస్తూ ఉంటారు. చిన్ని కృష్ణుడూ ఆ పసితత్వానికి అతీతుడు కాలేకపోయాడు. కాలేదు కూడా!)

ఈ విధంగా కృష్ణుడు తన తప్పిదాన్ని కప్పిపుచ్చడానికి చెబుతున్న అబద్ధాలకూ, ఆ అబద్ధాల మాటున దాగిన అమాయకత్వానికీ ముగ్ధురాలు అవుతూ యశోద, "నాకేమీ వద్దు" అంటున్న కన్నయ్య తిరస్కార భావాన్ని భరించలేక ఒక్కసారిగా వాత్సల్యంతో కొడుకును దగ్గరకు తీసుకొని నవ్వుకుందట. చిన్న వాడనుకున్న తన చిట్టి తండ్రి ఎన్నిమాటలు నేర్చాడో అని కావచ్చు! 'వెన్న కొరకు ఇన్ని అబద్ధాలెందుకురా కన్నా' అని కావచ్చు, నవ్వుకుంది. మన మనసుల్లోనూ వాత్సల్యభావాల చల్లదనపు జల్లును కురిపించింది యశోదమ్మ. ❖

(ఆగష్టు 13, గురువారం - శ్రీకృష్ణ జయంతి)



# ఓ మహాత్యాగి ఆత్మకథ



## (స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

*(...గత సంచిక తరువాయి)*

**(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, ప్రవక్త, శ్రేష్ఠసన్న్యాసి, గురువు, యుగాచార్యుడు, దేవదూత, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన తన జీవితానుభవాలను ధారావాహికంగా 2009 జూన్ సంచిక నుంచి అందిస్తున్నాం.)**

నేను జన్మించినప్పుడు మా నాన్న నా జాతకం వ్రాయించారు. కానీ దాని గురించి నాకెప్పుడూ ఏమీ చెప్పలేదు! ఆయన మరణించిన కొన్ని సంవత్సరాల తరువాత మా ఇంటికి వెళ్ళినప్పుడు మా అమ్మ దగ్గరున్న కొన్ని కాగితాల మధ్యలో ఈ జాతకాన్ని చూశాను. అందులో నేను పరివ్రాజక సన్న్యాసినై భూమండలమంతా పర్యటిస్తానని ఉంది.

నాకు ఆధ్యాత్మికత, తత్త్వశాస్త్రాలంటే బాల్యం నుండే ప్రగాఢమైన ఆసక్తి ఉండేది. 'త్యాగమే' మనిషి అభిలషించ వలసిన మహోన్నత ఆదర్శమని మన శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. నాలో ఈ త్యాగాగ్నిని రగిలించి, తను నడిచిన మార్గంలో నన్ను నడిపి, 'త్యాగాన్నే' దృఢ సంకల్పంగా మార్చడానికి ఒక మహాచార్యుని అవసరం ఏర్పడింది. ఆ త్యాగమూర్తే శ్రీరామకృష్ణ పరమహంస! ఆయనలోనే నా మహోన్నత ఆదర్శమైన 'త్యాగం' సాక్షాత్కారమవడం చూశాను.

సన్న్యాసులకు బంధాలుండవు. కానీ ఒకే ఒక్క అనుబంధం ఉంటుంది. అదే 'గురుశిష్య సంబంధం'. కన్నతండ్రి కన్నా గురువు గౌరవనీయుడు, నా తండ్రి కన్నా గురువుకే నా మొదటి పూజా గౌరవాలు! ఎందుకంటే తండ్రి కేవలం నాకీ శరీరాన్నిచ్చాడు, కానీ గురువు నాకు ఈ శరీర బంధాన్ని' తొలగించే మోక్షమార్గం చూపాడు. కనుక తండ్రి కన్నా గురువే గొప్పవాడు.

శ్రీరామకృష్ణ పరమహంస చాలా వింతైన మనిషి. ఆయన శాస్త్ర పాండిత్యానికై పాకులాడలేదు. కానీ బాలునిగా ఉన్నప్పుడే సత్యసాక్షాత్కారమనే తీవ్ర వ్యాకులతలో మునిగి పోయారు. మొదట హిందూ ధర్మసాధనలు చేశారు. ఆ తర్వాత ఇతర ధర్మాలలోని సత్యాన్ని కనుగొనాలనే తపనతో ఒకదాని తర్వాత మరొకటిగా అన్ని మత శాఖల సాధనా మార్గాలలోనూ ప్రవేశించారు. ఆ యా మత గురువులు చెప్పినట్లుగా కచ్చితంగా సాధన చేస్తూ, భక్తుల సాంగత్యంలో క్రమంగా ఆ సాధనా మార్గాల ఆదర్శాలతో తాదాత్మ్యం చెందేవారు. అన్ని సాధనల తర్వాత అన్ని మతాలూ సత్యమే అని నిరూపించారు.

సామాన్య గ్రామీణ భాషలో మాట్లాడే ఈ అద్భుత వ్యక్తిని (శ్రీరామకృష్ణులు) చూడడానికీ, అసమానమైన ఆయన బోధనల్ని వినడానికీ వేలమంది వచ్చేవారు! ఈయన కలకత్తా దగ్గర నివసించారు, (అది అప్పట్లో) భారత రాజధాని. వందలాది నాస్తికులు, భౌతిక వాదులు అక్కడి విశ్వవిద్యా లయాల నుండి ప్రతి ఏటా బయటకు వచ్చేవారు. ఈ నాస్తికులూ, భౌతికవాదులూ వచ్చి ఆయన మాటలు వినేవారు! నేనూ ఆయన గురించి విన్నాను. వారి మాటలు వినాలని వెళ్ళాను. ఆయన కేవలం ఏ ప్రత్యేకతా లేని ఒక సామాన్య వ్యక్తిగా కనిపించారు.

**పరమహంసతో ప్రథమ సమావేశం:** దక్షిణేశ్వర కాళికాలయ ఉద్యానంలోని వారి గదిలో మొదటిసారి కలిశాను. రెండు పాటలు పాడాను, ఆయన సమాధి మగ్నులయ్యారు; తరువాత రామచంద్ర దత్తాతో "ఎవరీ అబ్బాయి? ఎంత బాగా పాడుతున్నాడు!" అన్నారు. పాట ముగిసిన కాసేపటికి హఠాత్తుగా ఆయన లేచి నా చేయి పట్టుకొని, ఉత్తర దిక్కు వరండాకు తీసుకెళ్ళి తలుపు మూసేశారు. అక్కడ మేమిద్దరం తప్ప వేరెవరూ లేరు. నాకేదో వ్యక్తిగత ఉపదేశమిస్తారనుకున్నాను; కానీ ఆశ్చర్యకరంగా నా చేయి పట్టుకొని, ఆనంద భాష్పాలు ధారలు కట్టగా, చిరపరిచితునిలా చాలా ఆప్యాయంగా "ఆహా! ఇంత

ఆలస్యంగా వచ్చావు! నన్నిన్నాళ్ళుగా వేచి ఉంచడానికి ఎంత నిర్దయుడివి! లౌకికుల వ్యర్థపు మాటలు వినీ, వినీ నా చెవులు మండిపోతున్నాయి. ఓహ్! నా హృదయాంతరాళంలోని అనుభూతుల్ని అర్థం చేసుకోగల వ్యక్తి కోసం నేనెలా పరితపిస్తున్నానో తెలుసా?" అని ఏడుస్తూ నా ముందు చేతులు జోడించి నిలబడ్డారు. అంతేకాకుండా, "ప్రభూ! నీవు ఆ సనాతన ఋషి నారాయణుని అవతారమైన 'నరుడవనీ, జీవుల దుఃఖాలను బాపడానికై భువిపై అవతరించావనీ నాకు తెలుసు ప్రభూ!" – ఇలా ఇంకా ఏవేవో అంటున్నారు.

ఆయన ప్రవర్తన చూసి నేను నిర్ఘాంత పోయాను! 'నేనెవర్ని చూడడానికి వచ్చాను? కచ్చితంగా ఈయన పిచ్చివాడే! విశ్వనాథ దత్తా కొడుకునైన నన్ను పట్టుకుని ఈయన ఏదేదో అంటున్నారే! ఎంత విచిత్రం!' అని అనుకుంటూనే వింటున్నాను. ఇంతలో ఆయన తన గదికి వెళ్ళి, కొన్ని మిఠాయిలు, కలకండ, వెన్న తీసుకొచ్చి తన చేతులతోనే స్వయంగా నాకు తినిపించడం ప్రారంభించారు.

"అవి నా చేతికి ఇవ్వండి. వాటిని నా మిత్రులతో పంచుకుంటాను" అని నేనెంత వారించినా వినలేదు. "వారు మళ్ళీ తింటారులే!" అంటూ నేనవి తిన్నాకనే వదిలారు. నా చెయ్యి లాగి పట్టుకొని, "త్వరలోనే మళ్ళీ ఏకాంతంగా కలుస్తానని మాటివ్వు" అన్నారు. వారు బ్రతిమాలడం చూసి ముక్తసరిగా "సరే" నని ఆయనతో పాటు వారి గదిలోనున్న మిత్రుల దగ్గరకొచ్చాను.

**పవిత్రతా నిలయం పరమహంస జీవితం:** ఆయన మాటలు, కదలికలు, వ్యవహారం – ఏమీ తప్పనిపించలేదు. పైగా ఆయన ఉపదేశాలు, దివ్యభావ పారవశ్యమూ చూస్తే ఓ నిజమైన త్యాగమూర్తిలా అనిపిస్తారు. ఆయన మాటలు, చేతల మధ్య ఎంతో సామరస్యం ఉంది. భాష కూడా చాలా సరళం! 'ఈ వ్యక్తి ఒక గొప్ప గురువా?' అనుకుంటూ మెల్లగా ఆయన దగ్గరకు చేరి, "స్వామీ! మీరు భగవంతుణ్ణి చూశారా?" అని ఎంతోమందిని అడిగిన ప్రశ్ననే అడిగాను. "ఔను! నిన్ను చూసినట్లు ప్రత్యక్షంగా, అంతకన్నా స్పష్టంగా భగవంతుణ్ణి చూశాను, చూస్తున్నాను. భగవంతుణ్ణి సాక్షాత్కరించుకోవచ్చు. నేను నిన్ను చూసి మాట్లాడుతున్నట్లుగానే భగవంతుణ్ణి చూడవచ్చు. ఆయనతో మాట్లాడవచ్చు. కానీ భగవంతుడెవరికి కావాలి? లోకులు భార్యాబిడ్డల కోసం, ధనసంపదల కోసం కడవల కొద్దీ కన్నీరు కారుస్తారు! కానీ భగవంతుని కోసం ఎవరు విలపిస్తారు! ఆయన కోసం ఆర్తితో విలపిస్తే, ఆయన తప్పక ప్రత్యక్షమవుతాడు" అన్నారు.

ఈ మాటలు నన్ను కట్టిపడేశాయి! భగవంతుణ్ణి ప్రత్యక్షంగా చూశాననీ, ఆధ్యాత్మికత అనేది అనుభవైక సత్యమనీ, మనం దృశ్య ప్రపంచాన్ని అనుభవించిన దాని కంటే కోటి రెట్లు ఎక్కువగా అనుభూతి చెందగలమనీ నిర్భయంగా చెప్పగలిగిన వ్యక్తిని నా జీవితంలో మొట్టమొదటి సారిగా చూశాను. ఈ అమృత వాక్కుల్ని విని, వాటిని



ఆయన ఓ సామాన్య పండితునిలా కాక తన స్వీయ అనుభవపు లోతుల్లో నుంచి చెబుతున్నారని గ్రహించాను. కానీ వారి ఈ మాటలకూ, నాతో ఒంటరిగా ప్రవర్తించిన తీరుకూ పొంతన కుదరలేదు. ఆయనో రకమైన పిచ్చివారై ఉండాలని నిర్ణయించుకొన్నాను. అయినా ఆయన మహోన్నతమైన త్యాగానికి తలవంచకుండా ఉండలేకపోయాను.

ఆయనకి పిచ్చి ఉండవచ్చుగాక! కానీ చాలా కొద్దిమందికి మాత్రమే అలాంటి త్యాగం అబ్బుతుంది. పిచ్చివారైనా సరే, ఈయన పవిత్రులలోకెల్లా పవిత్రుడు. నిజమైన మహాత్ముడు. కేవలం ఈ త్యాగనిష్ఠ కొరకే మానవాళి అంతటికీ ఆయన పూజార్హుడు. ఇలాంటి పరస్పర విరుద్ధ భావాలతో ఆయన ముందు ప్రణమిల్లి, నేను కలకత్తా తిరిగి వచ్చాను. ❖ (సశేషం) అనుసృజన : **స్వామి అర్చనానంద**



# మహా పుణ్యప్రదం మహాత్ముల సంస్మరణం

– స్వామి తథాగతానంద

**భగవాన్ శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష సన్న్యాస శిష్యులైన స్వామి అఖండానందజీ మహరాజ్ ఆదేశం మేరకు నారాయణ మహరాజ్ (స్వామి సర్వగతానందజీ) కాలినడకన 1934 డిసెంబర్ 3వ తేదీన ముంబయి నుంచి బయలుదేరి 1935 ఫిబ్రవరి 7వ తేదీన హరిద్వార్ చేరుకున్నారు. అక్కడ కంఖల్ రామకృష్ణ మిషన్ కేంద్రంలో బ్రహ్మచారిగా చేరారు. 1936వ సంవత్సరంలో స్వామి అఖండానందజీ మహరాజ్ వారి వద్ద నుంచి మంత్రదీక్షనూ, 1944లో మాతృమూర్తి శ్రీశారదాదేవి శిష్యులైన స్వామి విరజానందజీ మహరాజ్ నుంచి సన్న్యాస దీక్షనూ స్వీకరించారు.**

**శ్రీమత్ స్వామి సర్వగతానందజీ మహరాజ్ బోస్టన్ (యు.ఎస్.ఏ.) రామకృష్ణ వేదాంత సొసైటీలో 2009 మే 3వ తేదీ ఉదయం 5.30 గంటలకు మహాసమాధి పొందారు. స్వామీజీ వయస్సు 96 ఏళ్ళు. పూజ్య స్వామీజీ తూర్పు గోదావరి జిల్లాలోని ముమ్మిడివరం గ్రామంలో 1912వ సంవత్సరంలో జన్మించారు.**

**పూజ్య స్వామి సర్వగతానందజీ గురించి న్యూయార్క్ వేదాంత సొసైటీ అధ్యక్షులు స్వామి తథాగతానందజీ చేసిన సంస్మరణ ప్రసంగంలోని ముఖ్యాంశాల అనువాదం ఇది :**

గురువు స్వామి అఖండానందజీ ఆజ్ఞ మేరకు నారాయణ మహరాజ్ (స్వామి సర్వగతానంద) చేతిలో చిల్లిగవ్వ లేకుండా, ఒక్క పూటే భిక్ష స్వీకరిస్తూ, పాదరక్షలు లేకుండా, కాలినడకన ముంబయి నుండి హరిద్వార్ వెళ్ళారు. ఎన్నో కష్టాలతో కూడిన పాదయాత్రా విశేషాలను నారాయణ మహరాజ్ స్వయంగా ఇలా వివరించారు:

'1934 నవంబర్ 12వ తేదీన ముంబయి రామకృష్ణ ఆశ్రమంలో స్వామి అఖండానందజీ మహరాజ్ వారి దర్శన భాగ్యం లభించింది. నా ప్రథమ సమావేశంలోనే స్వామీజీతో అన్యోన్య అనుబంధం ఏర్పడింది. ఆయన నాతో ఆప్యాయంగా మాట్లాడుతూ, ఎన్నో విషయాలను అడిగి తెలుసుకున్నారు. ప్రతీ రోజూ సాయంకాలం ఆశ్రమానికి వెళ్ళి, స్వామీజీని దర్శించడం వల్ల ఆయనకు మరింత సన్నిహితుణ్ణయ్యాను.

**గుర్వాజ్ఞతో సాగిన పాదయాత్ర:** ఒకరోజు స్వామీజీతో ఆధ్యాత్మిక జీవనం గడపాలన్న నా కోరికను తెలియజేశాను. అప్పుడు ఆయన నా మాటల్లో, ఆధ్యాత్మిక జీవనంలో భాగంగా యథోచితంగా కొంత సామాజిక సేవ చెయ్యాలన్న నా సంకల్పాన్ని పసిగట్టారు. తరువాత నాతో 'నేను నిన్ను హరిద్వార్ పంపుతాను. అక్కడ నీకు రోగి నారాయణ సేవ చేసే అవకాశం ఉంటుంది. అక్కడ స్వామి వివేకానందుల వారి శిష్యుడైన ఓ ప్రముఖ స్వామీజీ పర్యవేక్షణలో నువ్వు సేవ చేయవచ్చు. కానీ ఒక్క షరతు, నువ్వు హరిద్వార్‌కు కాలినడకన పాదరక్షలు లేకుండా వెళ్ళాలి. నేను కూడా పాదరక్షలు లేకుండా శీతకాలంలో హిమాలయాలలో పర్యటించాను' అని తమ స్వానుభవాన్ని వెల్లడించారు.

నేను సన్న్యాసం స్వీకరించాలంటే పాదరక్షలు లేకుండా కాలిబాటన హరిద్వార్ నడచివెళ్ళడం తప్పనిసరి అని చెప్పి మూడు షరతులు విధించారు. అవి ఏమిటంటే – వెంట ధనం తీసుకుపోకూడదు, విహార యాత్రలు చేయకూడదు, ఒక్క పూటే భుజించాలి. ఈ షరతులన్నింటినీ నేను పాటించి, నిర్విఘ్నంగా గమ్యం చేరగలనన్న నమ్మకం నాకు లేదు. కానీ ఆయన ఆశీర్వాద ప్రభావం వల్ల నాలో ఓ వినూత్న శక్తి ద్యోతకమైంది. 1934 డిసెంబరు 3వ తేదీన బొంబాయి నుండి హరిద్వార్ వెళ్ళడానికి నడక ప్రారంభించాను.

మార్గమధ్యంలో ఎన్నో ఇబ్బందులు, ఇరకాటాలు ఎదురయ్యాయి. పాదరక్షలు లేకుండా ఎగుడుదిగుడు బాటల్లో

పయనించడం వల్ల మడమలు పగిలి రక్తం కారడం మొదలైంది. ఆకలి బాధతో నీరసించిపోయాను. ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేని పరిస్థితిలో రోడ్డు ప్రక్కన ఓ చెట్టు క్రింద విశ్రమించాను. "ఇదే నా మరణ నికేతనమైతే, నన్ను కడతేర్చు ప్రభూ!" అని దీనంగా రామకృష్ణులను స్మరించాను. కొద్ది క్షణాలలో నిద్ర నన్ను ఆవహించింది.

ఎవరో వచ్చి, నిద్ర లేపి తమ బస్సు దగ్గరకు రావాల్సిందిగా పిలిచారు. నా దగ్గర పైకం లేదనీ, పైగా అడుగు తీసి అడుగు వేసే ఓపికా శక్తీ కూడా లేవనీ నేను అతనికి చెప్పాను. అతడు నన్నెత్తుకొని బస్సు దగ్గరకు మోసుకొనిపోయి ఓ స్థానంలో కూర్చోబెట్టాడు. ఆ సీటుపై నేను కొద్దిసేపు విశ్రాంతి తీసుకొన్నాను. బస్సులో డ్రైవరు, కండక్టరు తప్ప వేరే ప్రయాణికులెవరూ లేరు. నన్ను మహారాష్ట్రలోని ధులియాకు తీసుకువెళ్ళారు. బస్సు ఆగగానే త్రోవ మధ్యలో ఉన్న ఓ ఇల్లు చూపి నన్నక్కడికి వెళ్ళమన్నారు. నెమ్మదిగా అక్కడికి నడిచాను. అక్కడ ఇద్దరు మనుష్యులు ఏవో న్యాయపరమైన విషయాలపై తీవ్రంగా చర్చించుకొంటున్నారు. 'అంతరాయం కలిగిస్తున్నందుకు మన్నించండి. ఆ బస్సు ఆయన నన్నిక్కడికి వెళ్ళి విశ్రమించమన్నాడు' అని వారితో చెప్పాను. అందులో ఒకరు నన్ను లోపలికి పిలిచి, ఆ గదిలోనే తెర ప్రక్కనున్న మంచంపై విశ్రమించమన్నారు. తరువాత నిశ్శబ్దం. కొంతసేపటి తరువాత ఎవరో వచ్చి నా యోగక్షేమాలు విచారించారు. నేను హరిద్వార్‌లోని కంఖల్ రామకృష్ణ ఆశ్రమానికి వెళుతున్నానని చెప్పాను.

అతడు రక్తసిక్తమైన నా పాదాలను పరీక్షించాడు. రెండో అంతస్తులోకి తీసుకెళ్ళాడు. అక్కడ రెండు చిన్న గదులున్నాయి. ఒకటి ప్రార్థనా మందిరం. మరొకదానిలో ఓ మంచం ఉంది. ఆయన సదాశివరామకృష్ణ జోషీ. అంతకు ముందు నన్ను లోపలికి ఆహ్వానించినవారు ఆయన సోదరుడు విష్ణుజోషీ. వారు నా గాయాలు కడిగి మందు వేసి కట్టుకట్టారు. ఓ వారం రోజులు వాళ్ళింట్లో ఆతిథ్యం ఇచ్చారు. వారి పరిరక్షణలో నేను పూర్తిగా కోలుకొన్నాను. మరలా హరిద్వార్ వైపు నా పాదయాత్రను కొనసాగిస్తానని వారితో చెప్పాను. వారు నన్ను నడవవద్దన్నారు. వారిలో ఒకరు నాతో పాటు హరిద్వార్ వరకూ రైలులో తోడు రావడానికి సంసిద్ధతను వెలిబుచ్చారు. నేను నసేమిరా వద్దన్నాను. కాలినడకనే ప్రయాణం కొనసాగిస్తానన్నాను. చివరికి వారు అంగీకరించి, నన్ను సాగనంపారు. వారు నాపై చూపిన ప్రేమానురాగాలు ఎన్నటికీ మరువలేనివి.



1935 ఫిబ్రవరి 7న కంఖల్ రామకృష్ణ సేవాశ్రమం చేరాను. నాకక్కడ ఓ పెద్ద స్వామి కనిపించారు. స్వామీజీకి వినమ్రంగా పాదాభివందనం చేశాను. 'నీవు బొంబాయి నుంచి వచ్చిన నారాయణవా?' అని అడిగారు. 'అవు'నన్నాను. 'నువ్వు వస్తున్నట్లుగా స్వామి అఖండానందజీ నాకో ఉత్తరం వ్రాశారు' అని ఆయన నాతో చెప్పారు. నన్ను సాదరంగా ఆహ్వానించింది సాక్షాత్తూ స్వామి వివేకానంద శిష్యులైన స్వామి కల్యాణానందజీ మహరాజే అని తెలుసుకొని, అంతులేని ఆనందం పొందాను. కంఖల్ ఆశ్రమ జీవితం మరుపురానిది".

పూజ్య స్వామి సర్వగతానందజీ ఒక అసాధారణమైన సన్న్యాసి, గొప్ప కర్మ యోగి. లక్ష్య సాధన కోసం తదేక దీక్ష, పట్టుదల, సేవా దృక్పథం గల ఆయన కంఖల్ ఆశ్రమంలో స్వామి కల్యాణానందజీ పర్యవేక్షణలో రోగి నారాయణ సేవలో తరించారు.

**పరిచర్యలో పొందిన పరమానందం:**

స్వామి రంగనాథానందజీ రంగూన్ నుండి ఢాకా వరకూ నడిచి వెళ్ళారు. బేలూరు మఠం చేరేసరికి వారి బరువు 36 కిలోలకి పడిపోయి, ఎముకల గూడులా తయారయ్యారు. వారి ఆరోగ్యం పూర్వ స్థితికి రావడానికి బేలూరు మఠ అధికారులు కంఖల్ సేవాశ్రమానికి పంపించారు. అప్పుడు నారాయణ మహరాజ్ స్వామి రంగనాథానందజీకి అహర్నిశలూ అత్యంత భక్తి శ్రద్ధలతో సేవ చేశారు. నాలుగు నెలల్లోనే స్వామి రంగనాథానందజీ ఆరోగ్యస్థితి మెరుగైంది. నారాయణ మహరాజ్ చేసిన సేవలను స్వామి రంగనాథానందజీ ఎంతో ప్రశంసించారు. వారి ఆరోగ్యం పూర్తిగా నయమయ్యాక బేలూరు మఠ అధికారులు వారిని కరాచీ ఆశ్రమ బాధ్యతను చేపట్టమని కోరారు. తన వద్ద పని చెయ్యడానికి స్వామి సర్వగతానందజీని పంపించినట్లైతే తాను వెంటనే కరాచీ వెళతానని స్వామి రంగనాథానందజీ అన్నారు. దాంతో, బేలూరు మఠం కోరిక మీద నారాయణ మహరాజ్

మిగతా 30వ పేజీలో...



# భగవద్గీత
# వ్యక్తిత్వ వికాసం

– ఆకెళ్ల రాఘవేంద్ర

కురుక్షేత్రంలో... అటు కౌరవసేన, ఇటు పాండవసేన యుద్ధానికి సన్నద్ధమవుతున్నాయి. అతిరథ మహారథులంతా సమరానికి సంసిద్ధంగా ఉన్నారు. శ్రీకృష్ణుడు రథాన్ని నడుపుతున్నాడు. ఆ రథంలో అర్జునుడు ఆసీనుడై ఉన్నాడు. ఇంకో నిమిషంలోనో, అరనిమిషంలోనో బాణాలు సంధించడం తరువాయి. ఎదురుగా ఉన్న కౌరవసేనను అర్జునుడు చూశాడు. భీష్మ, ద్రోణ, దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, వికర్ణాదులను వీక్షించాడు. అంతే! అర్జునుడి వెన్నులో సన్నని వణుకు. "కృష్ణా! నేను యుద్ధం చేయలేను" అని అన్నాడు అర్జునుడు.

అప్పుడు అర్జునుడికి (18 అధ్యాయాల్లో) 700 శ్లోకాల్లో సుదీర్ఘ ఉపన్యాసమిచ్చాడు కృష్ణుడు. నాటికీ, నేటికీ, ఏనాటికీ ఉపకరించే సమాచారం అది. జీవితంలోని అయోమయాల్ని తీర్చి గమ్యాన్ని చేర్చే దిక్సూచి అది. దాని పేరే **భగవద్గీత!**

ఆ గీతోపదేశాన్ని శ్రీకృష్ణుడు ప్రశాంత వాతావరణంలో చేయలేదు. చల్లని గాలులు వీచే తపోవన ఆశ్రమ ప్రాంగణంలో చేయలేదు. హాయిగా పురాణ కాలక్షేపంలా ఓ దేవాలయంలో చెప్పలేదు. మరెక్కడ చెప్పాడు?

యుద్ధరంగంలో చెప్పాడు. కల్లోలమైన మనస్సుకు ధైర్యాన్ని బోధిస్తూ చెప్పాడు. జీవన్మరణ సమస్యలకు పరిష్కారం చెప్పాడు. కష్టాలు వస్తే ఎలా చిరునవ్వు చిందిస్తూ ఉండాలో చెప్పాడు. స్థైర్యాన్ని, ధైర్యాన్ని ఎలా పొందాలో చెప్పాడు. అన్నింటికీ మించి – అసలు మనిషిగా 'నువ్వేం సాధించాలో' చెప్పాడు.

శ్రీకృష్ణుణ్ణి, వ్యాసుడిని స్తుతించే గీతాధ్యాన శ్లోకాల్లోని నాలుగో శ్లోకం ఇలా చెబుతోంది: "ఉపనిషత్తులు అనే కామధేనువు నుంచి శ్రీకృష్ణుడు అనే గోవుల కాపరి పితికిన పాలు – 'భగవద్గీత'. అర్జునుడు లేగదూడ". అయితే గోవు ఇచ్చిన పాలన్నీ కేవలం లేగ దూడ తాగలేదు. మిగిలిన పాలు ప్రజలవి. గీతామృతం కూడా ఒక్క అర్జునుడికే కాదు. తరతరాల యుగ యుగాల భారతీయులందరికీనూ!

'శతాబ్దాలుగా మనం దుఃఖించాం. దుఃఖించినది ఇక చాలు' అంటారు స్వామి వివేకానంద. అదే విధంగా శతాబ్దాలుగా ఆ గీతామృతాన్ని మనం పూజలకే పరిమితం చేశాం. పూజించింది చాలు. ఇక మనం ఆ పాలను తాగాల్సిన సమయం ఆసన్నమైంది. తాగి – నరనరానా, కణకణానా జీర్ణించుకోవాల్సి ఉంది. ఆ పాలు అందించే శక్తి శరీరమంతా వ్యాపించాల్సి ఉంది. ఆ పాలు నేల పాలు కాకుండా చూడాల్సిన బాధ్యత మనపై ఉంది.

మీరు ఓ నది దాటాలి – దానిపేరు జీవితం. ప్రస్తుత స్థితి, లక్ష్యం అనేవి అటూ ఇటూ ఉన్న రెండు ఒడ్లు. అంటే మీరు ఇప్పుడున్న తీరం నుంచి లక్ష్యం అనే తీరానికి చేరుకోవాలి. కాలం ఆ నదిలోని నీరులా ప్రవహిస్తుంది. కాలవాహిని అలల వాలున మీరు ఎదురీది, సాఫల్యం సాధించాలి.

సమస్యల సుడిగుండాలు, కష్టాల తిమింగలాలు ఉండనే ఉన్నాయి. అయినా మీరు పయనించక తప్పదు. తీరం చూడక తప్పదు. సంకల్పం అనే పడవలో మీరు చేసే ప్రయాణానికి శ్రీకృష్ణుడే నావికుడు! భగవద్గీతే దిక్సూచి!!

ఈనాడు మనిషి ఆందోళనలకూ, ఒత్తిళ్ళకూ నిలయంగా మారాడు. నరాల బలహీనతకు కర్మాగారంగా, ఆత్మహత్యలకు కేంద్రంగా మారాడు. మానసిక దృఢత్వాన్నీ, ఆంతరంగిక అభివృద్ధినీ విస్మరించడమే దీనికి కారణం. మనిషి బయటకు ప్రయాణం చేస్తూ తనలోకి ప్రయాణించడం మరిచిపోవడమే ఇందుకు కారణం.

ఈ రహస్యాన్ని కొన్ని పదుల శతాబ్దాల కిందటే కృష్ణుడు గుర్తించాడు. ఈనాడు మన ఆత్మహత్యలకు కారణం ఆంతరంగికమైన ఆందోళన అన్న విషయాన్ని ఆనాడే కృష్ణుడు గుర్తించాడు. ఆ రహస్యాల విశేషాల్ని భగవద్గీతలో గుదిగుచ్చి చెప్పాడు శ్రీకృష్ణుడు. అదీ భగవద్గీత విశిష్టత.

నీవు నీ పని చేసుకుంటూనే, స్వచ్ఛమైన, సమర్థమైన సహాయకారిగా సమాజానికి ఉపకరించాల్సిందిగా చెబుతోంది – గీత. జీవితంలోనే యోగులుగా ఉండమంటోంది – గీత. జీవించడంలోనే యోగత్వం పొందమంటోంది – గీత. నీవు పని చేస్తూ, అందరితో పాటు జీవిస్తూ, నీ మనస్సును క్రమపద్ధతిలో ఉంచుకోమని ఉద్ఘోషిస్తోంది – గీత. అలజడి వస్తే అదిరిపోకుండా, కష్టం వస్తే కుంగిపోకుండా యుద్ధం

చేయమంటోంది – గీత. ఆగ్రహాన్ని నిగ్రహించుకుని, ఆవేశాన్ని అణచుకొని, కోపాన్ని అదిమి పెట్టుకుని ప్రశాంతంగా ఉండమంటోంది –గీత.

నీలో ఉన్న దివ్యకాంతిని ముందుగా నిన్ను గుర్తించ మంటోంది – గీత. అలా గుర్తించి ఆ వెలుగుతో నువ్వూ, లోకమూ కాంతిమయం కావాలంటోంది – గీత.

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే ॥ *(భగవద్గీత 5.14)*

"పరమేశ్వరుడు మానవులకు కర్తృత్వాన్ని గానీ, కర్మలను గానీ, కర్మసంయోగాన్ని గానీ సృష్టించడు. అతని స్వభావమే అలా ప్రవర్తించేలా చేస్తోంది".



అంటే ఏ పనైనా చేయడం చేయకపోవడం, బాగా చేయడం, చెడుగా చేయడం – ఇవన్నీ 'మానవ స్వభావం' ద్వారా జరుగుతున్నాయి. 'స్వభావస్తు ప్రవర్తతే' అనే దాన్ని బాగా అర్థం చేసుకోవాలి. నీలోని స్వభావమే నీవు నడవడానికి కారణం. నీలోని స్వభావం – సరైనది కాకపోతే, దుష్టబుద్ధి అయితే, కోపోద్రిక్తం అయితే, ఆందోళనా పూరితమైతే, ఆనందించలేనిదైతే, ఆకతాయిది అయితే, అంతులేని ఆశల వలయమైతే, అంతూ పొంతూ లేని అనుమానం ఉంటే నీ ప్రవర్తన తదనుగుణంగానే ఉంటుంది.

నీ స్వభావం – మంచిది అయితే, శాంతపూరితం అయితే, స్థితప్రజ్ఞత్వమైతే, ఆనందో బ్రహ్మ అయితే, నీ ప్రవర్తన తదనుగుణంగానే ఉంటుంది.

నిర్ణయించుకోవాల్సింది మీరే! తప్పుదోవలో పోతే, దుర్లక్షణాల బారిన పడితే ఆ బాధ్యత భగవంతుడు మోయడు. మీరే మోయాలి ఆ పాపపు భారాన్ని! మీ స్వభావాన్ని మీరు ఎంతగా మంచి వైపు మార్చుకుంటే మీకే అంత మంచిది!

మీరు ఎంతగా వ్యక్తిత్వ వికాసం కోసం తాపత్రయపడితే మీకు అంతకు రెట్టింపు లాభం.

భగవద్గీతలోని ఏడవ అధ్యాయంలోని తొలిశ్లోకంలో శ్రీకృష్ణుడు ఇలా అంటాడు: "అర్జునా! అనన్య ప్రేమతో నా యందు ఆసక్తి కలిగి ఉండి యోగంలో నిమగ్నమవ్వు – నన్ను తెలుసుకో". భగవద్గీతలో చాలా చోట్ల శ్రీకృష్ణుడు ఇలాగే పేర్కొనడం కనిపిస్తుంది. "నాపై ఆసక్తి కలిగి ఉండు, నా నిజస్వరూపం తెలుసుకో" అని పదే పదే అర్జునుడితో శ్రీకృష్ణుడు అంటాడు. ఇది కొంచెం స్వోత్కర్షలా అనిపించవచ్చు. కానీ దీని వెనుక ఒక అద్భుతస్ఫూర్తి దాగుంది.

జీవితంలో అన్ని కోణాలలో విజయం సాధించిన వ్యక్తి నుంచి స్ఫూర్తి పొందడం, అతనిని అనుసరించడం ఏమీ చెడ్డపని కాదు కదా! అందుకే శ్రీకృష్ణుడు ప్రతీసారీ ఆ మాట అంటున్నాడు.

ఆ కృష్ణుణ్ణి అర్జునుడు అనుసరించాడు. అందుకే ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో అజేయుడై నిలిచాడు. ఆయన భగవద్గీతలో చెప్పిన చక్కని చిట్కాలతో మనమూ ఆయనను అనుసరిస్తూ ముందుకు సాగుదాం. 'అబ్బే అదేం కుదరదు. మేం నాస్తికులం– శ్రీకృష్ణుడు దేవుడేంటి' అంటే అలాగే కానివ్వండి. కానీ ఆ చిట్కాల్ని గొంతులో పోసుకొని, నరనరానా జీర్ణించుకోవడంలో తప్పేముంది! 'అయినా కుదరదు సార్' అంటే ఓ పని చేయండి. ఆ కృష్ణుడి స్థానంలో మీకు తెలిసిన సక్సెస్‌ఫుల్ పర్సన్ పేరు పెట్టుకోండి. గాంధీ, ఐన్‌స్టీన్, స్వామి రంగానాథానంద, మీ నాన్నగారు... మీ ఇష్టం. ఆ ప్రముఖుల జాబితా ఏదైనా కావచ్చు. వారి నుంచి స్ఫూర్తి పొంది, మంచి లక్షణాల్ని పొందుతూ ముందుకు సాగండి. అప్పుడు 'యుద్ధంలో గెలుపు' మీదే! ఆనాడు కురుక్షేత్రంలో పాంచజన్య శంఖారావంతో శ్రీకృష్ణుడు చెప్పింది ఇదే కదా! అర్జునుణ్ణి కర్మవీరుడైన అనాసక్తయోగిగా మార్చి, కర్తవ్యాన్ని నూరిపోసింది ఇదే కదా! జీవితమనే యుద్ధరంగంలో అన్నీ ఉండి అసంతృప్తితో రగిలిపోతున్న వారికి స్థిత ప్రజ్ఞత్వం అనే ఔషధాన్ని అందించిందీ ఇదే కదా! "ఏం కావాలో తెలియడం లేదు గానీ మొత్తం మీద ఏదో కావాలి. ఆ 'ఏదో' ఎక్కడ, ఎప్పుడు, ఎలా దొరుకుతుంది" లాంటి ప్రశ్నలతో కాగి, కాలిపోతున్న వారికి సమాధానం కూడా ఇదే కదా! అదే కదా గీతాసారాంశం విశిష్టత!! ❖

# యువవాణి

**– స్వామి పరిజ్ఞేయానంద**

**శ్రీచైతన్య, విశాఖపట్నం.**

**ప్రశ్న: నేను ఇంటర్మీడియట్ చదువుతున్న ఫస్ట్ ర్యాంక్ విద్యార్థిని. చదువుతున్న సమయంలో స్నేహితులు వచ్చి కబుర్లతో కాలక్షేపం చేస్తున్నారు. అందువల్ల చదువులో వెనుకబడ్డాను. మాట్లాడకపోతే స్నేహితుల మనస్సును నొప్పించినవాడిని అవుతానేమోనని భయం. స్నేహితులను బాధ పెట్టకుండా సమయాన్ని సద్వినియోగం చేసుకోవడం ఎలా?**

**జవాబు:** విద్యార్థి దశలో సినిమాలు, షికార్లు, కబుర్లతో కాలాన్ని దుర్వినియోగం చెయ్యడం సహజం. దీనికి కారణం విద్యార్థులకు సమయం విలువ తెలియకపోవడమే.



సమయాన్ని వృథా చేయడం వల్ల జీవితంలో కలిగే అనర్థాలను గురించి అనుభవజ్ఞులు చెప్పిన విషయాల్ని గమనించండి:

1. విద్యార్థి దశలో సమయాన్ని సద్వినియోగం చేసుకోకపోతే తరువాత జీవితమంతా దుర్వినియోగం అవుతుంది. కాబట్టి జీవన సౌధ నిర్మాణానికి ప్రతీ క్షణమూ అత్యంత ఉపయుక్తమైనదని గ్రహించాలి.

Time is life, and if we kill time, it will kill our life... I recommend you to take care of minutes, for the hours will take care of themselves.

*- Lord Reymond*

2. అవసరానికి మించి మాట్లాడడం వల్ల సమయం, శక్తి రెండూ నష్టమవుతాయి. అందువల్ల మాటల్లో శక్తిని వృథా చేయకుండా కూడబెట్టాలి అంటారు స్వామి వివేకానంద.

Do not spend your energy in talking, accumulate power in silence... *- Swami Vivekananda*

3. ఒక వ్యక్తి యొక్క వ్యక్తిత్వం అతని ఆలోచనా సరళి, సమయాన్ని వినియోగించడం అనే రెండు అంశాలపై ఆధారపడి ఉంటుంది.

Character is the result of two things - mental attitude and the way we spend our time. *- Elbert Hubbard*

స్నేహితులతో మాట్లాడకపోతే వారి మనస్సును నొప్పించిన వాణ్ణి అవుతానేమోననే సందిగ్ధావస్థ నుంచి బయట పడడానికి సోక్రటీస్ తన మిత్రునిపై ప్రయోగించిన 'త్రిసూత్రం' మీరు కూడా పాటించండి.

దీర్ఘాలోచనలో ఉన్న సోక్రటీస్ దగ్గరకు ఆయన స్నేహితు డొకడు వచ్చి 'నీకు ఒక విషయం చెబుతాను విను' అని అన్నాడు. వెంటనే సోక్రటీస్ ఆ విషయమేమిటో చెప్పమని అంటే సమయం వృథా అవుతుందేమోననీ, చెప్పవద్దంటే మిత్రుడు బాధపడతాడేమోననీ ఆలోచించి 'త్రిసూత్ర' ప్రయోగం చేశాడు.

సోక్రటీస్ తన మిత్రుణ్ణి 'నీవు చెప్పాల్సిన విషయంలో సత్యమేమైనా ఉందా' అని ప్రశ్నించాడు. అందుకు అతని మిత్రుడు 'ఈ విషయం ఒకరి దగ్గర నుంచి విన్నది మాత్రమే!' అని బదులిచ్చాడు. అప్పుడు సోక్రటీస్ 'చెప్పే ఏ విషయమైనా సత్యమని రూఢి కానప్పుడు ఆ విషయాన్ని గురించి చర్చించడం వల్ల ఇద్దరికీ ఎలాంటి ప్రయోజనమూ ఉండదు' అని మిత్రుడితో అన్నాడు.

అంతటితో ఆగకుండా సోక్రటీస్ 'నీవు నాకు చెప్పాల్సిన విషయంలో ఏదైనా మంచి ఉందా?' అని మిత్రుణ్ణి అడిగాడు. మిత్రుడు 'లేదు' అని బదులిచ్చాడు. ఇప్పుడు సోక్రటీస్ మిత్రుణ్ణి మూడో ప్రశ్న అడిగాడు: 'నీవు చెప్పాల్సిన దాంట్లో మనకు ఉపయోగపడే విషయం ఏమైనా ఉందా?' మిత్రుడి నుంచి 'లేదు' అనే సమాధానం వచ్చింది.

సమాధానాలు విన్న తరువాత సోక్రటీస్ తన మిత్రునితో, 'నీవు చెప్పబోయే విషయం సత్యమూ కాదు, మంచి విషయమూ కాదు, ప్రయోజనకరమైనదీ కాదు. అలాంటి విషయాల్ని చర్చించు కోకుండా ఉండడం మంచిది' అని సున్నితంగా చెప్పి సంభాషణను నిలిపివేశాడు. మనం కూడా సోక్రటీస్ త్రిసూత్రాన్ని నిత్యజీవితంలో పాటించగలిగితే ఉన్న సమయ మంతా మనదే అవుతుంది. ఇక ప్రయత్నించి చూడండి. ❖


మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :

**యువవాణి**

**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**

**దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029**

# మనసా... నీ పయనమెటు?

**– స్వామి సేవ్యానంద**

**ఓ ఆశ్చర్యకరమైన విషయం:** మహాభారతంలో యక్షుడు, యుధిష్ఠిరుణ్ణి "ఈ లోకంలో ఆశ్చర్యకరమైన విషయం ఏమిటి?'' అని ప్రశ్నించాడు. సమాధానంగా యుధిష్ఠిరుడు – "ఈ ప్రపంచంలో నిత్యం ఎంతో మంది మరణిస్తున్నప్పటికీ, మిగిలిన వారంతా శాశ్వతంగా జీవించాలనే కోరుకుంటారు. ఇంతకన్నా ఆశ్చర్యకరమైన విషయం ఏముంది?" అని చెప్పాడు.

మనకు ఎంతో ప్రియమైన ఆస్తిపాస్తులు, సుఖభోగాలు, పేరు ప్రఖ్యాతులు, అన్నిటినీ మించి ఈ శరీరం ఎంతవరకు శాశ్వతం? శరీరంతో పాటు ఇవన్నీ ఏదో ఒక రోజు అంతం కావలసిందే కదా! ఆహ్వానం లేని అతిథిలా మనకు ఎదురయ్యే మృత్యుదేవతను తప్పించుకోవడం ఎవరికి మాత్రం సాధ్యం? ఈ శరీరం దహనమై, బూడిదగా మారిన తరువాత కూడా మనలో శాశ్వతంగా ఉండేది ఏమైనా ఉందా? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పడంలో 'శాస్త్రీయ విజ్ఞానం' పూర్తిగా విఫలమైంది. మన హృదయంలో ఆసీనమై ఉన్న 'ఆత్మ' శాశ్వతమైనదనీ, ఈ ఆత్మను సాక్షాత్కరించుకొని మనమంతా జనన మరణాలకు అతీతమైన ఉన్నతమైన స్థితిని చేరుకోగలమనీ, శాశ్వతమైన ఆనందాన్ని అనుభవించగలమనీ చెబుతుంది – ఆధ్యాత్మిక విజ్ఞానం.

**ఆధ్యాత్మిక విషయాలను మనం ఎందుకు విశ్వసించాలి? :** మతం పేరుతో రోజు రోజుకీ పెరుగుతున్న అత్యాచారాల ఫలితంగా నేటి యువతరంలో ఆధ్యాత్మిక జీవితంపై మంచి అభిప్రాయం, సరైన అవగాహనా లేకుండా పోయాయి. నేడు ఆధ్యాత్మిక విషయాలపై శ్రద్ధా విశ్వాసాలు లేకుండా ఉండడం 'ఆధునికత' అయింది. ఆధ్యాత్మిక విషయాలను మనం విశ్వసించాల్సిన అవసరం లేదు. వీటిని అనుభవ పూర్వకంగా తెలుసుకోవాలి. ''మానవునిలో అంతర్గతంగా ఉన్న దివ్యత్వాన్ని వ్యక్తం చేయడమే – మతం" అని స్వామి వివేకానంద చెప్పారు. భౌతిక విషయాలను శాస్త్రీయ విజ్ఞానం సహాయంతో నిరూపించిన వారిని 'శాస్త్రజ్ఞులు' అన్నట్లే, ఆధ్యాత్మిక సత్యాలను ముఖాముఖీ సాక్షాత్కరించుకొన్న వారిని ఋషులనీ, ప్రవక్తలనీ అంటాం. వీరు కొన్ని వేల సంవత్సరాల క్రితమే ఈ సత్యాలను సాక్షాత్కరించు కొని, మన కోసం ఆధ్యాత్మిక మార్గాన్ని తయారు చేశారు. ఈ మార్గాన్ని అనుసరిస్తే మనమంతా ఋషులం, మహాపురుషులం, అనంతమైన ఆనందానికి అధికారులం కాగలం.

**మనం ఏ స్థితిలో ఉన్నాం?:** నేటి వేగవంతమైన జీవితంలో, ఉన్న కొద్ది రోజులూ వీలైనంత సుఖాన్ని అనుభవించడమే తెలివైన పనిగా చాలా మంది భావిస్తున్నారు కానీ, ఉన్నతమైన జీవితాన్ని గడపాలనీ, శాశ్వతమైన ఆనందాన్ని ఆస్వాదించాలనీ ఎంత మంది కోరుకుంటున్నారు? మనం ఏ స్థితిలో ఉన్నామో తెలుసుకున్నప్పుడే ఇంతకన్నా ఉన్నతమైన స్థితికి వెళ్ళే అవకాశం ఉంటుంది.

శ్రీరామకృష్ణులు చెప్పిన ఒక కథ ద్వారా ఈ విషయాన్ని అర్థం చేసుకోవచ్చు: "బెస్తవాడు చేపల్ని పట్టడానికి ఒక చెరువులో వల విసురుతాడు. కొన్ని చేపలు ఎంత తెలివైనవంటే అవి ఎప్పుడూ వలలో చిక్కుకోవు. అవి 'నిత్యముక్తుల' కోవకు చెందినవి. వలలో చిక్కుకున్న చేపల్లో కొన్ని పారిపోవడానికి ప్రయత్నిస్తాయి. అవి 'ముముక్షు జీవుల' లాంటివి. కానీ, వీటిలో చాలా కొద్ది చేపలు మాత్రమే వల నుండి తప్పించుకొని నీళ్ళలోకి గెంతుతాయి. ఇవి 'ముక్త జీవుల' లాంటివి. అయితే, వలలో పడ్డ చేపల్లో అత్యధిక భాగం తప్పించుకోలేవు, తప్పించుకునే ప్రయత్నం కూడా చెయ్యవు. పైగా వల త్రాటిని నోట కరచి పెట్టుకొని, బురదలో దూరి, 'మేం ఇక్కడ సురక్షితంగా ఉన్నాం, ఇంకేం భయం లేదు' అనుకుంటాయి. కాసేపట్లో బెస్తవాళ్ళు వలతో సహా లాగి, తమను గట్టు మీద పడవేస్తారని వీటికి తెలియదు. ఇవి 'బద్ధజీవుల' వంటివి." మనలో ఎక్కువమంది ఈ బద్ధజీవుల తరగతికి చెందినవారే!

ఈ విలువైన మానవ జీవితాన్ని అశాశ్వతమైన ప్రాపంచిక భోగాల కోసం వృథా చేయకుండా శాశ్వత ఆనందం కోసం సద్వినియోగ పరచుకుందాం. ❖



# మనసు-మర్మం - స్వామి బుధానంద



## మనో నియంత్రణకు మార్గం!

మనస్సును స్వాధీనం చేసుకోవడం అన్ని కాలాలలోనూ ధీరులైన వారికి సైతం కష్టమైన పనే! అయితే, అది అసాధ్యం మాత్రం కాదు. దాన్ని సాధించ డానికి చక్కగా నిర్వచించిన, నిర్దేశించిన పద్ధతులు కొన్ని ఉన్నాయి.

మనస్సును స్వాధీనం చేసుకోవడం లోని రహస్యాన్నంతా శ్రీకృష్ణుడు రెండు మాటలలో ఇమిడ్చి బోధించాడు. అవి: అభ్యాసం, వైరాగ్యం.

పై రెంటినీ మన జీవితంలో ఆచరణ లోకి తీసుకురావాలంటే - మనస్సును స్వాధీనం చేసుకోవాలన్న దృఢమైన సంకల్పాన్ని పెంపొందించుకోవాలి; మన మనస్సు స్వభావాన్ని అర్థం చేసుకోవాలి. సంకల్పశక్తిని మరింత బలమైనదిగా చేయడానికి ముందుగా సుఖాలపై మనకున్న కోరికలను చంపుకోవాలి. మనస్సును స్వాధీనం చేసుకోవడంలో ఇమిడి ఉన్న లాభాలేమిటో అర్థం చేసుకోవాలి. మనస్సును సద్విషయాలతో నింపడానికి అనుకూలమైన అంతర్గత వాతావరణం అవసరం.

మనస్సు ఎంత పవిత్రమైనదైతే దాన్ని స్వాధీనం చేసుకోవడం అంత సులభం. కాబట్టి మనం మనస్సును పరిశుద్ధం చేయడానికి సాధనలు చెయ్యాలి. మన స్వభావంలో సత్త్వగుణాన్ని బలపరచి, అదే గుణాన్ని మరింత పరిశుద్ధం చేయడం ద్వారా దాన్ని కూడా అధిగమించడమే మన లక్ష్యం.

సాధనలను సమర్థంగా అభ్యాసం చెయ్యడానికి సూచించిన కొన్ని చర్యలను జాగ్రత్తగా అనుసరించాలి. ఈ చర్యలు ఏమిటంటే:

1. సామరస్యమైన మానవ సంబంధాలను కలిగి ఉండడం;
2. మనస్సుకు ఆరోగ్యకరమైన కాలక్షేపాన్ని చూపడం;
3. ఊహాశక్తిని సరిగ్గా ఉపయోగించడం;
4. నిరాశా నిస్పృహలకు లోను కాకుండా ఉండడం.

మనస్సును స్వాధీనం చేసు కోవడానికి ధ్యానం గొప్పగా సహకరిస్తుంది. అలాగే, స్వాధీనమైన మనస్సు, ధ్యానానికి సహకరిస్తుంది.

అత్యవసర పరిస్థితులలో వాడడానికి అవసరమైన నిరోధకాల (బ్రేకుల) గురించి పతంజలి మహర్షి సూచించిన పద్ధతి - పవిత్రమైన ఆలోచనలూ, నిరంతరం భగవన్నా మాన్ని స్మరించడం, భగవంతుణ్ణి శరణువేడడం.

మనస్సు యొక్క చైతన్యరహిత స్థితిని నియంత్రించకుండా మనస్సును స్వాధీనం చేసుకోలేం. చైతన్యరహిత స్థితిని నియంత్రించడానికి దానిలో పవిత్రమైన ఆలోచనలను ధారగా పోయడం ఒక పద్ధతి. ప్రాణాయామం, భక్తి మొదలైనవి ఇతర పద్ధతులు. పై పద్ధతులన్నీ మనిషిలో నిద్రాణమై ఉన్న ఆధ్యాత్మిక శక్తి, 'కుండలిని'ని మేలుకొలపడానికి సహాయపడతాయి.

మనస్సును స్వాధీనం చేసుకోవడంలో భగవంతుణ్ణి నమ్మిన వారిదే పైచేయి. భగవంతుని పట్ల ప్రేమను కలిగి ఉండడమే మనస్సును స్వాధీనం చేసుకోవడానికి సులభమైన పద్ధతి. ❖



(1884-1967)

# ముందుకు సాగిపో!

– స్వామి ప్రేమేశానంద

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ -వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

హృషీకేశ్
12-4-1930

ప్రియమైన శశాంక్!

నీవు నీ గురువును చూడడానికి వెళ్ళలేకపోయినందుకు బాధపడుతున్నావు. కానీ ఆయనను చూడడం కన్నా నీ విచారమే నీకు ఎక్కువ ఉపయుక్తమైనది. గురువును చూడలేకపోయాననే అనే విచారం ఆయన పట్ల నీ ఆకర్షణను పెంచుతోంది కదా!

పురుషకారం, అదృష్టం అన్నవి రెండు విభిన్న శక్తులు కావు. గతంలో చేసిన స్వప్రయత్నం ఏదైనా సంచితంగా మిగిలి, తర్వాతి కాలంలో అది ఆవిష్కృతమైనప్పుడు, బహుశః స్వర్గంలోని ఏ దేవుడో దానికి కర్త అని జనం భావిస్తుంటారు. వారు వారి గత జన్మల్లో ఎన్నెన్ని మంచి పనులూ, చెడ్డ పనులూ చేశారో వారికి తెలియదు.

ఒక్కటి గమనించు! జీవుడు భౌతికమైన శరీరానికి అధిపతి అయినప్పటికీ జీర్ణక్రియ లాంటి అంతర్గత చర్యల మీద అతని అదుపు ఏమీ ఉండదు. ఎలాగంటే మనం ఒక గుర్రం మీద కూర్చొని దాన్ని నడుపుతున్నప్పటికీ, నిజానికి అదే మనల్ని తీసుకుపోతుంటుంది. పని అనేది నా ఆధీనంలోనే ఉన్నా, ఒకసారి అది చేసేశాక దాని ఫలితాల మీద నా అదుపు ఏమీ ఉండదు. మనం గత జన్మలలో ఏమేమి చేశామో జ్ఞాపకం లేదు. అందుచేత మనం ప్రయత్నం వల్లనో, అప్రయత్నంగానో సత్ఫలితాలను పొందినప్పుడు అది స్వర్గంలోని భగవంతుడిచ్చిన కానుకగా భావిస్తుంటాం. ఫలితాలు వ్యతిరేకమైనవైతే, దాన్ని భగవంతుని ఆగ్రహానికి కారణంగా భావిస్తాం.

గత జన్మలో నేను అనేక దుష్కార్యాలు చేసి ఉండాలి. అందుకే ఇప్పుడు దారిద్ర్యం అనుభవిస్తున్నాను. నా జాతక చక్రం పరిశీలించిన ఒక జ్యోతిష్కుడు "శని ఆగ్రహించాడు" అని చెప్పాడు. అందుచేత నా దోషాలన్నిటికీ కారణం శని ప్రభావం అని నేను అర్థం చేసుకున్నాను. కానీ శని ఆగ్రహానికి కారణమైన నా గతజన్మ చర్యలేవీ నా జాతక చక్రంలో వ్రాసి లేవు. కాబట్టి నా 'అదృష్టం' అనేది నా పూర్వకర్మల ఫలితమేనని స్పష్టమవుతోంది.

భగవద్గీతలో ఎక్కడా 'అదృష్టం' గురించి నొక్కి చెప్పిన సందర్భం లేదు. 'పురుషకారం' గురించి గీత కొంత ప్రత్యేకంగా చెప్పింది. భగవంతుని వద్ద శరణాగతి పొందడం మరొక అంశం. జీవుడు అహంకారం, స్వప్రయత్నం అనే ఆలోచనల నుంచి ఎప్పుడు విడివడతాడో అప్పుడు నిష్క్రియుడై, అతని కర్మ ముగుస్తుంది. జీవుడు జ్ఞానాన్ని పొందడం వల్ల సర్వాన్నీ, అంటే స్వప్రయత్నాన్నీ, దాని ఫలితాన్నీ కూడా భ్రాంతిగా చూస్తాడు, భగవంతుడే అన్నీ చేసేవాడు, అనుభవించేవాడు అని తెలుస్తుంది. ఆ విధమైన జ్ఞానం కలిగాక భగవంతుడు ప్రేమస్వరూపుడు, దయామయుడు, అనుగ్రహ సాగరుడు అని అర్థమవుతుంది. ఈ స్థితికి చేరడానికి ముందే స్వప్రయత్నాన్ని ఆపివేస్తే జీవుడు వినాశానికి గురి అవుతాడు. దాన్ని గురించి ఆలోచించి ప్రయోజనం లేదు. నీవేమీ నిస్పృహకు గురి కాకు. హృదయాన్ని ఆనందంతో నింపుకొని మనస్సును నీ విధులపై లగ్నం చెయ్యి. నువ్వు సంతోషంగా ఉండు, ఇతరులను సంతోషంగా ఉంచు. నీ తల్లితండ్రులు ఆనందంగా ఉండేలా చూడు. ఓర్మితో భరించవలసినదంతా భరించు. ❖

ప్రేమాశీస్సులతో...
స్వామి ప్రేమేశానంద

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

... *23వ పేజీ తరువాయి*

1943లో కరాచీ వెళ్ళారు. కంఖల్ విడిచి వెళ్ళాలని లేకపోయి నప్పటికీ, స్వామి రంగనాథానందజీ పట్ల గల ప్రేమ వల్ల స్వామి సర్వగతానందజీ కరాచీ వెళ్ళి సేవ చేశారు.

**సంఘ సేవలో అవిశ్రాంత కృషి :** బోస్టన్ వెళ్ళాల్సిందిగా బేలూరు మఠం నుంచి ఆదేశం వచ్చే లోపు స్వామి సర్వగతానందజీ కొంతకాలం విశాఖపట్నం కేంద్ర అధికార బాధ్యతను నిర్వహించారు. 1954లో బోస్టన్‌లోని రామకృష్ణ వేదాంత సమాజానికి అధ్యక్షులుగా ఉన్న స్వామి అఖిలానందజీ మహరాజ్ సహాయకునిగా బోస్టన్ వెళ్ళారు. స్వామి అక్కడ రెండు ఆశ్రమాల అభివృద్ధికై తీవ్రంగా కృషి చేశారు. స్వామి అఖిలానందజీ మహాసమాధి అనంతరం 1962లో స్వామి సర్వగతానందజీ ఆ రెండు కేంద్రాలకూ అధ్యక్షులయ్యారు.

యాభై సంవత్సరాలకు పైగా స్వామి సర్వగతానందజీ ఒక్కరే రెండు కేంద్రాల బాధ్యతలనూ నిర్వహించారు. ఆశ్రమ నిర్వహణలో ఎదురైన అనేక సమస్యలనూ, తనకు ప్రాణహాని కలిగించే సంఘటనలనూ కూడా ప్రశాంతంగా ఎదుర్కోగలగడం శ్రీరామకృష్ణులపై సర్వగతానందజీకి గల అపార భక్తి విశ్వాసాలకు నిదర్శనం. పవిత్రమైన ఆదర్శాలతో వేల మందికి సాంత్వన కలిగించి ప్రభావితం చేసిన అసాధారణ వ్యక్తిత్వం స్వామీజీది.

స్వామి సర్వగతానందజీ వేదాంత సొసైటీలో చేసిన రాజయోగ ప్రసంగాలు అక్కడి మేధావుల్ని సైతం ఎంతో ప్రభావితం చేశాయి. ఆయన రాజయోగ ప్రసంగాలు రెండు సంపుటాలుగా ప్రచురితమయ్యాయి. ఆ గ్రంథాలను ఒక్కమారు చదివినా సరే, సర్వగతానందజీకి గల పరిజ్ఞానం ఎంత లోతైనదో పాఠకులకు ఇట్టే అర్థమవుతుంది.

'గుర్వాజ్ఞను' శిరసావహించిన ఉత్తమ శిష్యునిగా, 'మానవ సేవే మాధవ సేవ' అనే నవీన మంత్రాన్ని స్వీకరించి తరించిన ఉత్తమ సాధకునిగా, తప్త హృదయులకు శ్రీరామకృష్ణ సందేశామృతంతో సాంత్వన చేకూర్చి ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు ఆదర్శ గురువుగా స్వామి సర్వగతానందజీ మహరాజ్ ప్రదర్శించిన ప్రతిభ అనన్యసామాన్యం. త్యాగం, ప్రేమ, సహనం, సేవాభావాలు సమ్మిళితమైన స్వామీజీ జీవితం మనందరికీ చిరస్మరణీయం, స్ఫూర్తిదాయకం. ❖

భరతమాత చరణ సేవలో

# వీర సింహం

భారతమాత అనేక మంది వీరపుత్రులను కని పునీతమైంది. అది 1927వ సంవత్సరం డిసెంబర్ 18వ తేదీ. ఓ మధ్య వయస్కురాలైన మహిళ గోరఖ్‌పూర్ సెంట్రల్ జైలు ప్రధాన ద్వారం వద్ద నిరీక్షిస్తోంది. జైలు అధికారుల నుంచి వచ్చే పిలుపు కోసం ఆమె వేచి ఉంది. మరునాడు మృత్యువును కౌగలించు కోనున్న సమరయోధుణ్ణి కలిసేందుకు జైలులోకి ప్రవేశించింది.



సంకెళ్ళతో బంధింపబడిన ఆ స్వాతంత్ర్య యోధుణ్ణి అక్కడకు తీసుకు వచ్చారు. చివరిసారిగా చూసి "అమ్మా" అని పిలువగలిగిన సమయమది. ఆ ఆలోచన మనస్సులో నిండగానే కళ్ళ నుండి అశ్రుధారలు ప్రవహించాయి. "ఇవేమిటి నాయనా? నా కొడుకును నేను గొప్ప వీరుడిగా ఊహించుకున్నాను. నా కొడుకు చావుకు భయపడతాడని నేనెప్పుడూ ఊహించలేదు" అంది ఆ తల్లి.

"అమ్మా! ఇవి భయంతో వచ్చిన కన్నీళ్ళు కాదు. ఆనంద బాష్పాలు. నీ లాంటి తల్లికి పుత్రుణ్ణైనందుకు నేను పొందుతున్న ఆనందమిది" అన్నాడు ఆ యోధుడు. అతడే 'రామ్‌ప్రసాద్ బిస్మల్'. కాకోరీ దోపిడీ సంఘటనలో ప్రధాన నాయకుడు.

భారతమాత దాస్యశృంఖలాలను త్రెంచడానికీ, భారతీయులకు స్వేచ్ఛా వాయువులను అందించడానికీ విప్లవ కార్యకలాపాల కోసం పెద్ద మొత్తంలో ధనం సేకరించాలన్న ఆలోచనతో మన దేశాన్ని దోచుకుంటూ ఇంగ్లాండుకు తరలిస్తున్న బ్రిటీషు ప్రభుత్వ ధనాన్ని మన సొంతం చేసుకోవాలని 1925 ఆగష్టు 9 న 'కాకోరీ' గ్రామం చేరుతున్న రైలును రామ్‌ప్రసాద్, మరో తొమ్మిది మంది విప్లవ సహచరులతో ఎంతో చాకచక్యంగా దోచుకున్నారు. ఆ కాకోరీ రైలు దోపిడీ ఉదంతం భారత విప్లవోద్యమ చరిత్రలో ఓ సంచలనాత్మక ఘట్టం. బ్రిటీషు ప్రభుత్వం గుండెల్లో రైళ్ళు పరుగెత్తించిన వీరుడు, సాహసి, ఉన్నత సంస్కారాలు మూర్తీభవించిన వ్యక్తి 'రామ్ ప్రసాద్'.

'మాతృభూమి కోసం ఎన్నిసార్లైనా ప్రాణాలను త్యజించడానికి నేను సిద్ధం. ప్రతి జన్మా భారతమాత సేవలో తరించవలసిందే' అంటూ ఉరికంబాన్ని కౌగలించుకొని, తన జీవితాన్ని భరతమాత పాదాల చెంత అర్పించిన వీర సింహం రామ్‌ప్రసాద్ బిస్మల్. ❖

## చేసే మేలు చెప్పకూడదు! - స్వామి వినిశ్చలానంద

ఒక జెన్ గురువు తన శిష్యులతో సంచారం చేస్తూ ఓ గ్రామానికి చేరుకున్నారు. ఆయనకు ఆ గ్రామంలో ఒక వింత కనపడింది. అదేమంటే ఆ గ్రామంలో ఒక్క చెట్టు కూడా లేకుండా అన్నిటినీ మొదలు వరకూ నరికి వేశారు. కానీ ఒకే ఒక చెట్టును మాత్రం నరకకుండా అలానే ఉంచారు. ఇది చూసి ఆయనకు చాలా ఆశ్చర్యం కలిగింది.

వెంటనే ఆ జెన్ గురువు ఆ గ్రామ పెద్దను పిలిచి, "మీ గ్రామంలోని అన్ని చెట్లనూ నరికివేశారు కానీ, ఈ ఒక్కటీ ఏం పాపం చేసింది, దీన్ని ఎందుకు నరకలేదు" అని అడిగారు.

అందుకు ఆ గ్రామపెద్ద, "గురూజీ! ఈ చెట్టు ఎంత వంకర టింకరగా ఉందో చూడండి! ఇది ఏ పనికీ ఉపయోగపడదు. కనీసం వంట చెరకుగా కూడా పనికి రాదు. దాని వల్ల ప్రయోజనం ఏమిటి? అందుకే దాన్ని నరకకుండా వదిలివేశాం" అన్నారు.

అది వింటూనే ఆ జెన్ గురువు తన శిష్యులతో "చూశారా! సమాజానికి మనం ఉపయోగకరమైన పనులు చేసేవారమైనా ఆ విషయం బహిర్గతం చేయరాదు. ఆ రకంగా బహిర్గతం చేస్తే, ఈ చెట్లలానే మన జీవితాలు కూడా నాశనమవుతాయనే సత్యాన్ని తెలియజేస్తుంది" అన్నారు. ❖



# రామకృష్ణ మఠం

విజ్ఞానానంద మార్గ్, ముఠిగంజ్, అలహాబాద్-211 003 (ఉత్తర ప్రదేశ్)
ఫోన్: 0532 - 2413369, ఫ్యాక్స్: 2415235 Email : rkmathald@dataone.in



## త్రివేణీ సంగమ క్షేత్రంలో నూతన శ్రీరామకృష్ణ దేవాలయం

**ప్రియమిత్రులారా!**

ప్రయాగ (అలహాబాద్)లోని రామకృష్ణ మఠం 2010లో శతవార్షికోత్సవాలు జరుపుకోనుంది. ఈ శుభవార్త మీతో పంచుకోవడానికి ఆనందిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులలో ఒకరైన స్వామి విజ్ఞానానందజీ మహరాజ్ 1910లో ఈ మఠాన్ని ప్రారంభించారు. వారు ఆధ్యాత్మిక శక్తి సంపన్నులు, జీవన్ముక్తులు. స్వామి విజ్ఞానానందజీని రామకృష్ణ సంఘ ప్రథమ అధ్యక్షులూ, శ్రీరామకృష్ణుల ఆధ్యాత్మిక పుత్రుడూ అయిన స్వామి బ్రహ్మానందజీ మహరాజ్ 'గుప్త బ్రహ్మజ్ఞాని' అనేవారు. విజ్ఞానానందజీ జీవితమంతా దివ్యదర్శనాలతో నిండి నది. ఆయన తమ 28 సంవత్సరాల తీవ్ర తపస్సాధనల దివ్యశక్తితో మఠ వాతావరణాన్ని ప్రభావితం చేశారు; మఠాన్ని సందర్శించే భక్తులు ఇప్పటికీ ఆ దివ్యశక్తి ప్రభావాన్ని అనుభూతి చెందుతారు.



ఈ ఆధ్యాత్మిక శక్తి చైతన్యాన్ని ప్రతి ఒక్కరూ తమ జీవితంలో సాక్షాత్కరింప చేసుకొనే విధంగా భగవాన్ శ్రీరామకృష్ణుల విశ్వజనీన దేవాలయాన్ని నిర్మించాలని చాలా సంవత్సరాలుగా అనుకుంటున్నాం.

అందుకు ప్రస్తుత ప్రార్థనా మందిరాన్ని 2010లోగా దివ్యమైన ఆలయంగా తీర్చిదిద్ది, శ్రీరామకృష్ణుల చలువరాతి ప్రతిమను ప్రతిష్ఠించాలని నిశ్చయించాం. జాతి మత విచక్షణ లేకుండా అందరూ దేవాలయానికి వచ్చి ధ్యానం చేసుకోవచ్చు.

రామకృష్ణ మఠం, మిషన్‌ల అధ్యక్షులు శ్రీమత్ స్వామి ఆత్మస్థానందజీ మహరాజ్ 2008, ఏప్రిల్ 11న ఈ ఆలయానికి శంకుస్థాపన చేశారు. రానున్న జనవరి నెలలో ఆలయ మహాసంప్రోక్షణ జరుగనుంది.

ఈ బృహత్తర ఆలయ నిర్మాణానికి సుమారు కోటి రూపాయలు వ్యయమవుతాయని అంచనా. ఈ ఉన్నత కార్యార్థం మిమ్మల్ని ఉదారంగా విరాళాలు ఇవ్వవలసిందిగా కోరుతున్నాం.

రామకృష్ణ మఠానికి ఇచ్చే విరాళాలన్నిటికీ 1961 నాటి ఆదాయపు పన్ను చట్టంలోని 80 (జి) విభాగం ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

"Ramakrishna Math, Allahabad" పేరున చెక్కు/ డి.డి. తీసి Ramakrishna Math, Vijnanananda Marg, Mutthiganj, Allahabad-211 003 కు పంపాల్సిందిగా మనవి. దయచేసి మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ ఇంగ్లీషు, లేక హిందీ భాషల్లోనే జరపాల్సిందిగా వినతి.

భగవాన్ శ్రీరామకృష్ణుల అనుగ్రహం అందరి మీదా వర్షించాలని వారి పాదపద్మాల వద్ద ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
**స్వామి త్యాగాత్మానంద**
అధ్యక్షులు

Advt.

# స్వాధ్యాయం

– స్వామి రఘునాయకానంద

గురుకుల విద్యాభ్యాసం ముగించి ఇంటికి వెళుతున్న శిష్యుడికి గురువు మరొక్క సారి ఆతడు ఏ యే విషయాలలో శ్రద్ధ వహించాలో తైత్తిరీయ ఉపనిషత్తు ఇలా చెబుతోంది: 'సత్యాన్నే పలకాలి, ధర్మాన్ని ఆచరించాలి, శాస్త్రాల్లో నిర్దేశించిన కర్మలనే చేయాలి, స్వాధ్యాయాన్ని విడిచి పెట్టకూడదు.' ఇక, పతంజలి యోగసూత్రాల్లో తపస్సు, స్వాధ్యాయం, ఈశ్వరప్రణిధానం – ఈ మూడింటినీ పతంజలి మహర్షి 'క్రియాయోగం'గా నిర్వచించారు.

## మనల్ని మనం విశ్లేషించుకోవడమే స్వాధ్యాయం

స్వాధ్యాయం – స్వ అధ్యయనం అంటే మనల్ని మనం విశ్లేషించుకోవడం. An unexamined life is not worth living – ఆత్మ పరిశీలన లేని జీవితం జీవితమే కాదు అంటారు సోక్రటీస్. మనిషి అన్ని దశలలోనూ తనను తాను పరిశీలన చేసుకోవడం ద్వారా తనలోని లోపాలను సవరించుకొనే అవకాశం కలుగుతుంది. మనస్సులో వచ్చే ఆలోచనలకు క్రియారూపం ఇవ్వకుండా ప్రతి రోజూ గమనించడమే ఆత్మ పరిశీలన. ఈ ఆత్మ పరిశీలన మానసికంగా బలవంతులను చేసి, జీవిత పోరాటానికి సంసిద్ధం చేస్తుంది. మన ఆలోచనలే మన ప్రస్తుత స్థితికి కారణం. అందువల్ల ఆలోచనల విషయంలో జాగరూకత అవసరం. "Our thoughts make things beautiful, our thoughts make things ugly" అని అంటారు స్వామి వివేకానంద.

## స్వాధ్యాయమంటే?

సాంప్రదాయిక అర్థంలో స్వాధ్యాయం అంటే ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రాల పఠనమే. రామకృష్ణ మిషన్‌లో ఒక సీనియర్ స్వామీజీ స్వాధ్యాయం ఎలా చేయాలో చెబుతూ, 'మహాత్ముల జీవితాలను వారి సందేశాలను చదువుతున్నప్పుడు వాటిని నైతిక, ఆధ్యాత్మిక విలువల దృష్టితో చదవాలి. వాటిని మన జీవితంలో ఆచరించడానికి ప్రయత్నించాలి' అంటారు.

తరువాత ఓంకార ప్రణవ ధ్యానం. అంటే ఓంకార ధ్యానాన్ని కూడా స్వాధ్యాయంగా చెబుతారు. గురువు ద్వారా పొందిన మంత్రాన్ని ఉదయం, సాయంకాలాల్లో జపించడం కూడా స్వాధ్యాయమే.

## స్వాధ్యాయం ముఖ్యోద్దేశం

కేవలం విషయాన్ని తెలుసుకోవడానికి మాత్రమే శాస్త్రాధ్యయనం. అంతేకానీ దాని ద్వారా బ్రహ్మజ్ఞానాన్ని పొందలేం. 'పంచాంగంలో ఇంత వర్షం కురుస్తుంది అని ఉంటుంది కానీ దాన్ని పిండితే ఒక్క నీటి బొట్టు కూడా రాలదు' అంటారు శ్రీరామకృష్ణులు.

భక్తి గ్రంథాలు, వేదాంత గ్రంథాలు మనస్సును ఉన్నత స్థాయిలో ఉంచడానికి సహాయపడతాయి. దాని కోసం స్వాధ్యాయం అవసరం.

కేవలం శాస్త్రపాండిత్యమే లక్ష్యంగా చదివే పండితుల గురించి శ్రీరామకృష్ణులు చెబుతూ, ఆకాశంలో ఎత్తున ఎగురుతున్న గ్రద్దను ఉదహరిస్తారు. అది ఆకాశంలో ఎగురుతున్నప్పటికీ దాని దృష్టి మాత్రం క్రింద పడి ఉన్న శవాల మీదనే ఉంటుంది.



భగవంతుడే అన్నింటికీ మూలం అని తెలుసుకోవడమే శాస్త్రాధ్యయనం. ఎన్ని సున్నలు ఉన్నప్పటికీ ఎడమ ప్రక్కన ఒకటి లేకపోతే ఆ సున్నలకు ఏ విధంగా విలువలేదో అదే విధంగా భగవంతుడు లేకపోతే జీవితానికి విలువ లేదు. ఆయన ఒక్కడే సత్యం! అది తెలియజేయడమే శాస్త్రాధ్యయనం ముఖ్య ఉద్దేశం!

## నేటి యువతరానికి వివేక భావజ్వాల!

"ఎక్కడైతే హృదయాంతరాళాల నుంచి మాటలు వెలువడతాయో ఆ మాటలకే జీవితాలను మార్చగల శక్తి ఉంటుంది"అని 'గీతాంజలి'లో రవీంద్రనాథ్ టాగూర్ అంటారు. ఆ మాటలే స్వామి వివేకానంద భావజ్వాల. ఆయన జ్ఞానాగ్నిలో ఒక కణంగా మారగలిగితే – అంటే ఆయన భావాలతో నిండిన 'లేవండి! మేల్కొండి!' పది సంపుటాలలో కొంచెమైనా ఆకళింపు చేసుకోగలిగితే అదే నిజమైన స్వాధ్యాయం. మహాత్మా గాంధీ, సుభాష్ చంద్రబోస్ లాంటి ఎందరో నాయకులకూ, బిల్‌గేట్స్, సుకర్ణో, అన్నా హజారే వంటి నేటి ప్రముఖులకూ స్ఫూర్తిని ఇచ్చింది వివేకానందుని భావజ్వాలే! ❖

## నా జీవితంలో స్వామి వివేకానంద

# 'విశ్వాసం.. విశ్వాసం' అదే స్వామీజీ సందేశం!

– కామూర్తి వెంకటేశ్

నా పేరు కామూర్తి వెంకటేశ్. మా ఊరు అనంతపురం జిల్లా రాయదుర్గం. నేను రెడీమేడ్ గార్మెంట్స్‌లో కటింగ్ మాస్టర్‌గా పనిచేస్తున్నాను.

గత సంవత్సరం వేసవి సెలవులలో మా అబ్బాయిని స్వామి వివేకానంద బాల వికాస కేంద్రానికి పంపే అవకాశం కలిగింది. అప్పుడు ఆ 'వివేకానంద బాల వికాస కేంద్రం' తరగతులను నిర్వహించిన స్వామీజీ అర్చనానంద గారు పరిచయం అయ్యారు. స్వామీజీ సలహా మేరకు నేనూ 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకుడనయ్యాను. 'శ్రీరామకృష్ణ ప్రభ' చదవడం వల్ల శ్రీరామకృష్ణులు, శ్రీశారదా మాత, స్వామి వివేకానందుల గురించి తెలుసుకోగలిగాను. స్వామి వివేకానందుల గురించి ఇంకా ఎక్కువగా తెలుసుకోవాలన్న ఆసక్తితో స్వామీజీ జీవిత చరిత్ర 'స్వామి వివేకానంద' (2 సంపుటాలు) చదవడం ప్రారంభించాను. స్వామీజీ జీవితంలోని సంఘటనలను చదివినకొద్దీ నాకు ఆసక్తి పెరిగింది. దీంతో వివేకానందుని గురించి అందరూ తెలుసుకోవాలన్న ఉద్దేశంతో నన్ను కలిసిన వారందరికీ స్వామీజీని గురించిన పుస్తకాలు చదవాల్సిందిగా చెబుతుంటాను. ఎందుకంటే స్వామీజీ సేవాభావం, త్యాగనిరతి అందరిలోనూ కలగాలన్నది నా ఆశ.



స్వాతంత్ర్య సమరయోధులైన సుభాష్ చంద్రబోస్ గారు, స్వామీజీ సంభాషణలతో ప్రభావితమయ్యాననీ, శ్రీరామకృష్ణులు, స్వామి వివేకానందుల సాహిత్యం యువకులను చైతన్యం చేయగలదనీ కూడా చెప్పారు. మహాత్మా గాంధీ కూడా స్వామీజీ సాహిత్యాన్ని చదివి ప్రభావితం అయ్యానని చెప్పారు. అంతటి వారినే ప్రభావితం చేసిన స్వామీజీ సూక్తులు మనల్ని ఆకట్టుకోవడంలో ఆశ్చర్యం లేదు. అలాగే నన్నూ స్వామీజీ సూక్తులు ప్రభావితం చేశాయి. వాటిలో నన్ను బాగా ప్రభావితం చేసినవి: "విశ్వాసం! విశ్వాసం! మన మీద మనకే విశ్వాసం. దేవుని మీద విశ్వాసం. ఇదే గొప్పతనంలోని రహస్యం. మీ పురాణాలు వర్ణించిన ముప్పై మూడు కోట్లమంది దేవతల మీద మీకు విశ్వాసం ఉన్నా, అప్పుడప్పుడూ విదేశీయులు మీ మధ్యలోకి చొప్పించిన దేవతలందరి మీద కూడా మీకు విశ్వాసం ఉన్నా, మీ మీదనే మీకు విశ్వాసం లేకపోతే మీకు మోక్షం లేదు".

స్వామి వివేకానంద సాహిత్యాన్ని చదవక ముందు ఏదైనా ఒక విషయం గురించి నేను ఆ పని చెయ్యగలనా, లేదా; చేస్తే రాణించ గలనా అని పలురకాలుగా ఆలోచించేవాణ్ణి. చివరకు దైవం ఏది తలిస్తే అది జరుగుతుందిలే అనుకుని వెనుకడుగు వేసి, దాని గురించి ఆలోచించేవాణ్ణి కాను. కానీ స్వామి వివేకానందుల సాహిత్యాన్ని చదివిన తరువాత నాపై నాకు విశ్వాసం పెరిగింది. ఏదైనా పని చేయాలి అనుకుంటే దాన్ని చేసేవరకు విడిచిపెట్టకుండా చేస్తున్నాను. చివరకు ఎంత శ్రమించి అయినా సరే దాన్ని సాధించడం అలవరుచుకున్నాను.

స్వామీజీ ఆశయసాధనకు తోడ్పడాలన్న భావంతో నా వంతు సహాయంగా అవకాశం కలిగినప్పుడు స్వామీజీ సాహిత్య ప్రచారంలో పాల్గొంటున్నాను. ❖

కామూర్తి వెంకటేశ్, రాయదుర్గం, అనంతపురం జిల్లా

# నిత్య సంతోషం

– స్వామి రంగనాథానంద

సంతోషంగా ఉండాలని అందరూ కోరుకుంటారు, అందుకోసం భౌతికంగా ఎన్నో సౌకర్యాలు, సుఖాలు ఏర్పరుచుకుంటారు. కానీ నిత్యం సంతోషం ఎలా పొందాలో తెలుసుకోలేరు. అంతరంగంలోని దివ్యత్వాన్ని దర్శించగలిగితే ఆనందం అదే వస్తుంది. ద్రవ్యత్వం నుంచి దివ్యత్వం వైపు సాధన చేస్తూ ఆత్మస్వరూపం అవగాహన చేసుకునేవారికి అంతరంగం నుంచి నిత్య సంతోషం లభిస్తుంది. భగవద్గీత ఒక సాంకేతిక విజ్ఞాన శాస్త్రం లాంటిది. మానవుణ్ణి జంతు స్వభావం నుంచి దివ్యత్వానికి మళ్ళించే ఒక గొప్ప దివ్య గ్రంథం. మానవజాతి స్వేచ్ఛగా తిరిగే విధానాన్ని భగవద్గీతలో భగవంతుడు వివరించారు. "మన్–హుష్ అయినవారు మానుష్" అని శ్రీరామకృష్ణులు చెప్పేవారు. "మానుష్ ఎవరు? మన్–హుష్ అంటే ఎవరి మనస్సు సంతోషంగా ఉంటుందో వారు మానుష్. బలం అంతా అతని మనస్సులోనే ఉంటుంది. సాధనతో మానసిక బలాన్ని పెంచుకోవాలి. మాటపడాల్సి వచ్చినా, మాట చెల్లుబాటు కాని పరిస్థితి ఎదురైనా మానసికంగా కుంగిపోకుండా మనస్సును దృఢపరుచుకోవాలి. మన శరీరంలో రోగక్రిములెన్ని ఉన్నా, శరీరం బలంగా ఉంటే అవి ఏమీ చెయ్యలేవు. శరీరంలో బలం తగ్గినప్పుడే అవి విజృంభించి, అనారోగ్యం పాలు చేస్తాయి. అలానే మనస్సు దృఢంగా ఉన్నపుడు బయటి పరిస్థితులు మనల్ని కుంగదీయ లేవు.

**ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే**
**ప్రసన్న చేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే** *(గీత 2.65)*

ప్రతిజీవీ ఆనందాన్ని కోరుకుంటాడు. అదెలా సాధ్యమో భగవాన్ శ్రీకృష్ణుడు ఈ శ్లోకంలో బోధించాడు.

మనస్సు నిర్మలమైతే ఆనందం తప్పక లభిస్తుంది. 'ప్రసాదం' అంటే మనోనైర్మల్యం. నీకు 'ప్రసాదం' లభ్యమైనట్లయితే జీవితంలో దుఃఖాలన్నీ తొలగిపోతాయి. ఏ విషయాలూ మనల్ని కదిలించవు. ఒక్కొక్కసారి చాలా సామాన్యులలో కూడా మనం ఇలాంటి స్థిరబుద్ధిని చూస్తుంటాం.

'ప్రసన్న చేతసోహ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే' – మనస్సులో ప్రసన్నత ఉన్నవారికి ఎలాంటి అలజడీ, దుఃఖం కలగవు. నిర్మలమైన మనస్సు బుద్ధి యందు నిశ్చలంగా ఉండగలదు. అన్ని కార్యక్రమాలనూ నిర్వహిస్తూ, చాలా శాంతంగా నిర్మలంగా ఉండవచ్చు. నిర్మలమైన, ఆనందమైన, స్వేచ్ఛాయుతమైన మనస్సును 'ప్రసాదం' అంటారు. నీరు పరిశుభ్రంగా ఉంటే 'ప్రసన్న' అంటారు. శారీరక – మానసిక, ఇంద్రియ జ్ఞాన నిర్మితమయిన వాటినన్నిటినీ కచ్చితమైన రీతిలో



అధీనంలో ఉంచుకోవడం వల్ల మనకు శాంతి లభ్యమవుతుంది.

నీకు మనశ్శాంతి కావాలంటే ఇతరుల తప్పులను ఎంచకు అని శారదామాత బోధించారు.

మనస్సు, మాట ఒకటైతే మనశ్శాంతి లభిస్తుందని శ్రీరామకృష్ణులు చెప్పారు.

నిర్మలత్వం, పరిపూర్ణత ఉన్నప్పుడే సంతోషం లభ్యమవుతుంది. సంతోషం కావాలంటే మనస్సును వశంలో ఉంచుకోవాలి. మనస్సుకు శిక్షణ నిచ్చుకోవడం ద్వారా సమన్వయాన్ని సాధించవచ్చు.

నిత్యజీవితంలో ప్రేమపూర్వకంగా ఉండడం, నిన్ను నువ్వే కాక, నీ కుటుంబాన్నీ, పరిసరాలనూ ప్రేమించడం జీవన వైఖరిగా చేసుకోవాలి. ❖

సేకరణ: ఆర్. కృష్ణ

... 17వ పేజీ తరువాయి.


9
సరైన సమయానికే వచ్చావు నాయనా! ఈ విగ్రహాన్ని కొంతసేపు నువ్వు పట్టుకో. నేను స్నానం చేసి, అనుష్ఠానం ముగించుకుని వచ్చి దాన్ని మళ్ళీ తీసుకుంటాను.
మహారాజా! నేను బాలుణ్ణి! దీన్ని ఎక్కువసేపు మొయ్యలేను. అందువల్ల నేను మిమ్మల్ని మూడుసార్లు పిలుస్తాను. ఆ లోపల మీరు వచ్చేసేయాలి. లేకపోతే నేను దీన్ని కింద ఉంచాల్సి వస్తుంది.
సరే! అలాగే చేస్తాను.
10
విభీషణుడు కావేరీ జలాలలో చాలాసేపు ఆనందంగా స్నానం చేశాడు. ఇంతలో ...
మహారాజా! ఈ విగ్రహం చాలా బరువుగా వుంది. మహారాజా! మహారాజా!
విభీషణుడికి ఆ పిలుపు వినబడలేదు. అందువల్ల కావేరీ నది రెండుగా చీలి మధ్యలో ఒక దీవిలా ఉన్న చోట ఆ విగ్రహాన్ని పెట్టాడు ఆ బాలుడు.
11
స్నానం చేసి తిరిగి వచ్చిన విభీషణుడు...
ఓరీ! దాన్ని నేల మీద ఉంచకూడదని చెప్పానుగా!
నేనేం చెయ్యను మహారాజా! బరువు మొయ్యలేకపోయాను. నేను మూడుసార్లు పిలిచినా మీరు రాలేదు.
విభీషణుడు ఎంత ప్రయత్నించినా ఆ విగ్రహాన్ని కదిలించలేకపోయాడు. అందువల్ల ఆ బాలుణ్ణి కొట్టడానికి వెళ్ళాడు. ఆ బాలుడు వేగంగా ఒక కొండవైపు పరుగు తీశాడు. కొంతసేపటికి విభీషణుడు ఆ బాలుణ్ణి పట్టుకొని, అతని తల మీద మొట్టికాయ వేశాడు.
12
పట్టుబడ్డావా! దుష్టుడా!
వెంటనే ఆ బాలుడు వినాయకుడిగా విభీషణునికి దర్శనమిచ్చాడు. (విభీషణుడు ఆ బాలుణ్ణి మొట్టిన గుర్తు తమిళనాడులోని తిరుచ్చిరాపల్లిలో మలైకోట్టై వినాయకుడి శిరస్సు మీద ఇప్పుడు కూడా చూడగలం.)










ఇప్పటికీ విభీషణుడు ప్రతిరోజూ రాత్రి సమయంలో శ్రీరంగనాథ స్వామిని పూజిస్తాడని అంటారు.

ప్రార్థనలు, పూజలు, జపధ్యాన సాధనలను చేసిన పుణ్యస్థలాల్లో భగవంతుడు నిశ్చయంగా వెలసివుంటాడని గ్రహించు. శ్రద్ధా భక్తుల వల్ల పారమార్థిక భావాలు అక్కడ ఘనీభూతమై ఉంటాయని చెప్పవచ్చు. ఇలాంటి పుణ్యతీర్థాల్లో మానవుడు సులువుగా భగవంతుణ్ణి చూడగలడు. - **శ్రీరామకృష్ణ పరమహంస**



మూకమహాకవి ప్రణీత

## మూక పంచశతీ

వ్యాఖ్యాత: దోర్బల విశ్వనాథశర్మ
ప్రకాశికా: రావి కృష్ణకుమారీ
పేజీలు: 876, వెల: రూ. 500/-
ప్రతులకు: రావి మోహనరావు,
4-103, కొత్తపేట, చీరాల-523 157.
మొబైల్ ఫోన్: 9440115411



కంచి కామాక్షీ అమ్మవారి కృపతో మూకకవి భావపారవశ్యంలో రచించిన 'మూకపంచశతీ' అనే సంస్కృత గ్రంథానికి 'సారోల్లాసినీ' వ్యాఖ్య పేరుతో దోర్బల విశ్వనాథ శర్మగారు ఆంధ్ర ప్రతిపదార్థ తాత్పర్య వివరణ కావించారు. తాత్పర్య వివరణలో ప్రతి శ్లోకంలో ఉన్న అలంకార లక్షణాలను, ప్రాసలను, వర్ణ మైత్రులను తెలియజేసి వ్యాకరణ విశేషాలను కూడా విశదపరిచారు. శర్మ గారి తాత్పర్యం, తాత్పర్య వివరణ మృదుమధురంగానూ, గంభీరంగానూ సాగింది. కొన్ని చోట్ల తాత్పర్య వివరణలో శ్లోకం భావార్థ వివరణ కన్నా, వ్యాకరణ విశేషాలకు అధిక ప్రాధాన్యం ఇచ్చినట్లు కనపడినా, పుస్తకం మొత్తం చదివినట్లైతే అమ్మవారి తత్త్వాన్ని సమగ్రంగా తెలియజేశారని తెలుస్తుంది. సగుణ సాకార రూపాన్ని నిర్గుణ నిరాకార తత్త్వంతో అనుసంధానం చేస్తూ, భక్త్యావేశంతో మూకకవి రచించిన ఐదువందల శ్లోకరాజాలకు విశ్వనాథ శర్మగారు ప్రతిపదార్థం, తాత్పర్య వివరణను ఇచ్చి తెలుగు ప్రజలకు, ప్రత్యేకించి అమ్మవారి భక్తులకు మహోపకారం చేశారనడంలో అతిశయోక్తి లేదు. విశ్వనాథ శర్మగారి కృషి గొప్పగా ఎంచదగ్గది. అమ్మవారి భక్తులందరూ తప్పక చదువవలసిన గ్రంథమిది. - ఆనంద

---



యజుర్వేదీయ

## సంధ్యావందనం

వ్యాఖ్యానం: అప్పరుసు విజయరామారావు
పేజీలు: 107, వెల: రూ. 60/-
ప్రతులకు: ఎ.వి. రామారావు
16-9-750/12, అజంతా కాలనీ,
రేస్‌కోర్స్ రోడ్, ఓల్డ్ మలక్‌పేట్,
హైదరాబాద్-36



# 'వివేక ప్రభ' దశమ వార్షికోత్సవం



'ఆధ్యాత్మిక పత్రికా రచన ప్రాముఖ్యం'పై గోష్ఠి



గోష్ఠికి హాజరైన స్వామీజీలు, భక్తులు



రామకృష్ణ సంఘ మాసపత్రికల సంపాదకులు, ప్రతినిధులు

**మైసూరులోని శ్రీరామకృష్ణ ఆశ్రమం** ఆధ్వర్యంలో వెలువడుతున్న కన్నడ మాసపత్రిక 'వివేక ప్రభ' దశ వసంతాలు (2000-2009) పూర్తి చేసుకుంది. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని 2009 జూన్ 27, 28 తేదీల్లో ఘనంగా ఉత్సవాలను నిర్వహించారు.

27వ తేదీన రామకృష్ణ మఠానికి చెందిన వివిధ కేంద్రాల నుంచి ప్రచురితమవుతున్న మాసపత్రికల 'సంపాదకుల సదస్సు'ను నిర్వహించారు. ఈ సదస్సులో 11 మంది పత్రికా సంపాదకులు, ప్రతినిధులు, ప్రముఖ పాత్రికేయులు పాల్గొని 'ఆధునిక సమాజంలో ఆధ్యాత్మిక పత్రికల పాత్ర' అనే అంశంపై చర్చించారు.

28వ తేదీన జరిగిన సదస్సులో 'ఆధ్యాత్మిక పత్రికా రచన ప్రాముఖ్యం' అనే అంశంపై గోష్ఠి జరిగింది. ఈ సదస్సులో చెన్నై రామకృష్ణ మఠాధ్యక్షులు స్వామి గౌతమానందజీ, కోయంబత్తూర్ రామకృష్ణ మిషన్ విద్యాలయ కార్యదర్శి స్వామి ఆత్మారామానందజీ, కడప రామకృష్ణ మిషన్ కార్యదర్శి స్వామి ఆత్మవిదానందజీ, నాగపూర్ రామకృష్ణ మఠాధ్యక్షులు స్వామి బ్రహ్మస్థానందజీ, ప్రముఖ అర్థశాస్త్రవేత్త శ్రీ ఎన్. గురుమూర్తి, ప్రముఖ మానవీయ శాస్త్రవేత్త డా॥ ఎన్.ఎస్. రాజారామ్, ప్రముఖ రచయిత - ప్రయోక్త శ్రీ రాజీవ్ మెహ్రోత్రా, ఇతర ప్రముఖ పాత్రికేయులు, పుర ప్రముఖులు పాల్గొని ప్రసంగించారు. ఈ సదస్సులో సుమారు 400 మంది భక్తులు పాల్గొన్నారు. మైసూర్ రామకృష్ణ ఆశ్రమం అధ్యక్షులు స్వామి నిత్యస్థానందజీ వందన సమర్పణతో 'వివేక ప్రభ' దశమానోత్సవాలు విజయవంతంగా ముగిశాయి.




❖ నివేదిక: స్వామి వీరేశానంద

## భక్తులకు మంత్రోపదేశం



రామకృష్ణ మఠం, రామకృష్ణ మిషన్‌ల ఉపాధ్యక్షులు **పూజ్య స్వామి స్మరణానందజీ మహరాజ్** 2009 సెప్టెంబరు 9 నుంచి సెప్టెంబరు 23వ తేదీ వరకు హైదరాబాద్ రామకృష్ణ మఠంలో బస చేస్తారు. ఆసక్తిగల భక్తులకు **సెప్టెంబరు 13,16,18,20**వ తేదీల్లో పూజ్య స్వామీజీ మంత్రదీక్ష ప్రసాదిస్తారు. మరిన్ని వివరాల కోసం: **స్వామి జ్ఞానదానంద, అధ్యక్షులు, రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029**ను సంప్రతించవలెను.

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) 'వేదచూడామణి' : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

(ఆ) 'వేదార్థచూడామణి' : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
వయస్సు : 15 సంII, ఆ పైన
స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) వేదాధ్యాపకుడు : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవము : 2 సంవత్సరములు
సంభావన : నెలకు రూII 8,000/- మొత్తము, సౌకర్యములతో

(ఆ) వేదభాష్యాచార్యుడు : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవార్హత : 5 సంII
సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

హైదరాబాద్ — కులప్రశాసకుడు



Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

# సుబోధ

స్త్రీలందరూ జగన్మాత అంశలే కాబట్టి వారిని తల్లుల లాగ భావించాలి. స్త్రీలు యోగ్యులైనా, అయోగ్యులైనా, పతివ్రతలైనా, కాకపోయినాసరే వారిని ఆనందమయి అయిన ఆ జగజ్జనని దివ్య స్వరూపాలుగా చూడాలి.

తంత్రశాస్త్రానుసారం మూడు విధాలైన సాధనలున్నాయి. జగజ్జనని పట్ల సాధకుడు వీరభావాన్ని కానీ, సఖీభావాన్ని కానీ, మాతృభావాన్ని కానీ అవలంబించవచ్చు. నాది మాతృభావ సాధన. సాధకుడు జగన్మాత సఖినని భావించడం కూడా మంచిదే కానీ, వీరభావం, లేక వీరాచారం అపాయంతో కూడుకొని ఉంది. జగన్మాతను మాతృమూర్తిగా భావించే మాతృభావమే నిష్కళంకమైనది.

నీకు దైవానుగ్రహం కావాలంటే పరాశక్తి అయిన జగన్మాతను సంతుష్టురాలిని చేసుకో. ఔను! ఆమె మహామాయ. సమస్త జగత్తునూ భ్రమింపచేసేది ఆమే. సృష్టి, స్థితి, లయ అనే మహాలీలను ఆమె సాగిస్తోంది. సర్వాన్నీ ఆమె అజ్ఞానంతో కప్పింది. ఆమె మోక్షద్వారాన్ని తెరవనిదే ఎవరూ ఆత్మసౌధంలోకి ప్రవేశించలేరు. బయట నుంచి మనం కేవలం బాహ్య విషయాలను చూస్తున్నాం. సచ్చిదానందమయుడి స్వరూపం సర్వదా మనకు అతీతమై, అగోచరమై ఉంది.

దివ్యశక్తి విద్య, అవిద్య అనే రెండురూపాలలో వెలుస్తోంది. కామినీ కాంచనాలచే అవిద్య జగత్తును భ్రమింపజేస్తూ సంసారబద్ధం కావిస్తోంది. విద్య- భక్తికీ, జ్ఞానానికీ, ప్రేమకీ, కారుణ్యానికీ నిలయమై మనల్ని పరమేశ్వరుని సన్నిధికి కొనిపోతుంది. ❖

('శ్రీరామకృష్ణ బోధామృతం' నుంచి)



**శ్రీరామకృష్ణ ప్రభ**

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029

ఫోన్: 040-2766 7799, 2763 3936

E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద

సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద



# సురభి

“ఆ సాయం సమయం మరచిపోలేనిది. మాతృదేవి ఒక బల్ల మీద కూర్చొని ఉన్నారు. నేను (స్వామి హరిప్రేమానంద) మాతృదేవి పాదాల మ్రోల కూర్చొని, పాదపద్మాలను ఒత్తుతున్నాను. ఆ పాదాలు ముడతలతో బాగా శుష్కించిపోయాయి. అమ్మ పాదాలను చూడగానే నా మనస్సులో, “మాతృదేవి నిజంగా జగన్మాతేనా? దేవి పాదాలు ఇంత కళావిహీనంగా, నరాలు కనబడేలా శుష్కించి ఉంటాయా?” అనే సందేహం కలిగింది. కానీ బయటకు వ్యక్తం చేయలేదు. పాదపద్మాలను ఒత్తుతూనే ఉన్నాను.

అప్పుడు మెల్లమెల్లగా దృశ్యంలో మార్పు వచ్చింది. ఆ పాదాలు ఒక వృద్ధురాలి శుష్కించిన పాదాలలా కాకుండా ఒక యువతి పాదాలలా గోచరించాయి. అందమైన పాదాలు, వాటిపై పారాణి, అర్ధచంద్రుల లాంటి గోళ్ళు – ఇవన్నీ ప్రక్కనే ఉన్న దీపం వెలుతురులో స్పష్టంగా కనబడ్డాయి. ఆ పాదాలకు బంగారు గొలుసులు, వజ్ర వైడూర్యాలు పొదిగిన నూపురం ప్రకాశించాయి. ఈ పాదాలెవరివి? నేను ఎవరి పాదాలను ఒత్తుతున్నానని దిగ్భ్రమ చెందాను.

కళ్ళను ఒకసారి నులుముకొని చూశాను. బంగారు కాంతులతో మెరిసిపోతూ జగద్ధాత్రీదేవి ఆసీనురాలై ఉంది. మూడు నేత్రాలు, ఆయుధాలు ధరించిన నాలుగు చేతులు, అనేక ఆభరణాలు, వజ్రవైడూర్యాలు పొదిగిన ఆ కిరీటం నుంచి ఉత్పన్నమైన ప్రకాశం నాలుగు దిశలనూ నింపివేస్తూ ఉంది. నేను భావోద్వేగంతో, ‘అమ్మా’, అమ్మా’ అంటూనే బాహ్యస్మృతిని కోల్పోయాను.

ఎంతసేపు ఆ స్థితిలో ఉన్నానో నాకు తెలియదు. మళ్ళీ బాహ్యస్మృతి కలిగేటప్పటికి మాతృదేవి నా వీపు నిమురుతూ, ‘హరీ, ఓ హరీ! నీకేమైంది? లే, లే’ అంటున్నారు. అప్పుడు నాకు బాహ్యస్మృతి కలిగింది. ❖

(స్వామి హరిప్రేమానంద స్మృతుల నుంచి)

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 66 సంచిక: 9 సెప్టెంబర్ 2009



**సర్వస్య బుద్ధిరూపేణ జనస్య హృది సంస్థితే ।**
**స్వర్గాపవర్గదే దేవి నారాయణి నమోఽస్తుతే ॥**

సర్వజనుల హృదయాలయందు బుద్ధిరూపంలో ఉన్న ఓ దేవీ! స్వర్గసుఖాల్నీ, మోక్షాన్నీ ప్రసాదించే ఓ నారాయణీ! నీకు ప్రణామములు.

*(దేవీ మాహాత్మ్యం 11-8)*

## లోపలి పేజీల్లో...

# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి







ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు......** రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు............** రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు.................** రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాత పేరు చిరునామా | రూ. |
|---|---|---|
| మహారాజ పోషకులు | : శ్రీ పరమహంస పరివ్రాజక ఈశ్వరానంద భారతి స్వామి (శిష్యురాలు ఓ.కృష్ణవేణి), హైదరాబాద్ | 10,000 |
| " " | : శ్రీమతి ఎమ్. లీలావతి, నాగర్‌కర్నూల్, మహబూబ్‌నగర్ జిల్లా (కీ॥శే॥ అనంత లక్ష్మమ్మ జ్ఞాపకార్థం) | 10,000 |
| రాజ పోషకులు | : శ్రీ సి. గిరిరాజ్ కృష్ణ, C/o వి.ఐ.హెచ్.ఇ., రామకృష్ణ మఠం, హైదరాబాద్ (కీ॥శే॥ సి.జి. శ్రీనివాస్ జ్ఞాపకార్థం) | 5,000 |
| పోషకులు | : శ్రీమతి నామాల శ్యామల, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్ (కీ॥శే॥ కాంద్రేగుల విఘ్నేశ్వరరావు జ్ఞాపకార్థం) | 2,200 |
| " " | : శ్రీ కె. గురప్ప, టెలికామ్ నగర్, బి-క్యాంప్ (పి.ఓ.), కర్నూలు - 518 002 | 1,050 |
| " " | : నందిగాం లక్ష్మీనరసింహారావు, గాంధీనగర్, హైదరాబాద్ (కీ॥శే॥ నందిగాం సీతారామయ్య జ్ఞాపకార్థం) | 1,000 |
| " " | : ఒక శ్రేయోభిలాషి, కళ్యాణ్‌దుర్గం, అనంతపురం (కీ॥శే॥ కాసుల వీరభద్రప్ప జ్ఞాపకార్థం) | 1,000 |



**ముఖచిత్రం :** దారిద్ర్యాన్ని పటాపంచలు చేసే బంగారు తల్లి శ్రీదేవీ, ముగ్గురమ్మలకూ మూలమైన దుర్గాదేవీ, వికాస ప్రకాశాలకు ప్రతీకైన స్వచ్ఛ ధవళ సుందర మూర్తి సరస్వతీదేవీ.

## ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |

| చందా వివరాలు | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|
| విడి ప్రతి : | రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా : | రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు : | రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు : | రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు : | రూ. 1500 | $ 365 |

**గమనిక :** డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో **Ramakrishna Math, Hyderabad** అని వ్రాయాలి.
**పంపవలసిన చిరునామా : Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.**

## లోపలి పేజీల్లో...



## దసరా శుభాకాంక్షలు

'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు, రచయితలకు, రచయిత్రులకు, ఏజెంట్లకు, ప్రకటనకర్తలకు, దాతలకు మా హృదయపూర్వక దసరా శుభాకాంక్షలు. -సంపాదకులు

## శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

- సర్క్యులేషన్ మేనేజర్

ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.
- సంపాదకులు


**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com

# ఆధ్యాత్మిక యాత్రకు అనువైన బాట

'ఎన్నో ఏళ్ళుగా జపధ్యాన సాధనలు చేస్తున్నాం. కానీ ఇంత వరకూ భగవద్దర్శనం లభించలేదు' అని సందేహం వ్యక్తపరుస్తూ ఉంటాం.

మనందరికీ వచ్చే సందేహమే కేశవచంద్రసేన్‌కు కూడా వచ్చింది. ఒకసారి కేశవచంద్రసేన్, "నేను భగవంతుణ్ణి ఎందుకు దర్శించలేక పోతున్నాను" అని శ్రీరామకృష్ణుల్ని ప్రశ్నించాడు. "నువ్వు సిరిసంపదలతోనూ, పేరు ప్రతిష్ఠలతోనూ సంతృప్తిగా ఉన్నంతవరకూ భగవంతుణ్ణి దర్శించలేవు. పిల్లవాడు బొమ్మలతో ఆనందంగా ఆడుకొంటున్నంతసేపూ తల్లి, పిల్లవాణ్ణి గురించి పట్టించుకోదు. ఎప్పుడైతే పసివాడు బొమ్మలాటతో విసిగిపోయి, అమ్మ కోసం విలపిస్తాడో అప్పుడు మాత్రమే తల్లి పరుగున వచ్చి పిల్లవాణ్ణి అక్కున చేర్చుకుంటుంది"అని శ్రీరామకృష్ణులు సమాధానమిచ్చారు.

భగవంతుడు తల్లి లాంటివాడు. మనం మనఃస్ఫూర్తిగా ఏం కావాలనుకుంటున్నామో, భగవంతుడు అదే మనకు ప్రసాదిస్తాడు. పిల్లవాడు తనకు 'ఆటబొమ్మలు' కావాలని తల్లిని అడిగితే, ఆటబొమ్మల్నే ఇస్తుంది. 'అమ్మే' కావాలని ఆరాటపడితే, అమ్మే స్వయంగా వస్తుంది. మనం కూడా భగవంతుణ్ణి ప్రాపంచిక విషయవస్తువులనే ఆటబొమ్మలను కోరితే, వాటినే ప్రసాదిస్తాడు. 'నువ్వు' తప్ప వేరేమీ అక్కరలేదు అని ప్రార్థిస్తే, ఆయనే దర్శనమిస్తాడు.

**ఆవేదనే అసలైన అర్హత:** భగవంతుణ్ణి దర్శించడానికి ముఖ్యంగా కావలసిన అర్హత 'ఆవేదన'. ఆవేదన ఉంటే ఆయనను దర్శించడం అసంభవమేమీ కాదు. అందుకు నిదర్శనం శ్రీరామకృష్ణుల జీవితం.

జగజ్జనని కాళీమాత దర్శనం కోసం శ్రీరామకృష్ణులు ఏ సాధనలు చేశారు? ఆయన చేసిన సాధనంతా ఒకే ఒక్కటి – 'ఆక్రందన'. నాకు అమ్మ తప్ప వేరేదీ వద్దని అమ్మ కోసం విలపించారు. ఆవేదనతో కూడిన ఆక్రందన వల్లనే అమ్మను దర్శించగలిగారు ఆయన. కాబట్టి 'తల్లి కోసం తల్లడిల్లే పసిహృదయం' ఉంటే భగవంతుణ్ణి దర్శించడం సాధ్యమని శ్రీరామకృష్ణులు అనుభవపూర్వకంగా నిరూపించారు.

**సర్వావస్థల్లోనూ ఆ సర్వేశ్వరే ఆధారం:** కష్టసుఖాల్లోనూ, నిందాస్తుతుల్లోనూ సమచిత్తం కలిగి ఉండాలంటే భగవంతుని పట్ల సంపూర్ణ శరణాగతి భావం ఉంటేనే అది సాధ్యమవుతుంది.

అవమానం కలిగినా, అభిమానం పొందినా – ఈ రెండు సందర్భాల్లోనూ శ్రీరామకృష్ణులు ఎలా స్పందించారో తెలుసుకుందాం:

శ్రీరామకృష్ణులకు నరేంద్రుడంటే (స్వామి వివేకానంద) ఎంతో ప్రేమ. నరేంద్రుణ్ణి ఒక్కరోజైనా చూడకుండా ఉండలేక పోయేవారు ఆయన. ఒక వారం రోజుల పాటు నరేంద్రుడు, శ్రీరామకృష్ణులను దర్శించడానికి వెళ్ళలేదు. అప్పుడు ఆయనే స్వయంగా నరేంద్రుణ్ణి చూడడానికి వెళ్ళారు. తనపై శ్రీరామకృష్ణులకు ఉన్న మమకారాన్ని చూసి నరేంద్రుడు అందరి ముందూ పరుషంగా, 'జడభరతుడు సదా లేడిపిల్ల గురించే చింతిస్తూ ఉండడం వల్ల మరుసటి జన్మలో లేడిగా



జన్మించాడు. మీరు కూడా నిరంతరం నా గురించే చింతిస్తే మీరు ఏమవుతారో ఆలోచించండి' అని శ్రీరామకృష్ణులను నిందించాడు.

చిన్నపిల్లల్ని ఎవరైనా మందలిస్తే ఏడుస్తూ తల్లి దగ్గరకు వెళతారు. అలాగే శ్రీరామకృష్ణులు కూడా కాళీమాత ఆలయానికి వెళ్ళి, జరిగిన విషయాన్ని జగజ్జననితో విన్నవించుకున్నారు. అప్పుడు జగన్మాత, 'నువ్వు నరేంద్రునిలో ఆ నారాయణుణ్ణి దర్శిస్తున్నావు. కాబట్టే అతడంటే నీకు అంత ప్రేమ. నువ్వు ఎప్పుడైతే నరేంద్రునిలో నారాయణుణ్ణి దర్శించలేవో అప్పుడు అతని ముఖం ఒక్క క్షణం కూడా చూడలేవు' అని శ్రీరామకృష్ణులను ఓదార్చింది.

అద్వైత సాధనలో ఆరితేరిన బ్రహ్మజ్ఞాని తోతాపురి (శ్రీరామకృష్ణుల వేదాంతాచార్యుడు) దక్షిణేశ్వరానికి వచ్చాడు. అతడు శ్రీరామకృష్ణుణ్ణి చూసిన వెంటనే 'ఇతడే అద్వైత సాధనకు

సరైన యోగ్యుడు' అని భావించాడు. వెంటనే తోతాపురి శ్రీరామకృష్ణుల దగ్గరకు వెళ్ళి 'నువ్వు వేదాంత సాధనలను అభ్యసిస్తావా?' అని అడిగాడు. అప్పుడు శ్రీరామకృష్ణులు 'ఏం చేయాలో, ఏం చేయరాదో నాకేమీ తెలియదు. అంతా మా అమ్మకే తెలుసు. కాబట్టి నేను ఇప్పుడే అమ్మను అడిగి వస్తాను' అని ఆయనతో చెప్పి, కాళికాలయానికి వెళ్ళారు. కొద్దిసేపటిలో తిరిగి వచ్చి, 'వేదాంత సాధనలను అభ్యసించడానికి అమ్మ నాకు అనుమతి ఇచ్చింది' అని తోతాపురితో అన్నారు.

అందరి ఎదుటా నరేంద్రుడు అవమానించినప్పుడు శ్రీరామకృష్ణులు బాధపడలేదు. తోతాపురి 'నీకు అద్వైత సాధనల్ని నేర్పుతాను' అని అభిమానంగా అన్నప్పుడు ఆనందించలేదు. శ్రీరామకృష్ణుల్ని ఎవరు అవమానించినా, అభినందించినా సర్వకాల సర్వావస్థల్లోనూ సర్వేశ్వరిపైనే సంపూర్ణంగా ఆధారపడ్డారు. మనం కూడా ఆ జగన్మాతను శరణు వేడితే మానావమానాలకు అతీతులం కాగలం.



**అమ్మను అంగీకరించిన అద్వైతవాది:** నిర్వికల్ప సమాధి స్థితులను అనుభవించిన తోతాపురి, అమ్మ ప్రేమలోని మాధుర్యాన్ని ఆస్వాదించలేదు. శ్రీరామకృష్ణులు సాధారణ సాధకునిలా చేతులు చరుస్తూ అమ్మ నామస్మరణ చేయడం చూసిన తోతాపురి 'నిర్వికల్ప అనుభూతులను పొందిన తరువాత కూడా చేతులు చరుస్తూ చపాతీలు చేస్తున్నావు' అని శ్రీరామకృష్ణులను పరిహసించాడు. అందుకు శ్రీరామకృష్ణులు 'బ్రహ్మం- బ్రహ్మశక్తి అభేదం. అమ్మ అనుగ్రహంతో మీకు ఇది అవగతం కాగలదు' అని బదులిచ్చారు. తర్వాత తోతాపురి అమ్మ శక్తిని ఎలా అంగీకరించాడో తెలిపే ఓ సంఘటన:

ఒకసారి తోతాపురి రక్తగ్రహణి వ్యాధికి గురయ్యాడు. అందువల్ల అతడు తీవ్రమైన కడుపునొప్పితో బాధపడసాగాడు. ఎన్ని మందులు వాడినా ప్రయోజనం లేకపోయింది. సదా ఆత్మానుభూతిలో మునిగి ఉండే తోతాపురికి ఇప్పుడు దేహ ధ్యాస మొదలైంది. కడుపునొప్పి మరింత అధికమవడంతో, బాధను భరించడం కన్నా దేహత్యాగం చేయడం ఉత్తమమని తలచి, అర్ధరాత్రి వేళ గంగానది వైపు బయలుదేరాడు. అయితే, గంగానదిలోకి ఎంత దూరం వెళ్ళినా నీళ్ళు మోకాళ్ళ లోతు మించలేదు. ఈ విపరీత పరిణామానికి తోతాపురి దిగ్భ్రాంతి చెందాడు. అప్పుడు అతనికి ఓ దివ్య దర్శనంలో నేల మీదా, నీటి మీదా, ఆకాశంలోనూ సర్వత్రా జగజ్జననియే కనిపించింది. జగన్మాత అవ్యక్త విశ్వరూప దర్శనాన్ని కాంచిన తోతాపురి 'అమ్మా! అమ్మా!' అని విలపిస్తూ, 'అమ్మా! బ్రహ్మం - బ్రహ్మశక్తి అభేదం. సర్వం నీ మాయాధీనమే అని గ్రహించాను' అని అమ్మ చరణాల వద్ద ప్రణమిల్లాడు. ***'సైషా ప్రసన్నా వరదా నృణాం భవతి ముక్తయే'*** (దేవీ మాహాత్మ్యం *1-56*) - 'అమ్మ కృపతోనే ముక్తి సాధ్యం'అని తోతాపురి గ్రహించాడు.

**'మాతృభావం'లోని మాధుర్యం:** భగవంతుణ్ణి చేరుకోవడానికి భక్తితత్త్వం ఐదు భావాలను సూచిస్తుంది. అవి: శాంత భావం (మాతృభావం), దాస్య భావం, సఖ్య భావం, వాత్సల్య భావం, మధుర భావం.

అమ్మ ఒడిలో ప్రశాంతంగా సేద తీరే పసివాడికి ఏది అవసరమో దాన్ని తల్లి సమకూరుస్తుంది. తల్లి ఆలనాపాలనలో సురక్షితంగా జీవితాన్ని సాగించే పసివాని స్థితికి చేరుకోవాలంటే భగవంతుణ్ణి 'మాతృభావం'తో ఆరాధించాలి. ఆ మాతృభావం తోనే శ్రీరామకృష్ణులు జగన్మాతను దర్శించారు. నిరంతరం అమ్మ సన్నిధిలో చరిస్తూ అన్ని భక్తి సాధనలూ, తాంత్రిక సాధనలూ, వేదాంత సాధనలూ, ఇతర మత సాధనలూ అభ్యసించి పరిపూర్ణులయ్యారు. ఒక్క జీవిత కాలంలో అన్ని మత సాధనలను అభ్యసించి సఫలీకృతులు కావడం కేవలం శ్రీరామకృష్ణులకే సాధ్యమైంది.

సర్వధర్మాలనూ అనుష్ఠించిన శ్రీరామకృష్ణులు, 'ఇదంతా అమ్మ అనుగ్రహం వల్లే సాధ్యమైంది' అని మాతృ భావంలోని విశిష్టతను చాటిచెప్పారు.

ఆధునిక ప్రపంచంలో ఎదురయ్యే ఆకర్షణలను అధిగమించి గమ్యాన్ని చేరుకోవాలంటే దృఢ సంకల్పం, ఏకనిష్ఠ, పురుషప్రయత్నం అవసరం. ఇవన్నీ ఉన్నా గమ్యం చేరేవరకూ అంతా అగమ్యగోచరంగానే ఉంటుంది. కాబట్టి శ్రీరామకృష్ణుల లాగ అమ్మ ఒడిలో ఓలలాడే భాగ్యాన్ని సంపాదించుకుంటే ఏ ఆకర్షణలూ మనల్ని దారి మళ్ళించలేవు. అందువల్ల శ్రీరామకృష్ణులు చూపిన 'మాతృభావం' అనే బాటలో మన ఆధ్యాత్మిక యాత్రను కొనసాగిద్దాం, జగన్మాత చరణాలను చేరుకొందాం. ❖

# కార్య సాఫల్యత

- స్వామి సుప్రియానంద

పని చేయకుండా ఒక్క క్షణమైనా మనం జీవించలేం! "న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠ త్య కర్మకృత్..." (భగవద్గీత 3-5) ఒకోసారి విసుగుపుడుతుంది. అంతా అగమ్య గోచరంగా ఉంటుంది. పని 'సుడిగుండం' నుండి బయట పడాలనుకుంటాం. ప్రశాంతతను కోరుకుంటాం. కానీ అది ఎలా సాధ్యం?

"కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన..." (భ.గీ. 2-47) పనిచేయడానికి మాత్రమే కాని దాని ఫలానికి నువ్వు



అధికారివి కావు. మొదట్లో ఇది "నిరంకుశత్వం" గా అనిపించినా, దీనిలో 'ప్రశాంతత' కు దారిచూపే సూత్రం దాగి ఉంది.

మన ప్రమేయం లేకుండా జరిగే పనులు (గుండె కొట్టుకోవడం లాంటివి) కాకుండా మనం చేతనావస్థలో చేసే పనుల గురించే ఈ విశ్లేషణ. ఒక పనిని మన మనః స్థితిని అనుసరించి 1. కర్తవ్యం(Duty) 2. బాధ్యత (Responsibility) 3. ధర్మం (Righteousness) అనే మూడు స్థాయిలలో నిర్వర్తిస్తాం. ఇప్పుడు వీటిని విపులంగా పరిశీలిద్దాం.

**1. కర్తవ్యం (Duty) :** "ప్రతి వ్యక్తీ ఎలా కర్మచేస్తున్నాడో చూస్తున్నారు కదా! ఎవరికీ పూర్తి విరామం లేదు; నూటికి తొంభైతొమ్మిది మంది బానిసలలా పనులు చేస్తుంటారు. దుఃఖమే దానికి ఫలితం" అంటారు స్వామి వివేకానంద. ఆయనే కర్తవ్యాన్ని "మధ్యాహ్నపు మండుటెండ (Duty is midday's scorching sun) అని" వర్ణిస్తారు. దీనికి కారణం - కర్తవ్య నిర్వహణ అహంకార మిళితం. అందుకే ఈ పని 'ఇలా ఉంది' 'అలా ఉంది' అని గొణుక్కుంటూ చేస్తాం. ఒత్తిడికి గురి అవుతాం.

**2. బాధ్యత (Responsibility):** ఒక పని 'కర్తవ్య' స్థాయి నుండి 'బాధ్యత' స్థాయికి ఎదిగినప్పుడు దానిని మనం చక్కగా నిర్వహించగలుగుతాం. 'బడికి వెళ్ళడం తన కర్తవ్యంగా భావించిన విద్యార్థి 'చదువుకోవడం' తన బాధ్యతగా గుర్తిస్తే అతను మంచి విద్యార్థిగా మారే అవకాశం ఉంటుంది. కానీ ఒక పనిని బాధ్యతతో చేసినప్పుడు ఆ పని మీద మనకు 'మమకారం' పెరుగుతుంది. ఈ 'మమకారం' మనం చేసే ప్రతీ పని నుండి 'ప్రతిఫలం' కోరుకుంటుంది. దీని నుండి పుట్టిన 'ఫలాపేక్ష' ఓటమిని ఓర్చుకోలేదు. అప్పుడు మనస్సు నిరంతరం ఒత్తిడి, స్పర్ధ, సంఘర్షణలకు లోనవుతుంది.

**3. ధర్మం (Righteousness) :** మనల్ని అహంకార, మమకారాల బారినుండి రక్షించేదే నిస్సంగత్వం. ఇది సత్సంగత్వం వలన లభిస్తుంది. అంటే ధర్మంతో సాంగత్యం - ధర్మనిరతి కలిగి ఉండటం. అందుకే మన పెద్దలు "ధర్మో రక్షతి రక్షితః" (ధర్మాన్ని మనం ఆచరిస్తే అది మనల్ని రక్షిస్తుంది) అన్నారు.

మనం చేసే పనిలో ధర్మాన్ని పాటించినప్పుడు ఆ పని మనల్ని స్వతంత్రులను (ముక్తుల్ని) చేస్తుంది. అప్పుడు మనం స్వామి వివేకానంద చెప్పినట్లు బానిసలలాగ కాక యజమానులుగా పనిచేయగలుగుతాం. అదే 'పని సాఫల్యత' 'కర్మయోగం'.

యంత్రాలు, పరికరాలు కూడా పనిచేస్తాయి. కాని వాటికి 'ధర్మాధర్మాలు' తెలియవు. ఈ సందర్భంలో 'ధర్మనిష్ఠ'తో చేసే పని ఏదీ హేయమైనది కాదు, పైపెచ్చు అది ఒక "యోగాభ్యాసం" అని తెలియజెప్పే మహాభారతంలోని "వ్యాధగీత"ను (యోగి పుంగవుడికి కసాయివాడి ప్రవచనం) ఒక్కసారి జ్ఞాపకం తెచ్చుకుందాం. ❖



# పరమపద ప్రాప్తికి భగవన్నామ జపం

– స్వామి జ్ఞానదానంద



మన పూజామందిరాల్లో ఉదయం, సాయంత్రం కూర్చొని, జపమాల పుచ్చుకొని మంత్రాన్ని జపిస్తూ ఉంటాం. కానీ దాని రుచిని ఆస్వాదించలేక పోతున్నాం. పతంజలి మహర్షి ఇలా వచించారు: "భక్తివిశ్వాసాలతో సుదీర్ఘ కాలం అభ్యాసం చేయగలిగితే భగవత్ చైతన్యంలో సుప్రతిష్ఠులం కావచ్చు". మనోనిగ్రహం ఒక్క రోజులో సాధ్యం కాదు. చిరకాలం నిరంతర సాధన చేసినప్పుడే అది సిద్ధిస్తుంది. జపం ద్వారా అంతరంగ ఆధ్యాత్మిక జగత్తులోకి ప్రవేశించడానికి ఎంతో సహనం అవసరం.

ఒక మధ్యాహ్న వేళ ఒక వ్యక్తి చలనచిత్రం ప్రారంభమైన పదిహేను నిమిషాల తరువాత థియేటర్‌లోకి వెళ్ళాడనుకోండి. అత్యవసర నిష్క్రమణను సూచించే ఎర్రని ప్రతీక, తెర మీద కనిపించే వెలుగు తప్ప చుట్టూ అతడికి చీకటే కనిపిస్తుంది. లోపలికి వచ్చిన కాసేపటికి మెల్లగా కుర్చీల వరుసలు కనిపిస్తాయి. తన కుర్చీ ఎక్కడుందో చూడగలుగుతాడు. అదే విధంగా జపధ్యానాల వెలుగు వల్ల హృదయాంధకారం తొలగిపోతుంది. తరువాత ఆనందం కలుగుతుంది. తులసీదాస్ "గడప వద్ద ఉంచిన దీపం గది లోపలా, బయటా వెలుగును ప్రసరింపజేస్తుంది. అలాగే భగవన్నామ జపం మన బాహ్యాంతరాలను ప్రకాశవంతం చేస్తుంది" అంటారు.

తీవ్రత కొరవడిన ఆధ్యాత్మిక సాధనలు ఉప్పు లేని కూరల లాంటివి. పశుగ్రాసం, తెలకపిండిల మిశ్రమాన్ని ఆవులు ఎలా ఇష్టపడతాయో, అలా భక్తితో భగవన్నామాన్ని జపించగలిగితే జనులకు ఆధ్యాత్మిక జీవితం పట్ల ఇష్టం ఏర్పడుతుంది. వ్యాసమహర్షి ఇలా వచించారు: "జీర్ణక్రియకు తోడ్పడే పైత్యరస స్రావంలో అస్తవ్యస్తత ఏర్పడినప్పుడు చక్కెర రుచించదు. కానీ ప్రతి రోజూ అక్కరతో చక్కెర తింటూ ఉంటే క్రమంగా చక్కెర రుచిని అనుభవించవచ్చు, ఆ రుగ్మత అంతరించిపోతుంది. అదే విధంగా అజ్ఞానంలో ఉన్నవారికి భగవన్నామం రుచించదు. కానీ సక్రమంగా ఆధ్యాత్మిక సాధనలు అనుష్ఠిస్తూ వస్తే, అజ్ఞానం అదృశ్యమై పోయి భగవన్నామం పట్ల రుచి ఏర్పడుతుంది."

కొన్ని సమయాల్లో ఇన్‌ఫ్లుయెంజా జ్వరం ఒక వ్యక్తి రుచిని హరించివేస్తుంది; కానీ ఆహారంలో కాస్త ఊరగాయను జోడిస్తే రుచి కాస్త మెరుగవుతుంది. ఆ ఊరగాయ భక్తి. ఒక త్రాగుబోతు మద్యం గురించి వినడానికి ఇష్టపడతాడు. ఒక మద్యం సీసాను చూసినప్పుడు అతడి మనస్సు ఆనందంతో నృత్యం చేస్తుంది. ఆ సీసా మూత తీసినప్పుడు అతడికి మత్తు ప్రారంభమవుతుంది. మహదానందంతో సీసా మొత్తం త్రాగేస్తాడు. చివరికి అతడు ప్రపంచాన్ని మరచిపోయి దారి ప్రక్కన స్పృహతప్పి నేల మీద పడిపోతాడు. నిజానికి అలాంటి ఉల్లాస భరితమైన మత్తు భగవన్నామ జపం వలన కలుగుతుంది. శ్రీరామకృష్ణులు ఇలా చెప్పేవారు: "గంజాయి అనే మాటను పలుమార్లు ఉచ్చరించినంత మాత్రాన మత్తు కలుగుతుందా? గంజాయి ఆకు తెచ్చి, దాన్ని నూరి నీళ్ళలో కలిపి త్రాగాలి. మీరు గృహస్థ జీవితం గడుపుతున్నారు కనుక మీ మనస్సును భగవచ్చింతనతో ఉన్మత్తం గావించుకోండి. మీరు మీ కర్తవ్యాలు నిర్వహిస్తూ ఉండండి, కానీ ఆహ్లాదకరమైన ఉన్మత్తతను అలాగే నిలుపుకోండి."

రూపగోస్వామి 'విదగ్ధమాధవ్' గ్రంథంలో ఇలా వివరించారు: "రెండు అక్షరాల 'కృష్ణ' అనే పదంలో ఎంత అమృతం ఉందో నాకు తెలియదు. ఒక్క నోటితో ఆయన నామాన్ని జపించడంతో నాకు తృప్తి లేదు. నాకు లక్ష నోళ్ళు ఉండాలని కోరుతున్నాను. ఆయన నామాన్ని ఆలకించడానికి నాకు లక్ష చెవులు ఉండాలి. ఈ నామం నా మనస్సులో కంపించినప్పుడు నా ఇంద్రియాలన్నీ వివశమయ్యాయి."

భక్తి విశ్వాసాలతో భగవన్నామాన్ని నిరంతరం జపించడం ద్వారా పరమపదాన్ని చేరుకోవచ్చు. ❖

# మహాపురుషుల్లోని మహోన్నత లక్షణం !

– స్వామి వీరేశ్వరానంద*

స్వామి వివేకానంద పట్ల స్వామి అఖండానందజీ (గంగాధర్ మహరాజ్) అత్యంత భక్తి శ్రద్ధలు కలిగి ఉండేవారు. నేను (స్వామి వీరేశ్వరానంద) 'అద్వైత ఆశ్రమం'లో ఉండేవాణ్ణి.

ఒకసారి గంగాధర్ మహరాజ్ కలకత్తా వచ్చి, 'పుటియారాణి' ఇంట్లో బస చేసారు. ఒక భక్తుడు అద్వైత ఆశ్రమ సాధువుల కోసం రసగుల్లాలు తెప్పించారు. మా భోజనాలు పూర్తవక ముందే 'ఉద్బోధన్' కార్యాలయం నుంచి ఒక సన్న్యాసి అక్కడకు వచ్చారు. అతనికి కూడా మిఠాయిలు ఇవ్వడం జరిగింది. తరువాత అతను గంగాధర్ మహరాజ్ దగ్గరకు వెళ్ళి, "మహరాజ్! ఈ రోజు అద్వైత ఆశ్రమంలో చాలా పెద్ద 'భండారా' (విందు భోజనం) అయింది. వారు మిమ్మల్ని విందు భోజనానికి ఆహ్వానించలేదా? అని అడిగాడు. గంగాధర్ మహరాజ్ చిన్న పిల్లవాడిలాగ "అలాగా! నేను ఇక్కడే ఉన్నాను, మరి ప్రభు (వీరేశ్వరానంద) నాకు ఆహ్వానం పంపించలేదే!" అన్నారు.



కొన్ని రోజుల తరువాత నేను గంగాధర్ మహరాజ్‌ను కలవడానికి వెళ్ళాను. ప్రణామం చేసిన తరువాత వారి చరణాల దగ్గర కూర్చున్నాను. కానీ గంగాధర్ మహరాజ్ ఏమీ మాట్లాడకుండా మౌనంగా కూర్చున్నారు.

కొన్ని క్షణాల తరువాత గంభీర స్వరంతో "నేను నీతో కొంచెం మాట్లాడాలి" అన్నారు. దానికి, "నేను కూడా మీతో కొంచెం చెప్పాలి" అని జవాబిచ్చాను. "నువ్వు ఏం చెప్పాలనుకుంటున్నావు?" అని గంగాధర్ మహరాజ్ అడిగారు. అందుకు నేను, "ముందు మీరు ఏమి చెప్పాలనుకుంటున్నారో చెప్పేయండి. మీ తరువాత నేను చెప్పవలసింది చెబుతాను" అన్నాను. అది విని ఆయన చిన్నపిల్లాడిలాగా, "అయితే న్యాయాధికారిని నిర్ణయించు" అన్నారు. "మీరే న్యాయాధికారి" అని నేను అన్నాను.

*గంగాధర్ మహరాజ్ :* స్వయంగా దావా వేసిన నేనే న్యాయాధికారిని ఎలా అవుతాను?

*నేను:* మీ మీద నాకు నమ్మకం ఉంది.

అలాగైతే సరే అని "అద్వైత ఆశ్రమంలో అంత పెద్ద భండారా జరుపుకున్నారు. నేను ఇక్కడే ఉన్నాను. మరి నువ్వు నన్ను విందుకు ఆహ్వానించలేదు ఎందుకు" అని గంగాధర్ మహరాజ్ అడిగారు.

అప్పుడు నేను అలాంటిదేదీ లేదంటూ, జరిగినదంతా వారికి వివరంగా చెప్పి, చివరిగా ఇలా అన్నాను: "ఈ సన్న్యాసి నాకు వ్యతిరేకంగా చెప్పినదానిలో సత్యాసత్యాలు తెలుసుకోకుండా మీరు నా మీద నేరం ఆరోపించారు. 'ఒక వేళ ఎవరైనా ఏదైనా తప్పు చేసినట్లయితే వారిని పిలిచి అడగాలి. మిగిలిన వారితో కొంచెం కూడా చర్చించకూడదు' అని స్వామి వివేకానంద చెప్పేవారు. అయితే మీరు స్వామీజీ సూచనను ఉల్లఘించడం సబబు కాదు కదా!"

నేను ఈ విధంగా చెప్పిన వెంటనే "నువ్వు చెప్పింది నిజమే ప్రభు. నిజానిజాలు తెలుసుకోకుండా నీపై నేరారోపణలు చేశాను. తప్పంతా నాదే!"అని ఎంతో వినయంగా తన తప్పును అంగీకరించారు గంగాధర్ మహరాజ్.

ఈ సంఘటనలో రెండు విషయాల్ని మనం గమనించవచ్చు. ఒకటి – స్వామీజీ మాటల మీద స్వామి అఖండానందజీకి ఉన్న గౌరవం. రెండోది– రామకృష్ణ సంఘానికి సర్వాధ్యక్షులై ఉండి కూడా నాలాంటి సామాన్య వ్యక్తి ముందు తన తప్పును ఒప్పుకోవడం.

సాధారణంగా మనకన్నా వయస్సులోగానీ, అధికారంలో గానీ చిన్నవారెవరైనా మన తప్పులను ఎత్తిచూపినప్పుడు మనం అంగీకరించడానికి ఎంతమాత్రం సుముఖత చూపం. అదే మహాపురుషులకూ, సామాన్యులకూ గల తేడా! ❖

( *రామకృష్ణ సంఘ పదవ సర్వాధ్యక్షులు స్వామి వీరేశ్వరానంద స్మృతుల నుంచి )

(సెప్టెంబర్ 18, శుక్రవారం – శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన స్వామి అఖండానంద జయంతి)

# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -27



# దివాన్‌జీ నేర్చుకున్న పాఠం

స్వామి జపానంద సూరత్‌లో ఉండగా ఆయన ఆరోగ్యం పాడైంది. అందుకని కొంచెం విచారంగా ఒక శివాలయంలో కూర్చొని ఉన్నారు. ఒక గౌడ బ్రాహ్మణుడు శివాలయంలో అర్చన చేసుకొని వచ్చి స్వామిని పలకరించి మాటలు మొదలుపెట్టాడు. ఇది వరకే పరిచయం ఉన్నవాడిలా ఆయన మాట్లాడుతూ ఉంటే ఎంతో ఆత్మీయుడిలా అనిపించాడు. చాలాసేపు మాట్లాడుకున్న తరువాత "మీ భోజనం విషయం ఏమిటి? ఎక్కడ తింటారు?" అని ఆయన అడిగాడు. "ఎక్కడ దొరికితే అక్కడ" అన్నారు స్వామి.

తన గ్రామమైన సచ్చీన్‌కి రమ్మనీ, ఆరోగ్యం బాగుపడేవరకూ తమతోనే ఉండమనీ ఆయన స్వామిని కోరాడు. "ఎన్ని రోజులు ఉండాలంటే అన్ని రోజులు మీరు అక్కడ ఉండవచ్చు. మీరు మాతోపాటే ఉంటే మాకు సత్సంగభాగ్యం కూడా లభ్యమవుతుంది. అక్కడ మా అక్క ఉంది. ఆమె ఎప్పుడూ జపధ్యానాలలోనే సమయాన్ని వినియోగిస్తుంది. నన్ను ఎన్నో ధర్మ సందేహాలు అడుగుతుంది. కానీ నాకు అంత పరిజ్ఞానం లేకపోవడం వల్ల ఆమె సందేహాల్ని తీర్చలేకపోతున్నాను. నాలుగు మంచి మాటలు నేర్చుకుందామన్నా, మనశ్శాంతి కోసం వెళ్దామన్నా మాకు దగ్గరలో ఏ ఆశ్రమమూ లేదు" అన్నాడు.

సన్న్యాసి (స్వామి జపానంద) అంగీకరించి వెంటనే గ్రామానికి బయల్దేరారు. స్వామి జపానంద తాలూకు కంబళి, కమండలం పట్టుకొని ఆ బ్రాహ్మణుడు ఆయనతో పాటే నడిచాడు. టికెట్లు కొనుక్కుని బండిలో కూర్చున్నాక మాటల్లో పడ్డారు. రైలు బండి సాయంత్రం సుమారు ఐదు గంటలకు సచ్చీన్ చేరింది.

ఆ బ్రాహ్మణుడి ఇంట్లోని వారు సాధువును చూసి చాలా ఆనందించారు. ఒక మంచి గదిలో ఆయనకు బస ఏర్పాటు చేశారు. ఆ ఇంట్లో అందరూ సాత్విక గుణాలు కలవారిలా కనిపించారు. ఆ ఇల్లే ఋషుల ఆశ్రమంలా అనిపించింది. సన్న్యాసి చాలా సంతోషించారు.

రాత్రి చాలా సమయం వరకూ ఆధ్యాత్మిక విషయాలు చర్చించుకున్నారు. బ్రాహ్మణుడు కూడా స్వామి గదిలోనే నిద్రపోయాడు. పడుకునే ముందర స్వామి "నాకు తెల్లవారుజామునే లేవడం అలవాటు. తాడు, బాల్చీ ఇక్కడపెడితే నేను లేచి బావి నుంచి నీళ్ళు తోడుకుంటాను. దాని కోసమని మీ అందరినీ నేను ఉదయమే లేపనక్కర లేదు" అన్నారు. బ్రాహ్మణుడు నవ్వి, "మీరు ఎన్ని గంటలకు లేస్తారు? మా అక్క రోజూ మూడున్నర, నాలుగు గంటలలోపే నిద్రలేస్తుంది. కాబట్టి ఆమె మీకు అన్నీ సమకూర్చి పెడుతుంది" అన్నాడు.

ఉదయం లేచేసరికి నీళ్ళు సిద్ధంగా ఉన్నాయి. స్నానాదికాలు కానిచ్చి సన్న్యాసి అలా బయట కొంచెం దూరం నడచి వద్దామని బయల్దేరారు. బాటకు రెండు వైపులా చాలా దూరం వరకూ తుమ్మచెట్లు ఉన్నాయి. తోవ అంతా పసుపు పచ్చటి తుమ్మ పువ్వులు, తుమ్మ ముళ్ళతో నిండి ఉంది. చెప్పులు లేకుండా నడవడం చాలా కష్టం. పక్క ఊరి నుండి వచ్చే కూరలు, పళ్ళు, పాలు అమ్మేవాళ్ళు, రోజు కూలీ పని చేసుకునే వాళ్ళందరూ వాళ్ళ పనుల మీద ముళ్ళబాట మీదే నడుస్తూ పోతున్నారు. జోళ్ళు కూడా లేకుండా నడుస్తుండడం



వల్ల వాళ్ళ కాళ్ళకు ముళ్ళు గుచ్చుకుంటున్నాయి. వాటిని తీసుకుంటూ నడుస్తూండడాన్ని చూసి సన్న్యాసికి చాలా బాధ కలిగింది.

సన్న్యాసికి కొంచెం దూరంలో ఒక ఖర్జూరం చెట్టు కనిపించింది. ఆ చెట్టు మట్ట ఒకటి కోసి తెచ్చి, దానితో చీపురులా చేసి సన్న్యాసి బాట మధ్య భాగంలో ఊడవడం మొదలుపెట్టారు. ఆ మార్గంలో వెళ్ళతున్న వాళ్ళంతా సన్న్యాసిని చూసి నవ్వుతున్నారు. అయినా సన్న్యాసి కష్టపడి ముళ్ళు పక్కకి నెడుతూ ఉన్నారు. రెండు పక్కలా కలిపి సుమారు రెండు వందల చెట్లు ఉన్నట్లున్నాయి. ఇంతలో ఒక

నడివయస్కుడైన వ్యక్తి అక్కడికి వచ్చి, “ఇదేమిటి మహరాజ్! ఏం చేస్తున్నారు మీరు?” అని అడిగాడు. “ఏమీ లేదు. ఈ ముళ్ళ బాటలో మనుష్యులు చాలా కష్టపడి నడుస్తున్నారు. అందుకని ముళ్ళను ఊడుస్తున్నాను” అని అన్నారు సన్న్యాసి. “చెట్లు కొట్టి వేస్తే కాని ఈ ముళ్ళబాధ తప్పదు” అన్నాడు ఆ వ్యక్తి.

“చెట్లు నాటిన వాళ్ళెవరో కావాలనే బాటకు రెండు వైపులా తుమ్మ చెట్లు నాటినట్లున్నారు. భారత దేశంలో చెప్పులు కొనుక్కోలేని బీదవాళ్ళు వేల మంది ఉన్నారని వాళ్ళకు తెలియదేమో! ఈ విషయం నవాబుగారి దృష్టికి తేవాలి. కనీసం రోజుకొకసారైనా ఈ బాట ఊడ్చి, శుభ్రం చేసే ఏర్పాటు జరిగితే వీరి కష్టం దూరం అవుతుంది” అన్నారు సన్న్యాసి.

“అవును. అదేం కష్టమైన పని కాదు. అలాంటి ఏర్పాటు చెయ్యవచ్చు. మహరాజ్! ఆ చీపురు నాకివ్వండి. నేను కూడా కొంచెం దూరం ఊడుస్తాను” అంటూ సన్న్యాసి చేతిలో నుంచి చీపురు తీసుకుని ఆ వ్యక్తి కూడా కొంత మేర శుభ్రం చేశాడు. ఇదంతా అందరూ వింతగా చూస్తూ పక్క నుంచి వెళ్ళిపోయారు. కానీ ఇప్పుడు ఎవరూ నవ్వలేదు. అప్పుడు సన్న్యాసికి అతను ఊరిలో పేరు ప్రతిష్ఠలున్న వ్యక్తి అని అర్థమయింది.

సన్న్యాసి గౌడ బ్రాహ్మణుని ఇంట్లో బస చేస్తున్నారని తెలిసి, ఆ వ్యక్తి “మహరాజ్! గౌడ చాలా మంచి మనిషి. ధర్మపరాయణుడు. మీరు మా ఇంటికి కూడా విచ్చేయండి. ఇక్కడ నుంచి ఐదు నిమిషాలు నడక అంతే” అన్నాడు. సన్న్యాసి ఆ వ్యక్తితో కలిసి వాళ్ళ ఇంటికి వెళ్ళారు. ఇంటి దగ్గరకు వెళ్ళగానే చౌకీదారు సలాం చేశాడు. గేటు మీద ‘దివాన్ సాహెబు సచ్చీన్ స్టేట్’ అని వ్రాసి ఉంది. దివాన్‌గారు సన్న్యాసిని లోపలికి తీసుకువెళ్ళి, కూర్చోమని చెప్పి, టీ తెప్పించారు. “మహరాజ్! నేను ఈ వేళ మీ దగ్గర మంచి పాఠం నేర్చుకున్నాను. రోజూ ఉదయం నేను ఆ బాటలోనే నడుస్తాను. అయినా ఆ ముళ్ళ విషయం నాకెప్పుడూ తట్టలేదు. అంటే నేను చూసి కూడా ఏమీ పట్టించుకోలేదన్నమాట. అందుకే సాధు సన్న్యాసులతో సహజీవనం చెయ్యాలి అంటారు పెద్దలు. నేను కూడా ఎంతో కొంత సేవ చేయగలిగినందుకు సంతృప్తిగా ఉంది” అన్నాడు.

స్వామి జపానంద ఆ ఊర్లో ఐదారు రోజులున్నారు. రోజూ ఆ వ్యక్తి సన్న్యాసితో కలిసి ఆ బాట మీద నడుస్తూ అనేక ఆధ్యాత్మిక చర్చలు చేసేవాడు. ధార్మిక భావన ఉన్న చోటే మానవత్వం ఉంటుంది. ❖ **అనువాదం: శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**

# సకల దేవతాంశల సమన్వయమూర్తి

హరి హర బ్రహ్మేంద్రాదులందరి అంశలూ కలసి ఏర్పడిన మహామాయా దేవికి దేవతలందరూ సకల ఆయుధాలు, సకల ఆభరణాలు సమకూర్చారు. క్షీరాబ్ధి దేవత దివ్యవస్త్రాలనూ; విశ్వకర్మ వెలుగులు విరజిమ్మే చూడామణినీ, కటక కుండలాలనూ, కేయూర కంకణాలనూ; త్వష్ట ప్రజాపతి రత్న ఖచిత నూపురాలనూ; సముద్రుడు కంఠాభరణాలనూ, రత్నాంగుళీయకాలనూ; వరుణుడు వాడిపోని పద్మాలమాలనూ, వైజయంతినీ; హిమవంతుడు వివిధ రత్నాలతో పొదిగిన కనక సింహాసనాన్నీ సమకూర్చారు. సింహ వాహనం మీద నానావిధ భూషణాలతో విరాజిల్లే ఆ మహామాయాదేవికి విష్ణువు



వేయి అంచుల చక్రాన్నీ; శివుడు త్రిశూలాన్నీ; వరుణుడు శంఖాన్నీ; అగ్ని మనోవేగంతో పోగలిగి, వందమందిని మట్టుపెట్టే శక్తి; వాయుదేవుడు అక్షయ తూణీరాలనూ, దివ్యమైన ధనుస్సునూ ఇచ్చారు. ఇంద్రుడు వజ్రాయుధాన్ని ఇచ్చాడు. యముడు దండాన్నీ; విశ్వకర్మ పరశువునూ ఇచ్చి – అందరూ వివిధ వేదమంత్రాలతో దేవిని స్తుతించారు. ఈ మహామాయాదేవియే – మదంతోనూ, కామంతోనూ విర్రవీగే మహిషాసురుణ్ణీ, వాడిని ఆశ్రయించుకొని ఆగడాలు చేసే అసుర వీరులందరినీ చీల్చి చెండాడి ముల్లోకవాసులను రక్షించింది. ❖



# దేవీ వైభవం

ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

**(...గత సంచిక తరువాయి)**

సురథుడు "నాకు మళ్ళీ నా రాజ్యం కావాలి, నేను రాజ్యాన్ని ఏలాలి" అని అమ్మవారిని కోరుకున్నాడు. రథం అంటే శరీరం. సురథుడు అంటే మంచి శరీరం కలవాడు. నేను శరీరం ఉన్నవాడను, ఇంద్రియాలు ఉన్నవాడను అనే స్పృహ అతడికి ఉంది. ఈ దేహం ద్వారా సత్కర్మ చెయ్యాలి, సత్కర్మ ద్వారా దేహాన్ని పోషించాలి. ఆ జగన్మాత సురథుడి కోరికను సమ్మతించింది. అమ్మ అనుగ్రహంతో అతడికి పోయిన రాజ్యం వచ్చింది, హాయిగా సంపదలన్నీ అనుభవించాడు. అక్కడితో అయిపోలేదు. "వాంఛా సమధికం"-నాయనా! నువ్వు ఇప్పుడు రాజ్యాన్ని పొందుతావు. ఆ తరువాత నువ్వు సూర్య తేజస్సులో లీనమవుతావు. తిరిగి పరమాత్ముడైన ఆ సూర్యుని తేజస్సుతో నువ్వు ఆవిర్భవిస్తావు. సావర్ణి అనే మనువు అవుతావు" అంది అమ్మ.

సమాధి "మోహకూపం నుంచి బయట పెట్టే ఆత్మ జ్ఞానాన్ని ఇవ్వమ్మా" అన్నాడు. అందుకు అమ్మ మోక్షాన్నిచ్చింది, కైవల్యాన్నిచ్చింది, ఆత్మజ్ఞానాన్నిచ్చింది. ఇలా ఇద్దర్నీ ఆ తల్లి అనుగ్రహించింది. సమాధి అనేది సాధనను తెలియజేస్తుంది. సమాధి అంటే సమత్వ బుద్ధిలో బుద్ధిని ఉంచడం అని అర్థం. సురథుడు అనేది శరీరాన్ని తెలియచేస్తుంది. బ్రతుకు సురథం చేసుకోవాలి. సురథుడు శరీరానికీ, ఇంద్రియాలకీ సంకేతం. సమాధి బుద్ధికి సంకేతం. ఈ రెండూ అమ్మకు అర్పించినప్పుడు ఆ తల్లి 'లోకయాత్రా విధాయినీ' అయి ధర్మం చెడకుండా శరీరయాత్ర సలుపుతూ ఉంటుంది, మోహం నుండి రక్షిస్తూ ఉంటుంది.

బ్రహ్మ విద్యాస్వరూపిణి అయిన జగదంబికను ఆశ్రయిస్తే ఐహిక సంపదలు, కైవల్యజ్ఞానం కూడా అమ్మ ఇస్తుంది. కనుక ఇహం, పరం, పరమార్థం ఇవ్వగలిగే తల్లి జగదంబిక అని వ్యాసదేవుడు మార్కండేయ పురాణంలో చెప్పారు.

"లోకాలన్నిటికీ ఏకైక దిక్కు అమ్మ. పిపీలికాది బ్రహ్మలోక పర్యంతం అమ్మ చరణాలే దిక్కు" అని శంకర భగవత్పాదులు అన్నారు. అమ్మ కావాలని ఆ చరణాలను ఆశ్రయిస్తే ఇహం, పరం, సర్వం - ఆ తల్లి అందచేస్తుంది. అందుకు సదా అమ్మను శరణు వేడాలి.

సర్వజగత్తులో మోహాన్ని వ్యాపింపజేసి, ఆ మోహాన్ని ఉపసంహరింపజేసి మోక్షాన్నిస్తుంది. భీష్మపితామహుడు అంపశయ్య మీద ఉండి, శ్రీకృష్ణ పరమాత్మున్ణి "సర్గస్య రక్షణార్థాయ తస్మై మోహాత్మనే నమః" అని స్తోత్రం చేసిన భీష్మస్తవరాజం మహాభారతం శాంతి పర్వంలో వస్తుంది. ఇందులో 'సర్గస్య' అంటే ప్రపంచం. ఈ విశ్వం యొక్క రక్షణ కోసం మోహ స్వరూపుడై ఉన్న నారాయణునికి నమస్కారం అన్నాడు. అక్కడ "నారాయణః" అని పుంలింగంలో ఏ తత్త్వం చెప్పబడుతోందో అదే ఇక్కడ "నారాయణి" అని స్త్రీలింగంలో చెప్పబడుతోంది. అమ్మవారికి నారాయణి, వైష్ణవి అనే రెండు పేర్లున్నాయి.

సప్తశతి, భగవద్గీత ఈ రెండూ ఒకే తత్త్వాన్ని చెబుతాయి. 'దైవీ ఏషా గుణమయీ మమ మాయా దురత్యయా' తన మాయను దాటడం కష్టసాధ్యం అని గీతలో పరమాత్మ చెప్పారు.

జ్ఞానినాం అపి చేతాంసి దేవీ భగవతీ హి సా ।
బలాదాకృష్య మోహాయ మహామాయా ప్రయచ్ఛతి ॥
*(దేవీమాహాత్మ్యం -1.55)* జ్ఞానులైన వారి మనస్సును కూడా లాగి, మోహంతో జగత్తు వైపు తిప్పుతుంది అమ్మ అన్నారు. లేకుంటే జగన్నిర్వహణ సాధ్యం కాదు. మళ్ళీ సమయమెరిగి ఆ మోహాన్ని తొలగించగలిగేదీ ఆ తల్లే.

తయా విసృజ్యతే విశ్వం జగదేతత్ చరాచరమ్ ।
సైషా ప్రసన్నా వరదా నృణాం భవతి ముక్తయే ॥ (1.56)

అంటున్నది దేవీ మాహాత్మ్యం. సైషా ప్రసన్నా వరదా= సకల వరప్రదాయిని అయిన ఆ జగదంబ అనుగ్రహిస్తేనే ముక్తి సాధ్యం. సంసారం నుండి బయట పడడానికి మనం ఆశ్రయించాల్సింది ఆ తల్లిని మాత్రమే.

మమత్వం అనే లోతైన గుంటలో ఈ ప్రపంచాన్నంతటినీ తిప్పుతుంది అన్నారు. మమత్వం- "నాది" అనే మోహ బద్ధమైన ఒక గహ్వారంలో తిప్పేటటువంటి తల్లి. చండి,

దుర్గ అని ఆ జగదంబను ఆశ్రయించినప్పుడు మనం భావించవలసిన విషయాలివి. సంసారంలో సంచరించే మనం మోహం ద్వారా దెబ్బతినకుండా అది ఎంత మేరకు అవసరమో అంత మేరకు ఉంచి, తరువాత దాని నుండి విమోచనం కూడా కలిగించగలిగే తల్లి కనుక జీవించి ఉన్నంత కాలం అమ్మ చరణాలను ఆశ్రయిస్తే చాలు ఏం కావాలన్నా అమ్మే చూసుకుంటుంది.

ఇక్కడ 'ముక్తయే' అనీ, 'ముక్తేర్హేతు' అనీ రెండు పదాలను చెప్పారు. ఎప్పుడు ఏ కాస్త దుఃఖబంధనం మనకు కలిగినా దాని నుండి విమోచనం చెయ్యగలదా తల్లి. "నృణాం భవతి ముక్తయే" అన్నప్పుడు ఐహికమనీ, "ముక్తేర్హేతు భూత సనాతని" అన్నప్పుడు పరమార్థమనీ అర్థం తీసుకోవాలి. సర్వానికీ ఈశ్వరి అయిన ఆ జగదంబిక ఈ రెండు కార్యాలూ చేస్తున్నది. ఇదే "పశుపాశ విమోచని" అన్న నామానికి వ్యాఖ్యానం.



ఆ తల్లికి 'చండి' అని ఒక పేరుంది. చండి అనగానే ఉగ్ర స్వరూపిణి అని భయపడతాం. దేవతామూర్తులు భోగమూర్తులు, ఉగ్రమూర్తులు, యోగమూర్తులు అని మూడు విధాలుగా ఉంటాయి. భోగమూర్తులను ఆరాధన చేస్తే ఐశ్వర్యాలు, సుఖాలు, శుభాలు కలుగుతాయి. ఉగ్రమూర్తుల్ని ఆరాధిస్తే భూత ప్రేతాది భయాలూ, వ్యాధి, తస్కర గ్రహ ఇత్యాది బాధలూ తొలగిపోతాయి. యోగమూర్తులు లేక శాంత మూర్తులు బ్రహ్మ విద్యను అనుగ్రహిస్తారు. ఏ దేవత ఉపాసనలోనైనా ఈ మూడూ ఉంటాయి.

నారాయణిలో ఉగ్రమైన నరసింహాది ఉపాసనలు, సౌమ్య రూపాలు, గురు స్వరూపాలు ఉన్నాయి. దక్షిణామూర్తి మొదలైనవి యోగమూర్తులు; వీరభద్ర ఇత్యాది రూపాలు ఉగ్రమూర్తులు; పార్వతీ సమేతుడైన పరమేశ్వరుడు, నటరాజు మొదలైనవి భోగమూర్తులు.

ముగ్గురి అవసరమూ మనకు ఉంది. మూడూ జీవితానికి అవసరం కనుక మనం ఆరాధించే దైవం మన కోసం మూడు రకాల మూర్తులు ధరించి కాపాడతాడు. ఒక తల్లి పిల్లవాణ్ణి కాపాడడానికి ఎన్ని రకాల రూపాలు ధరిస్తుందో – వాడికి అన్నం పెట్టేటప్పుడు తల్లి అన్నపూర్ణ, చదువు నేర్పేటప్పుడు తల్లి రూపం సరస్వతి, పిల్లవాణ్ణి ఎవరైనా దెబ్బలాడడానికి వస్తే ఆ తల్లి ఉగ్రరూపం దాలుస్తుంది.

జగన్నిర్వహణ చేసే జగదంబిక ప్రసన్న స్వరూపిణిగా, ప్రసన్న వదనగా, సౌమ్య స్వరూపిణిగా ఎలా ప్రకాశిస్తున్నదో, అలాగే ఉగ్రరూపంతో చండిగా కనిపిస్తున్నది. చడి అనే ధాతువు నుండి చండి అనే శబ్దం వచ్చింది. తన పూర్తి ప్రతాపాన్ని బయటపెట్టిన స్వరూపం ప్రచండ. అంటే దాపరికం లేకుండా శక్తి అంతా బయట పెట్టింది. 'చండీ' శబ్దానికి మనం ధ్యానంతో అర్థం చెప్పగలిగితే పరిపూర్ణమైన పరబ్రహ్మ స్వరూపిణి అని అర్థం. అలాంటి ఆ చండి ఎందుకు అవతరించింది?

ఆ కథ చెప్తూ సుమేధ ఇలా అంటాడు: "దేవానాం కార్య సిద్ధ్యర్థం ఆవిర్భవతి సా యదా। ఉత్పన్నేతి తదా లోకే సా నిత్యాప్యభిధీయతే॥ (దేవీమాహాత్మ్యం–1.66) ఈ ఒక్క శ్లోకంలో అమ్మ తత్త్వమంతా చెప్పారు. సానిత్యా అంటే ఎప్పుడూ ఉండేది ఆ తల్లి అన్నారు. ఎప్పుడూ ఉన్న తల్లే కానీ అప్పుడప్పుడు అవతరిస్తుందట. సానిత్య అయిన జగదంబిక దేవకార్య సిద్ధ్యర్థం వచ్చిందట. ఇదే మాట లలితా సహస్రంలో చెప్పారు "దేవకార్య సముద్యతా" అని; అప్పుడూ దేవతల కార్యం కోసమే వచ్చింది. అమ్మ ఎప్పుడు వచ్చినా దేవకార్యం కోసమే వస్తుంది.

మహిషాసురుడు, శుంభనిశుంభులు, భండాసురుడు బాధ పెడితే అమ్మ అవతరించింది. మధుకైటభుల బాధతట్టుకోలేక బ్రహ్మదేముడు ప్రార్థన చేయగా అమ్మ మహాకాళికగా ఆవిర్భవించి అనుగ్రహించింది. "మీకు కష్టాలు వచ్చినప్పుడు భ్రామరీ, శతాక్షీ, రక్తదంతా అనే రూపాల్లో దేవకార్యం కోసం మళ్ళీవస్తాను" అని అమ్మ దేవతలకు అభయమిచ్చింది. ❖ **సశేషం**




# నిస్వార్థ ప్రేమకు ప్రతీక!

మాతృపూజ ఒక విశిష్టమైన తత్త్వం. మనకు కలిగే భావాల్లో మొట్టమొదటి భావం 'శక్తి'ని గురించినది. అంతఃశక్తి ఆత్మ, బాహ్యశక్తి ప్రకృతి – ఈ రెండిటి మధ్య జరిగే యుద్ధమే మానవ జీవనం. మనకు తెలియనివీ, మనం అనుభవించేవీ... సర్వమూ ఈ రెండు శక్తుల ఫలమే. సూర్యుడు అల్పమైనవాటి మీదా, ఉన్నతమైన వాటి మీదా కూడా సరిసమానంగా ప్రకాశిస్తున్నట్లే, భగవంతుని ప్రేమ నిష్పక్షపాతురాలైన తల్లి లాంటిదనే భావం ఉదయించింది.

భారతీయ సంస్కృతిలో మాతృభావానికే ప్రాముఖ్యం ఇచ్చారు. తల్లి అన్ని అవస్థల్లోనూ బిడ్డకు అండగా ఉంటుంది. ఒక వ్యక్తిని భార్యాపుత్రులు విడువవచ్చేమో గానీ తల్లి ఎన్నడూ విడువదు. ఎందుకంటే ఆమె ప్రేమ సడలదు, కొరవడదు, తన శిశువులోని చెడును లక్ష్యపెట్టదు, పైగా మరింతగా అతణ్ణి ప్రేమిస్తుంది. తల్లి విశ్వం యొక్క నిష్పక్షపాత శక్తి. నేడు హైందవులలోని అగ్రవర్ణాలలో కాన వచ్చే పూజ మాతృపూజే. ఈ ఆదర్శం ఇంకా ప్రాచుర్యాన్ని సంతరించుకోలేదు.

ప్రపంచమంతా ఒకే తల్లి లీల. కానీ దీన్ని మనం విస్మరిస్తున్నాం. మనం స్వార్థం వీడినప్పుడు, సంతోషం కలుగుతుంది. ఈ తత్త్వాన్ని ప్రతిపాదించిన తాత్త్వికుడు, కంటికి కనిపించే ప్రతి విషయం వెనుకా ఒకే శక్తి ఉందనే భావాన్ని తెలుసుకొని ఆశ్చర్య పోయాడు. భగవంతుణ్ణి గురించిన భావనలో మానవ కల్పితమైన హద్దు మూర్తిమత్త్వం ఉంది.

తల్లిలోని నిరపేక్షమైన శాశ్వత ఆత్మార్పణమే మనకు శాంతిని ఇవ్వగలదు. నిర్భయంగా, నిర్వ్యాజంగా ఆమెను ఆమె కోసమే ప్రేమించు. నువ్వామె బిడ్డవు కాబట్టి ఆమెను ప్రేమించు. మంచీ చెడూ అన్నిటా ఆమెను సమానంగా చూడు. ఇలా ఆమెను తెలుసు కొన్నప్పుడే, కేవలం అప్పుడే శాశ్వతానందం కలుగుతుంది. అప్పటి వరకూ దుఃఖం మనల్ని వెన్నాడుతుంది. తల్లి వద్ద విశ్రాంతి తీసుకొంటేనే మనం సురక్షితంగా ఉంటాం. కాబట్టి నిస్వార్థ ప్రేమకు ప్రతీక అయిన మాతృమూర్తిని ఆరాధించాలి. ❖



## పరిప్రశ్న

**- స్వామి మేధానంద పురి**

- సుబ్బారెడ్డి, కర్నూలు

**? : ద్వాదశ నామాల్లోనూ, పూజల్లోనూ "కేశవ" నామాన్ని మొదట్లో ఎందుకు ఉచ్చరిస్తారు?**

✍: "కశ్చ అశ్చ ఈశశ్చ త్రిమూర్తయః కేశాస్తే యద్వశేన వర్తన్తే స కేశవః". క+అ+ఈశ+వ - ఈ నాలుగు పదాల్నీ కలిపితే "కేశవ"అనే పదం ఉత్పన్న మవుతుంది. క=బ్రహ్మ, ఈశ=ఈశ్వరుడు, అ=విష్ణువు, వ=వశ అని అర్థం. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు వశమందుగలవాడు కేశవుడు. ఈ నామం యొక్క అర్థం అత్యంత విపులం, వ్యాపకం అవడం వల్ల ప్రప్రథమంగా దీనిని ఉచ్చరిస్తారు.



- సుశీల, కాకినాడ

**? : దేవుడికి హారతి ఎందుకు ఇస్తాం? ఎందుకు ఆ హారతిని కళ్ళకు అద్దుకోవాలి?**

✍: పరమాత్మ స్వయం ప్రకాశ స్వరూపుడు, జ్యోతి స్వరూపుడు. చీకటిలో మనం వస్తువులను చూడలేం. ప్రకాశం అంధకారాన్ని తొలగించి వస్తువులను కనిపించేలా చేస్తుంది. అలాగే అజ్ఞానంలో ఉన్నప్పుడు ఆ పరమాత్మ స్వరూపాన్ని చూడలేం. కాబట్టి జ్యోతి స్వరూపుడైన భగవంతుణ్ణి మనలోని అజ్ఞానాంధకారాలను తొలగించి, జ్ఞాన ప్రకాశాన్ని కలిగించాల్సిందిగా ప్రార్థిస్తూ ఆయనకు ఇచ్చిన హారతిని కళ్ళకు అద్దుకొంటాం. సూర్యునిలోనూ, పరమాత్మలోనూ, మన కళ్ళల్లోనూ ఉన్న జ్యోతి ఒక్కటే. "జాగ్రదవస్థలో కుడి కంటిలో ఆ పరమాత్మ స్థానం ఉంటుంది" అని శ్రుతులు చెబుతున్నాయి.

- ఇందిరమ్మ, మహబూబ్‌నగర్

**? : పంచాక్షరీ మంత్రాన్ని తెలపండి? పురశ్చరణ కోసం ఆ మంత్రాన్ని ఎన్ని సార్లు జపించాలి?**

✍: ఐదు అక్షరాలు ఉన్న మంత్రాన్ని పంచాక్షరీ మంత్రం అని అంటారు. "ఓం నమః శివాయ" - ఇది శివ పంచాక్షరీ మంత్రం. "ఓం రామాయ నమః" అనేది రామ పంచాక్షరీ మంత్రం. తారకం (ప్రణవం) చతుర్థి అంతం గల దేవతా శబ్దం. ప్రణవాన్ని అన్ని మంత్రాలకూ, స్తోత్రాలకూ ముందు తప్పక ఉచ్చరించాలి. లేకుంటే మంత్ర స్తుతులు ఫల శూన్యమవుతాయి. ఒక్కో అక్షరం లక్షసార్లు జపించడాన్ని 'పురశ్చరణ' అంటారు. పంచాక్షరీ మంత్రాన్ని 5 లక్షల మార్లూ, గాయత్రీ మంత్రాన్ని 24 లక్షల మార్లూ జపిస్తే పురశ్చరణ అవుతుంది.

- నరసింహారావు, విశాఖపట్నం

**? : సన్న్యాసం అంటే ఏమిటి? ఎవరిని సన్న్యాసులంటారు?**

✍: సంకల్ప త్యాగమే సన్న్యాసం. ఇచ్ఛ, కామనలను పూర్తిగా త్యజించిన వారిని సన్న్యాసులు అంటారు. గృహస్థాశ్రమంలో ఉండి సంకల్పాల్ని త్యజించిన వారు కూడా సన్న్యాసులే అవుతారు. కాషాయ వస్త్రాలు ధరించి, సంకల్పాలను త్యజించని వారు కేవలం సాధకులు మాత్రమే!

సంకల్పాల్ని త్యజించినవారే మోక్షానికి అర్హులు. శ్రవణ మననాదుల ద్వారా జ్ఞానం సంపాదించినవారు మోక్షాన్ని పొందగలుగుతారు. వేద విహిత కర్మలను నిష్కామ బుద్ధితో చేసి, చిత్తశుద్ధిని పొందిన వారు కూడా క్రమ ముక్తిని పొందుతారు. బాహ్య వస్తువుల చింతనను (పుత్ర-విత్త-లోకైషణాలను) త్యజించి, సర్వత్రా బ్రహ్మ దృష్టిని కలిగినవారే సన్న్యాసులు అవుతారు. గృహస్థులు నిష్కామ కర్మయోగం అనుసరించి సంకల్ప త్యాగం చేయవచ్చు. కాబట్టి ముఖ్య దృష్టితో సన్న్యాసులనూ, గౌణదృష్టితో గృహస్థులనూ ఏకీభవించి సన్న్యాస - కర్మ యోగాలు ఒకటే అని చెప్పడం జరిగింది.

**యం సన్న్యాసమితి ప్రాహుఃయోగం తం విద్ధి పాండవ**
**న హ్యసన్న్యస్త సంకల్పో యోగీ భవతి కశ్చన** *(గీత-6.2)*

'ఓ అర్జునా! దేనిని సన్న్యాసమని చెప్పుదురో, దానినే యోగం అని గ్రహింపుము. ఎందుకంటే సంకల్పరహితుడు ఎన్నటికీ యోగి కాలేడు.'

సంకల్పాలను త్యజించిన వారే సన్న్యాసులు, యోగులు. ❖

- రెంటాల జయదేవ



# ఆరోగ్యం అందించే శంఖం

### మహర్షుల మాట

మహర్షి పులస్త్యుడు 'పులస్త్య సంహిత'లో ఇలా చెప్పారు: "ఎవరైతే తమ ఇంట్లో లక్ష్మీదేవి శాశ్వతంగా నివాసం ఉండాలను కుంటారో, ఋణబాధలు, దరిద్రం లేకుండా సిరిసంపదలతో తులతూగాలనుకుంటారో అలాంటివాళ్ళు దక్షిణావర్త శ్వేత శంఖాన్ని (కుడి వైపు తెరుచుకొని ఉండే తెల్లటి శంఖాన్ని) పూజ గదిలో పెట్టుకోవాలి".

సుఖసంతోషాలు, సిరిసంపదలు, విజయం కావాలను కుంటే దక్షిణావర్తమైన తెల్లటి శంఖాన్ని మించినది ఏదీ లేదని 'లక్ష్మీ సంహిత'లో బ్రహ్మర్షి విశ్వామిత్రుడు చెప్పారు. శంకరా చార్యులు సైతం దక్షిణావర్తమైన తెల్లటి శంఖం ఉన్నప్పటికీ, దాన్ని ఉపయోగించుకోనట్లయితే అంతకన్నా దుర దృష్టం మరొకటి ఉండదని పేర్కొన్నారు. ఆ శంఖం ఉన్నట్లయితే, అది మంచి పనులు చేయడానికి ప్రోత్సహిస్తుందని ఆయన తెలిపారు.



తాంత్రిక విధానంలో కూడా శంఖానికి ఎంతో ప్రాముఖ్యం ఉంది. ఆ విధానంలో వినియో గించడానికి దక్షిణావర్తమైన తెల్లటి శంఖాన్ని మించినది ఏదీ లేదని 'గోరక్ష సంహిత'లో గురు గోరఖ్‌నాథ్ చెప్పారు. ఆ వినియోగం వల్ల తానూ, తన అనుయాయులూ ఏ విధంగా విజయం సాధించినదీ వివరించారు.

లక్ష్మీ స్వరూపమైన దక్షిణావర్త శ్వేత శంఖాన్ని అన్ని సందర్భాల్లోనూ ప్రార్థించినట్లయితే సంపదనూ, సౌభాగ్యాలనూ అందిస్తుందని మార్కండేయ మహర్షి వివరించారు.

### వైజ్ఞానిక వివరణలు

శంఖనాదం ప్రయోజనాల గురించి వైజ్ఞానికమైన వివరణలు కూడా ఉన్నాయి. ఆలయాల్లో చాలా మంది జనం గుమిగూడడం వల్ల గాలి కలుషితమవుతుంది. అలాంటప్పుడు పరిశుభ్రమైన గాలి కోసం శంఖనాదం ఉపయోగపడుతుందని శాస్త్రవేత్తల పరిశోధనలు చెబుతున్నాయి. అలాగే, శంఖధ్వానం ఎంత దూరం వ్యాపిస్తే అంత దూరం ఆ వాతావరణంలోని వ్యాధికారక సూక్ష్మ క్రిములు, మైక్రో ఆర్గానిజమ్స్ ధ్వంసమవుతాయని కూడా భారత శాస్త్రవేత్తలు చెబుతున్నారు. భారతీయ వైజ్ఞానికవేత్త జగదీశ్ చంద్రబోస్ ప్రయోగం చేసి, ఆ సంగతి నిరూపించారు. వాతావరణంలోని సూక్ష్మజీవులను నాశనం చేయడానికి ఎంతో సమర్థమైన, అతి చౌకయిన పద్ధతి శంఖారావం చేయడమేనని బెర్లిన్ విశ్వవిద్యాలయంలో జరిగిన పరిశోధనలు ధ్రువీకరించాయి.

### ఆరోగ్యానికి శంఖారావం

కలరా, మలేరియా వ్యాధుల్ని నియంత్రించడంలో కూడా శంఖనాదం తోడ్పడుతుందని చెబుతున్నారు. అపస్మారం, మూర్ఛ రోగం, కుష్ఠు వ్యాధి పీడితులకు సైతం శంఖనాదం మేలు చేస్తుంది.

అలాగే, శంఖం ఊదడం వల్ల హృద్రోగం తగ్గిపోతుందనీ, నత్తి ఉన్నా తగ్గుతుందనీ అంటారు. శంఖాన్ని ఊదడం వల్ల ఊపిరితిత్తుల సామర్థ్యం పెరుగుతుంది. ఊపిరితిత్తులకు సంబంధించిన రుగ్మతల నుంచి రక్షణ పొందవచ్చు. మానసిక ఆందోళనను పోగొట్టుకోవడానికీ, రక్తపోటును క్రమబద్ధం చేసుకోవడానికీ, మధుమేహ వ్యాధిని నియంత్రించ డానికీ, శ్వాస, జీర్ణకోశ సంబంధ మైన వ్యాధులను నివారించడానికీ శంఖం ఊదడం ఉపకరిస్తుంది.

### శంఖంతో అల్లుకున్న నమ్మకాలు

'శంఖ్ బాజే, భూత్ భాగే' అని మన దేశంలో ఓ మాట ఉంది. 'శంఖం ఊదితే, దయ్యాలు పారిపోతాయి' అని దాని అర్థం. చిన్న చిన్న శంఖాలను మాలగా కట్టి, చిన్న పిల్లల మెడలో వేసే ఆచారం కూడా కొన్ని చోట్ల ఉంది. దీనివల్ల పిల్లలకు త్వరగా మాటలు వస్తాయనీ, మాట స్పష్టంగా ఉంటుందనీ ఓ నమ్మకం. కొన్ని ప్రాంతాల్లో మహిళలు చిన్న చిన్న శంఖాలతో తయారు చేసిన గాజులు ధరిస్తారు.

ప్రార్థనా స్థలంలో శంఖాన్ని నీటితో నింపి, అక్కడే ఉంచడం ఆనవాయితీ. తరువాత ఆ నీటిని భక్తుల మీద జల్లుతారు. ఆ మంత్ర జలానికి రోగ నాశక లక్షణాలుంటాయనీ, ఆరోగ్యాన్ని మెరుగుపరుస్తుందనీ హిందువుల నమ్మకం. మొత్తం మీద హిందూ సంస్కృతి, ఆచారాల్లో శంఖానికి ఉన్న ఈ ప్రత్యేక స్థానాన్ని తెలుసుకొని, పదిమందికీ తెలియజెప్పడం మంచిది. ❖

*(వచ్చే సంచిక నుంచి 'నారికేళ విశిష్టత')*

# నిరుపేదల సేవలో తరించిన తరుణి

మూలం: వీరరాఘవన్ చిత్రాలు: శంకర్ అనుసృజన: స్వామి జ్ఞానదానంద

పూంపుహార్ పట్టణంలో మాధవి అనే నర్తకి, తన కుమార్తె మణిమేఖలతో నివసించేది.
మణిమేఖల తండ్రి కోవలన్, పాండ్యరాజు ఇచ్చిన తప్పుడు తీర్పుకి బలైపోయాడు.
ఆ శోకంలో వారిద్దరూ బౌద్ధ మతాన్ని స్వీకరించి, తపోమయ జీవితం గడపసాగారు.




5
మేఖలా! ఈ మూడు మంత్రాలూ స్వీకరించు. ఇందువల్ల నువ్వు అనుకున్న రూపం పొందగలవు, ఆకలి లేకుండా జీవించగలవు, ఆకాశ మార్గంలో పయనించగలవు.
చిత్తం దేవీ!
6
మణిమేఖలాదేవి అంతర్ధానమయ్యాక మరో దేవత అక్కడ ప్రత్యక్షమైంది.
మేఖలా! రానున్న పౌర్ణమి నాడు గోముఖి అనే నీటి ఊటను తవ్వగా తవ్వగా 'అమృత సురభి' అనే అక్షయ పాత్ర బయటకు వస్తుంది. ప్రజల ఆకలి తీర్చడానికి దాన్ని ఉపయోగించు.
అమృత సురభిని తీసుకొని మణిమేఖల పూంపుహార్‌కు వచ్చి, తాను కనిపించకపోవడంతో దిగులుపడుతున్న తన తల్లి మాధవికి జరిగింది పూసగుచ్చినట్లు చెప్పింది.
7
పూంపుహార్ పట్టణంలో ఆకలితో అలమటించే వారి ఆకలి తీర్చాలనుకున్నది మణిమేఖల. అప్పుడు కాయచండిక అనే స్త్రీ తీరని క్షుద్బాధతో కృశించి వచ్చింది. ఆమె మణిమేఖల వద్ద కొచ్చి...
8
తల్లీ! మీ అమృత సురభిలో, ఆధీర అనే పతివ్రత నుంచి మొదటి భిక్ష స్వీకరించి, మీ కార్యాన్ని ప్రారంభిస్తే దాన్లో అన్నం తరగకుండా అక్షయంగా వస్తుంది.
అలాగే చేస్తానమ్మా!
ఆ విధంగానే ఆధీర నుంచి అమృత సురభిలో భిక్ష గైకొని కాయచండిక క్షుద్బాధను తీర్చింది మణిమేఖల.

మిగతా 36వ పేజీలో...

# కుమారీ పూజ ప్రాముఖ్యం



– డాక్టర్ అపర్ణ

దేవీ భాగవతంలో జనమేజయ మహారాజు వేద వ్యాసుల వారిని దుర్గాపూజా విధానం అడిగినట్లు ఉంది. దుర్గామాత అర్చనా విధానాన్ని వివరిస్తూ వ్యాసమహర్షి 'కుమారీ పూజ'కు ఉన్న ప్రాధాన్యాన్ని తెలియజేశారట. ఆశ్వయుజ శుక్ల పాడ్యమి నుంచి నవమి వరకూ రోజూ అమ్మవారి పూజ పూర్తి చేసి, ఒక బాలికను సాక్షాత్తూ జగజ్జననిగా భావిస్తూ నివేదనతో సహా యథావిధిగా పూజ చెయ్యాలి. ఈ కుమారీ పూజ చాలా రకాలుగా చేస్తారు. ఉదాహరణకు మొదటిరోజు ఒక బాలికతో మొదలుపెట్టి, ఏ రోజుకారోజు బాలికల సంఖ్యను పెంచుతూ, నవమి నాడు తొమ్మిది మంది బాలికలను పూజించడం ఒక పద్ధతి. పాడ్యమి నుంచి నవమి వరకూ రోజూ తొమ్మిది మంది బాలికలను పూజించడం మరొక పద్ధతి.

**కుమారీ పూజ ప్రాముఖ్యం :** కుమారీ పూజ ఎందుకు చేస్తారు? నిష్కపటులైన పసిపిల్లలలో పవిత్రత మూర్తీభవించి ఉంటుంది. బాలికను అర్చిస్తే సాక్షాత్తూ అమ్మవారిని అర్చించినట్లే! శ్రీరామకృష్ణులు "మీరు కుమారీ పూజ చెయ్యలేదా? ఒక మామూలు అమ్మాయి (బాలిక)ని అర్చించడం ఎందుకు అనుకుంటున్నారా? ఎందుకంటే ఆమె జగన్మాత ప్రతిరూపం" అనేవారు. శాస్త్రాలు కూడా అమ్మవారి ఆరాధనలో కుమారీ పూజకు చాలా ప్రాముఖ్యం ఉందని చెబుతున్నాయి.

వైదిక, తాంత్రిక, పౌరాణిక శాఖల సంగమమే దుర్గాపూజ అని విద్వాంసుల అభిప్రాయం. భారతదేశంలో శక్తి ఆరాధన అనాదిగా ఉన్నదే అయినా దుర్గా పూజ సమయంలో పసి పాపను ఆరాధించడం అనేది తంత్రాలు ప్రారంభించాయని కొందరు విద్వాంసుల అభిప్రాయం. దుర్గామాత వేదకాలం నాటి దేవత కనుక ఆమెను సజీవంగా బాలిక రూపంలో ఆరాధించడం అన్నది కూడా అనాదిగా ఉన్నదే అని మరి కొందరి అభిప్రాయం.

వేదకాలంలో యజ్ఞం చేస్తున్నప్పుడు అగ్నిని "కుమార" అనీ, మంటని "కుమారి" అనీ అనేవారు. తైత్తిరీయ ఆరణ్యకంలో "కాత్యాయనాయ విద్మహే, కన్యకుమారి ధీమహి, తన్నో దుర్గిః ప్రచోదయాత్" అనే దుర్గా గాయత్రీ మంత్రంలో అమ్మవారిని కన్యాకుమారి అన్నారు. ఒక విశిష్టమైన పవిత్ర అగ్ని – దుర్గ–ఈ మంత్రాధి దేవత. దుర్గను కాత్యాయన (వేదాల ప్రత్యేకత) అన్నారు; దానికి కారణం ఆమె ఒక అవతారంలో కాత్యాయనుని పుత్రిక. ఇక్కడ 'దుర్గ' అన్న పదం 'దుర్గి'గా మారింది. అయితే 'కుమారీ' అనే పదానికి చాలా ప్రాముఖ్యం ఉంది.

కుమారి అంటే "కు కుత్సితమ్ మారయతి ఇతి కుమారీ" – చెడును నశింప చేసేది కుమారి. వేదాల ప్రకారం దుర్గను బాలికతో పోల్చారు. శ్వేతాశ్వతర ఉపనిషత్తులో దేవీ గురించి "త్వమ్ స్త్రీ త్వమ్ పుమానసి త్వమ్ కుమారా ఉతవా కుమారీ" – నువ్వొక స్త్రీవీ, నువ్వే పురుషుడివీ; అలాగే నువ్వు ఒక బాలుడివీ, నువ్వే బాలికవీ" అని చెప్పబడింది.

"ఒకప్పుడు అంభృణ మహర్షి కుమార్తెగా జగన్మాత అవతరించింది; అప్పుడు ఆమె పేరు వాక్. తానూ పరాశక్తి ఒకటే, వేరు కాదు అని తెలిసిన ఆమె 'ప్రజలకు శివత్వాన్నీ, బ్రహ్మత్వాన్నీ, విష్ణుత్వాన్నీ అనుగ్రహించేది నేనే' అని (ఋగ్వేదంలోని పదవ మండలంలో) చెబుతుంది"

యోగీశ్ చంద్ర అనే వంగ విద్వాంసుడు "దుర్గ ఒక కన్య; ఆమె శివపత్నీ కాదు, కార్తికేయ వినాయకుల జననీ కాదు. ఈ కుమారినే మన పురాణాలు ఆద్యాశక్తి అనీ, ప్రకృతి అనీ అన్నాయి. ఆమె శాశ్వతమైనది, ఆమెకి పుట్టుక అనేదే లేదు. అన్నింటికీ ఆమెయే మూలకారణం" అని వివరించాడు.

దేవాసుర సంగ్రామంలో విజయులైన దేవతలకు గర్వం రావడం, వారి అహంకారాన్ని తొలగించడానికి బ్రహ్మ

వారిని పరీక్షించడం, ఇంద్రుడి ఎదుట ఉమ అనే పేరుతో చిన్న బాలిక రూపంలో జగన్మాత ప్రత్యక్షమై అతనికి జ్ఞానోపదేశం చెయ్యడం మొదలైన వివరాలతో కేనోపనిషత్తులో ఉన్న కథ అందరికీ తెలుసు. పురాణాలు కూడా జగన్మాతను కుమారీ అని వర్ణిస్తున్నాయి. "బ్రహ్మ ఇతర దేవతలతో కలసి అమ్మవారిని మేలుకొలిపి, రావణ సంహారం జరిపించాల్సిందిగా ప్రార్థించాడట. ఆ జగదంబిక వారి ఎదుట కుమారీ రూపంలో ప్రత్యక్షమై బిల్వవృక్షం మీద ఉన్న తనను మేలుకొలపమని చెప్పిందట. వారంతా భూమి మీదకు రాగా బిల్వవృక్షం మీద ఉజ్జ్వలకాంతితో మిరుమిట్లు గొలిపే బాలిక నిద్రిస్తూ గోచరించిందట. అందరూ స్తుతించగా బాలిక ఆనందించి బాలికా రూపాన్ని వదిలి ఉగ్రచండీ రూపాన్ని ధరించిందట. ఆమే చండిక, ఆమె అనుగ్రహించిన పరాక్రమం వల్ల



రాముడు రావణుణ్ణి సంహరించాడు" అని బృహద్ధర్మ పురాణంలో ఒక కథ ఉంది. మహాభారతంలోని భీష్మ పర్వంలో అర్జునుడు సాక్షాత్తూ కుమారీ పూజ చేసినట్లు ఉంది.

తంత్రాలు కుమారీని గొప్ప యోగినిగా వర్ణించాయి. పార్వతి, శివుడితో "కుమారికా హ్యహమ్ నాథా సదా త్వం చ కుమారికా" – 'ప్రభూ! నేను కుమారీని, మీరు కూడా కుమారీయే' అన్నదని తంత్రాలలో చెప్పారు. శక్తి లీల స్థూల ప్రపంచంలోనూ, సూక్ష్మ ప్రపంచంలోనూ ఒకే విధంగా ఉంటుందని తంత్రాలు చెబుతున్నాయి. ఈ పరాశక్తియే కుమారీ రూపంలో విశ్వసృష్టి గావిస్తుంది. ఆమె అన్నిటికీ మూలంగా అన్నింటిలోనూ అంతర్గతంగా నిలిచి ఉంటుంది. అలా తంత్రాలు పరాశక్తి పూజ పవిత్రమైన జీవికి (బాలిక) చెయ్యమని ఆదేశిస్తున్నాయి. అదే కుమారీ పూజ". కుమారీ పూజ లేని ఆరాధన, హోమం లాంటి వాటికి ఫలితం ఉండదు అని తంత్రాలు చెబుతున్నాయి.

కామరూప్‌లోని కామాఖ్య గుడిలోనూ, మదురైలోని మీనాక్షి ఆలయంలోనూ, కన్యాకుమారి ఆలయంలోనూ అమ్మ కుమారీగా ఆరాధితమవుతోంది. స్వామి వివేకానందులు చాలా సార్లు కుమారీ పూజ చేశారు. దివ్యజనని శ్రీశారదాదేవి దుర్గాపూజ సమయంలో మహాష్టమి నాడు కుమారీ పూజ చేశారని ప్రత్యక్ష సాక్షి ఇందుబాలా ఘోష్ చెప్పారు.

దేవీ పురాణం ప్రకారం దుర్గాదేవి వయో భేదాన్ని బట్టి వివిధ రూపాలలో – వేర్వేరు పేర్లతో కుమారీగా పూజలందుకుంటుంది. ఒకటి నుంచి పది సంవత్సరాల వయస్సుగల కుమారీలను పూజించినప్పుడు దుర్గాదేవిని ఈ నామాలతో పిలుస్తారు :

ఒక సంవత్సరం వయస్సున్న కుమారీ – **సంధ్యా**
రెండు సంవత్సరాల వయస్సున్న కుమారీ – **సరస్వతీ**
మూడు సంవత్సరాల వయస్సు గల కుమారీ – **త్రిధా**
నాలుగు సంవత్సరాల వయస్సు గల కుమారీ – **కాళికా**
ఐదు సంవత్సరాల వయస్సు గల కుమారీ – **సుభగా**
ఆరు సంవత్సరాల వయస్సు గల కుమారీ – **కుబ్జికా**
ఏడు సంవత్సరాల వయస్సు గల కుమారీ – **చండికా**
ఎనిమిది సంవత్సరాల వయస్సు గల కుమారీ– **శాంభవీ**
తొమ్మిది సం॥ వయస్సు గల కుమారీ– **కాలసందర్భా**
పది సంవత్సరాల వయస్సు గల కుమారీ – **అపరాజితా**

వయస్సును బట్టి ఆరాధనా ఫలం మారుతుంది. ఉదాహరణకు, రెండేళ్ళ వయస్సున్న కుమారీని పూజిస్తే కష్టాలు, దారిద్ర్యం తొలుగుతాయి. మూడేళ్ళ కుమారీ పూజ వల్ల స్వర్గప్రాప్తి, ఆయుఃప్రమాణం పెరగడం.

అందరూ కుమారీలో జగన్మాతను పూజించాలి. ఈ ఆధునిక యుగంలో మనలో అంతర్గతంగా ఉన్న శత్రువులను సంహరించడానికీ, ఆధ్యాత్మిక అపేక్ష జాగృతమవడానికీ మాతృశక్తిని ఆరాధించాలి. ఇది కుమారీ పూజ ద్వారా సాధ్యమవుతుంది. ❖



# ఓ మహాత్యాగి ఆత్మకథ

(స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)



(...గత సంచిక తరువాయి)

**(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, ప్రవక్త, శ్రేష్ఠసన్న్యాసి, గురువు, యుగాచార్యుడు, దేవదూత, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన తన జీవితానుభవాలను ధారావాహికంగా 2009 జూన్ సంచిక నుంచి అందిస్తున్నాం.)**

నేను మూడోసారి మళ్ళీ దక్షిణేశ్వరంలో శ్రీరామకృష్ణులను కలిశాను. అప్పుడాయన భావ సమాధి గతులై, నన్ను దేవుడని పొగిడారు. "హే ప్రభూ! నారాయణా! నా కోసమే నీవీ మానవ రూపంలో వచ్చావు. అమ్మా! కామినీ కాంచనాల గంధం కూడా లేని అసలైన భక్తుల సాంగత్యం లభించకుంటే, ఈ భువిపై ఎలా మనగలను?" అని నేను జగన్మాతనడిగాను. "నిన్న రాత్రి నువ్వు నా వద్దకు వచ్చి, నన్ను లేపి 'నేను వచ్చాను' అన్నావు" అన్నారు. కానీ నాకేమీ తెలీదు. నేను కలకత్తాలో మా ఇంట్లో బాగా నిద్రపోయాను.

మరోసారి చాలా దూరం నుంచి కాలినడకన దక్షిణేశ్వరం కాళికాలయం చేరుకుని నేరుగా శ్రీరామకృష్ణుల గదిలోకి వెళ్ళాను. ఆయన ఓ చిన్న మంచంపైన కూర్చున్నారు. పరమానందభరితులై, ఆప్యాయంగా నన్ను తన దగ్గరకు పిలిచి మంచం మీద తన పక్కన కూర్చోబెట్టుకున్నారు. మరుక్షణమే ఓ రకమైన భావ పరవశానికి లోనై తనలో తాను ఏదో గొణుగుతూ, దృష్టి నా పైనే నిలిపి, మెల్లగా నా దగ్గరకు రాసాగారు. వెనుకటిలాగే ఈ రోజు ఏదో (వి)చిత్రం చేయబోతున్నారనుకున్నాను. కానీ క్షణకాలంలో ఆయన తన కుడిపాదాన్ని నాపై ఉంచారు! ఆ స్పర్శ తక్షణమే నాలో ఓ మహాద్భుతమైన అనుభూతిని రేపింది! నేను కళ్ళు తెరచి చూస్తుండగానే గోడలు, గదిలోని వస్తువులతో సహా అన్నీ తీవ్రమైన వేగంతో తిరుగుతూ శూన్యంలోకి మాయమయ్యాయి. ప్రపంచమంతా నా అస్తిత్వంతో పాటు ఓ సర్వవ్యాపక మహాశూన్యంలో విలీనమైపోతున్న భావన. నా ఉనికినే కోల్పోతున్నందు వల్ల ఇక మృత్యుముఖంలో ఉన్నానని చాలా భయపడ్డాను.

నన్ను నేను నిగ్రహించుకోలేక "మీరు నాకేం చేస్తున్నారు? నాకు ఇంట్లో తల్లిదండ్రులున్నారు" అంటూ అరిచాను. ఆయన గట్టిగా నవ్వి, నా ఛాతీని తడుముతూ "సరే, సరే! ఇప్పటికి ఇది చాలులే! సమయం వస్తే సర్వం సిద్ధిస్తుంది" అన్నారు. ఆశ్చర్యం! ఈ మాటలన్న వెంటనే నాకు కలిగిన విచిత్రమైన అనుభూతి అంతా మాయమైపోయింది! నేను మామూలు స్థితి కొచ్చాను; గది లోపలా బయటా అంతా మునుపటి లాగే కనిపించింది!

ఇదంతా నేను వర్ణించిన దాని కన్నా తక్కువ సమయంలో గడిచిపోయింది! కానీ నా మనస్సులో మాత్రం విప్లవాత్మకమైన మార్పు సంభవించింది. 'ఇదేమై ఉంటుంది?' అని ఆశ్చర్యంతో నిర్ఘాంతపోయాను. ఈ అద్భుత వ్యక్తి ఇచ్ఛామాత్రంతో ఈ మహానుభూతి వచ్చింది, వెళ్ళింది! ఇదేమైనా ఇంద్రజాలమా లేదా కనికట్టా? అని ప్రశ్నించుకున్నాను. కానీ అలా అవడానికి అవకాశం లేదు. ఎందుకంటే, అలాంటివన్నీ దుర్బల మనస్కుల మీదే పనిచేస్తాయి. నా మనస్సు, సంకల్పశక్తి చాలా బలమైనవని నాకు అమితమైన గర్వం ఉంది. నేనింకా ఈయన మహోన్నత వ్యక్తిత్వం ముందు తలవంచ లేదు; సరి కదా ఆయనను ఓ పిచ్చివానిలా భావించాను. మరి ఈ అకస్మాత్ మార్పుకి కారణమేమిటి? నేను ఏ నిర్ణయానికీ రాలేకపోయాను. అదో అనూహ్య విషయమనీ, దాన్ని గురించి ఆలోచించకపోవడమే మంచిదనీ అనిపించింది. ఏది ఏమైనా మరోసారి ఆయన నాపై మళ్ళీ అలాంటి ప్రభావం చూపకుండా జాగ్రత్తగా ఉండాలని గట్టిగా నిర్ణయించుకున్నాను.

మరుక్షణమే "నా లాంటి దృఢ మనస్కుణ్ణే ముక్కలు ముక్కలు చేసిన మనిషిని పిచ్చివాడని ఎలా తీసిపారేయ

గలం?" అన్న ప్రశ్న తలెత్తింది. కానీ మా మొదటి సమావేశంలో ఆయన తీరు చూస్తే అలా అనుకోక తప్పదు మరి, ఆయన ఓ అవతార పురుషుడై ఉంటే తప్ప! అదీ అసంభవమే! నాకు కలిగిన అనుభూతి స్వభావమేమిటో, పసిబాలునిలా ఎంతో పవిత్రంగా, సరళంగా ఉండే ఈ అద్భుత వ్యక్తి నిజతత్త్వమేమిటో తెలుసుకోలేక సతమతమయ్యాను. నా విమర్శనాత్మక బుద్ధికి ఇదొక పెద్ద దెబ్బలా తగిలింది. కానీ ఈ రహస్యపు లోతు కనుక్కొని తీరాలని సంకల్పించాను. ఆ రోజంతా ఇలాంటి ఆలోచనలతో గడిచింది. కానీ ఆ సంఘటన తరువాత ఆయన పూర్తిగా మరోమనిషి అయ్యారు. నన్ను ఎంతో ప్రేమ ఆప్యాయతలతో చిరపరిచిత మిత్రుడో



లేదా బంధువో అన్నట్లు ఆదరించారు. ఎంత ఆప్యాయత కురిపించినా ఆయనకు తృప్తి కలిగినట్లు లేదు. ఈ దివ్యమైన ప్రేమ, ఆప్యాయతలు నన్ను ఆయనకు మరింత దగ్గర చేశాయి. రాత్రి అవుతుండగా ఇక ఇంటికి వెళతానన్నాను. ఆయన చాలా అసంతృప్తితో మళ్ళీ త్వరలో వస్తానని మాటిచ్చిన తర్వాతే అనుమతించారు.

ఓ రోజు కాళికాలయ ఉద్యానంలో శ్రీరామకృష్ణులు నా హృదయస్థానంలో తాకారు. మొదట ఇళ్ళు, గదులు, తలుపులు, కిటికీలు, వరండాలు, చెట్లు, సూర్యచంద్రులు అన్నీ ముక్కలు చెక్కలవుతూ అణువులు, పరమాణువులుగా మారి మహాకాశంలో విలీనమై పోతున్నాయి. మెల్లగా ఆకాశంతో పాటు 'నేను' అనే స్ఫురణ (అహం చేతన) కూడా మాయమైపోయింది. ఆ తరువాత ఏమైందో నాకు గుర్తు లేదు. మొదట భయపడ్డాను. ఆ స్థితి నుండి దిగి వచ్చి, మళ్ళీ ఇళ్ళు, వాకిళ్ళు, కిటికీలు, వరండాలు మొదలైనవన్నీ చూడగలిగాను. మరో సందర్భంలో అమెరికాలోని ఒక సరస్సు ఒడ్డున సరిగ్గా ఇలాంటి అనుభూతే కలిగింది.

దీన్ని మతి భ్రమ అంటారా? ఈ అనుభూతి ఏదైనా రోగం ముదిరినందు వల్లా, లేక మత్తు పానీయాల నిషా వల్లా, లేక చిత్రవిచిత్ర శ్వాస ప్రక్రియలతో పుట్టిన భ్రమల వల్లా కాక, సంపూర్ణ ఆరోగ్యవంతుడైన ఒక మనిషికి కలిగినప్పుడు దీన్ని 'మతి భ్రమ' అని ఎలా అంటాం? ఇంకో విషయం, ఈ అనుభూతి వేదాలలో చెప్పిన దానితో సరిపోతోంది. పూర్వ కాల ఋషులు, ఆచార్యులు సాక్షాత్కారం గురించి చెప్పిన వివరాలతో ఇవి సరిపోతున్నాయి. ఆఖరికి నన్నో మతి తప్పిన వెర్రివెంగళప్పలా లెక్క వేశారా? ఈ అద్వైతానుభూతినే శాస్త్రాలు బ్రహ్మసాక్షాత్కారమనీ, దీనితో సకల భయాలు, జనన మరణ సంసార బంధాలు విచ్ఛేదనం అవుతాయనీ వచిస్తున్నాయి. ఈ మహోన్నత బ్రహ్మానందాన్ని అనుభవించిన వ్యక్తి ప్రాపంచిక సుఖదుఃఖాలకు చలించడు.

గురుదేవులు నన్ను అమితంగా ప్రేమించడం చూసి, నాపై గుడ్డి ప్రేమ చూపవద్దని నేను కొన్నిసార్లు ఆయనను చీవాట్లు పెట్టకపోలేదు. నా గురించే ఎప్పుడూ ఆలోచిస్తే, పురాణాలలో చెప్పినట్లు భరతుడు తన పెంపుడు జింకపై గల విపరీతమైన మమకారం వల్ల చనిపోయేటప్పుడు కూడా ఆ జింక గురించే చింతిస్తూ, మరుజన్మలో జింకగా పుట్టినట్లు మీరు కూడా నాలానే అవుతారని హెచ్చరించాను. సరళ స్వభావులైన గురుదేవులు ఈ మాటలతో ఎంతో కలత చెంది "నీవన్నది నిజమే! నిన్ను విడిచి ఉండలేకపోతున్నానే, నాకేమవుతుంది?" అంటూ ఆందోళనతో కాళికాలయంలోకి వెళ్ళారు. కొన్ని నిమిషాల్లో తిరిగి వచ్చి, "ధూర్తుడా! నీ మాటలిక ఎన్నడూ వినను. నీలో భగవంతుణ్ణి చూస్తున్నాను. కాబట్టే నిన్ను అంతగా ప్రేమిస్తున్నాననీ, ఏనాడైనా అలా దేవుణ్ణి చూడని పక్షంలో నీ ముఖం కూడా చూడలేననీ అమ్మ నాతో చెప్పింది" అన్నారు. ఈ ఘాటైన జవాబుతో నా వాదనలన్నిటినీ కొట్టిపారేశారాయన. ❖ *(సశేషం)*

అనుసృజన : స్వామి అర్చనానంద

# ఉపాధ్యాయ వృత్తి– మానవతా విలువలు

– డాక్టర్ కమల ఎస్. జయరావు



ఇటీవల ఢిల్లీ మహానగరంలో ఇద్దరు విద్యార్థినుల మృతి గురించి రెండు దిగ్భ్రాంతికరమైన వార్తలు రావడం జరిగింది. ప్రపంచంలోనూ, మన దేశంలోనూ ఎన్నో సంచలనాత్మక సంఘటనలు జరుగుతుండడం మూలంగా మనం వీటిని త్వరలోనే మరచిపోతాం. వీటిని గురించి లోతుగా ఆలోచించం.

ఢిల్లీలోని ఒక ప్రభుత్వ పాఠశాలలో ఇంగ్లీషు పాఠం సరిగ్గా అప్పచెప్పలేదని ఆగ్రహం చెందిన ఉపాధ్యాయిని షన్నో అనే 10, 11 ఏళ్ళ బాలికకు దారుణమైన దండన విధించింది. ఆ పిల్లను వేసవిలో మండుటెండలో గొంతుకు కూర్చోబెట్టి, రెండు చేతులను తొడల కింద నుండి పైకి తెచ్చి చెవులు పట్టుకోమంది. (దీనిని కోడిపుంజు ఆసనం అంటారట) ఆ పైన వీపు మీద మూడు, నాలుగు ఇటుకలు పెట్టి– అలా రెండు గంటల పాటు కూర్చోబెట్టింది. ఇంటికి తిరిగి వెళ్ళిన బాలిక, బహుశా ఎండదెబ్బ మూలంగా కోమాలోకి వెళ్ళి, ప్రాణాలు విడిచింది.

రెండో సంఘటన సంపన్నులు, ఎగువ మధ్య తరగతివారి సంతానం చదువుకొనే ఒక 'ప్రతిష్ఠాత్మకమైన' పాఠశాలలో జరిగింది. పన్నెండో తరగతి విద్యార్థిని అయిన ఆకృతి ఉబ్బసం వ్యాధితో బాధపడేది. ఆనాడు తరగతి గదిలో ఉండగా ఉబ్బసం ఉద్ధృతంగా వచ్చింది. పాఠశాల యాజమాన్యం ఆమెకు ప్రాథమిక చికిత్స చేయలేదు, వైద్యుల్ని పిలిపించలేదు. ఆసుపత్రికి తరలించలేదు. తల్లితండ్రులను రమ్మని ఫోను చేసి, చేతులు దులుపుకొన్నారు. వారు వచ్చి ఆమెను తీసుకొని వెళుతుండగా, ఆ విద్యార్థిని మార్గమధ్యంలోనే ప్రాణాలు విడిచింది.

రెండు సందర్భాలలోనూ విద్యార్థినుల మృతికి కారకులైన వారు మహిళలే కావడం గమనార్హం, శోచనీయం. పిల్లలను శారీరకంగా, మానసికంగా హింసించడం నేరమని ప్రభుత్వం అంటున్నా దాన్ని పట్టించుకొనేవారే లేరు. ప్రభుత్వం సైతం ఒక నియమం ఏర్పరిచి, ఆ పై నిమ్మకు నీరెత్తినట్లు ఉంటోంది. పిల్లలను శిక్షించనిదే వారికి క్రమశిక్షణ అలవడదనే 'తప్పుడు అభిప్రాయం' ఉపాధ్యాయులలోనే కాక, తల్లితండ్రులలోను, అసలు సమాజంలోనే వేళ్ళూనుకొని ఉంది. పోతే నేటి ఉపాధ్యాయులకు ఎన్నో విషయాలు తెలుసుకోవడానికి మార్గాలున్నాయి. వారి శిక్షణలో బాలల మనస్తత్త్వ శాస్త్రం కూడా ఒక పాఠ్యాంశం. అయినా, పైన పేర్కొన్న లాంటి సంఘటనలు దేశంలో ఏదో ఒక మూల జరుగుతూనే ఉన్నాయి. వీటికి కారణాలు అనేకం.

ఉపాధ్యాయులలో ఉన్నత విలువలు, ప్రేమ కొరవడుతున్నాయనడానికి ఇవి నిదర్శనాలు. ఇవి సమాజంలో నెలకొన్న విలువల లేమి, ప్రేమరాహిత్యాల చిహ్నాలు. పిల్లలు ఏ విద్య, ఏ వృత్తి ఎంచుకొనాలనే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు మా తరానికి ఉండేవి. తల్లితండ్రులు తగిన సూచనలు, దిశా నిర్దేశం చేసేవారు. ప్రతి పిల్ల, పిల్లవాడు ఇంజనీరో, డాక్టరో కావాలని నేటి తల్లితండ్రులు వారికి ఉగ్గుపాలతో (విటమిను చుక్కలనాలేమో) నూరి పోస్తున్నారు. అవి కాకపోతే ఎం.బి.ఏ, లేదంటే సి.ఏ. చదువును ఎంచుకోవాలి. ఇలాంటి పరిస్థితులలో ఉపాధ్యాయవృత్తి పట్ల తల్లితండ్రులకూ, సమాజానికీ గౌరవం లేకుండా పోతోంది.

నేటి ఉపాధ్యాయులు ప్రధానంగా మూడు కోవలకు చెందినవారై ఉంటున్నారు. పరీక్షల్లో మంచి మార్కులు తెచ్చుకోలేక ఏదో ఒక పట్టా పుచ్చుకొని, ఈ వృత్తిలోకి వచ్చేవారు; వీరికి సర్వసాధారణంగా తల్లితండ్రులు, బంధు వర్గాల ప్రోత్సాహం లభించదు. రెండో వర్గం ఆర్థిక సామాజిక పరిస్థితుల కారణంగా ఉన్నత వృత్తి విద్యలు అభ్యసించలేని వారు; వీరిలో చాలామటుకు వృత్తి పట్ల నిబద్ధత కలిగి ఉండడం కనపడుతుంది. మూడోది కాలక్షేపం కోసమో, సొంత ఖర్చులకు అవసరమైన ధనసంపాదన కోసమో ఈ వృత్తిని చేపట్టే గృహిణులు; వీరికి అంకిత భావం ఉంటుందా అన్నది అనుమానాస్పదమే.

ఇన్ని కారణాల వల్ల ఉపాధ్యాయుల పట్ల సమాజంలో పెద్దగా గౌరవం లేకుండా పోతోంది. నేడు ఉపాధ్యాయుల వేతనాలు తక్కువేమీ కాదు. పోతే పైన చెప్పిన కారణాల

మూలంగా 'బతకలేక బడిపంతులు' అన్న నానుడి నిజమవుతుంది. 'గురురేవ పరబ్రహ్మ' అనే సమాజంలో వీరికి సముచిత గౌరవం లభించకపోవడం ఒక శోచనీయమైన వైపరీత్యం. తల్లితండ్రులు తమ పిల్లల ఎదుటే - బడిలో బోధన బాగా లేదనీ, ఉపాధ్యాయుల పరిజ్ఞానం అంతంత మాత్రమేననీ కించపరచే వ్యాఖ్యలు చేస్తుంటారు. మంచి బోధనకు కొలమానం ఏమిటి? పిల్లలకు పరీక్షల్లో మంచి మార్కులు వచ్చి, ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులవడమే! ఈ ఒత్తిడి ప్రైవేటు పాఠశాలల్లోని ఉపాధ్యాయులపై తీవ్రంగా ఉంటుంది. వీరి ఉత్తీర్ణతా శాతం చూసి, ప్రభుత్వం కూడా తమ పాఠశాలల సిబ్బందిపై ఇలాంటి ఒత్తిడి తెస్తున్నారు.

ఇంతేకాక అల్పాదాయ వర్గాల వారూ, దిగువ మధ్యతరగతి వారి పిల్లలూ చదివే పాఠశాలల్లో ప్రతి తరగతి గదిలో విద్యార్థుల సంఖ్య హెచ్చుగా ఉంటోంది. పిల్లలందరికీ తెలివి, అవగాహనా శక్తి ఒకే స్థాయిలో ఉండవు. ఇంత మందికి తగినట్లు బోధించడం, వారికి క్రమశిక్షణ నేర్పడం ఉపాధ్యాయులకు తలకు మించిన భారం. ఇన్ని ఒత్తిళ్ళ కారణంగా వారు సహనం కోల్పోవడం, ఆగ్రహించడం జరుగుతుంది.

మహిళల్లో మాతృత్వపు లక్షణాలు మెండు కనుక వారు ఉపాధ్యాయ వృత్తికి తగినవారనే అభిప్రాయం ఒకటుంది. షన్నో, ఆకృతిల పట్ల దారుణంగా ప్రవర్తించిన వారిద్దరూ మహిళలే. ఇది యాదృచ్ఛికం కాదు. ఏ స్త్రీ అయినా తన సంతానాన్ని ప్రేమించినట్లు ఇతరుల పిల్లలను ప్రేమించ జాలదు. ఇది నిష్ఠుర సత్యం. శ్రీశారదామాత, మదర్ థెరెసా లాంటి మహితాత్ములకే ఇది సాధ్యం. ఇలాంటి వారి జీవితాలను ఆదర్శాలుగా స్వీకరిస్తే మానవతా విలువలు కొంతలో కొంత మెరుగుపడతాయి.

ఉపాధ్యాయవర్గంలో మానవతా విలువలు పెరగాలంటే, భారతీయ సమాజంలోనే మార్పు రావలసిన ఆవశ్యకత ఉంది. మానవతా విలువలు పెరగడానికి 'ఆర్ట్స్' లేదా 'హ్యూమానిటీస్' అనబడే శాస్త్రాల అవసరమున్నదని లోగడ (శ్రీ రామకృష్ణ ప్రభ - ఏప్రిల్ 2009 సంచికలో - 'విద్యలో విలువల ఆవశ్యకత') చెప్పడం జరిగింది. గణిత, విజ్ఞాన శాస్త్రాలకు ఇస్తున్న ప్రాముఖ్యం మానవతా శాస్త్రాలకు లేదు. కొన్ని పాశ్చాత్య దేశాలలో ప్రతి విజ్ఞాన శాస్త్ర విద్యార్థీ ఒక మానవతా శాస్త్రం కూడా అధ్యయనం చేయాలనే నియమం ఉంది. ఇది మన కళాశాలల్లో ప్రవేశపెట్టాలనే ప్రతిపాదన విశ్వవిద్యాలయాల ముందుకు తెచ్చినప్పుడు, విద్యావంతులైన తల్లితండ్రులే తీవ్రంగా వ్యతిరేకించడం జరిగింది. దేశ చరిత్ర, ఆర్థిక, సామాజిక, రాజనీతి శాస్త్రాల అధ్యయనమే ప్రజల సమస్యల అవగాహనకూ, దేశప్రగతికీ తోడ్పడుతుంది.

నేటి విద్యావంతులు అనేకులు ఆధ్యాత్మిక సంస్థలనూ, గురువులనూ ఆశ్రయించడం జరుగుతోంది. పోతే ఈ జ్ఞానాన్ని స్వలాభానికి వాడుకొంటున్నారే కానీ మానవతా విలువలను పెంపొందించుకొనే ప్రయత్నాలు జరగడం లేదు. రెండూ



సమానంగా సాగడమే, స్వామి వివేకానంద చెప్పిన 'ఆత్మనో మోక్షార్థం, జగద్ధితాయ చ' అర్థం.

రామకృష్ణ మఠం లాంటి ఆధ్యాత్మిక సంస్థలు ఉపాధ్యాయ వర్గానికి ప్రత్యేక శిక్షణా శిబిరాల ద్వారా ఆధ్యాత్మిక విలువలు బోధించే ప్రయత్నాలు చేస్తున్నాయి. పోతే ఈ శిబిరాలకు వచ్చేవారు ఎందరు ఆసక్తితో స్వచ్ఛందంగా వస్తున్నారో, ఎందరు యాజమాన్యం నిర్బంధం మూలంగా వస్తున్నారో, ఎందరు వీటిని ఆటవిడుపుగా భావిస్తున్నారో తెలుసుకోవాల్సిన ఆవశ్యకత ఉంది. ఏది ఏమైనా ఇవి ఎంతో కొంత ఉపయోగకరమన్న దాంట్లో సందేహం లేదు. కానీ దేశ విస్తీర్ణత, ఉపాధ్యాయుల సంఖ్యతో పోలిస్తే ఇవి ఏమాత్రం సరిపోవు. ఉపాధ్యాయులకు శిక్షణ కాలంలోనే ఆధ్యాత్మిక, మానవతా విలువలు నేర్పే అవసరం ఎంతైనా ఉంది. నేటి బాలలే రేపటి పౌరులన్న నినాదాన్ని కేవలం నోటితో పలకడం కాక, ఎలాంటి పౌరులను భవిష్యత్ కాలానికి అందజేయ నున్నామనే సంగతి విద్యావంతులు ఆలోచించాలి. అందుకు ఎలాంటి ఉపాధ్యాయులను తయారు చేస్తున్నామని కూడా ఆలోచించాలి. ❖



# ఒదిగిన కొద్దీ ఎదుగుదల!

– ఆకెళ్ల రాఘవేంద్ర

కుచేలుడి కథ తెలియని వారుండరు. కుచేలుడి పట్ల శ్రీకృష్ణ పరమాత్ముడు చూపిన స్నేహభావం ఎలాంటిదో తెలియని వారుండరు. అయితే ఈ కథ నుండి నేటి ఆధునిక మానవులమైన మనం తెలుసుకోవలసినది చాలా ఉంది.

పోతన రచించిన ఆంధ్రమహాభాగవతంలోని దశమస్కంధం లోని కథ ఇది. కుచేలుడి అసలు పేరు సుదాముడు. అతి దారిద్ర్యంతో కట్టుబట్టలు కూడా లేని వాడు కావడం వల్ల కు-చేలుడు అనే పేరు తెచ్చుకున్నాడు. (చేలము అంటే బట్టలు. కుచేలము అంటే దుస్తులు లేని దుస్థితి).



సాందీప మహాముని ఆశ్రమంలో శ్రీకృష్ణుడు, బలరాముడు విద్యాభ్యాసం చేస్తున్న కాలంలో సుదాముడు వారి సహాధ్యాయి. అంటే కుచేలుడు సాక్షాత్తూ భగవంతుడికే బాల్య సఖుడన్నమాట. విద్యాభ్యాసం అయిపోయిన తరువాత తన ఊరు చేరుకొని, వివాహం చేసుకొని భార్యాబిడ్డలతో జీవిస్తున్నాడు కుచేలుడు.

అయితే కారణాలేవైనప్పటికీ, కుచేలుడు ఆర్థికంగా చితికిపోయాడు. తాను పస్తులుండడమే కాక భార్యాపిల్లల్ని సైతం పస్తులుంచాల్సిన స్థితి. రానురానూ పరిస్థితి మరీ దుర్భరం అయింది. గంజినీళ్ళయినా లేకపోవడంతో భార్య సుశీల, కుచేలుడితో – 'మీ చిన్ననాటి స్నేహితుడైన శ్రీకృష్ణుణ్ణి సహాయం అర్థించమ'ని వేడుకొంది.

ముందు తటపటాయించిన కుచేలుడు చివరకు సరేనని ద్వారకకు బయలుదేరాడు. బాల్య మిత్రుడికి కానుకగా కుచేలుడు ఏమివ్వగలడు? అందుకే చిరిగిన వస్త్రపు కొంగులో గుప్పెడు అటుకులు మూటగట్టుకొని పయనమయ్యాడు.

వెళుతున్నంతసేపూ కుచేలుడికి అనుమానాలే! 'కృష్ణుణ్ణి చూసి చాలా ఏళ్ళయింది. ఆయన యాదవ రాజ్య సంరక్షకుడు, సాక్షాత్తూ భగవంతుడు. ఆయన దర్శనం నాబోటి దరిద్రుడికి లభిస్తుందా? అసలు ద్వారపాలకులే నన్ను అడ్డగిస్తారేమో!' ఇలా సందేహాల శరపరంపరతో ద్వారకకు చేరుకొన్నాడు కుచేలుడు.

ఇక్కడో చిన్నమాట...

తమ తమ పూర్వజన్మ సుకృతుల వల్ల నైతేనేమీ, సంకల్ప బలం వల్లనైతేనేమీ, పట్టుదలతో పరిశ్రమించడం వల్లనైతేనేమీ, తమ బలహీనతల్ని అధిగమిస్తూ తప్పుల్ని సరిదిద్దుకొంటూ ముందుకు సాగడం వల్లనైతేనేమీ... ఇంకా ఏ కారణం వల్లనైతేనేమి – ఒక వ్యక్తి జీవితంలో ఉన్నత స్థితిని చేరుకోవడం జరుగుతుంది.

మనలో అందరమూ అటు కుచేలుడి స్థితినో, ఇటు కృష్ణుడి స్థితినో– జీవితంలో పొందే ఉంటాం. అందుకని 'అతనా.. స్కూల్లో మేమిద్దరం ఒకే బల్ల మీద కూర్చొని చదువు కొన్నాం. ఇప్పుడు వాడి అదృష్టం బాగుండి మంత్రి అయ్యాడనో, కోటీశ్వరుడు అయ్యాడనో, సినిమా తార అయ్యాడనో..' ఇలా ఏదో ఒకటి అంటుంటాం.

మనతో పాటు ఆడుకొన్న 'అతను'... అలా జీవితంలో ఉన్నత స్థితిని చేరుకోవడంతో ఇటు దుగ్ధతోనో, అటు అహం దెబ్బతినో 'అతని' గురించి చెడుగానో, చులకనగానో మాట్లాడడం జరుగుతుంది. లేదంటే 'అతను' తారస పడినప్పుడు స్థాయీభేదాలు మరచిపోయి ప్రవర్తించడం జరుగుతుంది. 'అతను' లేనప్పుడు చులకనగా మాట్లాడడమో, ఆ చనువును దుర్వినియోగపరచడమో జరుగుతుంది.

ఈ అవలక్షణాలేమీ లేని వాడు కుచేలుడు.

శ్రీకృష్ణుడంతటి వాడు తన బాల్యసఖుడైనా, ఆ శ్రీకృష్ణుడు సాక్షాత్తూ యదుకుల భూషణుడే అయినా, సంపన్నుడే అయినా, భక్తవత్సలుడే అని తెలిసినా, తాను గర్భదరిద్రంతో బాధపడుతున్నానని తెలిసినా... కుచేలుడు ఆ బాల్యస్నేహాన్ని దుర్వినియోగపరిచే ప్రయత్నం కానీ, చులకన చేసి మాట్లాడే

ప్రయత్నం గానీ, నలుగురితోనూ తనకు శ్రీకృష్ణుడితో గల అనుబంధాన్ని చెప్పి గొప్పలకుపోయే ప్రయత్నం గానీ చేయలేదు. అదే కుచేలుడి వ్యక్తిత్వం నుంచి మనం నేర్చుకోవాల్సిన సుగుణం.

అందుకే శ్రీకృష్ణ మందిరంలోకి ప్రవేశం లభిస్తుందో, లేదోనని భయపడుతూ వెళ్ళిన కుచేలుడికి అనూహ్య స్వాగతం లభించింది. కుచేలుడు వెళ్ళే సమయానికి – శ్రీకృష్ణుడు సుందర సమున్నత మణిమయ స్వర్ణసౌధంలో అతివలు వింజామరలు వీస్తుండగా, హంసతూలికా తల్పం మీద రుక్మిణీ సమేతుడై ఉన్నాడు.

దారిద్ర్యపీడితుడూ, కృశించి నీరసించినవాడూ, చిరిగిన వస్త్రాలతో ఉన్నవాడూ అయిన కుచేలుణ్ణి చూడగానే శ్రీకృష్ణుడు గబగబ పాన్పు మీద నుండి దిగి వచ్చి, ఆదరంతో అక్కున చేర్చుకొన్నాడు. తీసుకెళ్ళి తన పాన్పుపై పక్కనే కూర్చుండబెట్టుకొన్నాడు.

ఇక్కడ ఇంకోమాట. మనం కూడా జీవితంలో ఉన్నతస్థితికి చేరుకొంటాం. కార్లు, బంగళాలు కొంటాం. రాజకీయ రంగంలోనో, మరో రంగంలోనో పేరు ప్రఖ్యాతులు ఆర్జిస్తాం. వందిమాగధులు మన చుట్టూ ఉంటారు. మనం అడుగు తీసి అడుగు వేస్తే సమాచార ప్రసార సాధనాలు మన తోటే కదులుతాయి అనుకుందాం. పోనీ, ఇంత కాకపోయినా మన చిన్ననాటి స్నేహితుడితో పోలిస్తే కాస్త డబ్బు, పేరు సంపాదించాం అనుకొందాం.

అంతే! గర్వం వచ్చేస్తుంది. అతిశయం ఆవరించేస్తుంది. చూపు నేలపై కాకుండా చుక్కల్లోకి వెళ్ళిపోతుంది. చుట్టూ ఎవరున్నా కనిపించరు. అది కాదు జీవితం అంటే, అలా ప్రవర్తించడం కాదు వ్యక్తిత్వం అంటే అని చెప్పేందుకే 'కుచేల–కృష్ణ కథ'. గర్వాంధకారంతో కన్నుమిన్నూ తెలీకుండా సాగడం కాదు. అదే శ్రీకృష్ణ పరమాత్మ నుండి మనం నేర్చుకోదగ్గ జీవన సత్యం. అందుకే ఆయన భగవంతుడయ్యాడు. 'మిత్రమా! నాకేం తెచ్చావు' అంటూ కుచేలుడి నుంచి అటుకులు తీసుకున్నాడు.

కుచేలుణ్ణి సాగనంపి, అతనికే తెలియకుండా అతని దారిద్ర్యాన్ని పోగొట్టి అతను ఇహంలోనూ, పరంలోనూ సౌఖ్యం పొందేలా చేశాడు శ్రీకృష్ణుడు.

మన కన్నా ఎదిగిన వారిని చూసి ఈర్ష్యపడకూడదు. వారి ఉన్నతిని చూసి అసూయ చెందకూడదు. స్థాయీ భేదాలు మరచి ప్రవర్తించకూడదు. అవసరంలో స్నేహితులను సాయమడగడం యాచన కాదు. బాల్య సఖులను మరచి అహంకారంతో ప్రవర్తించడం వ్యక్తిత్వం అనిపించుకోదు. హితులను ఆదుకోకపోవడం స్నేహధర్మం కాదు. మన కన్నా తక్కువ స్థితిలో ఉన్నవారిని చూసీచూడనట్లు ప్రవర్తించడం భావ్యం కాదు. స్నేహంతో, వాత్సల్యంతో, అనురాగంతో సాగడమే జీవితం! డబ్బు, హోదా ఉన్నా లేకున్నా మిగిలేదీ, మిగలాల్సిందీ ఇదే!

"ఎదిగేటప్పుడు, పై పైకి ఎగిరేటప్పుడు చుట్టుపక్కల చూసుకొంటూ వెళ్ళు. పలకరిస్తూ వెళ్ళు. నేనే గొప్ప అని విర్రవీగుతూ వెళ్ళకు. ఎందుకంటే – కిందపడితే ఆ పడేటప్పుడు ఆదుకోవాల్సింది వీళ్ళే" అన్న సూక్తిని నేర్చుకోవడం, అమలు పరచడం అవసరం.

'ఒదిగిన కొద్దీ ఎదుగుదల'అనే సత్యాన్ని ఆవిష్కరించేదే కుచేలోపాఖ్యానం. ❖

## అధికారాలకు అతీతమైన స్నేహబంధం

ఒకరోజు న్యూయార్క్‌లో దట్టంగా మంచు కురుస్తోంది. పాదచారులు చెవులకు కోటు కాలర్లు అడ్డంగా పెట్టుకుని నడుస్తున్నారు. ప్రక్కవాడు కూడా కనపడనంత దట్టంగా మంచు కురుస్తోంది.

అలాంటి వాతావరణంలో ఒక నల్లజాతి వ్యక్తి రెండు చేతులతోనూ రెండు బరువైన పెట్టెలు పట్టుకొని స్టేషన్ వైపు నడుస్తున్నాడు. బురదగా ఉన్న బాటపై అతడి కాళ్ళు జారిపోతున్నాయి. ఎంతో కష్టపడుతూ అతడు ఆ విధంగా నడుస్తూ ఉండగా ప్రక్క నుంచి "ఒకపెట్టె నాకు ఇవ్వు మిత్రమా" అన్న మాట వినపడింది.

నల్లజాతీయుడు నిర్ఘాంతపోయాడు. అప్పట్లో ఒక తెల్లవాడు, ఒక నీగ్రోతో అంత స్నేహంగా, ఆప్యాయంగా మాట్లాడటం కలలో కూడా ఊహించలేని విషయం.

అతడు కాస్త మొహమాటపడి "ఫర్వాలేదు" అని అంటూ ఉండగానే ఆ ప్రక్కనున్న తెల్లజాతి యువకుడు అతడి చేతి నుండి ఒక పెట్టెను తీసుకుని, అతడితో పాటు నడవసాగాడు. ఇద్దరూ మాట్లాడుకుంటూ ఒకరి వివరాలు ఒకరు తెలుసుకుంటూ ప్రయాణం సాగించారు. స్టేషన్ వరకూ ఆ విధంగా వెళ్ళి అక్కడ పెట్టె అందించి ఆ శ్వేత జాతి వ్యక్తి కరచాలనం చేసి వెళ్ళిపోయాడు. ఆ తరువాత వారిద్దరూ ఆ పరిచయాన్ని ఉత్తరాల ద్వారా కొనసాగించారు. ఇద్దరివీ రెండు వేర్వేరు సిద్ధాంతాలు. ఒకరు అమెరికాలోని నీగ్రోల హక్కుల కోసం పోరాడి చరిత్ర కెక్కిన 'బూకర్ వాషింగ్టన్'. ఆ తెల్లజాతి యువకుడు అమెరికా ప్రెసిడెంట్ అయిన 'టపాడో రూజ్‌వెల్ట్'. సిద్ధాంతరీత్యా వీరిద్దరి భావాలు వేరైనప్పటికీ వారి స్నేహం మాత్రం కొనసాగింది. ❖




– స్వామి పరిజ్ఞేయానంద

**సాయిరాం, శ్రీదత్త, రోహిత్ – నందమూరు, ప.గో. జిల్లా**

**ప్రశ్న: మమ్మల్ని ఎవరైనా తిట్టినా, అవమానించినా, విమర్శించినా చాలా బాధ కలుగుతుంది. అందువల్ల ఏ పనీ ఏకాగ్రతతో చేయలేకపోతున్నాం. విమర్శల్ని పట్టించుకోకుండా ఉండడం ఎలా సాధ్యమవుతుంది?**

**జవాబు:** పొగడ్తలకు పొంగిపోవడం, తెగడ్తలకు క్రుంగిపోవడం మానవ సహజం. అభినందనల్ని ఆహ్లాదంగా ఆస్వాదించగలుగుతున్నప్పటికీ, అవమానాల్ని అంగీకరించలేక పోవడానికి గల కొన్ని ముఖ్య కారణాలు :

1. ఎప్పుడూ మనల్ని అందరూ మంచివారు అనుకోవాలనీ, మన నిర్ణయాలే సరైనవనీ అనుకొనే మనస్తత్త్వం. ఈ స్వభావం ఉంటే ఒక్క చిన్న విమర్శను కూడా భరించలేం. కాబట్టి ప్రశంసల్ని స్వీకరించిన విధంగానే, విమర్శల్ని కూడా ఆహ్వానించగలగాలి.



2. ఇతరులు మనల్ని విమర్శిస్తున్నారంటే అందులో ఎంతో కొంత నిజం ఉండే ఉంటుందని గ్రహించాలి. అగ్గి పుల్లకు తల మాత్రమే ఉంది. కొద్దిపాటి రాపిడికే అది భగ్గుమంటుంది. మనిషిగా పుట్టిన మనకు తలతో పాటు మెదడు కూడా ఉంది. కాబట్టి అవమానాలు ఎదురైతే ఆగ్రహించడం కన్నా ఆత్మవిశ్లేషణ చేసుకోవడం ఉత్తమం.

'తన మీద విసిరిన ఇటుకలను వినియోగించుకొని ఇళ్ళు కట్టుకోగలిగినవాడే తెలివైన వాడు' అని ఓ అనుభవజ్ఞుని మాట. ఇతరులు మన మీద కురిపించే విమర్శలను మన వ్యక్తిత్వాన్ని నిర్మించుకోవడానికి వినియోగించుకోగలగాలి. అంతేగాని మనస్తాపంతో క్రుంగి, కృశించి పోకూడదు. అదే మహాత్ములకూ, సాధారణ మనుష్యులకూ గల తేడా!

One of the distinguishing differences between a big man and a petty one frequently is the ability to take criticism and profit by it instead of getting indignant, stewed-up and resentful. ***- Douglas Lurton***

3. ఎవరైనా మన మంచి కోరి చేసే విమర్శల్ని అవమానకరంగా భావించకుండా, ప్రశాంతంగా ఆలోచించాలి. అది సద్విమర్శ అయితే స్వీకరించాలి.

ఒకసారి అబ్రహాం లింకన్ సైనిక దళాల్ని విభజించే విషయంలో ఓ ఉత్తర్వు జారీచేశాడు. ఆ నిర్ణయం తప్పని తెలిసిన మిలటరీ జనరల్ స్టాంటన్, 'లింకన్ ఓ మూర్ఖుడు' అని అవమానించాడు. ఆ విషయం విన్న లింకన్ బాధ పడకుండా స్టాంటన్‌తో విషయాన్ని వివరంగా చర్చించాడు. చివరికి తన నిర్ణయమే తప్పని లింకన్ అంగీకరించాడు. కాబట్టి మనకు మేలు చేసే విమర్శల్ని సావధానంగా ఆలోచించి సరిదిద్దుకోవడం మంచిది.

4. ఎవరైనా ద్వేషంతో మనల్ని విమర్శిస్తే, అలాంటి విమర్శల్ని పట్టించుకోకుండా మన ప్రశాంతతను కాపాడుకోవాలి.

ఒకడు, బుద్ధుణ్ణి ఎడతెరిపి లేకుండా అరగంటసేపు దుర్భాషలాడాడు. బుద్ధుడు ప్రశాంతంగా అంతా విన్నాడు. 'ఎదుటి వ్యక్తి అనవసరంగా అలా తిడితే ఒక్క మాట కూడా బదులు చెప్పకుండా ఎలా ఉండగలిగారు' అని బుద్ధుణ్ణి ఓ శిష్యుడు అడిగాడు. అందుకు 'అతడి మాటలు వట్టి గాలి మాటలు (నిరాధారాలు). వాటిని తలచుకుంటూ చింతించడం ఎందుకు! గాలి మాటలు గాలికే పోతాయి' అని నవ్వుతూ బదులిచ్చాడు బుద్ధుడు.

5. విమర్శల్ని రోజుల తరబడి నెమరువేసుకుంటూ మథనపడడం మంచిది కాదు. అలా చేయడం శీతకాలంలో చలివేస్తే వేసవి కాలంలోనూ వణకడం లాంటిది. కాబట్టి ఎప్పుడు విన్న విమర్శల్ని అప్పుడే మరచిపోవాలి.

6. విమర్శల వల్ల బాధ కలిగినప్పుడు ఒంటరిగా ఉంటే మనస్సు మరింత అలజడికి లోనవుతుంది. కాబట్టి మంచి సాహిత్యం చదవడం, సన్నిహితులతో మనస్సు విప్పి మాట్లాడడం, దేవాలయాల్లో సంకీర్తన, సత్సంగాల్లో పాల్గొనడం లాంటివి చేయాలి.

ఈ ఆరు సూచనల్ని కొంతైనా ఆచరించగలిగితే, విమర్శల అస్త్రాల బారి నుండి మనల్ని మనం రక్షించుకోవచ్చు. ❖

**మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :**

**యువవాణి**

**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**
**దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029**



# విజయం నీ చేతిలోనే ఉంది

– స్వామి సేవ్యానంద

జీవితంలో విజయం సాధించాలనే అందరూ ఆశిస్తారు కాని, అపజయం పొందాలని ఎవరు మాత్రం కోరుకుంటారు? నీవు విజయం లేదా పరాజయం పొందడమన్నది నీ చేతిలోనే ఉంది. జీవితంలో విలువైన సమయం గడిచిపోయాక ఏమీ సాధించలేక పోయామని బాధపడేకన్నా ముందు నుంచే పట్టుదలతో ప్రయత్నిస్తే విజయం మన సొంతమౌతుంది. విజయం సాధించడానికి మన నిత్య జీవితంలో ఆచరించదగ్గ కొన్ని ఉపాయాలను చూద్దాం:

**లక్ష్యాన్ని నిర్ణయించుకో:** మనలో చాలామంది లక్ష్యం లేకుండానే జీవితం గడుపుతారు. లక్ష్యం లేని జీవితం దీపం లేని ఇల్లులా అంధకారమవుతుంది. 'లక్ష్యం' అనే దివ్యకాంతి మన జీవితంలో వెలుగును నింపి, మన పురోగతికి మార్గదర్శకమవుతుంది. అందుకే మనకంటూ ఒక లక్ష్యాన్ని నిర్ణయించుకొని దాన్ని సాధించే ప్రయత్నంలో ముందుకు సాగిపోవాలి. చిన్న అలలు కలిసి శక్తివంతమైన పెద్ద కెరటంగా మారినట్లే, నేడు మనం చిన్న లక్ష్యాలను సాధించగలిగితే భవిష్యత్తులో మన అంతరంగంలో ఉన్న 'దివ్యత్వాన్ని' వ్యక్తం చేసి, జీవిత గమ్యాన్ని చేరుకోగలం.

మనం ఉన్నతమైన మార్గంలో వెళ్తున్నపుడు ఎన్నో భావాలు, ఆదర్శాలు మన ముందుంటాయి. వీటన్నిటినీ ఒకేసారి ఆచరించే ప్రయత్నం చేస్తే, చివరికి ఏమీ సాధించలేక విఫలులమవుతాం. అందుకే ముందుగా ఏదైనా ఒక భావాన్ని తీసుకుని, దాన్ని మన జీవితంలో ఆచరించే ప్రయత్నం చేయాలి. "ఒక భావాన్ని స్వీకరించండి. దాన్ని మీ జీవితంగా చేసుకోండి. దాన్ని మననం చేయండి. కలగనండి, ఆ భావంలోనే పరవశులై జీవించండి. మీ మెదడు, కండరాలు, నరాలు, శరీరంలోని ప్రతిఒక్క భాగం ఆ భావంలో పూర్తిగా తన్మయం కావాలి. మిగిలిన అన్ని భావాలను ఒక పక్కన పెట్టండి. ఇదే విజయానికి దారి" అని స్వామి వివేకానంద చెబుతారు.

**సానుకూల ఆలోచనలు – ప్రతిభకు సోపానాలు :** మనకు ఆలోచనలు తప్పనిసరైనపుడు మన మనసుకు, శరీరానికి శక్తినిచ్చే సానుకూలమైన ఆలోచనలు (పాజిటివ్ థింకింగ్) చేసి ప్రతికూలమైన ఆలోచనలకు (నెగటివ్ థాట్స్) దూరంగా ఉండాలి. నేడు ప్రపంచంలో ఆరోగ్యవంతంగా ఎక్కువ కాలం జీవించేవారిలో జపాన్ దేశస్థులు అగ్రస్థానంలో ఉన్నారు. సానుకూలమైన ఆలోచనలు, సానుకూలమైన పనులు చేయడం దీనికి ఒక ప్రధాన కారణమని జపానుకు చెందిన డాక్టర్ షిరాసవా చెబుతారు. నేడు మంచి విద్యార్హతలు గల కొంతమంది యువకులు ప్రతికూలమైన ఆలోచనలకు బానిసలై, హంతకులుగా, నక్సలైట్లుగా, తీవ్రవాదులుగా మారి సమాజానికి భారమవుతున్నారు. వ్యక్తిగతమైన, సామాజికమైన సమస్యల్ని పరిష్కరించడానికి బాధ్యతారహితమైన హింసావాదం ఎప్పుడూ సరైన మార్గం కాదు. సానుకూలమైన ఆలోచనలకు, నిర్మాణాత్మకభావాలకు ప్రాధాన్యమిచ్చినపుడే మనం విజయపతాకాన్ని శాశ్వతంగా ఎగురవెయ్యగలం.

మనం ఏదైనా పనిని సాధించేముందు ఎన్నో అవరోధాలు ఎదురవుతాయి. ఈ ప్రతికూలమైన పరిస్థితులను మనకు అనుకూలంగా మార్చుకొని, విజయం పొందడంలోనే నిజమైన పురుషత్వం ఉంది. మన జీవితంలో పరాజయమన్నది చాలా సహజమైన విషయం. ఒకసారి పరాజయం పొందడంతోనే మనం నిరాశ చెందకూడదు. "నేను సాధించగలను, ఈ లోకంలో నాకు అసాధ్యమైనదేదీ లేదు" అన్న దృఢ సంకల్పంతో మరింత ఉత్సాహాన్ని పెంచుకొని మనం విజయం పొందే ప్రయత్నం చేయాలి.

**విజయానికి సులభమైన ఉపాయం:** ఎప్పుడూ తమ స్వార్థ ప్రయోజనం కోసమే ఆలోచించేవారు తాత్కాలికంగా ఫలితాలను పొందినప్పటికీ ఏదో ఒకరోజు తమ పరాజయాన్ని అంగీకరించవలసి వస్తుంది. అత్యాశతో లంచాలకు బానిసలై, తమ బ్యాంకు బ్యాలెన్సులను పెంచుకొనే స్వార్థపరులు నేడు కాకపోతే రేపు నలుగురిముందూ నవ్వులపాలు కావలసిందే! మనం ఎంత నిస్వార్థ పరులమైతే విజయానికి అంత దగ్గరైనట్లుగా తెలుసుకోవాలి. మనం పురోభివృద్ధి చెందడానికీ, మన దేశాన్ని ప్రగతిపథంలో ముందుకు తీసుకుపోవడానికీ ఇదే సులభమైన ఉపాయం. అందువల్ల మనం ఒక లక్ష్యాన్ని నిర్ణయించుకొని, సానుకూలమైన ఆలోచనలతో, నిస్వార్థతతో ముందుకు సాగితే 'విజయం' మన సొంతమవుతుంది. ❖

# అసలైన శరణాగతి

– స్వామి రఘునాయకానంద



ప్రతి విద్యార్థీ ఎంతో కొంత కష్టబడి పరీక్షల్లో నెగ్గుకు రావాలనే కోరుకొంటాడు. కానీ కొంతమంది రేపు చదవవచ్చులే, మాపు చదవవచ్చులే అని వాయిదాలు వేస్తూ, కాలప్రవాహంలో కొట్టుకుపోతారు. పరీక్షలు దగ్గర కొచ్చేసరికి ఏమీ చేయలేని నిస్సహాయ స్థితిలో పడిపోతారు. ఇక భగవంతుడే రక్షించాలంటూ గుళ్ళ చుట్టూ ప్రదక్షిణాలు చేస్తూ కనిపిస్తారు. వాళ్ళ బలహీనతను కప్పిపుచ్చుకోవడానికి చేస్తున్న ప్రయత్నమే ఈ ప్రదక్షిణలు, లేక భగవంతునికి శరణాగతులు కావడమా?

## ప్రయత్నం, ఆ పై శరణాగతి!

ఆకాశాన ఒక విమానం ఎగురుతూ ఉంది. అకస్మాత్తుగా ఇంజన్లో ఏదో లోపాన్ని గమనించిన పైలట్ దాన్ని సరిచేయడానికి ప్రయత్నించాడు. కానీ, కుదరకపోవడంతో లాభం లేదని గ్రహించాడు. ప్రమాదం అంచున ఉన్నానని తెలుసుకొని వెంటనే పారాచ్యూట్‌ను నడుమకు బిగించు కున్నాడు. ఒక చిన్న మంచినీళ్ళ సీసా, పటం, దిక్సూచులను ఒక సంచీలో వేసుకొని ఆ పైలట్ విమానం నుంచి పారాచ్యూట్ సహాయంతో కిందకు దూకాడు. ఒక ఎడారిలో దిగాడు. వెంటనే పటం, దిక్సూచి సహాయంతో ఒయాసిస్సు కొద్ది మైళ్ళ దూరంలో ఉందని తెలుసుకొన్నాడు. ఆ ఎడారి ఇసుకలో, భానుడి ప్రతాపాగ్నిని అనుభవిస్తూ, ఆ ఒయాసిస్సు వైపుగా నడక ప్రారంభించాడు. మధ్యలో ఆ చిన్న సీసాలో ఉన్న నీళ్ళను త్రాగుతూ నడుస్తున్నాడు. అలసట అతణ్ణి ఆవహించింది. ఒయాసిస్సు ఒక పర్లాంగు దూరంలో కనిపిస్తోంది. కానీ నడవడానికి కావలసిన ఓపికా లేదు, దప్పిక తీర్చుకుందామంటే మంచి నీళ్ళూ నిండుకొన్నాయి. ఒక్క అడుగు కూడా వేయలేని స్థితి. అప్పుడు ఇక భగవంతుడే శరణు అని ఆర్తితో సహాయం కోసం విలపించాడు. మొదట చేయవలసిన ప్రయత్నం అంతా చేసిన తరువాత భగవంతునికి శరణాగతులం కావాలన్నది ఈ కథ చెప్పకనే చెబుతోంది.

*నా సుఖదుఃఖాలను సహనంగా భరించగల శక్తి నాకివ్వు!*

*నా ప్రేమ సేవలో ఫలవంతం చేసుకొనే శక్తిని నాకు ప్రసాదించు!*

*నిరుపేదలను నిర్లక్షించిన, అహంభావపూరితమైన బలవంతులకు మోకరిల్లకుండే బలాన్ని నాకివ్వు!*

*దైనందిన ఒడుదొడుకుల నుండి నా మనస్సును ఉద్ధరించుకునే శక్తిని నాకివ్వు!*

*ఆ శక్తితో నేను సాధించింది, లాభించింది నీకు అర్పించేలా మరలా... నా కిచ్చిన శక్తినంతా నీ ఇచ్ఛకు అర్పించుకోగల ధీరత్వాన్ని నాకు ప్రసాదించు!!*

*(రవీంద్రనాథ్ టాగోర్ రచన 'గీతాంజలి' నుండి)*

## శ్రమను అర్పించడమే ఈశ్వరప్రణిధానం

ఈశ్వర ప్రణిధానం అంటే మనం చేస్తున్న ప్రతి కార్యాన్నీ భగవంతునికి సమర్పించడమే! అంటే భగవంతునికి సంపూర్ణంగా శరణాగతులం కావడం. చేసే ప్రతి కర్మనూ భగవంతునికి అర్పించాలి. మీరు పడ్డ శ్రమను విడనాడాలంటే ముందు బాగా శ్రమ పడాలి. పట్టుదలతో కార్యాచరణకు పూనుకోవాలి. ముందు మనకు ధర్మాచరణ, శ్రమల యొక్క విలువ తెలిసి ఉండాలి. మనం శాయశక్తులా ప్రయత్నం చేయడం ద్వారా మనల్ని మనం అభివృద్ధిపరచుకోవాలి. ధీరులూ, సమర్థులైన కార్యసాధకులకే అదృష్టం అను కూలిస్తుంది. దిగంతాలను తాకే వీరోచితమైన ధైర్యోత్సాహాలతో ప్రయత్నిస్తూ, కడ దాకా వేచి ఉండేవారే అద్భుతాలను సుసాధ్యం చేయగలరు. 'కావలసింది పురుషకారం అని గ్రహించు. పురుషకార విహీనునికి పరమేశ్వర అనుగ్రహం లభించడం కల్ల' – అని స్వామి వివేకానంద అంటారు.

## శరణాగతి – ఈశ్వరప్రణిధానం

హనుమంతుడు మహామేధావి, శక్తి సంపన్నుడు, ఎంతో సమర్థత కలిగినవాడు కనుక 'నా సమస్తమూ రామునికి అర్పించాను. నా హృదయంలో రాముణ్ణి ప్రతిష్ఠించుకొన్నాను, నేనాయన సేవకుణ్ణి' అని చెప్పుకోగలిగాడు. ఇక్కడ శరణాగతి భావంలోని అర్థం కనిపిస్తుంది. కానీ మామూలుగా 'నేను భగవంతునికి అర్పించాను' అనడంలో యథార్థమైన శరణాగతి కన్పించదు. అది కేవలం నోటి మాటే!

ప్రయత్నం ద్వారా సాధించిన జయం, అపజయం – ఈ రెండింటినీ ఈశ్వరార్పణ చేయడం ఈశ్వర ప్రణిధానం. అదే అసలైన శరణాగతి. ❖

# ముందుకు సాగిపో!

- స్వామి ప్రేమేశానంద



(1884-1967)

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ -వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

సార్‌గఛీ,
10 ఫిబ్రవరి 1954

## ప్రియమైన తల్లీ!*

ఈ అనంత విశ్వాన్ని సృజించి, పోషించి, తిరిగి తనలోనే లయం చేసుకొనేందుకు మూలమైన ఆ మహాశక్తి మీ అందరి కోసం మానవ రూపం దాల్చింది. ఆమె నిన్ను తన ఒడి లోనికి తీసుకుంది. ఇది నిజం కాదా చెప్పు? ఇప్పుడు నువ్వు నూటికి నూరు పాళ్ళూ నా తల్లివి అయ్యావు. శారదమ్మ పాదాల చెంత సమర్పితమైన స్వచ్ఛమైన పుష్పం లాంటి దానివి నువ్వు. అమ్మ అర్చనలో అర్పితమైన శ్వేత కుసుమ మాలిక లాంటి దానివి.

మనస్సు భగవంతుని వైపు పోవడం లేదంటావా? పోకపోతే ఏం! రసగుల్లాలు లభించలేదని కుళ్ళిపోయిన చేపలు తింటావా? శ్రీరామకృష్ణ కథామృతం అనుబంధంలో స్వామి వివేకానంద ఏమి చెప్పారో నీకు జ్ఞాపకం ఉందా? "రాముడు లభించలేదనే నెపంతో కాముణ్ణి పట్టుకొని ఈ సంసార జంఝాటంలో పడుతూ లేస్తూ, పిల్లల్ని కనే యంత్రాల మవుతామా? రామ! రామ!".

ఒక వ్యక్తి తన గది తలుపులు బిగించుకొని నిద్ర పోతున్నాడు. అకస్మాత్తుగా ఆ ఇంటికి నిప్పంటుకుంది. అతని స్నేహితుడొకడు గది గోడ పగలగొట్టి గదిలో ప్రవేశించి వాణ్ణి బయటకు లాగి రక్షించాడు. అదంతా తెలిశాక ఆ వ్యక్తి ఎంతగా ఉప్పొంగిపోతాడో ఊహించు. మన పరిస్థితి కూడా కచ్చితంగా అలాంటిదే. శారదమ్మ మనల్ని ఈ సంసార దావానలం నుంచి బయటకు లాగి కాపాడింది.

మీరంతా మనఃస్ఫూర్తిగా విచక్షణను అలవరచుకోవాలి. మీ అందరిలో స్త్రీ స్వభావం ఉంది. కానీ నిజానికి ఆత్మ స్వభావం అది కాదు. అందుచేతనే మీ శరీరాలనే మీరుగా భావిస్తూ అనవసరమైన బాధకు గురై, అతి సిగ్గు, బలహీనతలతో మీ ముఖాలను ముసుగులో దాచుకోవడం లాంటివి చేస్తుంటారు.

మీకు మీరు దృఢంగా ఇలా అనుకోవాలి: "నేను ఈ శరీరాన్ని కాదు. ఈ మనస్సును కాదు. ఈ బుద్ధిని కాను." ఆ పై జాగ్రదవస్థలోనూ, స్వప్నావస్థలోనూ, దీర్ఘసుషుప్తి లోనూ సాక్షీభూతమైన శుద్ధ ఆత్మతో మీ మనస్సును పోల్చుకోండి. ఎంతో కర్మ, భక్తి మీకు సహజసిద్ధంగానే బహూకృతమయ్యాయి. వాటిని మీరు యోగ జ్ఞానాలతో మిళితం చేస్తే, ఇక ఏ మాత్రం భయం కానీ, ఆందోళన కానీ ఉండవు. ఇది గ్రహించండి.

ప్రేమాశీస్సులతో...
స్వామి ప్రేమేశానంద

*అప్రకటిత విద్యార్థిని - (వయస్సులో చిన్నవారైనప్పటికీ స్త్రీలను తల్లీ అని సంబోధించడం భారతీయ సంప్రదాయం)

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు

# మా ఆరోగ్యానికి చేయూతనివ్వరూ?



1985వ సంవత్సరములో సామాన్యరీతిలో రాజమండ్రి రామకృష్ణ మిషన్‌వారిచే గిరిజన సంచార వైద్యశాల ప్రారంభించబడింది. ప్రస్తుతం ఈ వైద్యశాల ఇద్దరు వైద్యులు, రెండు వాహనములు, 8 మంది మెడికల్ మరియు పారామెడికల్ సిబ్బందితో పాటు ఎక్స్‌రే, ఇసిజి మరియు లేబొరేటరీ వంటి సదుపాయములతో నడుస్తున్నది. రాజమండ్రి నుంచి 53 కి.మీ. దూరంలోగల రంపచోడవరంలో ఐ.టి.డి.ఏ. వారు సమకూర్చిన నివాస స్థలములో వైద్య సిబ్బంది బసచేస్తూ గురువారం నుంచి ఆదివారం వరకు నాలుగురోజులపాటు వివిధ గిరిజన ప్రాంతాలను సందర్శిస్తుంటారు. సుమారు 1,500 మంది రోగులు ఈ క్యాంపులద్వారా చికిత్సపొందుతున్నారు. ఏప్రిల్ 2008 నుంచి మార్చి 2009 వరకు 60,000 మంది రోగులకు ఈ క్యాంపుల ద్వారా చికిత్స చేయడంతో బాటు ఉచితంగా మందులు కూడా అందించబడినవి.

రంపచోడవరంలోగల బేస్‌క్యాంపులో అత్యాధునిక ఉపకరణాలతో కూడిన ఒక లేబొరేటరీ ఏర్పాటు చేయబడింది. RNTCP-DOT స్కీమ్ ద్వారా క్షయవ్యాధిగ్రస్తులకు చికిత్సతోబాటు పోషకాహారం కూడా అందివ్వబడుతున్నది. అంతేకాకుండా వివిధ కార్యక్రమాల ద్వారా అనేక ఇతర రోగాలకు సంబంధించిన వివరాలను తెలియచేయడం జరుగుతోంది. సుమారు 1000 మందికి పైగా హాజరవుతున్న ప్రత్యేక వైద్య శిబిరాలలో వివిధ వైద్యనిపుణులు సేవలందిస్తున్నారు. కంటివైద్య శిబిరాలలో క్యాటరాక్ట్ ఆపరేషన్లు నిర్వహించడంతో బాటు, ఉచితంగా IOL లేదా కంటి అద్దాలు కూడా అందివ్వబడుతున్నవి.





**ప్రస్తుత అవసరాలు :** అధిక ధరల వలనా మరియు చాలీచాలని విరాళాలతోనూ ప్రస్తుతం ఈ సేవా కార్యక్రమాలను నడిపించడం చాలా కష్టతరమవుతున్నది. రోగుల సంఖ్య కూడా రోజురోజుకూ పెరుగుతున్నది. ప్రభుత్వంవారు అందిస్తున్న గ్రాంటు మా ఖర్చుకు ఏ మాత్రం చాలడం లేదు. పైగా గ్రాంటు ఎల్లకాలం అందుబాటులో కూడా లేదు.





**మీ సహాయం మాకవసరం :** ఈ నిధులలేమి నుంచి మాకు చేయూతనందించి ఈ సేవా కార్యక్రమాలు ఉన్నత రీతిలో నిరంతరం నడపగలిగేలా మా మిత్రులు, శ్రేయోభిలాషులు, భక్తులు, ప్రభుత్వరంగ సంస్థలు మరియు ఇతర వాణిజ్య సంస్థలకు మా విన్నపం. మీరందించే సహాయం మా ఈ సేవాకార్యక్రమాలు భవిష్యత్తులో నిరాటంకంగా సాగేందుకై ఎంతగానో తోడ్పడుతుంది.

**మా అవసరాలు**

| ఖర్చు | వార్షిక మొత్తం |
|---|---:|
| మందులు | 12,00,000 |
| జీతభత్యాలు | 8,00,000 |
| ఇంధనం & నిర్వాహక ఖర్చులు | 70,000 |
| క్షయవ్యాధి గ్రస్తులకు ఆహారం | 25,000 |
| ముద్రణ తదితరాలు | 10,000 |
| కంటివైద్య శిబిర ఖర్చులు | 20,000 |
| ప్రత్యేక వైద్య శిబిర ఖర్చులు | 40,000 |
| మరమ్మత్తులు | 10,000 |
| విద్యుత్తు చార్జీలు | 25,000 |
| తపాలా మరియు టెలిఫోను | 10,000 |
| వైద్య సామాగ్రిలు | 5,000 |
| ఇతరములు | 5,000 |
| **మొత్తం ఖర్చు** | **22,20,000** |

**ఇలా సహకరించగలరు :** రూ. 50 లక్షల శాశ్వత నిధిని సమకూర్చేందుకై విరాళాలనందివ్వమని మనవి. (కనీస విరాళం రూ. 10,000/–) లేదా మా వార్షిక ఖర్చుకై కొంత మొత్తాన్ని అందించండి.

రామకృష్ణ మిషన్, రాజమండ్రి పేరున అందించే విరాళాలన్నీ ఆదాయపు పన్ను సెక్షన్ – 80జి క్రింద మినహాయించబడినవి.
**చెక్కులు లేదా డిమాండు డ్రాఫ్టులు " రామకృష్ణ మిషన్, రాజమండ్రి" పేరున పంపించగలరు.**

భగవత్సేవలో

**స్వామి అక్షరాత్మానంద, సెక్రటరీ**

**రామకృష్ణ మిషన్**

**వివేకానంద రోడ్, రాజమండ్రి, ఆంధ్రప్రదేశ్ – 533 105**

ఫోన్ : 0883-2473112, Email : rkmrjy@gmail.com




Advt.,

# శ్రీరామకృష్ణ మఠం



న్యూ నాథమ్ రోడ్, రిజర్వ్ లైన్, మదురై - **625 014**,

ఫోన్: 0452-2680224, 2681181, email : rkmath@dataone.in

## శ్రీరామకృష్ణ మఠం, మదురైలో
## స్వామి వివేకానందుల కాంస్య విగ్రహ ప్రతిష్ఠ









స్వామి వివేకానంద 1893 సెప్టెంబర్ 11న విశ్వమత మహాసభలలో ప్రసంగించి ప్రపంచ ప్రఖ్యాతి గాంచారు. వారు అమెరికా వెళ్ళేముందు మొట్టమొదటి మారు మదురై సందర్శించారు.

తిరిగి భారతదేశం రాగానే 1897లో వారు రెండవమారు మదురై వచ్చారు. అక్కడ 1897 ఫిబ్రవరి 2న జరిగిన ఒక సభలో ప్రసంగించారు.

స్వామీజీ మదురై సందర్శనల జ్ఞాపకార్థం మదురై రామకృష్ణ మఠం $10^{1/2}$ అడుగులు గల స్వామీజీ కాంస్య విగ్రహాన్ని ప్రతిష్ఠించాలని నిశ్చయించింది.

స్వామి వివేకానందుల కాంస్య విగ్రహానికి అయ్యే మొత్తం ఖర్చు **రూ॥ 6,50,001/-**

ఈ ప్రణాళిక పూర్తవ్వడానికి ఉదారులైన భక్తులు, మిత్రుల నుంచి విరాళాలను కోరుతున్నాం. విరాళాలన్నింటికీ ఆదాయపు పన్ను చట్టంలోని సెక్షన్ 80(జి) కింద పన్ను మినహాయింపు ఉంది.

విరాళాలను Sri Ramakrishna Math, Madurai పేరున చెక్కు/ డి.డి. తీసుకొని, "Sri Ramakrishna Math, New Natham Road, Reserve Line, Madurai - 625014" కు పంపాల్సిందిగా మనవి.

మీ కోసం, మీ కుటుంబ సభ్యుల సంక్షేమం కోసం మదురైలోని జగజ్జనని శ్రీశ్రీ మీనాక్షి, శ్రీశ్రీ సుందరేశ్వర శివుణ్ణి, భగవాన్ శ్రీరామకృష్ణులు, దివ్యజనని శ్రీ శారదాదేవి, స్వామి వివేకానందులను ప్రార్థిస్తూ,

ధన్యవాదములతో

భగవత్సేవలో

**స్వామి కమలాత్మానంద**

అధ్యక్షులు.

## నా జీవితంలో స్వామి వివేకానంద

# మఠం సందర్శనతో మార్పు

– కె. రాజేష్

నా పేరు కె. రాజేష్. మాది శ్రీకాకుళం జిల్లా, బడగాం అనే గ్రామం. నేను డిగ్రీ పూర్తి చేసి, ఉద్యోగరీత్యా హైదరాబాద్‌లోని పఠాన్‌చెరువు ప్రాంతంలో ఉంటున్నాను. నా వయస్సు 21 సంవత్సరాలు. నా జీవితం గమ్యం లేని నావలా సాగింది. ఏమీ తెలియకపోయినా, అన్నీ తెలుసు అనే భ్రాంతిలో గడిపాను. జీవితం అంటే ఆట, పాట... సినిమా... షికారు అనే భ్రమలో గడిపాను. "నవ్వేవాడు, నవ్వించేవాడు దేవుడు, నవ్వుల పాలయ్యేవాడు జీవుడు" అని తెలుసుకోలేక పోయాను.



మా అన్నయ్య స్నేహితుడు 'శ్రీరామకృష్ణ మఠం' గురించి చెప్పారు. అది విని మా అన్నయ్య (ఇంద్రతనయ) 'శ్రీరామకృష్ణ మఠం' చూడాలని వెళ్ళాడు. అక్కడ ఉన్న వాతావరణం గురించి నాకు వివరంగా చెప్పాడు.

అక్కడి గాలి... మనస్సునూ, బుద్ధినీ ఉత్తేజపరిచే పిల్లనగ్రోవి స్వరం. అక్కడి నీరు.... మనిషికి జీవితంపై ఆశ పుట్టించే ఉత్ప్రేరకం. అక్కడి దేవాలయ ప్రాంగణం... ఓ భూలోక స్వర్గం.

అక్కడి ప్రతి మాట... ఒక ఆణిముత్యం. అక్కడి ప్రతి వాక్కు... వేద మంత్రం. అక్కడి మనుష్యులు... భగవంతుని రూపాలు అని చెప్పాడు. 'మానవసేవే మాధవసేవ' అనడానికి ప్రత్యక్ష సాక్షి 'శ్రీరామకృష్ణమఠం' అని తెలిపి, కొన్ని పుస్తకాలు, రామకృష్ణ భజనల సి.డి.లను నాకు బహుమతిగా ఇచ్చాడు. ఆరోజు రాత్రి నా కళ్ళకు నిదుర కరువైంది. నా మనస్సు వేదనాభరితమై, దుఃఖ సాగరంలో మునిగిపోయాను.

మరుసటి దినం నా పయనం 'శ్రీరామకృష్ణమఠం'కి సాగింది. ఆ రోజు మర్చిపోలేనిది. మా అన్నయ్య చెప్పింది కేవలం ఒక అణువంతేనని, నా కళ్ళతో సందర్శిస్తే కానీ నాకు తెలియరాలేదు.

"దృఢమైన క్రమశిక్షణ గల మనస్సు స్నేహితునిగా సహాయం చేస్తుంది. కానీ బలహీనమైన, స్వాధీనంలో లేని నిరాశా నిస్పృహలకు లోనైన మనస్సు శత్రువులా వ్యవహరించి వినాశనానికి దారితీస్తుంది" ...ఇలా అక్కడ ఉన్న ప్రతి మాటా నా కోసమే అన్న విధంగా ఉంది.

ప్రధానంగా... "బ్రతికినా, చచ్చినా మీ సొంత శక్తి మీదనే ఆధారపడండి. ఈ ప్రపంచంలో పాపం అనేది ఉంటే అది బలహీనతే. బలహీనతను అన్ని విధాలా విడిచిపెట్టండి. ఎందుకంటే బలహీనతే పాపం, బలహీనతే మరణం" అన్న స్వామి వివేకానంద సందేశం చదివాక నా ఆలోచనలు మారాయి.

"జీవితంలో మనం ఎన్నో సమస్యలతో సతమతమవు తుంటాం. వాటిని ఎదుర్కొనేందుకు ఎంతో శక్తి కావాలి. ఆ శక్తి జ్ఞానం నుంచి జనించినదైతే మరింత సులువుగా సమస్యల్ని పరిష్కరించుకోగలం" అన్న స్వామీజీ మాట అక్షర సత్యం. కాదు, కాదు జీవిత సత్యం.

ఇప్పుడు మా ఇంటిని ఒక చిన్న వివేకానంద గ్రంథాలయంగా మార్చుకున్నాను. నేను మారాను. నా స్నేహితులను మార్చాను. నిజంగా సమస్యల సాగరాన్ని దాటించేందుకు స్వామీజీ మధుర వాక్కులు ఓ వరమని నా ప్రగాఢ విశ్వాసం. ❖

కె. రాజేష్ పఠాన్‌చెరువు, హైదరాబాదు.

# మనస్సును పులకింపజేసిన స్వామీజీ ప్రసంగం

– జె. రామకృష్ణ

స్వామి వివేకానంద గురించి నేను ఇంటర్ (2వ సంవత్సరం)లో తెలుసుకున్నాను. అమెరికాలో జరిగిన సర్వమత మహాసభల్లోని స్వామీజీ ప్రసంగం చదువుతూ ఉంటే మనస్సు పులకిస్తుంది. "సోదర సోదరీమణులారా! మీకు భారతీయులందరి తరఫున నా నమస్కారాలు. మా భారతదేశం సనాతన ఋషి సంప్రదాయం గలది. ఎన్నో పవిత్రమైన నదులు, ఎందరో మహానుభావులు జన్మించిన పుణ్యభూమి. అలాంటి దేశంలో జన్మించినందుకు నేను గర్విస్తున్నాను" – ఇలా సాగుతుంది స్వామీజీ ప్రసంగం.



ఇలాంటి వాక్యాలు చదువుతూ ఉంటే మనలోకి ఏదో తెలియని శక్తి ప్రవేశించినట్లనిపిస్తుంది.

స్వామి వివేకానంద ముఖంలో వివేకం, ఆనందం – రెండూ ప్రకాశిస్తూ ఉంటాయి. ఇలాంటి మహోన్నత వ్యక్తుల గురించి చిన్న తరగతుల నుంచే ఏదో ఒక విధంగా విద్యార్థులకు తెలియజేయడం వల్ల వారిలో మంచి మార్పులను తీసుకురావచ్చని నా అభిప్రాయం. ❖

జె. రామకృష్ణ, వెల్ధి, మహబూబ్‌నగర్ జిల్లా.



# ఆచార్యదేవోభవ!

– ఆర్. కృష్ణ

'నేను ఇంగ్లాండు వెళ్ళాల్సి వస్తే చదువుకోవడానికి కాదు, చదువు చెప్పడానికే వెళ్తాను'అని పలికిన మహనీయుడు, ఉపాధ్యాయ వృత్తి నుండి రాష్ట్రపతి పదవి వరకు అధిరోహించిన మహామనీషి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్. 1888 సెప్టెంబర్ 5వ తేదీన చిత్తూరు జిల్లా సర్వేపల్లిలో వీరస్వామి, సీతమ్మ అనే దంపతులకు జన్మించారు.

ఆచార్యులకు దేవుడువంటివాడుగా, అధ్యయన, అధ్యాపన వ్యవస్థలకే గర్వకారణంగా నిలిచిన సర్వేపల్లి రాధాకృష్ణన్ తన అధ్యాపక వృత్తిలో పాటించిన ధర్మాలు ఉపాధ్యాయులకు ఆచరణీయాలు.

వివేకచూడామణిలో ఉపాధ్యాయునికి ఉండవలసిన లక్షణాలను తెలియచేశారు: 1. **శ్రోత్రియోః** విషయాలపై సంపూర్ణ అవగాహన కలిగిఉండాలి. 2. **అవృజినోః** నిష్కళంక, నిష్కల్మషమైన మనస్సు కలిగి ఉండాలి. బోధనలో నా జీవితం సార్థకమైంది అనే ఆత్మసంతృప్తి చెందాలి. 3. **అకామహతః** గురుశిష్యుల బంధం నిస్వార్థమైనది. తల్లి తన బిడ్డకు సేవలందించేటంత నిష్కామ సేవాతత్పరత కలిగి ఉండాలి. ఈ మూడు లక్షణాలను జీవితంలో పరిపూర్ణంగా ఆచరించి చూపారు కనుక 'ఆచార్య దేవోభవ'గా కీర్తింపబడుతున్నారని స్వామి రంగనాథానంద విశ్లేషించారు.



డా॥సర్వేపల్లి రాధాకృష్ణన్‌తో స్వామి రంగనాథానంద

'సర్వేపల్లి రాధాకృష్ణన్ శ్రీకృష్ణుడైతే, నేను ఆయన శిష్యుడినైన అర్జునుణ్ణి' అని మహాత్మా గాంధీ రాధాకృష్ణన్‌ను ఉద్దేశించి ఆప్యాయంగా అన్న మాటలివి.

**పరిపూర్ణ ప్రేమతత్వం:** సుమారు నలభై సంవత్సరాల పాటు అధ్యాపకవృత్తిలో కొనసాగి విద్యార్థులతో, విద్యా సంస్థలతో అనుబంధం కలిగి ఉన్నారు. గురువుగా, ఆత్మీయునిగా ప్రతి విద్యార్థి మదిలో స్థానం సంపాదించుకుని ఎందరో యువతీ యువకుల జీవితాలను ప్రభావితం చేశారు. వారిలో ఆధ్యాత్మిక, నైతిక విశ్వాసాలను పెంపొందించారు. క్లిష్టమైన అంశాలను విద్యార్థుల హృదయాల్లో హత్తుకునేటట్లు బోధించేవారు. విద్యార్థులతో స్నేహభావంతో కలిసిమెలిసి అభిమానంగా, ఆత్మీయంగా మెలుగుతూ "విద్యానిధిని పంచటానికి వచ్చిన సరస్వతీ పుత్రుడు"అని కీర్తింపబడ్డారు.

**మతసామరస్యం – విశాలదృక్పథం :** హిందూమతంలోని మూల సారాంశాన్ని అవగతం చేసుకుని 'సామాజిక న్యాయం, సమానత్వం, ప్రేమ, దయ, కరుణలను పంచుతూ మానవులకు మార్గనిర్దేశనం చేసేవే మతగ్రంథాలు అనీ, సర్వమత సారాంశం మంచిగా ఉండటం, మంచిని చెయ్యటం అనే స్వామి వివేకానంద బోధనలనూ ప్రజలకు బోధించారు'. రాధాకృష్ణన్ భారతీయ వివేకంతో ఆధ్యాత్మికంగా పండిన తత్త్వాన్ని గురించి చేసిన ప్రసంగాలు స్వాతంత్ర్య సమరయోధులకూ, పండితులకూ ప్రేరణ కలిగించాయి.

ఉపరాష్ట్రపతిగా, రాష్ట్రపతిగా 1962 చైనా యుద్ధం, 1965లో పాకిస్తాన్ యుద్ధ సమయాలలోనూ మరెన్నో ఇతర సమస్యలను పరిష్కరిస్తూ రాజ్యాంగ పరిధిలో రాధాకృష్ణన్ గావించిన సేవలు నిరుపమానమైనవి. భారతదేశం స్వాతంత్ర్యం పొందిన తర్వాత సోవియట్ యూనియన్‌లో భారతరాయబారిగా తన వాక్పటిమతో ఘర్షణకైతే ఇద్దరు ఉండాలనీ, దానిని నివారించడానికి ఒక్కరే చాలనీ చెబుతూ స్టాలిన్ మనస్సు మార్చి ఇరుదేశాల మధ్య బంధాన్ని పటిష్టపరిచాడు.

సామాన్య కుటుంబంలో పుట్టి, అధ్యాపకుడిగా, ఆచార్యునిగా, ఉపకులపతిగా, భారత రాయబారిగా, ఉపరాష్ట్రపతిగా, రాష్ట్రపతిగా, తత్త్వవేత్తగా దేశానికి ఎనలేని సేవలందించి, దేశ విదేశాలలో భారతజాతి గౌరవాన్ని ఇనుమడింపజేసి, పూజ్యనీయుడిగా మన్ననలందుకుంటున్న డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ జీవితం అందరికీ స్ఫూర్తిదాయకం. ❖

(సెప్టెంబర్ 5, శనివారం – ఉపాధ్యాయుల దినోత్సవం)

# మా తల్లి గాజులకు నీరాజనం... నిత్య నీరాజనం...

– శ్రీమతి గరిమెళ్ళ లక్ష్మి



అది వేసవి కాలం. ఎండలో ఒక గాజుల వ్యాపారి ఒక పల్లె నుండి మరొక పల్లెకు గాజుల మూట భుజాన వేసుకుని తిరుగుతున్నాడు. అతను సర్వకాల సర్వావస్థలలోనూ 'దుర్గా' నామాన్ని ఉచ్చరిస్తుండడం వల్ల అతణ్ణి అందరూ 'దుర్గాదాసు' అనేవారు.

ఆ రోజు అప్పటికే రెండు గ్రామాలు దాటినా ఎవరూ గాజులు కొనుక్కోలేదు. అయినా 'దుర్గా..దుర్గా' అంటూ అమ్మ నామాన్ని స్మరిస్తూ ముందుకు సాగాడు. అంతా అడవి ప్రదేశం. ఎక్కడా మనుష్య సంచారం లేదు. ఒక చిన్న చెరువు దాటి ముందుకు వెళ్ళబోతుండగా 'ఓ గాజులబ్బాయీ' అన్న పిలుపు వినపడింది. ఈ అడవిలో ఎవరు పిలిచారా అని ఆశ్చర్యంగా వెనక్కి చూశాడు దుర్గాదాసు. చెరువు ఒడ్డున ఒక అయిదారేళ్ళ బాలిక నిలబడి, అతణ్ణి పిలుస్తోంది. ఆ బాలిక కంఠం ఎంతో మధురంగా ఉంది. అపురూప సౌందర్యం గల ఆ బాలిక "నాకు గాజులు వేస్తావా?" అని అడిగింది.

"రా తల్లీ! నా దగ్గర ఉన్న వాటిలోకెల్లా మంచి గాజులు నీ చేతికి వేస్తాను" అని ఆ బాలిక చేతుల నిండా గాజులు వేశాడు దుర్గాదాసు. గాజులు తొడుగుతున్నంత సేపూ అనిర్వచనీయమైన ఆనందాన్ని అనుభవించాడు అతడు.

గాజులతో నిండిన తన రెండు చేతులను చూసి ఆనందిస్తూ, ఆ బాలిక "గాజులు చాలా బాగున్నాయి, అయితే నీకివ్వడానికి నా దగ్గర డబ్బులు లేవు" అని దుర్గాదాసుతో అంది. వెంటనే కొన్ని గుర్తులు చెప్పి ఆ ఇంటికి వెళ్ళి "మా నాన్నగారితో దేవుడి మందిరంలో ఒక భరిణెలో అర్ధరూపాయి ఉంది. దాన్ని మీ అమ్మాయి నాకు ఇమ్మంది అని అడిగి తీసుకో" అని ఆ బాలిక దుర్గాదాసుతో చెప్పింది.

దుర్గాదాసు ఆ అమ్మాయి చెప్పిన ప్రకారం ఆ ఇంటికి వెళ్ళి తలుపు తట్టాడు. ఇంటి యజమాని వచ్చి తలుపు తీశాడు. దుర్గాదాసు ఆ బాలిక చెప్పినట్లుగా 'దేవుడి మందిరంలో దుర్గాదేవి ప్రతిమ దగ్గర చిన్న భరిణెలో పైకం ఉంటుంది, అది నాకు ఇవ్వవలసిందని మీ అమ్మాయి చెప్పింది' అని అన్నాడు. ఇంటి యజమాని 'నాకు ఆడపిల్లలు లేరు. మా ఇంట్లో అలా డబ్బు ఎక్కడా పెట్టలేదు' అని చెప్పాడు. అయినా, సందేహంగానే దేవుడి గదిలోకి వెళ్ళి చూడగా నిజంగానే మందిరంలో దుర్గా ప్రతిమ పక్కన చిన్న భరిణె ఉంది. దానిని తెరిచి చూడగా అందులో అర్ధరూపాయి బిళ్ళ ఉంది. వెంటనే దాన్ని దుర్గాదాసుకు ఇచ్చి, భరిణె మూత పెట్టబోగా దానిలో మరొక అర్ధరూపాయి కనబడింది. దాన్ని తియ్యగానే, మరొకటి ఉంది. ఈ భరిణెలో ఇన్ని నాణాలు ఎలా అక్షయంగా వస్తున్నాయి అని అనుకున్నాడు. "ఆ అమ్మాయి కనబడిన చోటుకు నన్ను తీసుకుని వెళ్ళు" అని దుర్గాదాసుని అడిగాడు ఆయన.

ఇద్దరూ కలిసి ఊరి అవతల ఉన్న చెరువు దగ్గరకు వెళ్ళారు. అయితే అక్కడ ఎవరూ లేరు. 'ఎక్కడ కనపడింది ఆ బాలిక' అని అడిగాడు ఆయన. "నేను చూసినప్పుడు ఇక్కడే ఈ చెరువు ఒడ్డునే ఉంది" అన్నాడు దుర్గాదాసు.

ఇద్దరూ అలా వెతుకుతుండగా చెరువు మధ్యన దుర్గాదాసు గాజులు తొడిగిన రెండు చిన్ని చేతులు కనపడ్డాయి. కొన్ని క్షణాల తరువాత అవి క్రమంగా మాయమయ్యాయి. అది చూసిన వెంటనే దుర్గాదాసుకు తాను గాజులు వేసినది ఎవరికో అర్థమయింది.

"అమ్మని చూసి, మాట్లాడినా నేను ఆమె ఎవరో తెలుసు కోలేకపోయాను" అంటూ విలపించాడు దుర్గాదాసు. ❖

(దుర్గాదేవి బాలిక రూపంలో దర్శనమిచ్చి అంతర్ధానమైన చెరువు కలకత్తాకు 112 కి.మీ. దూరంలో ఉన్న కామార్పుకూర్‌లో ఉంది. అక్కడ నేటికీ అమ్మవారు భక్తుల పూజలందుకుంటోంది.)

ఆధారం : శ్రీరామకృష్ణ పరమహంస చెప్పిన కథ.

... 17వ పేజీ తరువాయి.

**9** ఆకలితో అలమటిస్తున్న అనేకుల క్షుద్బాధను మణిమేఖల పోగొట్టింది. యువరాజు ఉదయకుమారుడు ఆమెను ఇంకా విడిచిపెట్టలేదు. మణిమేఖల కాయచండిక రూపాన్ని దాల్చింది. ఆ రూపంలోనే అనేక చెరసాలలకు వెళ్ళి, అక్కడున్న వారి ఆకలిని తీర్చి చెరసాలలను రాచవిడుదులుగా మార్చివేసింది.



**10** అక్కడా మణిమేఖల వెంటపడిన యువరాజును కాయచండిక భర్త చంపాడు. తన కుమారుడి మరణానికి కారణమైన మణిమేఖలను రాణి బాధలకు గురిచేసింది. చివరకు తన తప్పును గ్రహించి క్షమించాల్సిందిగా ప్రార్థించింది.

**11** సావక దేశ రాజు పుణ్యరాజన్ రాజ్యభోగాలలో మునిగి ఉన్నాడు. అతణ్ణి మార్చడానికి మణిమేఖల అక్కడకు వెళ్ళింది.




**12** మణిపల్లవ ద్వీపంలో పుణ్యరాజన్ బౌద్ధ విహారాన్ని ఆరాధించగా గత జన్మ గురించి తెలిసింది.








పాఠశాల విద్యార్థిని ఎస్.వి. రాజేశ్వరి గీసిన చిత్రం

**భగవంతుడికీ, భక్తుడికీ వ్యత్యాసం లేదనే దృఢ నిశ్చయంతో భక్తులను సేవించాలి. ప్రతి జీవీ సాక్షాత్తూ భగవత్ స్వరూపమని గ్రహించి చేయవలసింది జీవసేవ, జీవకారుణ్యమనేది మూర్ఖప్రలాపం!**

– శ్రీరామకృష్ణ పరమహంస

# గ్రంథ పరిచయం

## శ్రీ సత్యనారాయణ వ్రతకల్పము



వ్యాఖ్యాత: ప్రొ॥ కుప్పా వేంకట కృష్ణమూర్తి
వెల: రూ. 50/-, పేజీలు : 258
ప్రాప్తి స్థానము : శ్రీపావని సేవాసమితి
శ్రీ సాయినిలయం, ఎస్.ఆర్.టి.270,
సనత్‌నగర్, హైదరాబాద్ - 500 018

అర్థంకాని, అర్థంలేని విద్య వ్యర్థమని ఆర్యోక్తి. కొన్ని పూజలు, వ్రతాలు, ఆచారం కాబట్టి చేస్తూ ఉంటారు. అంతేగాని భక్తి శ్రద్ధలు కలిగి, అంతరార్థం తెలిసికాదు. అలాంటి వాటిలో శ్రీసత్యనారాయణ స్వామివారి వ్రతం ఒకటి. గృహప్రవేశం, వివాహానంతరం ఈ వ్రతాన్ని చేస్తూ ఉంటారు.

భక్తికి, సంప్రదాయానికి మధ్య ఓ చక్కని వారధిని నిర్మించటానికి మహా పండితులు శ్రీ కుప్పా వేంకట కృష్ణమూర్తిగారు చక్కని ప్రయత్నం చేశారు. అర్థం తెలుసుకొని త్రికరణశుద్ధిగా శ్రీ స్వామిని అర్చించే విధానాన్ని తమ విపుల వ్యాఖ్యానం ద్వారా భక్తులకు ప్రబోధించారు. ఆచారం కన్నా శాస్త్రీయదృక్పథం కలిగిన మన వ్రతాలు, పూజల గురించి సమగ్రంగా అందించినందుకు శ్రీ కృష్ణమూర్తిగారికి, పావని సేవాసమితి వారికి అభినందనలు. ❖ - ఎం.వి. నాగప్రసాద్

## ప్రామాణిక శ్రీ విష్ణు పురాణం

(పరాశర మహర్షి ప్రణీతము-ఆంధ్రానువాద సహితము)



వ్యాఖ్యాత - శ్రీ భాగవతుల సుబ్రహ్మణ్యం
వెల: రూ. 250/-, పేజీలు : 584,
ప్రతులకు : నవరత్న బుక్ హౌస్
28-22-20, రహిమాన్ వీధి
అరండల్ పేట, విజయవాడ - 520 002

దేవతలకు, మానవులకు, ఋషులకు ఆరాధనీయుడు, దశావతారాలలో దుష్ట శిక్షణ, శిష్టరక్షణ చేసిన శ్రీమన్నారాయణుని విరాట్ స్వరూపమే ఈ విష్ణు పురాణం.

ప్రధానంగా పరాశర మహర్షి ప్రణీతమైన శ్రీవిష్ణుపురాణాన్ని ఇంకా ఎన్నో పురాణాలను, గ్రంథాలను పరిశీలించి సామాన్యునికి కూడా అర్థమయ్యేటట్లు శ్రీభాగవతుల సుబ్రహ్మణ్యం గారు చక్కగా వ్యాఖ్యానించారు.

ఈ పుస్తకం ద్వారా సృష్టి, స్థితి, లయ కారకుల్లో స్థితికారకుడైన శ్రీమహవిష్ణువు ఉత్పత్తి తెలుస్తుంది. అష్టాదశ పురాణాల వివరాలు, ఇంకా సృష్టి పూర్వ స్థితితో మొదలై ఆరు అంశలతో భారత చరిత్ర, సూర్యమహిమ, వ్యాసచరిత్ర, సగర చరిత్ర, కృష్ణావతారం, కవి స్వరూపం మొదలైన అంశాలతో ఆద్యంతం ఆసక్తిదాయకమైన ఈ గ్రంథం అందరూ చదవదగినది. ❖ - రాళ్ళ భండి జయలక్ష్మి

---

## శ్రీరామనామము- ఎంతో మంచి మధురము



(శ్రీరామ నామావళి) వెల:రూ.30/-

## శ్రీకృష్ణా నీ పేరెంతో మధురమురా



(శ్రీకృష్ణ నామావళి) వెల:రూ.30/-

గానం : డా॥ పన్నాల శ్యామసుందరమూర్తి

## నవయుగ ఆదర్శమూర్తులు

సంకలనం : డా॥ పన్నాల శ్యామసుందరమూర్తి
పేజీలు : 32, వెల : రూ.10/-



పుస్తకం, సి.డి.ల ప్రాప్తిస్థానం :
డా॥ పన్నాల శ్యామసుందరమూర్తి
శ్రీరామకృష్ణ సేవాసమితి
13-3-20, గుంటూరువారితోట
2వ లైను, గుంటూరు - 522 001
సెల్ నెం: 98661 75274

---

## పండుగలు-పర్వదినాలు

### సెప్టెంబర్ - 2009

| | | | |
|---|---|---|---|
| 13 | ఆదివారం | : | స్వామి అభేదానంద జయంతి |
| 15 | మంగళవారం | : | ఏకాదశి |
| 18 | శుక్రవారం | : | స్వామి అఖండానంద జయంతి |
| 28 | సోమవారం | : | విజయదశమి -శాంతిజల్ (సాయంత్రం హారతి తర్వాత) |
| 29 | మంగళవారం | : | ఏకాదశి |

### అక్టోబర్ - 2009

| | | | |
|---|---|---|---|
| 03 | శనివారం | : | లక్ష్మీ పూజ (సాయంత్రం హారతి తర్వాత) |
| 14 | బుధవారం | : | ఏకాదశి |
| 17 | శనివారం | : | దీపావళి - కాళీ పూజ |
| 29 | గురువారం | : | ఏకాదశి |
| 30 | శుక్రవారం | : | స్వామి సుబోధానంద జయంతి |



# 'శ్రీరామకృష్ణ ధ్యాన మందిరం' ప్రారంభోత్సవం









ప్రకాశం జిల్లా, తిమ్మరాజుపాలెం శ్రీరామకృష్ణ సేవాసమితి నిర్మించిన శ్రీరామకృష్ణ పరమహంస ధ్యాన మందిరం 2009 ఆగష్టు 5న ఉదయం 9 గంటల 20 నిమిషాలకు హైదరాబాద్ రామకృష్ణ మఠం అధ్యక్షులు పూజ్య స్వామి జ్ఞానదానందజీ మహరాజ్ ప్రారంభోత్సవం చేశారు. శోభాయాత్ర, పూజ, హోమం, భజన కార్యక్రమాల్లో సుమారు 2000 మంది భక్తులు అత్యంత భక్తిశ్రద్ధలతో పాల్గొన్నారు.

ప్రారంభోత్సవ సభలో పూజ్య స్వామి జ్ఞానదానందజీ, స్వామి శశికాంతానందజీ, స్వామి అక్షరాత్మానందజీ, స్వామి రఘునాయకానందజీ, డా॥ పన్నాల శ్యామసుందర మూర్తి 'మూర్తిత్రయ జీవిత సందేశం-ఆధ్యాత్మిక జీవనావశ్యకత' అనే అంశంపై ప్రసంగించారు. మందిరంలో నిర్వహించే పూజా, సేవా కార్యక్రమాల్లో అందరూ పాల్గొని పవిత్ర ఆధ్యాత్మిక వాతావరణాన్ని సద్వినియోగపరచుకోవాల్సిందిగా స్వామీజీలు భక్తులకు సూచించారు.

'శ్రీరామకృష్ణుల మందిరం' నిర్మించాలన్న తమ చిరకాల వాంఛ నెరవేరినందుకు భక్తుల హృదయాలు ఆనందంతో వెల్లివిరిసాయి. గ్రామస్థులందరూ ఆద్యంతం ఈ కార్యక్రమంలో ఉత్సాహంగా పాల్గొని వారి సేవల్ని అందించారు.

సమితి అధ్యక్షులు శ్రీ డి.వి.బ్రహ్మాజీ వందన సమర్పణతోఈ కార్యక్రమం ముగిసింది. ❖



*నివేదిక : వీరాంజనేయులు*

## భక్తులకు మంత్రోపదేశం



రామకృష్ణ మఠం, రామకృష్ణ మిషన్‌ల ఉపాధ్యక్షులు **పూజ్య స్వామి స్మరణానందజీ మహరాజ్** 2009 సెప్టెంబరు 9 నుంచి సెప్టెంబరు 23వ తేదీ వరకు హైదరాబాద్ రామకృష్ణ మఠంలో బస చేస్తారు. ఆసక్తిగల భక్తులకు **సెప్టెంబరు 13,16,18,20**వ తేదీల్లో పూజ్య స్వామీజీ మంత్రదీక్ష ప్రసాదిస్తారు. పూర్తి వివరాల కోసం: **స్వామి జ్ఞానదానంద, అధ్యక్షులు, రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ - 500 029**ను సంప్రతించవలెను.

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) 'వేదచూడామణి'** : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము

యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.

వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య

స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

**(ఆ) 'వేదార్థచూడామణి'** : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము

యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.

వయస్సు : 15 సం॥, ఆ పైన

స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) వేదాధ్యాపకుడు** : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)

కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము

అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవము : 2 సంవత్సరములు

సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

**(ఆ) వేదభాష్యాచార్యుడు** : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)

విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత

అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము

అనుభవార్హత : 5 సం॥

సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

హైదరాబాద్ కులప్రశాసకుడు



Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

Vol.66-10, Sri Ramakrishna Prabha (Telugu Monthly) October 2009, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. H-HD-1071/2007-09. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2007-09.



ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

అక్టోబర్ 2009
వెల : రూ. 10







# సుబోధ

జగన్మాతని శ్రీరామకృష్ణులు ఇలా ప్రార్థించేవారు:

"అమ్మా! జగజ్జననీ! నాకు లోకుల వల్ల గౌరవం వద్దు, విషయభోగాలు వద్దు; గంగా యమునా శాశ్వత సంగమం మాదిరి నా ఆత్మ నీలో లయించుగాక! ఇదే నేను కోరేది. అమ్మా! నేను భక్తిహీనుణ్ణి, యోగహీనుణ్ణి, దీనుణ్ణి, నిస్సహాయుణ్ణి, నాకొకరి మెప్పు వద్దు; నీ దివ్య పాదారవిందాల్లోనే నా మనస్సు నిరంతరం నిలుచుగాక!"

అమ్మ నన్ను సామాన్య భక్తుడి స్థాయిలో ఉంచింది. అందువల్లే రాఖాల్ (స్వామి బ్రహ్మానంద)తోనూ, ఇతరులతోనూ పరిహసించ గలుగుతున్నాను. నేనే కనుక జ్ఞాని స్థాయిలో ఉండి ఉంటే, ఇది సాధ్యం కాకపోయేది. సర్వత్రా కాళీమాతయే – లోకేశ్వరే – నాకు గోచరిస్తోంది. పండితులూ, పామరులూ కూడా అమ్మే అయి ఉందని కాళికాలయంలో నాకు గోచరించింది. నేనెంత ప్రయత్నించినా రామలాల్ తల్లిని దూషించలేక పోయాను. అమ్మే మరో రూపంలో ఆమెగా ఉందని నాకు అనిపించింది.

సమస్తం చిన్మయమని అకస్మాత్తుగా ఒకరోజు నాకు విదితమైంది. పూజాపాత్రలు, వేదిక, ద్వారం – సర్వం చిన్మయమై గోచరించాయి. మానవులు, మృగాలు, పక్షులు – సర్వం చిన్మయమే. నేనప్పుడు చూసినదానినల్లా పూజించేవాణ్ణి. భగవత్సాక్షాత్కారంతో సమస్త కర్మలూ తొలగిపోతాయి. నా పూజాకలాపం ఈ విధంగానే అంతమయింది. ❖

('శ్రీరామకృష్ణ బోధామృతం' నుంచి)

శ్రీరామకృష్ణ ప్రభ
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029
ఫోన్: 040–2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com
నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద
సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 66 సంచిక: 10 అక్టోబర్ 2009

**యాం హన్తుం మధుకైటభౌ జలజభూస్తుష్టావ సు ప్తే హరౌ**
**నీలాశ్మద్యుతిమాస్యపాదదశకాం సేవే మహాకాళికామ్ ॥**



విష్ణువు యోగనిద్రలో ఉండగా మధుకైటభాసురులను వధించుట కోసం బ్రహ్మదేవునిచేత స్తుతింపబడి, ఇంద్రనీలమణివంటి శరీరకాంతితో పది ముఖాలు, పది పాదాలుగల మహాకాళికా దేవిని నేను సేవిస్తున్నాను. *(మహాకాళీ ధ్యానం - దేవీ మాహాత్మ్యం నుంచి)*

## లోపలి పేజీల్లో...



# శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి





ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పంచి పెట్టేందుకు 'శ్రీరామకృష్ణ ప్రభ' కృషి చేస్తోంది. నిధుల కొరత లేకుండా ఈ జ్ఞానయజ్ఞం నిరంతరాయంగా సాగేందుకు 'శ్రీ రామకృష్ణ ప్రభ శాశ్వతనిధి'లో సభ్యులుగా చేరి ధనదానం చేయాల్సిందిగా మనవి. సభ్యుల పేర్లు పత్రికలో ప్రచురిస్తాం.

**మహారాజ పోషకులు**...... రూ. 10,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**రాజ పోషకులు**............ రూ. 5,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.
**పోషకులు**................. రూ. 1,000/-, అంతకన్నా ఎక్కువ విరాళం ఇచ్చేవారు.

| | దాత పేరు / చిరునామా | రూ. |
|---|---|---|
| మహారాజ పోషకులు | : శ్రీమతి & శ్రీ కోట రామ సూర్యనారాయణ, తణుకు, పశ్చిమగోదావరి జిల్లా | 10,000 |
| రాజ పోషకులు | : శ్రీ బరడి నవీన్ కుమార్, భ్రమరాంబికా నగర్, మల్కాజ్‌గిరి, హైదరాబాద్ | 5,000 |
| పోషకులు | : శ్రీ కాళ్ళకూరి సుబ్బారావు, సరిపల్లి, పశ్చిమగోదావరి జిల్లా (కీ॥శే॥ కాళ్ళకూరి చంద్రమ్మ జ్ఞాపకార్థం) | 1,116 |
| | : శ్రీ సి. మాలకొండయ్య, ట్రంక్‌రోడ్, నెల్లూరు. | 1,001 |

## 'శ్రీరామకృష్ణ ప్రభ' కానుక పథకం

ప్రియ భక్తులారా!

యువతరంలో ఆత్మవిశ్వాసాన్ని నింపే యువనాయక స్వామి వివేకానంద స్ఫూర్తివచనాలతో వెలువడుతున్న 'శ్రీరామకృష్ణ ప్రభ'ను రాష్ట్రంలోని వివిధ పాఠశాలలకూ, కళాశాలలకూ అందించాలని సంకల్పించాం.

శ్రీరామకృష్ణుల, స్వామి వివేకానందుల సందేశాల ఆవశ్యకతను గురించి సుభాష్ చంద్రబోస్ ఒక సందర్భంలో చెబుతూ, "శీలనిర్మాణానికి రామకృష్ణ - వివేకానంద సాహిత్యం కన్నా ఉన్నతమైన సాహిత్యం వేరొకటి లేదు" అని అన్నారు.

యువతరానికి 'శ్రీరామకృష్ణ ప్రభ'ను మరింత చేరువ చేయడానికి మీ ఆర్థిక సహాయాన్ని కోరుతున్నాం. ఈ పథకం కింద రూ. 1500 మొత్తాన్ని జీవిత చందా (20 సంవత్సరాలకు) కట్టినట్లయితే మీరు సూచించిన, లేదా మేము ఎంపిక చేసిన ఒక పాఠశాల/కళాశాలకు 20 ఏళ్ళ పాటు పత్రికను మీ పేరున పంపుతాం. చందాదారుని పేరు, విద్యాసంస్థ పేరు పత్రికలో ప్రచురిస్తాం.

మీ చందాను ఎమ్.ఓ. / డి.డి./ చెక్కు రూపంలో Ramakrishna Math, Hyderabad పేరున తీసుకొని, Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029 చిరునామాకు పంపవలెను.

స్వామీజీ ఆదర్శాలకు అనుగుణంగా యువతరాన్ని తీర్చిదిద్దడంలో 'శ్రీరామకృష్ణ ప్రభ' చేపట్టిన ఈ పథకానికి చేయూతనందించగలరని ఆశిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కాగలరని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
స్వామి జ్ఞానదానంద
అధ్యక్షులు

**ముఖచిత్రం:** కలకత్తా దక్షిణేశ్వరంలో గంగాతీరాన వెలసిన 'భవతారిణీ కాళికాలయం'. శ్రీరామకృష్ణ పరమహంస ఆరాధించిన చిన్మయమూర్తి కాళీమాత కొలువుదీరిన ఆలయం ఇదే! *(ముఖచిత్ర కథనం - పేజీ 10లో చూడండి)*

## ADVERTISEMENT TARIFF

| | MULTI COLOUR | B & W |
|---|---|---|
| Fourth Cover | Rs.25,000 | - |
| Second Cover | Rs.20,000 | - |
| Third Cover | Rs.20,000 | - |
| Inside Full Page | Rs.15,000 | 10,000 |
| Inside Half Page | Rs.10,000 | 5,000 |

## చందా వివరాలు

| చందా వివరాలు | ఇండియాలో | విదేశాలలో |
|---|---|---|
| విడి ప్రతి | : రూ. 10 | - |
| ఒక సంవత్సర చందా | : రూ. 100 | $ 25 |
| మూడు సంవత్సరాలకు | : రూ. 280 | $ 55 |
| ఐదు సంవత్సరాలకు | : రూ. 450 | $ 85 |
| ఇరవై సంవత్సరాలకు | : రూ. 1500 | $ 365 |

గమనిక : డిమాండ్ డ్రాఫ్ట్, మనియార్డర్లలో **Ramakrishna Math, Hyderabad** అని వ్రాయాలి.
పంపవలసిన చిరునామా : **Sri Ramakrishna Prabha, Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029.**

## లోపలి పేజీల్లో...



### శ్రీరామకృష్ణ ప్రభ చందాదారులకు విన్నపం

*ప్రియ పాఠకులారా!*

- 'శ్రీరామకృష్ణ ప్రభ' పత్రిక కవరు పైన చిరునామాకు కుడి భాగంలో మీ చందా గడువు ముగిసే నెల వ్రాసి ఉంది. సకాలంలో సొమ్ము చెల్లించి, చందా పొడిగించుకోండి. 'శ్రీరామకృష్ణ ప్రభ' ఆధ్యాత్మిక వెలుగులు మీ ఇంట నిరంతరాయంగా ప్రసరించేలా సహకరించండి.
- మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నింటిలో తప్పనిసరిగా చందా నెంబరు పేర్కొనాల్సిందిగా మనవి.
- మీ చిరునామా మారితే వెంటనే మాకు తెలియపరచి, సహకరించ మనవి.
- పత్రిక ప్రతీ నెల 26వ తేదీన పోస్ట్ అవుతుంది. మీకు పత్రిక 15వ తేదీ లోపు చేరనట్లయితే, వెంటనే మాకు తెలియజేయగలరు.

శ్రీరామకృష్ణ ప్రభ ద్వారా అవిచ్ఛిన్నంగా సేవలు అందించాలన్నదే మా ఆకాంక్ష. అందుకు మీ సహకారం కోరుతూ....

*- సర్క్యులేషన్ మేనేజర్*

ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.
- సంపాదకులు


**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com



# త్రిగుణాలను తొలగించే త్రివిక్రముడు!

'దీపావళి' అంటే దీపాల వరుస. దీపం జ్ఞానానికీ, ఆనందానికీ సంకేతం. మన జీవితంలోని దుఃఖమనే చీకటిని పారద్రోలి, ఆనందమనే వెలుగును నింపాలనే ఉద్దేశంతో జరుపుకొనే పర్వదినం 'దీపావళి'.

'దీపావళి' అనేక దేవీదేవతలతో సంబంధం కలిగి ఉండడం ఓ విశేషం. శ్రీరాముడు అరణ్యవాసం ముగించి తిరిగివచ్చిన సందర్భంలో ఆనందంతో జరిపిన ఉత్సవమనీ, శ్రీకృష్ణుడు సత్యభామ సహాయంతో నరకాసురుణ్ణి సంహరించిన శుభదినమనీ, క్షీరసాగర మథనంలో లక్ష్మీదేవి ఆవిర్భవించిన పవిత్ర దినమనీ, కాళీమాత అవతరించిన కాళరాత్రనీ, బలిచక్రవర్తి దాననిరతికి మెచ్చి జరిపే ఉత్సవమనీ, ఆయన పాతాళ లోకం నుంచి ప్రజల క్షేమాన్ని విచారించడానికి భువిపైకి వచ్చిన దినమనీ-ఇలా అనేక సందర్భాలను పురస్కరించుకొని భారతీయులంతా జరుపుకొనే పర్వదినం 'దీపావళి'.

సాక్షాత్తూ విష్ణుమూర్తి అవతారమైన వామనుడు కీర్తించిన మహోన్నత వ్యక్తి బలిచక్రవర్తి. ఆ దానవరాజు దానగుణానికి వామనుడు సంతృప్తి చెంది, ఈ భువిపై ఆచంద్రార్కం ఆరాధనలు అందుకుంటావని బలిచక్రవర్తిని ఆశీర్వదించాడు. అదే 'దీపాళికోత్సవం' అని శ్రీకృష్ణుడు ధర్మరాజుతో చెప్పినట్లు భవిష్యత్పురాణం ఉత్తర భాగంలో ఉంది. అలాంటి మహాత్ముని జీవిత విశేషాలను పరిశీలిద్దాం.

**భూదేవికి భారం ఎవరు? :** ఏ మహాత్ముని కీర్తిప్రతిష్ఠలైనా చరిత్రపుటల్లో చిరస్థాయిగా నిలిచి ఉన్నాయంటే వారిలోని సత్యసంధత, త్యాగనిరతి, దానగుణం అనే సుగుణ పుష్పాల సౌరభాలే అందుకు కారణం. ఎవరి వ్యక్తిత్వమైతే ఈ సుగుణాలతో విరాజిల్లుతుందో వారు మాత్రమే చిరస్మరణీయులు అనడానికి హరిశ్చంద్ర చక్రవర్తి, శిబి చక్రవర్తి, బలి చక్రవర్తుల జీవితాలే ఉత్తమ నిదర్శనాలు.

వామనుని వలన బలి చక్రవర్తికి వాటిల్లబోయే ఆపదను గ్రహించిన శుక్రాచార్యుడు 'వామన రూపంలో వచ్చినవాడు సాక్షాత్తూ మహావిష్ణువు. అతడు విశ్వరూపం ధరించి ఒక అడుగుతో భూలోకాన్నీ, రెండో అడుగుతో స్వర్గలోకాన్నీ ఆక్రమిస్తాడు. మూడో అడుగు నీ వినాశనానికి దారితీస్తుంది' అని బలి చక్రవర్తిని వారించాడు. అప్పుడు బలి చక్రవర్తి **మేరువు దలక్రిందైనను, బారావారంబు లింక బాతిన లోలో ధారుణి రజమై పోయిన, దారాధ్వము బద్ధమైన దప్పక యిత్తున్... 'యెట్టి దుష్కర్ముని నే భరించెద గాని సత్యహీనుని మోవజాల' ననుచు బలుకదే తల్లి భూదేవి బ్రహ్మతోడ...** (పోతన భాగవతం)

"మేరు పర్వతం తలక్రిందులైనా, సముద్రాలు ఇంకిపోయినా, భూమండలం పొడియైనా, మిన్ను విరిగి మీద పడినా సరే ఆడిన మాట తప్పను. ఎలాంటి చెడు పనుల్ని చేసినవాడినైనా నేను మోయగలను కానీ అసత్యవాదిని భరించలేను" అని భూదేవి బ్రహ్మతో పలికిన మాటల్ని శుక్రాచార్యునికి గుర్తుచేశాడు. కాబట్టి మనం భూదేవికి భారం కాకుండా సత్యనిష్ఠులమై జీవించడానికి ప్రయత్నిద్దాం.

**మోక్షసాధనకు మూడడుగులు:** వామనమూర్తి బలి చక్రవర్తిని కేవలం మూడడుగుల నేల అడగడానికి కారణం ఏమిటని సందేహం వచ్చి పరీక్షిత్తు మహారాజు 'బలిని అంభోరుహనేత్రుడేమి కొరకై పాదత్రయిన్ వేడె?' అని శుక మహర్షిని అడిగాడు.

స్థిరసుఖాసనంలో కూర్చొని జపధ్యాన సాధనలు చేయడానికి మనిషికి కావలసింది మూడడుగుల నేల మాత్రమే. కాబట్టి సాధకుడు మూడడుగుల నేలను సంపాదించి జపధ్యాన సాధనల్ని చేస్తే మోక్షాన్ని పొందవచ్చునని గుర్తుచేయడమే మూడడుగులలోని విశేషం.

**పరమపదానికి చేర్చే త్రిగుణాతీతస్థితి:** మానవుల స్వభావం సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలతో ముడిపడి ఉంది. మనిషి పరమోన్నత స్థితిని పొందాలంటే త్రిగుణాలకు అతీతుడు కావాలి. శ్రీరామకృష్ణ పరమహంస ఈ మూడు గుణాల్నీ ముగ్గురు దొంగలతో పోల్చి చెప్పే కథను ఒకసారి గుర్తుచేసుకుందాం:

(అక్టోబర్ 17, శనివారం - దీపావళి పర్వదినం)

ఒక ధనికుడు అడవి(సంసారం) మార్గంలో నడుచుకుంటూ వెళుతున్నాడు. హఠాత్తుగా ముగ్గురు దొంగలు (మూడు గుణాలు) వచ్చి అతని దగ్గర ఉన్న ధనాన్ని దోచుకున్నారు. ఇతణ్ణి ప్రాణాలతో విడిచిపెడితే ప్రమాదం అని తలచిన ఒక దొంగ (తమోగుణం) ధనికుణ్ణి చంపడానికి సిద్ధమయ్యాడు. అంతలో రెండో దొంగ(రజోగుణం) అడ్డుపడి, 'ఇతణ్ణి చంపకుండా కాళ్ళూచేతులూ కట్టి వదిలేద్దాం' అన్నాడు. అందుకు ఆ ముగ్గురు దొంగలూ అంగీకరించి ఆ ధనికుణ్ణి తాళ్ళతో బంధించి వెళ్ళిపోయారు. కొంతదూరం వెళ్ళాక మూడో దొంగ (సత్త్వగుణం) వెనుకకు తిరిగి వచ్చి, అతడి కట్లు విప్పాడు. తనతోపాటే కొంతదూరం తీసుకువెళ్ళి, ధనికుని ఊరికి దారి చూపించాడు. అప్పుడు ఆ ధనికుడు మూడో దొంగ చేసిన సహాయానికి కృతజ్ఞతలు తెలుపుతూ 'అయ్యా! మీరు నాకు ఎంతో సహాయం చేశారు. దయచేసి మీరు నాతో పాటు మా ఇంటికి వచ్చి ఆతిథ్యం స్వీకరించండి' అని ఆహ్వానించాడు. అందుకు మూడో దొంగ 'అక్కడకు వస్తే రక్షకభటులు నన్ను పట్టుకుంటారు' అని చెప్పి వెనక్కి వెళ్ళిపోయాడు. సత్త్వగుణం మోక్షానికి మార్గం చూపిస్తుంది కానీ మోక్షపదాన్ని చేర్చలేదు. కాబట్టి మనిషి త్రిగుణాలకు అతీతుడైనప్పుడే మోక్షానికి అర్హుడవుతాడు.

బలి చక్రవర్తి ఈ మూడు గుణాలకు అతీతుడై మోక్షపదాన్ని పొందిన తీరును చూద్దాం:

బలి చక్రవర్తి కొలువై ఉన్న నిండు సభలోనికి వామనుడు మెల్లమెల్లగా అడుగులు వేస్తూ ప్రవేశించినప్పుడు బలిచక్రవర్తి ఆ బాలుని దివ్యత్వాన్ని గుర్తించి, భక్తిప్రపత్తులతో వామనుని పాదాలను గంగాజలంతో కడిగి ఆ నీళ్ళను తన తలపై చల్లుకున్నాడు. తమోగుణ ప్రభావంలో ఉన్నవారు ఎదుటి వ్యక్తిలోని విశిష్టతను గుర్తించలేరు. కానీ వామనుణ్ణి చూడగానే ఇతడు సామాన్య బాలుడు కాదని బలిచక్రవర్తి వెంటనే గ్రహించాడు.

రజోగుణం ఉన్న వారి మనస్సు కామక్రోధాలు, రాగద్వేషాలతో నిండి ఉంటుంది. అందువల్ల వారిలో నిత్యానిత్య వివేకం లోపిస్తుంది. కానీ బలి చక్రవర్తి వామనునికి దానం ఇవ్వకుండా శుక్రాచార్యుడు అడ్డుపడినప్పుడు

**కారే రాజులు? రాజ్యముల్ గలుగవే? గర్వోన్నతిం బొందరే?**
**వారేరీ సిరి మూట గట్టుకొని పోవం జాలిరే?..** (పోతన భాగవతం)

'ఆచార్యా! పూర్వం రాజులు ఎంతోమంది రాజ్యాలను పరిపాలించారు. వారెవ్వరూ ఈ సంపదల్ని మూటకట్టుకొని పోలేదు కదా!' అని ఈ ప్రపంచంలో అనిత్యమైన సంపదల కోసం తాపత్రయం ఎందుకని తన విచక్షణా జ్ఞానాన్ని ప్రదర్శించాడు బలి చక్రవర్తి. దీన్నిబట్టి బలి చక్రవర్తి రజోగుణానికి అతీతుడైనాడని మనకు అర్థమవుతుంది.

శ్రీరామకృష్ణులు చెప్పిన కథలోని ధనికునికి దారి చూపించిన మూడో దొంగ సత్త్వగుణం. ధనికుడు తన ఇంటికి వచ్చి ఆతిథ్యం స్వీకరించమన్నప్పుడు రక్షకభటులు తనను బంధిస్తారని చెప్పి తప్పించుకున్నాడు మూడో దొంగ. బలి చక్రవర్తి వామనునికి దానం ఇవ్వడం వల్ల తనకు మరణం తప్పదని తెలిసినా, తనను విష్ణువు బంధిస్తాడని తెలిసినా భయపడకుండా 'బంధించిన వాడే బంధవిముక్తుణ్ణి చేస్తాడు' అని సంపూర్ణ శరణాగతి భావాన్ని ప్రదర్శించి 'నేను' అనే మమకారానికి అతీతుడయ్యాడు.

ఎవరైతే త్రిగుణాలకూ అతీతులవుతారో వారు మోక్షానికి అర్హులని భగవద్గీతలో శ్రీకృష్ణుడు బోధించాడు.



**గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్ ।**
**జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తోఽ మృతమశ్నుతే॥** (గీత– 14.20)

'మానవ జన్మకు కారణాలైన ఈ మూడు గుణాలనూ అతిక్రమించినవాడు జనన, మరణ, వ్యాధుల వల్ల కలిగే దుఃఖాల నుండి విముక్తుడై మోక్షం పొందుతాడు'.

బలిచక్రవర్తి త్రిగుణాలకు అతీతుడవడం వలన త్రివిక్రముడు అతనికి సుఖదుఃఖాలకు అతీతమైన సుతల లోకాన్ని ప్రసాదించాడు. అక్కడ సర్వదా సుదర్శన చక్రం రక్షిస్తుందని అభయమిచ్చాడు.

'సుతలం' అంటే ఉన్నతమైన ప్రదేశం. 'సుదర్శనం' అంటే మంచి దర్శనం. ఉత్కృష్టమైన ప్రదేశంలో సదా భగవంతుణ్ణి దర్శిస్తూ ఆనందాన్ని అనుభవించవచ్చని దాని అర్థం. మనకూ అలాంటి సౌభాగ్యాన్ని ప్రసాదించాల్సిందిగా ఆ త్రివిక్రముణ్ణి ప్రార్థిద్దాం. ❖

# మొండితనం పట్టుదల

– స్వామి సుప్రియానంద

"మా అబ్బాయి మొండి. మాటవినడు. ఈ మొండి తనమెలాపోతుంది?"... ఇది చాలా మంది తల్లితండ్రుల సమస్య. అసలు జీవితంలో ఏదో ఒక సమయంలో ఎవరైనా మొండితనం లేకుండా ఉండగలరా? అంటే అందరూ ఎప్పుడో ఒకప్పుడు మొండివాళ్ళే!

"అనంతశక్తి మనలోనే దాగి ఉంది" అంటారు స్వామి వివేకానంద. సాధారణంగా 'శక్తి' అనగానే మనం 'బలప్రయోగం' అనుకుంటాం. మనలో అంతర్వాహినిలా సంచరించే అనేక శక్తుల గురించి తెలుసుకోవడానికి మనం ప్రయత్నించం. మనలో ముఖ్యంగా మూడు శక్తులున్నాయి. అవి: ఇచ్ఛాశక్తి (desiring), జ్ఞానశక్తి (knowing), క్రియాశక్తి (doing).

ఒకరు మొండిగా వ్యవహరించినప్పుడు వారిలోని ఇచ్ఛాశక్తియే దానికి కారణం. ఈ ఇచ్ఛాశక్తి లేకుండా మనం జీవించలేం. అలాగే మొండితనంతో మనమేమీ సాధించలేం. ఇచ్ఛాశక్తిని జ్ఞానశక్తితో మేళవించినప్పుడు మొండితనం పట్టుదలగా మారుతుంది. ఆ పట్టుదలకు క్రియాశక్తిని జోడించినప్పుడు కార్యదక్షత పొందగలుగుతాం.



ప్రతి మనిషీ తనలో పట్టుదలను పెంపొందించుకోవాలనుకుంటాడు. మొండితనంలో స్వార్థం, రాగద్వేషాలు ఉంటాయి. అవిలేకుండా ఉండేదే 'పట్టుదల'. ఉన్నత మార్గంలో నడిపించేదే పట్టుదల. ప్రహ్లాదుడిలో అతని తండ్రికి మొండితనం మాత్రమే కనిపించింది. కానీ మనకు రాగద్వేషాలు ఇసుమంతైనా లేని ప్రేమ, భగవద్భక్తితో నిండిన పట్టుదల ప్రహ్లాదుడిలో కనబడతాయి. చాలా మంది హరిశ్చంద్రుడు మొండివాడు, అనవసరంగా కష్టాలు కొని తెచ్చుకున్న పిచ్చివాడు అనుకోవచ్చు. కానీ ఆయనలోని సత్యనిష్ఠ అనే 'పట్టుదల' గాంధీజీని ఎలా ప్రభావితం చేసిందో మనకు తెలుసు. ఈ ఆధునిక కాలంలో గాంధీజీని కూడా 'మొండివాడు' అనే వాళ్ళున్నారు. కానీ అది మొండితనమా? పట్టుదలా??

గాంధీజీ రౌండు టేబుల్ సమావేశానికి వెళ్ళినప్పుడు జరిగిన సంఘటన: బ్రిటీష్ రాణి ఎలిజబెత్ –II గాంధీజీని విందుకు ఆహ్వానించింది. గాంధీజీ "ప్రతిరోజూ నా భోజనం సాయంత్రం 7 గంటలకు చేస్తాను. మీ విందు రాత్రి 10 గంటలకు కాబట్టి నేను రాలేను" అని అన్నారు. దానికి బ్రిటీష్ రాణి "ఆ రోజు విందు 7 గంటలకే ఏర్పాటు చేస్తాం"అన్నారు. దానికి గాంధీజీ "మీరు మాంసం, మద్యం సేవిస్తారు, నాకు రెండూ సరిపడవు క్షమించండి. నేను రాలేను" అని బదులిచ్చారు. అందుకు రాణి "విందులో శాఖాహార భోజనమే అందరికీ పెడతాం. మద్యం నిషేధిస్తాం. కాబట్టి తప్పక రాగలరు" అని వర్తమానం పంపారు.

మళ్ళీ గాంధీజీ "రాత్రి భోజనానికి ముందు "రఘుపతి రాఘవ రాజారాం" భజన చేయకుండా ముద్ద ముట్టను. అది మీ విందులో సాధ్యం కాదు కదా!" అన్నారు. అప్పుడు మీ భజన కార్యక్రమానికి మాకెటువంటి అభ్యంతరంలేదని ఆమె చెప్పడంతో, గాంధీజీకి ఒప్పుకోక తప్పలేదు.

దీని ద్వారా గాంధీజీ తన నియమబద్ధ జీవనం కోసం కనబరిచిన 'పట్టుదల' మనకు గోచరిస్తుంది. అంతేకాదు బ్రిటీష్ రాణిలో కూడా గాంధీజీని ఎలాగైనా విందుకు రప్పించాలనే 'పట్టుదల' మనకు కనబడుతుంది. కాబట్టి మొండితనంలో లేని ప్రేమ పట్టుదలలో వ్యక్తమవుతుంది. కాబట్టి మనం మొండితనాన్ని వ్యతిరేకించడం కాదు, దానికి 'ఊర్ధ్వగతి'ని (upwardturn) ఇవ్వడానికి ప్రయత్నించాలి. ❖

# భగవన్నామం ఓ దివ్య ఔషధం

– స్వామి జ్ఞానదానంద



దివ్యనామం గురించి శ్రీరామకృష్ణుల ఉపదేశాన్ని అక్షయ్ సేన్ ఇలా వ్రాశాడు: "ఒక దుష్ట పిశాచం ఆవహించినట్లు, మనిషి మనస్సును అపవిత్ర ఆలోచనలు ఆక్రమించుకొని ఉంటాయి. మనస్సును పవిత్రీకరించడం కోసం విశ్వాసంతో నిరంతరాయంగా భగవన్నామాన్ని జపించాలి. ఇదే అతి సులభమైన మార్గం. శ్రీరామకృష్ణులు పదే పదే ఇలా చెప్పేవారు: 'భగవన్నామంలో అనంతమైన మహిమ ఉంది. నామమే బీజం; నామమే చెట్టు; నామమే పండు. భగవంతుడు తన నామంలోనే నెలకొని ఉంటాడు'. మౌఖిక ఉపదేశాన్ని జనులు అంతగా లక్షించరు. కనుక భగవన్నామ దివ్యౌషధ మహిమను జనులకు తెలియజేయడానికి శ్రీరామకృష్ణులు భగవన్నామాన్ని ఉచ్చరిస్తూ, చప్పట్లు చరుస్తూ నృత్యం చేసేవారు. భగవన్నామ పునరుచ్చరణ ఆయనను సమాధి స్థితికి తీసుకుపోయేటంతగా ఉన్మత్తులయ్యే వారంటే అతిశయోక్తి కాదు. అనేక జన్మల పాటు తీవ్రసాధనలు అనుష్ఠించడం ద్వారా ఒక వ్యక్తి సమాధి స్థితిని సంతరించుకోవచ్చు. అదే సమాధి స్థితిని భగవన్నామ పునశ్చరణ వల్లా సంతరించుకోగలమని శ్రీరామకృష్ణులు ఋజువు చేశారు. 'నారద భక్తి (భగవన్నామ జపం, భగవన్నామ గానం, భగవన్నామ శ్రవణం) కలియుగంలో భగవత్సాక్షాత్కారానికి ఉత్కృష్టమైన సాధన' అని శ్రీరామకృష్ణులు వచించారు.

బిగ్గరగా వినిపిస్తున్న సంగీత ధ్వనిలో ఇద్దరు వ్యక్తుల సంభాషణ వినపడదు. అలాగే బిగ్గరగా గానం చేస్తున్న సంకీర్తనలో లౌకికమైన కోర్కెలు అణగారిపోతాయి. దివ్యనామం కామాన్ని దిగమింగుతుందని చెబుతారు. శ్రీరామకృష్ణులు తమ శిష్యుడైన యోగానందను కామానికి విరుగుడుగా భగవన్నామాన్ని పునరుచ్చరించమన్నారు.

శ్రీరామకృష్ణులు *"జయ గోవింద, జయ గోపాల"; "కేశవ మాధవ దీనదయాళ"; "హరే మురారే గోవింద, వసుదేవకి నందన గోవింద"; "హరే నారాయణ గోవింద హే", "హరే కృష్ణ వాసుదేవ"* అని స్మరిస్తూ నృత్యం చేసేవారని రామ్‌లాల్ చెప్పాడు.

"సాయంత్రం బాగా ప్రొద్దుపోయాక గురుదేవులు 'బ్రహ్మం మాయ – జీవ – జగత్' మంత్రాన్ని పునశ్చరణ చేసేవారు. ఈ మంత్ర స్మరణ చేత భగవత్సాక్షాత్కారాన్ని పొందవచ్చు. 'ఇదొక నిగూఢమైన మంత్రం' అని గురుదేవులు చెప్పారు" అని 'మ' చెప్పేవారు.

శ్రీరామకృష్ణులు బలరామ్ ఇంటిని గానీ, ఇతర భక్తుల ఇళ్ళను గానీ పావనం చేసినప్పుడు భగవన్నామాన్ని స్మరించేవారు. ఆయనను దర్శించుకొన్న భక్తులంతా "జగజ్జనని నామాన్ని ఈ పరమహంసగారు ఎంత చక్కగా పునరుచ్చరిస్తున్నారు. అది హృదయాలలోకి చొచ్చుకుపోతోంది" అని అనేవారు.

శ్రీరామకృష్ణులు ఏకరీతి జీవితాన్ని ఎన్నడూ కోరుకోలేదు. భగవంతునికి అనేక నామాలు ఉన్నాయని వ్యక్తిగత అనుభవాల ద్వారా ఆయన గ్రహించారు. ఒకరోజు దక్షిణేశ్వరంలో గురుదేవులు "గౌర్, గౌర్" (చైతన్యుల పేర్లలో ఒకటి) అంటూ పునశ్చరణ చేస్తున్నారు. అప్పుడు ఎవరో ఇలా అడిగారు: "మహాశయా! మీరు జగజ్జనని నామాన్ని పునశ్చరణ చేస్తారు కదా! ఎందుకు ఇప్పుడు గౌర్ నామాన్ని స్మరిస్తున్నారు?" అందుకు గురుదేవుల జవాబు: "ఏం చెయ్యను? మీకు భార్య, కొడుకు, కూతురు, డబ్బు ఉన్నాయి. కానీ నాకు ఉన్నది ఆ భగవంతుడు ఒక్కడే. కనుక నేను కొన్ని సమయాల్లో గౌర్, కొన్ని సందర్భాలలో అమ్మ, మరికొన్ని సమయాల్లో రామ, కృష్ణ, కాళీ లేక శివ అంటూ స్మరిస్తాను. ఈ రీతిలో కాలం గడుపుతాను".

ప్రాపంచికత అనే రుగ్మతకు భగవన్నామమే ఓ దివ్య ఔషధం. కాబట్టి భగవన్నామ స్మరణతో మన జీవితాలను పునీతం చేసుకొందాం. ❖

# భక్తునిలో విశ్వాసాన్ని పెంచిన భగవంతుడు

శ్రీరామకృష్ణుల ఇంద్రజాలస్పర్శ సుబోధ్‌లో నిద్రాణమై ఉన్న ఆధ్యాత్మికతను మేల్కొల్పింది. ధ్యానం చేయడం మొదలుపెట్టగానే, శరీరమంతా కంపించి, ఒక ప్రవాహం తన వెన్నెముక ద్వారా వేగంగా ప్రవహించి మెదడుకు చేరుతున్న భావన అతడికి కలిగింది. అనిర్వచనీయ ఆనందం అతణ్ణి ముంచి వేసింది. తనలో ఒక వింతకాంతినీ, అందులో వివిధ దేవదేవీ స్వరూపాలు మెరుస్తూ ఉండడాన్నీ గాంచాడు. అతడి ధ్యానం గాఢమై, శరీర స్పృహనూ, బాహ్య చైతన్యాన్నీ కోల్పోయాడు. అతడు తిరిగి చైతన్యం పొందేసరికి గురుదేవులు తన శరీరాన్ని తల నుండి క్రిందకు నిమురుతూ కనిపించారు. ఆయన, "నువ్వు ఇంటివద్ద ధ్యానం చేసేవాడివా?" అని ప్రశ్నించారు. ఆ కుర్రవాడు, "చాలా కొద్దిగానండీ! మా అమ్మ చెప్పిన దేవుళ్ళు, దేవతల గురించి కొద్దిగా ఆలోచించేవాడిని" అన్నాడు. "ఆహా! అందుచేతనే అంత సులభంగా ఏకాగ్రతను పొందగలిగావు" అని గురుదేవులు అన్నారు.



స్వామి సుబోధానంద

ఆయన సుబోధ్‌తో జపం, ధ్యానం, బ్రహ్మచర్యాలను గురించి మాట్లాడేవారు. అతడి భక్తి విశ్వాసాలను పరీక్షించే వారు. ఒకసారి గురుదేవులు, సుబోధ్ శరీరాన్ని తాకి అతడితో "ఈ రోజున నీ మనస్సు నుండి కామాన్ని తొలగించాను" అని చెప్పారు.

సుబోధ్ మొదట్లో గురుదేవులు భగవదవతారమని అంగీకరించలేదు. ఒకరోజు గురుదేవులు అతణ్ణి, "నా గురించి నువ్వేమనుకుంటున్నావు?" అని అడిగారు. "జనం మీ గురించి రకరకాల విషయాలు చెప్పారు. అయితే స్పష్టమైన ఋజువు కనబడితే తప్ప నేను అవి ఏవీ నమ్మను" అని సుబోధ్ అన్నాడు. అహంకార రహితులైన గురుదేవులు ఇది విని, "మంచిది. పాత నాణాలకు క్రొత్త నాణాలనిచ్చేవాడు నాణాన్ని పరీక్షించిన విధంగానే, నన్ను పరీక్షించాకే అంగీకరించు" అన్నారు.

సుబోధానంద స్వామిగా పేరొందిన సుబోధ్ చాలా సంవత్సరాల తరువాత శ్రీరామకృష్ణులు, శ్రీ శారదామాతల గురించి ఒక ఉత్తరంలో, "వారంతట వారు తమను తెలియబరచుకోనిదే వారిని గుర్తించడం ఎవరికి సాధ్యం?" అని వ్రాశారు. గురుదేవులతో సుబోధ్ సన్నిహితమయ్యే కొద్దీ శ్రీరామకృష్ణుల దైవత్వం పట్ల అతడికున్న విశ్వాసం క్రమంగా బలపడింది. ఒకరోజు గురుదేవులు, సుబోధ్‌తో ధ్యానం చెయ్యమని చెప్పారు. అతడు, "అయ్యా! నేను ధ్యానం అభ్యసించ వలసి ఉంటే, మీ వద్దకు ఎందుకు రావాలి? వేరే గురువు వద్దకు వెళ్ళవచ్చు కదా!" అని జవాబిచ్చాడు. అతడి మనోగతాన్ని అర్థం చేసుకొన్న గురుదేవులు, "సరే! నువ్వు ధ్యానం చేయనవసరం లేదు. కానీ ఉదయం, సాయంత్రం నా గురించి ఆలోచించు" అన్నారు.

శ్రీరామకృష్ణులు తన ఆధ్యాత్మిక జీవనయాత్రలో ఎదుర్కొన్న కష్టాలను గురించి సుబోధ్‌తో ఇలా చెప్పారు: "నా సాధనల కాలంలో నేను దైవోన్మత్త స్థితిలో ఉండేవాణ్ణి. ఒకరోజు దక్షిణేశ్వరంలోని పంచవటిలో కూర్చొని గడ్డి ఏరుతున్నాను. నా దృష్టిని ఆకర్షించడానికి ప్రయత్నిస్తూ ఒక అందమైన యువతి వచ్చి నా వెనుక నిలబడింది. నాకు ఆమె ఉనికే తెలియలేదు. చాలాసేపు వేచి ఉన్న తరువాత, ఆమె నువ్వు అద్భుతమైన వైరాగ్యం కలిగిన సన్న్యాసివి. నువ్వు నా వైపు ఒక్కసారి కూడా చూడలేదు" అంది.

ఈ సంఘటన విన్న సుబోధ్ గురుదేవుల పట్ల సంపూర్ణ భక్తివిశ్వాసాలను పెంపొందించుకొని తన ఆధ్యాత్మిక జీవితాన్ని కొనసాగించాడు. ❖

(అక్టోబర్ 30, శుక్రవారం - శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన స్వామి సుబోధానంద జయంతి)



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -28

## మహరాజ్ మాటతో మారిన మనిషి

కలకత్తా నగరంలో ఒక వీధిలో ఆరడుగుల పొడవుగల, సన్నగా ఉండే ఒక వ్యక్తి ఉండేవాడు. కుస్తీలు పట్టడం, అటూ ఇటూ తిరగడం తప్ప ఏ పనీ చేసేవాడు కాదు. తాత తండ్రులు ఇచ్చిన ఇల్లు ఒకటి ఉండేది. దానికి వచ్చే అద్దెతో ఇల్లు గడిచేది. రోజంతా జూదం, పేక ఆడడంలోనూ, గూండాగిరీతోనూ గడిచేది. వివాహం కాలేదు. ముసలి తల్లి ఉంది. పెద్దగా బాధ్యతలు లేవు. మాటిమాటికీ కోపం తెచ్చుకుని ఎదుటివారిని కొట్టేవాడు. ఎన్నిమార్లో జైలుకి వెళ్ళాడు. ఏదో రకంగా ప్రతీసారీ బయటికి వచ్చేవాడు. జైలు నుంచి విడుదల అయ్యాక అతణ్ణి జైలుకు పంపినవాడి పని పట్టేవాడు.

ఒకసారి ఆ వీధిలో కాళీపూజ జరుగుతోంది. పూజ నిర్వహిస్తున్న వారిలో చాలా మందికి స్వామీజీతో పరిచయం ఉంది. కాళీపూజ సందర్భంలో నారాయణసేవ (అంటే బీద వాళ్ళకు భోజనాలు పెట్టే ఏర్పాటు) కూడా జరుగుతోంది. ఆ పూజకు స్వామి జపానందజీని కూడా ఆహ్వానించారు. స్వామి సమయానికి అక్కడకు చేరుకున్నారు. కాళీపూజ రాత్రి అంతా జరుగుతుంది. నిర్వాహకులలో ఒక పెద్దమనిషి వచ్చి జపానందజీతో "చూడండి, ఎదురుగా నిల్చొని ఉన్న పొడుగు మనిషి నుంచి కాళీమాత అందరినీ రక్షించాలి. అతను మాటిమాటికీ అందరితోనూ గొడవ పెట్టుకుంటాడు. అందరూ అతనంటే భయపడతారు. రాత్రంతా పూజ జరుగుతుంది కదా! యువకులు సరదాగా గడుపుతారు. ఎవరైనా అతనితో గొడవ పడితే అంతే! వాళ్ళ పని అయిపోయినట్లే" అన్నాడు.

స్వామి ఇదంతా విని భయపడ్డారు. 'అలా జరిగితే అందరికీ ఇబ్బంది కలుగుతుంది కదా!' అని కొంచెం ఆలోచించి అతణ్ణి పిలిచి మంచి మాటలతో ఇలా నచ్చచెప్పారు: "పూజా కార్యక్రమంలో ఏ విధమైన ఇబ్బందీ రాకుండా మీరు జాగ్రత్త తీసుకోండి. చాలామంది యువకులు ఉన్నారు. ఎక్కడైనా, ఏదైనా గొడవ జరిగితే వాళ్ళకు మీరు సర్ది చెప్పండి. మీరు అందరికీ తెలుసు. మీరు పూచీ వహిస్తే కార్యక్రమం ప్రశాంతంగా పరిసమాప్త మవుతుంది". స్వామి మాటలతో అతనికి విషయం తెలిసిపోయింది. సన్యాసి ఆ పని తనకే ఎందుకు అప్పచెబుతున్నారో అర్థమైంది. చిరునవ్వు నవ్వుతూ "మీరు నిశ్చింతగా ఉండండి. నా వల్ల ఎవరికీ ఏ విధమైన ఇబ్బందీ కలగదు" అన్నాడు. అతను మాట ఇచ్చాడంటే ఆ మాటకు కట్టుబడి ఉంటాడని అందరికీ తెలుసు. ఉదయం పూజ అయిపోయాక ప్రసాదం తీసుకుని అందరూ వెళ్ళిపోయారు. రాత్రి ఆ పొడవు వ్యక్తి ఎక్కడికో వెళ్ళి వచ్చాడు. కార్యక్రమం అంతా బాగా జరిగిపోయింది.

మర్నాడు పోలీసులు ఆ పొడుగాటి వ్యక్తిని వెతుక్కుంటూ వచ్చారు. ఎందుకని ఎవరో అడిగితే, రాత్రి అతను ఒక వ్యక్తి చెవి కోసేశాడని చెప్పారు. "నిన్న పగలంతా అతను ప్రశాంతంగా ఇక్కడే ఉన్నాడు. మధ్యలో ఒక్కసారి మాత్రం ఎక్కడికో వెళ్ళి వచ్చాడు. ఏం చేశాడో? ఎక్కడికి వెళ్ళాడో?" అని ఎవరో చెప్పారు. సాయంత్రం ఆ పొడుగాటి వ్యక్తి అక్కడికి వచ్చాడు. "మీరు వెళ్ళిపోయిన తరువాత మీ కోసం పోలీసులు వచ్చారు. ఎవరిదో చెవి కోశారట. నిజమేనా?" అని స్వామి జపానంద అన్నారు. "అవును మహరాజ్! నిజమే. రాత్రి నేను మా ఇంటికి వెళ్ళాను. అటు నుంచి ఒక బలిష్ఠమైన వ్యక్తి మా వీధిలో కనపడితే అతను



ఎవరో, ఎందుకు మా వీధిలో తిరుగుతున్నాడోనని అడిగితే 'నా ఇష్టం! నేను నాకు కావలసిన వీధిలో తిరుగుతాను' అన్నాడు. అతని మాటలు విని, నాకు కోపం వచ్చింది. అతని చెవి కోసేశాను. ఇలాంటి గొడవలు నాకు చాలామందితో అయ్యాయి. పోలీసులకు తెలుసు. నాలుగు రోజులు నన్ను వెతుకుతారంతే" అన్నాడు.

ఈ మనిషితో ఈ విషయం గురించి ఏమీ మాట్లాడకుండా వేరే విషయాలు మాట్లాడడం మంచిది అని అనుకుని "అయ్యా! మీరు ఏదైనా ఉద్యోగం కానీ, వ్యాపారం గానీ చెయ్యరా?" అని అడిగారు. ఆ వ్యక్తి, "లేదు. మా తాతలు, తండ్రి ఇచ్చిన ఒక

ఇల్లు ఉంది. దానికి అద్దె వస్తుంది. నేను, నా తల్లి ఇద్దరమే ఉంటాం. అలా వచ్చిన దానితో మా జీవితం గడిచిపోతుంది" అన్నాడు. "అంటే మీకు ఎలా కావాలంటే అలా మీ సమయం గడుపుతారన్నమాట. చూడండి! మీ వీధిలో చాలామంది బీదవాళ్ళు ఉన్నారు. వాళ్ళు చాలా కష్టపడి సంపాదించుకుని బతుకుతున్నారు. అనారోగ్యం వస్తే చాలా ఇబ్బంది పడిపోతారు. చికిత్స కోసం వైద్యుడి దగ్గరకు వెళితే చాలా సమయం నిరీక్షించవలసి ఉంటుంది. పైగా వైద్యులు వాళ్ళను సరిగ్గా చూడరు. బీదవాళ్ళ మీద చిన్న చూపు. పూర్వం మన దేశంలో బీద ఇంట్లో పుట్టడం ఒక పాపం అనుకునే వారు కాదు. కానీ విదేశీ సంప్రదాయం వచ్చాక బీదరికం కూడా ఒక తప్పు కిందే పరిగణింపబడుతోంది. అందువల్ల మీరు రోగులకూ, అసహాయులైన వాళ్ళకూ కొంచెం సాయం చేస్తూ ఉండండి. వాళ్ళ పట్ల మీరు సహానుభూతి చూపిస్తే, వాళ్ళు మీ మేలు మర్చిపోరు. సదా మీరంటే కృతజ్ఞులై ఉంటారు. మిమ్మల్ని దైవంగా భావిస్తారు. దాని కోసం మీరేమీ ఖర్చు పెట్టనక్కరలేదు. స్వామి వివేకానంద 'మానవసేవే మాధవ సేవ' అని చెప్పారు. అందుకని మీ దగ్గరకు వచ్చిన పేదవారికి సేవ చేస్తే చాలా బాగుంటుంది. మీలో సమర్థత ఉంది. ఆ వైపు మీ దృష్టి సారిస్తే అందరికీ మంచి జరుగుతుంది" అని చెప్పారు.

అంతా విన్న ఆ వ్యక్తి, "అవును. ఈ పని నేను చాలా సులువుగా చెయ్యగలను. మా వీధిలోనే వైద్యుడు ఉన్నాడు. అతని దగ్గరకు నేను అవసరం ఉన్నవాళ్ళను తీసుకెళ్ళగలను. ఇవాళ్టి నుంచి నేను ఈ పని చేస్తానని మీకు మాట ఇస్తున్నాను. ఈనాటి వరకూ ఈ విషయాలు నాకు ఎవరూ చెప్పలేదు. నేను ఇప్పుడు ఏం చెయ్యాలో నాకు బాగా అర్థమైంది" అన్నాడు.

అందుకు సన్యాసి, "మంచిది. ఈ పని మీరు బాగా చేస్తారని నాకు నమ్మకం ఉంది. ఉదయం, సాయంకాలం మీరు వీధిలో అటూ ఇటూ తిరుగుతారు కదా అందరినీ చూసుకోండి. అవసరమైన సహాయం చెయ్యండి. మిమ్మల్ని చూసి మిగతావాళ్ళు కూడా నేర్చుకుంటారు" అన్నారు. ఆ వ్యక్తి అంతా విని, "అలాగే! నేను సంతోషంగా ఈ పని చేస్తాను. మా వీధిలో అందరూ నన్ను ఎరుగుదురు. వారికి సేవ చేయడం నాకు సమ్మతమే" అన్నాడు.

చాలా కాలం తరువాత స్వామి జపానంద మళ్ళీ ఆ వీధికి వెళ్ళారు. అక్కడ ఆయన పరిచితులు "స్వామీజీ! ఆ మోసగాడు ఇప్పుడు బస్తీవాళ్ళందరికీ దేవుడి లాంటి వాడయ్యాడు. ఎవరైనా అనారోగ్యంతో బాధ పడుతున్నారని తెలియగానే అర్ధరాత్రి అయినా సరే వైద్యుణ్ణి పిలిచి, రోగికి చికిత్స జరిగే ఏర్పాటు చేస్తున్నాడు. వైద్యుడు కూడా డబ్బు కోసం ఆలోచించకుండా పిలవగానే వెంటనే వెళుతున్నాడు. అతని వల్ల పేదవాళ్ళందరికీ మంచి జరుగుతోంది. ఎవరైనా చనిపోతే వారికి అంతిమ సంస్కారం చేసే ఏర్పాట్లు కూడా అతనే చేస్తున్నాడు" అని చెప్పారు.

స్వామీజీ వచ్చారన్న వార్త వినగానే అతను సంతోషంగా వచ్చి నమస్కారం చేసి, వినమ్రంగా కూర్చున్నాడు. స్వామీజీ అతణ్ణి ఆశీర్వదించి, "అన్ని సంగతులూ విన్నాను. నాకు ఇవాళ చాలా ఆనందంగా ఉంది. మీరు చాలా మంచివారు" అన్నారు. ఆ వ్యక్తి వినయంగా, "మీరే నాకు మానవత్వం" అంటే ఏమిటో చెప్పారు. నేను మీ ఋణం ఎప్పటికీ తీర్చుకోలేను. ఈ విధంగా జీవించడంలో ఆనందం ఉంది. పరుల సేవలో తరించేలా నన్ను ఆశీర్వదించండి" అన్నాడు. ❖ **అనువాదం: శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**

# భువిపై వెలసిన భవతారిణి

***ముఖచిత్ర కథనం :***

రాణి రాస్మణి కాశీవిశ్వనాథుణ్ణి దర్శించాలని 1847లో కాశీ యాత్రకు సిద్ధమైంది. ఇక మరుసటి రోజు బయలు దేరవలసి ఉందనగా ముందురోజు రాత్రి కాళీమాత ఆమెకు కలలో దర్శనమిచ్చి "కాశీకి పోనవసరం లేదు. భాగీరథీ తీరాన ఒక చక్కని ప్రదేశంలో నా శిలావిగ్రహాన్ని ప్రతిష్ఠించి, పూజతో పాటు అన్న నైవేద్యాలను ఏర్పాటు చెయ్యి, అదే చాలు. నే నా విగ్రహంలో అభివ్యక్తమై నిత్యం నీ సేవాదులు స్వీకరిస్తాను"అని ఆదేశించింది. దాంతో ఆమె పరమానంద భరితురాలై వెంటనే కాశీయాత్ర మానుకొని దేవీ ఆలయ నిర్మాణానికి సంకల్పించింది.

ఈ విధంగా జగజ్జనని మీద ఎంతో కాలం నుంచి ఉన్న దైవభక్తి ఇప్పుడు ఆమెను గంగానదీ తీరంలో ఒక విశాలమైన స్థలం కొనుగోలుచేసి, పెద్దమొత్తంలో ధనం వెచ్చించి తొమ్మిది గోపురాలతో కూడిన పెద్ద ఆలయం, చిన్న దేవాలయాలు, అలాగే ఒక చక్కని పూలతోట నిర్మాణానికి ఉపక్రమింప చేసింది. 1855వ సంవత్సరం మే 31వ తేదీ గురువారం స్నానయాత్ర పండుగ దినాన ఆలయంలో జగన్మాత ప్రతిష్ఠాపనోత్సవం జరిగింది.

శ్రీరామకృష్ణులు ఉపాసించి, దర్శించి, సంభాషించిన జగన్మాత ఈ భువిపై నడయాడిన పరమపుణ్య క్షేత్రం కలకత్తాలోని దక్షిణేశ్వర భవతారిణీ కాళికాలయం.

ఈ దేవాలయంలో దీపావళి అమావాస్య రోజున రాత్రంతా 'కాళీపూజ' జరుగుతుంది. ఈ పూజా కార్యక్రమంలో వేలాది మంది భక్తులు పాల్గొంటారు. ❖



# దేవీ వైభవం

ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ**      విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

(...గత సంచిక తరువాయి)

ప్రకృతి శక్తులకి నియామకులు దేవతలు. కనుక ప్రకృతి అంతా క్షేమంగా ఉండి జగతి చక్కగా నడపబడాలి అంటే దేవతలు పని చెయ్యాలి. దేవకార్యానికి అడ్డువచ్చేటటువంటివి ఆసురీ శక్తులు. వీళ్ళ వల్ల లోకానికి క్షేమం కాదు. లోకరక్షకి అయిన జగదంబిక దేవకార్య సముద్యతా– అంటే లోక రక్షణమే దేవకార్యం. లోక రక్షణ కోసం అమ్మవారు వచ్చింది. అంతేకానీ దేవతలు అనే ఒక శక్తిని కాపాడడానికి కాదు. విష్ణుమూర్తిని దేవపక్షపాతి అంటాం. విష్ణువు – వైష్ణవి వీళ్ళిద్దరూ ఒకటే తత్త్వం. దైవీ శక్తుల్ని రక్షించి లోకాన్ని కాపాడడానికి వచ్చారు అమ్మవారు; భండాసుర సంహారం చెయ్యడానికి లలితగా వచ్చింది; అటు మహిషాసుర సంహారం చేసింది. మహిషాసుర సంహారం, శుంభనిశుంభుల సంహారంలో రెండు రహస్యాలున్నాయి.

మహిషాసుర మర్దనం చేసేటప్పుడు అమ్మవారిని దేవతలందరూ ఆశ్రయించారు. కానీ ఆ ఆశ్రయ విధానం వేరేగా ఉంటుంది. ఎలాగంటే వీళ్ళందరూ బ్రహ్మదేముడి దగ్గరకు వెళ్తే బ్రహ్మాది దేవతలందరూ శివుని వద్దకు వెళతారు. అప్పుడు శివునికి కోపం వచ్చి భృకుటి ముడిపడుతుంది. భృకుటి ముడిపడగానే ఆ పరమశివుడిలో ఉన్న చండమైన తేజస్సు బయటకి వచ్చిందట. శివునికి కోపం వచ్చిన వెంటనే పక్కనే ఉన్న విష్ణువుకి కోపం వచ్చింది. ఆయన కనుబొమల ముడిలోంచి ఒక తేజస్సు వచ్చి అక్కడున్న తేజస్సుతో కలిసింది. ఆ తరువాత బ్రహ్మగారి తేజస్సు. ఇలాగ దేవతలందరి తేజస్సు అక్కడ ఉన్న ఆ మహాతేజస్సులో కలిసి 18చేతుల మహాకారంగా ఆవిర్భవించిందట. అలాగ ఆవిర్భవించిన స్వరూపంలో జుట్టులో ఏ దేవత ఉన్నదో, కనుబొమలలో ఏ దేవత ఉన్నదో, లలాటంలో ఏ దేవత ఉన్నదో... (లలితా స్వరూపాన్ని వర్ణించేటప్పుడు ఏవి చెప్పుకున్నామో) అన్నీ వర్ణిస్తాడు వ్యాసదేముడు. ఇందులో అంతరార్థం ఏమిటంటే అందరూ తలొక శక్తీ ధారపోస్తే ఒక మహాశక్తి అయింది అని కాదు; ఏ మహాశక్తి నుంచి వీళ్ళందరూ అంశాలుగా తెచ్చుకుని చలామణీ అవుతున్నారో వాళ్ళ అంశ శక్తులన్నీ ఆ తల్లే అని తెలుసుకుని ఉపాసన చేశారు. భిన్న భిన్నాలలో అంతటా ఉన్న ఏకత్వశక్తి ఏదుందో అది అనే తత్త్వమే అక్కడ ప్రతిపాదన జరుగుతోంది. అలాగ సర్వదేవతామయమైన ఆకారం ఆవిర్భవించింది. అమ్మ ఎప్పుడు ఆవిర్భవించినా, ఏ రూపంలో వచ్చినా ఆవిడ సర్వదేవమయి అని తెలుస్తోంది. ఒక్క అమ్మకి కానీ మనం నమస్కరిస్తే సర్వ దేవతలకీ నమస్కరించినట్లే. ఇది మహిషాసుర మర్దన సమయంలో జరిగిన కథ.

శుంభ– నిశుంభ సంహారం రెండవకథ. అప్పుడు అందరూ గౌరీదేవిని ఆశ్రయించారు. శుంభనిశుంభ సంహారానికి వెళ్ళినపుడు మొదట అమ్మ ఏకగా కనపడి ఒక్క రూపంతో తిరుగుతోందట. అప్పుడు చండముండులనే అసురులు (శుంభనిశుంభుల బంట్లు) అమ్మ వారిని చూసి ఒక స్త్రీ రత్నాన్ని చూశాం అన్నారట. వాళ్ళు రాక్షసులైనా ప్రభుభక్తి పరాయణులు. 'సృష్టిలోని మంచి వస్తువులన్నీ మన దగ్గర ఉండాలి' అనుకోవడం రాక్షస ప్రవృత్తి. ఆక్రమణ బుద్ధి, అపహరించడం, హింసించడం– ఇది రాక్షస ప్రవృత్తి.

మన రాజుగారికి ఆమెని అప్పగిస్తే మనం ప్రభు భక్తిని రుజువు చేసుకున్న వాళ్ళమవుతాం అనుకుని "నువ్వు మా ప్రభువుల్ని చేపట్టు" అని జగదంబికని అడిగారు. ఆ తల్లి వచ్చిందే వాళ్ళ పని పట్టడానికి! ఆమె "మీరు చెప్పినది బాగుంది. కానీ నాకొక వ్రతం ఉన్నది; అదేమిటంటే యుద్ధంలో నన్నెవరు జయిస్తారో వారినే చేపడతాను అని. నేను ఆ మాటకి కట్టుబడిపోయాను. అందుకు ఎంత గొప్పవాడైనా మీ రాజు నాతో యుద్ధం చెయ్యవల్సిందే" అన్నది. చండముండులు వెళ్ళి ఈ మాట చెప్పగానే ఆయన హుంకరించి "ఎంత పొగరు ఆమెకు" అని ధూమ్రాక్షుడు అనే రాక్షసుణ్ణి అమ్మపైకి యుద్ధానికి పంపాడు. ఈ రాక్షసుల పేర్లన్నీ మనలో ఉన్న రజోగుణ, తమోగుణ ప్రవృత్తుల పేర్లు. పురాణాలన్నిటిలోనూ జంట రాక్షసులే. అవే రజోగుణ తమోగుణాలు. వాటిని సంహరించి సాత్వికమైన శుద్ధసత్త్వాన్ని

మనం అభివృద్ధి చేసుకుంటే అమ్మవారి రక్షణ లభిస్తుంది అని ఆంతర్యం. అదే రామాయణ, భారత భాగవతాదుల ప్రయోజనం. ఒక్కోసారి ఒక్కడే కనిపిస్తాడు. వాడిలోనే రెండు ప్రవృత్తులూ కలిసి పోతాయి. ఉదా: మహిషాసురుడు. మహిషం అంటే దున్నపోతు... పూర్ణ తమోగుణం. దానికితోడు అసుర జత అయింది, ఇది తీవ్ర రజోగుణం. ఈ రెండూ దెబ్బతింటే గాని అసలుది లభించదు. మనలోని రెండు ఆసురీప్రవృత్తులు సంహరింపబడితేనే జ్ఞానమో, భక్తో కనిపిస్తుంది. అందుకు మనం రామాయణం పారాయణ చెయ్యాలి. నిత్యం చండీసప్తశతి పారాయణ చెయ్యాలి. అలాగే



ఈ లోకంలో ఆసురీ ప్రవృత్తులు విజృంభించినప్పుడు అమ్మ వారిని ఆశ్రయిస్తే లోకంలో ఉన్న రజోగుణ తమోగుణాలని సంహరిస్తుంది. అందుకు మనలో ఉన్న మహిషాసుర ప్రవృత్తిని, బయట ఉన్న మహిషాసుర ప్రవృత్తిని కూడా సంహరింపచేయమని మనం అమ్మని పిలవాలి.

ధూమ్రాక్షుడు అంటే పొగ (చూరిన) కళ్ళవాడు అని అర్థం. అంటే వాడి కళ్ళలో తేజస్సు లేదు. పొగ ఉంది. (పేరులోనే తమోగుణం తెలుస్తున్నది ఇక్కడ) అతను వెళ్ళేటప్పటికి అమ్మవారు హిమపర్వత శిఖరం మీద శోభిస్తున్నారు. 'ఏకా' అంటే ఒక్కరే ఉన్నారు. (ఆ ఘట్టంలో వ్యాసదేవుడు మాటిమాటికీ ఏకా ఏకా అంటూ చూపిస్తారు. జాగ్రత్తగా చూస్తే బ్రహ్మవిద్య మంత్రాలు ఒక్కొక్క శ్లోకంలో కనిపిస్తాయి). ఆ తల్లిని చూసి ధూమ్రాక్షుడు యుద్ధానికి సిద్ధపడి దుముకబోతూ ఉంటే హుంకరించి ఎర్రగా చూసిందట అమ్మవారు. ఆవిడ హుంకారం చేత ధూమ్రాక్షుడు, అతని సైన్యం మొత్తం భస్మీపటలం అయిపోయారట. హుంకారం అంటే అమ్మయొక్క నాద స్వరూపం; ఆ నాదస్వరూపం వల్ల అజ్ఞానమనే పొగ అంతా చెదిరిపోయింది.

అప్పుడు చండముండులు ఇంకా అనేక మంది సైన్యంతో బయల్దేరి వచ్చారు. వాళ్ళిద్దరితో యుద్ధం జరిగినప్పుడు అమ్మ వారు కోపంగా చూశారు. వెంటనే అమ్మ భృకుటి నుండి నల్లని స్వరూపం ఒకటి ఆవిర్భవించిందట. ఆ తల్లి మహాకాళి. ఆమె చండ ముండుల్ని సంహరించి ఇద్దరితలలూ పట్టుకొచ్చిందట. ఆమె వెళ్ళేటప్పుడు తోవలో రథభట తురగ పదాతి బలాలన్నీ అమ్మవారి మీదకి దాడిచేశాయట. ఆమె వెళుతూ వాటిని చేతులతో పట్టుకుని నోటిలో వేసుకుంటూ వెళ్ళిపోయిందట. సృష్టి యొక్క అనంతత్వాన్ని తలచుకుంటే భయం, తలచుకోకుంటే అజ్ఞానం. కానీ అనంతకాలం, అనంత దేశం... ఏమిటిది అనుకుంటే మహాభయానికి లోనవుతాం. ఆ భయం నుండి మనని జాగృత పరచడానికి ఏ అనంత చైతన్యమున్నదో ఆ అనంత చైతన్యమే అంతటా ఉంది అని చెప్పారు భారతీయ మహర్షులు. అనంత వ్యాపకమైన చైతన్యమే ఒక చిన్న అణువులో కూడా ఉన్నదని చెప్పారు. అలాగ అనంత వ్యాపకమైన కాలశక్తే కాళి. ఇప్పటికి కాలం ఎన్ని తిన్నదో! కాల గర్భంలో ఎన్ని వెళ్ళిపోయాయో, ఇప్పటికీ అంతుపట్టదు. కాలం యొక్క అనంతత్వం ఎంత అని మనకేం తెలుసు?. "ఎన్ని కల్పాలు జరిగాయి అమ్మా" అని అడిగితే ఆమె తన మెడలో ఉన్న మాలను చూపించి లెక్కపెట్టుకో అన్నారట. ఆ మాల ఏమిటి అంటే పుర్రెల దండ. ఒక్కొక్క పుర్రె ఒక్కొక్క బ్రహ్మదట. ఒక్కొక్క బ్రహ్మ ఆయువు నూరు కల్పాలు. బ్రహ్మలు ఎందరు వెళ్ళారో లెక్కపెట్టుకో అని మాల ఇచ్చింది. మాల అంటే అంతులేనిది అని, అంటే ఆద్యంతరహితం అని. ఆ కాలంలోకి అలా ఎంతమంది వెళ్ళిపోయారో లెక్క లేదు. ఎన్ని వెళ్ళిపోయాయో! అన్నీ కబళించి వెళ్ళింది. అందుకే "మహాకాళీ మహాగ్రాసా మహాసనా" అన్నది లలితా సహస్రం.

ప్రళయకాలంలో అమ్మవారు మొత్తం జగతిని భక్షిస్తుందట. ప్రళయకాలంలోనే కాళి ఉన్నదా అంటే ప్రతీక్షణంలోనూ కాళి ఉన్నది. క్షణం ఇలా జరగగానే అలా కబళిస్తున్నది. అలాగ కబళించే లక్షణం కలది కాలం. అంతుపట్టని అనేక రహస్యాలు ఈ స్వరూపంలో కనిపిస్తాయి. ❖ **సశేషం**

ధీరవాణి

- స్వామి వివేకానంద

# ఆత్మారాముడివై జీవించు



ఆత్మలోనే నిష్ఠుడవవు. అప్పుడే నిజమైన విశ్వప్రేమ కలుగుతుంది. అత్యున్నత వైఖరి పాటించు; సర్వగతమైన మన స్వభావాన్ని గ్రహించి, ప్రపంచమనే సర్వ దిగ్దర్శక చిత్రాన్ని పరిపూర్ణ శాంతితో చూడాలి. సంసారం శిశుక్రీడ; మనకిది తెలుసు, కాబట్టి దీని వల్ల కలవరపడం. భూషణ చేత మనస్సుకు ప్రీతి ఏర్పడితే దూషణ చేత అప్రీతి కలుగుతుంది. ఇంద్రియాల వల్ల కలిగే సుఖం క్షణికం.

సృష్టిలో మనకు ప్రవేశం కలుగగానే మనకది సజీవమవుతుంది. స్వతస్సిద్ధంగా విషయాలు ప్రాణ రహితాలు, మనమే వాటికి ప్రాణం పోస్తున్నాం, అప్పుడు మనం మూర్ఖుల మాదిరి వాటిని చూసి భయపడుతూ ఉంటాం, లేదా వాటిని అనుభవిస్తుంటాం. సంత నుంచి ఇంటికి పోతూ, దారిలో గాలివానకు గురై ఒక పుష్పలావికుని ఇల్లు చేరిన బెస్తపడుచుల మాదిరి వర్తించకు. వారికి ఆతడు తన పూతోటకు పక్కనున్న గదిలో నాటి రాత్రి పడుకోవటానికి తావిచ్చాడు. అక్కడి వాతావరణం పువ్వుల సువాసనతో ఘుమఘుమ లాడుతూంటే, దాని వల్ల బెస్త పడుచులకు నిద్ర పట్టలేదు. చిట్టచివరకు వారు తమ చేపల బుట్టల మీద నీళ్ళు చల్లి, తమ తలల వద్ద పెట్టుకొన్నారు. అప్పుడు వారికి గాఢనిద్ర పట్టింది.

సంసారమే మన చేపల బుట్ట. భోగార్థం మనం దానిపై ఆధారపడకూడదు. అలా ఆధారపడేవారు తామసికులు, సంసారబద్ధులు. వీరి తరువాత గణింపదగ్గవారు రాజసికులు. ఎంతసేపూ 'నేను, నేను' అని పలుకుతూ వీరు అహంభావ పూరితులై ఉంటారు. ఒక్కోసారి వీరు సత్కర్మ చేస్తూ ఉంటారు. తన్మూలంగా వీరు పారమార్థికులు కావచ్చు. కానీ అంతర్ముఖులై, ఆత్మారాములై ఉండే వారు ఉత్తమోత్తములు, వీరే సాత్త్వికులు. ❖




- యల్.రాధాకృష్ణ, కడప

**? : భక్తునిపై 'మాయ' ప్రభావం ఎలా ఉంటుంది? 'మాయ' అంటే ఏమిటి?**

✍: మాయ దైవీ శక్తి. భగవంతుని నుండే వచ్చింది. ఆయన అధీనంలో ఉంటుంది. మాయను దాటడం చాలా కష్టం. భగవంతుణ్ణి ఆశ్రయించిన వారే దాన్ని దాటగలరు. "ఎవరైతే నన్నే శరణాగతితో వేడుకుంటారో వారిని తరింపజేస్తాను" అని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో (7-14) హితవు పలికాడు.

***దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా,***
***మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే ॥***

'యదా' 'మా' ఏది లేదో అదే మాయ అంటారు శ్రీరామకృష్ణులు: నేనూ, నా వారు, భార్య, భర్త, పిల్లలు అనుకోవడం మాయ. అందరూ తనవారే అనుకొని వారికి సహాయం చేయడం దయ అంటారు. వేదాంత పరిభాషలో దీన్ని **అనిర్వచనీయం** అంటారు.

భగవంతుణ్ణి మరిపింపజేసి ఈ ప్రపంచమే సర్వస్వం అనుకొనేలా చేసేది మాయ. అరిషడ్వర్గాలైన కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యాలకు లోనై ఉండేవాడు మాయలో ఉన్నట్లే. భగవంతుడే సత్యం, మిగతాదంతా అసత్యం అనే భావన వచ్చినప్పుడు మాయను అధిగమించవచ్చు. "ఎవరు మాయను దాటగలరు" అని రెండు సార్లు ప్రశ్నించి, "అవతార పురుషులనూ, మహాత్ములనూ సేవించినవారే మాయను దాటగలరు" అని భక్తిసూత్రాల్లో నారదమహర్షి చెప్పారు.

*'అవ్యక్తనామ్నీ పరమేశ శక్తి రనాద్యవిద్యా త్రిగుణాత్మికా పరా కార్యానుమేయా సుధియైవ మాయా యయా జగత్సర్వమిదం ప్రసూయతే' (వివేకచూడామణి శ్లోకం-110)*

*'...మహాద్భుతా నిర్వచనీయ రూపా' (వివేకచూడామణి-111)*

దీని పేరు అవ్యక్తం. త్రిగుణాత్మకమైనది దీని రూపం. అనాది అయిన అవిద్యా స్వరూపం. ఈ జగత్తు అంతా మాయ వల్లే పుడుతోంది. వర్ణింప శక్యం కానిది. మహాద్భుతమైనది మాయ.

*'శుద్ధాద్వయ బ్రహ్మ విబోధనాశ్యా సర్పభ్రమో రజ్జు వివేకతో యథా...' (వివేకచూడామణి-112)* - మునిమాపు వేళ పాము, త్రాడు అనే జ్ఞానం కలగగానే భ్రమ తొలగినట్లు అద్వితీయ శుద్ధ బ్రహ్మ జ్ఞానం కలగడంతోనే మాయ తొలగుతుంది.

ఒకసారి నారదుడు 'నీ మాయను చూడాలని ఉంది'అని శ్రీకృష్ణుణ్ణి కోరాడు. శ్రీకృష్ణుడు అతణ్ణి తీసుకొని ఎడారి మార్గంలో వెళుతూ దప్పికై, కొంచెం మంచినీళ్ళు కావాలని కోరాడు. నారదుడు అల్లంత దూరాన ఉన్న ఒక ఇంటికి వెళ్ళి అక్కడ ఒంటరిగా ఉన్న కన్యను చూసి మోహించాడు. ఆమెను పెళ్ళి చేసుకొని సంసార జీవితాన్ని కొనసాగిస్తున్నాడు. ఒకసారి వరద వచ్చింది. భార్యా, పిల్లల్ని రక్షించబోయి అందరినీ వరదలో పోగొట్టుకొన్నాడు. అప్పుడు విలపిస్తున్న నారదుణ్ణి, శ్రీకృష్ణుడు తన చేతితో స్పృశించి "నారదా! మంచినీళ్ళు ఏవీ?" అని అడిగాడు. అప్పుడు నారదుడికి స్పృహ వచ్చింది. ఇదే మాయ. క్షణంలో అంతా మరిపిస్తుంది.

భగవంతుని కృపతోనే మాయను దాటవచ్చు. మాయను గురించి వివరిస్తూ- 'ఉన్న వస్తువు (బ్రహ్మ) ఒక్కటే. ద్రవ్యమో! చైతన్యమో!! వాటి రెంటినీ విడదీసి ఆలోచించడం కష్టం. అదే మాయ. అదే అజ్ఞానం' అన్నారు స్వామి వివేకానంద. ❖

- రెంటాల జయదేవ

# నారికేళ విశిష్టత

హిందువులకు సంబంధించి అన్ని ధార్మిక కార్యక్రమాల్లోనూ, శుభకార్యాల్లోనూ నారికేళానిది ముఖ్యమైన పాత్ర. నారికేళాన్ని అందరూ శుభసూచకంగా భావిస్తారు. సంపదకూ, గౌరవ ప్రతిష్ఠలకూ, పురోభివృద్ధికీ, అదృష్టానికీ కొబ్బరికాయ ప్రతీక అని భారతీయుల విశ్వాసం. కాబట్టి, దేవతలందరికీ కొబ్బరి కాయ సమర్పించడం మన ఆచారం.

### కలశంలో కొబ్బరి కాయ

మన దేశంలో ఏ గుడికి వెళ్ళినా, దేవుడికి సర్వసాధారణంగా అర్పించేది - నారికేళమే! అలాగే, పెళ్ళిళ్ళు, పేరంటాలు, పండుగలు, పబ్బాలు వచ్చాయన్నా, కొత్త వాహనమో, ఇల్లో కొన్నామన్నా కొబ్బరికాయ కొట్టడం మన సంస్కృతిలోని అలవాటు. కీలకమైన కార్యక్రమాల్లో కలశంలో నీళ్ళు పోసి,



దానిలో మామిడాకులు వేసి, ఆ పైన కొబ్బరికాయను అమర్చి, ఆ కాయకు అయిదు చోట్ల కుంకుమ బొట్లు పెట్టి, ఆ కలశాన్ని ఆరాధించడం మన సంస్కృతి. అలా కలశం మీద ఉంచిన నారికేళానికి సాధారణంగా ఎర్ర రంగు వస్త్రం కప్పుతారు. ఎవరైనా గౌరవనీయులైన అతిథులు వచ్చినప్పుడు వారిని ఈ పూర్ణకుంభంతో స్వాగతించడం కూడా మనం చూస్తుంటాం.

### వరుణదేవుడికి నారికేళం

పెళ్ళి, పేరంటాల్లో వచ్చిన అతిథులకు నారికేళాన్ని కానుకగా ఇచ్చి పంపే సంస్కృతి కూడా కొన్ని చోట్ల ఉంది. అతిథులను అలా గౌరవించడం స్వచ్ఛతకు చిహ్నం. మన దేశంలో చాలా చోట్ల శరత్ పూర్ణిమ సందర్భంగా వరుణదేవుడికి నారికేళాన్ని సమర్పించే ఆచారం ఉంది.

నారికేళాన్ని కాయగానే అర్పించడం, లేదంటే కాయను కొట్టి సమర్పించడం - రెండు రకాల పద్ధతులూ ఉన్నాయి. సాధారణంగా ఏదైనా కార్యక్రమం ఆరంభంలో కొబ్బరి కాయను మొత్తంగా సమర్పిస్తుంటారు. ఆ తరువాత దాన్ని కొట్టి, ప్రసాదంగా ఇస్తుంటారు.

యజ్ఞ యాగాదులు చేస్తున్నప్పుడు హోమాగ్ని కుండంలో నారికేళాలను ఆహుతులుగా వ్రేల్చడం జరుగుతుంటుంది. అలాగే, దేవుడికి కొబ్బరికాయ కొట్టి, ఆ వచ్చిన రెండు కొబ్బరి చిప్పలనూ దేవుని ముందు పెట్టి, నైవేద్యం పెడుతుంటాం. ఆ పైన దేవుని ప్రసాదంగా స్వీకరిస్తుంటాం. దేవుణ్ణి సంతృప్తిపరచడానికీ, మన కోరికలన్నీ తీరడానికీ ఇలా కొబ్బరికాయలు కొడుతుంటాం. కొబ్బరికాయకు ఉండే మూడు కళ్ళూ, పరమేశ్వరుని త్రినేత్రాలకు ప్రతీక కాబట్టి, కొబ్బరికాయ పరమ శివునికి ప్రీతిపాత్రమైనదని ఓ నమ్మకం. త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు ముగ్గురూ నారికేళంలో వసిస్తుంటారని ఓ నమ్మిక.

### కొబ్బరి కాయ ఎలా కొట్టాలి?

దేవుడికి ఎలాంటి కొబ్బరికాయ కొట్టాలి, ఎలా కొట్టాలనే దానికి పెద్దలు ఓ సులభ సూత్రం చెప్పారు. కొబ్బరి కాయను కొనేటప్పుడే దాన్ని చేతిలోకి తీసుకొని, చెవి దగ్గర పెట్టుకొని, చేతితో ఆడించి చూడాలి. కొబ్బరికాయలోని నీళ్ళ శబ్దం తెలుస్తోందో, లేదో గమనించాలి. కాయ మీద వేలితో కొట్టి చూడాలి. అప్పుడు అయ్యే శబ్దాన్ని బట్టి ఆ కొబ్బరి కాయ మంచిదో, కుళ్ళినదో ముందుగానే కనిపెట్టవచ్చు. చెడిపోయిన కాయలను దేవుడికి కొట్టకూడదు, నైవేద్యం పెట్టకూడదు.

### పిలక ముఖ్యం!

పీచు తీయని కొబ్బరి కాయను కొంటే, ముందు జాగ్రత్తగా ఆ పీచు తీయాలి. అన్ని వైపులా పీచు తీయవచ్చు కానీ, దేవుడికి కాయ కొట్టాలంటే, చిన్న పిలక లాగ పీచును మాత్రం ఉంచేయాలి. అలా పిలక ఉన్న కొబ్బరి కాయలే దేవుడికి కొట్టాలి. అంతే కానీ, అన్ని వైపులా పూర్తిగా పీచు తీసేసిన బోడి కొబ్బరికాయలను దేవుడి నైవేద్యం కోసం కొట్టకూడదు.

కొబ్బరి కాయ మీద కళ్ళ లాగ మూడు గుర్తులుంటాయి. కాయను చేతితో పట్టుకొని పైకెత్తి కొట్టేటప్పుడు ఆ మూడింటిలో రెండు కళ్ళు మన కళ్ళకు కనబడుతూ, మన వైపు చూస్తున్నట్లుండాలి. దాంతో, కొబ్బరి కాయ మీది మూడో కన్ను కిందికి ఉంటుంది. ఇలా పట్టుకొని, కొబ్బరి కాయను కొట్టడం వల్ల కాయ సరిగ్గా, గుండ్రంగా పగిలే అవకాశాలు ఎక్కువ. ❖ *(వచ్చే సంచికలో 'నారికేళ నివేదనలో అంతరార్థం')*

# నది మార్గాన్ని మళ్ళించిన మహర్షి

కథ : స్వామి జ్ఞానదానంద    చిత్రాలు : దాకోజు శివప్రసాద్




5
కవషుడికి సత్రయాగం చూడాలని ఉంది; అందుకని నదీ తీరానికి దూరంగా వెళ్ళి ఇసుకలో కూర్చొని యాగాన్ని చూడసాగాడు.
6
ఇంతలో కవషుడికి దాహం వేసింది. నీళ్ళు తాగాలంటే యాగస్థలం దాటి నదీ తీరానికి వెళ్ళాలి. ఋషులకు ఆగ్రహం కలిగించడం ఎందుకని కవషుడు అప్పటికప్పుడు "అపోనప్త్రీయము" అనే సూక్తం రచించి సరస్వతీ నదీ దేవతను ప్రార్థించాడు.
7
అప్పుడు సరస్వతీ నది ప్రసన్నురాలై, తీరం నుండి ఒక పాయగా విడిపోయి, ప్రవహిస్తూ వెళ్ళి కవషుడి వద్ద ఆగింది. కవషుడు దోసిలిలో నీరు పట్టి దాహం తీర్చుకున్నాడు.
8
యాగం చేస్తున్న మునులు ఈ అద్భుతాన్ని చూసి ఆశ్చర్యపోయారు. వారు యాగం మధ్యలో ఆపి కవషుణ్ణి సమీపించారు.

మిగతా 36వ పేజీలో...

# అయిదు రోజుల ఆనందోత్సాహాల పండుగ



– స్వామి సర్వస్థానంద

దేశ విదేశాల్లోని భారతీయులందరూ అత్యంత ఉత్సాహంతో జరుపుకొనే పండుగలలో దీపావళి ఒకటి. బ్రహ్మదేవుడు శ్రావణపూర్ణిమ నాటి ఉపాకర్మ (రక్షాబంధనోత్సవం)ను బ్రాహ్మణులూ, దేవీనవరాత్రులను (దసరా) క్షత్రియులూ, దీపావళిని వైశ్యులూ, హోళికా పూర్ణిమను శూద్రులూ జరపాలని నిర్ణయించినట్లు ఒక కథ ఉంది.

దీపావళి మొత్తం ఐదు రోజుల పండుగ. ఇది సాధారణంగా అక్టోబర్ చివర్లో కానీ, నవంబర్ మొదట్లో కానీ వస్తుంది. మొదటి రోజు ఆశ్వయుజ బహుళ త్రయోదశి – దీనినే "ధనత్రయోదశి" అనీ, "ధన్ తేరస్" అనీ అంటారు. పశ్చిమ భారతదేశంలోని జైనులూ, వ్యాపారస్థులూ దీనికి చాలా ప్రాముఖ్యం ఇస్తారు. ఈ రోజున లక్ష్మీదేవిని ఆరాధిస్తారు. బంగారం కానీ, వెండి కానీ, పాత్ర సామగ్రి కానీ ఈ రోజున కొనడం శుభప్రదం అని వారి నమ్మిక.

బీహార్‌లోనూ, ఉత్తర భారతదేశంలోనూ దేవవైద్యుడైన 'ధన్వంతరి' గౌరవార్థం ధన్ తేరస్ జరుపుతారు. క్షీరసముద్ర మథనం జరిగినప్పుడు చేతిలో పాత్రను పట్టుకొని ధన్వంతరి ఉద్భవించాడట. అందుకే ఆ రోజున బంగారం కానీ పాత్ర సామగ్రి కానీ కొనడం ఆచారం. వర్షాకాలం చివర్లో వచ్చే ఈ పండుగ సమయంలో ధన్వంతరి పూజ పరిశుద్ధతకీ, ఆరోగ్యపరిరక్షణకీ గల ప్రాముఖ్యాన్ని చెప్పకనే చెబుతుంది.

రెండో రోజు ఆశ్వయుజ బహుళ చతుర్దశి. దీన్ని 'నరక చతుర్దశి' అంటాం. పూర్వ కాలంలో నరకవాసాన్ని తప్పించుకునేందుకు యముడి గౌరవార్థం పండుగ జరిపేవారు. అయితే నరకాసుర సంహారం ఆ రోజున జరిగింది కనుక నరకుడి తల్లి అయిన భూదేవి తన పుత్రుడు మరణించిన రోజున ఉత్సవం జరపాలన్నదట. చెడుపై మంచి సాధించిన విజయానికి ప్రతీక నరకాసురవధ. సూర్యోదయానికి ముందే అభ్యంగన స్నానం చేసి, యమధర్మరాజుకు తర్పణాలు విడిచి, దీపం వెలిగిస్తే నరకానికి వెళ్ళరనే నమ్మకం ప్రజలకు ఉంది. సూర్యాస్తమయం అయ్యాక ఇళ్ళనూ, ఆలయాలనూ దీపాలతో అలంకరిస్తారు.

మూడోరోజు ఆశ్వయుజ అమావాస్య. సంవత్సరం మొత్తమ్మీద అతి చీకటిగా ఉండే రాత్రి. ముందురోజులాగే సూర్యోదయానికి ముందే అభ్యంగన స్నానం చేసి అలక్ష్మి (అశుభం) తొలగడానికి లక్ష్మీదేవిని పూజిస్తారు. రెండు రోజులూ పితృదేవతలకు తర్పణాలు విడుస్తారు. కొన్ని ప్రాంతాల వారు పగలు ఉపవాసం ఉండి, రాత్రి బంధువులు,

స్నేహితులతో కలసి విందు ఆరగిస్తారు. సాయంకాలం ఇళ్ళను దీపాలతో అలంకరించి, టపాసులు కాలుస్తారు.

పూర్వం దీపావళి పంటల పండుగ. వ్యవసాయదారులూ, వర్తకులూ దీపావళి నాటికి పాత బాకీలు చెల్లించి, ఖాతా పుస్తకాలలోని లెక్కలన్నీ సరిచూసేవారు. వారికి దీపావళితో కొత్త సంవత్సరం మొదలయ్యేది. కాలక్రమంలో ఈ పండుగ ఆధ్యాత్మికంగా ప్రాముఖ్యాన్ని సంతరించుకుంది. ఈ పండుగకు సంబంధించి ఎన్నో పురాణ గాథలు ఉన్నాయి. తమ పధ్నాలుగు సంవత్సరాల వనవాసాన్ని ముగించుకొని సీతా రామ లక్ష్మణులు అయోధ్యకు తిరిగి వచ్చిన శుభసందర్భంలో అయోధ్యావాసులు తమ తమ ఇళ్ళను దీపాలతో అలంకరించుకున్నది దీపావళి నాడే అని ఉత్తర భారతదేశవాసులు చెప్పే కథ ప్రముఖమైనది.

మరొక కథ ప్రకారం... క్షీరసముద్ర మథనం జరిగినప్పుడు లక్ష్మీదేవి ఆ పాలసముద్రం నుండి ఉద్భవించినది దీపావళి నాడే! అందుకే దీపావళి నాడు లక్ష్మీపూజ చెయ్యడం. ఆనాడు మరికొందరు కాళీమాతను ఆరాధిస్తారు. ముఖ్యంగా వంగదేశంలో అమావాస్య నాటి రాత్రి మట్టితో చేసిన కాళీ ప్రతిమను పూజిస్తారు. దక్షిణ దేశంలో హిరణ్య కశిపుడి వధకు గుర్తుగా దీపావళి జరుపుతారు. జైనులు తమ ప్రభువు మహావీర్ పరినిర్వాణం చెందిన దినంగా పరిగణిస్తారు. 18 దేశాల రాజులు తమ మధ్యన ఉన్న జ్ఞానప్రకాశం తమకు దూరమైనందుకు గుర్తుగా ఆ రోజున తమ దేశాలలో దీపాలను వెలిగిద్దామనుకున్నట్లు జైనుల నమ్మకం. వారు దీపాలు వెలిగించడంతో పాటు శారదాపూజ (జమా ఖర్చుల పుస్తకాలను పూజించడం), లక్ష్మీపూజ కూడా చేస్తారు. విక్రమశకాన్ని పాటించే గుజరాత్ తదితర ప్రాంతాల వారికి సంవత్సరంలో చివరిరోజు దీపావళి.

తరువాతి రోజు కార్తీక శుక్ల పాడ్యమి. దీన్ని బలి పాడ్యమి అని కూడా అంటారు. వామనావతారం ధరించిన విష్ణుమూర్తి రాక్షసరాజైన బలిచక్రవర్తిని పాతాళానికి పంపినది ఈ రోజునే అని పురాణాలు చెబుతున్నాయి. దేశంలోని అనేక ప్రాంతాల వారు బలిచక్రవర్తిని- భార్య వింధ్యావళితో సహా ఈ రోజున పూజిస్తారు. కార్తీక శుక్ల పాడ్యమి నాడు ఉత్తర భారతదేశంలో గోవులనూ, ఎద్దులనూ పూజించడం; వైష్ణవులు గోవర్ధన పర్వతాన్ని పూజించడం, అన్నకూట ఉత్సవం జరపడం కనపడతాయి. గోవర్ధనగిరికి దూరంగా ఉండే ప్రజలు ఆవు పేడతో కానీ, అన్నపురాశితో కానీ కొండలా చేసి పూజిస్తారు. దానినే 'అన్నకూటం' అంటారు.

'శ్రీరామకృష్ణ కథామృతం'లో అన్నకూట ఉత్సవానికి సంబంధించిన ఆసక్తి కరమైన సంఘటన ఒకటి ఉంది: ఒకమారు శ్రీరామకృష్ణులవారిని కలకత్తాలోని మార్వాడీలు తాము జరుపుతున్న అన్నకూట ఉత్సవానికి ఆహ్వానించారు. 'మ', ఇతర భక్తులతో కలసి శ్రీరామకృష్ణులు ఉత్సవానికి వెళ్ళి, తామూ ఉత్సవంలో పాలుపంచుకుని, అమిత ఆనందోత్సాహాలతో సంధ్యాసమయమయ్యాక తిరుగు ముఖం పట్టారు. శ్రీరామకృష్ణులు "మీరు ఇక్కడ చూసిన ఉత్సవం బృందావనంలో కూడా జరపబడింది. అయితే అక్కడ అన్నపురాశి ఇంకా పెద్దదిగా ఉంది; ఇంకా ఎక్కువమంది ఉత్సవంలో పాల్గొన్నారు. అక్కడ గోవర్ధన పర్వతం కూడా ఉంది. మార్వాడీల భక్తి చూశారా? అదే అసలైన హైందవ ఆదర్శం; అదే సనాతన ధర్మం. హిందూ మతం సనాతన ధర్మం. అది ఎప్పటి నుండో ఉంది. అదొక్కటే ఎప్పటికీ నిలచి ఉంటుంది" అన్నారు.

ఐదవది కార్తీక శుక్ల విదియ. దీన్నే యమద్వితీయ అనీ, భ్రాతృ ద్వితీయ అనీ అంటారు.

బ్రహ్మాండ పురాణంలో "యమధర్మరాజును ఆయన సోదరి యమున తన ఇంటికి విందుకు ఆహ్వానించింది" అని ఉంది. ఆ రోజున తమ సోదరి ఇంట భుజించి, ఆమెకు బహుమతి ఇస్తారు సోదరులు.

దుర్గాపూజ లాంటి ఇతర పండుగలలాగ దీపావళికి ధార్మిక, మతపరమైన ప్రాముఖ్యం లేకున్నా అన్ని ప్రాంతాల వారూ జరుపుకొనే ప్రముఖమైన పండుగగా ప్రఖ్యాతి గాంచింది. వివిధ వర్గాల మధ్య సోదర ప్రేమను ఇనుమడింపజేసి సమాజంలో అందరూ కలసిమెలసి ఐకమత్యంతో జీవించేందుకు తోడ్పడుతుంది ఈ దీపాల పండుగ. ❖

**దీపావళి శుభాకాంక్షలు**

పాఠకులకు, రచయితలకు, రచయిత్రులకు, దాతలకు, ఏజెంట్లకు, ప్రకటనకర్తలకు హృదయపూర్వక దీపావళి శుభాకాంక్షలు.

- శ్రీరామకృష్ణ ప్రభ





# ఓ మహాత్యాగి ఆత్మకథ



(స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

(...గత సంచిక తరువాయి)

**(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, దేవదూత, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వ గాయకుడు ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన తన జీవితానుభవాలను ధారావాహికంగా 2009 జూన్ సంచిక నుంచి అందిస్తున్నాం.)**

ఓ రోజు శ్రీరామకృష్ణులు "నీకు కావాలంటే నీ హృదయంలో శ్రీకృష్ణుణ్ణి దర్శింపచేస్తాను" అన్నారు. "నాకు అలాంటి వాటి మీద నమ్మకం లేదు" అన్నాను. ఒకసారి "మీరు చూసే దైవ దర్శనాలు, వగైరాలు మీ ఊహాజనితాలు మాత్రమే! నిజాలు కావు" అన్నాను. నా మాటలు విని ఆయన కాళికాలయానికి వెళ్ళి జగన్మాతతో "అమ్మా! దైవ దర్శనాలన్నీ కేవలం ఊహాజనితాలేనా?" అని అడిగారు. తరువాత నాతో "ఈ దర్శనాలన్నీ నిజాలని సాక్షాత్తూ అమ్మ చెప్పింది!" అన్నారు.

మరోసారి (తన హృదయాన్ని చూపిస్తూ) "నీవు పాడేటప్పుడు, ఇక్కడ ఎవరైతే ఉన్నారో ఆయన ఓ సర్పంలా తన పడగ విప్పి నిలకడగా నిలిచి నీ సంగీతం వింటాడు" అన్నారు.

మేమిద్దరమూ వేదాలు, బైబిల్, ఖురాన్... ఇంకా ఇతర మత గ్రంథాల గురించి మాట్లాడుకొనేవాళ్ళం. ఒకసారి సంభాషణ ముగిస్తూ, ఆయన టేబిల్ మీద నుంచి ఓ పుస్తకం తీసుకురమ్మన్నారు. అందులో మిగతా విషయాలతో పాటు, ఆ సంవత్సరంలో ఎంత వర్షం కురుస్తుందో ముందుగా వ్రాయబడి ఉంది. "దాన్ని చదువు" అన్నారాయన. ఎంత వర్షం కురవబోతోందో ఆ సంఖ్య చదివాను నేను. "ఇప్పుడు పుస్తకం తీసుకుని బాగా పిండు!" అన్నారు. అలాగే చేశాను. అప్పుడు ఆయన ఇలా అన్నారు: "ఏం నాయనా! ఒక్క చుక్క నీరు కూడా రావడం లేదు! అది కేవలం పుస్తకం మాత్రమే! నీ మతం నిన్ను భగవత్ సాక్షాత్కారానికి అర్హుణ్ణి చేయనంతవరకూ అది వృథాయే! మతమంటే కేవలం గ్రంథాలు, శాస్త్రాలు అనుకొని వాటిని అధ్యయనం చేసేవారు తన వీపు మీద చక్కెర బస్తాలు మోసినా, దాని తియ్యదనం తెలియని గాడిద లాంటివారని నాకనిపిస్తుంది!..." మొదట్లో నేను ఆయన చెప్పినదేదీ నమ్మలేదు. ఓ రోజు ఆయన "మరి ఇక్కడికి ఎందుకొస్తున్నావ్?" అని అడిగారు. "నేను ఇక్కడికి మిమ్మల్ని చూడడానికి వస్తున్నాను. మీ మాటలు వినడానికి కాదు" అన్నాను. అందుకు ఆయన చాలా సంతోషించారు.

ఒక రోజు మేమిద్దరమే ఉండగా ఆయన, "నేను మహిమలనూ, సిద్ధులనూ ఉపయోగించ లేదు. కానీ నీ ద్వారా చేయగలను, నీవేమంటావు?" అన్నారు. "లేదు, మీరలా చేయలేరు!" అని నేనన్నాను. ఆయన దర్శనాలు, భావ సమాధులు అన్నీ మతి భ్రమలని చెప్పాను. ఆయనిలా అన్నారు: "దక్షిణేశ్వరం కాళికాలయంలో మేడ (కుఠీ) పైకి ఎక్కి, గట్టిగా రోదించేవాణ్ణి. ఓ భక్తులారా! మీరంతా ఎక్కడున్నారు? రండి నాయనలారా! నేను మిమ్మల్ని చూడడానికి తపిస్తున్నాను. మిమ్మల్ని చూడకపోతే మరణిస్తాను. భక్తులు తప్పక వస్తారు నాయనా అని జగన్మాత అన్నది. చూశావా! అమ్మ చెప్పినదంతా నిజమేనని తెలుస్తోంది కదా!" అందుకు నేనేమీ ఆయనకు బదులు చెప్పలేకపోయాను.

నా ఆశయాలు, ఆదర్శాలనే నేను చేసే పనులన్నింటిలో ఆచరించేవాణ్ణి. గురుదేవులీ విషయంలో ఏనాడూ జోక్యం కలిగించుకోలేదు.... నేను 'సాధారణ బ్రహ్మసమాజం'లో సభ్యుడినయ్యాను. ఓ రోజు ఆయన "నీవు ఈ విషయం రాఖాల్ (స్వామి బ్రహ్మానంద)తో చెప్పవద్దు, చెబితే తనూ చేరతానని అంటాడు!" అన్నారు. నేను దక్షిణేశ్వరం వెళ్ళినప్పుడు, గురుదేవులు ఇతరులను చదవవద్దని వారించే వేదాంత గ్రంథాలు నన్ను చదవమని ఇచ్చేవారు. తన గదిలో

ఉన్న 'అష్టావక్ర సంహిత' గ్రంథాన్ని వేరెవరైనా చదవబోతే ఆయన వారించి, దానికి బదులుగా 'ముక్తి - దానికి సాధనలు', భగవద్గీత, లేదా ఏదైనా ఒక పురాణం చదవాల్సిందిగా ఇచ్చేవారు. ఒక్కోసారి అద్వైత భావాలతో నిండిన 'అధ్యాత్మరామాయణం'లోని ఒక భాగం చదవ మనేవారు... అప్పుడు కొన్నిసార్లు మొండిగా "ఈ పుస్తకం చదవడం వల్ల లాభమేంటి? 'నేనే దేవుణ్ణి' అని తలవడం కూడా పాపం! ఈ పుస్తకం ఈ ఘోర పాపాన్ని బోధిస్తోంది. దీన్ని కాల్చేయాలి!"అని అన్నాను. ఆయన నవ్వుతూ "దాన్ని నీ కోసం చదవమన్నానా? నా కోసమే కొద్దిగా చదవ మన్నానంతే! నా కోసం చదువు. 'నేనే దేవుణ్ణి' అని నీవు



భావించనక్కర్లేదులే" అన్నారు. ఆ విధంగా ఆయన కోసమే ఆ పుస్తకాలు చదవాల్సి వచ్చేది.

ఒకరోజు గురుదేవుల దివ్యస్పర్శ నా మనస్సులో ఓ అద్భుతమైన పరివర్తన కలిగించింది. దాంతో విశ్వమంతా భగవంతుడు తప్ప మరేదీ లేదనే అనుభూతి కలిగింది. 'సర్వం బ్రహ్మమయం' (సర్వం ఖల్విదం బ్రహ్మ) అనుభూతిని పొందాను. కానీ ఇది ఎంత కాలం నిలుస్తుందో చూద్దామని మౌనంగా గమనించాను. ఆ రోజంతా ఈ అద్వైత స్థితి చెక్కుచెదరలేదు. ఇంటికి తిరిగొచ్చాను. అక్కడ నేను చూసిన సమస్తం బ్రహ్మముగా కనిపించింది. భోజనం చేద్దామని కూర్చున్నాను. కానీ అన్నం, పళ్ళెం, వడ్డించిన మా అమ్మ, ఆఖరికి నేనూ... సమస్తమూ అదే పరబ్రహ్మ చైతన్యం! ఒకటి రెండు ముద్దలు తిని అలాగే స్థిరంగా కూర్చుండిపోయాను.

మా అమ్మ "ఎందుకలా కూర్చుండిపోయావు? భోంచేయి" అన్న మాటలతో ఉలిక్కిపడి మళ్ళీ తినడం మొదలుపెట్టాను. కానీ నేను తింటున్నా, పడుకున్నా, కళాశాలకు వెళుతున్నా, ఏమి చేస్తున్నా అన్ని వేళలా ఏదో ఒక అద్భుత దివ్యపారవశ్య స్థితి (సమాధి)లో ఉన్నట్లు అనుభూతి కలిగేది. వీధుల్లో నడుస్తుంటే, గుఱ్ఱపు బండ్లు పరుగెడుతున్నాయి. గుఱ్ఱబ్బళ్ళూ, నేనూ ఒకే చైతన్య వస్తువని కనిపించడంతో నాకు ప్రక్కకు తప్పుకోవాలని అనిపించలేదు. నాకప్పుడు బాహ్య స్పృహ లేదు. శరీర అవయవాలన్నీ మొద్దుబారినట్లుగా అనిపించింది. భోజనం నాకు రుచించలేదు, ఎవరో వేరే వ్యక్తి తింటున్నట్లుగా అనిపించింది. ఒకోసారి భోంచేస్తూనే నడుం వాల్చేవాణ్ణి! కొన్ని నిమిషాల తర్వాత లేచి మళ్ళీ తినేవాణ్ణి. కొన్ని రోజులు చాలా ఎక్కువగా తినేవాణ్ణి, కానీ ఏ హానీ జరిగేది కాదు. మా అమ్మ నా కేదో రోగం పట్టిందేమోనని బెంగ పెట్టుకుంది. నేనిక ఎక్కువ రోజులు బ్రతుకనేమో అని భయపడింది కూడా!... ఆ స్థితిలో కొంచెం మార్పు వచ్చాక ప్రపంచమంతా ఓ కలలాగ కనిపించసాగింది! కలకత్తా లోని 'కార్న్ వాలిస్ సర్కిల్' లో నడుస్తున్నపుడు రహదారి పక్కన ఇనుప కడ్డీలతో ఉన్న కంచె 'నిజమా కాదా?' అని తెలుసుకొందామని వాటికి నా తలను కొట్టుకునేవాణ్ణి! ఈ విధంగా కొన్నాళ్ళు కొనసాగింది. మామూలు స్థితికి వచ్చాక కచ్చితంగా నేను అద్వైత అనుభూతిని కొంచెం చవిచూశానని స్పష్టంగా గ్రహించాను. అప్పుడే శాస్త్ర వాక్యాలు అబద్ధాలు కావని నాకు స్ఫురించింది. అప్పటి నుండీ అద్వైత తత్త్వపు సిద్ధాంతాలను నిరాకరించ లేకపోయాను.

నా జీవితంలో మొట్టమొదటిసారిగా భగవంతుణ్ణి చూశాననీ, మతమనేది అనుభవైక సత్యమనీ, ఈ ఇంద్రియ జగత్తు కంటే అవధులు లేనంత అధిక తీవ్రతతో ఆధ్యాత్మిక చైతన్యాన్ని అనుభవించవచ్చుననీ నిర్భయంగా, దృఢంగా చెప్పగలిగిన ఒక వ్యక్తిని చూశాను. ఆయన దగ్గరకు రోజుల తరబడి వెళ్ళసాగాను. వెళుతూ ఆధ్యాత్మిక తత్త్వానుభూతిని స్పష్టంగా మరొకరికి ఇవ్వవచ్చును అని నా కళ్ళతో ప్రత్యక్షంగా చూశాను! ఆయన ఒక్క స్పర్శ, ఒక్క చూపు, సమస్త జీవితాన్నే మార్చేయగలదు! ❖ *(సశేషం)*

అనుసృజన: **స్వామి అర్చనానంద**



# రంతిదేవుడి దానగుణం

– ఆకెళ్ల రాఘవేంద్ర

దానగుణంలో ఒక మహోన్నతమైన ఆశయాన్ని నిలిపిన వాడు రంతిదేవుడు. దయను ప్రదర్శించడంలో అతనికి అతనే సాటి. తాను ఆకలితో అలమటించి పోతున్నప్పటికీ సాటివారి ఆకలిని గుర్తించి, తాను ఏమీ తినకుండా తోటివారి కడుపు నింపిన ధన్యజీవి రంతిదేవుడు. వ్యాసుడు రంతిదేవుడి పాత్రను ఎందుకు సృష్టించాడో తెలుసా? ఒక ఉదాత్త ఆదర్శాన్ని మానవాళికి అందించేందుకు! రంతిదేవుడి కథ ఆనాటి కన్నా ఈనాడు ప్రతి ఒక్కరికీ ఆదర్శప్రాయం. అదెలాగో తెలుసుకొందాం.

పోతన రచించిన మహాభాగవతంలోని నవమ స్కంధంలో ఉన్న చిన్న కథ 'రంతిదేవుడి' కథ. రంతిదేవుడు ఒక రాజు. లెక్కలేనన్ని సంపదలు ఆర్జించాడు. అయితే చనిపోయేటప్పుడు ఆ ఆస్తులన్నీ తీసుకెళ్ళిపోవడం జరగదన్న సత్యం తెలిసినవాడు రంతిదేవుడు. అందుకే ఆకలిగొన్న వారికి, బాధల్లో ఉన్నవారికి, దీనులకి దానాలు చేసేవాడు. ఎంతటి ఆస్తి అయినా... ఇచ్చుకుంటూ వెళ్ళిపోతే తరిగిపోవాల్సిందే, కరిగిపోవాల్సిందే! రంతిదేవుడికీ జరిగిందదే!!

విపరీతంగా దానాలు చేయడం వల్ల కొంతకాలానికి రంతిదేవుడు తన సంపదను కోల్పోయాడు. రాజు కాస్తా పేదవాడైపోయాడు. అయినా ఇంటిలో ఉన్నంతవరకు ఏ వస్తువు ఉంటే ఆ వస్తువును దానం చేసేసేవాడు. మణిమయ రత్నఖచిత భవంతులు పోయి పర్ణశాలలో జీవించాల్సి వచ్చింది. అయినా తానూ తన కుటుంబమూ ఆ గుడిసెలోనే బతికేవారు.

విశేషమేమిటంటే, ఇంత జరిగినా రంతి దేవుడు కించిత్తయినా బాధపడలేదు. 'అయ్యో! నా ఆస్తులు పోయాయే' అని కన్నీరు కార్చలేదు. అనవసరంగా దానాలు చేశానని వాపోలేదు. గతాన్ని తలుచుకొని వర్తమాన దుఃస్థితి పట్ల వేదన చెందలేదు. ఎందుకంటే... రంతిదేవుడు తనకు తెలిసి దానాలు చేశాడు. కావాలని దానం చేశాడు. కీర్తి కోసమో, పొగడ్తల కోసమో దానం చేయలేదు. ఆనందం కోసం, ఇతరులకు సహాయం చేయడం కోసం దానం చేశాడు. దానం చేయడంలో వీరత్వం ప్రదర్శించాడు. అందుకే రంతిదేవుడు దానవీరుడయ్యాడు.

దగ్గర ఉన్నవన్నీ అయిపోయేంతవరకు దానాలు చేస్తూనే ఉన్నాడు. చివరకు చిల్లిగవ్వయినా లేని పరిస్థితి. చివరకు తానూ, తన కుటుంబమూ మూడు పూటలా కాదు... ఓ పూటయినా ఏమీ తినలేని పరిస్థితి. పస్తులుండాల్సిన స్థితి. ఒకటా.. రెండా.. ఏకంగా 48 రోజుల పాటు ఆహారం లేకుండా ఉండాల్సిన పరిస్థితి. అయినా గుండె దిటవును కోల్పోలేదు.

అలాంటి పరిస్థితుల్లో ఓ రోజు... రంతిదేవుడికి నేయీ, పాయసమూ, నీళ్ళూ లభించాయి. నలభై ఎనిమిది రోజుల పాటు పస్తులున్న కుటుంబం కాబట్టి దొరికినవే పంచభక్ష్య

పరమాన్నాలుగా భావించి, ఆబగా తినాలనుకోవడం సహజం. రంతిదేవుడి కుటుంబం కూడా అదే చేయబోయింది. కాళ్ళూ చేతులూ కడుక్కొని ఆ దొరికిన పాయసాన్ని పంచుకొని తినాలనుకొన్నారు వారంతా.

కానీ అంతలో ఒక బ్రాహ్మణుడు వచ్చాడు. ఆకలేస్తోందన్నాడు. తినగా మిగిలింది దానం చేయడం గొప్ప కావచ్చు, కానీ అన్ని రోజుల పాటు అసలు అన్నమే లేకుండా కనీసం మంచినీళ్ళు కూడా తాగకుండా ఉన్న రంతిదేవుడూ, అతని కుటుంబసభ్యులూ ఆ అతిథికి ఆహారపదార్థం ఇవ్వాలని నిశ్చయించుకొన్నారు. తమ దగ్గర ఉన్న పాయసంలో అర్ధభాగం ఇచ్చేశారు.

మిగిలినది తినాలనుకొనేలోపు ఒక శూద్రుడు వచ్చి 'ఆకలిగా ఉంది బాబూ' అని కన్నీరు కార్చాడు. రంతిదేవుడు లేదనక ఆ పాయసంలో మిగిలిన సగంలో ఓ సగాన్ని ఇచ్చాడు. అతను వెళ్ళీ వెళ్ళగానే మరొకరు.. ఆపై ఇంకొకరు.. ఇలా ఒకరి తర్వాత ఒకరుగా రంతిదేవుడి దగ్గరకు రావడం.. మొత్తం పాయసాన్ని తీసేసుకోవడం, ఆ మంచి నీళ్ళు సైతం అర్థించడం జరిగిపోయింది.

అయినా 48 రోజుల పాటు పచ్చి మంచినీళ్ళయినా తాగని రంతిదేవుడు దొరక్క దొరక్క దొరికిన పదార్థాన్ని సైతం దానం చేసి, అంతే ఆనందంతో నిలిచాడు.

ఈ కథ అందించే పరమార్థం ఏమిటి? నిజాయతీగా నిర్భీతితో ఒప్పుకొంటే... మనమెవ్వరం రంతిదేవుడిలా నేడు ప్రవర్తించలేం. కాలధర్మాన్ని ఆచరిస్తే అలా ప్రవర్తించ కూడదేమో కూడా! కానీ, రంతిదేవుడిలా మొత్తం ఆస్తిని మనం దానం చేసేయక్కర్లేదు. రంతిదేవుడిలా మనం విపరీతంగా దానధర్మాలు చేసేసి బికారులం కానక్కర్లేదు. కానీ... ఆ మహానుభావుడి ఆదర్శాన్ని స్వీకరించి, మనకు కలిగినంతలో 'ఏదైనా' చేద్దాం.

అంటే మనం రోజూ అన్నం వండుకొంటాం. రోజూ కొనగుప్పెడు బియ్యాన్ని పక్కన పెడదాం. నెలయ్యేసరికి ముప్ఫయ్ గుప్పెళ్ళ బియ్యం అవుతుంది. దాన్ని ఏ అనాథ శరణాలయానికో దానం చేద్దాం.

అంటే రంతిదేవుడిలా మనం ఆస్తుల్ని కరిగించుకోవద్దు. వీధిన పడవద్దు. మన సుఖాల్ని మరవద్దు. మన కుటుంబధర్మాల్ని విడవవద్దు. రంతిదేవుడు ఒక పర్వతం. మనం ఒక్కొక్కరం ఒక్కో ఇసుక రేణువు. ఒక్క ఇసుక రేణువు ఏమీ చేయలేదు. కానీ మనమంతా... మన కాలనీలోని వందమంది, మన ఊళ్ళోని వెయ్యిమంది, మన నగరంలోని లక్షమంది... మన రాష్ట్రంలోని కోట్లమంది... ఒక్కొక్కరం కొంత... మనకు ఉన్నంత.. మనకు తోచినంత సాయం చేస్తే... చెప్పలేనంత సహాయం సమాజానికి!

'పరోపకారార్థ మిదం శరీరమ్' అన్నది నాటి మాట. సొంతలాభం కొంత మానుకొని పొరుగువాడికి తోడుపడడం నేటి మాట. నాటి రంతిదేవుడి దేహం విడివడి కొన్ని కోట్ల శకలాలై నేడు ఇదిగో ఇలా కోట్లాది మందిగా జన్మించాడనుకొందాం. మన 'పరిధి'లో మనం కూడా ఎంతో కొంత చేద్దాం. ❖

## చిన్నారి చిరుకానుక

"నాన్నా, ఈ కుర్రాడెవరు?" అని వార్తాపత్రిక చదువుతున్న తన తండ్రిని అందులో ఉన్న ఫోటో గురించి అడిగాడు ఐదేళ్ళ సంజీవ్ కుమార్. "అతనికి గుండె జబ్బు బాబూ. సాయం చెయ్యమని అడుగుతున్నారు. ఆపరేషన్ చెయ్యకపోతే జీవించడం కష్టమట" అని బదులిచ్చాడు తండ్రి వేణుగోపాల్.

"ఆ సాయం మనం చెయ్యలేమా నాన్నా?" అడిగాడు సంజీవ్. "అంత డబ్బు మన దగ్గర లేదుగా..." బదులిచ్చాడు నాన్న. "సరేగానీ నాన్న, నాకు ఈ దీపావళికి ఎన్ని రూపాయల బాణసంచా కొనిస్తావ్?" అని అడిగాడు ఈ చిన్నారి. తండ్రికి ఈ ప్రశ్న ఎందుకో అర్థం కాకపోయినా... "ఓ 2,500 రూపాయలవి కొంటాను" అని చెప్పాడు నాన్న.

"అయితే, ఆ డబ్బు ఆ అబ్బాయికిచ్చి సాయం చేద్దాం" అని సంజీవ్ చెప్పగానే ఒక్కసారి ఆ కన్న తండ్రికి ఒళ్ళు పులకరించింది, కళ్ళు చెమర్చాయి. చిన్న పిల్లాడికి వచ్చిన ఆలోచన తనకు రాలేదే అని సిగ్గుపడ్డాడు కూడా.

ఈ సంఘటన 2003లో జరిగింది. ఆ రోజు మొదలుకొని చిన్నారి సంజీవ్ తన తండ్రి ఇచ్చే పాకెట్ మనీతో ఓ 50 మందికి పైగా ఆపన్నులను ఆదుకున్నాడు. ఈ సాయాన్ని అతను పోస్ట్ ద్వారా పంపిస్తాడు. సాయమందుకున్నవారు కృతజ్ఞతతో రాసే ఉత్తరాల్ని చూసి పరమానందం పొందుతుంటాడు ఈ చెన్నై చిన్నారి. మరి మనం కూడా ఈ చిన్నారిలాగ ఆపదలో ఉన్న వారిని ఆదుకొందామా! ❖

సేకరణ : గుళ్ళపూడి శ్రీనివాసకుమార్



# చిగురంత ఆశతో ముందడుగు వేద్దాం

– స్వామి సేవ్యానంద

జీవితంలో మనం ఎటువంటి పొరపాట్లు చేయకుండా పురోభివృద్ధి చెందాలని అంతా కోరుకుంటాం. అయితే, ఇది ఎన్నటికైనా సాధ్యమా? పిల్లలు తప్పటడుగులు వెయ్యకుండా నడవడం నేర్వలేరు కదా! కొంత కాలం తప్పటడుగులు వేస్తూ, దెబ్బలు తింటూ తమంతట తాము ఎలా నడవాలో, పరిగెత్తాలో నేర్చుకుంటారు. ఈ జీవిత గమనంలో మనమంతా పసివాళ్ళమే! అందుకే, మనకు తెలిసో, తెలీకో ఎన్నో పొరపాట్లు చేస్తుంటాం.

**పొరపాట్లను సరిదిద్దుకునే నేర్పు:** స్వేచ్ఛా జీవితంలో అడుగుపెట్టే యువ తరం తప్పుడు నిర్ణయాలను తీసుకోవడం, తప్పు త్రోవ పట్టడం చాలా సహజమైన విషయం. మనం ఇలాంటి పనులు చేయకుండా ఉండాల్సిందని చాలాసార్లు అనుకుంటాం. అయితే వీటిని పదే పదే తలచుకొని కుమిలి పోవడం వలన కొంచెం కూడా ప్రయోజనం లేదు. మనం పొరపాట్లను ధైర్యంగా అంగీకరించి వాటిని సరిదిద్దుకునే ప్రయత్నం చేయాలి. భవిష్యత్తులో ఇటువంటి పనులు ఇంకెప్పుడూ చేయనని దృఢ నిర్ణయం తీసుకోవాలి.



“పొరపాట్లను ఎప్పుడూ లక్ష్యపెట్ట వద్దు. ఆవు అసత్యమాడగా నేను ఎప్పుడూ వినలేదు. అయితే అది ఎప్పటికీ ఆవే కాని మనిషి కాదు. కాబట్టి అపజయాలను, పొరపాట్లను లెక్కచేయ వద్దు. లక్ష్యసిద్ధికై వేయి సార్లు పోరాడు. వేయిసార్లూ ఓటమి ప్రాప్తిస్తే మరోసారి ప్రయత్నించు” అని స్వామి వివేకానంద చెబుతారు. మనం ఎటువంటి పొరపాట్లనూ చేయకుండా ఉండడానికి పుట్టుకతోనే మనమంతా మహాపురుషులం కాలేదు కదా! మనం ఎన్ని పొరపాట్లను చేసినప్పటికీ వాటిని సరిదిద్దుకొని మహాపురుషులం కాగలం. ఇదే మనిషి గొప్పతనం.

**పొరపాట్లు బంగారు మెట్లు:** చాలా సందర్భాలలో మనం చేసిన చెడ్డపనులు, పొరపాట్లు మన పురోగమనానికి దారి చూపే కాంతి పుంజాలవుతాయి. “నేను కొన్ని ఒప్పులు చేసి, చాలా విషయాలలో తప్పులు చేసినందుకు సంతోషిస్తాను. ఎందుకంటే వాటి నుంచి నా జీవితంలో గొప్పపాఠాలు నేర్చుకొన్నాను” అని స్వామి వివేకానంద చెబుతారు. తెలివైన వారు తమ తప్పును వెంటనే తెలుసుకొని, మంచి మార్గంలో వెళ్ళే ప్రయత్నం చేస్తారు. వారు చేసిన పొరపాట్ల నుంచి మరిన్ని కొత్తపాఠాలను నేర్చుకొని, తమ జీవితాన్ని ఉత్తమ భావాలతో, ఆదర్శాలతో నింపి పురోగతి చెందుతారు.

**క్షమాగుణం – ఉత్తముని లక్షణం:** మనం ఇతరుల లోపాల్ని, వారు చేసిన పొరపాట్లను పదేపదే తలచుకోవడం వలన మన మనస్సు కలుషితం అవుతుంది. ఇతరులు తాము చేసిన తప్పును ఒప్పుకొని పశ్చాత్తాపం చెందాక వారిని క్షమించే క్షమాగుణం, విశాల హృదయం మనలో ఉండాలి. చేసిన తప్పును సరిదిద్దుకొని భవిష్యత్తులో ఉన్నతమైన స్థితికి వెళ్ళే సదవకాశం మనం వారికి కల్పించాలి.

“ధృతరాష్ట్రుని పుత్రుడైన దుర్యోధనుడు పాండవులతో గొడవపడి, వారితో చాలా చెడుగా ప్రవర్తించాడు. వారి రాజ్యాన్ని తీసుకోవడమేగాక వారిని అడవులకు పంపించాడు. అప్పుడు విదురుడు ‘దుర్యోధనుడు రాజ్యాన్ని తిరిగి పాండవులకు ఇచ్చి, వారిని క్షమించమని కోరాలి’ అని ధృతరాష్ట్రుడికి సలహా ఇచ్చాడు. దుర్యోధనుడు పాండవులకు అన్యాయం చేశాడని చెప్పడంతో ధృతరాష్ట్రుడు విదురుణ్ణి నిందించి, అతనిపట్ల చాలా కఠినంగా ప్రవర్తించాడు. విదురుడు దుఃఖంతో తిరిగి వెళ్ళాడు. విదురుడు వెళ్ళిన కొంత సమయం తరువాత ధృతరాష్ట్రుడు పశ్చాత్తాపం చెంది, తనను క్షమించాల్సిందిగా కోరుతూ తన అనుచరుణ్ణి విదురుని వద్దకు పంపించాడు. విదురుడు వెంటనే ఆనందంతో ధృతరాష్ట్రుని దగ్గరకు వెళ్ళి, ‘నిన్ను చూడడానికి చాలా వ్యాకులతతో వచ్చాను. నిన్ను మనస్ఫూర్తిగా క్షమిస్తున్నాను’ అని చెబుతాడు.

పొరపాట్లు, అభిప్రాయభేదాలు, కోపతాపాలు మన మధ్య సాధారణమైనప్పటికీ పశ్చాత్తాపం చెందే గుణం, క్షమాగుణం అలవరచుకోవాలి. "We may not be saintly enough to forgive, but we can forget atleast"– మనం ఇతరుల్ని క్షమించేంత మహోన్నతులం కాకపోయినా, కనీసం జరిగిన విషయాన్ని మరచిపోయే ప్రయత్నమైనా చేయాలి. అప్పుడే మనం అందరితో కలసిమెలసి ఆనందంగా జీవించగలం. ❖




**– స్వామి పరిజ్ఞేయానంద**

**– కుమారి తన్మయి, విజయనగరం.**

**ప్రశ్న: నాకు భయమెక్కువ. దయ్యాలు రాత్రిపూట తిరుగుతుంటాయని ఇతరులు చెప్పడం వల్ల నాలో భయం మరింత ఎక్కువయింది. రెండు సంవత్సరాలుగా పగలు కూడా ఒంటరిగా ఎక్కడికీ వెళ్ళలేకపోతున్నాను. మనస్సంతా ఇదే ఆలోచనతో ఉండడం వల్ల ఏ పనినీ ఏకాగ్రతతో చేయలేక పోతున్నాను. ఈ భయం నుండి ఎలా బయటపడాలో తెలుపగలరు.**




**జవాబు:** చిన్నపిల్లలు చీకటిలో భయపడతారు. కానీ మీరు పట్టపగలే భయపడుతున్నారు. బయట దయ్యాలు తిరుగుతున్నాయని ఎవరో చెప్పిన మాటల్ని నమ్మి భయపడుతున్నారంటే, 'మీ హృదయంలోనే సదా భగవంతుడు ఉన్నాడు' అన్న భగవాన్ శ్రీకృష్ణుని బోధపై మీకు విశ్వాసం లేదని తెలుస్తోంది. అంటే మాధవుని మాట కన్నా మానవుని మాటకే ప్రాధాన్యం ఇస్తున్నారన్నమాట!

If there is anything in the world which can be called sin, it is this - 'fear'. It is fear that is the greatest of all supersti-tions. It is fear that is the cause of our woes...

***- Swami Vivekananda***

'ఈ ప్రపంచంలో పాపం అనేది ఏదైనా ఉందంటే అది 'భయం' మాత్రమే. భయమే మూఢనమ్మకాలకు మూల కారణం. భయమే మన దుఃఖాలన్నింటికీ ముఖ్య కారణం' అని అంటారు స్వామి వివేకానంద.

నరేంద్రుడు (స్వామి వివేకానందుని బాల్యనామం) చిన్నప్పుడు స్నేహితులతో ఆడుకొనేటప్పుడు చెట్టెక్కి కొమ్మలు పట్టుకుని వ్రేలాడేవాడు. నరేంద్రుణ్ణి చెట్టు ఎక్కకుండా చేయాలని ఓ వృద్ధుడు నరేంద్రునితో 'ఆ చెట్టు మీద భూతం ఉంది. అది చెట్టెక్కిన వాళ్ళ గొంతు నులిమి చంపేస్తుంది' అన్నాడు. ఆ వృద్ధుని మాటలు విని నరేంద్రుని స్నేహితులంతా భయపడి పారిపోయారు. కానీ నరేంద్రుడు మాత్రం చెట్టెక్కి కొమ్మను పట్టుకొని వ్రేలాడుతూ ఆడుకోవడం మొదలుపెట్టాడు. కొంతసేపటికి ఓ స్నేహితుడు వచ్చి 'చెట్టు మీద భూతం ఉందని తాతయ్య చెప్పాడు కదా! వెంటనే చెట్టు దిగి వచ్చెయ్. లేకపోతే భూతం నిన్ను చంపేస్తుంది' అన్నాడు. అందుకు నరేంద్రుడు 'నువ్వు వట్టి పిరికివాడివి. ఆ తాతయ్య మాటలు నమ్ముతావా! ఒకవేళ తాతయ్య మాటలు నిజమే అయితే ఇన్ని రోజుల నుంచీ ఆడుకుంటున్న మనల్ని ఆ భూతం ఎందుకు చంపేయలేదు?' అని స్నేహితుణ్ణి ఎదురు ప్రశ్న వేశాడు. అప్పుడు ఆ స్నేహితుడు, నరేంద్రుడన్న మాటలు నిజమేనని తెలుసుకున్నాడు.

పైన చెప్పిన సంఘటనలో నరేంద్రుడు చెప్పిన మాటల్ని ఒక్కసారి గుర్తుచేసుకోండి. నిజానికి దయ్యాలు మీకు హాని చేయాలని అనుకుంటే రెండు సంవత్సరాలుగా హాని చేయకుండా ఎందుకున్నాయని మీరే ఆలోచించుకోండి. ఇతరులు చెప్పిన మాటల్ని నమ్మి మనస్సును దయ్యాలకొంపగా మార్చుకోవడమే మీ భయానికి అసలు కారణం.

Fear demoralizes character, de-stroys ambition, causes disease, paralizes happiness and prevent achievement.

***- Sweth Marden***

భయం ఉంటే వ్యక్తిత్వం వికసించదు, జీవిత గమ్యాన్ని ఏర్పరచుకోలేం, సంతోషంగా ఉండలేం, లక్ష్యాల్ని సాధించలేం.

మిమ్మల్ని ఆవరించింది పిరికితనం మాత్రమే. మీలో భయం పోవడానికి 'భూత పిశాచ నికట నహి ఆవై, మహావీర జబనామ సునావై' – ఎవరి నామాన్ని వింటే భూత ప్రేత పిశాచాలు దరిచేరవో అలాంటి మహావీర హనుమంతుని నామాన్ని స్మరించండి.

The wise man in the storm prays God, not for safety from danger, but for deliverance from fear.

***- Ralph W. Emerson***

వివేకవంతులు ఆపదల నుండి తమను కాపాడాల్సిందిగా భగవంతుణ్ణి కోరరు. భయ విముక్తుల్ని చేయాల్సిందిగా ప్రార్థిస్తారు. కాబట్టి దయ్యాల నుంచి రక్షించాల్సిందిగా భగవంతుణ్ణి ప్రార్థించడం కన్నా మీలో భయాన్ని తొలగించాల్సిందిగా ప్రార్థించండి. ❖

**మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :**

**యువవాణి**

**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**

**దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029**



# అహింసో పరమోధర్మః

- స్వామి రఘునాయకానంద

ఈనాడు హింస అన్ని రంగాలలోను వ్యాపించింది. హింస అంటే కత్తులతో చేసేదే కాదు. సమావేశాలలో పాల్గొంటామని చెప్పి రాకపోవడం, స్నేహితులతో వస్తామని చెప్పి వేరే కార్యకలాపాలలో మునిగిపోవడం. స్వార్థబుద్ధితో తాము కోరినది దక్కలేదని చేసే దాడులు, హింసాత్మక క్రియలు, మారణహోమాలు, హత్యలు సర్వసాధారణమైపోయిన ఈ రోజులలో అహింస అనే పదమే హాస్యాస్పదంగా మారిపోయింది.

ఏ జీవినీ హంసించకుండా ఉండడమే అహింస అయితే మరి వైద్యుడు రోగిని రక్షించడానికి చేసే శస్త్రచికిత్స, దేశ రక్షణకోసం సైనికులు చేసే భీకరపోరాటం, తన బంధు వర్గాన్ని దుండగుల బారి నుండి రక్షించడానికి ఒక వ్యక్తి చేసే పోరాటం... ఇవన్నీ హింసాత్మక సంఘటనలైతే మరి వారంతా హింసను ప్రేరేపించిన వారవుతారా?

## ఏది అహింస

ఈ పని హింస ఈ పని అహింస అని నిర్ణయించడం కార్యాన్ని బట్టి కాక భావాన్ని బట్టి ఏర్పడుతుంది. మనిషి జీవితంలో నడవడి అహింస. మనకు ఏవైతే హాని కలిగిస్తాయో, కష్టం కలిగిస్తాయో ఆయా విషయాలలో ఇతరులకు మనం హానికలిగించకూడదు. అంతేకాదు మన ఆలోచనల ద్వారా, చేతల ద్వారా, మాటల ద్వారా ఇతరులకు కష్టం కలిగించకుండా ఉండాలి. అహింసకు కావల్సింది – హాని కల్గించని మనస్సు, ప్రేమతో పలకరించే నోరు, ఇతరులకు సహాయపడే చేతులు. అహింస అంటే కేవలం హింసించకుండా ఉండడం మాత్రమే కాదు. అహింస అంటే ప్రేమను కూడా చూపించాలి. ఈ రెండూ కలిస్తేనే నిజమైన అహింస అంటారు మహాత్మా గాంధీ, క్షమాగుణం – అదే నిజమైన బలం.

## ఆరోగ్య రక్షణకై అహింస

ఇతరులకు హాని కలిగించడం ద్వారా మనం ఒక విధమైన మానసిక రుగ్మతకు గురవుతాం. తద్వారా మానసిక ఆరోగ్యం క్షీణిస్తుంది. పతంజలి మహర్షి మానసిక అనారోగ్యానికి దోహదం చేసేవి చంపడం, అసత్యం పలకడం, కోపం, అజ్ఞానం అని చెబుతారు. 'ప్రతి దుర్భావం, ద్వేషపుటాలోచన అతి రహస్యంగా కొండగుహలో కూర్చొని తలచినా, అది నిక్షిప్తమై ఎప్పుడో ఒకప్పుడు అప్రతిహతశక్తితో, ఏదో ఒక రూపంలో నిన్ను తప్పకుండా పొందుతుంది'అని అంటారు స్వామి వివేకానంద. దుఃఖం మానసిక ఆరోగ్యాన్ని క్రుంగ దీస్తుంది. అందుచేత మన ఆలోచనలు సర్వుల హితం కోరేవిగా ఉండాలి.

## అసూయ లేకపోవడం అహింస

అసూయ లేకుండడమే అహింసకు నిదర్శనం. ఎవరిపట్లా అసూయలేనివాడు ఎవడో అతడే మానవకోటిని ప్రేమిస్తాడు. లోకంలో అల్పమైన పేరు ప్రతిష్ఠల కోసం, నాలుగు రూపాయల కోసం ఒకరి పట్ల ఒకరు అసూయాద్వేష పూరితులవ్వడం చూస్తాం. హృదయంలో ఈ అసూయ ఉన్నంత వరకు పరిపూర్ణ అహింసను సాధించలేం. నిర్భయులకే అహింసను ఆచరించడం సాధ్యం. బలహీనులు అహింసను పాటించలేరు. ఇతరులు మనపై ద్వేషభావాన్ని ప్రదర్శిస్తే మనం వారిపై ప్రేమను ప్రదర్శించడానికి చాలా బలం అవసరం.

అసూయాద్వేషాలు లేకుండా, ఒకరినొకరు ప్రేమతో పలకరించుకొంటూ, మనసా వాచా కర్మణా వీలైనంత వరకు బుద్ధిపూర్వకంగా ఇతరులతో బాగా మెలగుదాం. సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని సాధిద్దాం. అదే అన్ని ధర్మాలలో కెల్లా పరమ ధర్మం–అహింసో పరమో ధర్మః❖




**- ఎమ్. గౌరీశంకరశర్మ**

ఆత్మను గురించి అధ్యయనం చేయడమే ఆధ్యాత్మికత. ఆత్మ శబ్దానికి వేదాల్లో, ఉపనిషత్తుల్లో, పురాణాల్లో చాలా అర్థాలు ఉన్నాయి. అన్నింటి సారం స్థూలంగా అర్థం చేసుకుంటే – తనను గురించిన అధ్యయనమే ఆధ్యాత్మికత. ఆత్మవిశ్వాసం, ఆత్మాభిమానం, ఆత్మబలం మొదలైన పదాలు మనం వింటూనే ఉంటాం. అవన్నీ ఆత్మకు సంబంధించినవే.

పాశ్చాత్య సంస్కృతి ప్రభావం వల్ల నేటి యువతరంలో ఆధ్యాత్మిక భావాలు నానాటికీ కొరవడుతున్నాయి. రోజు రోజుకూ మానవుడు తన సహజత్వాన్ని కోల్పోతున్నాడు. ఇది ఇలాగే కొనసాగితే చివరకు తన అస్తిత్వాన్నే కోల్పోయే ప్రమాదం ఉంది. దీనిపై నేటి విద్యావిధానం ప్రభావం చాలా ఉంది. ఈనాటి విద్య యాంత్రికమైన విద్య. ఈ యాంత్రికత మనుష్యుల్లో ముఖ్యంగా యువకుల్లో ప్రబలంగా కనపడుతోంది. విద్య లక్ష్యం తనను గురించి తాను తెలుసుకోవడం. "యా విద్య సా విముక్తయే విద్యయాஉమృత్ మశ్నుత్" అని ఆర్యోక్తి. ఇలాంటి విద్య గ్రంథాలకు మాత్రమే పరిమితమై పోయింది. ఈనాటి యువతరం కంప్యూటర్ విద్య, వ్యాపార విద్య మొదలైన వాటి వైపు మొగ్గుచూపడం జరుగుతోంది.

భారతదేశం, ఆర్యావర్తం, పుణ్యభూమి, కర్మభూమి అని చెబుతారే కానీ మాటల్లో, చేతలలో ఈనాటి తరం చూపించడం లేదు. సంస్కృతి, సంప్రదాయం, ఆచారాలు లాంటి ఆధ్యాత్మిక విలువల్ని మరచిపోతున్నారు. "*యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః*" (ఎక్కడ స్త్రీలు పూజింపబడతారో అక్కడ దేవతలుంటారు) అనే సంస్కృతి మనది. ఎంతసేపూ మనిషి కొత్త కొత్త పరిశోధనలు చేసి యంత్రాలు కనుక్కుంటున్నాడు, కనిపెట్టడానికి ప్రయత్నిస్తున్నాడు కానీ తనను తాను తెలుసుకోడానికి ప్రయత్నించడం లేదు. ఇతర గ్రహాల మీద మనుష్యులున్నారా? లేదా? ఏ గ్రహం ఎక్కడుంది? ఏ గ్రహంపై ఏముంది? అని పరి పరి విధాల పరిశోధిస్తున్నాడు, కానీ తనలో ఏం శక్తులున్నాయో గ్రహించలేకపోతున్నాడు. అంతరిక్షయానం కోసమేగానీ అంతరంగయానం గురించి ఎవ్వరూ ఆలోచించడం లేదు.

ఎందరో మహానుభావులు "నరత్వం దుర్లభం లోకే" – 'మానవజన్మ లభించడం చాలా కష్టమ'ని చెబుతారు. అలాంటి మనుష్య జన్మ వ్యర్థం చేసుకుంటున్నాడు. మానవుడు ఒక అద్భుతమైన శక్తి కేంద్రమని మహర్షులు చెబుతారు. ఆ శక్తిని కనుగొనడానికి కావలసిన స్థితప్రజ్ఞత, విజ్ఞానం, మానసిక స్థితి యుక్తవయస్సులో మాత్రమే ఉంటుంది. అలాంటి మనస్సును తాత్కాలికమైన ఫలితాలనిచ్చే భౌతిక విషయాలకు వాడుకోవడం జరుగుతోంది. కొంతమంది యువకులు వృద్ధాప్యంలో ఆధ్యాత్మికత గురించి ఆలోచించవచ్చు, అప్పుడే తొందర ఏమొచ్చింది అంటారు. కానీ దానికి యుక్త వయస్సే సరైనది. శారీరక దారుఢ్యం ఉన్నప్పుడే మనస్సు దృఢంగా ఉంటుంది. యువత ఈ భౌతిక పరిధిని దాటి ఆలోచించాలి, అన్వేషించాలి. తన కాళ్ళమీద తాను నిలబడాలి అంటే మనిషి స్వయంశక్తిపై ఆధారపడి జీవించడం నేర్చుకోవాలి. నేటి యువత ఇంద్రియాలకు బానిసలై అనేక వ్యసనాలకు లోనైపోతున్నారు. బావిలోని కప్పల్లాగ బ్రతుకుతూ అదే సర్వస్వం అనుకుంటున్నారు. ఈ బానిసత్వానికి స్వస్తి పలకాలి. నిజ స్వరూపాన్ని గ్రహించాలి. మొట్టమొదట తన అజ్ఞానాన్ని గ్రహించాలి. స్వామి వివేకనాంద "బలమే జీవనం – బలహీనతే మరణం" అన్నారు. బలమంటే మానసిక బలం అని అర్థం. మానసిక బలంతో మనిషి కనీవినీ ఎరుగని అద్భుతాలను సృష్టించగలడు.

> *ఆత్మను మరచి అస్థిపంజరం వైపు దృష్టిని మరల్చిన మానవులు 'నేను', 'నేను' అని భ్రమిస్తున్నారు. బలహీనతలన్నింటికీ ఇదే మూలం. మన ఆత్మ శక్తిని మనం విశ్వసించకపోవడమే నాస్తికత అని వేదాంతం బోధిస్తుంది. ఎల్లప్పుడూ ఆత్మను గురించి వినండి, ఆత్మను గురించి మాట్లాడండి, ఆత్మను గురించి విచారణ చేయండి. అప్పుడే మీలోని ఆత్మ మేల్కొంటుంది.*
>
> **- స్వామి వివేకానంద**

"సోత్సాహనాం నాస్త్యసాధ్యం నరాణాం" – అంటే ఉత్సాహవంతులకు ప్రపంచంలో అసాధ్యమంటూ ఏమీ లేదు. ఆ ఉత్సాహం మానసిక బలం వల్లే వస్తుంది. దీనికి తగినట్లుగా తల్లితండ్రులు కూడా జీవిత పరమార్థాన్నీ వారికి తెలియజేయాలి. చిన్నప్పుడే మంచి భావాలు నేర్పితే, పెరిగిన తర్వాత కూడా ఆ ప్రభావం ఉంటుంది.

ఈనాటి విద్యావిధానం ఒక సమాచార సేకరణ మాత్రమే; ఆధ్యాత్మికాంశాలు అణుమాత్రమైనా ఉండవు. 'సత్యమేవ జయతే' అనేమాటకు అర్థం చెప్పేవారూ, గాంధీగారి 'స్వతంత్ర' శబ్దానికి అర్థాన్ని వివరించేవారూ, శంకరాచార్యుల జీవుడు–పరమాత్మ అనే పదాలకు ఆలోచన కల్పించేవారూ, రామకృష్ణ – వివేకానందుల సందేశాలని ఒంట బట్టించేవారూ ఎంతమంది ఉన్నారు? పూర్వకాలంలో పాఠశాలలు ఆశ్రమాలలా ఉండేవి. అక్కడ అన్ని విద్యలతో పాటు ఆధ్యాత్మిక విద్యనూ బోధించేవారు. అందుకే

ఆచార్యాత్ పాదమాదత్తే
పాదం శిష్య స్వ మేధయా ।
పాదం సబ్రహ్మచారిభ్యః
పాదం కాలక్రమేణ చ॥

'విద్యార్థికి పావు భాగం గురువుగారు బోధిస్తే, పావువంతు జ్ఞానం తన మేధస్సుతో (స్వంతంగా) నేర్చుకుంటాడు. పావు తన తోటివారితో, పావు కాలగమనంలో (అనుభవపూర్వకంగా అదే వస్తుంది) నేర్చుకుంటాడు' అనేవారు.

అది అక్షర సత్యం. కాబట్టి నేటి పరిస్థితుల్లో యువతరం మొదట మహాత్ముల చరిత్రలు తెలుసుకోవాలి. వారి బోధనల్ని చదివి ఆచరించడానికి ప్రయత్నించాలి. ఆ బాధ్యత తల్లితండ్రుల మీదా, ఉపాధ్యాయుల మీదా కూడా ఉంది.

రామాయణ, భారత, భాగవత గ్రంథాల్నీ, వివేకానందుని సూక్తులనూ చదివి తెలుసుకున్నట్లయితే యువతరానికి ఇంకా మంచి భవిష్యత్తు ఉంటుంది. కనుక యువతరం ఆర్థికాభివృద్ధి కోసమే కాకుండా ఆధ్యాత్మిక అభివృద్ధికి కూడా కొంచం సమయాన్ని కేటాయించడం ఎంతైనా అవసరం. అప్పుడే భారతీయ పూర్వ వైభవం, మహర్షుల ఆశయాలు సఫలీకృతమవుతాయి. ❖

# మురికిలో కొట్టుమిట్టాడకు!

– ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి



**ఆశ చేత మనుజులాయువు గల నాళ్ళు**
**తిరుగుచుండ్రు భ్రమను త్రిప్పలేక**
**మురికి భాండమందు ముసురు నీగల భంగి**
**విశ్వదాభిరామ వినుర వేమ!**

**భావం :** మనిషికి ఆశ ఉంటుంది; అది ఎంతో కావాలనే ఆశే; ఆ ఆశతో మానవులు ప్రాణమున్నన్ని రోజులూ తిరుగుతూనే ఉంటారు. ఆ భ్రాంతిలో పడి, దుర్గంధం ఉన్న కుండలో తిరిగే ఈగల్లా తిరుగుతూనే ఉంటారు.

జానెడు పొట్టకు సరిపోయేంత గాక ఇంకా ఎంతో సంపాదించాలనే కోరిక, తన ఏడు జానెల శరీరానికి ఏడు బంగళాలు కావాలనే కోరిక, తరతరాలకు సరిపోయేంత కూడబెట్టి పోవాలనే ఆకాంక్ష; మరణించే వరకూ ఇదే విధంగా ఆశతో వ్యవహరిస్తే – ఇక ఈ పరమ పదానికి, ఆ పరమాత్ముని సన్నిధికి చేరేదెలా!

అందుకే భ్రాంతిలో పడి తిరగడాన్ని యోగి వేమన నిరసిస్తున్నారు. ఆశ అనేది మురికి లాంటిది. మురికి చుట్టూ ఈగలు ముసురుతాయి. మానవులు ఈగలు కారు. మానవులు దివ్యత్వం వైపు వెళ్ళాలి. మురికి కుండలో మురగరాదు. ఇంత సువిశాల విశ్వంలోని దివ్య పరిమళాల్ని ఆఘ్రాణించాలి. అందు కోసం యోగమార్గాన్ని అనుసరించాలి. ధ్యానమార్గాన్ని అనుసరించాలి.

ఆశతో దుర్యోధనుడు, రావణుడు, హిరణ్యకశిపుడు, కంసుడు, తదితరులెందరో అశాంతిలో కూరుకుపోయారు. అంతటా అశాంతిని వ్యాపింపజేశారు. అందుకే ఆశ ఉండరాదు; మురికి కుండల్లో మురగరాదు. జీవితాన్ని పరమాత్మ అనే పరిమళ భాండాల్లో నిలపాలి. ఇదే వేమన వేదం, వేదాంతం. ❖



# ముందుకు సాగిపో!

(1884 – 1967)

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884–1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ – వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

సార్‌గచీ,
15 జనవరి 1951

ప్రియమైన తారాపద!*

నీవు భగవద్గీత, శ్రీరామకృష్ణ కథామృతం చదువుతున్నావని తెలిసి ఆనందించాను. గీత వంటి గొప్ప గ్రంథం మరొకటి లేదు. మానవ జీవితంలోని అన్ని సందర్భాలకూ గీత పరిష్కారాలను చూపుతుంది. కథామృతం గీతకు వ్యాఖ్యానమేనని తెలుసుకో. రెండు గ్రంథాలూ బోధిస్తున్నది ఒకే పరమాత్మ గురించి.

మతమన్నది సృష్టి రహస్యాలన్నింటినీ అర్థం చేసుకొనే శాస్త్రం. చావు పుట్టుకలు, ఇహపరాలు – వీటికి సంబంధించిన రహస్యాలను వెల్లడిస్తుంది మతం. భౌతికశాస్త్రమన్నది మతశాస్త్రంలోని భాగం మాత్రమే. ఈ విశ్వానికి ఆవల ఉన్న మహాకారణాన్ని మతశాస్త్రం శోధన చేస్తుంది. ఈ పరిశోధనలో ఇమిడి ఉన్న పద్ధతినే మనం మతం అని అంటున్నాం.

వైదిక మతం అంతరించి, దాని స్థానాన్ని మూఢనమ్మకాలు ఆక్రమించాయి. సమాజాన్ని ఉన్నత స్థానంలో నిలుపలేకపోయి, జీవితసమస్యలను తీర్చలేకపోయినప్పుడు దాన్ని మతం అనడం కన్నా, పాపం అనడం సబబు.

దేశ పరిస్థితులను గమనించు. ఎక్కడా, ఏ పనీ ఒక విధివిధానం ప్రకారం జరగడం లేదు. మనకు స్వాతంత్ర్యం లభించినది మొదలు అనాత్మవాదం, విలువల రాహిత్యామూ పుష్కలంగా దర్శనమిస్తున్నాయి. ఈ దేశానికి ఇప్పుడు అన్ని రంగాలలోనూ నిజమైన మనుష్యులు కావాలి. సంపూర్ణ మానవ వికాసమే జీవిత లక్ష్యం కావాలి.

నీకు ఉన్న సమయంలో మూడు వంతులు పఠనానికీ, ఒక వంతు దాన్ని ప్రతిఫలింప చేసుకోడానికీ వినియోగించు. జపధ్యానాలను క్రమం తప్పక సాధన చేస్తుండు. భగవన్నామాన్నీ, ఆయన లీలలనూ స్మృతిపథంలో ఉంచుకో! అప్పుడు నీ మనస్సు, ఇంద్రియాలూ నీ అదుపులో ఉంటాయి.

కాలాన్ని సమర్థంగా వినియోగించడంలో జాగ్రత్త వహించు. పురాణ గ్రంథాలు ప్రతినిత్యం చదువుతుంటే నీకు పఠనా సామర్థ్యం పెరుగుతుంది. నిరంతరం భగవానునిపై ధ్యాస ఉంచితే, నీ మనస్సు అదే భావంతో ఘనీభవిస్తుంది.

ఒక ముఖ్యమైన విషయం నువ్వు అర్థం చేసుకోవాలి. మనం ఈ ప్రాపంచిక లంపటాల్లో పడి అనేక జన్మలు గడిపాం. కేవలం కొద్ది సంవత్సరాల్లోనే మన ఆలోచనలను, మనస్సును అదుపులోపెట్టి శ్రీరామకృష్ణులపై ఏకాగ్రం చెయ్యడం సాధ్యం కాదు. మనఃపూర్వకంగా గొప్ప జిజ్ఞాసతో నీవు చాలాకాలం పోరాటం సల్పాలి. లేకపోతే ఫలితం ఉండక పోగా పూర్తి నిరాశకు గురవుతావు. కలత చెందకుండా శ్రీరామకృష్ణులు మనకు రక్షణగా ఉన్నారని భావించు. ఆయన పైన విశ్వాసంతో మనం సాహసవంతులమై ఈ కఠోర మార్గంలో పయనిస్తున్నాం. ముందుకు సాగిన కొద్దీ ఆయన అనుగ్రహానికి సాక్షీభూతుల మవుతాం. నిర్భయంగా ముందుకు సాగిపో... అనుగ్రహాన్ని పొందే రోజు అతి సమీపంలోనే ఉంది.

ప్రేమాశీస్సులతో...
స్వామి ప్రేమేశానంద

(*కాలాంతరంలో రామకృష్ణ సంఘంలో 'స్వామి అబ్జజానంద'గా ప్రసిద్ధులు)

తెలుగుసేత : కె. త్రివిక్రమరావు



# మౌనంగా బోధించిన మునీంద్రుడు
# సదాశివ బ్రహ్మేంద్రుడు

"భారతదేశంలో (ఆధ్యాత్మిక) మహాపురుషులు ఏ కాలంలో అయినా కరువయ్యారని ఏ ఒక్కరైనా చూపించగలరా? భరతమాత విశాల దృక్పథం, ఉన్నతభావాలు గల ఋషులకు జన్మనిస్తూనే ఉంది. అలాంటి ఆధ్యాత్మిక రత్నాలు మౌనంగా యావత్ ప్రపంచంలోని ప్రజా సంక్షేమానికై పాటుపడుతూనే ఉన్నారు" అన్నారు స్వామి వివేకానంద. ఈ మహాత్ముల పట్ల మనఃస్ఫూర్తిగా నమ్మకం కలిగి ఉండాలి.

అలాంటి వారిలో సదాశివ బ్రహ్మేంద్ర ఒకరు. తిరుచినాపల్లి తాలూకాలో కావేరీ నదీతీరంలో ఉన్న 'నేరూరు' అనే గ్రామంలోని శివాలయంలో ఒక బిల్వ వృక్షం ఉంది. ఆ దేవాలయంలో ఉన్న ఈ మహాత్ముడి సమాధిని దర్శించడానికి జనులు తండోపతండాలుగా వెళ్తారు.

ఈ మహాత్ముని తండ్రి మోక్ష సోమసుందర అవధాని అనే పండితుడు. ఆయన తనకు ఒక కుమారుణ్ణి ప్రసాదించాల్సిందిగా రాముణ్ణీ, కృష్ణుణ్ణీ ప్రార్థించారు. తల్లి పార్వతి శివుణ్ణి ప్రార్థించింది. అందువల్ల అతనికి శివరామకృష్ణ అని నామకరణం చేశారు.

చిన్నతనం నుంచే ఆయనకు పూర్తి వైరాగ్య భావం ఉండేది. అతను ఊరూరా తిరుగుతూ, భిక్షాటన చేస్తూ అడవుల్లో, నదీ తీరాల్లో గడిపేవాడు. నివసించడానికి తనకే వసతి లేనపుడు భగవంతుడికి వసతి ఎలా కలిగించగలడు! అందువల్ల మనస్సునే భగవంతుని నివాసంగా చేసి, భగవత్ ప్రార్థన చేసి, ఈ 'మానసిక పూజ'ను 'శివమానసిక పూజ' అన్న గీతంలో వర్ణించారు:

"ఓ మహాదేవా! విశ్వవ్యాప్తుడవైన నిన్ను ఎక్కడ పూజించను! నీ బాహువులు, పాదాలు అంతటా వ్యాపించి ఉండగా నీ పాదప్రక్షాళన ఎలా చెయ్యగలను! గొప్ప నర్తకుడవైన నీ ముందు నేనెలా నృత్యం చెయ్యగలను!"

శివరామకృష్ణుని భక్తికి శివుడు స్పందించి కామకోటి పీఠానికి చెందిన పరమ శివేంద్ర సరస్వతీ స్వామిని గురువుగా స్వీకరించమని ఆజ్ఞాపించాడు.

గురువు ఇతనిలోని చైతన్యానికి ముగ్ధుడయి "సదా శివ" అని పిలిచారు. సదాశివుడు తన గురువుకు శుశ్రూషలు చేశాడు. అనేక కీర్తనలు రచించాడు. పండితుల సమక్షంలో తన విజ్ఞానాన్ని ప్రదర్శించాడు. బ్రహ్మసూత్రాలకూ, పతంజలి యోగ సూత్రాలకూ వ్యాఖ్యానం వ్రాశాడు. తన పాటలన్నిటినీ గురువుకు అంకితం చేశాడు. ఆయన రచించిన కీర్తనలలో 'పరమ హంస గురు" అన్న పదం ఉంటుంది.

గొప్ప గొప్ప విద్వాంసులు ఇతని జ్ఞానాన్ని చూసి ఓర్వలేక పోయారు. వేదాంత చర్చల్లో అతని వద్ద ఓటమి పొందిన ఒక పండితుడు, గురువుకు సదాశివ గురించి ఫిర్యాదు చేసాడు. గురువు అతణ్ణి 'నీవు ఎప్పుడు మౌనం వహిస్తావు'అని అడిగారు. "గురుదేవా! ఈ క్షణం నుంచే నేను మౌనం వహిస్తాను" అని చెప్పి మౌనాన్ని అవలంబించి, భావ యుక్తంగా ఎన్నో పాటలు రచించాడు. గురువునూ, ప్రాపంచిక సంప్రదాయాలనూ వదలి, దిగంబరుడై తిరుగుతుండే వాడు. బ్రహ్మానందభరితమైన ఆత్మ జ్ఞానాన్ని అనుభవించాడు.

ఒక రోజు మధ్యాహ్నం ఆయన ఒక ధాన్యపు రాశి ప్రక్కన కూర్చొని ధ్యానమగ్నులయ్యారు. సాయంత్రం రైతు వచ్చి ఆయనను చూసి దొంగ అనుకుని కొట్టడానికి కఱ్ఱ పైకెత్తాడు. అంతే! రాత్రంతా అతను శిలలా ఉండిపోయాడు. మర్నాడు ఉదయం స్వామి మామూలు స్థితికి వచ్చి, కృషీవలుణ్ణి చూసి నవ్వగా అతను మళ్ళీ చైతన్యవంతుడై తనను క్షమించాల్సిందిగా ప్రార్థిస్తూ స్వామి కాళ్ళ మీద పడ్డాడు. స్వామి మౌనంగా అక్కడ నుంచి కదిలారు.

ఒకసారి కావేరీ నదీ తీరంలో కూర్చొని సదాశివ బ్రహ్మేంద్ర స్వామి సమాధి మగ్నుడయ్యారు. బాహ్య ప్రపంచపు స్పృహను

కోల్పోయారు. కుండపోతగా వర్షం కురవసాగింది. అక్కడ నుంచి కదలాల్సిందిగా ఎందరో చెప్పారు. కానీ ఆయన చెవులకు వినపడలేదు. ఆయన ఇంద్రియాలు, మనస్సు అంతర్ముఖం అయి ఉన్నాయి. నీళ్ళలో ఆయన కొట్టుకు పోయారు. ఆయన మరణించారని జనులు దుఃఖించారు.

మూడు నెలల తరువాత ఒక వ్యవసాయదారుడు నదీ తీరంలోని ఇసుకను త్రవ్వి బండిలో పోస్తుండగా అతని పార రక్తసిక్తమయింది. అతను జాగ్రత్తగా త్రవ్వగా సదాశివ బ్రహ్మేంద్ర స్వామి మూడు నెలల క్రితం ఎలా కూర్చొని ఉన్నారో ఇప్పుడూ అలాగే ధ్యానమగ్నులై ఉన్నారు. జనులు ఆయనను శివావతారంగా భావించి పూజించసాగారు.

ఒక ఛాందస బ్రాహ్మణుడు స్వామి నిజంగా అవధూత కారనీ, నాటకమాడుతున్నారనీ చెప్పాడు. సదాశివ మౌనంగా ఒక చాకలి వాని దగ్గరకు వెళ్ళి, అతని నాలుక మీద ఏదో వ్రాశారు. ఆ చాకలి వెంటనే వేదమంత్రాలు పఠించాడు. ఏమి ఆశ్చర్యం! నిరక్షరాస్యుడు అతని స్పర్శ మాత్రం చేత జ్ఞాని అయ్యాడు. పండితుడు అజ్ఞాని అయ్యాడు.



ఒకసారి ఒక ముసల్మాన్ స్వామి భుజాన్ని ఖండించాడు. రక్తం స్రవిస్తున్నా స్వామి ఏమీ కానట్టు నడచి వెళుతుంటే, అతడు తన కళ్ళను తానే నమ్మలేక స్వామితో 'మీ చేయిని ఖండించాను' అని చెప్పాడు. స్వామి నిదానంగా చేతిని తాకగానే అది యథాస్థితిని పొందింది. ముసల్మాన్, స్వామి కాళ్ళమీద పడి క్షమాపణ కోరాడు.

ఆయన ఆ విధంగా సమయం వచ్చినప్పుడు ఎన్నో అద్భుతాలను ప్రదర్శించేవారు. ఒకే సమయంలో ఎన్నో ప్రదేశాలలో కనిపించేవారు. భక్త బృందం తనతో ఉండాలని ఎన్నడూ తలచలేదు. పిల్లలు అమాయకంగా ఉంటారు కనుక వారిని ఇష్టపడేవారు.

జీవితపు చివరిదశలో స్వామి నేరూరులో స్థిరపడ్డారు. ఒకసారి పిల్లలు మదురైలో జరుగుతున్న సంత చూడాలని ఆసక్తి చూపిస్తే, వారిని కళ్ళుమూసుకోమని మదురైకు తీసుకువెళ్ళి సంత చూపించి తినుబండారాలు కొనిపెట్టి మళ్ళీ కళ్ళు మూసుకోమని నేరూరుకు తిరిగి తీసుకువచ్చారు స్వామి.

పిల్లలు తమ అనుభవాన్ని చెప్పగా తల్లితండ్రులు ఆశ్చర్య చకితులయ్యారు. స్వామి ఒకే సమయంలో కాశీ, నేరూరు, కంచి, పూరీ – అన్ని చోట్లా కనిపించారు.

స్వామి బంధాలు లేకుండా సన్న్యాసిగా ఇతరుల బాగు కోసమే జీవించారు. మరణ సమయం ఆసన్నమవగానే తన శిష్యులకు కబురుపెట్టి, "నేను ఈ భౌతిక శరీరాన్ని చాలిస్తున్నాను. మీరు నాకు సమాధి కట్టి దానిపై బిల్వ వృక్షం నాటండి. ఆ సమయంలో కాశీ నుంచి ఒక బ్రాహ్మణుడు తెల్లని శివలింగాన్ని తీసుకు వస్తాడు. ఆ లింగాన్ని నా సమాధి ముందు ప్రతిష్ఠించి నిత్యం పూజించండి. భగవంతుడి మీద నమ్మకం ఉంచండి. శాశ్వతుడైన భగవంతుణ్ణి పొందండి. ఇంద్రియాలనూ, మనస్సునూ మీ అధీనంలో పెట్టుకోండి" అని తన చివరి సందేశాన్ని వ్రాశారు. భక్తులు దుఃఖాన్ని ఆపుకోలేకపోయారు. ఒక భక్తుడు "భగవంతుడా! నువ్వు వదిలి వెళితే మమ్మల్ని ఆదుకునేదెవరు? నువ్వు లేకుండా మేము జీవించలేం. మాకు భగవంతుణ్ణి చేరడానికి తోవ చూపించు" అని విలపించాడు. సదాశివ స్వామి మరణిస్తూ అతి ప్రయాసతో కళ్ళు తెరచి, తన చివరి సందేశాన్ని కీర్తన ద్వారా తెలియజేశారు.

*'సర్వం బ్రహ్మమయం.. సర్వం బ్రహ్మమయం..'* – భగవంతుడు అంతటా ఉన్నాడు. అంతటా ఉన్న భగవంతుణ్ణి నువ్వు ఎక్కడ వెతుకుతావు? మనం అందరం బ్రహ్మంలోనే ఉన్నాం.

ఇప్పటికీ నవరాత్రి 'సమాధి దినం' పెద్ద ఎత్తున జరుపుతారు. దేవాలయంలో జరిగే పూజల నిమిత్తం ఖర్చుల కోసం పుదుక్కోట్టై మహారాజు ఒక గ్రామాన్ని దానం చేశాడు. ఆ ధన సహాయంతో ఉత్సవాలు జరుపుతారు. జీవించి ఉన్నప్పుడు కట్టెలా ఉండి ప్రజలకు సహాయపడ్డారు. మరణానంతరం చెట్టుగా ఉంటూ మానవాళికి సహాయపడుతున్నారు. మహాత్ములు తాము జీవించి ఉన్నా, మరణించినా మానవ జాతి హితవునే కోరుతారు. ❖ **సేకరణ : శ్రీమతి కె. జానకి**



# రామకృష్ణ మఠం

విజ్ఞానానంద మార్గ్, ముఠిగంజ్, అలహాబాద్-211 003 (ఉత్తర ప్రదేశ్)
ఫోన్: 0532 - 2413369, ఫ్యాక్స్: 2415235 Email : rkmathald@dataone.in



## త్రివేణీ సంగమ క్షేత్రంలో నూతన శ్రీరామకృష్ణ దేవాలయం

**ప్రియమిత్రులారా!**

ప్రయాగ (అలహాబాద్)లోని రామకృష్ణ మఠం 2010లో శతవార్షికోత్సవాలు జరుపుకోనుంది. ఈ శుభవార్త మీతో పంచుకోవడానికి ఆనందిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులలో ఒకరైన స్వామి విజ్ఞానానందజీ మహారాజ్ 1910లో ఈ మఠాన్ని ప్రారంభించారు. వారు ఆధ్యాత్మిక శక్తి సంపన్నులు, జీవన్ముక్తులు. స్వామి విజ్ఞానానందజీని రామకృష్ణ సంఘ ప్రథమ అధ్యక్షులూ, శ్రీరామకృష్ణుల ఆధ్యాత్మిక పుత్రుడూ అయిన స్వామి బ్రహ్మానందజీ మహారాజ్ 'గుప్త బ్రహ్మజ్ఞాని' అనేవారు. విజ్ఞానానందజీ జీవితమంతా దివ్యదర్శనాలతో నిండినది. ఆయన తమ 28 సంవత్సరాల తీవ్ర తపస్సాధనల దివ్యశక్తితో మఠ వాతావరణాన్ని ప్రభావితం చేశారు; మఠాన్ని సందర్శించే భక్తులు ఇప్పటికీ ఆ దివ్యశక్తి ప్రభావాన్ని అనుభూతి చెందుతారు.



ఈ ఆధ్యాత్మిక శక్తి చైతన్యాన్ని ప్రతి ఒక్కరూ తమ జీవితంలో సాక్షాత్కరింప చేసుకొనే విధంగా భగవాన్ శ్రీరామకృష్ణుల విశ్వజనీన దేవాలయాన్ని నిర్మించాలని చాలా సంవత్సరాలుగా అనుకుంటున్నాం.

అందుకు ప్రస్తుత ప్రార్థనా మందిరాన్ని 2010లోగా దివ్యమైన ఆలయంగా తీర్చిదిద్ది, శ్రీరామకృష్ణుల చలువరాతి ప్రతిమను ప్రతిష్ఠించాలని నిశ్చయించాం. జాతి మత విచక్షణ లేకుండా అందరూ దేవాలయానికి వచ్చి ధ్యానం చేసుకోవచ్చు.

రామకృష్ణ మఠం, మిషన్‌ల అధ్యక్షులు శ్రీమత్ స్వామి ఆత్మస్థానందజీ మహరాజ్ 2008, ఏప్రిల్ 11న ఈ ఆలయానికి శంకుస్థాపన చేశారు. రానున్న జనవరి నెలలో ఆలయ మహాసంప్రోక్షణ జరుగనుంది.

ఈ బృహత్తర ఆలయ నిర్మాణానికి సుమారు కోటి రూపాయలు వ్యయమవుతాయని అంచనా. ఈ ఉన్నత కార్యార్థం మిమ్మల్ని ఉదారంగా విరాళాలు ఇవ్వవలసిందిగా కోరుతున్నాం.

రామకృష్ణ మఠానికి ఇచ్చే విరాళాలన్నిటికీ 1961 నాటి ఆదాయపు పన్ను చట్టంలోని 80 (జి) విభాగం ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

"Ramakrishna Math, Allahabad" పేరున చెక్కు/ డి.డి. తీసి Ramakrishna Math, Vijnanananda Marg, Mutthiganj, Allahabad-211 003 కు పంపాల్సిందిగా మనవి. దయచేసి మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ ఇంగ్లీషు, లేక హిందీ భాషల్లోనే జరపాల్సిందిగా వినతి.

భగవాన్ శ్రీరామకృష్ణుల అనుగ్రహం అందరి మీదా వర్షించాలని వారి పాదపద్మాల వద్ద ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
**స్వామి త్యాగాత్మానంద**
అధ్యక్షులు




# వివేక నాదమే వారి జీవన వేదం!

– కరణం గోపాలకృష్ణ పిళ్లై

నా జీవితంలో నన్ను సర్వదా వెన్నాడే మధురానుభూతి ఈ సంఘటన. అది 1967వ సంవత్సరం. చిత్తూరు జిల్లాలోని పూతలపట్టు గ్రామంలో జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో సామాన్యశాస్త్ర ఉపాధ్యాయుడిగా పనిచేసేవాణ్ణి. పూతలపట్టు అనగానే, ప్రసిద్ధ కంబ రామాయణాన్ని తమిళం నుండి ఆంధ్రీకరించిన పూతలపట్టు శ్రీరాములు రెడ్డి గారు జ్ఞాపకం రాక మానరు. ఆనాడు ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షలుండేవి. పరీక్షలకు ముందు ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్ష వ్రాసే విద్యార్థులకు వీడ్కోలు సమావేశం జరిపేవారు. అప్పుడు ఒక విద్యార్థికి ఆటోగ్రాఫ్‌గా స్వామి వివేకానందుల సూక్తి ఒకటి వ్రాసి సంతకం పెట్టి ఇచ్చాను.



ఇది జరిగిన సుమారు 15 సంవత్సరాల తర్వాత తిరుపతి నుండి చిత్తూరు వెళుతున్నాను. ఒక వ్యక్తి వినయంగా నమస్కారం చేస్తూ, నా ప్రక్కన ఖాళీ సీట్లో కూర్చున్నాడు. అతడే కొంతసేపటికి "నన్ను గుర్తు పట్టలేదా సార్" అన్నాడు. "గుర్తుకు రావడం లేదు" అన్నాను. "సార్! నా పేరు కుప్పన్. ఎస్.ఎస్.ఎల్.సి.లో మీరు మా క్లాస్ టీచర్. నేను అల్లరి చేస్తే మీరు కొట్టిన దెబ్బ గుర్తు చూడండి" అంటూ అతను తన కణతను చూపాడు. వెంటనే గుర్తొచ్చింది. కుప్పన్ మహా అల్లరి చేసేవాడు. అది తలచుకొని నన్నగా నవ్వుకున్నాను.

మార్గం మధ్యలో కుప్పన్ ఊరు బండపల్లి వచ్చింది. కుప్పన్ నన్ను బలవంతం చేసి బస్సు దింపి, వాళ్ళ ఇంటికి తీసుకెళ్ళాడు. పోస్టల్ డిపార్టుమెంటులో తాను ఉన్నతాధికారిగా పనిచేస్తున్నట్టు చెప్పి, మిగతా కుటుంబ విషయాలన్నీ దారిలో క్లుప్తంగా చెప్పాడు. కొసమెరుపుగా, "ఇదంతా తమ ఆశీర్వాదమే సార్" అన్నాడు కల్లాకపటం లేకుండా! ఇంటికి చేరుకున్నాం. పెద్ద ఇల్లే! విశాలంగా ఉంది. భార్యా బిడ్డలను పరిచయం చేశాడు. చక్కని భోజనం పెట్టారు. సాయంత్రం నేను బయలు దేరుతున్నప్పుడు పండ్లు, పూలు, తమలపాకులు, ఖరీదైన బట్టలు పెట్టి సకుటుంబంగా సాష్టాంగ నమస్కారం చేశారు.

కాస్త ఆనందం, కాస్త మొహమాటంతో "ఇదంతా ఏంటి?" అన్నాను "ఏదో చిరుకానుక" అన్నారు దంపతులు భక్తి వినయాలతో. అంతలో కుప్పన్ పెద్ద పెద్ద అక్షరాలతో రంగులతో వ్రాయబడిన చక్కని పటాన్ని నా ముందుంచాడు. అందులో స్వామి వివేకానందుని గొప్ప సూక్తి "Arise, Awake and Stop not till the Goal is reached" బహు సుందరంగా వ్రాసి ఉంది. పటంలో కుడివైపున "స్వామి వివేకానంద" అని, ఎడమ వైపున కె. గోపాలకృష్ణ అని నా పేరు వ్రాసి ఉంది. "ఏంటయ్యా" అంటూ ఆశ్చర్యంగా చూశాను. "సార్! ఫేర్‌వెల్ రోజు నా ఆటోగ్రాఫ్‌లో మీరు ఈ కొటేషన్ వ్రాశారు. ఇదే నా జీవిత గమ్యమైంది. ఈ సూక్తి నాకూ, నా కుటుంబానికీ ఆదర్శమైంది. అందుకే ఈ సూక్తిని డ్రాయింగ్ మాస్టారు సయ్యద్ బాషాతో వ్రాయించి, ఫ్రేము కట్టించాను. ప్రతీ రోజూ ఈ సూక్తి చదివి, ఆ స్ఫూర్తితో మా కుటుంబం పనులు ప్రారంభిస్తుంది. మా అభివృద్ధికి స్వామి వివేకానందుని బోధలే మూలం. ఈ సూక్తులే మా జీవనానికి వేదాలు! నా ఆటోగ్రాఫ్‌లో ఈ సూక్తి వ్రాసిచ్చిన మీరే నా ఆదర్శ గురువులు" అని ఎంతో నమ్రతతో అన్నాడు కుప్పన్.

కుప్పన్ మాటలు విని నా కళ్ళు చెమర్చాయి. నేను వ్రాసిన స్వామి వివేకానందుల సూక్తిని అక్షరాలా పాటించి, కుప్పన్ నాకు నిజంగా గురువయ్యాడు. వట్టి మాటలే గానీ చేతలు లేని నేను కుప్పన్‌కు శిష్యుణ్ణయ్యాను. ❖

(కరణం గోపాలకృష్ణ పిళ్లై, పాకాల, చిత్తూరు జిల్లా)

మహనీయుల జీవితాల్లో

# మధురఘట్టాలు

- ఆర్. కృష్ణ



# సత్యనిష్ఠలో స్థిరచిత్తుడు

మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీజీకి తండ్రి నుంచి క్రమశిక్షణ, మంచి నడవడిక, తల్లి నుంచి దైవభక్తి అలవడ్డాయి. ప్రాథమిక విద్య పోరుబందరు, రాజ్‌కోట్‌లలో పూర్తయింది. గాంధీ చిన్నతనంలో హరిశ్చంద్ర నాటకం చూడడం జరిగింది. ఆ నాటకంలో హరిశ్చంద్ర చక్రవర్తి సత్యం కోసం తన భార్యను కూడా అమ్ముకుని కష్టాల పాలవడం గాంధీపై ప్రభావం చూపింది. అప్పటి నుంచి ఎన్ని కష్టాలు వచ్చినా సరే హరిశ్చంద్రుడిలా సత్ప్రవర్తనతో, నిజాయతీతో నడుచుకోవాలని భావించాడు. తన జీవితాన్ని పూర్తిగా సత్యనిష్ఠకు అంకితం చేశాడు.

ఒకనాడు గైల్స్ అనే ఆంగ్లేయుడు మోహన్‌దాస్ చదివే బడికి పరీక్షాధికారిగా వచ్చి, 'ఉక్త లేఖనం' (డిక్టేషన్) ద్వారా పిల్లల వర్ణక్రమ (స్పెల్లింగ్) సామర్థ్యాన్ని పరీక్ష చేస్తున్నాడు. ఆయన చెప్పిన అయిదు సరళమైన మాటలను మోహన్‌దాస్ తప్ప మిగిలిన అందరూ తప్పు లేకుండా వ్రాశారు. గాంధీ 'కెటిల్' అనే ఆంగ్ల పదానికి వర్ణక్రమం సరిగ్గా వ్రాయలేక పోయాడు. ఉపాధ్యాయుడు తనకు చెడ్డ పేరు వస్తుందని భయపడ్డాడు. ప్రక్క పిల్లవాని పలక చూసి, ఆ మాట వ్రాయాల్సిందిగా గాంధీకి ఆయన సైగ చేశాడు. గాంధీ మౌనంగా ఉండిపోయాడే కానీ చూసి వ్రాయలేదు. ఎన్ని ఇబ్బందులు వచ్చినా మోసం చేసి, సత్యాన్ని కప్పి పుచ్చకూడదని అతనికి తెలుసు.

బ్రిటీషువారు మనదేశాన్ని పరిపాలిస్తున్న కాలంలో మన దేశ విద్యార్థులు పై చదువుల నిమిత్తం ఇంగ్లండు వెళ్ళేవారు. వెళ్ళిన వారు వివాహితులైనప్పటికీ అక్కడ మాత్రం అవివాహితులమని చెప్పేవారు. కారణం- ఇంగ్లండులో ప్రతి విద్యార్థీ అవివాహితుడే. గాంధీ కూడా ఇంగ్లండులో బ్రహ్మచారిగానే ప్రవర్తించాడు. బిడియం, పిరికితనం, తల్లికి చేసిన వాగ్దానాల కారణంగా స్త్రీలతో గాంధీ జాగ్రత్తగానే మసలుకొనేవాడు.

గాంధీ సిగ్గు, బిడియాలను పోగొట్టాలని తలచి ఓ వృద్ధ మహిళ ఒక స్త్రీని గాంధీ దగ్గరకు పంపబోయింది. ప్రమాదం గుర్తించి పూర్తి వివరాలతో గాంధీ ఆమెకు (వృద్ధమహిళ) ఒక లేఖ వ్రాశాడు:

"బ్రైటనులో కలిసినప్పటి నుండి మీరు నన్ను సొంత తల్లిలా ప్రేమగా చూస్తున్నారు. నాకు పెళ్ళి అవడం మంచిదన్న భావంతో యువతుల్ని నాకు పరిచయం చేస్తున్నారు. ఈ వ్యవహారం ముదరక ముందే మీ ప్రేమకు నేను తగనని తెలియజేయడం నా కర్తవ్యమని భావిస్తున్నాను. నాకు ఇదివరకే పెళ్ళి అయిపోయిందని నేను మీతో పరిచయం అయినప్పుడే చెప్పి ఉండవలసింది. పెళ్ళి అయినా ఇక్కడ చదువుకునేందుకు వచ్చే విద్యార్థులు తమకు పెళ్ళి అయిందని చెప్పరనే విషయం నాకు తెలుసు. నేను కూడా అలాగే చేశాను. అయితే ఇప్పుడు మీకు ఆ విషయం ముందే చెప్పి ఉండవలసిందని నాకు బోధపడింది. మీకు చెప్పకుండా దాచినందుకు నేను విచారిస్తున్నాను. అయితే ఇప్పటికైనా మీకు నిజం తెలియజేసే ధైర్యాన్ని భగవంతుడు నాకు ప్రసాదించాడు. అందుకు సంతోషిస్తున్నాను. మీరు నన్ను క్షమించండి..."

గాంధీ ఈ లేఖ వ్రాసి పెద్ద బరువు దించుకున్నట్లు భావించాడు. ఇక ముందు సత్యనిష్ఠతోనే ప్రవర్తించాలని నిర్ణయించుకున్నాడు.

గాంధీ లేఖను అర్థం చేసుకున్న ఆ వృద్ధ మహిళ కూడా సహృదయతతో తిరిగి గాంధీకి లేఖ వ్రాసింది.

కొందరు లౌకిక వ్యవహారంలో అసత్యం ఉపకరించినంతగా సత్యం సహాయపడదని భావిస్తారు. ఈ విషయంలో గాంధీజీ సత్యం ద్వారా సాధించలేనిది ఏమీ లేదని అనుభవపూర్వకంగా తెలియజేశారు. సత్యనిష్ఠలో స్థిర చిత్తుడనని నిరూపించు కున్నారు గాంధీజీ. ❖ **(అక్టోబర్ 2న గాంధీ జయంతి)**

# ఆగండి! ఆస్వాదించండి!!

స్వామి వివేకానంద అన్నట్లు మనం ఒక చట్రంలోని తెల్ల ఎలుకలలా దేని కోసం కష్టపడుతున్నామో, చివరికి ఏం సాధించబోతున్నామో తెలియకుండానే నిరంతరం పనిలో తలమునకలవుతున్నాం. దీని ప్రభావం మన దైనందిన జీవితంలో, ముఖ్యంగా మన కుటుంబ సంబంధాల పైన విశేషంగా ఉంటుంది.

బాల్యంలో ఉండే జిజ్ఞాస, సృజనాత్మకతలు ఈ పోటీ ప్రపంచపు ప్రవాహంలో కొట్టుకుపోయి, యుక్తవయస్సు వచ్చేసరికి కేవలం యాంత్రికంగా తయారవుతున్నారు ప్రతి ఒక్కరూ! మనం ఈ యాంత్రిక జీవనం నుండి బయటపడి జీవితంలో ప్రతి దాన్నీ ఆస్వాదించగలగాలి.

ఈ విషయాన్ని ఈ మధ్య చాలామంది వ్యక్తిత్వవికాస నిపుణులు నొక్కి చెబుతున్నారు. ప్రతీ క్షణాన్నీ ఎరుకతో ఆస్వాదించాలని వారంటారు. ఉదాహరణకు భోజన సమయంలో ఆహారం పళ్ళెంలో నుంచి కడుపులోకి వెళ్ళింది అన్నట్లు కాకుండా తినే ప్రతి ముద్దలోనూ రుచిని ఆస్వాదించాలంటారు. ఈ రకంగా మనం మన ఎరుకను వృద్ధిపరచుకోగలం. మనం ఎదుర్కొనే ప్రతి సమస్యా దాదాపు ఈ ఎరుక లేమి వల్లనే ఎదురవుతోంది.



మన జీవితాలు ఎంత యాంత్రికంగా తయారయ్యాయో అర్థం చేసుకోవడానికి వాషింగ్టన్ డి.సిలో ఒక సర్వేలో నిర్వహించిన ఈ ప్రయోగం చక్కని ఉదాహరణ. వాషింగ్టన్ మెట్రో స్టేషన్‌లో ఒక వ్యక్తి కూర్చొని వయొలిన్ వాయించడం ప్రారంభించాడు. దాదాపు 45 నిమిషాలలో అతడు బాచ్ (17వ శతాబ్దికి చెందిన పాశ్చాత్య సంగీతకారుడు, బీథోవెన్, మోజర్ట్‌ల శ్రేణికి చెందినవాడు) కూర్చిన కృతులను వాయించాడు. కొన్నివేల మంది అటు వైపు నుండే వెళ్తున్నారు. అతడు వాయించడం మొదలు పెట్టిన మూడు నిముషాలకు ఒక మధ్య వయస్కుడు అక్కడొక కళాకారుడు వాద్యం వాయిస్తున్నాడన్న విషయం గుర్తించాడు. నడక వేగాన్ని కాస్త తగ్గించి, కొద్ది క్షణాల పాటు అక్కడ ఆగి మళ్ళీ వేగంగా వెళ్ళిపోయాడు.

దాదాపు మరో నిముషం తర్వాత ఒక స్త్రీ ఒక డాలరు అక్కడ పడేసి ఆగకుండా నడక కొనసాగించింది. మరికొన్ని నిముషాల తరువాత ఒక వ్యక్తి గోడకు ఆనుకొని నిలబడి కాసేపు ఆ కళాకారుడి సంగీతాన్ని విన్నాడు. అతను కూడా వెంటనే గడియారం చూసుకొని, మళ్ళీ నడవడం మొదలుపెట్టాడు.

అందరిలోకీ ఎక్కువ ఆసక్తి చూపింది ఓ మూడేళ్ళ అబ్బాయి. తల్లితో వెళుతూ అక్కడ కళాకారుణ్ణి చూసి నిలబడిపోయాడు. వెంటనే ఆమె ఆ అబ్బాయిని అక్కడ నుండి లాక్కుపోయింది. ఆ అబ్బాయి ఈ కళాకారుడు కనిపించేంత వరకూ తల వెనక్కి తిప్పి చూస్తూనే నడిచాడు.

మొత్తం మీద ఆ కళాకారుడు వయొలిన్ వాయించిన ఆ 45 నిమిషాలలో కేవలం ఆరుగురు మాత్రమే ఆగి కాసేపు చూశారు. దాదాపు 20 మంది కొంత చిల్లర అక్కడ పడేసి, ఆగకుండా వెళ్ళిపోయారు. ఆ చిల్లర మొత్తం 32 డాలర్లు అయ్యింది.

ఇంతకీ అక్కడ ఆ స్టేషన్లో కూర్చొని వాయించిన కళాకారుడెవరంటే జోషువా బెల్. ఆస్కార్ అవార్డు లాంటివి అనేకం పొందిన యువ కళాకారుడతడు. అక్కడ అతడు వాయించినవి చరిత్రలో ఇంతవరకు వయొలిన్‌పైన వాయించని అత్యంత సంక్లిష్ట కృతులు. వాటి విలువ దాదాపు 3.5 మిలియన్ డాలర్లు ఉంటుందని అంచనా.

ఆనాటికి సరిగ్గా రెండురోజుల తర్వాత ఆ రోడ్డు ప్రక్కన వాయించిన సంగీతాన్ని అతడు బోస్టన్‌లోని ఓ ప్రముఖ సంస్థలో ప్రదర్శించాడు. దానికి ప్రవేశ రుసుము ఒక్కో వ్యక్తికి 100 డాలర్లు!

ఇది నిజంగా జరిగిన సంఘటనే! 'వాషింగ్టన్ పోస్ట్' వాళ్ళు ప్రజల గ్రహణశక్తి, అభిరుచి, ప్రాధాన్యాల గురించి తెలుసుకోవడానికి మారువేషంలో వున్న బెల్‌తో కలిసి చేసిన సాంఘిక ప్రయోగం ఇది. ఆ ప్రయోగంలోని ముఖ్య విషయాలు ఈ విధంగా ఉన్నాయి.

1. మనం మంచివాటిని ఆస్వాదిస్తున్నామా?
2. మనం వాటిని అభినందించ గలుగుతున్నామా?
3. మన ముందుకు వచ్చే నైపుణ్యాన్ని మనం గుర్తిస్తున్నామా?

ఈ ప్రయోగంలో జరిగిన దాన్ని బట్టి మనం ఈ క్రింది నిర్ధారణకు రావచ్చు. "ప్రపంచంలో ఒకానొక గొప్ప కళాకారుడు, చరిత్రలోనే అత్యుత్తమమైన సంగీతాన్ని వాయించేటప్పుడు మనం దాన్ని గుర్తించలేకపోతున్నామంటే, జీవితంలో ఇంకా ఎన్ని విషయాలను కోల్పోతున్నామో కదా!" ❖ సేకరణ : జి. సతీష్

... 17వ పేజీ తరువాయి.


9
ఋషులవైపు భయంగా చూస్తూ కవషుడు ఇలా విన్నవించుకున్నాడు:
“యాగం చూడాలనిపించి మీకు దూరంగా కూర్చున్నాను. దాహం వేసింది. మీ దగ్గరకు వస్తే ఆగ్రహిస్తారని నా దాహం ఇక్కడే తీర్చుకున్నాను. ఇందులో నా తప్పు ఏదైనా ఉంటే నన్ను క్షమించండి; కానీ నన్నిక్కడ నుంచి వెళ్ళమనకండి”.


10
ఋషులందరూ అతడికి నమస్కరిస్తూ.....
“మహానుభావా! మీ గొప్పతనాన్ని తెలుసుకోలేక అమర్యాదగా ప్రవర్తించాం; మమ్మల్ని మన్నించండి. దాహం తీర్చుకునేందుకు సరస్వతీ నదిని మీ వద్దకు రప్పించుకో గలిగిన మీ మంత్రశక్తి అపూర్వం. అది మాకు నేర్పండి. ఇప్పుడు మీరే యాగం పూర్తిచేయించండి”.


11
కవషుడు సంకోచిస్తూ...
“నేను బ్రాహ్మణుడను కాను. మీరు నన్ను మనఃస్ఫూర్తిగా మీలో కలుపుకోగలరా?”


12
బ్రాహ్మణుడంటే బ్రహ్మజ్ఞానం కలవాడు అని అర్థం. బ్రాహ్మణత్వం కులం కాదు; అది పుట్టుకతో రాదు. బ్రహ్మజ్ఞానం సంపాదించినవారందరూ బ్రాహ్మణులే! అజ్ఞానంతో మిమ్మల్ని అబ్రాహ్మణుడవన్నాం. మన్నించండి.
13
అందరూ బ్రాహ్మణులే. మనుష్యులు అది గుర్తించక కులాన్ని పట్టుకుని వేలాడుతూ ఉంటారు. ఇందులో మీ తప్పేమీ లేదు. మున్ముందు కులంతో నిమిత్తం లేకుండా మనుష్యులందరూ కలసి చదువుకుంటారు.
14
కవషుడు వారితో కలసి సత్రయాగాన్ని పూర్తి చేయించాడు.
15
కవషుడున్న చోటుకు ప్రవహించిన సరస్వతీ నదికి 'పరిసారికము' అని పేరు వచ్చింది.
16
మన ప్రాచీనులు అపార విజ్ఞానాన్ని కలిగి ఉన్నప్పటికీ మనుష్యుల్ని కులం పేరుతో విడదీసి అమానుషంగా ప్రవర్తించే వారంటారు. అయితే తప్పు మనుష్యుల్లోనే ఉంది కానీ మన ప్రాచీన విజ్ఞానంలో లేదు. ఇందుకు ఉదాహరణ కవషుడి కథ.

# గ్రంథ పరిచయం

## కఠోపనిషత్తు

### మరణానంతరం...

వ్యాఖ్యానం : స్వామి జ్ఞానదానంద
వెల:రూ.25/-(తపాలా ఖర్చులు రూ.20/-అదనం),పేజీలు : 150
ప్రతులకు : తెలుగు ప్రచురణల విభాగం
రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500029
Email : rktelugubook@gmail.com ఫోన్. 040-27631149

కఠోపనిషత్తును 'కఠోపనిషత్తు మరణానంతరం...' అని పేర్కొనడం ఎంతో సమంజసం. మరణం గురించిన సత్యాలను మృత్యుదేవతను నచికేతుడనే బాలుడు సాహసించి ప్రశ్నించాడు. యమధర్మరాజు చెప్పిన జవాబులే కఠోపనిషత్తుగా రూపొందింది.



జనన మరణాలు అగ్రాహ్యమైనవి. జననం జరిగిపోయిన విషయం కనుక దానిని గురించి చేయగలిగింది ఏమీ లేదు. ఇకపోతే మరణం. మరణం అంటే ఏమిటి? అప్పుడు మనిషికి ఏం జరుగుతుంది? తరువాత అతడు ఏమవుతాడు? ఈ ప్రశ్నల జవాబులకు మనిషి నాటి నుంచీ నేటిదాకా విశ్వప్రయత్నం చేస్తూనే ఉన్నాడు.

కఠోపనిషత్తు మరణం గురించి విచారణ చేయడం కన్నా దానిని జయించి పరమసత్యాన్ని గ్రహించడమే ఉత్తమం అని చివరకు తేల్చింది. మనకు ప్రసాదితమైన మానవ జీవితాన్ని సముచిత రీతిలో గడపడమే అందుకు మార్గం అంటోంది కఠోపనిషత్తు. సరళమైన భాషలో, ఆధునిక పోకడలో సాగిన వ్యాఖ్యానంతో ఈ తరం పాఠకులకు ఇట్టే అర్థమై ఈ ఉపనిషత్తు ఎంతో ప్రయోజనకారి అవుతుందనడంలో ఎలాంటి సంశయమూ లేదు. ❖

– బ్రహ్మచారి హేమంత్

## బ్రహ్మ సూత్రములు

ఆంగ్లమూలం: శ్రీ శివానంద సరస్వతీ స్వామి
ఆంధ్రానువాదం : శ్రీ స్వామి హంసానంద
వెల : రూ. 200/-, పేజీలు : 754
ప్రతులకు :దివ్యజీవన సంఘం, శివానందనగర్-249 192, హిమాలయములు, ఉత్తరాఖండ్.

ప్రస్థానత్రయంలో జటిలమని చెప్పదగ్గ బ్రహ్మ సూత్రాలకు ఆది శంకరులవారి భాష్యానికి అనుగుణంగా స్వామి శివానంద మహరాజ్ (దివ్య జీవన సంఘ వ్యవస్థాపకులు) వ్రాసిన ఆంగ్ల వ్యాఖ్యకు తెలుగు అనువాదం ఈ గ్రంథం. తొలి ముద్రణ 1983 లో జరిగింది. ఇంతకుముందు రెండు భాగాలుగా వెలువరిచిన భాష్యాన్ని ఇప్పుడు ఒకే సంపుటంగా ప్రచురించారు. శ్రీ హంసానంద స్వాములవారి అనువాదం చక్కగా సాగింది.



ఉపనిషత్తుల జ్ఞానం, సంస్కృత భాషా పరిజ్ఞానం బాగా ఉండి తెలుగులో పారిభాషిక పదాలు తెలిస్తే తప్ప ఇలాంటి అనువాదాలను చేయటం సాధ్యపడదు. పుస్తకంలోని భావ వ్యక్తీకరణ స్పష్టతను బట్టి శ్రీ హంసానంద స్వాములవారు త్రిభాషా కోవిదులని తెలుస్తుంది. ఆంగ్ల గ్రంథాన్ని చక్కగా అర్థం చేసుకుని తేటతెలుగులో అనువాదాన్ని కొనసాగించారు. ఈ భాష్యాన్ని తెలుగులోనికి అనువదించి శ్రీ స్వామీజీ ఆంధ్రులకు మహోపకారం చేశారు. తెలుగులో బ్రహ్మసూత్రాలను చదవాలనుకున్న వారికి ఈ పుస్తకం కల్పతరువుగా భాసిస్తుందని చెప్పవచ్చును. ❖

– ఆనంద

## పండుగలు - పర్వదినాలు

### అక్టోబర్ - 2009

| | | | |
|---|---|---|---|
| 03 | శనివారం | : | లక్ష్మీ పూజ (సాయంత్రం హారతి తర్వాత) |
| 14 | బుధవారం | : | ఏకాదశి |
| 17 | శనివారం | : | దీపావళి - కాళీ పూజ |
| 29 | గురువారం | : | ఏకాదశి |
| 30 | శుక్రవారం | : | స్వామి సుబోధానంద జయంతి |

### నవంబర్ - 2009

| | | | |
|---|---|---|---|
| 01 | ఆదివారం | : | స్వామి విజ్ఞానానంద జయంతి |
| 12 | గురువారం | : | ఏకాదశి |
| 26 | గురువారం | : | స్వామి ప్రేమానంద జయంతి |
| 28 | శనివారం | : | ఏకాదశి, గీతా జయంతి |

# వార్తావాహిని



## శ్రీ రామకృష్ణ సేవాసమితి రజతోత్సవం

పశ్చిమగోదావరి జిల్లా **గరగవ్రరు శ్రీరామకృష్ణ సేవాసమితి** ప్రారంభించి 25 సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా 2009 ఆగష్టు 28,29,30 తేదీలలో రజతోత్సవ వేడుకలను జరుపుకుంది. 29వ తేదీన జరిగిన బహిరంగ సభలో విజయవాడ రామకృష్ణ మిషన్ స్వామి స్వసంవేద్యానందజీ, రాజమండ్రి రామకృష్ణ మిషన్ స్వామి అచింత్యానందజీ, గుంటూరు డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి, కాకినాడ మస్తాక్ అహ్మద్ ప్రసంగించారు.

30వ తేదీన గుంటూరు శారదా మఠం ప్రవ్రాజికా ధర్మాత్మప్రాణా, ప్రవ్రాజికా త్యాగనిష్ఠాప్రాణా మాతాజీల ఆధ్వర్యవంలో సాధనా కార్యక్రమం నిర్వహించబడింది.

ఈ సందర్భంగా బాలరామకృష్ణ గేయ నృత్య రూపకం, శ్రీరామకృష్ణ పరమహంస నాటకం ప్రదర్శించబడ్డాయి. ❖

నివేదిక : ఎమ్. విశ్వనాథరాజు, కార్యదర్శి



## శ్రీ రామకృష్ణ సేవాసమితి పంచమ వార్షికోత్సవం

**అనంతపురం శ్రీరామకృష్ణ సేవాసమితి** 2009 ఆగష్టు 8వ తేదీన పంచమ వార్షికోత్సవం జరుపుకుంది. కడప రామకృష్ణ మిషన్ స్వామి సుకృతానందజీ ఆధ్వర్యవంలో విష్ణుసహస్రనామ పారాయణం, పూజ, భజనలు జరిగాయి.

ఆ రోజు ఉదయం జరిగిన బహిరంగ సభలో 'శ్రీరామకృష్ణ జీవితం-ఆదర్శం' అనే అంశంపై స్వామి సుకృతానందజీ, 'స్వామి వివేకానంద - కర్మయోగం' అనే అంశంపై డాక్టర్ నాగత్రిశూలపాణి ప్రసంగించారు. శ్రీ టి. చంద్రశేఖర్, శ్రీ జి. శ్రీధరమూర్తి సమితి నిర్వహిస్తున్న సేవాకార్యక్రమాల్ని వివరించారు. సాయంత్రం ఆరాత్రికం తరువాత పూర్ణప్రజ్ఞ నాట్య శిక్షణాలయ నిర్వాహకురాలు శ్రీమతి గీతాలక్ష్మి నేతృత్వంలో బాలల నృత్యప్రదర్శనా కార్యక్రమాలు జరిగాయి. పూజ్య స్వామీజీ విద్యార్థులకు బహుమతి ప్రదానం చేశారు. ❖

నివేదిక : డాక్టర్ నాగత్రిశూలపాణి, అధ్యక్షులు

## యువజన సదస్సు

**వివేకానంద యువ మహామండలి**, విశాఖపట్నం శాఖ 2009 ఆగష్టు 16వ తేదీన యువజన సదస్సును నిర్వహించింది. ఈ కార్యక్రమంలో విశాఖపట్నం రామకృష్ణ మిషన్ స్వామి గుణేశానందజీ, యువ మహామండలి ప్రథమ అధ్యక్షులు శ్రీ ఆర్.ఎస్. ప్రేమ్‌కుమార్, పతంజలి యోగకేంద్ర నిర్వాహకులు శ్రీ వేదభాస్కరమ్, శ్రీ ఎమ్. సత్యనారాయణరాజు పాల్గొని 'యువతకు ఆదర్శం వివేకానంద' అనే అంశంపై



ప్రసంగించారు. ఈ సదస్సులో సుమారు 100 మంది విద్యార్థులు పాల్గొన్నారు. ❖ నివేదిక : బి. శ్రీధర్, కార్యదర్శి

**పాఠ్యపుస్తకాల పంపిణీ :** తూర్పుగోదావరి జిల్లా **పెదబ్రహ్మదేవం శ్రీ శారదా రామకృష్ణ సేవాసమితి** పేద విద్యార్థులకు పాఠ్యపుస్తకాలను ఉచితంగా పంపిణీ చేసే కార్యక్రమం చేపట్టింది. ఈ సంవత్సరం ఆగష్టు 3వ తేదీన 60 మంది పదవ తరగతి పేద విద్యార్థులకు పాఠ్యపుస్తకాలనూ, ఇద్దరు విద్యార్థులకు నగదు బహుమతినీ రాజమండ్రి రామకృష్ణ మిషన్ స్వామి అచింత్యానందజీ ద్వారా సమితి అందజేసింది. ఈ కార్యక్రమంలో పాల్గొన్న స్వామీజీ, శ్రీ వి. రామసుబ్బారావు 'ఆదర్శ విద్యార్థులు' అనే అంశంపై ప్రసంగించారు. ❖ నివేదిక : నువ్వుల బాబ్జి, కార్యదర్శి

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) 'వేదచూడామణి' : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
- యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
- వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
- స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

(ఆ) 'వేదార్థచూడామణి' : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
- యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
- వయస్సు : 15 సం॥, ఆ పైన
- స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

(అ) వేదాధ్యాపకుడు : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
- కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
- అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
- అనుభవము : 2 సంవత్సరములు
- సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

(ఆ) వేదభాష్యాచార్యుడు : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
- విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
- అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
- అనుభవార్హత : 5 సం॥
- సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను శ్రీ పి. **వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-

హైదరాబాద్ కులప్రశాసకుడు



Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020 and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**



# సురభి

గురుదేవులు మహాసమాధి చెందిన కొన్ని రోజుల తర్వాత గురుదేవుల అన్నగారి కుమారుడైన శివరామ్‌తోపాటు మాతృదేవి కామార్పుకూర్ నుండి జయరాంబాటీ వెళుతున్నారు. మాతృదేవి ముందు నడుస్తూ ఉంటే శివరామ్ సామానుతో మాతృదేవి వెనుక నడుస్తూ వస్తున్నాడు. జయరాంబాటీ చేరుకోవడానికి ఇంకా కొంతదూరం ఉంది. అప్పుడు శివరామ్ హఠాత్తుగా ఆగిపోయి మాతృదేవిని ఇలా ప్రశ్నించాడు:

శివరామ్: పిన్నీ! నిన్ను నేను ఒక మాట అడుగుతాను. నిజం చెప్పు! నువ్వు నిజం చెబితేనే నేను నీ వెంట వస్తాను.

మాతృదేవి: ఏమిటది?

శివరామ్: నిజంగా నువ్వెవరు?

మాతృదేవి: నేను ఇంకెవర్ని? నీ పిన్నిని.

శివరామ్: నువ్వు నిజం చెప్పడం లేదు. ఇక నేను నీకు తోడురాను.

మాతృదేవి: నేను ఎవరని అనుకొంటున్నావు? నేను ఒక సామాన్య వ్యక్తిని మాత్రమే!

శివరామ్: నీవెవరో నిజం చెప్పేవరకూ నేను ఇక్కడ నుంచి కదలను.

ఇలా అంటూ అతడు అక్కడే నిలబడిపోయాడు. అతని పట్టుదల చూసిన మాతృదేవి, "కొందరు నన్ను కాళి అంటారు" అన్నారు.

శివరామ్: నిజంగానే నువ్వు కాళీవేనా?

మాతృదేవి: అవును. ❖

('శ్రీశారదాదేవి చరితామృతం' నుంచి)

Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

ఆధ్యాత్మిక అమృతవాహిని
# శ్రీ రామకృష్ణ ప్రభ

ãÙÑ@Ù 66 ãÙzH 11 #=Q ~i2009

గీతా ధ్యానం

**మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినే దినే।**
**సకృద్గీతాంభసి స్నానం సంసారమల నాశనమ్॥**

ప్రతి దినం నీటితో స్నానం చేయడం వలన శరీర మాలిన్యం పోతుంది. ఒక్కసారి గీతాజ్ఞానమనే జలంతో స్నానం చేస్తే సంసారమాలిన్యం పూర్తిగా నశించిపోతుంది.



ÖÑ ÑÖ;.



# రామకృష్ణ - వివేకానంద భావ ప్రచార పరిషత్

## 19వ వార్షిక భక్తసమ్మేళనం

### 2009 డిసెంబర్ 25, 26, 27 తేదీలు, గుంటూరు

**సమ్మేళన ప్రాంగణం : శ్రీరామనామ క్షేత్రము (విజయలక్ష్మీ టాకీస్ ప్రక్క సందులో), గుంటూరు. ఫోన్ :0863 - 2220254**

గుంటూరు నగరంలో శ్రీరామకృష్ణ సేవాసమితి ఆధ్వర్యంలో **2009 డిసెంబర్ 25,26,27 తేదీలలో** జరిగే 19వ వార్షిక భక్తసమ్మేళనానికి ఇదే మా ఆహ్వానం.

- ఈ సమ్మేళనంలో పాల్గొనే సంస్థలు, తమ సభ్యులు ఒక్కొక్కరి నుంచి **రూ.150/-** సభ్యత్వ రుసుముగా వసూలుచేసి, జత చేసిన సభ్యత్వ పత్రములో వివరాలు తెలపాలి. రుసుము ఎమ్.ఓ/ డి.డి ద్వారా **30-11-09** తేదీ లోగా **డాక్టర్ పన్నాల శ్యామసుందరమూర్తి, 13-3-20, 2వ లైను, గుంటూరువారి తోట, గుంటూరు-522 001** చిరునామాకు పంపవలెను. **1-12-09 తర్వాత నమోదు చేసుకొనే వారు రూ.200/-చొప్పున చెల్లించాలి.** సమ్మేళన సంబంధిత పత్రాలు 25-12-09వ తేదీన సమావేశ ప్రాంగణంలో పొందవచ్చు.
- డిమాండ్‌డ్రాఫ్టులు పంపదలచినవారు "Ramakrishna - Vivekananda Bhava Prachara Parishat" పేరున ఆంధ్రా బ్యాంక్ (మెయిన్ బ్రాంచ్), కొత్తపేట, గుంటూరులో చెల్లుబాటు అయ్యేలా పంపాలి. (Code No. 0150; S.B.A/C No. 015010100003165 అకౌంట్‌కి ఆన్‌లైన్ ద్వారా కూడా పైకం పంపవచ్చును.) **చెక్కులు అంగీకరింపబడవు.**
- ప్రతినిధులకు ఉచిత భోజన, వసతి సౌకర్యాలు 25-12-09(శుక్రవారం) ఉదయం నుండి 27-12-09 (ఆదివారం) రాత్రి వరకు ఏర్పాటు చేయబడును.
- ప్రత్యేక సదుపాయములు (లాడ్జిలలో గదులు) కావలసిన వారు హోటల్ గదులు స్వయంగా రిజర్వు చేసుకొనగలరు.
- 24-12-09 (గురువారం) రాత్రి నుండి గుంటూరు జంక్షన్ రైల్వే స్టేషన్‌లోనూ, ఆర్.టి.సి. బస్‌స్టాండ్‌లోనూ రిసెప్షన్ కౌంటర్లు ఏర్పాటుచేయబడతాయి.
- ఈ సమ్మేళనం సందర్భంగా ఒక స్మారక సంచికను విడుదల చేయనున్నాం. ఆ సంచికలో ప్రకటనల నిచ్చి ప్రోత్సహించ గలరు. ప్రకటనల ట్యారిఫ్ వివరాలు:

| | పూర్తి పేజీ | అర పేజీ | పావు పేజీ |
|---|---|---|---|
| బ్లాక్ వైట్ : | 3,000 | 1,600 | 800 |
| కలర్ : | 5,000 | 3,000 | 1,500 |
| 2,3 కవరు పేజీలు | 10,000 | - | - |
| 4వ కవరు పేజీ | 15,000 | - | - |

### సంప్రతించవలసిన చిరునామా

**డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి, 13-3-20, 2వ లైను, గుంటూరువారి తోట, గుంటూరు-522 001**
**సెల్ నెం. 98661 75274, ఫోన్ :0863-2337380**
**డాక్టర్ జి. రవీంద్రబాబు, సెల్ : 9491893305**

ÖÑ ÑÖ;.





ఈ సంచికలోని రచయిత(త్రు)ల అభిప్రాయాలు వ్యక్తిగతమైనవి. సంపాదకులు గానీ, హైదరాబాద్ రామకృష్ణ మఠం గానీ వాటికి బాధ్యత వహించజాలరు.

– సంపాదకులు

N-ô=•• Ñ;,,ÑEãÑáñ «kè

| ^• ñిం | z~ఠిఠిం | ~రి. |
|---|---|---|
| మహారాజ పోషకులు | : శ్రీమతి కె. శాంత, అశోక్‌నగర్, హైదరాబాద్ (కీ॥శే॥ శ్రీ కృష్ణయ్య శెట్టి జ్ఞాపకార్థం) | 10,001 |
| మహారాజ పోషకులు | : శ్రీ గొంట్ల సుబ్బారాయుడు శెట్టి, శ్రీమతి లక్ష్మీ రంగనాయకమ్మ, సాయినగర్, అనంతపురం. | 10,000 |
| పోషకులు | : శ్రీమతి సి. శకుంతల, గాంధీనగర్, హైదరాబాద్-500 080 | 1,011 |
| పోషకులు | : శ్రీమతి వి. సరోజినీ దేవి, మల్కాపురం, విశాఖపట్నం-530 011 | 1,000 |
| పోషకులు | : శ్రీ ఎమ్.పి. సుబ్రహ్మణ్యం, కావలి, నెల్లూరు జిల్లా - 524 201 | 1,000 |
| పోషకులు | : శ్రీ ఐ. రామభద్ర రాజు, వెలగదుర్రు, మొర్త, పశ్చిమ గోదావరి జిల్లా -534 227 | 1,000 |

SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com



# జీవననౌకకు దిక్సూచి

శ్రీకృష్ణుడు భగవద్గీతను బోధించింది కురుక్షేత్ర రణ రంగంలో గానీ, రణగొణ ధ్వనులకు దూరంగా ఎక్కడో కీకారణ్యంలో కాదనే విషయం మనందరికీ తెలిసిందే. దీన్నిబట్టి భగవద్గీత కేవలం మనశ్శాంతి కోసం ఎక్కడో ఓ మూల కూర్చొని పారాయణం చేసుకోవడానికి మాత్రమే ఉద్దేశింపబడింది కాదనీ, కార్యరంగంలో ప్రోత్సాహాన్నిచ్చి నడిపించేదనే విషయం మనకు విదితమవుతుంది.

క్షత్రియుడిగా యుద్ధం చేయడం అర్జునుని స్వధర్మం. స్వధర్మాన్ని పాటించి ధర్మాన్ని రక్షించాల్సిన బాధ్యత అతనిది. ఆ సమయంలో ఆత్మవిశ్వాసం కోల్పోయిన అర్జునుడు యుద్ధం చేయనని మనోదుర్బలతకు గురవుతాడు. స్వధర్మాన్ని విస్మరించినవాడు జీవించి ఉన్నా మరణించినవాడితో సమానమే. కాబట్టి మనోదుర్బలతను వీడి ధర్మసంరక్షణార్థం యుద్ధానికి సన్నద్ధమవమని అర్జునుడికి మనోధైర్యాన్నిచ్చి, స్వధర్మాన్ని గుర్తుచేసిన శ్రీకృష్ణుని బోధ 'భగవద్గీత'. అర్జునుడిలో ఆత్మవిశ్వాసాన్ని పెంచి కర్తవ్యపాలనలో కృతకృత్యుడయ్యేలా చేసింది గీతోపదేశం.

**జీవనయానంలో ఆత్మశక్తి తరంగం :** అమెరికాలో ఓ ప్రసిద్ధ వాణిజ్య సంస్థ ఉన్నత అధికారుల కోసం 'మనో నియంత్రణ'పై సదస్సు నిర్వహించింది. ఆ సదస్సులో ఓ ప్రఖ్యాత వ్యక్తిత్వవికాస నిపుణుడు ప్రసంగించాడు. ఆయన ప్రసంగానికి ప్రభావితుడైన ఓ భారతదేశపు ఉన్నత అధికారి (ఒక భక్తుడు) ఆయన దగ్గరకు వెళ్ళి 'మీరు ఇంత స్ఫూర్తిదాయకంగా ఎలా ప్రసంగించగలిగారు' అని అడిగాడు. అందుకు ఆ నిపుణుడు 'నేను భగవద్గీతను క్షుణ్ణంగా అధ్యయనం చేశాను. జయాపజయాల్లో స్థిరచిత్తంతో ఉండాలంటే భగవద్గీతను అందరూ చదవాలి' అని బదులిచ్చాడట.

మన జీవనయానంలో ఎదురయ్యే సమస్యల్ని పరిష్కరించుకోవడానికి మనోధైర్యాన్నీ, కర్మకౌశలాన్నీ పెంచే ఆత్మశక్తి తరంగం 'భగవద్గీత'. ఏ రంగంలోనైనా విజయం సాధించాలంటే ముందుగా అపజయాలకు అధైర్యపడకుండా ఉండే మనోబలాన్ని పెంపొందించుకోవాలి. విజయాన్ని సాధించడానికి ముందు అపజయాల్ని అంగీకరించడం నేర్చుకోవాలి. అదే విజయపథానికి మొదటి సోపానం. విజయానికి కావలసిన సహనం, నిస్సంగం, క్షమాగుణం మొదలైన సూత్రాలను బోధిస్తుంది 'భగవద్గీత'.

సముద్రయానంలో ఓడ దారితప్పిపోకుండా గమ్యాన్ని సురక్షితంగా చేరడానికి దిక్సూచి ఎలా సహాయపడుతుందో అలాగే సమస్యల సాగరంలో మన జీవననౌక చిక్కుకుపోకుండా ప్రశాంతంగా పయనించడానికి 'భగవద్గీత' ఉపయోగపడుతుంది.

**ఒత్తిడిలో ఓదార్పునిచ్చేది :** విద్యార్థి పరీక్షల్లో ఉత్తీర్ణుడు కాకపోయినా, ఉద్యోగికి అనుకున్న విధంగా పదోన్నతి లభించకపోయినా, వ్యాపారస్థుడికి ఆశించిన విధంగా లాభం చేకూరకపోయినా – ఇలా ప్రతి ఒక్కరూ తమతమ రంగాల్లో వైఫల్యాల్ని చవిచూసినప్పుడు నిరాశా, నిస్పృహలు ఆవరించడం సహజం. నేడు ఈ మానసిక ఆందోళనల నుంచి బయటపడడం కోసం మనస్తత్వవేత్తలను సంప్రదించడం ఓ అలవాటుగా మారింది. జీవితంలో ఓటమిని ఎలా ఎదుర్కోవాలో తెలుసుకోకపోవడం వల్లనే అపజయాలు ఎదురైనప్పుడు ఒత్తిడికి గురవుతున్నాం. ఇంటికి పునాది ఎంత ముఖ్యమో మనిషికి మనోబలం అంతే ముఖ్యం. 'ఆపదల్లో ఆదుకొని మనోబలాన్ని మనకు ప్రసాదించేది భగవద్గీత' అని ఎందరో మహాత్ములు అనుభవపూర్వకంగా గ్రహించిన విషయం.

When disappointment stares at me and all alone I see not one ray of light, I go back to the Bhagavad Gita. It is my mother... When I am in difficulty or distress I seek refuge in her bosom. - *Mahatma Gandhi*

'సంశయాలు నన్ను ఆవరించినప్పుడూ, సమస్యలు వాటిల్లినప్పుడూ, నిరుత్సాహం కలిగినప్పుడూ భగవద్గీతనే నేను ఆశ్రయిస్తాను. భగవద్గీత నాకు తల్లి వంటిది' అని అంటారు గాంధీజీ.

జీవితంలో ఎదురయ్యే సమస్యల పరిష్కారానికి భగవద్గీత ఎన్నో సూచనల్ని తెలుపుతుంది. కాబట్టి ప్రతి ఒక్కరూ భగవద్గీతను బాల్యం నుంచే పఠించడం అలవాటు చేసుకోవాలి.

భగవద్గీతలాంటి గ్రంథాలను పదవీవిరమణ అయినప్పుడో, మృత్యుముఖంలో ప్రవేశించడానికి సిద్ధంగా ఉన్నప్పుడో చదువుకోవాలనే అపోహ నుంచి మనం బయటపడాలి. యుక్తవయస్సులో ఉన్నవారెవరైనా భగవద్గీత చదివితే 'జీవితాన్ని అనుభవించిన తరువాత వృద్ధాప్యంలో చదవాలి కానీ ఇప్పటి నుంచే ఎందుకులే?' అని నిరుత్సాహ పరచకూడదు. నిజానికి భగవద్గీత ఒత్తిడిలో ఓదార్పునిచ్చే కన్నతల్లిలాంటిది అన్న విషయాన్ని అందరూ గ్రహించాలి.

**ప్రశాంత జీవనానికి పరమాత్ముని సందేశం :** మన విధులను నిర్వర్తిస్తూ ఎలాంటి ఉద్వేగాలకూ గురికాకుండా



ప్రశాంత చిత్తంతో ఉండాలంటే ఫలితాలను గురించి ఆలోచించకుండా ప్రయత్నమందే మనస్సును లగ్నం చేయడం అలవరచుకోవాలి. ఫలితాల్ని ఆలోచిస్తూ పనిచేయడం వల్లనే ఉద్వేగాలు కలుగుతాయి. ఉద్వేగకరమైన మనస్సుతో పనిచేసినప్పుడు ఫలితాలు ఆశాజనకంగా ఉండవు. ఎప్పుడైతే మనం ఆశించినట్లు ఫలితాలు రాలేదో మనశ్శాంతిని కోల్పోతాం. **కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన...** 'నీకు కర్మ చేయడానికే అధికారం ఉంది. కానీ దాని ఫలితం మీద లేదు' అని శ్రీకృష్ణుడు బోధించాడు. కాబట్టి ఫలితం ఎలాంటిదైనా పరమాత్మకు అర్పించి ప్రయత్నం చేయడం నేర్చుకుంటే జీవితం ప్రశాంతంగా సాగిపోతుంది. అదే భగవానుని సందేశం.

రాజ్యభారాన్ని మోస్తూ రాజర్షిలా జీవించాడు జనక మహారాజు. రోజంతా ఎన్నో కార్యకలాపాలు నిర్వర్తిస్తూ, ఎలాంటి ప్రతికూల పరిస్థితులు ఎదురైనా మనోద్వేగాల్ని అదుపులో ఉంచుకొని నిర్లిప్తంగా రాజ్యపాలన కొనసాగించాడు జనక మహారాజు.

ఎన్నో ఆధునిక పరికరాలుగల అత్యంత విలువైన తన ప్రయోగశాల అగ్ని ప్రమాదానికి గురైనప్పుడు ఎడిసన్ తన భార్యను తీసుకొచ్చి ' చూడు! ఇలాంటి అగ్ని ప్రమాదాన్ని నీ జీవితంలో మరెప్పుడూ చూడలేవు' అని చెప్పి ఇంటికి వెళ్ళి హాయిగా నిద్రపోయాడట.

జార్జ్ వాషింగ్టన్ కార్వర్ తన జీవితంలో కష్టపడి సంపాదించిన 70 వేల డాలర్లను ఓ బ్యాంకులో ఉంచాడు. ఆ బ్యాంకు దురదృష్టవశాత్తూ దివాలా తీయడం వల్ల తన కష్టార్జితం మొత్తాన్ని కోల్పోయాడు. ఆ విషయం తెలిసిన అతడు 'నా పొదుపు మొత్తం ఇంకెవరికో ఉపయోగ పడుతుందిలే' అని నిశ్చింతగా ఉన్నాడట.

జీవితం ఎన్నో రకాల కష్టాలతోనూ, నిరుత్సాహాలతోనూ నిండి ఉంటుంది. జీవితాన్ని ప్రశాంతంగా కొనసాగించాలంటే ఎంతో కొంత నిస్సంగత్వాన్ని అలవర్చుకోక తప్పదు. విపత్తులు సంభవించినప్పుడు విలపించడంకన్నా పరిష్కారాన్ని కనుగొని మరలా ప్రయత్నించడం మిన్న అనే విషయం పై సంఘటనల ద్వారా మనకు అర్థమవుతుంది.

**అభ్యాసంతో అభ్యుదయం :** మనోద్వేగాలకు గురికాకుండా నిర్లిప్తంగా పనిచేయడం ఎలా సాధ్యమవుతుందనే సందేహం మనలో కలుగుతుంది.

శ్రీ శారదాదేవి శిష్యులు స్వామి అశేషానందజీ మహరాజ్ ఇచ్చిన సందేశం మన సందేహాన్ని నివృత్తి చేస్తుంది. స్వామి అశేషానందజీ ఏ పని చేస్తున్నా ప్రశాంత వదనంతో ఉండేవారు. రోజూ తోటలో మొక్కలకు నీళ్ళు పోస్తున్నా, ఆశ్రమ ప్రాంగణం శుభ్రం చేస్తున్నా, పూజ చేస్తున్నా ప్రశాంతంగా ఉండడాన్ని చూసిన ఓ భక్తుడు ఆయన్ని ఇలా ప్రశ్నించాడు : స్వామీజీ! మీరు పని చేస్తున్నప్పుడు మీ మనస్సు దేనిపై నిమగ్నమై ఉంటుంది? 'నేను పని చేస్తున్నప్పుడు భగవద్గీతలోని ఒక శ్లోకం భావాన్ని ధ్యానిస్తూ ఉంటాను' అని స్వామీజీ బదులిచ్చారు.

మనం కూడా నిత్యజీవితంలో ఎక్కడున్నా, ఎలా ఉన్నా, ఏ పని చేస్తున్నా భగవద్గీత సందేశామృతాన్ని ఆస్వాదించడం అలవరచుకుంటే గమ్యాన్ని సురక్షితంగా చేరుకోవచ్చు. □

చేయదలచిన, చేయవలసిన పనుల గురించి పూర్వా పరాలన్నీ పరిగణించి ఊహించడమే అంచనా. ఆ ఊహ తప్పినప్పుడు అంచనాలు తారుమారవుతాయి. అంచనాలు మూడు రకాలు:

1. మనపైన ఇతరుల అంచనా లేక ఇతరుల పై మన అంచనా.
2. మనపైన మన అంచనా.
3. మనకు అప్పగించిన పనిపైన మన అంచనా.



# అంచనాలు

రామాయణంలో సీతాన్వేషణకై లంకకు ఎవరిని పంపాలి అన్న ప్రశ్న తలెత్తినపుడు, ప్రతిఒక్కరూ తమ శక్తి సామర్థ్యాల గురించి చెబుతుండగా, హనుమంతుడు మాట్లాడకుండా ఒక మూల కూర్చుంటాడు. అప్పుడు జాంబవంతుడు అందరితో హనుమంతుడొక్కడే లంకకు వెళ్ళి తిరిగిరాగల సమర్థుడని చెబుతాడు. ఆ మాటలు హనుమంతుణ్ణి ఉత్తేజపరచి లంకకు వెళ్ళి సీతాదేవి జాడను కనుగొనేలా చేశాయి.

హనుమంతుని బాల్యం స్వేచ్ఛాపూరిత వాతావరణంలో గడుస్తుంది. పసితనంలో సూర్యుణ్ణి పండుగా భ్రమించి తినబోయి, మూతి కాల్చుకుంటాడు. కానీ పిరికితనం, భయం అన్నవి తన దరికి చేరనివ్వలేదు. హనుమంతుని తల్లి అంజనాదేవి తన కుమారుడి స్వేచ్ఛను ఎప్పుడూ అడ్డుకోలేదు. ఇలా సహజ సిద్ధంగా ఎదిగిన హనుమంతుడు వినయ విధేయతలు, భక్తి శ్రద్ధలు, ధైర్యసాహసాలను అలవరచుకుని ఎన్నో మహత్కార్యాలు సాధించాడు.

అంజనాదేవి తన కుమారునికి ఇచ్చిన స్వేచ్ఛ నేడు ఎంతమంది తల్లితండ్రులు తమ పిల్లలకు ఇస్తున్నారు? చాలా మంది తల్లితండ్రులు వారి పిల్లలను డాక్టర్లు, ఇంజనీర్లుగా ఊహించుకొని (అంచనావేసి) పిల్లల "భవిష్యత్తు"ను పసితనంలోనే ఒక 'ప్రణాళిక'గా రూపొందించి దానిని వారిపై ఆపాదించి వారి బాల్యాన్ని 'యాంత్రిక' జీవనానికి గురిచేస్తున్నారు. ముడిసరుకు బాగుంటేనే ఒక వస్తువు నాణ్యత సంతరించుకుంటుంది. సహజత్వం, స్వేచ్ఛ లేని బాల్యం దుర్భరం, వికాసరహితం.

మహాభారతంలో ఉత్తరకుమారుడు కౌరవులను తరిమికొడతానని ప్రగల్భాలు పలికి, తీరా యుద్ధ రంగం నుండి పిరికి పందలా పారిపోవాలనుకుంటాడు. ఇది ఉత్తర కుమారుడు తన గురించి వేసుకున్న ఎక్కువ అంచనా!

బేలూరు మఠంలో గంగానదీ తీరాన ఒక స్నానఘట్టం నిర్మించాలని స్వామి వివేకానంద సంకల్పం. స్వామీజీ, పూర్వాశ్రమంలో ఇంజనీరు అయిన స్వామి విజ్ఞానానందకు ఆ పని అప్పగించారు. ఆయన దాని నిర్మాణపు ఖర్చు తక్కువగా అంచనా వేశారు. పని పూర్తయింది. అంచనాకు మించి ధనం ఖర్చు అయినట్లు స్వామీజీకి తెలిసింది. జమాఖర్చులు చూసే బాధ్యత స్వామి బ్రహ్మానందది కాబట్టి, ఆయనను పిలిచి స్వామీజీ చాలా కఠినంగా మందలించారు. స్వామి బ్రహ్మానంద అది భరించలేక తన గదికి వెళ్ళి తలుపులు మూసుకుని, పెద్దగా విలపించారు. అప్పుడు స్వామీజీ అశ్రుపూరిత నయనాలతో స్వామి బ్రహ్మానంద మహరాజ్ వద్దకు వచ్చి ఇలా అన్నారు: "సోదరా! క్షమించు. నిన్ను శ్రీరామకృష్ణులు ఒక్క పరుషమైన మాట కూడా అనకుండా ఏ విధంగా ప్రేమించేవారో నాకు తెలుసు. అందుకు భిన్నంగా ఈ చిన్న విషయంలో, చాలా పరుషమైన మాటలతో నిన్ను తీవ్రంగా బాధించాను. నీతో కలిసి జీవించడానికి నాకు అర్హత లేదు."

వెంటనే స్వామి బ్రహ్మానంద మహరాజ్ "స్వామీజీ! అలా అనకండి, మీ దూషణలే మాకు ఆశీస్సులు. మమ్మల్ని ఎందుకు వదిలి వెళతారు? మీరు మా నాయకులు. మీరు లేకుండా మేమసలు పని చేయలేం" అన్నారు. కాసేపటికి ఇద్దరూ శాంతించారు.

చూశారు కదా, అంచనాల అద్భుత లీలలు! కాబట్టి మన అంచనాలు అటు ఎక్కువ, ఇటు తక్కువ కాకుండా చూసుకుందామా మరి! □



– స్వామి జ్ఞానదానంద

భగవన్నామ పునశ్చరణ ప్రధానోద్దేశం – భగవత్సాక్షాత్కారం లేదా ముక్తి. రెండవ ఉద్దేశం మానసిక, శారీరక శాంతి. శ్రీరామకృష్ణులు ఇలా చెప్పేవారు: "ఒక వ్యక్తి భగవన్నామాన్ని పునశ్చరణ చేస్తే అతడి మనశ్శరీరాలతో పాటు సమస్తమూ పవిత్రతను పొందుతాయి." భగవన్నామానికి ఎంతో పవిత్రత ఉంది. భగవన్నామ జపం తక్షణమే ఫలితాన్ని ఇవ్వకపోయినప్పటికీ కచ్చితంగా ఏదో ఒక రోజు ఫలాన్నిస్తుంది.

భగవాన్ శ్రీరామకృష్ణుల నామ మహిమ గురించి స్వామి శివానందజీ మహరాజ్ ఇలా చెప్పారు: "ఈ యుగానికి శ్రీరామకృష్ణ నామమే తారక మంత్రం. ఆయన నామాన్ని ఆశ్రయించిన వారు శాంతిని పొందుతారు. భక్తితో ఆయన నామాన్ని స్మరించండి. ఆయన నామంలో మహత్తర శక్తి నిక్షిప్తమై ఉంది."

విభిన్న నామాలతో భగవంతుడు ప్రతి యుగంలోనూ అవతరిస్తాడు. ఈ యుగంలో ఆయన శ్రీరామకృష్ణులుగా అవతరించారు. స్వామి వాసుదేవానంద ఇలా వ్రాశారు: "ఆయన నామంలో అద్భుతమైన మహత్త్వం ఉంది. కష్ట సమయాల్లో ఆ నామం ధైర్యాన్నిస్తుంది. మంచి సమయాల్లో ఆనందాన్ని కలిగిస్తుంది; రోగానికి ఔషధంగా, చీకటికి వెలుగుగా ఈ నామం విరాజిల్లుతుంది. మరణానంతరం ఈ నామం మనిషిని అమరత్వ రాజ్యంలోకి తోడ్కొని వెళుతుంది. సంఘర్షణ కాలంలో ఈ నామం ప్రశాంతతను నెలకొల్పుతుంది. ధ్యాన సమయంలో మనస్సును ఏకాగ్రపరుస్తుంది."

గురుదేవులు ఇలా చెప్పారు: "భగవన్నామాన్ని పునశ్చరణ చేస్తూ ఆయన మహిమను గానం చేస్తే దేహంలోని సకల పాపాలూ ఎగిరిపోతాయి. దేహం అనే వృక్షం మీద పాపాలనే పక్షులు వాసం చేస్తాయి. భగవన్నామ కీర్తన అనేది చేతులతో చప్పట్లు కొట్టడం లాంటిది. చేతులతో చప్పట్లు కొట్టగానే చెట్ల మీద పక్షులు ఎగిరిపోయినట్లు, భగవన్నామ గుణ సంకీర్తనమనే చప్పట్లకు పాపాలన్నీ పలాయనమవుతాయి."

కొన్ని సమయాలలో గురుదేవులు తమాషాగా భగవన్మహిమను కీర్తించేవారు. 1883 జనవరి 1వ తేదీన ఒక భక్తుడు గురుదేవుల కోసం బుట్ట నిండా జిలేబీలు తెచ్చాడు. ఒక జిలేబీ ముక్క తింటూ, నవ్వుతూ ఆయన ఆ భక్తుడితో ఇలా అన్నారు: "చూడు! నేను జగజ్జనని నామాన్ని పునశ్చరణ చేస్తూ ఉంటాను కదా! అందుకే ఈ మంచి తినుబండారాలన్నీ లభిస్తున్నాయి." అందరూ నవ్వారు. ఆయన ఇలా కొనసాగించారు: "కానీ ఆమె సొర, గుమ్మడి లాంటి ఫలాల నివ్వదు. జ్ఞానం, వివేకం, ప్రేమ, వైరాగ్యం మొదలైన అమృత ఫలాలను ప్రసాదిస్తుంది సుమా!"

గురుదేవుల నామ మహత్త్వాన్ని గురించి మాతృదేవి ఇలా చెప్పారు: "గురుదేవులు నాతో 'నా నామాన్ని స్వీకరించిన వారికి దుఃఖం కలగదు. నన్ను చింతన చేసే వారికి కనీస అవసరాలకు కొరత ఉండదు' అని అన్నారు." మాతృదేవి ఇంకా ఇలా చెప్పారు: "ఎవరైనా తమ కర్మ ఫలాన్ని అనుభవించే తీరాలి. కానీ నువ్వు భగవన్నామాన్ని స్మరిస్తే కాలు తీసివేయవలసినంత తీవ్రమైన గాయం అవడానికి బదులుగా సూది మాత్రం గుచ్చుకొంటుంది. జప తపాదులు చెడు కర్మను తొలగిస్తాయి' అని గురుదేవులు అన్నారు."

భగవన్నామ స్మరణ వలన లభించే ఫలితాన్ని ఈ యుగంలో శ్రీరామకృష్ణులు చూపించారు. ఆయన డబ్బును తాకలేదు; ఆయన ఏదీ పొదుపు చేయలేదు; ఆయన ఇల్లంటూ ఏదీ కట్టలేదు. కానీ ఆయన జగజ్జనని దివ్యనామాన్ని జపిస్తూ తన జీవితాన్ని ఆనందమయంగా గడిపారు.

భగవన్నామాన్ని స్మరిస్తూ స్వధర్మాన్ని పాటించే వారికి ప్రతికూల పరిస్థితులు కూడా అనుకూలంగా మారుతాయి. కాబట్టి భగవన్నామాన్ని నిరంతరం జపిస్తూ ముక్తిమార్గంలో ముందడుగువేద్దాం. □

## భగవంతుడిచ్చిన కానుక

# భగవద్గీత



భగవద్గీతను ఆదర్శంగా తీసుకొంటే మనిషికి ఆత్మగౌరవం, స్వేచ్ఛ పెంపొందడంతో పాటు సమత్వ భావన వృద్ధి చెందుతుంది. ముఖ్యంగా మన దేశానికి కావలసింది ఇదే. గీతా ఆదర్శం ప్రపంచంలో అందరినీ ఉత్తేజపరుస్తోంది. ఈ అనుష్ఠాన వేదాంతాన్ని ప్రపంచానికి మొట్టమొదటిసారిగా స్వామి వివేకానంద తెలిపారు. శ్రీకృష్ణుడు గీతను అనుష్ఠాన వేదాంతంగానే అందించాడు. మనం మాత్రం దీనిని కేవలం పవిత్ర గ్రంథంగా భావించి, పూజగదికి పరిమితం చేశాం. మనిషి పరిపూర్ణుడవడానికి కావలసిన అంశాలు భగవద్గీతలో ఉన్నాయన్న అవగాహన ఇప్పుడిప్పుడే మొదలైంది. ఆ ఆశయాలను పాటిస్తే వ్యక్తి సౌశీల్యవంతుడవుతాడు; జాతి ఔన్నత్యాన్ని సాధిస్తుంది. దేశం ప్రగతి పథంలో ముందుంటుంది. వేదాలు అనే కామధేనువు నుంచి శ్రీకృష్ణుడనే గోవులకాపరి పితికిన 'పాలు' – భగవద్గీత. ఆ పాలు కేవలం పూజగదిలో పెట్టి పూజించడానికి కాదు; అవి మనం తాగడానికి ఉద్దేశించబడినవి. అప్పుడే శక్తి వస్తుంది. అనేక వందల సంవత్సరాల నుంచి ఆ పాలను పూలతో పూజిస్తున్నాం కానీ తాగలేదు. అందువల్లే మనం భౌతికంగా, మానసికంగా, సాంఘికంగా బలహీనులుగానే ఉన్నాం. వాటిని తాగడం మొదలుపెడితే జాతి నూతన జవసత్త్వాలను సంతరించుకుంటుంది; శక్తిమంతంగా తయారవుతుంది.

ఒకసారి మిలటరీ గవర్నర్ జె.యన్. చౌదరిని కలిశాను. నేను ఆయన బల్లపైన భగవద్గీతను చూశాను. 'మీరు దీన్ని చదువుతారా?' అని అడిగాను. 'ప్రశాంతత కావాలనుకున్నప్పుడు కొన్ని శ్లోకాలను చదువుతాను' అని ఆయన అన్నారు. 'ఈ పుస్తకం యొక్క ప్రయోజనం అది కాదు' అన్నాను నేను. ఆయన ఆశ్చర్యంగా, 'మీ ఉద్దేశం ఏమిటి? కేవలం మానసిక ప్రశాంతత కాకుండా భగవద్గీత మరేదైనా ప్రయోజనాన్ని కలుగజేస్తుందా?' అని అన్నారు. 'తప్పకుండా; భగవద్గీత కేవలం ప్రశాంతతనే కాదు ధైర్యాన్నీ, బలాన్నీ కూడా ఇచ్చి ఒక వ్యక్తికి తన కర్తవ్యాన్ని పరిపూర్ణంగా తెలియజేస్తుంది' అన్నాను. 'అంటే నేను ఇంకా బాగా పనిచేయడం నేర్చుకుంటానా?' అని అడిగారు. దీనివల్ల మీరే కాదు మీ దగ్గర పనిచేస్తున్నవాళ్ళు కూడా ధైర్యవంతులై, దృఢంగా తయారవుతారనీ, బాధ్యతాయుతంగా ప్రవర్తిస్తారనీ చెప్పాను. 'ఇది నిద్ర పుచ్చే పుస్తకం కాదు. అందరినీ కర్తవ్య నిర్వహణలో ఇంకా ఎక్కువ బాధ్యతతో, ఒక ధ్యేయంతో సామాజిక అభివృద్ధికి నిర్దిష్టమైన నిర్ణయాలను తీసుకొనేలా చేస్తుంది' అన్నాను. 'మీరు స్వామి వివేకానందుని పుస్తకాలు చదివారా?' అని ఆయనను అడిగాను. 'ఆ! చిన్న చిన్నవి ఏవో చదివాను' అన్నారు. 'అవి చాలవు, మీరు "లెక్చర్స్ ఫ్రమ్ కొలంబో టు అల్మోరా" (సందేశ తరంగిణి) చదవాలి. అది భారతదేశానికి స్వతంత్రం రావడానికి ఎంతగానో దోహదపడిన పుస్తకం!' అన్నాను. 'అయితే ఒక పుస్తకం పంపండి చదువుతాను' అని అన్నారు. నేను పంపాను. తరువాత ఆయన నాకు మిత్రుడయ్యారు.

ప్రస్తుత తరుణంలో మనం ముందుకు వెళ్ళడానికి ఆచరణీయ వేదాంతం కావాలి. మన పాదాల వద్ద ఉన్న ప్రమిదలోని జ్ఞానజ్యోతి వెలుగును మెదడు వరకు ప్రసరింపచేయాలి. ధైర్యశాలి అయిన అర్జునుడికి, ధీశాలి అయిన శ్రీకృష్ణుడు చేసిన ఉపదేశం గీత. అంటే, ధైర్యశాలురైన ప్రజలకు మరింత ధైర్యం కోసం గీత అన్న ఉద్దేశాన్ని మనం జ్ఞాపకం పెట్టుకోవాలి. ప్రపంచం అంతటా కోట్లాది ప్రజలు దీనిని శతాబ్దాలుగా చదువుతూ పరమోత్కృష్ట ప్రయోజనాన్ని పొందారు; పొందుతున్నారు; ఆలోచనా పరిధిని విస్తరించుకుంటున్నారు. □

(స్వామి రంగనాథానందజీ గీతోపన్యాసాల నుంచి)

**సేకరణ : ఆర్ కృష్ణ**



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -29

## ã=òæ#òÑO2# ÃÑ¿È

స్వామి జపానందజీ 1929వ సంవత్సరం నుంచి 1935 వరకు అంటే సుమారు 6 సంవత్సరాలు గుజరాత్‌లోని కాఠియావాడ్‌లో గడిపారు. కాఠియావాడ్ ఆస్థానపు దివాన్ గారితో పరిచయమై, అది కొద్దికాలానికే స్నేహంగా మారింది.

గుజరాతీయులు తమ ఇంటి పెద్ద, అంటే పెద్ద అన్నను 'మోటాభాయి' అంటారు. ఆ పద్ధతిలో కొన్ని కుటుంబాలలో తండ్రిని కూడా 'మోటాభాయి' అనే పిలుస్తారు. దివాన్ గారిని వారి ఇంట్లో సభ్యులు 'మోటాభాయి' అని పిలిచేవారు. అలాగే జపానందజీ కూడా అతణ్ణి 'మోటాభాయి' అనేవారు. మోటాభాయి మంచి స్వభావం కలవాడు. అందరినీ ఆదరించేవాడు. డబ్బును మంచినీళ్ళ ప్రాయంగా ఖర్చు పెట్టేవాడు. ముందూ వెనకా ఆలోచించకుండా ఖర్చులు పెట్టడంతో ఒక్కొక్కసారి ఇబ్బందులను ఎదుర్కొనేవాడు. సన్న్యాసిని మోటాభాయి, వారి ఇంటి సభ్యులందరూ వారి ఇంట్లో వ్యక్తిగానే చూసేవారు. ఎల్లప్పుడూ స్వామీజీ అవసరాలు కనిపెట్టుకొని, అన్నీ సమకూర్చేవారు. ఒక సంవత్సరం చలి ఎక్కువగా ఉంది. ముంబయిలో కూడా ఆ ఏడు చాలా చలిగా ఉంది. ఆ సంవత్సరం అందరూ ఉన్ని దుస్తులు ప్రత్యేకంగా కొనుక్కున్నారు. ఉన్ని దుస్తుల వ్యాపారులు బాగా డబ్బు చేసుకున్నారు. మోటాభాయి కుటుంబంలో అందరూ ముంబయి వెళ్ళాలి. సన్న్యాసిని కూడా వారితో రావాల్సిందిగా పిలిచారు. సన్న్యాసి దగ్గర స్వెట్టరు కానీ, కోటు కానీ లేదు. అందుకని వెళ్ళడానికి సంకోచించారు.

ఇంటికి నలుగురు కుట్టుపనివాళ్ళను పిలిపించి, రాజ్‌కోట్ బజారులో దొరికిన మంచి రకం ఉలెన్ బట్ట తెప్పించి ఇంట్లో అందరికీ కోట్లు, ఇంకా అవసరమైన ఉన్నిదుస్తులు కుట్టించాడు. మోటాభాయి కుటుంబ సభ్యులందరికీ, అంటే అన్నదమ్ములు, వారి పిల్లలు, మనుమలు - ఇలా మొత్తం యాభైమందికి కోట్లు కుట్టించాడు.

మోటాభాయి తమ్ముడు ఒకరు వేరుగా ఉంటున్నాడు. అతని 10-11 సంవత్సరాలు వయసున్న పిల్లలు రోజూ మోటాభాయి ఇంటికి వచ్చేవారు. వాళ్ళకి అందరి కన్నా ముందు బట్టలు కుట్టించాడు. అది చూసి మోటాభాయి భార్యకు కోపం వచ్చింది. "వాళ్ళు మనతో ముంబయి రావడం లేదు. వాళ్ళకు తరువాత కుట్టించవచ్చుకదా" అంది. అయినా వాళ్ళకే ముందు కుట్టించాడు. ఆయన, సన్న్యాసితో "స్వామీజీ! వాళ్ళు మా తమ్ముడి పిల్లలు. వాళ్ళకు మంచి ఉన్ని దుస్తులు లేవు. ఇక్కడ కుట్టుపని వాళ్ళు కుట్టడం చూస్తున్నారు. 'పెద్దనాన్న మాకు కుట్టించలేద'ని బాధపడరూ! అందుకే ముందు వాళ్ళకు కుట్టించాను" అన్నాడు.

ఇలా ఉండగా, పని ఇంకా త్వరగా అవడానికి ఇంకో ఇద్దరు పనివాళ్ళను పిలిపించారు. ముందు తెప్పించిన బట్ట చాల లేదు. మనుష్యుల్ని బజారుకు పంపించారు. కానీ ఈ సారి ముందు లాంటి మంచి బట్ట దొరకలేదు. బజార్లో దొరికిన ఉలెన్ బట్టల్నే తెప్పించి ఇంట్లో వాళ్ళకీ, తనకీ



కుట్టించాడు. ప్రయాణానికి ముందురోజు మోటాభాయి కోటు తయారైంది. తీరా అప్పుడు వాళ్ళకు జ్ఞాపకం వచ్చింది - తాము స్వామీజీకి ఏమీ కుట్టించలేదని!

"చలికాలంలో కావలసిన దుస్తులు స్వామీజీ దగ్గర లేవని మీరెవరూ నాకు గుర్తు చెయ్యలేదు. కనీసం ఒక్క కోటైనా ఉండాలి కదా! నేను కూడా అడగడం మర్చిపోయాను" అని మోటా భాయ్ తన ఇంట్లో వాళ్ళతో అన్నాడు. లోపలికి వెళ్ళి, తన కోసం కుట్టిన కోటు తీసుకువచ్చి స్వామీజీకి ఇచ్చాడు. కానీ, అది కొంచెం పెద్దది అయింది. దాంతో, కుట్టుపనివాడికి ఇచ్చి, సన్న్యాసికి సరిపడేలా దాన్ని సరి చేయించాడు. సన్న్యాసి "నాకు వద్దు. ముంబయి వెళ్ళిన తరువాత స్వెట్టరు కొనుక్కుంటాను" అని ఎంత చెప్పినా వినలేదు. "నేనే

ముంబయిలో అవసరమైన దుస్తులు కొనుక్కుంటాను" అని మోటాభాయ్ అన్నాడు. ముంబయిలో ఒక నెల ఉండి అందరూ రాజ్‌కోట్ తిరిగి వచ్చారు.

అదే సమయంలో బీహార్‌లో భయంకరమైన భూకంపం వచ్చింది. ఎంతోమంది ప్రాణాలు కోల్పోయారు. ఇళ్ళు, సామాన్లు, అయినవాళ్ళను పోగొట్టుకున్నారు. భూకంప పీడితులకు రామకృష్ణ మిషన్ సహాయ కార్యక్రమాలు చేపట్టింది. అహ్మదాబాద్ వెళ్ళి, మిత్రులనూ, పరిచయస్థులనూ అడిగి సేవాకార్యానికి అవసరమయ్యే సొమ్మును విరాళాల రూపంలో సేకరించే ప్రయత్నం చేయాల్సిందిగా ఖార్ రామకృష్ణ మిషన్ స్వామీజీ, సన్న్యాసిని కోరారు. సన్న్యాసి ఆ పనిలో చాలామటుకు సఫలీకృతులయ్యారు. ఆ పని పూర్తయ్యాక రాజ్‌కోట్ తిరిగి వెళ్ళిపోవాలి. సన్న్యాసి దగ్గర రైలు ప్రయాణానికి డబ్బు లేదు. ఎటు నుంచీ సహాయం రాకపోతే కాలినడకనే రాజ్‌కోట్ వెళదామని అనుకున్నారు. అంతేకానీ, ఎవరినీ ఏదీ అడగకూడదని సన్న్యాసి నియమం పెట్టుకున్నారు.

ఇంతలో మోటాభాయి ఒక్కరూ ముంబయి నుంచి రాజ్‌కోట్ తిరిగి వస్తున్నారని కబురు వచ్చింది. ఆయన సన్న్యాసిని తనతో రాజ్‌కోట్ తిరిగి రావడానికి సిద్ధంగా ఉండాల్సిందిగా అన్నాడు. ఇంకా భూకంప పీడితుల సహాయం కోసం విరాళాలు సేకరించే పని పూర్తి కాలేదు. అందుకు ఇప్పుడే రాజ్‌కోట్ వెళ్ళడం అవదు. స్వామీజీ, మోటాభాయిని కలవడానికి రైల్వేస్టేషన్‌కి వెళ్ళారు, రైలుబండి వచ్చింది. కబుర్లు చెప్పుకున్నారు. రైలుబండి కదలబోతూ ఉండగా మోటాభాయి ఏదో చెబుతూ ఉంటే, పని అయిపోగానే రాజ్‌కోట్ వస్తానని సన్న్యాసి అన్నారు. రైలు నడుస్తూ ఉండగా, కిటికీలో నుంచి మోటాభాయి "స్వామీజీ! మీ దగ్గర టికెట్‌కి డబ్బు ఉందా?" అని అడిగాడు. స్వామీజీ దగ్గర నుంచి సమాధానం లేకపోవడంతో, పది రూపాయల నోటు కిటికీలో నుంచి స్వామీజీ చేతిలో పెట్టాడు. బండి వెళ్ళిపోయింది.

వారం పదిరోజులకు అహ్మదాబాద్‌లో పని పూర్తిచేసుకుని సన్న్యాసి రాజ్‌కోట్ వెళ్ళి మోటాభాయిని కలవడానికి వారి ఇంటికి వెళ్ళారు. అక్కడ అతని తమ్ముడు ఉన్నాడు. స్వామీజీ ఇంట్లోకి ప్రవేశించగానే అతను "స్వామీజీ! మీకు తెలుసా? ఈ సారి మోటాభాయి ముంబయి నుంచి ఎలాంటి స్థితిలో వచ్చారో? ఆయన దగ్గర పదిరూపాయలు మాత్రమే ఉన్నాయి. అవి మీకు ఇచ్చారు. దోవలో ఎక్కడా ఏమీ తినలేదు, తాగలేదు" అన్నాడు.

"అదేమిటి అలా అంటున్నారు? వారి దగ్గర పది రూపాయలే ఉన్నాయా! అవే నాకు ఇచ్చారని నాకు ఎలా తెలుస్తుంది! నేను వారిని ఏమీ అడగలేదే! బండి కదిలిపోతూ ఉండగా, కిటికీలో నుంచి నాకు ఇచ్చారు. అయ్యో భగవంతుడా! నా వల్ల ఆయనకు ఇంత ఇబ్బంది అయిందా!" అని బాధాతప్త హృదయంతో సన్న్యాసి అన్నారు.

మోటాభాయి మాత్రం నవ్వుతూ లోపల నుంచి బయటకు వచ్చి ఆప్యాయంగా స్వామీజీని పలకరించి లోపలకు తీసుకెళ్ళాడు. □ **అనువాదం : శ్రీమతి జి.ఎస్. లక్ష్మి**



## మీరేనా దేవుడంటే!

కొన్నేళ్ళ క్రిందట న్యూయార్క్‌లో జరిగిన ఒక విక్రయ సదస్సుకి షికాగో నగరం నుంచి కొందరు విక్రయదారులు హాజరయ్యారు. ఆ సదస్సు ముగించుకొని తిరిగి షికాగో వెళ్ళడానికి వారంతా విమానాశ్రయానికి బయలుదేరారు. ట్రాఫిక్ రద్దీ వల్ల విమానాశ్రయానికి ఆలస్యంగా చేరుకున్నారు. అప్పటికే విమానం బయలుదేరే సమయం అయ్యిందనే ప్రకటన విన్నారు. ఆ కంగారులో అక్కడున్న ఆపిల్ పళ్ళ స్టాండ్‌కి వారిలో ఒకరి కాలు తగిలి ఆ పళ్ళన్నీ నేలపై చెల్లాచెదురుగా పడ్డాయి. విక్రయదారులంతా వెనక్కి తిరిగి చూడనైనా చూడకుండా కౌంటర్ వైపు పరిగెత్తారు, ఒక్కరు తప్ప.

అతను ఆగి తన మిత్రుల్లో ఒకరితో "ఫ్రాన్సిస్! షికాగో చేరగానే నువ్వు మా ఇంటికి ఫోన్ చేసి నేను తరువాతి విమానంలో వస్తున్నానని చెప్పు" అని అన్నాడు.

ఆ ఆపిల్ పళ్ళను అమ్మే 16 ఏళ్ళ అమ్మాయి ఏడుస్తూ నేలపైన పడిన పళ్ళను ఏరుకుంటోంది. ఆ వ్యక్తి కూడా నేలపై చెల్లాచెదురుగా పడిన పళ్ళను ఏరి స్టాండ్‌లో ఉంచాడు. ఏడుస్తున్న ఆ అమ్మాయి చేతిలో 40 డాలర్లు ఉంచి "ఇది నీకు జరిగిన నష్టానికి పరిహారం" అని ఓదార్చాడు. అప్పుడు ఆ అమ్మాయి అతనితో 'సర్! మీరేనా దేవుడంటే!' అని అడిగింది.

మనల్ని ఎవరైనా దేవుడు అనుకునేలా జీవితంలో ఒక్కసారైనా ప్రవర్తించామా? □

# దేవీ వైభవం

ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

(...గత సంచిక తరువాయి)

అమ్మ నుండి రెండో ఆవిడ వచ్చింది... ఆవిడే కాళి. ఇంకా అనేకమంది రాక్షసులు వస్తూ ఉంటే అమ్మ నుండి సప్తమాతృకలు వచ్చారట. అమ్మ కథ చెప్పినా అమ్మ నామం చెప్పినా అమ్మ ఆవిర్భావం అక్కడ జరుగుతుందన్న విషయం ఎప్పుడూ గుర్తుపెట్టుకోవాలి. కమండలం, అక్షమాలతో హంస వాహనంపై కూర్చొని బ్రాహ్మీ (బ్రహ్మ స్వరూపం); చతుర్భుజాలతో శంఖ చక్ర గదా పద్మాలు ధరించి, గరుత్మంతుడి మీద కూర్చొని, నీలమేఘశ్యామల అయి వైష్ణవి; సర్పాలు, త్రిశూలం ధరించి వృషవాహిని అయి మాహేశ్వరి; సహస్రాక్షాలతో ఐరావతం పైన ఐంద్రి; బల్లెంతో శక్తి ఆయుధం పట్టుకొని, నెమలి పైన కౌమారి; వారాహి; నారసింహి; చాముండి – ఈ శక్తులన్నీ బయటకు వచ్చాయి. చండ ముండుల్ని సంహరించి, ఆ రెండు తలలూ తెచ్చి ఏకా అయిన ఆ తల్లి దగ్గర పెట్టిందట. అందుకు ఆమెకు చాముండ అనే పేరు వచ్చింది. ఇంకా అనేకానేక శక్తులు వచ్చాయి. ఆ శక్తి సేనలన్నీ విజృంభించాయి. చండ ముండుల్నీ, రాక్షస సేనల్నీ సంహరించాయి. శుంభ నిశుంభులు బయల్దేరారు. కొంతసేపు యుద్ధం జరిగాక అమ్మ, నిశుంభుణ్ణి సంహరించింది. నిశుంభ సంహారం జరిగిన తరువాత శుంభుడి సైన్యమంతా దెబ్బతిని, వాడొక్కడే మిగిలాడు. అప్పుడు ఉక్రోషంతో "ఏమిటి నీ బడాయి! నిన్ను జయిస్తే నన్ను చేపడతానన్నావు; నిన్ను జయిద్దామని వస్తే నువ్వు ఇంతమందితో వచ్చి, యుద్ధం చెయ్యడం ఏం గొప్పా?" అన్నాడట. అమ్మ, "ఓరి మూర్ఖుడా! నీతో ఇన్ని రాక్షస (శక్తులు) సేనలున్నాయి. కనుక నేను ఇన్ని రూపాలు ధరించాను. ఒక్కర్తిని ఉన్న నన్ను ఇన్ని చేసినది నువ్వే" అన్నదట. "నిజంగా నువ్వొక్కడవూ వచ్చి ఉంటే నీ పని పట్టేదాన్ని. నువ్వు ఇంత మందిని తీసుకుని వచ్చావు. నేను నిజానికి ఏకనే. ఏకనైన నా నుండి వచ్చారు వీళ్ళందరూ. వీళ్ళు వేరు కాదు. అందరూ నా నుండి వచ్చిన నా శక్తులే; కావాలంటే చూడు" అన్నారట అమ్మవారు. "చూడు" అనగానే అక్కడున్న సప్త మాతృకలూ, ఇతర శక్తులూ వెళ్ళి అమ్మవారిలో కలిసిపోయి, అమ్మవారు ఒక్కరే కనపడ్డారట శుంభుడికి! అలా కనపడిన వెంటనే ఆ ఏకజ్ఞానం ఎప్పుడు వచ్చిందో వాడి పని పూర్తయిందట. అదే కృష్ణపరమాత్మ చెబుతాడు– "జ్ఞానమంటే ఏకదృష్టి. భిన్నత్వదృష్టి అజ్ఞానం అని"! "అవిభక్తం విభక్తేషు తద్జ్ఞానం విద్ధి సాత్త్వికం– "భాగభాగాలుగా కనిపిస్తున్న ఈ జగతి యందు అసలు ఏ భాగమూ లేకుండా వ్యాపించినటువంటి ఏకత్వాన్ని దర్శించు! అది జ్ఞానం'' అన్నాడు భగవద్గీతలోని 18వ అధ్యాయంలో శ్రీకృష్ణపరమాత్మ.



ఇన్ని అసురీ ప్రవృత్తులు నశించిన తరువాత, వాడు అడిగినప్పుడు అమ్మ అనుగ్రహించి ఏకత్వ జ్ఞానమిచ్చాక, వాడి పని పూర్తయింది. దీన్ని బట్టి మొత్తం సప్తశతి ఏం చెబుతున్నదో తెలుస్తోంది. మొదట చూపించినది – దేవతలందరి నుంచీ వచ్చిన శక్తీ కలసి ఒకటైంది. ఇక్కడ అమ్మ నుండి వచ్చిన శక్తులన్నీ వివిధ దేవతలుగా కనిపించి మళ్ళీ అమ్మలో లీనమయ్యాయి. ఇదంతా పరిశీలిస్తే, అమ్మ అంటే సర్వదేవతామయి. అమ్మ నుండి వచ్చిన శక్తుల్ని తీసుకొని, ఒక్కొక్క దేవత ప్రకాశిస్తూ ఉన్నారనే విషయం మనకి స్పష్టమవుతుంది. ఇదే దుర్గాదేవి వైభవం.

*యా చణ్డీ మధుకైటభాదిదలనీ, యా మహిషోన్మూలినీ*
*యా ధూమ్రేక్షణచణ్డముణ్డమథనీ యా రక్తబీజాశనీ ।*
*శక్తిః శుమ్భనిశుమ్భదైత్యదలనీ యా సిద్ధిదాత్రీ పరా*
*సా దేవీ నవకోటి మూర్తి సహితా మాం పాతు విశ్వేశ్వరీ॥*

ఈ ఒక్క శ్లోకంలో మొత్తం సప్తశతిని నిక్షిప్తం చేశారు ఆ మహర్షి. మొదట మధు కైటభ సంహారం చేసిన తల్లి పేరు – మహాకాళి. మహిషాసుర మర్దనం చేసిన తల్లి పేరు – మహాలక్ష్మి. శుంభ నిశుంభ సంహారం చేసిన తల్లి – మహాసరస్వతి. సాధారణంగా సరస్వతి అంటే సృష్టికర్త్రి అనీ, మహాకాళి లయకర్త్రి అనీ, మహాలక్ష్మి పోషణ కర్త్రి అనీ అంటాం. ఆ మూడూ ఇక్కడ ఉన్నప్పుడు వరస ఇలాగ వచ్చిందేమిటి అన్న ప్రశ్న రావచ్చు. దీనికి అనేక అంతరార్థాలున్నాయి.

జగతి యొక్క ఆరంభావస్థను మనం చూసినప్పుడు మొదట ఉండే ఆ లయావస్థలో నుంచే ఈ జగతి అంతా కూడా ఆవిర్భవిస్తున్నటువంటిది. ఆ తరువాత ఈ జగతి



యొక్క రక్షణ. భౌతికంగా చూస్తే ఆ రక్షణలో ఒక భాగం ప్రస్తావించబడింది. అంతరార్థం పరిశీలించినట్లైతే ఇక్కడ చాలా రహస్యముంది. అదేమిటంటే ఆ మహాకాళి ఆవిర్భావం చేత సర్వవిధాలైన ప్రవృత్తులూ ఆ జగజ్జనని యందు లయమై అప్పుడు ఆ తల్లి మనల్ని అనుగ్రహించి పరిపూర్ణమైన శక్తినీ, జ్ఞానాన్నీ ప్రసాదిస్తుంది. అందుకే సప్తశతి మహా సరస్వతీ తత్త్వంతో పూర్తవుతుంది. మహాసరస్వతి అంటే బ్రహ్మవిద్యాస్వరూపం. అదే మనకు కావల్సినది. అందుకు పరమశక్తిగా సరస్వతీ స్వరూపాన్ని చెప్పారు. ఆ మూడుగా ఉన్న తల్లి ఒక్కరే. మనం 'అమ్మా' అని పిలిచిన పద్యం తలచుకుంటే –

అమ్మల గన్నయమ్మ, ముగురమ్మల మూలపుటమ్మ, చాల బె
ద్దమ్మ, సురారులమ్మ కడు పాఱడి పుచ్చెడి యమ్మ, దన్ను లో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి యమ్మ,దుర్గ, మా
యమ్మ, కృపాబ్ధి యిచ్చుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్.

(పోతన భాగవతం)

దర్శనం పొందిన మహర్షి లాంటి మహానుభావుడు కనుకనే పోతన ఇంత గొప్పగా రచించగలిగారు. అమ్మలందరికీ అమ్మట. జగత్తులో ఏది కారణమను కుంటున్నామో ఆ కారణాలన్నిటికీ కారణం కనుక అమ్మలగన్నయమ్మ అలా అన్నప్పుడు ఇక్కడ 'మల' అంటే కొండ అని అర్థం. ఆ+మల కలిపితే అమ్మల అయింది. అమ్మల గన్నయమ్మ అంటే హిమవత్పర్వత రాజపుత్రి అయిన జగదంబిక; ముగ్గురమ్మల మూలపుటమ్మ... ముగ్గురిగా కనిపించినా ముగ్గురూ కలిపి ఒక్కటే... ఆ తల్లి ఏకా. ఇన్ని రూపాలేమిటి, ఇన్ని దేవతలేమిటి అనుకునేవాడు శుంభ నిశుంభుల్లాంటి వాడనీ, ఇన్ని రూపాలున్నా తల్లి ఒక్కటే అనే జ్ఞానం ఉన్నవాడు అమ్మ అనుగ్రహానికి పాత్రుడనీ తెలుసుకోవాలి. (మన మతంలో ఇందరు దేవుళ్ళేమిటి అంటే అది శుంభ నిశుంభుల లక్షణం అని తెలుసుకోవాలి.) అలాగ ఇక్కడ సర్వం, ఏకం అనే రెండు తత్త్వాలు చెప్పబడుతున్నాయి.

'ముగురమ్మల మూలపుటమ్మ... చాల పెద్దమ్మ' అంటే ఈవిడ ఎప్పటిదో ఎవరూ చెప్పలేదు. పురాతనీ, సనాతనీ అయిన తల్లి జగదంబిక చాల పెద్దమ్మ. ఎందుకొస్తుంది అంటే "దైవకార్య సముద్యతా". అది ఎలా చేస్తుంది.... సురారులమ్మ కడుపాఱడి పుచ్చెడి అమ్మ అంటే రాక్షసుల తల్లికి కడుపుమంట పెట్టడానికి వచ్చిందట. అంటే రాక్షసులందర్నీ చంపడానికి వచ్చింది. అయితే "తన్ను లో నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి అమ్మ" – లోనమ్మిన = అమ్మను చాలా లోతుగా మనసారా నమ్మాలి; అలా నమ్మిన వేల్పుటమ్మలు... వేల్పుటమ్మలు= దైవీ ప్రవృత్తులు; దైవీ ప్రవృత్తున్న వారిని అనుగ్రహిస్తుంది. అందుకు అమ్మ అనుగ్రహం పొందాలంటే దైవీ ప్రవృత్తులు పెంచుకోవాలి. అంతే కానీ దేవకాంతల హృదయంలో అమ్మ ఉంటుందని మామూలు అర్థం తీసుకోకూడదు. □

(సశేషం)

ధీరవాణి

- స్వామి వివేకానంద

# ఆత్మసామ్రాజ్యానికి అధిపతివి నీవే!



ఒకప్పుడొక రాణి ఉండేది. ఆమె పేరు మదాలస. ఆమె తన పిల్లలందరూ జీవన్ముక్తులు కావాలనుకొని అందు నిమిత్తం స్వయంగా శ్రద్ధ వహించింది. ఊయలలో పడుకోబెట్టి, వారిని ఊపుతూ "తత్త్వమసి, తత్త్వమసి" (నువ్వే బ్రహ్మనివి, నువ్వే బ్రహ్మనివి) అని ఆమె జోల పాడేది. వారిలో ముగ్గురు సన్న్యాసులైనారు. నాలుగోవాడు చక్రవర్తి కావడానికి తగిన శిక్షణ పొందడానికై మరోచోటుకు కొనిపోబడ్డాడు. అతడు ఇల్లు విడిచి వెళ్ళేటప్పుడు ఆ తల్లి అతడికొక చీటీనిచ్చి, ప్రాయం వచ్చాక దాన్ని చదవాల్సిందిగా చెప్పింది.

పెరిగి పెద్దయ్యాక అతను ఆ చీటీ తీసి చూశాడు. దాని మీద ఇలా వ్రాయబడి ఉంది: "బ్రహ్మమే సత్యం, తక్కినదంతా మిథ్య. ఆత్మ చంపదు, చావదు. ఒంటరిగా జీవించు, లేదా సాధుసంగంలో మసలుకో." యువరాజైన ఆ రాకుమారుడు దాన్ని చదువుకోగానే, సంసారాన్ని త్యజించి సన్న్యాసి అయ్యాడు.

త్యజించు, సంసారాన్ని త్యజించు. వంటింట్లోకి జొరబడి ఒక మాంసపు ముక్కను తింటూ, ఇంతలో ఎవరైనా వచ్చి తరిమికొడతారేమో అనే భయంతో అటూ ఇటూ చూసే కుక్కల మాదిరి మనం ఉన్నాం. అలా కాకుండా సార్వభౌముడవై ఉండు, సమస్త ప్రపంచమూ నీదే అని గ్రహించు. సంసారాన్ని త్యజిస్తేనే గానీ ఈ ఎరుక నీకు కలగదు. శారీరకంగా త్యజించ లేకుంటే మానసికంగా త్యజించు. హృదయాంతరాళాల నుంచి నెట్టివేయి. వైరాగ్యం కలిగి ఉండు. ఇదే నిజమైన త్యాగం, అది లేనిదే ఆత్మసిద్ధి పొందడం అసాధ్యం.

మంచివైనా, చెడువైనా - నీ కర్మలను కన్నెత్తి కూడా చూడబోకు. వాటిని స్మరించనే స్మరించకు. అయినదేదో అయింది. మూఢవిశ్వాసాలను విడనాడు. మృత్యుముఖంలో నైనా సరే దౌర్బల్యానికి అధీనుడవు కాబోకు.

పశ్చాత్తాపపడకు, జరిగిపోయినవాటి గురించి తలపోస్తూ ఉండకు; సత్కర్మ ఫలమైనా, దుష్కర్మ ఫలమైనా సమస్త కర్మఫల భారాన్ని భగవంతుడి మీద పెట్టు. దుష్కర్మలను మాత్రమే భగవంతుడికి సమర్పించి, సత్కర్మలను నువ్వు ఉంచుకోకు. దుర్బలులు, భయగ్రస్తులు, అజ్ఞులు - వీరెన్నడూ ఆత్మను పొందలేరు. □

# పరిప్రశ్న

- స్వామి సుకృతానంద



**యన్.వి.నారాయణ, బెస్తవారి పేట.**

**? : సర్వాంతర్యామి అయిన భగవంతుణ్ణి పూజ గదికో, గుడికో పరిమితం చేసి ప్రత్యేక మర్యాదలు ఇవ్వకుండా, మనలోనే ఉన్నట్లు భావించాలనుకోవడం తప్పా?**

□ : సర్వాంతర్యామి అయిన సర్వేశ్వరుణ్ణి కేవలం దేవాలయానికో, పూజ గదికో పరిమితం చేయరాదు. ఎల్లప్పుడూ ఆయన మనతోనే ఉన్నట్లు భావించటం ఉత్తమం. ఆ అద్వితీయ పరమాత్మ అంతటా వ్యాపించి ఉన్నట్లు భావించాలి. అయితే దేవాలయాల్లోనూ, ఇంట్లోనూ పూజించకూడదనడం భావ్యం కాదు. ఆయన అర్చా మూర్తిగా ఆలయాల్లో ఉంటూ భక్తుల నివేదనలను స్వీకరిస్తాడు. కల్పవృక్షమై వారి కోరికలను తీరుస్తాడు. దైవాన్ని సర్వజీవులలో చూడాలి. అందరికీ అది సాధ్యం కాదు. ఆ స్థితిని చేరుకోవడానికి పూజ గదులు, దేవాలయాల ఆవశ్యకత ఉంది. దీన్ని 'గౌణి పూజ' అంటారు. శ్రీరామకృష్ణ పరమహంస, స్వామి వివేకానంద, పవహారి బాబా, శ్రీరమణ మహర్షి - ఇలా అసంఖ్యాకులైన మహాత్ములు సర్వేశ్వరుని సర్వాంతర్యామిత్వాన్ని దర్శించారు. దైవానుగ్రహం ఉంటే మీరూ చూడగలరు.

**రాజ్యలక్ష్మి, కాకినాడ.**

**? : మంత్రానికి గల శక్తి, బీజం, కీలకం, ముద్ర అనే వాటిని విశదీకరింప ప్రార్థన.**

□ : **శక్తి:** ప్రతి భాషలోనూ పదాలకూ, వాక్యాలకూ వాచ్యార్థం ఉంటుంది. దీనిని "శక్తి" అంటారు. కుండ అనే పదానికి శక్తి కుండాకారం గల వస్తువును సూచించడంలో ఉంటుంది. అలాగే ఆవు అనే పదం యొక్క శక్తి ఆవు ఆకారంతో ఉన్న జంతువును సూచిస్తుంది. తల్లితండ్రులు పెట్టిన పేరుతో పిల్లలను పిలుస్తారు. పిల్లలు దూరంగా ఉంటే వారి పేరు తలచుకోగానే వారి రూపం మనస్సులో మెదులుతుంది. అలాగే మంత్రాల స్తుతిపాఠాల శక్తి ఆ యా దేవతా స్వరూపాలను సూచిస్తుంది.

**బీజం:** మర్రి చెట్టులోని శక్తి అంతా మర్రి "బీజం" (విత్తు)లోనే ఇమిడి ఉంటుంది. అలాగే మంత్రాలు, స్తుతి పాఠాల వ్యాపకరూపమైన శక్తి బీజాక్షరంలో ఇమిడి ఉంటుంది. అనుకూల వాతావరణంలో విత్తనం మహా వృక్షమైనట్లు మంత్రాలను బీజాక్షరాలతో జపించడం వల్ల జపించే వారికి అధిక ఫలం లభిస్తుంది.

**కీలకం :** కీలు అంటే మేకు. యంత్రాలలో కీలక స్థానంలో ఉన్న మేకు కానీ, గడియ కానీ పడిపోతే యంత్రం పని చేయదు. అలాగే మంత్ర, స్తుతి పాఠాలలో పాఠకులకు కలిగే ప్రతిబంధకాలను ఈ కీలకాలు తొలగిస్తాయి. పాఠకులకు ప్రతిబంధకాలు అంటే మంత్ర స్తుతి పఠన ద్వారా కలగాల్సిన ఫలితం లభించక పోవడం! అప్పుడు కీలక సహిత మంత్ర జపం ద్వారా, లేక కీలక స్తుతి ద్వారా ముల్లుతో ముల్లును తొలగించినట్లు ప్రతిబంధకాలు తొలగుతాయి.

**ముద్ర:** *యోజనాత్ సర్వదేవానాం ద్రాణాత్ పాప సంహతేః*
*తస్మాత్ ముద్రేతి సా ఖ్యాతా సర్వ కామార్థ సాధనీ*

అంటే వ్రేళ్ళు కలిపి ముద్రలు చూపించడం. దేవతలందరూ ముద్రలు చూపించే వారి వద్దకు వస్తారు. వారి పాపాలను నశింపజేస్తారు. వారి కోరికలన్నింటినీ సిద్ధింపజేస్తారు. కనుకనే 'ముద్ర' అంటారు. □

#ãûW^Œà

శ్రీవశిష్ఠ మహర్షి: ఓ రామచంద్రా! "ఇంద్రియ సమూహం అనే వంతెన ద్వారా ఈ భవసాగరాన్ని దాటడం జరుగుతుంది. మరింకే కర్మల వల్ల గానీ, వ్యవహారాల వల్ల గానీ అది సాధ్యపడేది కాదు. "శాస్త్రం – సజ్జన సాంగత్యం – సాధన" – వీటి సహాయం చేత ఈ జీవుడు జితేంద్రియుడు, వివేకవంతుడు అవగలుగుతున్నాడు. జితేంద్రియుడు (ఇంద్రియ ప్రభావాన్ని అధిగమించినవాడు) మాత్రమే ఈ దృశ్యం యొక్క అత్యంత అభావాన్ని ఎరుగగలడు. ఇంద్రియ జయమే సంసార భేదనం. ఇంద్రియవశత్వమే సంసార బంధనం.

చూశావా! రామా! ఇదీ సంసార స్వరూపం. ఈ సంసార సాగరాలు ఎలా ప్రాప్తిస్తున్నాయో, ఎలా నివర్తిస్తున్నాయో ఈ విచారణల సహాయం చేత నీకు నీవే గ్రహించు. ఆ పై ఏది ఎలా ఉచితమని భావిస్తావో, అలా చెయ్యి. ఇక ఎక్కువగా చెప్పవలసిన పనే ముంది? ఈ మనస్సే 'కర్మ' అనే వృక్షపు అంకురమని గ్రహించు. ఈ మనస్సును ఉత్తమ అవగాహనతో నియమించావా విహిత – నిషిద్ధ కర్మల రూపమైన ఈ జగద్వృక్షం స్వయం భిన్నమవుతుంది. అంతా ఈ మనస్సే అయి ఉందని మళ్ళీ మళ్ళీ చెబుతున్నాను. ఈ మనస్సుకు ఇక్కడే ఇప్పుడే సరి అయిన చికిత్స చేయాలి. మరి ఇంకెప్పుడు ఏమి చేయగలవు చెప్పు.



**మనః సర్వమిదం రామ, తస్మిన్నంతశ్చికిత్సితే**
**చికిత్సతోవై సకలో జగజ్జాలామయో భవతే ॥**

ఈ మనస్సుకు ఇక్కడ సరైన చికిత్స చేశావా, ఇది శమిస్తుంది. అప్పుడు "జగత్సమూహం" అనే దృశ్యజాడ్యం పూర్తిగా తొలగిపోతుంది.

మనస్సే ఈ దేహాకారముగా స్ఫురిస్తూ, స్వప్నంలో లాగ 'క్రియాసమర్థం' అవుతుంటే మనస్సు కన్నా వేరుగా ఈ జడదేహం ఎక్కడ కార్యసమర్థమవుతుంది? మనస్సు కన్న వేరైన లక్ష్యం కలిగి ఉంటోందా, లేదు!

అసలు ఈ 'సంసారం' అనబడే జాడ్యానికి మూలకారణమేమిటి? విను, చెబుతాను. ఎప్పటి నుంచో తెలియదు గానీ, ఈ జీవుణ్ణి "దృశ్యం" అనే ఒక పిశాచం పట్టి పీడిస్తోంది. ఎందుకో అతడు అది గుర్తించడం లేదు.

జ్ఞానం వల్ల ఈ దృశ్యాన్ని పూర్తిగా తొలగించి వెయ్యాలి. అంటే, మొత్తం దృశ్యానికి అతీతత్వం వహించి ఉండాలి. అదే సర్వ ప్రయత్నాలకీ ఉత్తమ ప్రయోజనం.

మరింకే వ్యవహారం ఎంతగా ఆశ్రయించినా సరే, ఈ దృశ్యం శమించేది కాదు సుమా! "దృశ్యం యొక్క పూర్ణ రాహిత్యం" మనోరోగానికి పరమోత్తమమైన ఔషధం. ఇందుకు వేరే మందేమీ లేదు.

ఈ మనస్సే దేహాదులలో ఆత్మభావనను కలుగజేసి, మోహాన్ని ఉత్పత్తి చేసి అందిస్తోంది. జన్మించేదీ అదే! మరణించేది కూడా అదే! ఈ మనస్సు యొక్క ప్రభావం చేతనే జీవుడు బంధంలో చిక్కుకోవడం జరుగుతుంది. ఎవరైతే ఈ మనస్సును ఆత్మజ్ఞానం వైపు ఉన్ముఖం చేస్తాడో, అట్టి వాడు స్వయంగా విముక్తిని పొందుతాడు.

ఓ జనులారా! మీరంతా చూస్తున్న ఈ జగత్తు మరెక్కడో లేదు సుమా! ఇది మీ మీ మనస్సులతో ఇలా సంకల్పాల బలం వల్ల జగత్తుగా ఏర్పడుతోంది. 'శూన్యం'లో విశాల గంధర్వ నగరంలా, స్వప్నంలో అనేక చమత్కారమైన వస్తువులలా ఇదంతా ప్రాప్తిస్తోంది. ఆ వస్తువే అయివుండి కూడా ఎంతో సత్యంగా తోస్తోంది. నాయనలారా! మీరంతా వాస్తవానికి సత్య–నిత్య–నిరుపమానంద స్వరూపులే! కానీ ఏం లాభం? నిష్కారణంగా మనస్సు వల్ల ప్రభావితులై అసత్యాన్ని అత్యంత సత్యంగానూ, నిత్యసత్యమైన నిర్మల చైతన్య తత్త్వాన్ని లేనట్టుగానూ గాంచుతున్నారని మనవి చేస్తున్నాను.

ఒక్కసారి మీ మీ మనస్సులను నిలదీసి ప్రశ్నించండి, నిరోధించండి. ఆత్మ వైపు ఉన్ముఖులు కండి! □

('శ్రీవసిష్ఠ రామ సంవాదం' – స్థితి ప్రకరణము నుంచి)

అనువాదం : వై. హెచ్.రామకృష్ణ



# <a HaÆ" ÕÉ JO «a Ò

(...గతసంచిక తరువాయి.)

నిజానికి, నారికేళాలను నైవేద్యంగా పెట్టడంలో ఓ చిన్న అంతరార్థం ఉంది. పూర్వకాలంలో దేవుడికి బలి ఇచ్చే సంప్రదాయం ఎక్కువగా ఉండేది. అయితే, కాలక్రమంలో అది తగ్గుతూ వచ్చింది. జంతుబలికి బదులుగా, కొబ్బరికాయ కొట్టి, సాత్వికమైన రీతిలో దైవాన్ని ఆరాధించే పద్ధతి పెరిగింది. కొబ్బరికాయ మీద ఉండే కళ్ళు, కాయకు ఉండే పిలక మనిషి శిరస్సును జ్ఞాపకానికి తెస్తాయి. కాబట్టి, కొబ్బరి కాయను నరబలికి ప్రత్యామ్నాయంగా కూడా చెబుతారు. కొబ్బరికాయను నైవేద్యంగా పెట్టడాన్ని భగవంతునికి రుధిరాన్ని నివేదించడమనే భావన కూడా ఉంది. అనేక తాంత్రిక ప్రక్రియల్లో సైతం నారికేళానికి ఉన్న ప్రాధాన్యం అంతా ఇంతా కాదు.



టెంకాయకూ, మన శరీరానికీ సంబంధం ఉంది. ఒక రకంగా చూస్తే, ఇది శరీరాన్ని అర్పించడం లాంటిది. కొబ్బరి బోండాంపై చర్మం మన చర్మమనీ, పీచు - మాంసమనీ, పెంకు - ఎముక అనీ, కొబ్బరి - మజ్జ అనే ధాతువు అనీ, నీళ్ళు - మనలోని అమృత రసమనీ, మూడు కళ్ళు - ఇడ, పింగళ, సుషుమ్న అనే నాడులు అనీ టెంకాయను గురించి చెప్పారు.

పారమార్థికంగా చెప్పాలంటే, గట్టిగా ఉండే కొబ్బరికాయ పై పెంకు మనలో దృఢంగా పేరుకుపోయిన అహంభావానికి ప్రతీక. నారికేళాన్ని పగులగొట్టడమంటే, మనం మన అహంభావాన్ని ఛేదించడమే! కొబ్బరి కాయలో ఉండే నీళ్ళు మనలోని 'వాసనల'కూ, తెల్లగా ఉండే కొబ్బరి గుజ్జు మన మనస్సుకూ ప్రతీక. కొబ్బరికాయ కొట్టి, ఆ చిప్పలనూ, కొబ్బరి నీళ్ళనూ దేవుడికి అర్పించడమంటే, మనం అహంకారాన్ని ఛేదించి, మన మనస్సును దేవుడికి నివేదించినట్లు అర్థం. అలా దేవునికి నివేదించిన కొబ్బరిని - అంటే భగవత్ నివేదనతో, ఆయన స్పర్శతో పునీతమైన మనస్సును - ప్రసాదంగా స్వీకరిస్తున్నామన్న మాట!

## <a HaÒ<ÕÉ#fiÎê Ò

మనిషి నారికేళం లాగ ఉండాలని శాస్త్రాలు చెబుతున్నాయి. కొబ్బరికాయ లాగ బయటకు ఎంతో దృఢంగా, కఠినంగా ఉన్నట్లు కనిపించాలి. అయితే, లోపల ఎంతో మృదువుగా, వితరణశీలి అయ్యుండాలి.

నిస్వార్థమైన సేవకు కూడా కొబ్బరికాయ ప్రతీక. నారికేళ వృక్షం ఎవరేది కోరితే అది అందించేదని ప్రాచీన గాథలు చెబుతున్నాయి. అందుకే, దాన్ని 'కల్పవృక్షం'గా పేర్కొనేవారు.

మనం జాగ్రత్తగా గమనిస్తే, కొబ్బరి చెట్టులో వృథా అయ్యేది ఏదీ లేదు. కొబ్బరి చెట్టు కాండం, కొబ్బరిమట్టలు, కొబ్బరికాయలు, కొబ్బరిపీచు - ఇలా అన్నీ ఉపయోగపడేవే! గుడిసెలు వేసుకోవడానికీ, చాపలు అల్లుకోవడానికీ, రుచికరమైన ఆహారపదార్థాల తయారీకీ, వాడుకొనే నూనెకీ - ఇలా ఎన్నో విధాలుగా అవి ఉపకరిస్తాయి.

నేలలోని ఉప్పు నీటిని గ్రహించి, దాన్ని బలవర్ధకమైన తియ్యటి కొబ్బరి నీళ్ళుగా మార్చడం కొబ్బరి చెట్టులోని విశేషం. అనారోగ్యంతో బాధపడుతున్నవారికి కొబ్బరి నీళ్ళు ఎంతో మేలు చేస్తాయని వేరుగా చెప్పనక్కర లేదు. కొబ్బరి నీళ్ళనూ, కొబ్బరి పదార్థాలనూ అనేక ఆయుర్వేద ఔషధాల తయారీలో, ఇతర ప్రత్యామ్నాయ వైద్య విధానాల్లో వినియోగిస్తుంటారు.

సముద్ర తీర ప్రాంతాల్లో ప్రధానంగా కొబ్బరి చెట్లు పెంచుతుంటారు. భారతదేశంలోని అన్ని ప్రాంతాల్లో కొబ్బరి కాయలను విభిన్న కార్యక్రమాలకు వినియోగిస్తుంటారు. ఆ రకంగా అది జాతీయ సమైక్యతకు చిహ్నమని చెప్పవచ్చు. □

(వచ్చే సంచికలో 'నారికేళం - వైద్య ప్రయోజనాలు')

# 't =^EáÑÕfL^OEO

కథ : స్వామి జ్ఞానదానంద        చిత్రాలు : సి. హెచ్. రమేష్




మిగతా 34 వ పేజీలో...



నేను (ఎమ్. రామారావు) రాజమండ్రి నుంచి 1932 ఆగష్టులో ఇంజనీరింగ్ చదవడానికి కలకత్తా వెళ్ళాను. ఆ సంవత్సరం దసరా సెలవులకి రాజమండ్రి వచ్చాను. ఒకరోజు నేను, మా సోదరుడు (ఎమ్.రంగారావు) గోదావరి ఒడ్డుకి వెళ్ళగా, అక్కడ మా మాధ్యమిక పాఠశాల ప్రధానోపాధ్యాయులైన జి.వి.వెంకటరావుగారు కలిశారు. వారు నన్ను "రామూ! నువ్వు ఇప్పుడు ఏమిటి చేస్తున్నావు" అని అడిగారు. నేను కలకత్తాలో కళాశాల విద్యను అభ్యసిస్తున్నట్లు చెప్పగానే, 'నువ్వు దక్షిణేశ్వరం, బేలూరు మఠం సందర్శించావా' అని అడిగారు. నేను ఎక్కడికీ వెళ్ళలేదనీ, ఆ ఊరికి ఇంకా అలవాటు పడలేదనీ చెప్పి, ఈ మారు వెళ్తాను అన్నాను.

## ఓ మరువరాని దివ్యానుభూతి

**- ఎమ్.రామారావు**

**భగవాన్ శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష సన్న్యాస శిష్యులైన స్వామి విజ్ఞానానందజీ మహరాజ్ 'గుప్త బ్రహ్మజ్ఞాని'. అలాంటి బ్రహ్మజ్ఞాని అనుగ్రహం పొందిన ధన్యులు శ్రీ ఎమ్. రామారావు. ఆయన 1932లో ఇంజనీరింగ్ విద్యను అభ్యసించడానికి రాజమండ్రి నుంచి కలకత్తా వెళ్ళారు. ఆ సమయంలో కలకత్తాలోని దక్షిణేశ్వరాలయం, ఉద్బోధన్, బేలూరు మఠాలను తరుచూ సందర్శించే వారు. ఆయన 1935లో బేలూరు మఠంలో స్వామి విజ్ఞానానందజీ మహరాజ్‌ను దర్శించారు. పూజ్య స్వామీజీని దర్శించినప్పటికి శ్రీ రామారావు వయస్సు 19 ఏళ్ళు. ఇప్పుడు ఆయన వయస్సు 94 ఏళ్ళు.**

**2009 నవంబర్ 1 తేదీన (తిథి ప్రకారం) స్వామి విజ్ఞానానందజీ మహరాజ్ జన్మదిన సందర్భంగా శ్రీ రామారావు మధురానుభూతులను 'శ్రీరామకృష్ణ ప్రభ' పాఠకులకు అందిస్తున్నాం. పూజ్య స్వామీజీతో జరిగిన సంభాషణల్నీ, మంత్రదీక్ష స్వీకరించిన వైనాన్నీ ఆయన మాటల్లోనే...**

ఏప్రిల్ నెలలో మా సోదరుడు రంగారావు, ఆయన మిత్రుడు టి.శ్రీరామ్మూర్తితో కలసి కలకత్తా వచ్చారు. వారు నేను ఉంటున్న బాలీగంజ్‌లోని వసతి గృహంలో (హాస్టల్) నాతోపాటే ఉన్నారు. మా అన్నగారు దక్షిణేశ్వరం, బేలూరు మఠం చూడాలనుకుంటున్నట్లు చెప్పారు. అప్పటికింకా కలకత్తాలోని అన్ని ప్రదేశాలూ బాగా తెలియక పోయినా, బేలూరుమఠం హౌరా వైపు ఉందని తెలిసింది. అందువల్ల వారిద్దర్నీ తీసుకుని ముందు హౌరా వెళ్ళాను అక్కడి నుండి దక్షిణేశ్వర కాళికాలయానికి బస్సులో వెళ్ళాం. ముందుగా కాళీమాతని దర్శించుకుని, 12 శివాలయాలకీ, రాధా గోవిందుని ఆలయానికీ వెళ్ళాం. అక్కడి నుండి పడవలో బేలూరు మఠం వెళ్ళాం. బేలూరు మఠంలో స్వామి శివానందజీ (మహాపురుష్) మహరాజ్ అనారోగ్యంతో ఉన్నారు. ఆయన్ని దర్శించేందుకు మేడమీదికి వెళ్ళాం. వారికి ప్రణామాలర్పించి మేము గోదావరి జిల్లా నుండి వచ్చాం అని చెప్పగానే స్వామీజీ "గోదావరీ మాయీ... గోదావరీ మాయీ... గోదావరీ మాయీ..." అని మూడు మార్లు అన్నారు. మహరాజ్ మమ్మల్ని ఆశీర్వదించి మీరు ఇనీషియేషన్ (మంత్రదీక్ష) తీసుకుంటారా అని అడిగారు.

(నవంబర్ 1, ఆదివారం – శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన **స్వామి విజ్ఞానానంద జయంతి**)

మా అన్నగారు "ఇనీషియేషన్" అంటే ఏమిటో మాకు తెలియదు అని బదులిచ్చారు. అప్పుడు మహాపురుష్ మహరాజ్ మమ్మల్ని బలవంతపెట్టలేదు. "ఇనీషియేషన్" అంటే ఏమిటో తెలుసుకోకపోవడం మేము చేసిన పెద్దపొరపాటు. మేము అప్పటికి "ఇనీషియేషన్" అన్న పదం విని ఎరుగం. "మంత్రదీక్ష" అని అంటే మాకు అర్థమై ఉండేది. అది మా దురదృష్టం.

ప్రతీ ఆదివారం బాలీగంజ్ నుంచి నేను ఉదయం 5 గంటలకి బయల్దేరి బస్సులో దక్షిణేశ్వరం వెళ్ళేవాణ్ణి. శ్రీరామకృష్ణులవారి పట్ల ఆకర్షితుడినైనందువల్ల నేను వారి గదికి వెళ్ళి ఎక్కువ సమయం అక్కడ గడిపేవాణ్ణి. అయితే నేను ఉండే బాలీగంజ్ దక్షిణేశ్వరానికి చాలా దూరం. అందువల్ల వెళ్ళి, రావడం శ్రమకరంగానే ఉండేది. క్రమంగా ఒక వారం బేలూరు మఠానికీ, మరొక వారం ఉద్బోధన్‌కీ వెళ్ళనారంభించాను. ఉద్బోధన్ బాలీగంజ్‌కి కాస్త దగ్గర అవడం వలన ఉదయం పూజ మొదలవకుండానే అక్కడకి చేరేవాణ్ణి.

ఆ విధంగా ఆదివారాలు, ఇతర శెలవు రోజుల్లో బేలూరు మఠం కన్నా ఎక్కువగా ఉద్బోధన్‌కు (మాతృమూర్తి శారదాదేవి నివసించిన గృహం) వెళ్ళేవాణ్ణి. అప్పుడు స్వామి ఆత్మబోధానందజీ కార్యదర్శిగా ఉండేవారు. నేను ఉద్బోధన్ వెళ్ళినప్పుడల్లా ఆయన "రామూ! టీ తాగుతావా" అని అడిగేవారు. నేను "అలాగే మహరాజ్" అనేవాణ్ణి.

1935 జులై 16న బేలూరు మఠానికి ఒక స్వామీజీ వచ్చారని తెలిసింది. ఆ రోజు సాయంకాలం నేను ఆ స్వామీజీని దర్శించుకోవడానికి వెళ్ళాను. బేలూరు మఠంలో స్వామి వివేకానందుల గది పక్కన ఉన్న గదిలోకి నన్ను ఒక స్వామీజీ తీసుకువెళ్ళారు. గది లోపల ఉన్న స్వామీజీ "సర్! లోపలికి రండి" అన్నారు. అప్పటికి నా వయస్సు 19 సంవత్సరాలు. స్వామీజీ 'సర్!' అని సంబోధించడం వల్ల పెద్దమనిషిని ఎవరినో పిలుస్తున్నారనుకున్నాను. "సర్! కంగారు పడకండి" అని స్వామీజీ నవ్వుతూ అన్నారు. స్వామి మళ్ళీ "మీరు ప్రస్తుతం ఏం చేస్తున్నారు" అని అడిగారు. అప్పుడు నేను "కలకత్తాలో ఇంజనీరింగ్ విద్య అభ్యసిస్తున్నాను" అని చెప్పాను. అందుకు స్వామీజీ "అయితే మిమ్మల్ని ఇంజనీర్‌గారు అని పిలవచ్చన్నమాట" అని అన్నారు. స్వామీజీ మాటలు విని అక్కడున్న బ్రహ్మచారులందరూ నవ్వారు. ఆయనే భగవాన్ శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులైన స్వామి విజ్ఞానానందజీ మహరాజ్ అని తెలిసి ఆశ్చర్యపోయాను.

తరువాత స్వామీజీ "మీరు మంత్రదీక్ష కోసం వచ్చారా? రేపు ఉదయం 8 గంటలకి రండి" అన్నారు. మర్నాటి నుండి నా పరీక్షలు మొదలుకానున్నాయి. అందుకని నేను ఏం చెయ్యాలా అని ఆలోచిస్తూ నేల చూపులు చూడసాగాను. నా సంశయం ఎందుకో తెలియక పోవడంతో "సర్! మీరేదో ఆలోచిస్తున్నట్లున్నారు" అని అడిగారు. అప్పుడు నేను "రేపు ఉదయం నాకు పరీక్ష ఉంది..." అన్నాను. "అయితే మంత్రదీక్ష ఇచ్చి, మిమ్మల్ని త్వరగానే పంపించేస్తాను" అని అన్నారు స్వామీజీ. ఒకవేళ ఆలస్యమైతే పరీక్ష మరుసటి సంవత్సరం వ్రాయొచ్చులే అని తీర్మానించుకొని "నేను తప్పకుండా వస్తాను" అని మంత్రదీక్ష తీసుకోవడానికి నా సమ్మతిని తెలిపాను.

మర్నాడు ఉదయం ధోవతి, కొన్ని పళ్ళు తీసుకుని వెళ్ళాను. దక్షిణ గురించి మరచి పోయాను. ముందుగానే ఒక స్వామీజీ పళ్ళెంలో పువ్వులు, దక్షిణ (ఒక రూపాయి) సిద్ధంగా ఉంచారు. ఆ పళ్ళెం తీసుకుని నేను గుడిలోకి వెళ్ళాను. నేను వెళ్ళే సరికే ఆ గదంతా మంత్రదీక్ష కోసం వచ్చిన భక్తులతో నిండి పోయింది; నేను కూర్చునేందుకు ఎక్కడా స్థలం లేదు, ఇంతలో ఎవరో కాస్త పక్కకి జరుగగా ఒక మూల పళ్ళెం పట్టుకుని కూర్చున్నాను. "ఇలా ఇంత చివరన మూలలో కూర్చున్నాను... మంత్రదీక్ష త్వరగా ముగించుకుని ఎలా వెళ్ళగలను" అనుకున్నాను. అయితే దైవ నిర్ణయం మరోలా ఉంది. స్వామి విజ్ఞానానందజీ మహరాజ్ డాబా మీద నుండి వస్తూ, వచ్చీరావడంతోనే తమ సేవక్ స్వామితో "దక్షిణాది నుండి మంత్రదీక్ష కోసం వచ్చిన అబ్బాయి ఉన్నాడు, ఆ అబ్బాయికి దీక్ష ఇవ్వందే మరెవ్వరికీ ఇవ్వడం జరగదు" అన్నారు. ఆ అబ్బాయికి అంత ప్రాముఖ్యత ఎందుకు ఇస్తున్నారు అన్నది సేవక్ స్వామీజీకి కూడా ఆశ్చర్యాన్ని కలిగించింది. "నేను ఆ అబ్బాయిని 8 గంటలలోపు దీక్ష ఇచ్చి, పంపించేస్తానని మాట ఇచ్చాను" అన్నారు స్వామీజీ.

అక్కడ ఉన్న అంతమంది భక్తులలో దక్షిణదేశం నుండి వచ్చింది నేనే కనుక నేను వెంటనే లేచి నిలబడ్డాను. వెంటనే స్వామీజీ "ఎందుకు అంత మొహమాటం, అలా మూలన కూర్చున్నారు" అంటూ నవ్వి "రండి సర్, నేను మీకు ముందు దీక్షి ఇచ్చి, పంపిస్తాను" అన్నారు. యథావిధిగా పూజ మొదలైనవి జరిగాక, నాకు దీక్ష ఇవ్వడం జరిగింది. తరువాత స్వామీజీ 'నేను ఈ రోజు రాత్రి అలహాబాద్ వెళుతున్నాను. నువ్వు హౌరా స్టేషన్‌లో 10వ ప్లాట్ ఫాం మీద అలహాబాద్

**మిగతా 30వ పేజీలో...**



# F=Çˆ ãy P ‡öÏ¿E

(™Éq∞q" Ö#O^ @ÉÜ«=K«åÅ ã=∂Ç~Ô)

**(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, ప్రవక్త, శ్రేష్ఠసన్యాసి, గురువు, యుగాచార్యుడు, దేవదూత, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వగాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన తన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.)**

(...గత సంచిక తరువాయి)

ఓ సారి శ్రీరామకృష్ణులు నాతో ఇలా అన్నారు: "ఈ ప్రపంచంలో కోటిలో ఒక్కరికి కూడా నిజంగా భగవంతునిపై విశ్వాసం లేదు." ఎందుకని నేనడిగాను. "ఈ గదిలో ఓ దొంగ ఉన్నాడనుకో. ప్రక్కగదిలో పెద్ద బంగారు నిధి ఉందనీ, ఈ రెండు గదులకూ మధ్య సన్నటి అడ్డుగోడ మాత్రమే ఉందనీ ఆ దొంగకు తెలిసిందనుకో! అప్పుడు వాడి పరిస్థితి ఎలా ఉంటుంది?" అని ప్రశ్నించారాయన. నేను "వాడసలు నిద్ర పోలేడు. అతడి మనస్సంతా 'ఆ బంగారాన్ని ఏ విధంగా చేజిక్కించుకోవాలా' అనే తపన పడుతుంది. వేరేమీ ఆలోచించలేడు!" అన్నాను. అప్పుడు వారిలా బదులిచ్చారు: "ఒక వ్యక్తికి భగవంతుడిపై నిజంగా శ్రద్ధ, విశ్వాసం ఉంటే ఆ దేవుణ్ణి పొందడానికి పిచ్చివాడిలా తపన పడకుండా ఉంటాడని నీవు నమ్ముతావా?.. ఈ సృష్టిలో అనంతమైన, మహాద్భుతమైన పరమానంద నిధి (దైవం) ఒకటి ఉందనీ, ఆ మహానందాన్ని (భగవంతుని) తప్పక పొందగలమనీ నిజంగా ఎవరైనా నమ్మితే, దాన్ని ఎలాగైనా పొందాలని తపన పడకుండా ఉండగలరా?"

ఒక రోజు శ్రీరామకృష్ణులు హఠాత్తుగా నా చేయి పట్టుకొని "ఈ రోజు నీ తెలివితేటలతో పాటు పాండిత్యమూ పరీక్షిద్దాం! నీవు కేవలం $2^{1/2}$ పరీక్షలు మాత్రమే పాసయ్యావు; కానీ $3^{1/2}$ పరీక్షలు పాసైన ఓ ఉపాధ్యాయుడు ఈ రోజు వచ్చారు! రా! ఆయనతో నీవెలా మాట్లాడతావో చూద్దాం!" అని నవ్వుతూ తీసుకెళ్ళారు. (నరేంద్రుడు అప్పుడు బి.ఏ. చదువుతున్నాడు. కానీ 'మ'– మహేంద్రనాథగుప్త బి.ఏ. పాసై, బి.ఎల్. చదువుతున్నాడు. ఈ విషయాన్ని సరళ స్వభావులైన శ్రీరామకృష్ణులు వివరించిన విధమిది!)

'మ'తో పరిచయమయ్యాక ఆయనతో ఎన్నో విషయాల గురించి మాట్లాడాను. గురుదేవులు నిశ్శబ్దంగా కూర్చొని, మా మాటల్ని వింటూ మమ్మల్ని గమనించసాగారు. 'మ' వెళ్ళిపోయిన తర్వాత ఆయనిలా అన్నారు: "మ. అన్ని పరీక్షల్లో ఉత్తీర్ణుడైనా ఏం లాభం? ఆయనది స్త్రీ స్వభావం – సిగ్గు, బిడియం. దీటుగా వాదించలేడు!" ఈ విధంగా ఇతరులతో నన్ను మాట్లాడింపజేస్తూ, గురుదేవులు తమాషా చేసేవారు.

(గురుదేవులను కలిసిన కొన్నాళ్ళ తర్వాత) ఈ మతం, ధర్మం – సాధన వల్ల నేనేమీ సాధించక పోయి ఉండవచ్చు. కానీ గురుదేవుల కృప వల్ల నా భయంకరమైన కోపాన్ని అదుపులో పెట్టగలిగాను. ఇందులో సందేహం లేదు. ఇంతకు ముందు తీవ్ర క్రోధావేశంలో ఆత్మ నిగ్రహం కోల్పోయి, ఆ తర్వాత పశ్చాత్తాపంతో కుమిలిపోయేవాణ్ణి... కానీ ఇప్పుడు ఎవరైనా నాకు చాలా హాని చేసినా, తీవ్రంగా కొట్టినా కూడా నేను కోపోద్రిక్తుణ్ణి అవడం లేదు. ఒకరోజు గురుదేవులు అడిగారు: "నీ కెప్పుడైనా జ్యోతి కనిపిస్తుందా?" "ఔను. నిద్రపోయే ముందు నా నుదుటి దగ్గర ఒక జ్యోతి తిరుగుతూ కనిపిస్తుంది" అని నేను చెప్పాను.

నా పెళ్ళి కోసం ప్రయత్నాలు జరుగుతున్నాయని తెలిసిన గురుదేవులు దేవాలయంలో కాళికాదేవి పాదాలు పట్టుకుని కన్నీరు కారుస్తూ, "అమ్మా! దయచేసి అలాంటిదేమీ జరగకుండా చేయి తల్లీ! నరేంద్రుణ్ణి మాయలో ముంచి వేయకమ్మా!" అని ప్రార్థించారు... ఒక రోజు గురుదేవులు మా ఇంట్లో నేను చదువుకొనే గదిలోకి వచ్చి అఖండ బ్రహ్మచర్యపాలన గురించి ఉపదేశమిస్తుండగా, మా అవ్వ ప్రక్కగది నుండి అదంతా విని మా అమ్మానాన్నలకు చెప్పేసింది! దాంతో ఇలా ఓ సాధువుతో తిరిగి నేనూ 'సన్యాసినైపోతానేమో' అనే భయంతో వాళ్ళు నా పెళ్ళి ప్రయత్నాలు ఇంకా తీవ్రతరం

చేశారు. కానీ గురుదేవుల దివ్య సంకల్పం ముందు వారి ప్రయత్నాలన్నీ నీరుగారాయి! కొన్నిసార్లు అంతా నిశ్చయమైనా, రెండు కుటుంబాల మధ్య కొన్ని అతి చిన్న విషయాలలో అభిప్రాయభేదాలు వచ్చి పెళ్ళి ఆగిపోయేది.

గురుదేవుల సన్నిధిలో మేము పొందిన అనిర్వచనీయ దివ్యానందాన్ని గురించి వివరించడం అసాధ్యం! మాకు తెలియకుండానే మాతో ఆడుతూ పాడుతూ, మా ఆధ్యాత్మిక జీవితాల్ని తీర్చిదిద్దుతూ, మాకెలా శిక్షణ నిచ్చేవారో నిజంగా మా బుద్ధికి అందని విషయం!.. ఓ సారి నేను ధ్యానంలో ఏకాగ్రతను పొందలేక గురుదేవుల సలహా అడిగాను. నేను ప్రాతఃకాలం ధ్యానాభ్యాసానికి కూర్చోగానే దగ్గరలో ఉన్న ఓ జనపనార మిల్లు నుండి వచ్చే సైరన్ శబ్దంతో నా మనస్సు చంచలమయ్యేది. ఈ సమస్య చెప్పగా గురుదేవులు ఆ సైరన్ శబ్దం మీదనే మనస్సును ఏకాగ్రం చేయమని నాకు సలహా ఇచ్చారు. వారి సలహాను పాటించి ఎంతో లాభం పొందాను. మరోసారి ధ్యాన సమయంలో శరీరస్పృహ పూర్తిగా మరచిపోవడంలోనూ, లక్ష్యం పైన మనస్సును ఏకాగ్రం చేయడంలోనూ ఇబ్బంది ఎదురైంది. అప్పుడు గురుదేవుల సహాయమడిగాను. ఆయన తమ గురువు తోతాపురి వద్ద వేదాంత మార్గంలో సాధన చేసేటప్పుడు వారిచ్చిన (తోతాపురి) ఉపదేశమే నాకూ ఇచ్చారు. తన బొటన వేలి గోటితో నా కనుబొమ్మల నడుమ గుచ్చి "ఇప్పుడు ఈ నొప్పి కలిగే భాగంపై నీ మనస్సును ఏకాగ్రం చేయి" అన్నారు. నేనలా చేసేసరికి సులభంగా ఏకాగ్రత కుదిరింది. శరీర స్పృహ కూడా లేకుండా గాఢంగా ధ్యానం చేయగలిగాను.

గురుదేవులు అనేక ఉన్నత ఆధ్యాత్మిక అనుభూతులు పొందిన 'పంచవటి'లోని ఏకాంత, ప్రశాంత వాతావరణం మా ధ్యానానికి చాలా అనువుగా ఉండేది. ధ్యానాది సాధనలే కాక అక్కడ మేము (నరేంద్రుడు, ఇతర సోదర శిష్యులు) అప్పుడప్పుడూ అల్లరిచేస్తూ, తమాషాలతో గడిపేవాళ్ళం. కొన్ని సార్లు గురుదేవులు కూడా మా వినోదాన్ని రెట్టింపు చేసేవారు! పరుగెత్తడం, గెంతడం, చెట్ల పైకి ఎక్కడం, లతలు ఊడలతో ఊగడాలతో పాటు, అప్పుడప్పుడు వన భోజనాలు చేసేవాళ్ళం. మొదటిసారి వనభోజనం జరిగినప్పుడు నేనే స్వయంగా వండడం గమనించిన గురుదేవులు మాతో కలిసి భుజించారు. ఆయన బ్రాహ్మణులు వండింది తప్ప తినరని నాకు తెలుసు. కాబట్టి వారి భోజనానికి కాళీ ఆలయంలో ఏర్పాటు చేయించి ఉంచాను. కానీ ఆయన "నీ లాంటి శుద్ధాత్మ వండింది తినడంలో ఏ దోషమూ లేదు" అంటూ నేనెంతగా వారించినా వినకుండా నేను వండిన ఆహారాన్ని ఎంతో ఆనందంగా స్వీకరించారు! మా నాన్న చనిపోయిన తరువాత మా అమ్మ, తమ్ముళ్ళు ఆకలితో అలమటించసాగారు. ఒక రోజు గురుదేవులు నా మిత్రుడు 'అన్నదా గుహ'తో "నరేంద్రుని తండ్రి పోయాడు, వాళ్ళ కుటుంబం చాలా కష్టాలలో ఉంది. ఈ పరిస్థితిలో అతడి స్నేహితులు వాళ్ళకు ధనసహాయం చేస్తే బాగుంటుంది." అన్నారు. అన్నదా వెళ్ళాక గురుదేవులతో నేను "అవన్నీ వాళ్ళకు చెప్పాల్సిన అవసరమేముంది?" అంటూ కోప్పడ్డాను. దాంతో ఆయన కన్నీరు కారుస్తూ, "ఓ నరేన్! నీ కోసం నేను ఇంటింటికీ వెళ్ళి భిక్షమెత్తడానికైనా సిద్ధమే నాయనా!" అన్నారు. గురుదేవులకు నాపై ఉన్న ప్రేమ వర్ణింప సాధ్యంకానిది.

(సశేషం) అనుసృజన :స్వామి అర్చనానంద





# యువతరానికి గీతోపదేశం

– స్వామి బోధమయానంద

వేదాలు, భగవద్గీత మొదలైనవి వృద్ధులకూ, పదవీ విరమణ చేసినవాళ్ళకూ మనశ్శాంతి నిస్తాయని నేటి యువతరం అభిప్రాయం. మరికొందరు లోతైన సందేశాలు ఈ నాటి విధానానికి సరిపడవనీ, వాటిని గ్రహించడం కూడా కష్టమనీ భావిస్తారు. శ్రద్ధాసక్తులతో గీతాధ్యయనం చేస్తే ఇలాంటి తప్పుడు అభిప్రాయాలు సమసిపోతాయి. నేటి యువకులలాగే జీవితంలోని అస్తవ్యస్థ పరిస్థితులను చూసిన అర్జునుడికి జీవితమనే రణరంగాన్ని ఎదుర్కోవాల్సిందిగా బోధించాడు శ్రీకృష్ణుడు.

### సమస్యలను పరిష్కరించడం

జీవితంలో విజయం ఎలా సాధించాలి? కోరికలను ఎలా నియంత్రించాలి? సమర్థమైన నాయకుడిగా ఎలా అవ్వాలి? సరైన నిర్ణయాలు ఎలా తీసుకోవాలి? యువతరం ఎదుర్కొంటున్న ఈ విధమైన సమస్యలనే గీత బోధిస్తుంది. మన దృక్పథాన్నీ, ఆలోచనలనూ సరిదిద్దుతుంది. మన ఆలోచనా విధానంలో మార్పు రాగానే మన చేతలలో, వాటి ఫలితాలలో కూడా మార్పులు వస్తాయి. భగవద్గీతా బోధలు మన అంతరంగంలో మార్పును తెస్తాయి.

### ఒత్తిడిని అధిగమించడం:

ఒత్తిడి శారీరకమైనది, మానసికమైనది అని రెండు రకాలు. ప్రమాదాలు, వ్యాధులు మొదలైనవి శారీరకమైనవి. భయం, ఆందోళన, కోపం, మానసిక సంఘర్షణ మొదలైనవి మానసికమైనవి.

వ్యాకులత మనస్సు యొక్క ముఖ్యమైన సమస్య. యువకులు తమ శక్తి సామర్థ్యాలను నిరూపిస్తూ సంఘం, తోటివారు ఇతరులు ఆశించిన రీతిలో ఎదగడానికి గాను శ్రమకూ, ఒత్తిడికీ లోనవడం జరుగుతుంది. ఎన్నో పనులు చేయాల్సి రావడం వల్ల పరిశీలించడానికి తగిన సమయం ఉండదు. ఇరవై ఏళ్ళ క్రితం నాటి యువకుల కన్నా ఈ తరం యువకులు చాలా చురుకుగా ఆలోచిస్తూ, త్వరత్వరగా పనులు చేస్తున్నారు. అయితే ఫలితమేమిటి? మతిభ్రమణం, నిరాశావాదం, దౌర్జన్యం, వ్యాకులతలకు గురికావడం!

ఈ అలజడులు, ఒత్తిళ్ళను అధిగమించడానికి భగవద్గీత అమూల్యమైన సూచనలిస్తుంది. గీతోపదేశం జరిగిన యుద్ధభూమి – కురుక్షేత్రం ఒత్తిడిని ఎలా అధిగమించగలం అనే విషయానికి ప్రాధాన్యం ఇస్తుంది. ఒకమారు ఈ విషయాన్ని గురించి ఆలోచిస్తే – యుద్ధభేరీలు మ్రోగి, శంఖం పూరించిన తరువాత కూడా యుద్ధం చేసి బంధువులనూ, గురువులనూ చంపడానికి సంసిద్ధుడు కాలేదు అర్జునుడు. యుద్ధంలో ఎదురయ్యే భయంకరమైన పరిణామాల్ని తలచుకొని మానసిక ఆవేదనకు గురి అయ్యాడు. మానసిక స్థైర్యాన్ని కోల్పోయి భయంతో వణుకుతూ, ధనుర్బాణాలను కూడా ఎత్తలేక కుంగిపోయాడు.

దీనినే అర్జున విషాదయోగం అన్నారు. నేటి యువతరంలో కూడా ఇదే పరిస్థితిని చూస్తున్నాం. కర్తవ్యనిర్వహణలో ఎదురయ్యే చిన్న వైఫల్యమో, చిన్న చిన్న అడ్డంకులో వాళ్ళను నిర్బలుల్నీ, నిస్సహాయుల్నీ చేస్తున్నాయి. కొందరు జీవితం చాలించాలన్న నిర్ణయానికి వస్తున్నారు. ఇలాంటి పరిస్థితుల్లో శ్రీకృష్ణుడు, అర్జునుడికి ఇచ్చిన సలహా ఏమిటి?

"క్లిష్ట సమయంలో నిస్సహాయత ఎక్కడ నుంచి వచ్చింది? నిజాయతీపరులు దీనిని హర్షించరు. ఇది స్వర్గప్రాప్తిని కలిగించదు సరి కదా, నీకు అపఖ్యాతిని కలిగిస్తుంది. ధైర్యాన్ని కోల్పోవద్దు. ఇది నీకు తగదు. హృదయదౌర్బల్యాన్ని వదలిపెట్టు" అని కృష్ణపరమాత్మ బోధించాడు.

ప్రతి యువకుడూ ఈ భావాల్ని ప్రతిరోజూ మననం చెయ్యాలి. వాటి భావం "జీవితాన్ని ఎదుర్కో, పారిపోవద్దు, పారిపోవడం వల్ల సమస్య సమసిపోదు. దాని వల్ల మనస్సు ఇంకా బలహీనమై, భవిష్యత్తులో సమస్యలను ఎదుర్కొనే శక్తిని కోల్పోతుంది. ఎవరికి వారు తమకున్న సమర్థత మీద దృష్టి పెట్టుకోవాలి కానీ నిర్బలత మీద కాదు".

మీ గదిలో కానీ, ఏకాంత ప్రదేశంలో కానీ ఈ భావాలపై ధ్యానం చెయ్యాలి. ఈ విధంగా రోజూ ఆచరిస్తే మనలోని ఒత్తిడి తగ్గుతుంది. నిజానికి ఒత్తిడి చాలా శక్తిమంతమైనది. దాన్ని తగిన సమయంలో సరైన తోవలో పెట్టకపోతే (ఎదుర్కోకపోతే) మనిషి జీవితానికే ముప్పు. సమస్యలను ఎదుర్కోవాలి కానీ పారిపోకూడదన్న అభిప్రాయం మనలో తీవ్రంగా ఉండాలి.

**అస్థిరత్వాన్ని అధిగమించడం :** ఒడుదొడుకుల మధ్య ఎలా ఉండాలన్నది జీవితంలో పెద్ద సమస్య. నిరంతరం పట్టుదల, ఉత్సాహం పెంచుకోవాలి. వ్యతిరేకమైన భావాలనూ, భవిష్యత్తును గురించిన ఆరాటాన్నీ అదుపులో ఉంచుకోవాలి. సందేహాలు, నిరాశ అన్నవి జీవితంలో ఎప్పుడో ఒకప్పుడు ఎదురవుతాయి. వీటిని అధిగమించే సామర్థ్యంతో ముందుకు సాగినప్పుడే విజయాన్ని సాధిస్తాం. మనలో స్ఫూర్తిని పెంచుకోవడమంటే – మన ఆలోచనలను సరిగ్గా అర్థం చేసుకొని, వాటిని నియంత్రించడమే!

కృష్ణుడు మందలించగానే తన ఆలోచనా విధానం తప్పు అని గ్రహించి, వెంటనే అర్జునుడు "నేను నిన్నాశ్రయించిన



నీ శిష్యుణ్ణి. నాకు ఏది హితకరమో చెప్పు" అని ప్రార్థించాడు.

వాస్తవంగా గీతా బోధ ఇక్కడ నుంచే, అంటే అర్జునుడు క్షాత్రధర్మం పాటించడానికి సిద్ధమవడంతో మొదలవుతుంది.

గీత రెండో అధ్యాయంలో శ్రీకృష్ణుడు జనన మరణాలకు అతీతమైన, పవిత్రమైన, మార్పు లేని ఆత్మను గురించి అర్జునుడికి బోధించాడు. తాత్కాలికమైన సమస్యల కారణంగా విశ్వాసాన్ని కోల్పోకూడదు. మనందరిలో శాశ్వతంగా ఉన్న అక్షయమైన శక్తి మూలాన్ని గురించి స్వామి వివేకానంద ఈ విధంగా చెప్పారు:

"బెస్తవాడు తాను ఆత్మ అని అనుకుంటే అతను గొప్ప బెస్తవాడవుతాడు; విద్యార్థి తాను ఆత్మ అని భావిస్తే అతను మంచి విద్యార్థి కాగలడు. ఒక న్యాయవాది తాను ఒక ఆత్మ అని అనుకుంటే మంచి న్యాయవాది కాగలడు."

మనం కౌశల్యంతో పని చేస్తూ, వివేకాన్ని ఆశ్రయించాలని భగవద్గీత ఉపదేశిస్తోంది. విచక్షణా జ్ఞానాన్ని ఎలా ఉపయోగించాలన్నది నేటి యువతరానికి తెలియదు. నేర్పుతో పనిచెయ్యడం అంటే కర్మఫలాన్ని ఆశించడం కాదు, పనిలోని ఆనందాన్ని స్వార్థరహితంగా ఆస్వాదించాలి. ఎంత చిన్న సమస్యనైనా నిరాశావాదం మరింత క్లిష్టం చేస్తుంది.

ఈ విచక్షణా జ్ఞానం వల్లనే మనిషి జంతువుల కన్నా ఉన్నతుడయ్యాడు. మనిషి పతనానికీ, ఓటమికీ కారణం – ఈ జ్ఞానాన్ని కోల్పోవడమే! తాత్కాలికమైన కష్టాల వల్ల తన లక్ష్యానికి దూరం కాకూడదని శ్రీకృష్ణుడు ఉపదేశిస్తున్నాడు.

విజయానికీ, సాంత్వనకీ మూలమైన సహజమైన ఆత్మ నిగ్రహం ద్వారా ప్రతి ఒక్కరిలో అంతర్నిహితంగా ఉన్న శక్తి ప్రకటితమవుతుంది. తమను తాము బలవత్తరం చేసుకోవాలి. స్వామి వివేకానంద "మీకు బలాన్నిచ్చే ప్రతీ ఆలోచననూ గ్రహించి, నిర్బలుల్నిగా చేసే ఆలోచనలను త్యజించాలి" అన్నారు. బయట నుంచి ఏదో సహాయం లభిస్తుందని ఎదురు చూడకుండా, తమ అంతరంగం నుంచి శక్తిని పొందాల్సిందిగా శ్రీకృష్ణుడు నేటి యువతరానికి సందేశమిచ్చాడు.

మనిషి తనను తానే ఉద్ధరించుకోవాలి. ఉన్నతమైన స్థితి నుంచి పతనమవకుండా తమను తామే కాపాడుకోవాలి.

సమస్యలను ఎదుర్కొంటున్న యువకులను బాధ్యతా యుతమైనవారిగా రూపొందించడానికి భగవద్గీతలో తగినంత పరిజ్ఞానం ఉంది. నిజాయతీ, నమ్మకం తప్పనిసరిగా ఉండాలి. ప్రతి ఒక్కరూ తాము మారాలనీ, అలా మారడానికి కావలసిన శిక్షణ పొందాలనీ అనుకోవాలి. తమ దగ్గర లేని వాటి గురించి ఆలోచించకుండా తమకు ఉన్న వాటిని దృష్టిలో పెట్టుకోవాలి.

"ఎల్లవేళలా నన్ను తలచుకుంటూ యుద్ధం చెయ్యి. మనస్సునూ, బుద్ధినీ నాకు సమర్పణ చేస్తే నిస్సంశయంగా నన్ను చేరుతావు" అన్నాడు కృష్ణపరమాత్మ.

మనందరిలో ఉన్న "నేను" భగవంతుడే! అలాంటప్పుడు నిరాశా నిస్పృహలకి తావేది! అంతర్గతంగా ఉన్న శక్తి విశ్వాసాల గురించి గీతలో చెప్పిన సందేశాన్ని గుర్తుంచుకుని ప్రతి యువకుడూ జీవితాన్ని కొనసాగించాలి. □

అనువాదం : శ్రీమతి కె. జానకి



# నిజమైన పూజ

– స్వామి సేవ్యానంద

మనం మందిరాలకు, ప్రార్థనాలయాలకు వెళ్ళడం, పూజలు, పండగలు చేయడం మంచి ఆచారాలైనప్పటికీ వీటిని ఎందుకు చేస్తున్నామని కాస్త ఆలోచించడం ఎంతైనా అవసరం. మనలో చాలామంది గుడికి వెళ్ళి దేవుణ్ణి శ్రద్ధాభక్తులతో పూజిస్తారు. అయితే, ఆ భక్తి భావాన్ని గుడిలోనే వదిలిపెట్టి బయట స్వార్థభావంతో ప్రవర్తిస్తారు. మనం పూజా విధులను కేవలం ఒక ఆచారంగా మాత్రమే చేయకుండా వాటి ఫలితంగా మన మనస్సు ఎంతవరకు పవిత్రమయిందో ఆలోచించాలి. మన మనస్సును పవిత్రం చేయని పూజలు ఎన్ని చేసినా ఏం ప్రయోజనం?

**పూజ ఎవరికి?** : మనం పూజ చేస్తున్నది ఎవరికి? భగవంతునికే కదా! అయితే, ఈ భగవంతుడు ఎక్కడ ఉన్నాడు? భగవంతుడు మందిరంలో మాత్రమే ఉన్నాడా? ఒక రాయిని చక్కగా చెక్కి, సుందర రూపాన్ని చేసి భగవంతునిగా ఆరాధిస్తాం. అయితే మన ఎదురుగా ఉన్న 'మానవుడు' అనే దేవాలయంలోని భగవంతునికి ఎందుకు సేవ చేయలేక పోతున్నాం? "ఒక ప్రతిమలో భగవంతుణ్ణి పూజించ గలిగినప్పుడు, ఒక మనిషిలో భగవంతుణ్ణి ఎందుకు పూజించలేం?" అని శ్రీరామకృష్ణులు ప్రశ్నిస్తారు. ఈ ప్రశ్నకు సరైన సమాధానంగా స్వామి వివేకానంద 'మానవ సేవే మాధవ సేవ' అన్న ఈ అత్యున్నత ఆదర్శాన్ని ప్రపంచం నలుమూలలా ప్రచారం చేయడమే కాకుండా ఆచరణలో చూపారు.

**నిజమైన శివారాధకుడు** : "ప్రతిమలో మాత్రమే శివుణ్ణి చూసే వారి పూజ ప్రారంభదశలోనిదే. దరిద్రునిలో, దీనునిలో, రోగిలో శివుణ్ణి చూడగలిగినవారు నిజమైన శివారాధకులు. అలాంటివారిపైనే శివుని కెక్కువ ప్రీతి" అని స్వామి వివేకానంద చెబుతారు. భగవంతుణ్ణి పూజించినపుడు అతనికి ప్రియమైన ధూప, దీప, నైవేద్యాలు అర్పిస్తాం. మరి మానవుడిని ఎలా ఆరాధించగలం? అతనికి కూడా ధూప, దీపాలు ఇచ్చి, పూల మాల వెయ్యడమే ఆరాధనా? ఎంత మాత్రం కాదు. ఆకలితో అలమటిస్తున్న దరిద్రనారాయణుడికి తిండి పెట్టడం, వ్యాధిగ్రస్థుడైన రోగినారాయణుడికి వైద్య సదుపాయాలు అందించడం, సంసార దావాగ్నిలో దహించుకు పోతున్న వారికి సరైన ఆధ్యాత్మిక మార్గాన్ని చూపించడం – ఇదే మనం చేయగలిగే అత్యున్నతమైన పూజ.

**ప్రతి పని పూజతో సమానం** : మనం చేసే ప్రతి పనీ పూజతో సమానం. మహాభారతంలో దీనికి చక్కని దృష్టాంతం ఉంది. ఒక బ్రాహ్మణుడు చాలాకాలంపాటు అడవిలో తపస్సు చేశాడు. ఒకరోజు అతను కూర్చున్న చెట్టుమీద నుంచి ఒక కాకి అతని మీద రెట్ట వేసింది. అతను కోపంతో ఆ కాకి వైపు చూడగానే అది కాలి బూడిదైంది. బ్రాహ్మణుడు తనకు ప్రాప్తించిన శక్తికి చాలా ఆశ్చర్యపడ్డాడు. ఒక రోజు భిక్షాటనకోసం ఒక గ్రామానికి వెళ్ళి, ఒక ఇంటి ముందు నిలబడగా ఆ ఇంటి ఇల్లాలు "దయచేసి కొంచెం వేచి ఉండండి. నా భర్త పరిచర్యలు పూర్తికాగానే మీకు భిక్ష వేస్తాను" అని చెప్పి, తన గృహస్థ ధర్మంలో మునిగిపోయింది. చాలా సమయం గడిచాక కూడా ఆమె బయటికి రాకపోవడంతో బ్రాహ్మణుని మనసు క్రోధంతో నిండింది. అదే సమయంలో ఆ మహిళ "మీ క్రోధంతో కాలి బూడిద కావడానికి నేను ఆ అడవిలో కాకిని కాను, దయచేసి వేచి ఉండండి" అని చెప్పింది. ఎక్కడో అడవిలో జరిగిన విషయం ఈ గ్రామంలోని మహిళకు ఎలా తెలిసిందని ఆశ్చర్యపడ్డ బ్రాహ్మణుడు తన అహంకారానికి పశ్చాత్తాపపడి, జ్ఞానం ప్రసాదించవలసిందిగా ఆ మహిళను కోరాడు. జ్ఞానం కోసం ఆ ఊరి చివరిలో ఉన్న ధర్మవ్యాధుణ్ణి కలవాల్సిందిగా ఆ మహిళ సలహా ఇచ్చింది. జంతువులను చంపి, వాటి మాంసాన్ని అమ్మే అల్పకులానికి చెందిన ధర్మవ్యాధుణ్ణి చూడగానే మొదట బ్రాహ్మణుని మనస్సులో గ్రీణాభావం కలిగినా తరువాత అతని జ్ఞానానికి ఆశ్చర్యపడక తప్పలేదు. ధర్మవ్యాధుడు బ్రాహ్మణుడికిచ్చిన ఈ ఉపదేశాలే 'వ్యాధగీత'గా ప్రఖ్యాతి చెందింది.

మనం ఏ పని చేస్తున్నామన్న విషయానికి ప్రాధాన్యం ఇవ్వకుండా మనం ఒక పనిని ఎంత అంకిత భావంతో చేస్తున్నాం, ఆ సమయంలో మన మనసు ఎంత ఉన్నతమైన స్థితిలో ఉందన్న విషయానికే ప్రాధాన్యం ఇచ్చినట్లయితే మనం చేసే ప్రతి పనీ 'నిజమైన పూజ' అవుతుంది. □

# యువవాణి

– స్వామి పరిజ్ఞేయానంద

**కేదారిశెట్టి రాంబాబు, ఎస్.కోట, విజయనగరం జిల్లా.**
**ఎ. రాజ్‌కుమార్, సంతబొమ్మాళి, శ్రీకాకుళం జిల్లా.**

**ప్రశ్న: ప్రసార మాధ్యమాల ప్రభావం వల్ల మనోనిగ్రహం కొరవడుతుంది. స్వామి వివేకానంద కాలంలో మనస్సును చలింపజేసే ఆధునిక ప్రసార మాధ్యమాలు లేవు. కాబట్టి ఆయనకు మనోనిగ్రహం సాధ్యమైంది. మరి నేటి సమాజంలో మాలాంటి యువతకు మనోనిగ్రహం ఎలా సాధ్యమవుతుంది?**

**జవాబు:** మనస్సును నిగ్రహించడం అన్నది ఆధునిక కాలంలోనే కాదు అనాదికాలంలో కూడా ఉన్న సమస్యే! పూర్వం ఋషులు, రాజులు తమ లక్ష్యసిద్ధి కోసం తపస్సు చేస్తున్నప్పుడు వారి లక్ష్యం నుంచి మనస్సును మళ్ళించడానికి అప్సరసలను పంపించి తపోభంగం చేసేవాడు ఇంద్రుడు. విశ్వామిత్రుడు బ్రహ్మర్షి కాకుండా ఇంద్రుడు మేనకను పంపించి తన లక్ష్యాన్ని మరిచేలా చేసిన సంఘటన మనకు తెలిసిందే! నేటి కాలంలో టీ.వీ., ఇంటర్‌నెట్, సెల్‌ఫోన్ మొదలైన ఆధునిక పరికరాలే మనస్సును మళ్ళించే అప్సరసలు. కాబట్టి మానసిక ఏకాగ్రతను భంగపరిచే పరిస్థితులు ఆధునిక సమాజానికి మాత్రమే పరిమితం కాదనీ, అనాదికాలం నుంచీ ఉన్నాయనీ గ్రహించాలి.



స్వామి వివేకానంద విద్యార్థిగా ఉన్నప్పుడూ, విదేశాల్లో పర్యటించినప్పుడూ టీ.వీ., ఇంటర్‌నెట్‌ల ప్రభావం లేకపోయినా కాంతా కనకాల ప్రలోభాల్ని ఎన్నింటినో ఎదుర్కోవాల్సి వచ్చింది. జీవిత లక్ష్యంపై మనస్సు లగ్నమైనప్పుడు ఎలాంటి ప్రలోభాలనైనా అధిగమించవచ్చని ఆయన జీవిత చరిత్ర చదివితే మనకు అర్థమవుతుంది.

నేటి యువత ప్రసార మాధ్యమాలు, ఆధునిక పరికరాలను అవసరానికి మించి వినియోగించడం ప్రలోభాల వెంట పరుగులు తీయడం లాంటిది.

The vast wasteland of T.V. is not interested in producing a better mousetrap but interested in producing a worse mouse *- C.Coughlin*

సాంకేతిక పరిజ్ఞానం మనిషిలోని పశుస్వభావాన్ని నిర్మూలించడానికి బదులు మనిషిని పశుతుల్యుణ్ణిగా మార్చేందుకు తోడ్పడుతోంది.

వంట చేసుకోవడానికి ఉపయోగపడే నిప్పే అశ్రద్ధగా ఉంటే చేతుల్ని కాలుస్తుంది. ఆధునిక పరిజ్ఞానం కూడా నిప్పులాంటిది. ఆధునిక పరికరాల చెడు ప్రభావాన్ని యువత గ్రహించి వీటి వినియోగంలో ప్రత్యేక శ్రద్ధ వహించాలి. అప్పుడే మనోనిగ్రహం సాధ్యమవుతుంది. అంతేకానీ ప్రసార మాధ్యమాల్నీ, ఆధునిక పరికరాల్నీ నిందించడం వలన ప్రయోజనమేమీ లేదు.

**రమేష్, హైదరాబాద్.**

**ప్రశ్న: 'శ్రీరామకృష్ణ ప్రభ'ను చదవమని నా స్నేహితుడు ప్రోత్సహించాడు. పత్రికను చదివినప్పటి నుంచీ నా చదువులో ఏకాగ్రత పెరిగింది. కానీ నాకు స్ఫూర్తినిచ్చిన నా స్నేహితుడు దూరంగా వెళ్ళిపోయాడు. అందువల్ల నాలో నిరాశ చోటుచేసుకుంది. మనస్సు లక్ష్యంవైపు పోవడం లేదు. ఇప్పుడు నేనేం చేయాలి?**

**జవాబు:** 'Chance makes our parents but choice makes our friends' – జీవితంలో మనకు స్ఫూర్తినిచ్చి మంచి మార్గంలో నడిపించే స్నేహితులు దూరమవడం బాధాకరమైన విషయమే! అయితే ఎల్లప్పుడూ ఒక వ్యక్తి మనతోనే ఉండాలనుకోవడం కూడా స్వార్థమవుతుంది. కాబట్టి ఒక వ్యక్తిని ఆధారం చేసుకోవడం కన్నా వారి ఆదర్శాలను ఆలంబనగా చేసుకోవడం ఉత్తమం. మీ శ్రేయస్సుతో పాటు మీ స్నేహితుడి శ్రేయస్సును కూడా ఆకాంక్షించండి. అప్పుడు మీ స్నేహితుడు మీకు దూరమయ్యాడన్న బాధ తొలగి లక్ష్యసాధనలో ముందడుగు వేయగలుగుతారు.

యువతకు నిత్య స్ఫూర్తిప్రదాత స్వామి వివేకానంద. ఆయన బోధనలు ఎంతోమందికి ఉత్తేజాన్నిచ్చి విజయపథంలో నడిపిస్తున్నాయి. కాబట్టి స్వామి వివేకానందను ఆదర్శంగా తీసుకొని మీ లక్ష్యసాధనలో కృషిచేయండి. అప్పుడు నిరాశా నిస్పృహలు మిమ్మల్ని ఆవహించలేవు. □

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :
U(=''a}~
**శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,**
**దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029**



– ప్రయాగ రామకృష్ణ



అనుకున్నంతా అయింది. ఐదేళ్ళలోపు పిల్లల్ని డే కేర్ సెంటర్లలో చేర్చడం శ్రేయస్కరం కాదని ప్రపంచవ్యాప్తంగా ఉన్న పరిశోధకులందరూ తేల్చి చెప్పారు.

ఏడాది అయినా నిండని పిల్లల్ని పని మనుషులకు, నర్సరీలకు, ఆయాలకు అప్పగించి ఉద్యోగాలకు పరుగెడుతున్న తల్లుల సంఖ్య నానాటికీ ఎక్కువవుతోంది. చిన్న కుటుంబాలు చింతలు లేని కుటుంబాలని మురిసిపోతున్నాం కానీ, తల్లులు ఉద్యోగాలకు పోయి ఇళ్ళల్లో అమ్మమ్మలు, నాయనమ్మలూ కరువైపోయాక పిల్లల గతి అధోగతయింది. గొర్రెల్నీ, మేకల్నీ మందలో కలిపేసినట్టు చంటిపిల్లల్ని కూడా మందిలో కలపడంవల్ల వాళ్ళ మనోవికాసం లోపిస్తుందని పరిశోధకులు హెచ్చరిస్తున్నారు.

యునైటెడ్ స్టేట్స్‌లోని నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ చైల్డ్ హెల్త్ అండ్ హ్యూమన్ డెవెలప్‌మెంట్ జరిపిన అధ్యయనంలో 'డే కేర్ సెంటర్లలో ఎక్కువసేపు ఉండే నాలుగు, నాలుగున్నరేళ్ళలోపు వయస్సున్న పిల్లలు పెద్దయ్యాక అందరితో కలుపుగోలుగా ఉండలేరనీ, ఇతరులతో సర్దుకుపోలేరనీ' వెల్లడైంది.

ఈ విషయంలో మన పెద్దవాళ్ళెప్పుడో 'రాజవత్ పంచవర్షాణి' అని చెప్పారు. దాని ప్రకారం ఐదేళ్ళొచ్చే వరకూ పిల్లల్ని ప్రభువుల మాదిరి సకలోపచారాలతో తల్లితండ్రులు సంతోషపెట్టాలట. ఆ తరువాతే చదువు.

ఇప్పుడది పోయింది. మూడో ఏడు కూడా రాకుండానే పిల్లల్ని కాన్వెంట్ బళ్ళకు, కార్పొరేట్ స్కూళ్ళకు తోలుతున్నాం. బుద్ధివికాసానికి ఏమాత్రం అవకాశం లేని లేత వయసులో ఉన్న పసికూనల మీద రకరకాల ప్రయోగాలు చేస్తున్నాం. దాంతో చాలా మంది పిల్లలు తరువాతి కాలంలో బుద్ధిహీనులుగా, మరమనుష్యులుగా, మూర్ఖులుగా, హింసావాదులుగా తయారవుతున్నారు. ఇవేవీ కానివాళ్ళు–లేదా ఇవన్నీ కలిసిన వాళ్ళు – విలువలతో నిమిత్తం లేకుండా కేవలం డబ్బు పోగేసే యంత్రాలవుతున్నారు.

కనుక తల్లితండ్రులందరూ ఈ విషయాన్ని గురించి బాగా ఆలోచించాలి. పసి పిల్లలతో మనం ఎంత ఎక్కువసేపు గడపగలిగితే అంతగా వాళ్ళు మన ప్రేమను ఆస్వాదించ గలుగుతారు. మనకు చేరువవుతారు. మనకు మాలిమి అవుతారు. అదే అదను. ఆ సమయంలోనే వాళ్ళకు మనం మంచి బుద్ధుల్నీ, విలువల్నీ బోధించాలి. వాటి ఆధారంగానే వాళ్ళ వ్యక్తిత్వ నిర్మాణం జరుగుతుంది. బిడ్డల పెంపకంలో తండ్రిది గురుతరమైన బాధ్యత. అయితే అంతకంటే మహత్తరమైన బాధ్యత తల్లిది. తల్లిని మించిన నేర్పరి, శిక్షకురాలు ఎవరుంటారు?

కడుపులో పడ్డప్పటినుంచి తల్లి ప్రభావం పిల్లల మీద ఉంటుంది. అమ్మ కడుపులోంచే పిల్లలు అన్నీ నేర్చుకోడం మొదలుపెడతారు. భారతంలో అష్టావక్రుడి కథను ఒక్కసారి గుర్తుచేసుకోండి!

ఉద్దాలక మహర్షి శిష్యుడు కహోలుడు. కహోలుడు మంచివాడే కానీ, చదువులో చురుకైనవాడు కాదు. పైగా నిలకడ లేని మనిషి. అందుకని ఏ విద్యా పూర్తిగా అబ్బలేదు. కానీ, బుద్ధిమంతుడు గనుక అతని గుణగణాలకు మెచ్చి ఉద్దాలకుడు తన కూతురు సుజాతనిచ్చి పెళ్ళి చేశాడు. కహోలుడికి, సుజాతకు ఒక కొడుకు కలిగాడు. తల్లి కడుపులో ఉన్నపుడే ఆ పసివాడు తాతగారు చదివే వేదాలన్నీ విన్నాడు. తండ్రి కహోలుడు

చదివే శాస్త్రాలు, పురాణాలు కూడా విన్నాడు. తండ్రి ఏకాగ్రత లేకుండా, మనసు నిలకడ లేకుండా చదివేవాడు గనుక తప్పులు దొర్లుతుండేవి. అవి వినలేక పసివాడు తల్లి కడుపులో వంకర్లు తిరిగేవాడు. ఆ వంకరలు చివరికి పిల్లవాడి శరీరంలో అలానే నిలిచిపోయాయి. తీరా భూమి మీద పడ్డాక చూస్తే ఎనిమిది వంకర్లు ఉన్నాయి. అందుకని అతనికి అష్టావక్రుడన్న పేరు వచ్చింది.

ఈ కథ ఎందుకు చెప్పాల్సొచ్చిందంటే పిల్లల్లో విద్యాభ్యాస ప్రక్రియ అమ్మ కడుపులోనే మొదలవుతుంది ఆపైన తల్లితండ్రులు ఏంచేస్తే పిల్లలూ గమనించి అదే చేస్తారు. కనుక వాళ్ళు పసివాళ్ళుగా ఉన్నప్పుడు తండ్రులు, ఇంకా ముఖ్యంగా తల్లులు చాలా జాగ్రత్తగా ప్రవర్తించాలి.

పిల్లలకు తల్లే తొలి గురువు. బిడ్డలతో ఎలా మెలగాలో, వాళ్ళను ఎలా బుజ్జగించాలో, ఎలా దండించాలో, వాళ్ళు చేసే పనులకు ఎలా స్పందించాలో, ఎలాంటి స్పందనలకు ఎలాంటి మార్పులుంటాయో అమ్మలకే తెలుసు.

హైదరాబాద్‌లో ఆ మధ్య ఓ సదస్సు జరిగింది. భారతీయ విద్యాలయంవారు 'మదర్స్ కెన్ మేక్ ఆల్ ద డిఫరెన్స్' పేరుతో నిర్వహించిన ఆ సదస్సులో పిల్లలు, తల్లులు, ఉపాధ్యాయులు, మానసిక నిపుణులు పాల్గొన్నారు. సైకాలజిస్ట్ డాక్టర్ శ్రీనివాస్ మాట్లాడుతూ ఢిల్లీలో జరిగిన ఒక అపూర్వ ప్రయోగం గురించి చెప్పారు. ఒకసారి ఒక స్కూలులో చదువుకుంటున్న చిన్నపిల్లలందరికీ ఒకే రకమైన బనీన్లు వేశారు. తరువాత వాళ్ళ తల్లుల్ని పిలిచి వాళ్ళెదుటే పిల్లలు వేసుకున్న బనీన్లన్నింటినీ తీయించి ఒకచోట కుప్పగా వేయించారు. ఆ తరువాత 'మీ పిల్లల బనీన్లు మీరు గుర్తుపట్టగలరేమో ప్రయత్నించండి' అని పాఠశాల నిర్వాహకులు తల్లులకు పరీక్షపెట్టారు. పదే పది నిమిషాల్లో ఆ తల్లులంతా వాళ్ళ పిల్లలు వేసుకున్న బనీన్లను వేరుచేసి చూపించారు. అదెలా సాధ్యం అంటే అదే అమ్మల గొప్పతనం అని గర్వంగా చెప్పారట. అమ్మే అమృతం అనడానికి ఇంతకంటే నిదర్శనమేం కావాలి? అందుకే తల్లుల్లారా మిమ్మల్ని వేడుకుంటున్నాం పిల్లల వ్యక్తిత్వాలకు పాదు చేయండి. పిల్లలందర్నీ ప్రతిభామూర్తులుగా మలచండి. □

## ధనము కూడబెట్టి...

– ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి



**ధనము కూడఁబెట్టి దానంబు చేయక**
**తానుఁదినక లెస్స దాచుకొనఁగ**
**తేనెటీగ గూర్చి తెరువరికియ్యదా**
**విశ్వదాభిరామ వినుర వేమ!**

**భావం :** ఎవరికీ దానం చేయకుండా ఎంతో ధనాన్ని కూడబెట్టి, తాను కూడా తినకుండా దాచడం వల్ల ఎటువంటి ప్రయోజనం లేదు. చూడు! తేనెటీగ తేనెను కూడబెట్టి బాటసారికిస్తున్నది కదా!

**వ్యాఖ్య:** చెట్లు పళ్ళనిస్తున్నాయి, ఆవులు పాలనిస్తున్నాయి, సూర్యుడు వెలుగునిస్తున్నాడు, చంద్రుడు చల్లని వెన్నెలనిస్తాడు, గాలి, భూమి, నీరు అన్నీ మనిషి వికాసానికి దోహదం చేస్తున్నాయి. ఇవన్నీ ఎవరి నుండీ ఏమీ కోరుకోకుండా సేవలందిస్తున్నాయి. వీటిని మనం ఆదర్శంగా తీసుకొని ఇతరులకు ఉపయోగపడేలా జీవించాలి.

ఈ పద్యంలో యోగి వేమన తేనెటీగను ఉదాహరణగా చెప్పారు. తేనెటీగ కష్టపడి కూడబెట్టిన తేనె తాను అనుభవించకుండా తెరువరి (బాటసారి) చేజిక్కించుకుంటాడు. కాబట్టి ధనసంచయం, జ్ఞానసంచయం, వస్తుసంచయం ఇవన్నీ తనకొఱకు కాదని వాటి అవసరాలు ఎవరికున్నాయో వారికందించాలి. ధనం కూడబెట్టవచ్చు కాని దానం చేయాలి. వంద చేతులతో సంపాదించాలి; వేల చేతులతో పంచిపెట్టాలి.

తేనెటీగను, కందిరీగను, చేపను, సింహాన్ని, చెట్టును– ఇలా ఎన్నింటినో గురువుగా భావించి మనం మన జీవితాన్ని తీర్చిదిద్దుకోవాలి అని భాగవతంలో చెప్పబడింది. □



# ã ˜ åxH[ Ü«O!

– స్వామి రఘునాయకానంద

సత్యం వద – సత్యాన్నే మాట్లాడు అన్నది నీతి వాక్యం. నైతిక విలువలను బాల్యం నుంచే నేర్పించాలి. ఈనాడు నైతిక విలువలను పాఠ్యాంశాలలో చొప్పిస్తున్నారు, నైతిక విలువల పేరుతో ఒక ప్రత్యేక సబ్జెక్టు పెట్టి; దాని మీద పరీక్షలు కూడా నిర్వహిస్తున్నారు. నైతిక విలువలు పరీక్షల ద్వారా నేర్పించలేం. ఆచరణ ద్వారానే నేర్పించాలి. అన్ని నైతిక విలువలకు సత్యమే పునాది. సత్యం పలకడం అనేది సహజంగానూ, స్వతఃసిద్ధంగానూ రావాలి. పిల్లలు అసత్యాలు చెబుతున్నప్పుడు వాళ్ళలో అమాయకత్వం పోయి గోప్యంగా మారిపోతారు.

అబద్ధాలు చెప్పే వ్యక్తి పైకి దాంబికతను ప్రదర్శించినప్పటికీ లోపల మాత్రం అపరాధ భావం కలిగి, కలత, విచారాలతో ఉంటాడు. ఒక వ్యక్తి ఆదాయపు పన్ను ఎగవేయడానికిగాను తనకున్న ఆదాయపు వనరులను లెక్కల్లో చూపించకుండా ఆదాయపు పన్ను శాఖ వారికి దాఖలు చేశాడట. అలా చేసినప్పటినుంచీ నిద్రలేమితో బాధపడి ఆదాయ పన్ను శాఖ వారికి ఈ విధంగా ఉత్తరం వ్రాశాడు: “ఆదాయపు పన్ను కట్టబడుతుందని నా ఆదాయపు వివరాలను తెలియజేయలేదు, అప్పటినుండి నాకు నిద్ర పట్టడం లేదు. అందుచేత ఈ ఉత్తరంతో పాటు 150 డాలర్లు పంపిస్తున్నాను. ఇంకా నిద్రపట్టకపోతే మిగిలింది పంపిస్తాను”.

**అసత్యం చెప్పడం–మన మీద ఇతరులకు నమ్మకం పోవడమే:** అసత్యం చెప్పి ఒకసారి ఇతరులకు నమ్మకం కలిగించినా, అది తరువాత ఇతరులకు మన మీద గౌరవాన్ని కోల్పోయేలా చేస్తుంది. మనందరికీ తెలిసిన ఒక కథ ఉంది. “ఊరి చివర గొర్రెలను కాస్తున్న పిల్లవాడు సరదాకు తోడేలు వచ్చిందని గట్టిగా అరిచేసరికి ఊరిలో ఉన్నవారంతా కర్రలతో వస్తారు. తోడేలు లేకపోయే సరికి పిల్లవాడు సరదాకు చేసిన పని అని తెలుసుకొని తిరిగి వెళ్ళిపోయారు. కానీ ఒకరోజు నిజంగానే తోడేలు వచ్చింది. ‘తోడేలు వచ్చింది. గొర్రెలను చంపేస్తుంది.. రండి రండి...’ అని పిల్లవాడు అరిచినప్పటికీ ఎవరూ రాలేదు”. అసత్యం పలకడం మూలంగా మనిషి మీద ఉన్న నమ్మకం, పరపతి (credibility) పోతుంది.

**సత్యానికే జయం :** ప్రస్తుత సమాజంలో సత్యం పాటించి, జీవించడం కష్టమంటూ చాలా మంది వాపోతారు. "Truth does not pay homage to any society, ancient or modern; society has to pay homage to truth or die. – సత్యం సమాజానికి తల వంచదు; సమాజమే సత్యానికి తలవంచాలి” అంటారు స్వామి వివేకానంద. శ్రీరామకృష్ణ పరమహంస తండ్రి క్షుదీరామ్ సత్యవాది. ఆ ఊరి జమీందారు ఒక వ్యాజ్యానికి సత్యవాది అయిన క్షుదీరాంను తప్పుడు సాక్ష్యం చెప్పమన్నాడు. చెప్పలేనందుకు ఆయన మీద తప్పుడు నేరాలు మోపి ఊరి నుండి వెళ్ళగొట్టాడు. ఇక్కడ సత్యం, సమాజానికి తల వంచలేదు. అయితే ప్రక్క గ్రామ ప్రజలు ఆదరాభిమానాలతో ఆయన్ని ఆహ్వానించడమే గాక కొంచెం పొలాన్ని ఇచ్చి ఆర్థిక బలాన్ని చేకూర్చారు. ఇక్కడ సమాజమే సత్యానికి తలవంచినట్లు గమనిస్తాం. ఉపనిషత్తులు ‘సత్యమేవ జయతే’ అని ఘోషిస్తున్నాయి. సత్యాన్ని త్రికరణశుద్ధిగా ఆచరిస్తే విజయం తథ్యం. నెమ్మదిగానైనా మనం విజయాన్ని సాధిస్తాం అంటారు స్వామి వివేకానంద.

**సత్యమే భగవంతుడు :** సత్యసంధత ఆధ్యాత్మికతకు పునాది. న్యాయస్థానంలో న్యాయవాది ముద్దాయితో ఈ విధంగా ప్రమాణం చేయిస్తున్నాడు : ‘నేను సత్యాన్నే చెబుతాను. సత్యాన్ని తప్ప వేరేమీ చెప్పను. అలాగైతే భగవంతుడు రక్షిస్తాడు.’ దానికి సమాధానంగా ముద్దాయి ‘అయ్యా! నేను సత్యాన్ని మాత్రమే చెప్పగలిగితే నేనే భగవంతుణ్ణి’ అన్నాడు. సత్యాలకే సత్యం ఆ భగవంతుడు.

**అమృత పుత్రులం :** శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రాః – మనం అమృత పుత్రులం, శాశ్వత బ్రహ్మానందానికి వారసులం, మనం సింహాలం. అనంత శక్తి సంపన్నులం, గొర్రెలమనే భ్రాంతిలో ఉన్నంతవరకు మనం అసత్యవాదులమే. ఆ భ్రాంతిని వీడి సింహాల్లాగ గర్జిద్దాం. సత్యవాదులం అవుదాం. నైతిక విలువలను ఆచరిద్దాం!!



# ముందుకు సాగిపో!

(1884 – 1967)

దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884–1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ – వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.

## Ñ¦Ü¿œ *ºf!

బేలూరు మఠం
9–6–1936

'జ్యోతి' ఎంత అందమైనపేరు నీది! నువ్వేదో 'రేణువుని...' అంటూ వ్రాశావు. ఒక చిన్న ధూళి కణాన్ని స్ఫురింపజేసే ఆ పద ప్రయోగం నాకే మాత్రం నచ్చలేదు. నిజానికి నువ్వు శరీరం, మనసులకు ఆవల ఉన్న జ్యోతివి; అంతేకానీ గుర్తింపు లేని ధూళి కణానివి మాత్రం కాదు. ఈ 'నేను' అన్న భావం నుండి విడుదలై నీ పవిత్రమైన అప్రాకృతిక స్వభావాన్ని ఎప్పుడు గ్రహిస్తావు?

నీ గత కర్మల ఫలితంగానే ఇప్పటి ఈ సుఖ దుఃఖాలను అనుభవిస్తున్నావు. నువ్వు ఊరికే ఉండిపోతే నీ కర్మకు పరితపించాల్సిందే. అదే నువ్వు నిశ్చయంతో, స్వయం కృషితో గట్టిగా పనిచేస్తే ఇప్పటి నీ కర్మ గత కర్మను అధిగమిస్తుంది. పది రూపాయలు సంపాదించే వాడు దాన్ని విలాసంగా ఖర్చుపెట్టేసి, బికారి కావచ్చు. లేదా దాన్ని పెట్టుబడిగా పెట్టి లక్షాధికారి కావచ్చు. నేనొక చింతమొక్కను, ఒక మామిడి మొక్కను నాటాను. అవి పెరిగి మహావృక్షాలై, ఫలాలనివ్వసాగాయి. అప్పుడు నాకెంతో మనశ్శాంతి లభించింది.

'గతంలో నా మనస్సు పైన పడిన గాఢమైన ముద్రల వల్ల నేను మనస్సును చదువుపై కేంద్రీకరించలేకపోతున్నాను. ఉపాధ్యాయులు కలుపుగోలుగా ఉండడం లేదు!' అని వ్రాశావు.

కర్మ, మరో కర్మ ద్వారా మాత్రమే నాశనం పొందుతుంది. నీకు సంతోషాన్నీ, బాధనూ కలిగిస్తున్నవి నీ పనులే. ఉపాధ్యాయులు నీకు సుఖాన్ని గానీ, దుఃఖాన్ని గానీ, ప్రేమను గానీ, ద్వేషాన్ని గానీ వారి మనఃపూర్వకంగా ఇవ్వలేరు. ఎందుచేతనంటే వారి ధోరణి వారి పనుల చేత నియంత్రితమై ఉంటుంది. భగవంతుడు కూడా నీతో కలుపుగోలుగా ఉండడు. ఆఖరికి అతడు కూడా నీ కర్మఫలాలనే నీకిస్తాడు. పని ఒక్కటే నీ అభ్యున్నతికి మార్గం. నువ్వు నీ స్వయం కృషి మీదనే ఆధారపడాలి. నిన్ను నువ్వు కించపరచుకోకు. ఎవరి పైనా ఆధారపడాల్సిన పని లేదు. "ఓటమి వెనుక ఓటమి ఎదురైనా భయపడి వెన్నుచూపకు" అంటారు స్వామి వివేకానంద.

"సాధురేవ స మంతవ్యః..." – ఒక పాపి నన్ను అనన్య భక్తితో కొల్చినప్పటికీ అతడు పవిత్రుడే... (గీత 9–30) ఈ శ్లోకమంటే నీకెందుకు అంత ఇష్టం? బహుశా నువ్వు నీ కర్మలనన్నింటినీ కట్టగట్టి ఒక గాడిద వీపుపైన మూట ఎత్తినట్లు భగవంతుని వీపుకెత్తుదామనుకుంటున్నావా? కానీ భగవానుడు బహు తెలివైన బాలుడు సుమా! అతణ్ణి మోసం చేయడం అసాధ్యం. నువ్వు నీ 'అనన్య భక్తిని' మూల్యంగా ఇస్తే తప్ప, నీ మూట ఆయన తలకెత్తుకోడు. 'అనన్యభక్తి' అంటే అదేమన్నా చెట్టు మీది పండా కోసి ఇవ్వడానికి!

"ఉద్ధరేదాత్మ నా – త్మానం...."– ఒక వ్యక్తి తనను తానే ఉద్ధరించుకోవాలి (భగవద్గీత 6–5). ఈ భావం నీకు నచ్చలేదా? నీ జీవిత సర్వస్వాన్ని పణంగా పెట్టి అయినా సరే దీన్ని సాధన చెయ్యి, ఫలితాలను గురించి ఆలోచించనే వద్దు.

ప్రేమాశీస్సులతో...
స్వామి ప్రేమేశానంద

(స్వామి విజ్ఞానానందజీ మహరాజ్ వారి శిష్యుడైన జ్యోతిరింద్ర మోహన్‌సేన్ చిన్నబాలుడిగా ఉన్నప్పుడే స్వామి ప్రేమేశానందజీని దర్శించాడు.)

**తెలుగుసేత : కె. త్రివిక్రమరావు**



...19వ తరువాయి.

# ఓ మరువరాని దివ్యానుభూతి

ఎక్స్‌ప్రెస్ దగ్గర నన్ను కలువు' అని చెప్పారు. నేను స్వామీజీ మాటల్ని ఆదేశంగా స్వీకరించి, తప్పక వస్తానని మాట ఇచ్చాను.

నేను మంత్రదీక్ష తీసుకొని పరీక్ష వ్రాయడానికి నిర్ణీత సమయానికి అరగంట ఆలస్యంగా చేరాను. నేను మొదటి తరగతి విద్యార్థిని కావడం వలన, పరీక్ష నిర్వహిస్తున్న ఆచార్యుడు నేనెందుకు పరీక్ష వ్రాయడానికి రాలేదా అని నాకోసం నిరీక్షిస్తున్నారు. నేను వెళ్ళగానే నా ఆలస్యానికి కారణం ఏమిటని అడిగారు. నేను మంత్రదీక్ష తీసుకోవడం కోసం బేలూరు మఠానికి వెళ్ళినట్లు చెప్పగానే ఆయన సంతోషించి నాకు ఆలస్యమైన ఆ అరగంట సమయాన్ని పొడిగించారు. ఆ విధంగా స్వామి విజ్ఞానానందజీ మహరాజ్ వద్ద నేను దీక్ష స్వీకరించడం జరిగింది.

నాలాగే గోదావరి జిల్లాలోని పెనుగొండ నుండి వచ్చిన నా సన్నిహిత మిత్రుడు- ఆర్.వి. సత్యనారాయణ దీక్ష తీసుకునేందుకు అలహాబాద్ వెళ్ళాడు. అక్కడ స్వామి విజ్ఞానానందజీ మహరాజ్ వద్ద దీక్ష స్వీకరించాడు. స్వామీజీ హఠాత్తుగా తమ చేతిలోని రుద్రాక్షమాలను ఒక కాశీ అంగవస్త్రాన్ని అతనివైపు విసురుతూ "ఇది నీకోసం కాదు, దీన్ని రామారావుకి ఇవ్వు" అంటూ మరొక మాల నా స్నేహితునికి ఇచ్చారు. నేను వారికి మూడు జాబులు వ్రాసాను, మూడుమార్లు కూడా స్వామీజీ వెంటనే జవాబిచ్చారు.

దీక్ష తీసుకున్నాక నేను నా గురుదేవులైన స్వామి విజ్ఞానానందజీ మహరాజ్‌ను మళ్ళీ దర్శించుకోలేక పోయాను. వారి సమాచారం మిత్రుల ద్వారా, ఇతర భక్తుల ద్వారా తెలుసుకునేవాణ్ణి. ఒకమారు వారు తీవ్ర అనారోగ్యంతో బాధపడుతున్న సమాచారం వచ్చింది. వారు 1938లో మహాసమాధి పొందారన్న విషయం వార్తాపత్రికలో చదివాను.

నా మంత్రదీక్ష అయిన రోజు రాత్రి స్వామీజీని రైల్వే స్టేషన్‌లో కలిసినప్పటి సంఘటన నా హృదయంలో చెరగని ముద్రవేసింది. అది ఒక దివ్యానుభూతి. ఆ సంఘటనను తలచుకున్నప్పుడు నేను కన్నీళ్ళు ఆపుకోలేను:

నేను పళ్ళు పట్టుకుని విజ్ఞాన్ మహరాజ్‌కి మాటిచ్చిన ప్రకారం హౌరా స్టేషన్‌కి వెళ్ళాను. నేను తీసుకుని వెళ్ళిన పళ్ళు వారే స్వయంగా అందుకున్నారు. వారికి వీడ్కోలు చెప్పడానికి బేలూరు మఠంలోని వరిష్ఠ సాధువులు చాలా మంది వచ్చారు. నేను మహరాజ్‌కి ప్రణామం చేసి, వారి కాళ్ళ దగ్గర నేల మీదే కూర్చోబోయాను. కానీ స్వామీజీ నన్ను అలా కూర్చోనీయ లేదు. వారు చాలా బలిష్ఠంగా ఉండేవారు. అమాంతం నన్ను తమ ఒడిలో కూర్చోపెట్టు కున్నారు. ఏ పూర్వ జన్మ సుకృతఫలమో గానీ ఓ బ్రహ్మజ్ఞాని ఒడిలో కూర్చునే అదృష్టానికి నోచుకున్నాను. నేటికీ ఆ దివ్యానుభూతిని నెమరువేసుకుంటూ ఆనందంగా శేషజీవితాన్ని గడుపుతున్నాను. బహుశా వారిని నేను ఇక కలవలేను అనుకునే, విజ్ఞాన్ మహరాజ్ నన్ను స్టేషన్‌కి రమ్మని పిలిచి ఉంటారు. అది నా అదృష్టం.

విజ్ఞాన్ మహరాజ్ జీవితం, వారి ఉపన్యాసాలు గల బెంగాలీ పుస్తకాల్ని కొంత మంది భక్తుల నుంచి సంపాదించి క్షుణ్ణంగా చదివాను.

1936లో నేను రామకృష్ణ మఠంలో బ్రహ్మచారిగా చేరుదామనే ఉద్దేశంతో ఉద్బోధన్‌కి వెళ్ళాను. అక్కడ స్వామీజీ నా గురించిన అన్ని వివరాలూ అడిగినప్పుడు నాకు 16 ఏళ్ళకే వివాహమైందన్న విషయం చెప్పడం మర్చిపోయాను. "అయితే మరేదో ముఖ్యమైన విషయం నేను మరచి పోతున్నాను" అని స్వామీజీతో అన్నాను. అప్పుడు ఆ స్వామీజీ "మేడ మీదికి వెళ్ళి, అక్కడ ఏకాంతంగా కూర్చుని ఆలోచించు" అన్నారు. నేను అలాగే మేడమీదికి వెళ్ళి, అక్కడ కూర్చుని 5 నిముషాలు తీవ్రంగా ఆలోచించాను. అప్పుడు గుర్తు వచ్చింది, నేను వివాహితుణ్ణి అని. వివాహం అయిన వాళ్ళని మఠంలో చేర్చుకోరని తెలియదు. నాకు వివాహం అయినందువల్ల నన్ను మఠంలో చేర్చుకోలేదు. అప్పుడు నేను చాలా బాధపడ్డాను. ఆత్మారాందాస్ మహరాజ్ "మఠంలో చేరలేకపోయినందుకు నువ్వు అలా బాధపడకూడదు. నీకు వీలైనప్పుడల్లా ఇక్కడకు వచ్చి ఉండవచ్చు" అని నన్ను ఓదార్చారు.

ఈ విధంగా రామకృష్ణ మఠం స్వామీజీలతో అత్యంత సన్నిహితంగా మెలిగే అవకాశం నాకు లభించింది. దుర్లభమైన మహాత్ముల సాంగత్యం లభించడం నా పూర్వజన్మ సుకృత ఫలంగా భావిస్తున్నాను. □






రామకృష్ణ నగర్, కరైపెట్టై, కాంచీపురం – 631552, తమిళనాడు.
ఫోన్: 044-27294960, 94440 02838, 98849 88178.
Email : rkmathkanchi@hotmail.com


# విన్నపం

**కాం**చీపురంలోని శ్రీరామకృష్ణ మఠం బేలూరులో గల శ్రీరామకృష్ణ మఠం, రామకృష్ణ మిషన్‌ల శాఖా కేంద్రం. 1932లో కాంచీపురంలో ప్రారంభమైన ఈ కేంద్రం 1996లో ఊరికి 5 కిలోమీటర్ల దూరంలో నున్న కరైపెట్టై అనే గ్రామానికి తరలించబడింది. ధార్మిక, ఆధ్యాత్మిక, సాంస్కృతిక, గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలను నిర్వహిస్తోంది. జాతి, మత, వర్ణ వివక్షత లేకుండా అనాథలకూ, నిరుపేదలకూ విద్యా వైద్య రంగాలలో అనేక విధాలుగా తోడ్పడుతోంది.

**మా సంస్థ ప్రస్తుతం నిర్వహిస్తున్న సేవాకార్యక్రమాలు:**

1. ఆర్థికంగా వెనుకబడిన 300 మంది (10వ తరగతి, 12వ తరగతి చదివే) విద్యార్థుల కోసం చుట్టు ప్రక్కల గ్రామాలలో తొమ్మిది ఉచిత విద్యా కేంద్రాలను నిర్వహిస్తోంది.
2. వివిధ పాఠశాలలు, కళాశాలలకు చెందిన 1700 మంది పేద విద్యార్థులకు దుస్తులు, పుస్తకాలు మొదలైనవి పంపిణీ చేస్తోంది.
3. పాఠశాల, కళాశాల విద్యార్థులు 50 మంది చదువుకు రుసుము చెల్లిస్తోంది.
4. 60 మంది పేద విద్యార్థులకూ, 30 మంది నిరుపేద వృద్ధులకూ రోజూ అన్నదానం చేస్తోంది.
5. పేదలకు ఉచిత వైద్యం; నిత్యావసర సామగ్రి సరఫరాతో పాటు వృద్ధులకూ, వితంతువులకూ ధన సహాయాన్ని అందిస్తోంది.
6. వివిధ విద్యాసంస్థలలోని 1000 మంది విద్యార్థులు, అధ్యాపకులకు వ్యక్తిత్వ వికాస తరగతుల్ని నిర్వహిస్తోంది.

ఈ సేవాకార్యక్రమాల నిర్వహణకు తగిన భవనాలు కానీ, నిధులు కానీ లేవు. మేము పూర్తిగా ఉదార హృదయులైన ప్రజలు, శ్రేయోభిలాషులు, భక్తుల సహకారంతోనే ఈ కార్యక్రమాల్ని నిర్వహిస్తున్నాం.



**మౌలిక సదుపాయాలు :**

1. బహుళార్థ సేవల భవనం – 75 లక్షలు.
2. కార్యాలయం, గ్రంథాలయం, పుస్తక విక్రయశాల – 75 లక్షలు.
3. సాధునివాసం, వంటగది భవనం – 50 లక్షలు.

ఆశ్రమంలో సేవలు నిర్విఘ్నంగా కొనసాగేందుకు అత్యవసరమైన మౌలిక సదుపాయాలను సమకూర్చాలి. అందుకు విరాళాల్ని అందజేయాల్సిందిగా మిమ్మల్ని అభ్యర్థిస్తున్నాం.

విరాళాలను "Sri Ramakrishna Math, Kanchipuram" పేరున చెక్కు / డి.డి. తీసి Sri Ramakrishna Math, Ramakrishna Nagar, Karaipettai, Kanchipuram-631 552 చిరునామాకు పంపాల్సిందిగా మనవి.

విరాళాలన్నిటికీ 1961 ఆదాయపు పన్ను చట్టంలోని 80-జి సెక్షన్ కింద పన్ను మినహాయింపు కలదు.

మీరు భగవాన్ శ్రీరామకృష్ణుల కృపకు పాత్రులు కావాలని ప్రార్థిస్తూ...

భగవత్సేవలో

**స్వామి ధర్మాత్మానంద**

అధ్యక్షులు

| దాత పేరు | విద్యాసంస్థ |
|---|---|
| శ్రీ వై.వి.ఎస్. రామ, అశోక్ నగర్, హైదరాబాద్. | శ్రీ సరస్వతీ గ్రంథాలయం, వెదుళ్ళపల్లి, బాపట్ల, గుంటూరుజిల్లా |
| శ్రీ బి. సత్యనారాయణ, మల్లాపూర్, కరీంనగర్ జిల్లా | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, చొప్పదండి, కరీంనగర్ జిల్లా |
| శ్రీమతి ఆర్. హేమలత, నల్లకుంట, హైదరాబాద్ | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, గుమ్మడవెల్లి, నల్లగొండ జిల్లా |
| శ్రీ బి. మల్యాద్రి, ఖాట, బద్ది పోస్ట్, హిమాచల్‌ప్రదేశ్ | మండల పరిషత్ ఉన్నత పాఠశాల, పర్లపల్లి, నెల్లూరు జిల్లా |
| శ్రీమతి బి. కళావతి, ఆల్వాల్, సికింద్రాబాద్ | లైబ్రేరియన్, నంబూరు, గుంటూరు జిల్లా |
| 〃 〃 〃 | బ్రాంచ్ లైబ్రెరి, సామర్లకోట, తూర్పుగోదావరి జిల్లా |
| ఇ. ప్రవీణ, దోమల్‌గూడ, హైదరాబాద్ | ప్రగతి మహావిద్యాలయ పి.జి. కళాశాల, కోఠి, హైదరాబాద్ |
| శ్రీ జి. వెంకటేశ్వర్లు, మంచిర్యాల్, ఆదిలాబాద్ జిల్లా | ఆదిలాబాద్ జిల్లాలోని 8పాఠశాలలు/కళాశాలలకు స్పాన్సర్ చేశారు. |
| శ్రీ రాజేశ్వరరావు, ఆర్.టి. నగర్, బెంగుళూరు | శ్రీకాకుళం జిల్లాలోని 5 పాఠశాలలకు స్పాన్సర్ చేశారు. |
| శ్రీమతి పుసులూరి ఉష, బాపట్ల, గుంటూరు జిల్లా | ఎస్.ఆర్.కె. ప్రభుత్వ డిగ్రీ కళాశాల, గూడూరు, నెల్లూరు జిల్లా. |
| (కీ॥శే॥ పి. వేంకట సత్యవనవ సుందరం జ్ఞాపకార్థం) | పి.ఆర్.ఆర్ వి.ఎస్., ప్ర.డిగ్రీ కళాశాల, విదవలూరు, నెల్లూరు |
| 〃 〃 〃 | విశ్వోదయ ప్రభుత్వ డిగ్రీ కళాశాల, వేంకటగిరి, నెల్లూరు జిల్లా. |
| శ్రీ భాస్కరరావు కోడై, శాంతినగర్, ఏలూరు | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, తాడేపల్లి గూడెం, ప.గో. జిల్లా |
| 〃 〃 〃 | డి.ఆర్. గోయెంకా ఆర్ట్స్ సైన్స్ కళాశాల,పెంటపాడు, ప.గో.జిల్లా |
| శ్రీ ఎన్. ప్రభాకర్, జమిస్థాన్‌పూర్, హైదరాబాద్ | ప్రభుత్వ ఉన్నత పాఠశాల (బాలికల) వేములవాడ, కరీంనగర్‌జిల్లా |
| డా॥ వాసుదేవ చక్రవర్తి, జువ్వలపాలెం, భీమవరం, ప.గో.జిల్లా | శ్రీఉమా రామలింగేశ్వర దేవస్థానం, కోమటివాడ, ప.గో.జిల్లా |
| శ్రీమతి సి. సత్యవతి, హిమాయత్‌నగర్, హైదరాబాద్ | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, బోగోలు, ప్రకాశం జిల్లా |
| శ్రీ బి. సుబ్బారావు, చింతల్, బాలానగర్ టౌన్‌షిప్, హైదరాబాద్ | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, మునుగొండ, తూ.గో. జిల్లా |
| డా॥ వి. అనురాధ, ఆర్.ఎస్.రోడ్, రాజంపేట, కడప జిల్లా | ప్రభుత్వ బాలికల ఉన్నత పాఠశాల, ప్రొద్దుటూరు, కడప జిల్లా |
| 〃 〃 〃 | జిల్లా పరిషత్ బాలికల ఉన్నత పాఠశాల, రాజంపేట, కడపజిల్లా |
| శ్రీ రాఘవేంద్ర | శ్రీ రామలింగేశ్వర డిగ్రీ కళాశాల, కులకచర్ల, రంగారెడ్డి జిల్లా |
| 〃 〃 〃 | వెంకటరావు మెమోరియల్ పాఠశాల, కులకచర్ల, రంగారెడ్డి జిల్లా |
| 〃 〃 〃 | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, కులకచర్ల, రంగారెడ్డి జిలా |
| శ్రీ వినాయక్ దేశ్‌పాండే | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, బోథ్, ఆదిలాబాద్ జిల్లా |
| 〃 〃 〃 | సరస్వతీ శిశుమందిర్, బోథ్, ఆదిలాబాద్ జిల్లా |
| శ్రీ నాగరాజ శెట్టి, కనెగిరి ఉపనగర్, బెంగుళూరు | ప్రభుత్వ ఉన్నత పాఠశాల, గట్టు, తంబలపల్లి, చిత్తూరుజిల్లా |
| 〃 〃 〃 | ప్రభుత్వ ఉన్నత పాఠశాల, వివేక్‌నగర్, బెంగుళూర్ |
| 〃 〃 〃 | ప్రభుత్వ ఉన్నత పాఠశాల, చింతపర్తి, చిత్తూరు జిల్లా |
| శ్రీ కె.వి.ఎస్.ఇ.వరప్రసాద్, కమలానగర్,వనస్థలిపురం, హైదరాబాద్ | జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల, గరివిడి, విజయనగరం జిల్లా |

ఈ పథకం ద్వారా **శ్రీరామకృష్ణ ప్రభ**ను మరింత మందికి చేరువ చేస్తున్న దాతలకు కృతజ్ఞతలు.




# q^•q ÉHxH F J^

– బి. కృష్ణవేణి

స్వామి వివేకానంద స్ఫూర్తితో కొంత మంది విద్యార్థులలోనైనా ప్రేరణ, చైతన్యం కలుగజేశానన్న తృప్తి, ఆనందం ఓ అధ్యాపకురాలిగా నాకు లభించాయి.




ఓ ప్రైవేట్ పాఠశాలలో వార్డెన్‌గా పని చేస్తుండగా (ఇష్టం లేని పని) ఓ విద్యార్థిని తండ్రి లామినేషన్ చేయించిన స్వామి వివేకానంద సందేశంతో ఉన్న పోస్టరు తెచ్చి ఇచ్చారు. ఆడపిల్లలందరికీ దీని అర్థం చెప్పి, ప్రతిరోజూ చదివిస్తే బాగుంటుందని అన్నారు. అది చదివాక ముందుగా నాలోనే తెలియని స్ఫూర్తి కలిగి అనిష్టంగా చేరిన ఆ వృత్తిని ఇష్టంగా మలుచుకోగలిగాను. ఆ పోస్టరును ప్రవేశ ద్వారానికి ఎదురుగా ఉన్న గదిలో పెట్టి ప్రతిరోజూ 6వ తరగతి నుంచి జూనియర్ కళాశాల విద్యార్థుల వరకు ఉన్న పిల్లలందరి చేత ఉదయం 6.30 గంటలకు చదివించి, అర్థాన్ని విశదీకరించేదాన్ని. క్రమక్రమంగా విద్యార్థినుల ప్రవర్తనలో చాలా మార్పు రావడం గమనించాను. పిల్లలను కలవడానికి వచ్చే తల్లితండ్రులు కూడా వారిలోని మార్పును గమనించి ఎంతో ఆనందించారు.

ఆ తరువాతి కాలంలో ఓ ప్రైవేటు పాఠశాలలో హిందీ అధ్యాపకురాలిగా చేరాను. ఓ సెలవు రోజు రామకృష్ణ మఠానికి వెళ్ళి, స్వామి వివేకానంద ఇన్‌స్పిరేషన్ పోస్టర్లు రెండు కొని 9,10 తరగతులలో పెట్టి వారి చేత చదివించడం ప్రారంభించాను. స్కూల్ అసెంబ్లీలో శ్రీరామకృష్ణ పరమహంస చెప్పిన కథలు చెప్పేదాన్ని. తరగతిలో మొదటి 5 స్థానాలు పొందిన విద్యార్థులకూ, పూర్తి హాజరు ఉన్న విద్యార్థులకూ స్వామి వివేకానంద పుస్తకాలను బహుమతిగా ఇచ్చేదాన్ని. క్రమంగా వారిలో నేను ఆశించిన మార్పు కలగసాగింది. కొంతమంది తమ తల్లితండ్రులను అడిగి మఠానికి వెళ్ళి, పుస్తకాలు కొనుక్కోవడం, చదవడం ప్రారంభించారు. 'నా భారతం అమర భారతం' నాకు ఓ పారాయణ గ్రంథం లాంటిది. ఆ పుస్తకాన్ని ఎంతమంది పిల్లలకో బహుమతిగా ఇచ్చి చదివించి మనదేశం యొక్క గొప్పదనాన్ని గుర్తింపజేయగలిగాను. వీరిని చూసి హైస్కూలులోని తక్కిన తరగతుల వారు కూడా స్వామి వివేకానంద ఇన్స్పిరేషన్ పోస్టర్లను తెప్పించుకుని వారు కూడా చదవడం ప్రారంభించారు. వారిలోని మార్పును గమనించిన పాఠశాల యాజమాన్యం వారూ ఆనందం వ్యక్తం చేశారు.

కాలక్రమేణా మరొక పాఠశాలలో చేరవలసి వచ్చింది. అది ఆ సంవత్సరమే ప్రారంభమైంది. అక్కడి విద్యార్థులందరూ చదువులో చాలా వెనుకబడినవారే. వారిని చూసి నాకు వారిలో మార్పు కేవలం చదువు వల్ల మాత్రమే సాధ్యపడదని అర్థమైంది. వారిలో ఆత్మ విశ్వాసం కలిగించడం నా ప్రథమ కర్తవ్యమని భావించాను. ఇన్స్పిరేషన్ పోస్టర్లను తెచ్చి 9,10 తరగతుల వారికి ఇచ్చి వారి గదులలో అంటించమన్నాను. మర్నాడు నేను తరగతికి వెళ్ళేసరికి కూడా వారు పోస్టరు అంటించలేదు. కారణం అడిగితే, 'పెట్టాం, ఊడిపోయింది' అన్నారు. 'మళ్ళీ పెట్టవచ్చు కదా' అని ఊరకున్నాను. మూడో రోజు కూడా వాళ్ళు దాన్ని అతికించలేదు. నాకు కోపం, బాధ, నిరాశ కలిగి "మిమ్మల్ని బాగు చేద్దామన్నా మీరు మారరు. నా ప్రయాస వృథా" అంటూ తరగతి గదిలో నుంచి పాఠం చెప్పకుండా వచ్చేశాను.



'పిల్లల మీద నేను అలా కోపగించుకోకుండా ఉండవలసింది' అని అనుకొని మర్నాడు స్కూల్‌కు వెళ్ళాను. అప్పుడు విద్యార్థులందరూ శ్రద్ధగా స్వామి వివేకానంద సూక్తులను ముక్త కంఠంతో చదువుతున్నారు. ఆ సన్నివేశాన్ని చూసి నా కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

ఆ రోజు నుండి దాదాపు ప్రతిరోజూ స్వామి వివేకానంద జీవితం నుంచి ఏదో ఒక ఉదాహరణ చెబుతూ ఉండే దాన్ని. వారిలో అనూహ్యమైన మార్పు కలిగింది. మూడు మార్కులు తెచ్చుకునే వంశీ అనే విద్యార్థి నాలుగు నెలల్లో 60 మార్కులు తెచ్చుకునే స్థాయికి ఎదిగాడు. ఇదంతా స్వామి వివేకానంద స్ఫూర్తిదాయక సందేశ మహిమే! □

(బి. కృష్ణవేణి, అల్కాపురి, హైదరాబాద్)

...17వ తరువాయి.


కాసేపయ్యాక తిరిగి వచ్చిన సర్పం మణి కనపడక పోవడంతో కోపంగా బుస కొడుతూ జనకుడి శిబిరాన్ని చేరుకుంది. సర్పాన్ని చూసిన రాజభటులు భయంతో కకావికలైపోయారు. కలకలం విన్న జనకుడు సర్పాన్ని ఎదుర్కొని, ముక్కలు ముక్కలుగా నరికాడు.
ఆ సర్పం ఒక దివ్యపురుషునిగా మారింది.
రావణ వధ కోసం శ్రీరాముడు అవతరించడానికి ఇప్పటి నుండే సన్నాహాలు జరుగుతున్నాయి. నీ పై పరమ శివునికి ఫిర్యాదు చేయడం నా బాధ్యత; పరిణామాలకు సిద్ధంగా ఉండు.
నేను రాజధర్మం నిర్వర్తించాను. ఎవరికీ అపకారం చెయ్యలేదు. కనుక నాకు భయం లేదు.
దివ్యపురుషుడు శివుడి దగ్గరకు వెళ్ళి, జరిగిన సంగతి చెప్పాడు.
శంకరుడికి ఆగ్రహం వచ్చి ప్రమథగణాలను వెంటబెట్టుకొని, చేత ధనువు ధరించి రుద్రవనం చేరాడు. ఇది ఇంద్రుడికి తెలిసింది.
ఇప్పుడిది శివకేశవుల యుద్ధంగా మారి, ప్రళయానికి దారి తీస్తుంది. ఈ యుద్ధాన్ని నివారించడం ఒక్క నారద మహర్షికే సాధ్యం...
నారద మహర్షి వస్తే సమస్యకు పరిష్కారమేదైనా చెబుతారు.


దేవదానవ యుద్ధాలు లేవు కదా!
నన్నెందుకు తలచుకున్నావు.
ఇంద్రుడు నారదునికి విషయమంతా చెప్పి, “ఇప్పుడు యుద్ధాన్ని ఆపకపోతే, విశ్వానికే ముప్పు” అన్నాడు.
ఒకరు భోళా శంకరుడు, మరొకరు కపట నాటక సూత్రధారి. వీరి మధ్య యుద్ధాన్ని ఆపడం చిటికెల మీద పని.
నారదుడు రుద్రవనానికి బయల్దేరాడు.
అప్పటికే శివుడు, జనకుడు ఎదురెదురుగా నిలబడి ఉన్నారు. శివుడు మణి ఇమ్మన్నాడు. జనకుడు అందుకు నిరాకరించాడు.
నా మణిని నాకు తిరిగి ఇవ్వు, లేకుంటే యుద్ధం చెయ్యి.
జనకుడు శివుని చేతిలో ఉన్న ధనుస్సును లాక్కున్నాడు. శివుడు కోపం పట్టలేక త్రిశూలంతో జనకుణ్ణి సంహరించబోయాడు.
జనకుడు విష్ణుమూర్తిని ప్రార్థించాడు...
నారదుడు, కుమారస్వామి చెవిలో ఏదో చెప్పాడు.






సాక్షాత్తూ అవతారమూర్తి అయిన శ్రీరామచంద్రుడు లంకకు పోవటానికై సముద్రానికి సేతువు కట్టవలసి వచ్చింది. కానీ ఆయన భక్తుడైన హనుమంతుడు రామనామంపై అఖండ విశ్వాసంతో ఒక్క గెంతులో సముద్రాన్ని లంఘించాడు. కేవలం విశ్వాస మహిమతో స్వామి కంటే సేవకుడే ఎలా ఘనతరకార్యాన్ని చెయ్యగలిగాడో చూడండి!

\- శ్రీరామకృష్ణ పరమహంస

# [illegible]

– గుళ్ళపూడి శ్రీనివాస కుమార్

"ఆ సంగీత సామ్రాజ్ఞి ముందు నేను ఒక దేశానికి ప్రధానమంత్రిని మాత్రమే!" సంగీత కళానిధి (దివంగత) ఎమ్మెస్ సుబ్బులక్ష్మిని ఉద్దేశించి సాక్షాత్తూ మన దేశానికి తొలి ప్రధానమంత్రి అయిన పండిత జవహర్‌లాల్ నెహ్రూజీ ఈ వ్యాఖ్యలు చేశారు. కర్ణాటక సంగీత శిరోమణిగా ఎంతో ఖ్యాతినార్జించి, అంతర్జాతీయంగా మన దేశ సంప్రదాయ సంగీత కీర్తిపతాకను రెపరెపలాడించిన భారతరత్నం సుబ్బులక్ష్మి. మన సంప్రదాయ సంగీత కచ్చేరీల్లో పాడే కీర్తనల్లోని సాహిత్యాన్ని పరికిస్తే అందులో త్యాగనిరతి, ఆత్మజ్ఞానం, తత్త్వబోధ, భగవంతుని లీలలు ఇత్యాది దివ్య జీవన విలువలు ఉంటాయి. ఆ కీర్తనల్లోని విలువలను తన జీవితంలోనూ నింపుకున్న నారీమణి ఎమ్మెస్. ఆమె తన గానామృతాన్ని పంచి, ఎన్నో వైద్యశాలలు, విద్యాలయాలు, ధార్మిక సంస్థలు, ఆలయాల కోసం నిధుల సమీకరణకు చేయూతనిచ్చారు.

మహాత్మా గాంధీ తాను ఏర్పాటు చేసిన కస్తూర్బా గాంధీ స్మారక నిధి కోసం సుబ్బులక్ష్మి సేవలనే వినియోగించుకున్నారు. ఆ నిధి కోసం కచ్చేరీలు చేసిన సుబ్బులక్ష్మిని ప్రశంసిస్తూ గాంధీజీ ఆమెకు పంపిన లేఖలో ప్రత్యేకంగా తమిళంలో సంతకం చేశారు. నిధుల సేకరణ కోసం పాడాలన్న విజ్ఞప్తితో ఎవరైనా వస్తే సుబ్బులక్ష్మి వెంటనే కచ్చేరీ ఏర్పాటుకు అంగీకరించేవారు. పేదలకు నేత్రవైద్య సేవలందిస్తూ చెన్నైలో జాతీయస్థాయి ఖ్యాతి నార్జించిన శంకర నేత్రాలయానికి సుబ్బులక్ష్మి గాత్రాలయం ఇతోధికంగా సేవలందించింది. కర్ణాటక సంగీత త్రిమూర్తులుగా పూజలందుకునే త్యాగరాజ స్వామి, ముత్తుస్వామి దీక్షితులు, శ్యామశాస్త్రులు తమిళనాడులోని తిరువారూర్‌లో నివసించారు. ఈ మహనీయులు నివసించిన ఇళ్ళను స్వాధీనం చేసుకుని స్మారక మందిరాలుగా మార్చేందుకు కచ్చేరీలు చేసి నిధులందించారు సుబ్బులక్ష్మి. ఇలాంటి ధార్మిక కార్యక్రమాల కోసం మద్రాసు, ముంబయి, బెంగుళూరు, హైదరాబాద్ వంటి పలు నగరాలు, పట్టణాల్లో ఆమె వందలాది కచ్చేరీలు చేశారు. 1953లో రామకృష్ణ మిషన్ పాఠశాల కోసం న్యూఢిల్లీ పౌరులను తన గానామృత జలధిలో ఓలలాడించారు.

తిరుమల తిరుపతి దేవస్థానాల కోసం 'బాలాజీ పంచరత్న మాల' అనే భక్తి గీతగుచ్ఛాన్ని ఈ అమృతమూర్తి గానం చేశారు. ఆమె గానంతో రూపొందించిన అన్నమయ్య కీర్తనల తొలి ఆల్బమ్ విడుదలకు ఆ వాగ్గేయకారుడు జన్మించిన తాళ్ళపాకకు సుబ్బులక్ష్మి దంపతులు వెళ్ళారు. ఈ ఆల్బమ్‌లన్నిటి విక్రయాలపై తమకు లభించే రాయల్టీలను దేవాలయాలకే సమర్పిస్తున్నట్లు ప్రకటన చేశారు. సామవేద సారాన్ని ఆకళింపు చేసుకుని, భక్తిమార్గంలో తన జీవితాన్ని తరింపజేసుకున్న ఆధునిక సంగీత యోగిని సుబ్బులక్ష్మి.

సుబ్బులక్ష్మి భర్త సదాశివం 'కల్కి' అనే తమిళ పత్రిక నడిపేవారు. ఒక దశలో ఆర్థిక సమస్యలు చుట్టుముట్టడంతో కల్కి గార్డెన్స్ అనే వారి విశాల భవంతిని అమ్మివేసి, చెన్నై, నుంగంబాక్కంలోని ఒక చిన్న ఇంట్లో సుబ్బులక్ష్మి దంపతులు అద్దెకు ఉండాల్సి వచ్చింది. ఈ సమయంలో ఎదుర్కొన్న కష్టాలను ఆమె మౌనంగా భరించారే తప్ప ఎవరితోనూ చెప్పుకోలేదు. నాటి తమిళనాడు ముఖ్యమంత్రి ఎం.జి. రామచంద్రన్ అప్పటి ప్రధానమంత్రి రాజీవ్ గాంధీతో మాట్లాడి సుబ్బులక్ష్మికి ఒక ఇల్లు బహూకరించాలని నిర్ణయించుకున్నారు. అయితే, సుబ్బులక్ష్మి, సదాశివం దంపతులు ఈ ప్రతిపాదనను సున్నితంగా తిరస్కరించారు. ఈ రోజుల్లో ఇలాంటి ఆదర్శ దంపతులను చూడగలమా? □



## QÆÊfi KÜo

# ZÑ¶t ZkÅt



... అన్ని కాలాలలో అందరికీ...

**రచయిత : ప్రయాగ రామకృష్ణ**
**వెల : రూ. 125/-, పేజీలు : 169**
**ప్రతులకు : ప్రయాగ రామకృష్ణ**
**12-2-828/ఎ/11, అంబా గార్డెన్స్**
**మెహదీపట్నం, హైదరాబాద్ - 500 028**

త్యాగాలు చెయ్యడం, విలువలతో జీవించడం అనేది సత్యయుగంలో అయితే కుదురుతుంది కానీ ఈ కాలంలో అలా జీవించడం అయ్యే పనేనా? అనే వాదన చాలామంది నుంచి వింటుంటాం. త్యాగధనులు, పరోపకారులు నాడూ, నేడూ ఉన్నారని ప్రయాగ రామకృష్ణ రచించిన "ఎపిక్స్ ఎథిక్స్" చదివితే అవగతమవుతుంది. గడిచిన యుగాలు మొదలుకొని నిన్నటి చారిత్రక కాలం మీదుగా నేటి సమాజం వరకూ కనిపించే పురాణ, చారిత్రక ఘటనలను నేటి జీవనశైలితో సమన్వయ పరుస్తూ సాగుతుందీ రచన. మనం అనుసరించే విలువల ప్రభావం మన జీవితంపై ఏ విధంగా ఉంటుందనేది సోదాహరణంగా చెబుతుందీ పుస్తకం. యుగపురుషులైన శ్రీరాముడు, శ్రీకృష్ణునితోబాటు ఎందరో మహర్షులు, నిన్న మొన్నటి రాజులు, స్వాతంత్ర్య సమరయోధులు, శాస్త్రవేత్తలు ఇలా వివిధ యుగాలు, రంగాలు, సంప్రదాయాలకు చెందిన ఉన్నత వ్యక్తులు అనుసరించిన విలువలను విశదీకరించి మనలోనూ ఆ స్ఫూర్తిని నింపే ప్రయత్నం ఇక్కడ జరిగింది. అయితే, ఇష్టమైన కూరవేసుకుని లొట్టలేస్తూ తినే అన్నం ముద్దలో ఒకరాయి వస్తే ఎలా విలవిలలాడిపోతామో... అలాగే, ఈ పుస్తకంలోని తేట తెలుగు అక్షరామృతాన్ని పాఠకులు ఆనందంగా ఆస్వాదిస్తున్నప్పుడు కొన్నిచోట్ల ఉన్నట్టుండి తగిలే ఆంగ్ల పదాలు పంటి కింద రాళ్ళలా కొరుకుడు పడకపోవడం కాస్త ఇబ్బందిగా అనిపించింది. ఈ పుస్తక శీర్షిక (టైటిల్) తెలుగు పదమైతే సముచితంగా ఉండేది. ▫ **- గుళ్ళపూడి శ్రీనివాసకుమార్**



## ఆంధ్రప్రదేశ్ వరద బాధితులకు
## రామకృష్ణ మిషన్ సహాయక చర్యలు

2009 అక్టోబర్ మొదటి వారంలో సంభవించిన అనూహ్య వరదల కారణంగా తుంగభద్రా, కృష్ణా తీర ప్రాంతాల్లోని అనేక గ్రామాలు జలమయమయ్యాయి. వేలాది మంది నిరాశ్రయులయ్యారు.

కర్నూలు జిల్లాలోని వరద బాధితులకు కడప రామకృష్ణ మిషన్; మహబూబ్‌నగర్ జిల్లాలోని వరద బాధితులకు హైదరాబాద్ రామకృష్ణ మఠం; కృష్ణా, గుంటూరు జిల్లాల్లోని వరద బాధితులకు విజయవాడ రామకృష్ణ మిషన్ ప్రాథమిక సహాయక చర్యల్ని చేపట్టాయి. వరద బాధితులకు - ఆహార పొట్లాలనూ, కిరాణా సామగ్రినీ, వంట పాత్రలనూ, దుప్పట్లనూ, చీరలనూ పంపిణీ చేశాయి. ఈ సహాయక కార్యక్రమాలు ఇంకా కొనసాగుతున్నాయి.

వరద బాధితుల సహాయ, సేవా కార్యక్రమాల నిమిత్తం విరాళాలను కోరుతున్నాం. దాతలు విరాళాల్ని ఈ క్రింది చిరునామాలకు పంపవలసిందిగా మనవి.

**Ramakrishna Mission**
**Putlampalli, near RIMS Hospital**
**Kadapa - 516 002**
**Ph: 08562 - 200120, 200633**

**Ramakrishna Mission**
**Sitanagaram**
**Tadepalli (Mdl), Dt. Guntur- 522 501**
**Ph: 08645 - 272248, 272656**

**Ramakrishna Math**
**Domalguda, Hyderabad - 500 029**
**Ph: 040- 27633936, 27633937**

విరాళాలకు ఆదాయపు పన్ను చట్టంలోని 80(జి) సెక్షన్ క్రింద పన్ను మినహాయింపు ఉంది. ▫

## #=Q~ü2009 ÑO_ÆQÆÊeÑ¨fk<åÅo _ÆQ~ü2009

| | | | |
|---|---|---|---|
| 01 | ఆదివారం | : | స్వామి విజ్ఞానానంద జయంతి |
| 12 | గురువారం | : | ఏకాదశి |
| 26 | గురువారం | : | స్వామి ప్రేమానంద జయంతి |
| 28 | శనివారం | : | ఏకాదశి, గీతా జయంతి |

| | | | |
|---|---|---|---|
| 08 | మంగళవారం | : | దివ్యజనని శ్రీ శారదాదేవి జయంతి |
| 12 | శనివారం | : | ఏకాదశి, స్వామి శివానంద జయంతి |
| 22 | మంగళవారం | : | స్వామి శారదానంద జయంతి |
| 24 | గురువారం | : | క్రిస్టమస్ (సాయంత్రం ఆరతి తర్వాత) |
| 28 | సోమవారం | : | వైకుంఠ ఏకాదశి, గీతా పారాయణం - ఉ. 8 గంటలకు |
| 30 | బుధవారం | : | స్వామి తురీయానంద జయంతి |

# N~å=dbB–,^ÕåÅUœå ÕdÐN<À ê=O

**కడప రామకృష్ణ మిషన్** నూతన శ్రీరామకృష్ణ దేవాలయ శంకుస్థాపనోత్సవం సందర్భంగా 2009 సెప్టెంబర్ 5,6 తేదీలలో వివిధ కార్యక్రమాల్ని నిర్వహించింది. 5వ తేదీన సాయంత్రం జరిగిన బహిరంగ సభలో 'యోగి వేమన జీవితం-సందేశం'పై విజయవాడ రామకృష్ణ మిషన్ కార్యదర్శి స్వామి శశికాంతానందజీ, 'అన్నమాచార్య జీవితం-సందేశం'పై డాక్టర్ సర్వోత్తమరావు, 'భక్త పోతన జీవితం-సందేశం'పై డాక్టర్ చెంచు సుబ్బయ్య, 'వీరబ్రహ్మేంద్ర స్వామి జీవితం-సందేశం'పై శ్రీ కట్ట నరసింహులు ప్రసంగించారు. అనంతపురం నృత్య కళానిలయం బాలలచే 'శ్రీరామకృష్ణ లీలా గీతి' నృత్యరూపకం ప్రదర్శించబడింది.



నూతన శ్రీరామకృష్ణ దేవాలయ నమూనా

2009 సెప్టెంబర్ 6న ఉదయం 9 గంటలకు నూతన శ్రీరామకృష్ణ దేవాలయానికి రామకృష్ణ సంఘ ఉపాధ్యక్షులు పూజ్య స్వామి స్మరణానందజీ మహరాజ్ శంకుస్థాపన చేశారు. ఉదయం 9.30 గంటలకు కోయంబత్తూర్ రామకృష్ణ మిషన్ విద్యాలయ కార్యదర్శి స్వామి ఆత్మారామానందజీ కార్యాలయం భవనాన్ని ప్రారంభించారు. ఉదయం 11 గంటలకు జరిగిన బహిరంగ సభలో పూజ్య స్వామి స్మరణానందజీ మహరాజ్, స్వామి ఆత్మారామానందజీ మహరాజ్ దేవాలయ ప్రాముఖ్యత గురించి వివరించారు. తదనంతరం గుంటూరు చిర్రా బ్రహ్మానంద రెడ్డి భాగవతార్‌చే శ్రీరామకృష్ణ జీవితంపై హరికథా గానం, టి.టి.డి. అన్నమాచార్య ప్రాజెక్ట్ కళాకారులు అన్నమాచార్య సంకీర్తనలు గానం చేశారు. ఈ కార్యక్రమంలో వివిధ రామకృష్ణ మఠ కేంద్రాల నుంచి 40 మంది స్వామీజీలు, 600 మంది భక్తులు పాల్గొన్నారు.

2009 సెప్టెంబర్ 11వ తేదీన జిల్లా కలెక్టర్ శ్రీ శశిభూషణ్ కుమార్ 'వివేకానంద విద్యానికేతన్'-పాఠశాల భవనాన్ని ప్రారంభించారు. సుమారు 1000 మంది విద్యార్థులు పాల్గొన్న ఈ కార్యక్రమంలో జిల్లా కలెక్టర్, మహబూబ్‌నగర్ మహిళా కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ పి. ఎల్లారెడ్డి ఉత్తేజకరంగా ప్రసంగించారు.



దేవాలయ శంకుస్థాపనోత్సవం



'వివేకానంద విద్యా నికేతన్' ప్రారంభోత్సవం

## విద్యార్థుల వికాసానికి 'వివేకవాహిని'

**ఖ**మ్మం, సూర్యాపేట, హుజూర్‌నగర్, చిలకలూరిపేట, పూనూరు- శ్రీరామకృష్ణ సేవాసమితుల ఆధ్వర్యంలో **విజయవాడ రామకృష్ణ మిషన్ 'వివేకవాహిని'** 2009 జూన్, జూలై, ఆగస్టు, సెప్టెంబర్ నెలల్లో ఖమ్మం, నల్గొండ, కృష్ణా, గుంటూరు, ప్రకాశం జిల్లాల్లోని 50 విద్యా సంస్థల్లో వ్యక్తిత్వవికాస సదస్సులను, 7 గ్రామాల్లో సత్సంగాలను నిర్వహించింది. ఈ సదస్సుల్లో 21,000 మంది విద్యార్థులు పాల్గొని రూ. 1,22,000లు విలువచేసే వివేకానంద సాహిత్య గ్రంథాలను కొన్నారు.



సంయుక్త నివేదిక : కె. త్రివిక్రమరావు, ఖమ్మం; సుబ్రహ్మణ్య శర్మ, హుజూర్‌నగర్; యం.వి. దాసయ్య, పూనూరు.



# సుబోధ

అహంకారాన్ని ఎలా నశింపచేసుకోవాలో తెలుసా? వడ్లుదంచేవారు మధ్య మధ్య పని ఆపి ఊక మొదలైనవి పూర్తిగా పోయాయా లేదా అని పరిశీలిస్తుంటారు. నగలను త్రాసులో వేసి తూచేవారు ముల్లు సరిగ్గా నడుమ నిలిచివుందో లేదో తరచూ చూస్తారు. అలాగే అహంకారం ఇంకా తలెత్తుతోందా, అణగిపోయిందా అని తెలుసు కోటానికి అప్పుడప్పుడు నన్ను నేను నిందించు కొనేవాణ్ణి.

పొయ్యిమీద అన్నం ఉడుకుతున్నదనుకో, సరిగ్గా ఉడికిందో లేదో తెలుసుకోటానికి నువ్వొక మెతుకును తీసి నొక్కి చూస్తావు కదా? దానివల్ల వెంటనే నీకు పాత్రలోని అన్నమంతా ఉడికిందీ లేనిదీ తెలుస్తుంది. అందుకై అన్ని మెతుకులనీ పట్టిచూడనక్కర్లేదు. కొన్ని మెతుకులను పట్టిచూసి అన్నం స్థితిని తెలుసుకున్నట్లే ప్రపంచం శాశ్వతమో, అశాశ్వతమో, సత్యమో, మిథ్యో ప్రపంచంలోని రెండు మూడు విషయాలను పరిశీలించగానే నీకు బోధపడుతుంది. మానవుడు జన్మిస్తున్నాడు, కొంతకాలం జీవిస్తున్నాడు, మరణిస్తున్నాడు. జంతువులూ, వృక్షాలూ కూడ ఇలాగే పుడుతూ గిడుతున్నాయి. నామరూపాలున్న సమస్తానికీ–సూర్యచంద్రాదులకూ–ఇదే గతి అని వివేచనచేత నీకు తెలుస్తుంది. జగత్తులోని అన్ని వస్తువుల తత్త్వమూ ఈ విధంగా నీకు అవగాహన మవుతుంది. ఇలా జగత్తు అశాశ్వతమనీ, మిథ్య అనీ నువ్వు గ్రహించగానే దానిపట్ల నీకు మోహం ఉండబోదు. అప్పుడు సంసారాన్ని మానసికంగా త్యజించి కోరికల నుండి విముక్తుడవవుతావు. ఇలా విషయ పరిత్యాగం చేయగల్గితే జగత్తుకు ఆధారభూతుడైన పరమాత్ముణ్ణి చూడగలవు. ఈ విధంగా బ్రహ్మ సాక్షాత్కారాన్ని పొందిన వ్యక్తి సర్వజ్ఞుడుకాక మరేమవుతాడు? □

(శ్రీరామకృష్ణ బోధామృతం నుంచి)

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029
ఫోన్: 040-2766 7799, 2763 3936
E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: స్వామి జ్ఞానదానంద
సంపాదకులు: స్వామి పరిజ్ఞేయానంద



# సురభి

శారదామాతకు అనారోగ్యంగా ఉన్న రోజుల్లో సేవ చేసే భాగ్యం నాకు (ప్రవ్రాజిక భారతీప్రాణా) లభించింది. నేను అమ్మకు పాలు త్రాగించేదాన్ని. థర్మామీటరుతో జ్వరం చూసేదాన్ని. అమ్మ అప్పుడప్పుడు పాలు త్రాగనని మొరాయించేవారు. "మహరాజ్‌ను (స్వామి శారదానంద) పిలుస్తాను!" అని అనగానే చిన్నపిల్లలా మారుమాట్లాడకుండా త్రాగేసేవారు. రాత్రి పదకొండింటికి చివరిసారి పాలు ఇచ్చేదాన్ని. ఒక రోజు రాత్రి అమ్మ పాలు త్రాగను గాక త్రాగనన్నారు. ఎంత బ్రతిమలాడినా వినకపోతే, మహరాజ్‌ను పిలిచాను.

మహరాజ్ వచ్చి అమ్మ తలను చేతితో నిమురుతూ నిదానంగా "అమ్మా! కొంచెం పాలు త్రాగుతారా?" అని అడిగారు. అందుకు అమ్మ "సరళ చేతితో త్రాగను. ఆమె రేయింబవళ్ళూ, 'అమ్మా తిను! అమ్మా త్రాగు!' అంటుంది. చేతి కింద పుల్ల (థర్మామీటరు) పెడుతుంది. ఆ రెండు పనులే నేర్చుకుంది. నువ్వే త్రాగించాలి!" అని అన్నారు.

మహరాజ్ ఎదుట నా గురించి అమ్మ అలా చెప్పడం నాకు చాలా బాధ కలిగించింది. నేను మర్నాడు మహరాజ్‌తో, "అమ్మకు నా మీద విసుగు పుట్టినట్లనిపిస్తోంది. ఇక మీదట పాలు త్రాగించను, థర్మామీటరు పెట్టి జ్వరం చూడను. ఆమె కంట పడకుండా మిగతా పనులు చేస్తాను" అన్నాను.

మహరాజ్: "అన్నం నీవే పెట్టాలి సుమా!"

నేను: "ఆఁ! అన్నం పెడతాను. అన్ని సపర్యలూ చేస్తాను. కానీ పాలు త్రాగించడం, థర్మామీటరు పెట్టడం మరెవరినైనా చేయమనండి."

ఆ రోజు అలాగే చేశాను. మర్నాడు గదిలో అడుగు పెట్టగానే, అమ్మ నన్ను దగ్గరకు పిలిచి, "నాకు పాలు త్రాగించటం లేదే? చేతి కింద పుల్ల పెట్టడం లేదే? నేను అనారోగ్యంగా ఉండడం వల్ల ఏం చేస్తున్నానో, ఎప్పుడు ఏమంటున్నానో నాకే తెలియదు తల్లీ! నా మాటలకు కోపం తెచ్చుకోకు" అంటూ నన్ను లాలించారు. అమ్మ మాటలు విన్న నేను కన్నీరు ఆపుకోలేకపోయాను. □

(ప్రవ్రాజిక భారతీప్రాణా స్మృతుల నుంచి)

Vol.66-11, Sri Ramakrishna Prabha (Telugu Monthly) November 2009, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. H-HD-1071/2007-09. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2007-09.

"Are you growing spiritually? Can you love others? Can you feel oneness with others? Have you peace within yourself? And do you radiate it around you? That is called spiritual growth, which is stimulated by meditation inwardly, and by work done in a spirit of service outwardly."

*- Swami Ranganathananda*



You write a book on citizenship, but you yourself do not behave like a citizen. What is the use of that knowledge of citizenship? You know about law, but behave lawlessly all the time! What is the use of that knowledge of law? You study science, but you don't have scientific thinking. What is the use of that science? In all these matters, 'be' is more important than mere 'know'.

*- Swami Ranganathananda*



Swami Ranganathananda

(15.12.1908 - 25.4.2005)



**శ్రీరామకృష్ణ ప్రభ**

రామకృష్ణ మఠం, దోమల్‌గూడ, హైదరాబాద్-500 029

ఫోన్: 040-2766 7799, 2763 3936

E-mail : sriramakrishnaprabha@gmail.com

నిర్వాహక సంపాదకులు: **స్వామి జ్ఞానదానంద**

సంపాదకులు: **స్వామి పరిజ్ఞేయానంద**

ఆధ్యాత్మిక అమృతవాహిని

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటం: 66 సంచిక: 12 డిసెంబర్ 2009

**రత్నసాను శరాసనం రజతాద్రిశృంగనికేతనం**
**శింజినీకృత పన్నగేశ్వర మచ్యుతానలసాయకమ్**
**క్షిప్రదగ్ధపురత్రయం త్రిదశాలయై రభివందితం**
**చంద్రశేఖర మాశ్రయే మమ కిం కరిష్యతి వై యమః**



మేరువే విల్లు; వెండికొండయే నివాసం; నాగేంద్రుడైన వాసుకే అల్లెత్రాడు; విష్ణువు, అగ్ని బాణములుగా కలిగి క్షణములో త్రిపురాలను దగ్ధమొనర్చి, దేవతలచే కీర్తించబడిన చంద్రశేఖరుణ్ణి ఆశ్రయింతును. ఇక నాకు యముని వలన భయమేమున్నది?

*(చంద్రశేఖరాష్టకం)*

## లోపలి పేజీల్లో...



# 19వ వార్షిక భక్తసమ్మేళనం

## 2009 డిసెంబర్ 25, 26, 27 తేదీలు, గుంటూరు

**సమ్మేళన ప్రాంగణం : శ్రీరామనామ క్షేత్రము (విజయలక్ష్మీ టాకీస్ ప్రక్క సందులో), గుంటూరు. ఫోన్ :0863 - 2220254**

గుంటూరు నగరంలో శ్రీరామకృష్ణ సేవాసమితి ఆధ్వర్యంలో **2009 డిసెంబర్ 25,26,27 తేదీలలో** జరిగే 19వ వార్షిక భక్తసమ్మేళనానికి అందరికీ ఇదే మా ఆహ్వానం.

- ఈ సమ్మేళనంలో పాల్గొనదలచిన వారు **రూ.150/-** సభ్యత్వ రుసుము చెల్లించాలి. రుసుము ఎమ్.ఓ/ డి.డి ద్వారా **30-11-09** తేదీ లోగా **డాక్టర్ పన్నాల శ్యామసుందరమూర్తి, 13-3-20, 2వ లైను, గుంటూరువారి తోట, గుంటూరు-522 001** చిరునామాకు పంపవలెను. **1-12-09 తర్వాత నమోదు చేసుకొనే వారు రూ.200/- చొప్పున చెల్లించాలి.** సమ్మేళన సంబంధిత పత్రాలు 25-12-09వ తేదీన సమావేశ ప్రాంగణంలో పొందవచ్చు.
- డిమాండ్‌డ్రాఫ్టులు పంపదలచినవారు "Ramakrishna - Vivekananda Bhava Prachara Parishat" పేరున ఆంధ్రా బ్యాంక్ (మెయిన్ బ్రాంచ్), కొత్తపేట, గుంటూరులో చెల్లుబాటు అయ్యేలా పంపాలి. (Code No. 0150; S.B.A/C No. 015010100003165 అకౌంట్‌కి ఆన్‌లైన్ ద్వారా కూడా పైకం పంపవచ్చును.) **చెక్కులు అంగీకరించబడవు.**
- ఈ సమ్మేళనంలో పాల్గొనే సభ్యులకు ఉచిత భోజన, వసతి సౌకర్యాలు 25-12-09(శుక్రవారం) ఉదయం నుండి 27-12-09 (ఆదివారం) రాత్రి వరకు ఏర్పాటు చేయబడును.
- ప్రత్యేక సదుపాయములు (లాడ్జిలలో గదులు) కావలసిన వారు హోటల్ గదులు స్వయంగా రిజర్వు చేసుకొనగలరు.
- 24-12-09 (గురువారం) రాత్రి నుండి గుంటూరు జంక్షన్ రైల్వే స్టేషన్‌లోనూ, ఆర్.టి.సి. బస్‌స్టాండ్‌లోనూ రిసెప్షన్ కౌంటర్లు ఏర్పాటుచేయబడతాయి.
- ఈ సమ్మేళనం సందర్భంగా ఒక స్మారక సంచికను విడుదల చేయనున్నాం. ఆ సంచికలో ప్రకటనల నిచ్చి ప్రోత్సహించ గలరు. ప్రకటనల ట్యారిఫ్ వివరాలు:

| | పూర్తి పేజీ | అర పేజీ | పావుపేజీ |
|---|---|---|---|
| బ్లాక్ & వైట్ : | 3,000 | 1,600 | 800 |
| కలర్ : | 5,000 | 3,000 | 1,500 |
| 2,3 కవరు పేజీలు | 10,000 | - | - |
| 4వ కవరు పేజీ | 15,000 | - | - |

**భక్త సమ్మేళనానికి అందరూ ఆహ్వానితులే**

### సంప్రతించవలసిన చిరునామా

**డాక్టర్ పన్నాల శ్యామసుందర మూర్తి, 13-3-20, 2వ లైను,**
**గుంటూరువారి తోట, గుంటూరు-522 001**
**సెల్ నెం. 98661 75274, ఫోన్ :0863-2337380**
**డాక్టర్ జి. రవీంద్రబాబు, సెల్ : 9491893305**

## లోపలి పేజీల్లో...





**ముఖచిత్రం :** రావణ సంహారం తరువాత సీతాదేవి శ్రీరాముని సమేతంగా రామేశ్వరంలో సైకత లింగం ప్రతిష్ఠించి, అర్చించింది. శారదాదేవి రామేశ్వరాలయంలో శివునికి అభిషేకం చేస్తూ భావపారవశ్య స్థితిలో 'శివుడు అప్పుడు నేను ఉంచినట్లే ఉన్నాడు' అని పలికింది. త్రేతాయుగంలో సీతామాతే కలియుగంలో శారదామాతగా అవతరించింది.

## శ్రీరామకృష్ణ ప్రభ శాశ్వత నిధి

| | దాత పేరు చిరునామా | రూ. |
|---|---|---|
| పోషకులు | : శ్రీ ఇ.ఆర్. రావు, యాదమ్మనగర్, తిరుమల్‌గిరి, సికింద్రాబాద్ | 1,500 |
| పోషకులు | : శ్రీమతి కందుకూరి శేషారత్నం, నిడదవోలు, పశ్చిమగోదావరి జిల్లా | 1,010 |
| పోషకులు | : శ్రీ అప్పలస్వామి, పొందూరు రోడ్, రాజాం, శ్రీకాకుళం జిల్లా | 1,000 |

**SRI RAMAKRISHNA PRABHA, RAMAKRISHNA MATH**
Domalguda, Hyderabad - 500 029. Andhra Pradesh
Phone No: 040 - 2766 7799, E-mail : sriramakrishnaprabha@gmail.com

సంపాదకీయం



## పరమపావని చరిత

# కలియుగ సీత

మనం ఎలాంటి కష్టనష్టాలను అనుభవించకుండా, అపోహలు అపనిందలు భరించకుండా, నిరాశా నిస్పృహలు ఎదుర్కోకుండా జీవితం ప్రశాంతంగా సాగిపోవాలని ఆశిస్తాం. అలా ఆశించడం సహజమే కానీ అది సాధ్యమేనా అని ఒక్కసారి ఆలోచించాలి.

శిల్పి చేతిలో ఉలి దెబ్బలు తగలకుండా రాయి అందరితో ఆరాధింపబడే దేవుని ప్రతిమగా మలచబడడం సాధ్యం కాదనీ, కమ్మరి కొలిమిలో కరగకుండా బంగారం అందమైన హారంగా మారి దేవుని మెడలో స్థానం దక్కించుకోవడం అసాధ్యమనీ మనకు తెలుసు. కానీ మనం మాత్రం ఎలాంటి బాధలకూ, కష్టాలకూ గురికాకుండా ప్రశాంతంగా జీవిస్తూ ఉన్నత స్థానాన్ని అధిరోహించాలని ఆశించడం ఎంతవరకు సమంజసం?

సమాజంలో ఎవరితోనూ మనఃస్పర్థలు లేకుండా సహజీవనం సాగించాలన్నా, ఉన్నత ఆశయాలు సాధించాలన్నా సహనం చాలా ముఖ్యం. సహనం యొక్క ప్రాధాన్యత గురించి శ్రీరామకృష్ణులు ఇలా అన్నారు: 'జె సయె సే రయ్, జె నా సయె సే నాశ్ హయె – సహనం ఉన్నవారు మనుగడ సాగిస్తారు, లేనివారు నశిస్తారు'.

'సహనానికి మించిన సుగుణం లేదు' అని అంటారు శ్రీ శారదాదేవి. అరుదైన ఈ సుగుణాన్ని అలవరచుకోవడం అంత సులభమైన పనికాదని యోగి వేమన నొక్కివక్కాణించారు:

**బహుళకావ్యములను పరికింపగావచ్చు, బహుళశబ్దచయము బలుకవచ్చు**
**సహన మొక్కటబ్బ చాల కష్టంబురా, విశ్వదాభిరామ వినురవేమ**

'చాలా కావ్యాలను చదువవచ్చు, అనేక మాటలు నేర్చుకోవచ్చు. కానీ సహనం అలవరచుకోవడం చాలా కష్టం'.

అత్యంత కష్టతరమైన ఈ సహన గుణానికి ప్రతిరూపాలు సీతామాత, శారదామాత. పతితో సహజీవనమే పరమ ధర్మమని తలచి శ్రీరాముని వెంట పయనమైంది సీతామాత. పతిదేవుని సేవయే పరమ కర్తవ్యమని భావించి శ్రీరామకృష్ణుల సన్నిధికి చేరింది శారదామాత. వీరి జీవన ప్రయాణమంతా కష్టాల కడలిలోనే సాగింది. కష్టాలను ఎదుర్కోవడంలో అద్భుతమైన సహన శక్తిని ప్రదర్శించారు. అందువల్లనే వీరిద్దరూ ఆచంద్రార్కం మనకు ఆదర్శప్రాయులు, ఆరాధ్యనీయులు అయ్యారు.

సీతామాత–శారదామాతల జీవిత విశేషాలు సమరూపంగా ఉండడం గమనించవచ్చు. ఉదాహరణకు కొన్ని సన్నివేశాలను ఇక్కడ పరిశీలిద్దాం:

**పర్ణశాలలో ప్రశాంత జీవనం :** సీతామాత అంతఃపుర సుఖాలను త్యజించి శ్రీరామునితో అరణ్యవాసం చేసింది. అరణ్యవాస సమయంలో ఆకులుఅలమలే పంచభక్ష్య పరమాన్నాలు, కటిక నేలే హంసతూలికాతల్పం అయ్యాయి సీతమ్మకు. ఈ కష్టాలన్నింటినీ సహించి శ్రీరాముని సన్నిధిలో ప్రశాంత జీవనం సాగించింది సీతమ్మ.

శారదామాత శ్రీరామకృష్ణులకు సేవ చేయడం కోసం దక్షిణేశ్వరంలోని నహబత్‌లో నివసించింది. సీతాదేవి అరణ్యంలో శ్రీరాముని సన్నిధిలో 13 ఏళ్ళు నివసిస్తే, శారదాదేవి నహబత్‌లో 13 ఏళ్ళు నివసించి పతి సేవలో తరించింది. శారదాదేవి నివసించిన నహబత్ కాళ్ళు పూర్తిగా చాచుకోవడానికి కూడా కష్టంగా ఉండేంత చిన్న గది. ఈ గదిలోనే శ్రీరామకృష్ణులకూ, వారి శిష్యులకూ, భక్తులకూ భోజనాది సదుపాయాలను సమకూర్చడం, అందులోనే నిద్రపోవడం. నహబత్‌లో శారదమ్మ అసౌకర్యాలన్నింటినీ ఓర్చుకొని ఎలా జీవనాన్ని కొనసాగించిందో మన ఊహకు అందని విషయం.

పర్ణశాలలో శ్రీరాముని సన్నిధిలో ఉండే భాగ్యానికి నోచుకుంది సీతమ్మ. కానీ శారదమ్మ నహబత్‌లో నివసిస్తు న్నప్పటికీ శ్రీరామకృష్ణుల దర్శన భాగ్యం అరుదుగా లభించేది. శ్రీరామకృష్ణులు నివసించే గది నహబత్‌కు 75 అడుగుల

దూరంలోనే ఉండేది. కానీ శ్రీరామకృష్ణులు నిరంతరం భక్తుల సాంగత్యంలో భగవన్నామ సంకీర్తనాదులతో భావపరవశులై ఉండేవారు. శ్రీరామకృష్ణులను నహబత్ వసారా చుట్టూ కట్టిన వెదురు తడికల కన్నం నుండి దర్శించి ఆనందించేవారు శారదమ్మ. ఇన్ని కష్టాల్ని భరిస్తున్నప్పటికీ నహబత్‌లో గురుదేవుల సేవలో రోజులు గడుపుతున్నప్పుడు శారదమ్మ 'నా హృదయంలో ఆనంద కలశం ఉన్నట్లు అనుభూతి కలిగేది' అని అనేవారు. ఎనలేని కష్టాలను అనుభవిస్తూ కూడా ఆనందంగా జీవించారంటే అమ్మలోని సహనశక్తి ఎంత మహత్తరమైనదో వర్ణనాతీతం.

**అసుర గుణాల్ని పారద్రోలే సుగుణం :** అశోక వనంలో సీతమ్మ బంధింపబడినప్పుడు ఆమె పవిత్ర జీవనానికి ప్రభావితురాలైన త్రిజట మిగిలిన రాక్షసుల బారి నుండి సీతమ్మకు ఎలాంటి ఇబ్బందులు కలుగకుండా కాపాడేది.

శారదమ్మ ఒకసారి కాలినడకన జయరాంబాటి నుండి గంగా స్నానానికై వెళుతున్న మిగిలిన గ్రామ స్త్రీలతో కలకత్తా బయలుదేరింది. మార్గమధ్యంలో బందిపోటు దొంగలకు నిలయమైన ఒక ప్రాంతం ఉంది. ఆ దొంగల బారి నుండి తప్పించుకోవాలంటే చీకటి పడే లోపే ఆ ప్రాంతాన్ని దాటి వెళ్ళాలి. శారదాదేవితో ఉన్న బృందమంతా వేగంగా నడుస్తూ ముందుకు వెళ్ళిపోయింది. శారదాదేవి మాత్రం వెనకబడి పోయింది. అంతలో చీకటి పడింది. ఒంటరిగా ఉన్న శారదా దేవిని ఒక బందిపోటు దొంగ సమీపించి 'ఎవరది? ఇక్కడ ఎందుకు నిలబడి ఉన్నావు' అంటూ గర్జించాడు. శారదాదేవి ఆ దొంగను ఉద్దేశించి 'తండ్రీ! నేను దక్షిణేశ్వరంలో ఉన్న మీ అల్లుణ్ణి చూడడానికి వెళుతున్నాను. నన్ను అక్కడికి చేరేలా చూడండి' అని మృదుమధుర శైలిలో చెప్పింది. శారదమ్మ సరళ స్వభావానికి కఠిన హృదయుడైన బందిపోటు దొంగ కరిగి పోయాడు. తన ఇంటికి తీసుకువెళ్ళి శారదమ్మను కన్న బిడ్డలా ఆదరించాడు.

సీతమ్మ త్రిజటను ప్రేమ వచనాలతో మెప్పించి తన మిత్రురాలిగా చేసుకుంది. మిగిలిన రాక్షసులందరూ తనను వేధించినా వారిని నిందించకుండా సహనాన్ని ప్రదర్శించింది. అలాగే శారదమ్మ కూడా తన మృదు వచనాలతో బందిపోటు దొంగ హృదయాన్ని గెలుచుకుంది. తనతో వచ్చిన స్త్రీ బృందం తనను ఒంటరిగా వదిలి వెళ్ళినప్పటికీ వారిపై ఎలాంటి నిందారోపణలు చేయకుండా సహనగుణాన్ని ప్రదర్శించింది.

**అందరి క్షేమాన్ని కాంక్షించే విశాల హృదయం:** సీతామాత అశోక వనంలో ఉన్నప్పుడు రాక్షసులు ఆమెకు ఎన్ని ఇబ్బందుల్ని కలిగించినా వారి క్షేమాన్ని మాత్రమే కాంక్షించింది. శ్రీరాముడు అయోధ్యను పరిపాలిస్తున్నప్పుడు ప్రపంచంలో ప్రజలంతా క్షేమంగా ఉండాలని సీతమ్మ ప్రార్థించేది.

తోబుట్టువుల తగాదాలు, మరదళ్ళ వేధింపులు, మేనకోడళ్ళ మందలింపులు, భక్తుల శోకతాపాల మధ్య శారదమ్మ జీవనం సాగింది. సూర్యతాపాన్ని స్వీకరించి చల్లని వెన్నెల కురిపించే చంద్రునిలా శారదమ్మ కష్టాలన్నింటినీ సహించి అందరికీ సాంత్వన చేకూర్చేది.

ఇలా సీతమ్మ – శారదమ్మల జీవితాల్లో సమరూపంగా ఉన్న సన్నివేశాలు అనేకం. అయితే వీరిద్దరి జీవిత విశేషాలలో పోలిక కలిగి ఉండడానికి కారణం త్రేతాయుగంలో వెలసిన సీతామాతే, కలియుగంలో శారదామాతగా అవతరించడం. ఈ అవతార రహస్యాన్ని శారదమ్మే స్వయంగా రామేశ్వరుని సన్నిధిలో తెలిపింది.

శారదాదేవి కొంత మంది భక్తులు, శిష్యులతో కలిసి దక్షిణదేశ యాత్ర చేశారు. అప్పుడు పరమేశ్వరుని దర్శనార్థం రామేశ్వరం సందర్శించారు. రామేశ్వరాలయంలో శివలింగానికి



మాతృదేవి తన స్వహస్తాలతో అభిషేకం చేశారు. అభిషేకం ముగిసిన తరువాత శారదాదేవి భావపారవశ్య స్థితిలో 'పరమేశ్వరుడు అప్పుడు నేను ఉంచినట్లే ఉన్నాడు' అని అన్నారు. రావణ సంహారం తరువాత సీతాదేవి శ్రీరాముని సమేతంగా రామేశ్వరంలో సైకత లింగం ప్రతిష్ఠించి, అర్చించింది. త్రేతా యుగంలో శివుణ్ణి అర్చించిన ఆ సీతామాతే ఈ కలియుగంలో శారదామాతగా అవతరించినట్లు అమ్మ స్వీయవచనాలే నిదర్శనం. కాబట్టి **'పరమపావని చరిత కలియుగ సీత'** మన శారదమ్మ.

మన జీవిత పరమార్థాన్ని సాధించేందుకు కొంతైనా సహనాన్ని ప్రసాదించమని అనంత సహన సంపదకు నిలయమైన శారదమ్మను మనసారా ప్రార్థిద్దాం. ❖

# అర్థం-అనర్థం

ఆఫీసు నుండి అలసిపోయి వచ్చిన తల్లికీ ఆరేళ్ళ కొడుకుకీ మధ్య జరిగిన సంభాషణ:

కొడుకు : అమ్మా! నేను నిన్ను ఒక ప్రశ్న అడగవచ్చా?

తల్లి : అడుగు. ఏమిటా ప్రశ్న!

కొడుకు : అమ్మా! నువ్వు గంటకు ఎంత సంపాదిస్తావు?

తల్లి : (కోపంగా) ఇలాంటి విషయాలు నీకెందుకు?

కొడుకు : దయచేసి, చెప్పమ్మా! గంటకు ఎంత సంపాదిస్తావు?

తల్లి : (గర్వంగా) మరీమరీ అడుగుతున్నావు కాబట్టి చెబుతున్నాను. నేను గంటకు వంద రూపాయలు సంపాదిస్తాను.

కొడుకు : అమ్మా! నాకు యాభై రూపాయలు అప్పు ఇవ్వవా?

తల్లి : (కోపంగా) నేను కొనిచ్చిన బొమ్మలు సరిపోలేదా? అమ్మ దగ్గర అప్పు చేసి బొమ్మలు కొంటావా? నోర్మూసుకుని గదిలోకి వెళ్ళి పడుకో, ఎందుకు ఇలా తయారవుతున్నావు? నేను కష్టపడి పనిచేస్తున్నది నువ్వు డబ్బు దుబారా చేయడానికి కాదు.

ఆ అబ్బాయి బిక్కముఖం వేసుకుని తన గదికి వెళ్ళి పోయాడు. కొంతసేపు తర్వాత తల్లి శాంతంగా ఆలోచించింది. 'తన సంపాదన కుటుంబ సుఖ సంతోషాలకే కదా!' అనుకొని కొడుకు గదికి వెళ్ళింది.

తల్లి : బాబూ, నువ్వు నిద్రపోతున్నావా?

కొడుకు : లేదమ్మా, మేల్కొనే ఉన్నాను.

తల్లి : బాబూ నేను ఉదయం నుంచీ బాగా పనిచేసి అలసిపోవడంతో నువ్వు నన్ను అలా అడిగేటప్పటికి నాకు కోపం వచ్చింది. నీతో చాలా కఠినంగా మాట్లాడాను. ఇవిగో యాభై రూపాయలు తీసుకో.

పిల్లవాడు నవ్వుతూ "ధన్యవాదాలమ్మా!" అని డబ్బు అందుకున్నాడు. తన దిండు క్రింద నుండి కొన్ని నలిగిపోయిన నోట్లు, కొన్ని నాణాలు తీశాడు. పిల్లవాడు మెల్లగా డబ్బులు లెక్కపెట్టుకుంటున్నాడు. పిల్లవాడి దగ్గర అప్పటికే కొంత డబ్బు ఉండడంతో తల్లికి మళ్ళీ కోపం వచ్చింది. పిల్లవాడు డబ్బు లెక్క పెట్టి ఆనందంగా తల్లి వంక చూశాడు.

తల్లి : నీ దగ్గర డబ్బు ఉండి కూడా మళ్ళీ నన్నెందుకు అడిగావు?

కొడుకు : అమ్మా! ఇంతకు ముందు నాదగ్గర యాభైరూపాయలే ఉన్నాయి. నువ్వు ఇప్పుడిచ్చిన యాభైతో వంద రూపాయలయ్యాయి. ఇప్పుడు నేను నీ సమయంలో ఒక గంట కొనుక్కోగలను. రేపు నువ్వు తొందరగా ఇంటికి వస్తే కలిసి భోజనం చేద్దాం!

తల్లికి నోటమాట రాలేదు. కళ్ళుచెమ్మగిల్లాయి. అర్థం సృష్టించిన అనర్థం నుండి బయటపడి కొడుకుని అక్కున చేర్చుకుంది. ఇదండీ కథ!

ఆనందం, సంపూర్ణ స్వాతంత్ర్యం – ఇవి ప్రతి మనిషీ కోరుకునేవి. వీటి అన్వేషణలో మనకు 'డబ్బు' తారసపడు తుంది. ఈ 'డబ్బు'తో మనకు వచ్చిన ఆధిపత్యాన్ని 'స్వాతంత్ర్యంగా' భావిస్తాం! ఇంకేముంది – డబ్బే ఆనందం, డబ్బే సర్వస్వం!



ఆదిశంకరులు 'భజగోవింద స్తోత్రం'లో ఇలా అంటారు:

*అర్థమనర్థం భావయ నిత్యం, నాస్తి తతస్సుఖలేశ స్సత్యమ్।*
*పుత్రాదపి ధనభాజాం భీతిః సర్వత్రైషా విహితా రీతిః ॥*

'అర్థం అనర్థం, కొంచెం కూడా సుఖం లేదు– ఇది సత్యం. దీంతో సొంత బిడ్డ నుండి కూడా భయమే! ఇదే రీతి అంతటా!'

అర్థం అనర్థానికి దారితీయకుండా ఉండాలంటే ఏం చేయాలి? ధర్మ, అర్థ, కామ, మోక్షాలైన పురుషార్థాలను మనిషి సక్రమంగా గ్రహించినప్పుడు అతని జీవిత 'పరమార్థం' ఏమిటో బోధపడుతుంది. అప్పుడు అర్థం అనర్థం కాదు.

Money is not evil after all - in good hands - "మంచి చేతుల్లోని డబ్బేమీ చెడుకాదు" అంటారు స్వామి వివేకానంద. ❖



ఏసు ప్రభువు రూపంలో

# శ్రీరామకృష్ణులు

– స్వామి జ్ఞానదానంద

ఒకసారి క్రైస్తవ మతానికి చెందిన ప్రభుదయాళ్ మిశ్రా కలకత్తాలోని శ్యామ్‌పుకూర్‌లో శ్రీరామకృష్ణులను దర్శించడానికి వచ్చాడు. ఆ సంఘటన గురించి మణీంద్ర కృష్ణ గుప్తా ఇలా వివరించారు:

నల్లని చొక్కా, నల్లని టోపీ ధరించిన ఒక వ్యక్తి వచ్చి నన్ను ఇలా అడిగాడు: "అయ్యా! శ్రీరామకృష్ణ పరమహంసను దర్శించవచ్చునా?" అందుకు నేను, "అలాగే! నా వెంట రండి" అని అతణ్ణి గురుదేవుల గదిలోకి తోడ్కొని వెళ్ళాను.

కాసేపు మౌనంగా కూర్చున్న తరువాత ఆ వ్యక్తి, గురుదేవులతో ఇలా అన్నాడు: "మహాశయా! నేనొక క్రైస్తవుణ్ణి. చాలాకాలం ఏకాంతంలో క్రీస్తును ధ్యానించాను. నా ఇష్టదైవం ఏసుక్రీస్తే అయినప్పటికీ, నాకు యోగ శాస్త్రాలలో నమ్మకం ఉంది. సంసారంలోనే ఉంటూ అత్యున్నత ఆధ్యాత్మిక అనుభూతిని సంతరించుకొన్న వ్యక్తిని చూడాలనే ఆకాంక్ష ఒకసారి నాలో జనించింది. ఒక రోజు ధ్యానంలో ఉన్నప్పుడు నాకు ఇద్దరు వ్యక్తులు గోచరించారు. వారిలో ఒకరు అత్యున్నత ఆధ్యాత్మిక అనుభూతిని సంతరించుకొన్నారనీ, ఆయన పాదాల వద్ద ఆసీనులై ఉన్న రెండవ వ్యక్తి ఇంకా అత్యున్నత స్థితికి చేరకపోయినా అసామాన్యుడనీ నేను గ్రహించాను.

ఈ దర్శనానంతరం ఆ ఇద్దరినీ అన్వేషిస్తూ నేను అనేక ప్రాంతాలు గాలించాను. చిట్టచివరగా ఘాజీపూర్‌లోని పవహారీబాబా గురించి విని, ఆయనను చూడడానికి వెళ్ళాను. కానీ ధ్యానంలో గోచరించిన ఆ ఇద్దరు వ్యక్తుల పోలికలలో ఏ ఒక్కరిదీ ఆయనలో కానరాకపోవడంతో నిరాశ చెందాను. కానీ ఆ గదిలో ధ్యానంలో నాకు గోచరించిన ఆ ఇద్దరు వ్యక్తులలో ఒకరి చిత్తరువు గోడకు తగిలించి ఉండడం నా కళ్ళబడింది. పవహారీ బాబాని ఆ చిత్తరువు ఎవరిదని అడిగాను. ఆ చిత్తరువు శ్రీరామకృష్ణ పరమహంస వారిదని ఆయన చెప్పారు. ఆతురతతో బాబాగారిని, 'ఆయనను నేనెక్కడ చూడగలను?' అని అడిగాను. ఆయన అనేక సంవత్సరాలు దక్షిణేశ్వరంలో నివసించారనీ, కానీ ప్రస్తుతం అనారోగ్యం కారణంగా ఆయనను భక్తులు చికిత్సకై కలకత్తాకు తీసుకువెళ్ళారనీ బాబాగారు చెప్పారు. పవహారీ బాబాగారి సూచన మేరకు నేనిప్పుడు కలకత్తా వచ్చాను."

ఆ వ్యక్తి ఇంకా ఇలా చెప్పాడు: "మీరు చూస్తున్న ఈ దుస్తులు నేను మామూలుగా ధరించే దుస్తులు కావు." అలా అంటూ అతడు లేచి నిలబడి వెలుపలి దుస్తులు తొలగించగా, లోపల కాషాయాంబరాలు కనిపించాయి. తక్షణమే గురుదేవులు లేచి నిలబడి, క్రీస్తు చిత్తరువులో మాదిరి చేయి పైకెత్తి, సమాధిమగ్నులయ్యారు. అప్పుడు ఆ సన్న్యాసి చేతులు జోడించి గురుదేవుల వైపు వాలి, ఆయనను తదేకంగా చూడసాగాడు. ఆ సన్న్యాసి కళ్ళ వెంట నీరు ధార కట్టింది, ఉద్వేగంతో అతడు వణుకుతున్నాడు. ఆ ఇద్దరి ఆధ్యాత్మిక స్థితులకు ఆశ్చర్యపోతూ మేమంతా చూస్తూ నిలబడిపోయాం. కాసేపయ్యాక గురుదేవులు బాహ్య చైతన్యంలోకి వచ్చారు. వదనంలో ఆనందం ద్యోతకమవుతుండగా ఆ సన్న్యాసి మా వంక చూసి, "నేడు నా జన్మ తరించింది" అన్నాడు బిగ్గరగా.

తరువాత ఆయనను మేము ప్రక్క గదిలోకి తీసుకొని వెళ్ళాం. అక్కడ స్వామి వివేకానంద ఆయనకు ప్రసాదం ఇచ్చారు. చివరగా ఆ సన్న్యాసిని తన పారవశ్యానికి కారణం ఏమిటని ప్రశ్నించాం. అందుకు ఆయన ఇలా జవాబిచ్చాడు: "అనేక సంవత్సరాల పర్యంతం నేను ధ్యానిస్తూ ఉన్న వ్యక్తిని నేడు దర్శించుకోగలిగాను. నేను శ్రీరామకృష్ణునిలో క్రీస్తును దర్శించాను."

ఇలాంటి సంఘటననే ఒకసారి 'మ' వర్ణించారు: "మిస్సిర్ అనే వ్యక్తి భక్తిపరాయణుడైన ఒక క్రైస్తవుడు. గురుదేవులకు అతడంటే చాలా ఇష్టం; అతడితో భగవంతుణ్ణి గురించి మాట్లాడేవారు. గురుదేవులు అతడికి క్రీస్తును చూపించారు. తదనంతరం అతడు గురుదేవులే క్రీస్తు అని గ్రహించాడు."❖



# శ్రీ శారదారాధనం

## ధ్యానమ్

**శ్రీ శారదాం పరమపావన పాదపద్మాం**
**శ్రీ షోడశీం పరమహంస సమర్చితాంఘ్రీం**
**శ్రీ మంత్రరాజ పరదైవత మాదిలక్ష్మీం**
**ఆవాహయామి మనసా శిరసా నమామి**

ఓ శారదమ్మా! తల్లీ! అతి పవిత్రమైన నీ పాద పద్మాలను నా హృదయంలో నిలుపుకొంటున్నాను. శ్రీరామకృష్ణ దేవులు నిన్ను శ్రీషోడశీ మహావిద్యగా భావించి, ధ్యానించి, దర్శించి నీ పాదపద్మాలను పూజించారు.

శ్రీశక్తిమంత్రానికి పరదైవతమైన ఆదిశక్తివి నీవు. నిండు మనస్సుతో నీ సన్నిధిని భావిస్తున్నాను. శిరస్సు వంచి ప్రణమిల్లుతున్నాను. పంచజ్ఞానేంద్రియాలను నీ వశం చేస్తున్నాను.

**త్వాం భావయామి మనసా మనసః మలఘ్నీం**
**త్వామర్థయామి కురు సన్నిధి మద్య మాతః**
**త్వా మర్చయామి హృదయే హృదయప్రతిష్ఠే**
**శ్రీశారదే కురు కృపాం మయి మాతృదేవి**

'మనస్సులోని మాలిన్యాలను నశింపజెయ్యి తల్లీ!' అని నిన్ను మనసారా ప్రార్థిస్తున్నాను. తల్లీ! ఇప్పుడు నీ సన్నిధి భాగ్యం నాకు ప్రసాదించాల్సిందిగా వేడుకొంటున్నాను. నా హృదయంలో నెలకొని ఉన్న నిన్ను అర్చిస్తున్నాను. అమ్మా! మాతా! శ్రీశారదమ్మా! నన్ను దయతో చూడు తల్లీ!!

**ఆకారయామి తవ రూప మనన్య చిత్తః**
**ఆకర్ణయామి తవ నామ మహాదరేణ**
**ఆస్వాదయామి తవ నామ సుధా ప్రసారం**
**మాం పాలయ ప్రియతమం సుత మల్పభాగ్యం**

వేరే తలపులు లేని చిత్తంలో నీ రూపాన్ని చిత్రించుకొంటున్నాను. నీ నామాలను అతి శ్రద్ధతో వింటున్నాను. నీ నామ మాధుర్యాన్ని ఆస్వాదిస్తున్నాను. నీ దర్శన భాగ్యానికి నోచుకొని నీ ప్రియపుత్రుణ్ణి దయ చూపి పాలించవమ్మా!

**ధ్యాయామి దేవి తవ పాద హిరణ్య శోభాం**
**హృత్పద్మ విజ్వల దనాహత విద్యుదాభాం**
**ఆజ్ఞాంతరాళ శివశాంభవ చంద్రకాన్తిం**
**శాన్తే సహస్రదళ పద్మ పదం నయస్వ**

ఓ శారదాదేవీ! నీ పాదాల నుండి ప్రసరించే బంగారు కాంతులను చిత్తంలో ధ్యానిస్తున్నాను. హృదయంలో మెరిసే కాంతులను ధ్యానిస్తున్నాను. భ్రూమధ్యం నుండి శివసంబంధమైన చంద్రకాంతిని ధ్యానిస్తున్నాను. ఓ తల్లీ! నన్ను సహస్రార పద్మానికి చేర్చి అనుగ్రహించు!

**మృగశిరసి ససోమే శారదాం శుద్ధ విద్యాం**
**లలిత మధురవాచా సర్వ మహ్లాదయన్తీం**
**గురు గురు పదకార్యం లీలయా నిర్వహంతీం**
**తులసి దళ సువర్ణైః నవమృదు శుభబిల్వైః అర్చయామి ప్రసన్నాం**

చంద్రునితో కూడిన మృగశిరా నక్షత్రంలో (మార్గశిర పూర్ణిమ)శుద్ధ విద్యారూపిణియై, మృదు మధురాలాపాలతో అందరినీ ఆనందపరవశులను చేసే తల్లీ! ఆధ్యాత్మ విద్యను ప్రసాదించి గురుస్థానాన్ని అవలీలగా నిర్వహించే తల్లీ! నిన్ను మృదువైన బిల్వపత్రాలతో, తులసీ దళాలతో అర్చిస్తాను. తల్లీ! ప్రసన్నురాలవై నా పూజ స్వీకరింపుము!! ❖ – శ్రీ విష్ణుభట్ల విరచిత



# దేవీ వైభవం



ప్రవచనం: **శ్రీ సామవేదం షణ్ముఖశర్మ** విలేఖనం: **శ్రీమతి ఎన్. శేషు**

**(...గత సంచిక తరువాయి)**

“అమ్మ దుర్గమాయమ్మ కృపాబ్ధి” అన్నారు. ‘కృపాబ్ధి’ అన్నది గొప్ప విషయం. దయలో సముద్రం లాంటిది. అపారమైన దయ కలిగినటువంటిది తల్లి; కృపాబ్ధి అయిన ఆ తల్లికి నమస్కరిస్తే ఏమిస్తుంది!... “మహత్వ కవిత్వ పటుత్వ సంపదల్” – మహత్వము, కవిత్వము, పటుత్వము, సంపద... ఈ నాలుగూ ఇస్తుంది అమ్మ దుర్గ.

ప్రతీవాడూ మహత్వం కోసం తాపత్రయ పడతాడు; అమ్మ ఆ గొప్పతనాన్ని ఇస్తుందట. వేదమే “సమానానాం ఉత్తమ శ్లోకోస్తు!” అంటోంది. ‘ఏ రంగంలో ఉన్నా ఉత్తమ శ్లోకుడిగా ఉండు’ అంది. ఉత్తమ శ్లోకుడిగా ఉండడమే మహత్వం. ఆ మహత్వం తల్లి ఇచ్చిన శక్తి అని తెలుసుకున్నవాడు ధన్యుడవుతాడు.

రెండోది కవిత్వం – ఇక్కడ కవిత్వమంటే బుద్ధి శక్తి అని అర్థం; ఇది సరిగా పని చెయ్యకపోతే దేనికీ పనికిరారు. అన్నిటికీ మించిన పెద్ద సంపద బుద్ధిశక్తే. వాగ్బుద్ధి జ్ఞానాధిష్ఠాత్రి అయిన సరస్వతి అనుగ్రహం చేత వాక్కు, బుద్ధి, జ్ఞానం పనిచేస్తాయి. అందుకే కవిత్వం అంటే శబ్దస్వరూపిణి అయిన సరస్వతీ అమ్మవారి అనుగ్రహం.

తరువాతివి పటుత్వం, సంపద. శరీరంలోని ప్రతీ ఇంద్రియమూ పటువుగా పనిచెయ్యాలి. శక్తి, పరాక్రమం, ప్రతాపం లాంటివి ఉండాలి; అందుకు కావలసినది పటుత్వం. ఇదంతా బాగా పని చెయ్యాలంటే కావలసినది సంపద. ఇవన్నీ అమ్మవారు ఇస్తుంది.

మహత్ శబ్దం బ్రహ్మవాచకం, అలా అని తెలియచేసే బీజాక్షరం “ఓం”. రెండవది కవిత్వం. కవిత్వానికి అధిష్ఠాత్రి వాక్స్వరూపిణి అయిన జగదంబిక, ఆ బీజాక్షరం “ఐం”. తరువాత పటుత్వం! అంటే శక్తి. శక్తి బీజం “హ్రీం”. సంపద అంటే “శ్రీం” అనే బీజం. మహత్వ కవిత్వ పటుత్వ సంపదలంటే ‘ఓం ఐం హ్రీం శ్రీం’ అనే నాలుగు బీజాక్షరాలు. ఇవి లలితా మహాత్రిపురసుందరి యొక్క బీజాక్షరాలు. ఆ దుర్గ అయిన పరాశక్తి లలితా మహాత్రిపురసుందరి ఓంకార ఐంకార హ్రీంకార శ్రీంకార బీజస్వరూపిణి అయిన జగదంబిక... అమ్మలగన్నయమ్మ. అలా అందమైన ఈ (అమ్మలగన్నయమ్మ....) పద్యంలో పోతనగారు ఎన్నో రహస్యాలు పెట్టారు. ఆయన రాముడికి అర్పించి వ్రాశారు కనుక పలికిన వచనాలన్నీ పరాశక్తి వచనాలే అవుతాయి. ఆయన “అమ్మా! ఇంత మహాకావ్యం వ్రాయాలంటే నా వల్ల అవుతుందా? నువ్వు ఆధారం లేకపోతే నేను వ్రాయలేను” అన్నారట!

*పుట్టం, బుట్ట, శిరంబునన్ మొలవ నంభోయాన పాత్రంబునన్*
*నెట్టం గల్గను, గాళిఁ గొల్వను, బురాణింపన్ దొరంకొంటి మీఁ*
*దెట్టే వెంటఁ జరింతు దత్సరణి నా కీవమ్మ! యో యమ్మ! మేల్*
*పట్టున్ నాకగుమమ్మ! నమ్మితిఁ జుమీ బ్రాహ్మీ! దయాంభోనిధీ!*

అన్నారు పోతన. “నువ్వే నన్ను పలికించాలి” అన్నాక ఆవిడ ఇలాంటి పలుకులు కాకపోతే ఎలాంటివి పలికిస్తుంది! ఇందులోని బీజాక్షరాలు కూడా ఆయన పెట్టినవి కావు అమ్మ ఆయనచేత పెట్టించింది. శబ్దాలన్నీ మన నుంచి వస్తాయి తప్ప మన వల్ల రావు. అదే అహంకారం వదులుకో అని చెప్పిన పాఠం.

ధనుస్సు నుండి బాణాలు వచ్చాయి కానీ దాన్ని ప్రయోగించిన వాడు...ఆ ధానుష్కుడొకడున్నాడు. అలాగే మనం ధనుస్సుల్లాంటి వాళ్ళం. అయితే మన నుండి వచ్చే ప్రతి మాట తీరునూ ప్రయోగించే ఒక శక్తి ఉంది. దాన్ని పరిశీలించాలి. ధనుస్సు శరీరం, దాని నుండి వ్యక్తమయ్యే ఇంద్రియాల చైతన్యం బాణాలు. వీటికి మూలంగా బాణాల్ని సంధించే పరమాత్మ చైతన్యమే అమ్మ. ఇది తెలుసుకుంటే మన నుంచి వెలువడేవీ, ప్రపంచం నుండి వెలువడేవీ... సర్వ శక్తులూ అమ్మ యొక్క శక్తులే అన్నారు. బాణం ఊరకే తెచ్చి గుచ్చుకుంటే నెత్తురు ఒక్క చుక్క కూడా రాదు. అదే ప్రయోగించి బాణం కొడితే మనిషి ఎగిరి పోతాడు; ఎందుకంటే అమ్మ ప్రయోగించిన శక్తి ఉంది అందులో. అందుకే ప్రకృతి శక్తులన్నీ జడీభూతములు, ఇంద్రియ శక్తులన్నీ జడీభూతములు. ఈ ఇంద్రియ శక్తుల ద్వారా, ప్రకృతి శక్తుల ద్వారా, మన జీవితమనే ధనుస్సు ద్వారా అమ్మ ఎన్ని శక్తులు ప్రకటిస్తుందో తెలుసుకుంటే ఆ అసలు శక్తి... పరాశక్తి చరణాలను ఆశ్రయిస్తాం, ఆ ఏకత్వాన్ని దర్శిస్తాం. అమ్మ బీజాక్షరాలకు అంత పేరుంది; అమ్మ నామాలకు అంత పేరుంది. ఆ రహస్యాన్ని మనకు ‘దేవీ భాగవతం”చక్కగా వివరిస్తుంది. ❖ **(సశేషం)**



# పరమేశ్వరుని పరిరక్షణలో ...

## స్వామి జపానంద స్వీయ అనుభవాలు -30

# లోభానికి ఫలితం

సింధుప్రాంతంలో కరాచీ పెద్ద రేవు, పెద్ద నగరం, చాలా మంది ధనవంతుల నివాసస్థానం. స్వామి జపానంద పంజాబ్ నుంచి హైదరాబాదు (పాకిస్తాన్), అక్కడ నుంచి కరాచీ వెళ్ళారు. కరాచీలో కొంతకాలం సాధుబేలా ఆశ్రమంలో ఉన్న తరువాత బందర్ రోడ్డు ఎక్స్‌టెన్షన్‌లో ఒక సింధీ వ్యాపారి కొత్తగా కట్టిన ఇంట్లో ఉన్నారు. అప్పుడు అక్కడ హిందువులకు మూడు ఇళ్ళు మాత్రం ఉండేవి. ఇంకా ఇళ్ళు కడుతున్నారు. కరాచీలో స్వామీజీకి చాలామంది సింధీ సజ్జనులతో పరిచయం అయింది. వారిలో ఇద్దరు ముగ్గురు భక్తులు క్రమం తప్పకుండా సన్యాసిని దర్శించడానికి వచ్చేవారు. వారంతా వేదాంత చర్చలు చేసేవారు. ముఖ్యంగా విచారసాగరం గురించి చర్చించుకునేవారు. ఆ చర్చలో వారంతా ఆనందం పొందేవారు.

ఒకరోజు ఒక భక్తుడు స్వామి జపానందను ఏకాంతంలోకి తీసుకెళ్ళి "మహరాజ్! ఒక ఫకీరు ఈ ఊరు వచ్చాడు. అతనికి బంగారం తయారు చెయ్యడం వచ్చు. రాగిని బంగారంగా మార్చేస్తాడు. కొన్ని రకాల మూలికల రసం తీసి, రాగిలో కలిపి, బట్టీలో వేసి కాలిస్తే అది బంగారం అవుతుంది" అన్నాడు. వెంటనే స్వామీజీ "అదంతా నమ్మకు. ఆ విధంగా వాడు జనాలను మోసం చేస్తున్నాడు. ఆ గొడవలో నువ్వు పడకు. ఆ ఫకీరుకు నిజంగా బంగారం చెయ్యడం వస్తే అతను అలా ఫకీరు జీవితం ఎందుకు గడుపుతాడు? ఇలాంటి మనుష్యులకు దూరంగా ఉండు" అన్నారు. ఆ భక్తుడు "స్వామీజీ! అతను బంగారం చేసి అందరికీ చూపిస్తున్నాడు. అది నిజమే. ఇదివరకు కూడా ఆ విధంగా బంగారం చేసేవారు కదా!" అన్నాడు.

అందుకు స్వామీజీ "నిజం అవవచ్చు కానీ మోసగాళ్ళకు దూరంగా ఉండాలి" అన్నారు. ఆ విధంగా సంభాషణ జరిగాక ఆ సింధీ భక్తుడు వెళ్ళిపోయాడు. ఆ తరువాత అతను చాలా రోజులు రాలేదు. ఏదో పని ఉండి ఉంటుంది. లేకపోతే ఆరోగ్యం బాగులేదేమో అని స్వామీజీ అనుకున్నారు.

ఒకరోజు అతని మిత్రుడొకడు స్వామీజీ దగ్గరకు వచ్చి ఇలా చెప్పాడు: "మహరాజ్! నా మిత్రుడు పిచ్చివాడైపోయాడు. మీకు తెలిసే ఉంటుంది. కొంత కాలం క్రితం అతనికి ఒక ఫకీరుతో పరిచయమైంది. ఆ ఫకీరు నా మిత్రుని దగ్గర ఉన్న బంగారం ఇస్తే దాన్ని రెండింతలు చేసి ఇస్తానని చెప్పి ఒక గిన్నెలో అతని భార్య నగలన్నీ వేసి అందులో రాగి వస్తువులు కొన్ని వేసి బట్టీలో పెట్టాడు. అలా అక్కడ వారం రోజుల పాటు ఆ పనిలోనే ఉన్నట్లు ఉండి ఒక రోజు బంగారం అంతా తీసుకుని ఎక్కడికో పారిపోయాడు. ఫకీరు పారిపోయాడని తెలుసుకుని నా మిత్రుడు గిన్నె తీసి చూస్తే అందులో రాళ్ళు రాగివస్తువులు ఉన్నాయి. బంగారం మాయం అయిపోయిందని తెలియగానే ఇంట్లో గోల, ఏడుపులు, గొడవలు అయ్యాయి. వ్యాపారంలో వరుసగా నష్టాలే వస్తున్నాయి. ఏడెనిమిది వేల దాకా



అప్పులున్నాయి. పైగా బంగారం పోవడంతో అతను పిచ్చివాడైపోయాడు. ఇంట్లో వాళ్ళు అతణ్ణి ఇంటికి రానివ్వడం లేదు. పిచ్చివాడిలా వీధుల్లో తిరుగుతూ ఉంటే స్నేహితులు, పరిచితులు చూసి పిలిచి తినడానికి ఏమైనా పెడితే తింటాడు".

ఈ విషయం తెలుసుకుని జపానందజీ చాలా బాధ పడ్డారు. వద్దని చెప్పినా ప్రలోభంతో అతను ఈ అవస్థ తెచ్చుకున్నాడు. అతని పరిస్థితి బాగుపడాలంటే ఏం చెయ్యాలా అని ఆలోచించారు.

స్వామీజీ గురునామల్ అనే వ్యాపారి ఇంట్లో ఉన్నారు. అతని పుత్రుడు మంచి స్వభావం కలవాడు. అతనికి స్వామి

అంటే చాలా గౌరవం. అతని ద్వారా తెలిసింది సింధీ వ్యాపారి బట్టల వ్యాపారం కోసం ఏడువేలు విలువ చేసే సరుకు తీసుకెళ్ళాడు. కానీ ఆ సొమ్ము వాళ్ళకు తిరిగి ఇవ్వలేక పోయాడు. అందుకని అందరూ అతనికి మళ్ళీ సరుకు ఇవ్వడానికి నిరాకరించారు. ఆ విధంగా వ్యాపారం మూతబడి పోయింది.

స్వామీజీ "అతణ్ణి రక్షించాలి కదా! బాధ భరించలేక పిచ్చివాడైపోయాడు. మీకు అతను బంధువే కదా! మీరందరూ కొంచెం జాలి, దయ చూపించండి. భగవంతుడి కృప వల్ల మీరంతా సుఖంగా ఉన్నారు. మీ దగ్గర చాలా ధనం ఉంది. పదివేల రూపాయలు మీకు లెక్కలోవి కావు" అన్నారు. గురనామల్ పుత్రుడు "మేము ఏమి చెయ్యగలం మహరాజ్! మా డబ్బు మేము అడగకపోయినా మిగిలిన వాళ్ళు వదులుకోరు కదా!" అన్నాడు.

అందుకు స్వామీజీ బదులిస్తూ, "నేను, మీ డబ్బు వదులుకోమని అనలేదే. మీరైనా, మీ తోటి వ్యాపారస్తులైనా మీ డబ్బు అంతా వసూలు అయ్యేదాకా ఆ దుకాణం మీ అధీనంలోనే ఉంచుకోండి. మీ అప్పులు తీరిపోయాక అతని దుకాణం అతనికి ఇచ్చెయ్యండి. అతని ఇంటి ఖర్చులకు సరిపడే డబ్బు ప్రతి నెలా అతని భార్యకు ఇవ్వండి. అతను దుకాణానికి వస్తే రానివ్వండి. పని చెయ్యనివ్వండి. అతని పెద్ద కొడుకు వయసు సుమారు 12 సంవత్సరాలు ఉంటుంది. ఆ అబ్బాయిని దుకాణంలో కూర్చోనివ్వండి. ఆ విధంగా చేస్తే అతని మానసిక పరిస్థితి బాగుపడుతుంది అని నేను అనుకుంటున్నాను. ఈ పని మీరు చెయ్యగలరా" అన్నారు.

"నేను మా అన్నలతో మాట్లాడి చూస్తాను. మా నాన్నగారు హైదరాబాదు వెళ్ళారు. ఈ సాయం మేము చెయ్యగలం" అన్నాడు అతను.

మూడు నాలుగు రోజులలో జపానందజీ చెప్పిన విధంగా ఏర్పాటు జరిగింది. అతనికి అప్పు ఇచ్చిన వాళ్ళందరూ అతని బంధువులే. అతని దైవభక్తి, సాధు సన్యాసుల పట్ల ఉన్న గౌరవం చూసి అతనంటే అందరికీ మంచి అభిప్రాయం ఉండేది. అతని స్థితికి అందరూ బాధపడుతున్నారు. వాళ్ళందరూ కూడా ఈ ఏర్పాటుకు అంగీకరించారు. స్వామి చెప్పినట్లు అతని భార్యతో మాట్లాడి దుకాణం వాళ్ళ అధీనంలో ఉంచుకుని వ్యాపారం కొనసాగించారు. ఇందులో ఎవరికీ ఏ ఇబ్బందీ కలగలేదు. వచ్చిన లాభాల్లో కొంతభాగం వాళ్ళ అప్పు కింద తీసుకున్నారు. ఈ ఏర్పాటు వల్ల సింధీ వ్యాపారికి ఆరోగ్యం చేకూరింది. ధైర్యం వచ్చింది.

ఆ వ్యాపారి తన మిత్రునితో కలిసి స్వామిని చూడడానికి వచ్చాడు. రాగానే సన్న్యాసి కాళ్ళ మీద పడి కంటతడి పెట్టుకున్నాడు. "మీరు వద్దని చెప్పినా మీ మాట వినకుండా బంగారం మీద వ్యామోహంతో ఈ పనిచేశాను. దాని ఫలితం అనుభవిస్తున్నాను" అన్నాడు.

"జరిగినదేదో జరిగిపోయింది. ఇంక జాగ్రత్తగా నీ వ్యాపారం చూసుకో. నీ భార్యతో తగువు పెట్టుకోకు. నిన్ను వాళ్ళు ఇంట్లోంచి బయటికి పంపించివేశారన్న విషయం మరిచిపో! ఏమీ జరగనట్లే నీ పని చూసుకో" అని స్వామీజీ సలహా ఇచ్చారు. అతను తలవంచుకుని అంతా విని ఇంటికి వెళ్ళిపోయాడు. మనుష్యుల్లో మానవత్వం అంటే ఇదే! ❖

**అనువాదం : శ్రీమతి జి.ఎస్.లక్ష్మి**

## నిజంగా మన శ్రేయస్సుకోరే వాడు...

అందరికీ భగవంతుడే గతి. భగవంతుడే గమ్యం. నీ హృదయంలో ఎల్లప్పుడూ ఆయన్ని ధ్యానిస్తూ ఉండు. విచారించకు. సర్వం ఆయన సానుకూలపరుస్తాడు. భగవంతుడు నిన్ను ఎక్కడ ఉంచినా, నీ మనస్సు ఎల్లప్పుడూ ఆయన మీదే ఉండాలని ప్రార్థించు.

నిన్ను ఆయన ఏ విధంగా ఉంచినా అది నీ మేలు కొరకే. హాఫీజ్ అనే సూఫీ కవి ఇలా చెప్పాడు : "నేను పేదరికపు దుమ్ములో పొర్లడాన్ని చూడడం నా ప్రియునికి సంతోషమైనప్పుడు, నేను నా దృష్టిని స్వర్గంలోని సరోవరం మీదికి మరల్చితే, నిజంగా నేను ముందుచూపు లేని వాణ్ణే." భగవంతుడు ఎక్కడ ఉంచినా ఎల్లప్పుడూ సంతృప్తి చెందడం మంచిది. ఆయన సర్వశ్రేయస్కరుడు, సర్వజ్ఞుడు. మనకు ఏది మంచిదో అది ఆయనకు తెలుసు. ఆ ప్రకారమే ఆయన ఏర్పాటు చేస్తాడు. కానీ, మన ఇష్టప్రకారమే జరగాలని కోరుతూ మనం గందరగోళాన్ని సృష్టిస్తున్నాం.

"ఓ దేవా! నేను ఎక్కడున్నా, ఎలావున్నా నిన్ను ఎన్నడూ మరువకుందును గాక!" అని హృదయపూర్వకంగా భగవంతుణ్ణి ప్రార్థించు. నీకు ఏది శ్రేయస్కరమో దాన్ని ఆయన సమకూర్చుతాడు. ❖ **– స్వామి తురీయానంద**

# మనస్సు - ఉపశమనము

శ్రీవశిష్ఠమహర్షి : ఓ రామచంద్రా! ఈ మనస్సును గమనిస్తున్నావా? ఇది అత్యంత ఉత్సాహంగా ఉరకలు వేస్తూ విషయాల వైపుకే పరుగులు తీస్తుంది. ఈ సంసారం జీవుని పట్ల విజృంభించడానికి కారణం మనస్సే సుమా! ఫలితమేమిటి? ఈ జీవుడు నిరంతరం సమస్త దుఃఖాలనూ, ఆపదలనూ పొందుతున్నాడు.

ఇందుకు ఉపాయం మనోనిగ్రహమే. ఇప్పుడు జ్ఞాన సర్వస్వాన్ని ఒక వాక్యంలో చెపుతాను...

**"భోగేచ్ఛా మాత్రకోబంధ స్తత్త్యాగో మోక్ష ఉచ్యతే"**

విషయభోగాల పట్ల ఆసక్తి కలిగి ఉండడమే బంధం. అటువంటి ఆసక్తిని పరిత్యజించడమే మోక్షం.

అనేక రకాలైన బోధల అవసరమేముంది? ఈ ఒక్క విషయం ఆచరించు, చాలు:

"ఈ ప్రపంచంలో ఏయే వస్తువులు ప్రీతిమంతంగా తోస్తాయో, ఆ యా విషయాలను, లేక వస్తువులను విషంలానో, అగ్నిలానో చూడడం!"



మళ్ళీ మళ్ళీ విచారణ చేస్తే "ఈ విషయ భోగాలు ప్రమాదకరమైనవి" అనే విషయం తెలుస్తుంది. అందువల్ల, ముందుగానే ఆ నిశ్చయం కలిగి ఉండాలి. భోగవాసనలు త్యజించు. భోగవాసనలను త్యాగం చేసి విషయాలను సేవిస్తే అప్పుడు అవి సుఖప్రదాలే అవుతాయి.

ముళ్ళతీగ విత్తు నుండి ముళ్ళపొద పుడుతోంది కదా! వాసనాగ్రస్థమైన బుద్ధి నుండి 'రాగము' మొదలైన అనేక దోషాలు ఉత్పన్నమవుతున్నాయి. ఎవరి బుద్ధి అలాంటి వాసనాజాలంలో తగులుకోకుండా, రాగ-ద్వేష రహితంగా అచంచలంగా ఉంటుందో, అట్టి బుద్ధి మాత్రమే పరమ శాంతిని పొందుతోంది.

ఓ రామా! ఇదంతా 'భావము'లోనే ఉదయించడం జరుగుతోంది సుమా! కనుక ఉత్తమ భావానుసంధానం చేతనే మనస్సు ప్రశాంతతను పొందుతుంది. ఆ ఉత్తమ భావాలు ఉన్నచోట అజ్ఞానం అనే దట్టమైన మేఘం క్రమంగా నశించగలదు. సౌజన్యం శుక్లపక్ష చంద్రునిలా వృద్ధి చెందగలదు. వివేకం సూర్యతేజంలా ప్రకాశిస్తుంది. అలాంటి వ్యక్తి ఆత్మవస్తువును పొందుతాడు. ఆత్మ లాభం వల్ల హృదయంలో ధైర్యం, ప్రశాంతత, పరమానందం వృద్ధి పొందుతాయి. ఆ వ్యక్తి కృతార్థుడవుతాడు. ఈ మార్గంలో అత్యంత శోభను కలుగజేయగలిగేది సత్సాంగత్యం. వివేకం వృద్ధి చెందుతున్నప్పుడు ఏకాగ్రత అనే దాని నుంచి 'సచ్చిదానందం' అనే శ్రేష్ఠరసం ప్రవహిస్తూ ఉంటుంది. ఆత్మను గురించిన అవగాహన ధ్రువపడుతుండగా, మనస్సు నిర్ద్వంద్వమై, నిష్కామం, ఉపద్రవ రహితం అవుతుంది. క్రమంగా తన చపలత్వాన్ని త్యజిస్తుంది. శోక-మోహ-భయ-వర్జితమవుతుంది. సంశయరహితమవుతుంది.

**ఇచ్ఛా దోష రాహిత్యం**

ఓ రాఘవా! "నేను విషయాలను, వైచిత్ర్యాలను దర్శించాలి... పొందాలి" అనే కోరిక ఈ మనస్సుకు ఎప్పుడూ ఉంటుంది. ''నేను ఏదో పొందాలి...'' అనే భావోద్వేగాన్ని నీ మనస్సు నుండి తొలగించాలి. అప్పుడు ఈ మోహకల్పనా జాలమంతా క్రమంగా తొలగిపోతుంది. ఈ మనస్సును నిర్లిప్తంగా, ఆశావర్జితంగా చేయాలి. ''ప్రవృత్తి'' పట్ల ప్రమేయ రాహిత్యం, సంసర్గ రాహిత్యం అలవాటు చేయాలి.

ఎప్పుడైతే ఈ 'మనస్సు' తృష్ణ, సంశయాలతో నిండి ఉంటుందో, ఆ జీవుణ్ణి 'స్థూలదేహ భావం' అనే దెయ్యం పట్టుకుంటుంది.

ఈ మనస్సు నుండి స్థూలత్వాన్ని తొలగించుకుంటే అది ఈశ్వర స్వరూపం అవుతుంది. అప్పుడు "ప్రత్యగాత్మత్వం" అనే జీవన్ముక్తి లభిస్తుంది. అందుచేత ఈ మనస్సును స్వసామర్థ్యంలో - నిగ్రహంలో నియమించు. అప్పుడది తనకు ఏ మార్గం దుఃఖభరితమో, ఏ మార్గం అనుసరణీయమో, ఏది 'స్వస్వరూపానందాన్ని' ప్రసాదించగలదో గ్రహిస్తుంది. ❖

('శ్రీవసిష్ఠ రామ సంవాదం' - స్థితి ప్రకరణము నుంచి)

**అనువాదం : వై. హెచ్.రామకృష్ణ**

# ఎల్లప్పుడూ ముందుకే సాగండి!

మానవజాతి భారతదేశంలోనూ, ఇతర దేశాలలోనూ అభివృద్ధిపరచిన ఉత్తమ భావాలను సామాన్యులు, పేదల దగ్గరకు తీసుకువెళ్ళాలనేదే నా జీవిత ఆశయం. కులం ఉండాలా, అక్కర్లేదా? స్త్రీలు స్వతంత్రులా లేక అస్వతంత్రులుగా ఉండాలా? అనే వాటితో నాకు సంబంధం లేదు. ప్రధానమైన జీవిత సమస్యలను గురించి మన పూర్వీకులు, ఇతర దేశాల వారు ఏమి ఆలోచించారో, ఆ విషయాలను వారికి తెలియజేయండి. ముఖ్యంగా ఇతరులు ఏమి చేస్తున్నారో చూసిన తరువాత, వారిని నిర్ణయించుకోనివ్వండి. రసాయన పదార్థాలను ఒకచోటుకు చేర్చడమే మన పని. స్ఫటికీకరణం ప్రకృతే, దాని విధానాలను అనుసరించి తీరుతుంది. కష్టించి పని చేయండి. స్థైర్యంగా ఉండండి. భగవంతుని పట్ల విశ్వాసం కలిగి ఉండండి.

దేశం గుడిసెలలో జీవిస్తోందని మరువవద్దు. అయ్యో! వారికి ఎవ్వరూ ఏ సాయం చేయలేదే! కానీ ఆధునిక సంస్కర్తలు వితంతు వివాహాలలోనే తీవ్రంగా మునిగి ఉన్నారు. నేను ప్రతి సంస్కరణనూ సానుభూతితో చూస్తాను. కానీ దేశ పరిస్థితి ఎందరు వితంతువులకు భర్తలు లభించాలి అనే దానిపై ఆధారపడి ఉండదు. జనసామాన్యపు స్థితిగతులపైనే అది ఆధారపడి ఉంటుంది. మీరు జన సామాన్యాన్ని ఉద్ధరించగలరా? వారి స్వభావ సిద్ధమైన ఆధ్యాత్మిక స్వభావాన్ని కుంటుపరచక, వారు కోల్పోయిన వ్యక్తిత్వాన్ని తిరిగి వారికి ప్రసాదించగలరా? సమత్వంలోనూ, స్వాతంత్ర్యంలోనూ, కార్యదక్షత లోనూ, శక్తిలోనూ పాశ్చాత్యులందరి కన్నా మీరు పాశ్చాత్యులు కాగలరా? అదే సమయంలో ఆధ్యాత్మిక సంస్కృతిలోనూ, స్వభావాలలోనూ మీరు పరిపూర్ణమైన హిందువులుగా ఉండగలరా? వారిని ఈ విషయాన్ని గురించి స్వయంగా ఆలోచించనివ్వండి. వర్ణ వ్యవస్థ ఉండాలా, లేదా? స్త్రీలకు పూర్తి స్వాతంత్ర్యం కావాలా, లేదా? అనే దానితో నాకు సంబంధం లేదు. 'జీవితానికి గానీ, అభివృద్ధికి గానీ, సంక్షేమానికి గానీ ముఖ్యంగా కావలసింది - ఆచరణ లోనూ, ఆలోచనలోనూ పూర్తి స్వాతంత్ర్యమే; అది ఎక్కడ లోపిస్తే, అక్కడ ఆ మానవుడు, ఆ జాతి, ఆ దేశం పతనమై తీరుతాయి.



ఉత్తమ భావాలను ఇంటింటికీ కొనిపోయే ఒక యంత్రాంగాన్ని స్థాపించడమే చేయవలసిన పని. దానిని మనం చేసి తీరుతాం. దానిని సాధించడం కోసమే మీరు జన్మించారు. ఆత్మవిశ్వాసం కలిగి ఉండండి. ఉత్తమ విశ్వాసాల నుండే ఉత్తమ కార్యాలు పుడతాయి. (చరైవేతి) ఎల్లప్పుడూ ముందుకే సాగండి! ఆమరణాంతం పేదసాదలు, పతితుల పట్ల సానుభూతిని చూపడమే మన లక్ష్యం. ❖

# పరిప్రశ్న

**– స్వామి మేధానంద పురి**

**డి. మూర్తిరాజు, భీమవరం.**

**? : ఆగామి – సంచిత – ప్రారబ్ధ కర్మలపై సామాన్య వ్యక్తికి విశ్వాసం ఎలా ఏర్పడుతుంది?**

✍: కర్మ సిద్ధాంతం ముఖ్యంగా శాస్త్రజ్ఞానం వల్ల కలుగుతుంది. శ్రుతి స్మృతులు తల్లి లాంటివి. ప్రతి ఒక్కరికీ వాటిపై విశ్వాసం అవసరం. తల్లి, చిన్న పిల్లవాడికి తన భర్తను చూపి, 'ఈయన మీ నాన్న గారు' అని చెబుతుంది. తల్లి మాట కన్నా పిల్లవాడికి తండ్రిని గుర్తించడానికి మరొక గతి లేదు. అలాగే తల్లి లాగ ప్రబోధించే వేదశాస్త్రాల పట్ల ప్రతి ఒక్కరికీ విశ్వాసం అవసరం. శాస్త్రం కర్మలను వారి వారి ఆశ్రమ, వర్ణాల (జాతి)ను అనుసరించి విధిస్తుంది.

"యథా కర్మ యథా శ్రుతమ్", "నా భుక్తం క్షీయతే కర్మ జన్మకోటి శతైరపి", "కర్మణా బధ్యతే జంతుః" మొదలైన శ్రుతులు చాలా ఉన్నాయి. శాస్త్రంలో చెప్పిన విషయాలనే గురువులు ఉపదేశిస్తారు. కనుక వారిపై విశ్వాసాన్నీ, శ్రద్ధనూ ఉంచాలి.



లోకంలో ఫలానా వ్యక్తులు సుఖాలు అనుభవిస్తున్నారు గనుక సుకృత కర్మలు ఆచరించి ఉండాలి. ఫలానా వ్యక్తి దుఃఖం అనుభవిస్తున్నాడు కనుక దుష్కృత కర్మల ఫలితంగా దుఃఖం అనుభవిస్తున్నాడు అంటారు. అదీ కాక మంచి ప్రవర్తన, సత్యపాలన, దయాది గుణాలు కలవారు ఎక్కువ మందిని ఆకర్షిస్తారు. చెడ్డ నడవడి, అసత్య పాలన, క్రూర కర్మలు చేసేవారి నుండి జనులు దూరంగా తొలగిపోతారు. ప్రవర్తన వల్ల కూడా కర్మల యందు విశ్వాసం కలుగుతుంది.

మన ప్రమేయం లేకపోయినా జరిగే ప్రమాదాలు, దొంగతనాలు, దెబ్బలాటలు, నష్టాలు మొదలైనవి సంచిత ప్రారబ్ధ కర్మల ఫలాన్ని సూచిస్తాయి. ఒకడు పేదవాడి ఇంటిలో జన్మిస్తాడు. వేరొకడు ధనవంతుల ఇంటిలో జన్మించి ఐశ్వర్యంతో తులతూగుతాడు. ఇది కూడా ఆ యా వ్యక్తులు చేసిన సంచిత కర్మ ఫలమే గదా! ఒకే తల్లికి పుట్టిన సంతానంలో ఒకడు గొప్పవాడవుతాడు. ఒకడు మంచి వాడవుతాడు. ఒకడు బీదవాడవుతాడు, ఒకడు చెడ్డవాడవుతాడు. ఈ తారతమ్యం కర్మఫలమేగదా! శ్రీమద్భగవద్గీతను తాత్పర్యంతో చదివితే మీ సందేహం పూర్తిగా తీరుతుంది.

**చేపూరు వెంకటేశ్వర్లు, నంద్యాల.**

**? : శుక్లాం బరధరం... విఘ్నోపశాంతయే**
**అగజానన పద్మార్కం... ఉపాస్మహే**
**విష్ణుసహస్రనామాలు... జపే వినియోగః**
**తత్సవితుర్వరేణ్యం...ప్రచోదయాత్ అని మన ఆర్షవిజ్ఞాన గ్రంథాలలో శ్లోకాలు మంత్రాలూ ఉన్నాయి. వీటిలో చివర ఇచ్చిన పదాలు అన్నీ ఒకే అర్థాన్ని తెలుపుతాయా? లేక విశేషార్థాలు ఉన్నాయా?**

✍: పై మంత్రాలలోని చివర పదాలకు విశేషార్థాలు ఉన్నాయి. విఘ్నోపశాంతయే: సాధారణంగా అందరూ శుభకార్యాలు మొదలు పెట్టేటప్పుడు విఘ్నాలు నశించడానికీ, పనులన్నీ జయప్రదమవడానికీ ఈ శ్లోకాన్ని చదివి విఘ్నేశ్వరుణ్ణి ధ్యానిస్తారు.

ఉపాస్మహే: భక్తులకు అనేక వరాలిస్తూ ఏకదంతంతో ఉన్న గణేశుణ్ణి ఉపాసిస్తాం. మనస్సు నుండి విషయవాసనలను తొలగించి ధ్యేయమైన గణేశుని యందు మనస్సుని స్థిరంగా ఉంచడమే ఉపాసన. ఈ ఉపాసన ముక్తికోసం చేసే సాధన.

జపే వినియోగః : "తద్ జపః తదర్థభావనమ్" మంత్రాలు దేవతా నామాలు. ఈ మంత్రాలతో పాటు దేవతా స్వరూపం, గుణాలు, లీలలను ధ్యానిస్తూ దేవత యొక్క ఉనికిని భావిస్తూ పారాయణ చెయ్యాలి. దీనినే 'జపే వినియోగః' అంటారు.

ప్రచోదయాత్: దేవత మన బుద్ధిని ప్రేరణ చేస్తాడు. గాయత్రీ ఛందస్సులో ఉన్న ఈ మంత్రానికి ఆరాధ్యుడు సూర్య భగవానుడు. ఆయన ఏకత్వ (జీవబ్రహ్మైక్యతను) జ్ఞానానికి మన బుద్ధిని ప్రేరేపించాలి. అన్ని సాధనలకూ గమ్యం మోక్షమే అయినా విభిన్న ఫలితాల్ని ఆశించి ఈ ప్రార్థనలో భిన్నపదాలు ఉపయోగించారేమో!. ❖



# మహాపురుషుని మధురానుభూతులు

- స్వామి సర్వజ్ఞానంద*

నేను (స్వామి సర్వజ్ఞానంద) స్వామి శివానందజీని స్వామి బ్రహ్మానందజీతో పాటు మొట్టమొదట 1921లో మద్రాసు మఠంలో దర్శించాను. కీర్తన సమయంలో శివానందజీ తబలా వాయిస్తున్నారు. అప్పటికి ఇంకా బ్రహ్మచారిగా ఉన్న స్వామి శ్రీనివాసానంద, మహాపురుష్ మహరాజ్ (స్వామి శివానందజీ) ఛాయాచిత్రం ఒకటి తీయాలని ప్రయత్నించారు. కానీ ఆయన ఎవరినీ ఎప్పుడూ ఫోటో తీయనిచ్చేవారు కాదు. స్వామి శ్రీనివాసానంద ఫోటో తియ్యాలని ప్రయత్నించేసరికి తమ తలను అటూ ఇటూ కదిపేవారు మహాపురుష్‌జీ!

మహాపురుష్ మహరాజ్ చాలా గంభీరంగా ఉంటారని విన్నాను. ఇదంతా విని కూడా నేను ఒకరోజు వారిని కలవాలనుకున్నాను. నేను వారి గదికి వెళ్ళి ద్వారబంధాన్ని పట్టుకుని, నెమ్మదిగా లోపలకు తొంగి చూశాను. మహాపురుష్ మహరాజ్ కుర్చీలో కూర్చొని ఉన్నారు. ఆయన నన్ను చూసి హఠాత్తుగా చేతులు చరిచారు. నేను భయపడి పరుగు పెట్టాను. వెనుతిరిగి చూస్తే మహాపురుష్‌జీ ద్వారబంధాన్ని పట్టుకొని నిలబడి చిన్న పిల్లవాడిలా వినోదంగా నవ్వు తున్నారు. ఈ సంఘటనతో ఆయనంటే నాకున్న భయం ఎక్కువైంది.

తరువాత నేను మద్రాసు మఠంలో చేరాను. 1926లో మహాపురుష్ మహరాజ్ అక్కడకు వచ్చినప్పుడు వారిని చూశాను. స్వామి రుద్రానందజీ, నేను తప్ప మిగిలిన స్వాము లందరూ మహరాజ్‌కు స్వాగతం పలకడానికి స్టేషన్‌కు వెళ్ళారు. వారంతా మఠానికి రాగానే మహాపురుష్‌జీ, నేను నిలబడిన దగ్గరే నా ప్రక్కన కారు దిగారు. తల్లి తన బిడ్డ వైపు చూసినట్లు నా వైపు వాత్సల్యపూరితంగా చూశారు. ఆయన పూర్తిగా మారిపోయినట్లు అనిపించింది. నాకు వారి పట్ల ఉన్న భయం తొలగిపోయింది.

రోజూ జపం, ధ్యానం పూర్తవగానే మేమందరం మహాపురుష్ మహరాజ్ గదికి వెళ్ళి, వారికి ప్రణామం చేసేవాళ్ళం. కొన్ని మార్లు వారు మాతో మాట్లాడేవారు, మరికొన్ని మార్లు గాఢమైన మౌనంలో ఉండేవారు. ఒకరోజు నేను వారి పాదాలకు నమస్కరించగానే నా పేరడిగారు. చెప్పాను. తరువాత "చూడు! నీపేరు నేను మర్చిపోతున్నాను. నేను నీకొక కొత్త పేరు పెట్టనా?" అన్నారు. నేను మౌనంగా ఉండిపోయాను.

మహాపురుష్ మహరాజ్ "నీ పేరు భజహరి! భజహరి అంటే 'భగవంతుణ్ణి భజించు' అని అర్థం" అన్నారు. హఠాత్తుగా మహరాజ్ "భజహరి, హరిభజ, భజహరి, హరిభజ" అంటూ నృత్యం చేయసాగారు. అందరూ నవ్వడం మొదలు పెట్టారు. అలా నా పేరు 'భజహరి'గా మారింది.

ఒకరోజు నేను "మహరాజ్! శ్రీరామకృష్ణులు మీ నాలుక మీద ఏదో వ్రాశారనీ, దానితో మీకు కుండలినీ ఉద్దీపన కలిగిందనీ మీరు అన్నారు. మీకు ఆ అనుభూతి ఇంకా కలుగుతుందా?" అని అడిగాను. అలాంటి ప్రశ్న అడగడం తప్పని నాకు తెలియజేయాలన్నట్లుగా అందరూ నావైపు కోపంగా చూడసాగారు. అయితే మహరాజ్ మాత్రం "అవును! ఇప్పటికీ నాకు ఆ అనుభూతి ఉంది" అన్నారు.

మరొకమారు మహాపురుష్‌జీ, నాతో "భజహరీ! నువ్వు నాట్రంపల్లి వెళ్ళి అక్కడున్న స్వామి 'కె.' ని ఇక్కడకు పంపించు. అతనికి కొన్ని రోజుల పాటు నాతో కలసి ఉండాలని ఉంది" అన్నారు. నేను మాత్రం "మహరాజ్! నాకు వెళ్ళాలని లేదు. మీరు మద్రాసు తరచుగా రారు. నేను వెళితే, ఇక పైన మీ

మిగతా 30వ పేజీలో...



# భక్తురాలి రూపంలో భగవంతుడు

కథ: అళగరాజా, హరిహరన్ బొమ్మలు : గోవి అనుసృజన : స్వామి జ్ఞానదానంద

భక్తి వెల్లువ భారతావనిని ముంచెత్తిన కాలం అది. మహారాష్ట్రలో గంగాధరరావు, కమలాబాయి దంపతులకు పాండురంగ భక్తురాలైన సక్కుబాయి కుమార్తెగా జన్మించింది.




6
గదిలో సక్కుబాయి తీవ్రంగా జపం చేయసాగింది.
కమలా! సక్కుకు ఏమయింది? పిచ్చిపట్టినట్లుగా ఇలా ఉందేమిటి?
అవునండీ! మునుపటిలా ఆడుకోవడానికి వెళ్ళడం లేదు. ఎప్పుడూ జపం, ఏవేవో పాటలతో గడుపుతోంది. పిచ్చి పట్టిందేమోనని భయంగా ఉంది.
వివాహం చేస్తే ఆమె పిచ్చి వదిలిపోతుంది.
7
తల్లితండ్రులతో పెళ్ళిచూపులకు వచ్చిన మిత్రువుకు సక్కుబాయి నచ్చడంతో వెంటనే వివాహం జరిగిపోయింది. కానీ కొన్ని రోజులు గడిచాక...
అమ్మా! సదా పాటలు, ధ్యానాలతో గడిపే సక్కు వైఖరి నాకు నచ్చడం లేదు.
అవును! నేనూ చూస్తున్నాను. ఈ అహంకారిని దారికి తీసుకురావాలి.
నువ్వన్నది నిజం! ఆ శని గ్రహాన్ని ఒక గదిలో పడేసి ఉంచు. అప్పుడిక ఆమె తనంతట తానే దారిలోకి వస్తుంది.
8
పాండురంగా! నన్నెందుకు ఇలా పరీక్షిస్తున్నావు? అందరూ ద్వేషించేలా నేను ఏం చేశాను? హే పాండురంగా! నువ్వు ఎప్పుడు వస్తావు?
ఏయ్ సక్కూ! ఎవరితో మాట్లాడుతున్నావు? పిచ్చిదానా! నిన్ను పస్తు ఉంచితేనే నీకు బుద్ధి వస్తుంది.
9
ఆ సమయంలో సక్కుబాయి గురువు అక్కడకు వచ్చాడు.
అమ్మా! సక్కుబాయి మీ కోడలే కదా! ఆమె క్షేమంగా ఉందా?
ఆమెకు ఏం చేటు! నిష్ప్రయోజకురాలు!
అలా అనకండి! నేను ఆమెతో మాట్లాడి మీ మనస్సుకు నచ్చినట్లు నడుచుకునేలా చేస్తాను.
సాధువు, సక్కుబాయిని చూసి ఆమెతో మాట్లాడి ఉత్సాహపరచడంతో ఆమె మారిపోయిందని సక్కుబాయి భర్త, అత్త గారు, మామ గారు – అందరూ సంతోషించారు. ఒకమారు కొందరు భక్తులు యాత్రకు వెళుతున్నారు.

మిగతా 36వ పేజీలో...



# అమ్మ అనుగ్రహం పొందిన అదృష్టవంతులు

– స్వామి నిర్వికల్పానంద

జయరాంబాటీ దగ్గరలో సంథాల్ గిరిజన తెగకు చెందిన హబూ ముండా అనే వృద్ధుడు నివసించేవాడు. అతనికి సుమారు ఎనభై ఏళ్ళుంటాయి. సన్నగా, పొడవుగా ఉండి, చూడడానికి బిచ్చగాడిలా ఉండేవాడు. అతను రోజూ "మాతృమందిర్ (శ్రీశారదాదేవి ఆలయం)"కి వచ్చేవాడు. అయితే ఏనాడూ గుడిలోకి అడుగుపెట్టేవాడు కాదు. గుడి మెట్ల దగ్గరే నిలబడి, అమ్మతో ఒక్కొక్క రోజు కోపంగా, ఒక్కొక్కరోజు బ్రతిమిలాడుతున్నట్లుగా, ఒక్కొక్క రోజు ఏడుస్తూ మాట్లాడుతూ పిచ్చివాడిలా ప్రవర్తించేవాడు. గుడిలోకి వెళ్ళకుండానే, ఆఖరి మెట్టుకు తన నుదుటిని తాకించి, అక్కడి నుంచి వెళ్ళిపోయేవాడు. కుండపోతగా వాన పడుతున్నా, చలి గజగజ వణికిస్తున్నా సాయం కాలం ఆరతి అయ్యేసరికి అతను ఆలయానికి రావడం మానేవాడు కాదు. ఇది అందరికీ ఆశ్చర్యం కలిగించేది. భక్తులెవరైనా అతని రూపు చూసి, బిచ్చగాడనుకొని పైకం ఇవ్వబోతే అతను స్వీకరించకుండా, ఆలయంలోని హుండీ చూపించేవాడు.

జయరాంబాటీ ఆశ్రమానికి అప్పుడు అధ్యక్షులుగా ఉన్న రామ్‌మయ్ మహరాజ్ (స్వామి గౌరీశానందజీ)ని హబూ గురించి వాకబు చేయగా అతని అసలు కథ తెలిసింది.

"జయరాంబాటీలో శ్రీమాత ఇంటి నిర్మాణం పూర్తి అయిన కొత్తలో బాలుడైన హబూ తన తండ్రితో పాటు శ్రీమాత (శారదాదేవి)ని చూడడానికి వెళ్ళాడు. ఇంటికి ఎవరైనా మొదటిమారు వస్తే, వచ్చిన వారిని వారి ఇంటి గురించి, వారి క్షేమ సమాచారాలు, వారికి ఏం కావాలి లాంటి వివరాలన్నీ ఇంటి యజమాని అడగడం సంథాల్ తెగలో ఒక ఆచారం. అమ్మ తనను దగ్గరకు పిలిచి, క్షేమ సమాచారాలు అడుగుతుందని భావించాడు హబూ. అయితే గృహప్రవేశం సందడిలో ఉన్న శ్రీమాత, హబూ పట్ల ప్రత్యేక శ్రద్ధ వహించలేదు. ఇది హబూకు బాధ కలిగించింది.

ఒకసారి హబూకు శరత్‌మహరాజ్ (స్వామి శారదానంద)ని కలిసే అవకాశం లభించింది. వారు హబూతో శ్రీమాతను సందర్శించాల్సిందిగా చెప్పారు. అతను అమ్మ దర్శనం కోసం వెళ్ళగా, ఈ సారి కూడా ఆమె అతని పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపలేదు. ఇది అతణ్ణి చాలా బాధించింది. చాలా బాధపడుతూ తిరిగి వచ్చిన హబూ, శరత్ మహరాజ్‌ను కలిసి అమ్మ తనని పిలిచే వరకూ ఆమెను కలవడానికి వెళ్ళనని కచ్చితంగా చెప్పాడు. అప్పుడు శరత్ మహరాజ్ "భక్తితో హృదయపూర్వకంగా ప్రార్థిస్తే అమ్మ అనుగ్రహం తప్పక లభిస్తుంది" అని చెప్పారు. ఆ బాలుడు, మహరాజ్ చెప్పిన మాటను విశ్వసించి, అమ్మను ప్రార్థించడం మొదలుపెట్టాడు. తరువాత అమ్మ ఈ ప్రపంచాన్ని విడిచారని తెలిసింది. అప్పటి నుంచీ అతను నిత్యం ఆలయానికి వచ్చి, బయట నుండే తనను ఆమె వద్దకు పిలవాల్సిందిగా ప్రార్థించేవాడు".

రామ్‌మయ్ మహరాజ్, హబూను చూసి "అమ్మ నిన్ను పిలవదు" అని ఆట పట్టించేవారు. వెంటనే హబూ "అదేం కాదు! అమ్మ తప్పకుండా పిలుస్తుంది, శరత్ మహరాజ్ చెప్పారు" అనేవాడు అమిత విశ్వాసంతో.

కొన్నాళ్ళు అయ్యాక హబూ అనారోగ్యం కారణంగా మంచం పట్టాడు. అతన్ని చూడడానికి కొంత మంది సాధువులు వెళ్ళినప్పుడు వారితో హబూ "అమ్మ వచ్చింది! అమ్మ దర్శనమిచ్చి, నన్ను రమ్మని స్వయంగా పిలిచింది" అన్నాడు. అవధుల్లేని ఆనందంతో అవే మాటల్ని మళ్ళీ మళ్ళీ ఉచ్చరించాడు.

శ్రీమాత ఆఖరికి తన కుమారుడి ప్రార్థన విని, అతణ్ణి అనుగ్రహించి, తన దర్శనమిచ్చింది. బిడ్డ ఆక్రందనల్ని వింటూ ఏ తల్లి అయినా ఎంతకాలం సమాధానం చెప్పకుండా ఉండగలదు! శ్రీమాత పట్ల అద్భుతమైన భక్తి విశ్వాసాలను హబూ ముండాలో చూశాం.

గర్బేటా రైలు నిలయంలో కూలీగా పనిచేసే ఒక వ్యక్తి రోజూ శ్రీరామకృష్ణుల ఆలయానికి వచ్చేవాడు. రోజూ

తెలతెలవారుతుండగా అతడు ఆశ్రమానికి వచ్చి, గేటు నుంచి ఆలయం వరకూ ఆశ్రమ ప్రాంగణం అంతా అతి జాగ్రత్తగా ఊడ్చేవాడు. చెత్త, ఎండుటాకులు అన్నీ ఎత్తి శుభ్రం చేసేవాడు.

ఒకసారి ప్రభు మహరాజ్ (స్వామి వీరేశ్వరానందజీ – రామకృష్ణ సంఘ పదో అధ్యక్షులు) గర్బేటా ఆశ్రమానికి వచ్చినప్పుడు అతను చేస్తున్న ఈ అద్భుతమైన సేవను చూశారు. అతని పని తీరు చూసి ముగ్ధులైన ప్రభు మహరాజ్, ఆ ఉద్యోగి గురించి వివరాలు తెలుసుకోగోరారు. అతను ఆశ్రమంలో పనిచేసే ఉద్యోగి కాదనీ, ఎవరూ అడగకుండానే తనంతట తానుగా ఈ పని చేస్తున్నాడనీ ఒక స్వామి చెప్పారు. గర్బేటా చుట్టు పక్కల ఉన్న పల్లెల్లోని వారి పేదరికం, వారి పరిస్థితులు చూసిన ప్రభు మహరాజ్ శ్రీరామకృష్ణ లోకశిక్షా పరిషత్‌కి అప్పుడు డైరెక్టర్‌గా ఉన్న శ్రీశివశంకర్ చక్రవర్తితో పేదప్రజల సేవ, సహాయాల కోసం ఒక ప్రణాళికను ప్రారంభించాల్సిందిగా చెప్పారు. వారు చెప్పినట్లు అనంతర కాలంలో ఒక ప్రణాళికను ప్రారంభించారు.

కూలీ కావడం వల్ల ఆ వ్యక్తి గర్బేటా ఆశ్రమానికి వచ్చే భక్తులు, అతిథుల సామాను మోసేవాడు. ఒకమారు అలా ఆశ్రమానికి వచ్చినప్పుడు దివ్యజనని జయంతి ఉత్సవాలు జరుగుతున్నాయి. ఆ సందర్భంలో ఒక స్వామీజీ శ్రీమాత గురించి ప్రసంగిస్తున్నారు. ప్రసంగం మధ్యలో స్వామి ఈ క్రింది ఉదంతాన్ని తెలియజేశారు:

"ఒకసారి శ్రీమాత, మాస్టర్ మహాశయ్ ('మ' – 'శ్రీరామకృష్ణ కథామృతం' రచయిత), ఇతర భక్తులతో పూరీ యాత్ర నుంచి జయరాంబాటీ తిరిగి వెళుతుండగా గర్బేటా రైలు నిలయంలో రైలు చాలాసేపు ఆగింది. రైలు అక్కడ అంతసేపు ఎందుకు ఆగిందో కారణం అడిగారు శ్రీమాత. రైలు ఇంజన్‌లో బొగ్గు, నీరు నింపడానికి అంత సేపు ఆపాల్సి వచ్చిందని తెలిసింది. అది వినగానే శ్రీమాత చిన్నపిల్లలాగ అది చూస్తానని రైలు దిగారు. రైలు దిగగానే శ్రీరామకృష్ణులు అక్కడ నిలబడి చిరునవ్వు నవ్వుతూ తన వైపు చూసినట్లు, తరువాత రైలు నిలయం దాటి బయటకు వెళ్ళి క్రమంగా అదృశ్యమైనట్లు శ్రీమాతకు కనపడింది. అప్పుడు అమ్మ భక్తులతో అక్కడ శ్రీరామకృష్ణుల ఆలయం నిర్మించాలని చెప్పారు. 1915లో గర్బేటాలో రామకృష్ణ మఠం స్థాపితమైంది. తరువాత రామకృష్ణుల ఆలయ నిర్మాణం జరిగింది.

విష్ణుపూర్ రైలు నిలయంలో ఒక బీహారీ కూలీకి శ్రీమాత మంత్రదీక్షనిచ్చి, సీతామాతలా దర్శనమిచ్చిన ఉదంతం ఆ ఉపన్యాసంలో విని, తాను కూడా బీహారీయే కనుక ఆ సంఘటనను తనకు అన్వయించుకున్నాడు. శ్రీమాత జానకీమాత అని అతని దృఢవిశ్వాసం. చాలా కాలం క్రితం బహుశా తన దూరపు బంధువు అయిన ఆ కూలీకి



జానకీమాతగా దర్శనమిచ్చినట్లే తనకు కూడా అమ్మ దర్శన మిస్తుందని అతను విశ్వసించాడు. అతను తన పనిలోకి వెళ్ళేముందు ప్రతి రోజూ ఆశ్రమానికి వచ్చి, నిస్వార్థంగా కొంతసేవ చెయ్యడానికి స్ఫూర్తి కలిగింది ఈ సంఘటన వల్లనే. అతను ఈ విధంగా గర్బేటాలో ఉన్నన్ని రోజులూ సేవ చేశాడు. గర్బేటా విడిచి వెళ్ళే ముందు ఆలయానికి వచ్చి, దివ్యజననికి నివేదన చేశాడు. ఆ తరువాత అతని గురించి ఏమీ తెలియదు. అయితే శ్రీమాత పట్ల అతని భక్తి విశ్వాసాలు అనన్య సామాన్యమైనవి అనడంలో సందేహం లేదు. ❖

(సేకరణ: రామకృష్ణ సంఘ ఆంగ్ల మాసపత్రిక 'ప్రబుద్ధ భారత' 2008 జనవరి సంచిక నుంచి)



# ఓ మహాత్యాగి ఆత్మకథ

## (స్వామి వివేకానంద స్వీయ వచనాల సమాహారం)

**(మహా భక్తుడు, అద్వైత వేదాంతి, కర్మయోగి, ప్రవక్త, శ్రేష్ఠసన్న్యాసి, గురువు, యుగాచార్యుడు, దేవదూత, పరమహంస శిష్యుడు, మానవ జాతి ప్రేమికుడు, మహా దేశభక్తుడు, ధ్యానసిద్ధుడు, మహాయోగి, గంధర్వగాయకుడు - ఇలా విభిన్న రూపాలలో స్వామి వివేకానంద మనకు దర్శనమిస్తారు. స్వామీజీ తన సంభాషణలు, ఉపన్యాసాలు, వ్యాసాలు, లేఖల్లో స్వయంగా తెలిపిన జీవితానుభవాలను 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా అందిస్తున్నాం.)**

(...గత సంచిక తరువాయి)

మా తండ్రి మరణించిన వెంటనే నేను ఉద్యోగం వెతుక్కోవలసి వచ్చింది. కాళ్ళకు చెప్పులు అయినా లేకుండా, ఆకలితో, చేతిలో దరఖాస్తు పట్టుకొని, మండుటెండలో ఆఫీసుల చుట్టూ తిరిగేవాణ్ణి. కొన్నిసార్లు సానుభూతితో మిత్రులొకరో, ఇద్దరో నాతో పాటు వచ్చేవారు. ప్రతి చోటా నా ముఖం మీద తలుపులు మూసేసేవారు! ఈ జీవిత (నగ్న) సత్యం నిస్వార్థమైన సానుభూతి ఈ లోకంలో చాలా అరుదనీ, ఇందులో దుర్బలులకూ, పేదలకూ, అనాథలకూ స్థానం లేదనీ - నాకో గుణపాఠం నేర్పింది! అంతకు కొన్నాళ్ళ క్రితం నాకు ఏ చిన్న సాయం అయినా చేయడమే గొప్పగా భావించే బాగా డబ్బున్న స్నేహితులు కూడా ముఖం తిప్పేసుకోవడం గమనించాను. ఇదంతా చూస్తూంటే - ఈ ప్రపంచం ఓ రాక్షస సృష్టిలా కనిపించింది!

కొన్నిసార్లు ఇంట్లో బియ్యం నిండుకుని, నా జేబులో పైసా కూడా లేనప్పుడు నన్ను ఎవరో భోజనానికి ఆహ్వానించారని అమ్మకు చెప్పి, ఖాళీ కడుపుతోనే గడిపేవాణ్ణి! (కనీసం మా అమ్మ, తమ్ముళ్ళయినా రెండు మెతుకులు ఎక్కువ తినవచ్చునని అలా చెప్పేవాణ్ణి.) ఆత్మగౌరవం అడ్డు రావడంతో నా ఈ పరిస్థితులన్నీ ఇతరులతో చెప్పేవాణ్ణి కాదు. బాగా ఆస్తులున్న నా మిత్రులు కొన్నిసార్లు వారి ఇళ్ళకూ, ఉద్యానాలకూ పాడడానికి రమ్మని పిలిచేవారు. తప్పనిసరి అయితేనే వెళ్ళేవాణ్ణి. అక్కడ వారితోనూ ఏమీ చెప్పేవాణ్ణి కాదు. వారూ నా కష్టాల గురించి అడిగేవారు కాదు. కొన్నిసార్లు కొందరు "ఈ రోజు నీవు చాలా నీరసంగా కనిపిస్తున్నావెందుకు?" అని అడిగేవారు. కేవలం ఒకే ఒక మిత్రుడు మా బీదరికం గురించి తెలుసుకొని, నాకు తెలియకుండా, అప్పుడప్పుడు 'అనామకం'గా మా అమ్మకు ధన సహాయం చేసేవాడు. ఆ మిత్రుని కెంతో ఋణపడి ఉన్నాను.

కొంత మంది మిత్రులు అక్రమ సంపాదనతో జీవిస్తూ, నన్నూ తమతో చేతులు కలపమన్నారు. నాలాగే విధి వక్రించి నిరుపేదలైన కొంతమంది గతి లేక వక్రమార్గాన్ని అనుసరిస్తూ, నాపై చాలా సానుభూతి చూపారు. వేరే కష్టాలూ వచ్చాయి. ఎన్నో ప్రలోభాలు అడ్డు నిలిచాయి! ఓ ధనిక మహిళ నా దుఃఖదినాల్ని అంతం చేసుకోవడానికి నన్ను ప్రలోభపరిచే ప్రయత్నం చెయ్యబోయింది. నేను దాన్ని తిప్పికొట్టాను. ఇంకో స్త్రీ కూడా అలాంటి దుష్ప్రయత్నమే చేసింది. ఆమెతో ఇలా అన్నాను- "నీ జీవితాన్ని ఈ తుచ్ఛ భోగాలలో వ్యర్థం చేశావు. కారుమేఘాల లాంటి మృత్యు నీడలు నిన్ను తరుముకొని వస్తున్నాయి. దాని కోసం ఏమైనా సిద్ధమయ్యావా! ఈ నీచబుద్ధిని విడిచిపెట్టి భగవంతుణ్ణి తలచుకో!"

ఈ సమస్యలెన్ని ఉన్నా, భగవంతుని అస్తిత్వంపై, ఆయన దివ్య కృపపై ఎప్పుడూ నమ్మకం కోల్పోలేదు. ప్రతి ఉదయం భగవన్నామాన్ని ఉచ్చరిస్తూ నిద్ర లేచి, ఉద్యోగ ప్రయత్నంలో బయటకు వెళ్ళేవాణ్ణి. ఓ రోజు మా అమ్మ అది విని కటువుగా - "చాలు మూర్ఖుడా! బాల్యం నుండీ దేవుని కోసం ఎంతగానో ఏడుస్తున్నావ్, ఆ దేవుడు నీకేం చేశాడు?" అంది. నా మనస్సు చివుక్కుమంది, సంశయ భూతం ఆవహించింది - "దేవుడు నిజంగా ఉన్నాడా? నిజంగా ఉంటే వ్యాకులతతో మనిషి చేసే ప్రార్థనల్ని ఆయన వింటాడా? అయితే ఆవేదనాభరితమైన నా విన్నపాలకు ఆయన బదులెందుకివ్వడు? దేవుని దివ్య సామ్రాజ్యంలో ఇంతటి దుఃఖమెందుకు? దయామయుడైన ఈ దేవుని లోకంలో రాక్షసుడెందుకు రాజ్యమేలుతున్నాడు?"

అలాగే, "భగవంతుడు మంచివాడు, కరుణామయుడే అయితే, లక్షల మంది కరువు కాటకాలతో పిడికెడు మెతుకులు దొరకక ఎందుకు ప్రాణాలు విడుస్తున్నారు?" అన్న పండిత ఈశ్వరచంద్ర విద్యాసాగరుని మాటలు నా చెవుల్లో మారుమ్రోగాయి! ఆ దేవుని మీద చాలా కోపం వచ్చింది.

ఏదైనా సరే రహస్యంగా చేయడం నా స్వభావానికే విరుద్ధం. అంతేకాదు నా బాల్యం నుండీ నా ఆలోచనల్ని దాచకపోవడం నాకు అలవాటు! కాబట్టి సహజంగానే 'భగవంతుడు' కేవలం ఒక 'కల్పన' అనీ, ఒక వేళ ఆయన ఉన్నా ఆ దేవుణ్ణి

ప్రార్థించడం వ్యర్థం అనీ అందరితో చెప్పసాగాను. త్వరలోనే ఆ వార్తలు 'ఇంతితై వటుడింతై...' అన్నట్లుగా - నేను నాస్తికుణ్ణయ్యాననీ, తాగుడుకూ, వ్యభిచారానికీ కూడా వెనుకాడడం లేదనీ - అంతటా వ్యాపించాయి. ఈ తప్పుడు మాటలతో నా హృదయం ఇంకా కరడు కట్టింది. ఈ దుఃఖమయ ప్రపంచంలో ఒక మనిషి కొద్దిపాటి సుఖం కోసం ఏ మార్గాన్ని అనుసరించినా తప్పేమీ లేదనీ, ఒకవేళ ఆ మార్గాన్ని అనుసరిస్తే సఫలమవుతానని నేను నమ్మితే, ఆచరణలో పెట్టడానికి ఎవ్వరికీ భయపడననీ అందరితో చెప్పసాగాను.

ఈ విషయంపై మార్పులు, చేర్పులతో తప్పుడు వార్తలు త్వరలోనే గురుదేవులు, వారి భక్తుల చెవుల్లో పడ్డాయి. కొందరు



ప్రత్యక్షంగా నన్ను కలసి, తాము విన్న పుకార్లలో కొన్నయినా నమ్ము తున్నామని చెప్పకనే చెప్పారు. వాళ్ళు నా గురించి అంత నీచంగా ఆలోచిస్తారని తెలిసి, నా ఆత్మాభిమానం దెబ్బతింది. "నరక భయంతో భగవంతుణ్ణి నమ్మడం పిరికితనం" అని కోపావేశంతో వారితో స్పష్టంగా చెప్పాను. భగవంతుని అస్తిత్వం, లేక నాస్తికత్వంపై అనేక పాశ్చాత్య తత్త్వవేత్తలను ఉదాహరిస్తూ వారితో వాదించాను కూడా! ఫలితంగా, నేను సంపూర్ణంగా నాశనమయ్యాననే పూర్ణ విశ్వాసంతో వారంతా వెనుదిరిగారు! నేనూ సంతోష పడ్డాను. కానీ శ్రీరామకృష్ణులు కూడా ఇవన్నీ నమ్ముతారేమోననే ఆలోచన రాగానే హృదయం పిండినట్లయింది. 'ఫరవాలేదు. ఒక వ్యక్తి ఏర్పరచుకొనే మంచి అభిప్రాయం కానీ, చెడు అభిప్రాయం కానీ అలాంటి కల్పితమైన, దుర్బలమైన పునాదులపై ఆధారపడి ఉంటే, నేను లెక్కచేయను' అనుకున్నాను.

గురుదేవులు ఆ వార్తల్ని మౌనంగా విని, ఏ అభిప్రాయమూ వ్యక్తపరచలేదని తెలిసి ఆశ్చర్యపోయాను! కానీ వారి ప్రియ శిష్యుడు భవనాథ్ "స్వామీ! నరేంద్రుడు ఇంత నీచస్థితికి దిగజారతాడని కలలో కూడా ఊహించలేదు!" అంటూ కన్నీరు కారుస్తుంటే, గురుదేవులు మండిపడ్డారు. "నోరు ముయ్యి, మూర్ఖుడా! అలా ఎన్నటికీ జరగదు. మరోసారి నాతో అలా మాట్లాడావో నీ ముఖం కూడా చూడను" అన్నారు.

కానీ బలవంతంగా నా మస్తకంలోకి జొప్పించబడిన ఈ నాస్తిక భావాలెంతగా ఉన్నా, నా బాల్యం నుండీ, తర్వాత శ్రీరామకృష్ణుల సాంగత్యం వల్ల పొందిన దివ్య దర్శనాలు, అనుభూతుల స్పష్టమైన గాఢ సంస్కారాలు మాత్రం భగవంతుడు తప్పక ఉన్నాడనీ, దైవసాక్షాత్కారానికి ఏదో ఒక మార్గం తప్పక ఉండాలనీ నాలో ప్రేరణ కలిగించాయి. భగవంతుణ్ణి దర్శించలేకపోతే ఈ జీవితానికి అర్థం లేదు; ఈ కష్టాలు, కడగండ్ల మధ్యనే నేనా మార్గాన్ని కనుక్కొని తీరాలి. ఇలా నా మనస్సు అటు సంశయం - ఇటు నమ్మకం- ఈ రెంటి మధ్య ఊగిసలాడుతూ రోజులు గడిచాయి; నా ఆర్థిక ఇబ్బందులూ అలాగే నిలిచాయి.

ఎండాకాలం పోయి, వర్షాలు మొదలయ్యాయి. ఉద్యోగాల వేట కొనసాగింది. రోజంతా తిండి లేక ఉపవాసంతో, వర్షంలో తడిసి, శరీరమూ, మనస్సూ బాగా అలసిపోయి ఒక సాయంత్రం ఇంటికి తిరిగి వస్తున్నాను. తీవ్రమైన అలసటతో అడుగు ముందుకు వేయలేక, బాట పక్కనే ఒక ఇంటి అరుగు మీద చతికిలబడ్డాను. అప్పుడు నేను స్పృహలో ఉన్నానో, లేనో చెప్పలేని స్థితి! అనేకానేక ఆలోచనలు మనస్సులో కల్లోలం రేపుతున్నాయి. వాటిని తోసి పారేసి ఒక్క విషయంపై మనస్సును ఏకాగ్రం చేసే శక్తే లేదు! హఠాత్తుగా ఏదో ఒక దివ్యశక్తితో నా ఆత్మను కప్పిన పొరలు ఒక్కటొక్కటిగా తొలగిపోతున్నట్లుగా అనుభూతి చెందాను. సచ్చిదానందమయమైన భగవంతుని సృష్టిలో ఓ వైపు ప్రేమ, కరుణ; మరోవైపు దుఃఖం, దారిద్ర్యం - ఈ రెండూ కలిసి ఉండే విషయాలే అన్న భావనతో అంతకు ముందు నాకున్న సంశయాలన్నీ వాటంతట అవే తీరిపోయాయి! ఓ సుదీర్ఘమైన, గాఢమైన ఆత్మావలోకనం ద్వారా దీనికంతటికీ ఒక అర్థముందని గ్రహించి సంతృప్తి చెందాను. ఆ పై ఇంటికి వెళుతూంటే, శరీరంలో ఏ అలసటా లేదు. మనస్సంతా అద్భుత శక్తితో, ప్రశాంతతతో నిండి చైతన్యవంతమైంది. ఆ రాత్రి హాయిగా గడిచింది. ❖ (సశేషం)

అనుసృజన : స్వామి అర్చనానంద

# మరణం ఇస్తున్న మహత్తర సందేశం!

– ఆకెళ్ల రాఘవేంద్ర

విధి విచిత్రమైంది!

మహాభారతం ఆదిపర్వంలో పరీక్షిన్మహారాజు కథ ఉంది. పరీక్షిత్తు సర్వధర్మాలూ తెలిసిన మహారాజు. దేశంలోని దీనుల, వికలాంగుల, పేదల రక్షణ, పోషణ భారం స్వయంగా చూసుకొనేవాడు.

అంతటి మహారాజు 'ఏడు రోజుల్లో మరణిస్తావు' అంటూ ఓ మునికుమారుడి శాపానికి విధివశాత్తూ గురికావాల్సి వచ్చింది. అప్పుడేం చేయాలి?

పరీక్షిత్తు ఎత్తయిన ఒంటి స్తంభం మేడ నిర్మించి, అక్కడే ఉండిపోయాడు. మరణం రాకుండా ఆపేందుకు అన్నిరకాల ఏర్పాట్లూ చేసుకున్నాడు. మరణం అంటే ఏమిటో తెలుసుకొనేందుకు పండిత గోష్ఠులు ఏర్పాటు చేసుకున్నాడు.

ఆరు రోజులు గడిచాయి.

ఏడో రోజు రానే వచ్చింది. ఆ రోజు పరీక్షిత్తు ఓ పండు తినబోతూంటే దాని నుంచి ఓ రాగి రంగు కీటకం బయటకు వచ్చింది. అది తక్షకుడు అనే సర్పమై, ఆ మహారాజు కంఠాన్ని చుట్టుకొని కాటేసింది. అంతే! పరీక్షిత్తు మరణించాడు.

అంటే – మరణం తథ్యం, ఇది సత్యం.

ఇలాంటిదే మరో కథ వరాహ మిహిరుడికి సంబంధించినది:

గుప్తరాజయిన రెండో చంద్రగుప్తుడి (లేదా విక్రమాదిత్యుడి) ఆస్థానంలోని నవరత్నాలలో వరాహ మిహిరుడు ఒకరు.

మిహిరుడు గొప్ప జ్యోతిశ్శాస్త్రవేత్త. విక్రమాదిత్యుడికి కొడుకు జన్మించినప్పుడు మిహిరుడు ఆ రాకుమారుడి జాతకాన్ని క్షుణ్ణంగా పరిశీలించి, 18వ ఏట మరణిస్తాడనీ, అందునా ఓ వరాహం (అంటే అడవిపంది) చేతిలో మరణిస్తాడనీ చెప్పడం జరిగింది.

అంతా హతాశులయ్యారు.

రాకుమారుడికి 18 ఏళ్ళు వచ్చాయి. మిహిరుడు చెప్పిన దుర్ముహూర్తం దగ్గర పడుతోంది. దాంతో ప్రత్యేకంగా ఓ ఏడంతస్తుల మేడను విక్రమాదిత్యుడు నిర్మించాడు. ఎలాంటి ప్రమాదమూ తన కొడుకుకు సంభవించకుండా కట్టుదిట్టమైన భద్రత పెట్టాడు. ఏ విధమైన క్రూరజంతువులూ, ముఖ్యంగా అడవి పంది ప్రవేశించకుండా జాగ్రత్తలు తీసుకున్నారు.

ఏడో అంతస్తులో రాకుమారుణ్ణి ఉంచారు. అతనికి మరణం గురించి ఏమీ తెలీకుండా జాగ్రత్తపడ్డారు. మరణం సంభవించబోతోందన్న సత్యం తెలిస్తే ఎవరైనా స్థిమితంగా ఉండగలరా! అందుకే ఆ సంగతి తెలియనివ్వకుండా,



రాకుమారుడు స్నేహితులతో ఉల్లాసంగా గడిపేలా ఏర్పాట్లు చేయించాడు రాజు. సైనికుల పహారా ఉంది. మొదటి అంతస్తులోనే ఉండి విక్రమాదిత్యుడు ఎప్పటికప్పుడు తన కొడుకు క్షేమసమాచారాలు తెలుసుకుంటూ ఉన్నాడు.

ఆ రోజు రానే వచ్చింది. ఆ రోజు సాయంత్రం నాలుగు గంటలకు రాకుమారుడి మరణం సంభవిస్తుందని మిహిరుడి ఉవాచ! సాయంత్రం మూడున్నరైంది. రాకుమారుడు బతికే ఉన్నాడు. మూడు నలభై అయిదైంది. రాకుమారుడు బతికే

ఉన్నాడు. మూడు యాభై అయిదైంది. రాకుమారుడు బతికే ఉన్నాడు. క్షణక్షణానికీ భద్రత పెంచారు. రాజుగారికి క్షేమసమాచారాలు అందిస్తున్నారు. ఏ విధమైన జంతువులూ ప్రవేశించకుండా దేగల్లా సైనికులు ఒళ్ళంతా కళ్ళు చేసుకొని, కాపలా కాస్తున్నారు.

కానీ విచిత్రం! సరిగ్గా నాలుగైంది, రాకుమారుడు నెత్తుటి మడుగయ్యాడు. అంతటి భద్రత ఉన్నప్పటికీ ఏమైంది?

3.55 నిమిషాలకు ఏదో అంతస్తులో స్నేహితులతో కాలక్షేపం చేస్తున్న రాకుమారుడు సరదాగా ఒక్కడే మేడపైకి వెళ్ళాడు. గుప్తుల రాజముద్ర వరాహం. వారు ఏ భవనం నిర్మించినా ఆ మేడపై భాగాన రాతితో వరాహాన్ని చెక్కించి పెడతారు. రాకుమారుడు చేరుకొన్న ఆ భవనం పైభాగాన కూడా వరాహం ఆకారంలో ఓ రాతి కట్టడం ఉంది.

సరిగ్గా నాలుగైంది. ఆ 'వరాహ' కట్టడం కూలింది. రాకుమారుడు మరణించాడు.

దీన్నిబట్టి మనకు ఏమర్థమైంది?

మరణం తప్పదు.

**జాతస్య హి ధ్రువో మృత్యుః**

అయితే మరణం తర్వాత దుఃఖమేనా? శోకమేనా? కన్నీరు కార్చడమేనా? ఎలాగూ మరణించక తప్పదు కాబట్టి బ్రతికినన్నాళ్లూ స్వీయసుఖాల కోసం బతకడమేనా? సొంత లాభం కొంత మానుకొని పొరుగువారి కోసం బతికి మనం వెలుగుతూ ఇతరులకు కాంతినిచ్చి, మనం నడుస్తూ ఇతరులను నడిపించాలా లేక ఎవర్నీ పట్టించుకోకుండా, ఆస్తి కూడగట్టి ఇతరుల మనసుల్ని బాధపెట్టి, పూర్తి స్వార్థంతో బతికి ఆ పై మరణించి జీవితాన్ని సార్థకం చేసుకోకుండా తెర మరుగవుదామా? ఆలోచించాలి.

వాస్తవానికి మరణం ఓ సందేశాన్నిస్తుంది. బతుకును సార్థకం చేసుకోమనే హెచ్చరిక చేస్తుంది. పుట్టలోని చెదలు పుట్టవా, గిట్టవా అన్న వాక్యంలోని పరమార్థాన్ని అర్థం చేసుకోమంటుంది. అనవసరపు అహం, అనవసరపు అసూయలు, అర్థం లేని ప్రేలాపనలు, కాలయాపనలు మాని, పొంచి ఉన్న మృత్యువు ఏ క్షణంలోనైనా కబళిస్తుందని గమనిస్తూ జీవితాన్ని సాఫల్యం చేసుకోమని చెప్పేదే మరణం.

తేనె సీసాలోని చెంచాకు తేనె మాధుర్యం తెలియదు. బతుకును గందరగోళపరచుకొని, కావాలని సమస్యల చిక్కుముళ్ళు వేసేసుకొని, జీవచ్ఛవంలా బతకడం కాదు జీవితమంటే! ఇతరుల జీవితాన్నీ, మనసుల్నీ గాయపరుస్తూ బతకడం కాక, తాను బతుకుతూ, తాను నిలబడుతూ, ముందుకు సాగుతూ, తాను వెలుగుతూ ఇతరుల్ని బతికించాలనీ, నిలబెట్టాలనీ, ముమ్ముందుకు నడిపించాలనీ, ఇతరులకు వెలుగివ్వాలనీ చెప్పే సందేశమే మరణం.

**యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్త దేవేతరో జనః**
**స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే**

ఇది భగవద్గీతలోని కర్మయోగంలోని 21వ శ్లోకం. "సంఘంలో శ్రేష్ఠుడు, ఉత్తముడు ఏ విధంగా నడుచుకుంటే సామాన్యులు కూడా అదే విధంగా అతని అడుగుజాడల్లో నడుస్తారు. ఉత్తముడు తన ప్రవర్తన ద్వారా ఏ ప్రమాణాల్ని నెలకొల్పితే దానినే లోకమంతా ఆచరిస్తుంది." ఇదీ ఈ శ్లోక పరమార్థం.

చూశారా! నలుగురి కోసం బతికిన మనిషి వెనుక నలుగురూ నడుస్తారు. ఆదర్శప్రాయమైన వ్యక్తిత్వం ఏర్పరుచుకొంటే, జీవితాన్ని సార్థకం చేసుకొంటే, ఆ వ్యక్తికి మరణమే ఉండదు. ఇది తథ్యం. ❖

**పిబన్తి నద్యః స్వయమేవ నాంభః**
**ఖాదన్తి న స్వాదుఫలాని వృక్షాః**
**పయోధరా స్సస్య మదన్తి నైవ**
**పరోపకారాయ సతాం విభూతయః**

నదులు తమ నీరు తామే త్రాగవు. చెట్లు తమ తియ్యని పండ్లను తామే తినవు. మేఘాలు తమ వృష్టి వల్ల పండిన పంటలను తామే అనుభవించవు. అలాగే, సత్పురుషులు తమ సంపదల్ని స్వప్రయోజనానికి కాకుండా పరోపకారానికే వినియోగిస్తారు. ❖

**ఆయుషః ఖండమాదాయ**
**రవిః అస్తమయం గతః ।**
**అహన్యః హనిబోద్ధవ్యం**
**కిమేతత్ సుకృతం కృతమ్ ॥**

సూర్యుడు ఉదయించి, అస్తమిస్తున్నాడంటే రోజు రోజుకీ ఆయుష్షు తరిగిపోతుందని అర్థం. అందువల్ల జీవితంలో సత్కర్మలను ఎంత త్వరగా ప్రారంభిస్తే అంత మంచిది. ❖

# యువవాణి

**– స్వామి పరిజ్ఞేయానంద**

**ఎస్. ఆరీఫ్, కడప**

**ప్రశ్న: నేను ఇంజనీరింగ్‌లో చేరి ఆరు నెలల పాటు తరగతులకు హాజరయ్యాను. కానీ నాకు పాఠాలు అర్థం కానందువల్ల చదువు మానేశాను. ఇప్పుడు ఐ.పి.ఎస్. కావాలని ప్రయత్నిస్తున్నాను. ఐ.పి.ఎస్. కావాలంటే నేనేం చేయాలి?**

**జవాబు:** ఏ రంగంలోనైనా విజయం సాధించాలంటే ముఖ్యంగా మూడు లక్షణాలు అవసరం. 1. లక్ష్యం 2. దృఢ సంకల్పం 3. ప్రయత్నం.

జీవితంలో ఒక గమ్యం నిర్దేశించుకున్నప్పటికీ దృఢ సంకల్పం లేకపోతే గమ్యాన్ని చేరలేం. అలాగే దృఢ సంకల్పం ఉండి కూడా ప్రయత్నం చేయకపోతే లక్ష్యాన్ని సాధించలేం. కాబట్టి ఈ మూడు లక్షణాల్లో ఏ ఒక్క లక్షణం లేకపోయినా విజయం సాధ్యం కాదు.

మీరు ఇంజనీరింగ్ కష్టంగా ఉందని ఇప్పుడు ఐ.పి.ఎస్.కు సిద్ధమవుతున్నారు. ఇలా లక్ష్యాల్ని మార్చుకుంటూ పోతే దేనిలోనూ విజయాన్ని సాధించలేరు.

'జీవితంలో ఒక లక్ష్యం ఏర్పరుచుకొని ఆ లక్ష్యం గురించే ఆలోచించు, కలలు కను, దాన్ని సాధించేవరకూ జీవిత సర్వస్వాన్ని అర్పించు– ఇదే విజయ రహస్యం' అని అంటారు స్వామి వివేకానంద.

Take up one idea. Make that one idea your life - think of it, dream of it, live on that idea. Let the brain, muscles, nerves, every part of your body, be full of that idea, and just leave every other idea alone. This is the way to success... *- Swami Vivekananda*



మీరు ఇంజనీర్ కావలన్నా, పోలీస్ అధికారి కావాలన్నా– లక్ష్యం ఏదైనప్పటికీ దానితోపాటు పట్టుదల, ప్రయత్నం తోడైతేనే విజయాన్ని సాధించగలరు.

**రాజేష్, హిందూపూర్.**

**ప్రశ్న: నేను గత మూడు సంవత్సరాలుగా ఉద్యోగ ప్రయత్నంలో ఉన్నాను. కానీ ఇంతవరకూ ఉద్యోగాన్ని సంపాదించలేకపోయాను. అందువల్ల మానసిక ఒత్తిడికి గురయ్యాను. దీని నుండి బయటపడే మార్గాన్ని తెలియజేయండి.**

**జవాబు:** మానసిక ఒత్తిడికి గురవడానికి ముఖ్య కారణాలు: 1. అపజయాలను అంగీకరించలేకపోవడం 2. మన శక్తిని మనం తక్కువగా అంచనా వేసుకోవడం 3. భవిష్యత్తు గురించి భయం చెందడం.

ముఖ్యంగా మన శక్తిమీద మనకు విశ్వాసం లేనప్పుడు ప్రతికూల భావాలు మనల్ని ఆవరిస్తాయి. ఆ స్థితిలో మనం నిస్సహాయులుగా, నిరాశావాదులుగా మారిపోతాం. ఇలాంటి నిస్సహాయ స్థితి నుండి బయటపడడానికి మనస్సుకు సానుకూల భావాలను అందించాలి. మనలో ఎప్పుడైతే సానుకూల దృక్పథం ఏర్పడుతుందో అప్పుడు ఎలాంటి క్లిష్టపరిస్థితులనైనా అధిగమించగలమనే ఆత్మవిశ్వాసం వృద్ధి చెందుతుంది. సానుకూల భావాలు గల మనస్సుతో మనం ఏ కార్యం చేపట్టినా దాన్ని సమర్థంగా నిర్వహించగలుగుతాం.

You will never fear the future if you believe that all your actions, all your thoughts are in accord with the positive ideas of your mind. *- Adolfo Torres*

'బాల్యం నుంచీ సానుకూల దృక్పథం అలవరచుకోకపోవడం వల్లనే మన దేశం వినాశపుటంచులకు చేరుకుంది' అని అంటారు స్వామి వివేకానంద.

By dwelling too much upon negativism, the whole country is going to ruin... Let positive, strong, helpful thought enter into their brains from very childhood...

*- Swami Vivekananda*

మీలో సానుకూల దృక్పథం ఏర్పడడానికి స్వామి వివేకానంద సాహిత్యాన్ని చదవండి. మీ ఆశయ సాధనలో తప్పక కృతకృత్యులవుతారు. ❖

మీ సందేహాల్ని పంపాల్సిన చిరునామా :
**యువవాణి**
శ్రీరామకృష్ణ ప్రభ, రామకృష్ణ మఠం,
దోమల్‌గూడ, హైదరాబాద్ – 500 029



# మనిషికి 'మతం' అవసరమా?

- స్వామి సేవ్యానంద

మానవుడు ఎప్పుడూ కొత్త విషయాలను తెలుసుకోవాలనీ, మరిన్ని కొత్త పద్ధతులను నేర్చుకోవాలనీ కుతూహలపడుతూ ఉంటాడు. ఈ జిజ్ఞాస వల్లనే మానవుడు భౌతిక విషయాలను తెలుసుకోవడంతో తృప్తి చెందకుండా ఇంద్రియాలకు అతీతమైన విషయాలను కూడా తెలుసుకోవాలని ప్రయత్నించాడు. మనస్సు తన వంతుగా అంతరంగ అన్వేషణను కొనసాగించి, 'మతం' అనే దివ్యమైన మార్గాన్ని మనిషికి అందించింది.

**మతం ఎందుకు? :** 'మనం ఉన్నదానితో తృప్తి చెంది, ఆనందంగా జీవించవచ్చుకదా! మతం గురించి, అతీతమైన విషయాల గురించి తెలుసుకోవడంలో ఏం ప్రయోజనం ఉంది?' అని చాలా మందిలో సందేహం రావచ్చు. మన చుట్టూ ఉన్న ఆవులు, కుక్కల వంటి జంతువులు కూడా ఉన్నదానితో తృప్తి చెంది బ్రతుకుతాయి. మనం కూడా వాటిలాగే చేస్తే మనకూ, జంతువులకూ తేడా ఏముంది?

మనిషి స్వాభావికంగా ఉన్నతిని కోరుతాడు. అందుకే, అతని ఆలోచనలు కూడా ఎప్పుడూ ఉన్నతంగా ఉంటాయి. మన అదృష్టం కొద్దీ భౌతిక సుఖాలతో తృప్తి చెందకపోవడం వల్లనే మనమంతా అనంతమైన ఆనందానికి అధికారులం కాగలుగుతున్నాం. ఈ మతాన్ని ఏ కొద్దిగానైనా ఆచరించడం వల్లనే నేడు మనల్ని 'మానవజాతి'గా చెప్పుకోగలుగుతున్నాం. లేదంటే ఇప్పటికే మనమంతా ఏ 'పశుజాతి'గానో లేదా అంతకంటే నీచమైన జాతిగానో మారేవాళ్ళం.

**నిస్వార్థతే నిజమైన మతం :** మనం ఎంత అభివృద్ధి చెందామన్నది మనలో ఉన్న ఆధ్యాత్మిక శక్తి మాత్రమే నిర్ణయించగలదు కానీ, మన దగ్గర ఉన్న ఆస్తులు, అంతస్తులు కాదు. ఈ ఆధ్యాత్మిక శక్తిని మనకు ఇచ్చేదే మతం. మానవ జాతి పురోగతి చెందడానికి మతం పాత్ర విశేషంగా ఉన్నప్పటికీ ఈ ప్రపంచంలో జరిగిన వివాదాలు, రక్తపాతాలు, మారణ హోమాలలో అత్యధిక భాగం మతం పేరుతోనే జరిగాయన్న విషయం మనం మరచిపోకూడదు. అయితే దీనికి కారణం మనిషి యొక్క అవివేకమే కానీ, మతం యొక్క దోషం కాదు.

ఒక మందిరంలో చాలా కాలం నుంచి కొన్ని పావురాలు ఆనందంగా జీవిస్తున్నాయి. ఒకరోజు మరొక పావురాల గుంపు అక్కడకు రావడం జరిగింది. విషయం ఏమిటని మొదటి పావురాల గుంపు యొక్క నాయకురాలు అడిగింది. "మేము ఉంటున్న ప్రార్థనాలయంపై ఎవరో హఠాత్తుగా వచ్చి, దాడిచేసారు. అక్కడి అశాంతిని తట్టుకోలేక మేమంతా ఇక్కడకు వచ్చాం. దయచేసి కొంత కాలం మాకు స్థానమివ్వండి" అని రెండవ పావురాల గుంపు యొక్క నాయకురాలు వేడుకుంది. "మీరు తప్పకుండా మాతోపాటు కలసి ఉండండి" అని మొదటి నాయకురాలు అనుమతినిచ్చింది. ఈ సంభాషణ ఇలా జరిగాక మొదటి గుంపులో నుంచి ఒక పావురం "ఈ మానవులు మతం పేరుతో ఎప్పుడూ గొడవపడి, ఎందుకు అశాంతిని సృష్టిస్తారు? చర్చిలో ఉన్నా, మసీదులో ఉన్నా, గుడిలో ఉన్నా మనమంతా కలసి ఉండటం లేదా? ఈ మానవులు కూడా మనలాగే కలిసి మెలసి శాంతిగా ఉండవచ్చు కదా!" అని అంది. సమాధానంగా మొదటి నాయకురాలు "మనం ఏం చేయగలం? భగవంతుడు మనకిచ్చిన ఈ పాటి బుద్ధి మనిషికి ఇవ్వలేదేమో!" అని అంది.

మనం మతాన్ని అనుసరించడం స్వార్థపరులుగా మారి, వివాదాలు పెంచుకోవడానికి కాదు. నిస్వార్థతను అలవరచుకొని, పరిపూర్ణులమవడానికి మతాన్ని ఆశ్రయించడం. "నీవు నిస్వార్థపరుడవా? నిస్వార్థపరుడవైతే ఒక్క ధార్మిక గ్రంథాన్నైనా చదువకుండానే, ఒక్క మందిరానికైనా లేదా ప్రార్థనాలయానికైనా వెళ్ళకుండానే పరిపూర్ణుడవవుతావు." అని స్వామి వివేకానంద చెబుతారు.

**మనసులెన్నో మతాలన్ని :** సమాజంలో శాంతిని నెలకొల్పడానికి మానవులంతా ఒకే మతాన్ని అనుసరించడమే సరైన ఉపాయమని కొంతమంది అభిప్రాయం. ఇది ఎన్నటికీ సాధ్యం కాని విషయం. మనసులెన్నో మతాలన్ని! నదులన్నీ వేరు వేరు మార్గాలలో ప్రవహించినప్పటికీ చివరికి ఒకే సముద్రంలో కలిసినట్లు ఈ మతాలన్నింటి లక్ష్యం ఒక్కటే! మనిషిని మనీషిగా మార్చడం!! మనిషిని భగవంతుని దగ్గరకు చేర్చడం!! మనమంతా 'మతం' అనే దివ్యమార్గాన్ని అనుసరించి పరిపూర్ణులం కావడానికి ప్రయత్నిద్దాం. ❖

# ఒత్తిళ్ళు ఉండాల్సిందే!

– స్వామి శ్రీకాంతానంద

ఒత్తిళ్ళు లేనిదెవరికి? ఎంతో కొంత ఒత్తిడి అందరి మనస్సుల్లోనూ ఉంటుంది. నిజానికి అది అవసరం కూడా! ఒత్తిడి ఒక ఇంధనం లాంటిది. అసలు ఏ ఒత్తిడీ లేకపోతే మానవ జీవితంలో ఏ ప్రగతీ ఉండదు. ఇంధనం లేని వాహనంలా అతని గమనమే స్తంభించిపోతుంది. వాస్తవానికి ఒత్తిళ్ళను ఎదుర్కొనే కొద్దీ మానసిక శక్తి మరింత బలపడుతుంది. ఒత్తిడి ఒక సవాలు లాంటిది. అలా సవాలుగా తీసుకునే వారికి ఒత్తిడి మంచే చేస్తుంది. కాకపోతే ఆ ఒత్తిడి ఒక పరిమితిలో ఉన్నంత వరకు సరే కానీ, ఆ పరిధి దాటిపోతేనే కొన్ని సమస్యలు మొదలవుతాయి. అలా పరిమితి దాటిపోవడానికి చాలాసార్లు మన ప్రణాళికలోనే ఏదో లోపం ఉంటుంది. మనం ఎంచుకునే మార్గంలోనే ఏదో లోపం ఉంటుంది. కానీ, దాన్ని మనలో చాలా మంది గుర్తించలేరు. ఎవరైనా దాన్ని గుర్తించినా అప్పటికే చాలా ఆలస్యమైపోతుంది.

**అనంత శక్తి మనలోనే!:** మనం ఒత్తిడికి గురి కావడానికి ప్రధానంగా రెండు కారణాలు ఉంటాయి. ఒకటి – మన శక్తిని తక్కువగా అంచనా వేసుకోవడం, లేదంటే మన శక్తికి మించిన కోరికలు కలిగి ఉండడం. ఒకవేళ నిజంగానే మన శక్తికి మించిన కోరికలు మనలో ఉంటే వాటిని వదిలేయడం తప్పనిసరి అవుతుంది.

మౌలికంగా మనిషిది ఆధ్యాత్మిక సంస్కృతి. భౌతిక విషయాలకు తక్కువ ప్రాధాన్యాన్నీ, ఆధ్యాత్మిక విషయాలకు ఎక్కువ ప్రాధాన్యాన్నీ ఇచ్చే సంస్కృతి. అదే మనల్ని క్రమశిక్షణలో నడిపిస్తుంది. ఈ క్రమశిక్షణను కోల్పోయినప్పుడే మనిషికి దేని మీదా అదుపు ఉండదు. నేడు మనిషి ఎదుర్కొంటున్న సమస్యల్లో చాలావరకు ఈ క్రమశిక్షణ లోపించడం వల్ల వచ్చినవే! అనుకున్నది సాధించుకోవడానికి మనిషి పగలూ రేయీ శ్రమిస్తున్నాడు. ఇది అతణ్ణి ఎంతో ఒత్తిడికి గురి చేస్తోంది. నిజానికి మనం చేస్తున్న పని వల్ల మనకు ఆనందం కలిగితే దాని వల్ల ఎప్పుడూ ఒత్తిడి కలుగదు. అయితే, ఆ ఆనందం ఉన్నత లక్ష్యాల కోసం, ఉన్నత విలువల కోసం చేసే పనులలో మాత్రమే కలుగుతుంది. అలా కాకుండా అపరిమితంగా కోరికలు, వ్యాపకాలు పెంచుకుంటూ పోతే అది ఒత్తిడినే నింపుతుంది. అది శరీరాన్నీ, మనస్సునూ దెబ్బ తీస్తుంది. అయినా దాన్ని మనం పట్టించుకోం. ఫలితంగా కొద్దిరోజుల్లో శరీరం, మనస్సు తమ చైతన్యాన్ని కోల్పోతాయి. అప్పుడు ఆశల సాధనలో సహకరించడం మానేస్తాయి. మౌలికంగా మనిషి ఆనంద స్వరూపుడు. శాశ్వత ఆనందం శారీరక, భౌతిక విషయాల నుంచి రాదు. కానీ ఆధునిక మానవుడు ఆ సత్యాన్ని గమనించడంలో నిర్లక్ష్యం వహిస్తున్నాడు. ప్రతి ఒక్కరూ ఆనందం కోసం బయట వెతుకుతూ ఉన్నారు కానీ, నిజానికి అది ఉన్నది మనలోనే!

ఒత్తిడి ఎక్కువగా పోటీతత్త్వం నుంచి వస్తుంది. అది ఆరోగ్యకరంగా ఉంటే నష్టమేమీ ఉండదు. కానీ, చాలాసార్లు అది అసూయ, ద్వేషాల మధ్య కాలిపోతోంది. ఎదుటి వారిని తనలో భాగమనుకునే ఆధ్యాత్మిక తత్త్వం లేకపోవడమే ఇందుకు కారణం. అది అతని సంతోషాన్ని హరించి వేస్తుంది.



వాస్తవానికి సంతోషంగా లేని వారే ప్రతి పనిలోనూ ఒత్తిడికి గురవుతుంటారు. మనస్సులో సంతోషమే ఉంటే అది ఎన్ని ఒత్తిళ్ళనైనా అధిగమించేలా చేస్తుంది. ఒత్తిడి దశలు వేరు కావచ్చు కానీ, అసలే ఒత్తిడి లేని వారంటూ ఎవరూ ఉండరు. కాకపోతే ఆ ఒత్తిడిని సానుకూలంగా చూస్తున్నారా, లేక ప్రతికూలంగా చూస్తున్నారా అన్నది ముఖ్యం.

సమాజం నుంచి మనల్ని మనం విడదీసుకుని చూసుకోవడం కూడా ఈ ఒత్తిడికి కారణం. ఆధ్యాత్మికంగా ఎదిగే కొద్దీ మనిషి మానసికంగా ఇతరులతో కలిసిపోతాడు. అప్పుడు ఇతరుల కష్టాలే కాదు, ఇతరుల ఆనందాలూ తనవవుతాయి. అలా అతని పరిధి పెరుగుతుంది. ఇది మానసిక ఒత్తిళ్ళను అధిగమించేలా చేస్తుంది.

మానసిక ఒత్తిళ్ళ విలువలను సరిగ్గా అంచనా వేయడం వల్ల కూడా వాటిని అధిగమించే శక్తి వస్తుంది. ఇప్పుడున్న ఈ కాస్త మెరుగైన స్థితికి ఒకప్పుడు మనం ఎదుర్కొన్న ఒత్తిళ్ళే కారణమని గ్రహిస్తే చాలు. ఇప్పుడున్న ఒత్తిళ్ళను మనం సానుకూలంగా తీసుకునే శక్తి వచ్చేస్తుంది.

హృదయం సంకుచితమైతే ప్రతిదీ బాధిస్తుంది. విశాలమైతే అదే ఆనందాన్నిస్తుంది. అలా హృదయాన్ని విశాలం చేసే తత్త్వం ఆధ్యాత్మిక జ్ఞానం వల్ల కలుగుతుంది. అందరి నుంచీ తాను విడిపోకుండా అందరిలో తానూ కలిసిపోయే వేళ ఏదీ ప్రత్యేకంగా అతణ్ణి తాకదు. అందరి కష్టాలూ తన కష్టాలవుతాయి. అందరి సంతోషాలూ తన సంతోషాలవుతాయి. భిన్నత్వంలోనే ఏకత్వం అతనికి బోధపడుతుంది. అందరి నుంచి విడిపోతే, ఒక చిన్న సమస్య కూడా కొండంతలా కనిపిస్తుంది. అందరితో కలిసిపోతే ఎంత పెద్ద సమస్య అయినా చిన్నదై పోతుంది.

పంచభూతాలతో తయారైన మనిషిలో అనంతమైన శక్తి ఉంది. ఆ శక్తిని గుర్తించలేని వారే ఆత్మన్యూనతా భావానికి గురవుతారు. వారికి ప్రతి పనీ ఎంతో భారంగా కనిపిస్తుంది. కొందరిలో చేస్తున్న పని మీద అనిష్టం కూడా మానసిక ఒత్తిడికి కారణం కావచ్చు.

ఎంతటి పనినైనా చేసేయగలనన్న ఆత్మవిశ్వాసంతో ఉండడం అన్నిటి కన్నా ముఖ్యం. అప్పుడు ఒత్తిడిని ఒక సవాలుగా, ఒక గొప్ప అవకాశంగా తీసుకునే స్థితికి మనస్సు చేరుకుంటుంది. ఒత్తిడి మీద విజయం సిద్ధిస్తుంది. ❖

# చెడు స్నేహం చేటు

– ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి



**కానివాని తోడఁ గలసి మెలంగిన**
**హాని వచ్చునెంత వానికైన**
**కాకిఁ గూడి హంస కష్టంబు పొందదా!**
**విశ్వదాభిరామ వినుర వేమ!**

**భావం :** తప్పుడు పనులు చేసే మనిషితో, కలసి మెలసి వ్యవహారం జరిపినట్లయితే గొప్పవారైనా ప్రమాదంలో పడిపోతారు. కాకితో కలిసి ఉన్న హంస కూడా కష్టాల పాలవుతుంది.

**వ్యాఖ్య :** కాకిని చెడ్డవారికి, హంసను మంచి వారికి ప్రతీకలుగా యోగి వేమన పోల్చారు. చెడువారితో స్నేహం చేయకూడదని తాత్పర్యం. కల్లు తాగుతున్న వాడి ప్రక్కన మరొక వ్యక్తి కూర్చుంటే లోకం అతడూ తాగుతున్నాడను కొంటుంది. చెడ్డవారితో స్నేహం చేసిన మంచివారికి కూడా చెడ్డ పేరు వస్తుంది. దొంగ వెంట తిరిగితే దొరైనా దొంగగా మారుతాడు.

ఓ పంచతంత్రం కథలో కాకి నెమలి ఈకలు కుచ్చుకొని నెమలిలా నృత్యం చేస్తుంది. అలా నృత్యం చేస్తున్నప్పుడు ఈకలు రాలిపోయి కాకి రంగు బయట పడుతుంది. అప్పుడు నెమళ్ళు కాకిని పొడచి తరిమివేస్తాయి.

చెడువారితో సహవాసం ఎప్పటికైనా ప్రమాదకరం. అందువల్ల ఇతరులతో స్నేహం చేసే ముందు వారి మంచీ చెడులను గురించి బాగా తెలుసుకొన్న తరువాతే సన్నిహితులమవడం శ్రేయస్కరం. ❖

# ధ్యానానికి నైతిక విలువలు అవసరమా?

– స్వామి రఘునాయకానంద

నైతిక విలువలు ఆచరించకుండా ధ్యానం చేయడం సాధ్యమేనా? యోగ శాస్త్ర పితామహుడు పతంజలి ధ్యానానికి ముందు ఆచరించవలసిన కొన్ని నైతిక విలువలను నిర్దేశించాడు. యమ, నియమ, ఆసనం, ధారణ, ధ్యానం... అంటూ వివరించాడు. అంటే ధ్యానానికి ముందు పాటించవలసిన మొట్టమొదటిది యమం. అహింస, సత్యం, అస్తేయం, బ్రహ్మచర్యం, అపరిగ్రహం – ఈ అయిదింటినీ కలిపి 'యమం' అంటారు. పోయిన సంచికలలో అహింస, సత్యం గురించి తెలుసుకొన్నాం. ఈ సంచికలో అస్తేయం అంటే ఏమిటో చూద్దాం.

### అస్తేయం అంటే...

అస్తేయం (The virtue of non-stealing) అంటే ఇతరుల వస్తువులు దొంగిలించకుండా ఉండడం మాత్రమే కాదు; మనది కానిది దేనినీ ఉపయోగించకుండా ఉండడం అస్తేయం. ప్రస్తుత సమాజంలో ఉన్న పరిస్థితిని గమనిస్తే – స్వార్థ ప్రయోజనాల కోసం ప్రజాధనాన్ని ఉపయోగించడం, సొంత భవన నిర్మాణం కోసం పది మందికీ ప్రయోజనం చేకూర్చే బహిరంగ ప్రదేశాలను కాజేయడం, అధికారులు తమ క్రింది ఉద్యోగులను వాళ్ళ సొంత పనులకు ఉపయోగించుకోవడం, ఆందోళనలు, రాస్తారోకోలు అంటూ బస్సులకు నిప్పు అంటించడం – మరి ఇవన్నీ మనవి కానివి, మనం ఉపయోగించకూడనివి, మనం చేయకూడనివి కదా!




### అస్తేయానికి ఆణిముత్యాలు

ఒకసారి చాణుక్యుడు రాత్రిపూట రాచకార్యానికి సంబంధించిన పనిలో నిమగ్నమై ఉన్నాడు. ఇంతలో అతని స్నేహితుడు వచ్చాడు. వచ్చిన స్నేహితుణ్ణి పలకరిస్తూనే అక్కడ వెలుగుతున్న దీపాన్ని ఆర్పి ప్రక్కన ఉన్న దీపాన్ని వెలిగించి మిత్రునితో సంభాషణ మొదలుపెట్టాడు చాణుక్యుడు. స్నేహితుడికి ఏమీ అర్థం కాక చాణుక్యుణ్ణి ప్రశ్నించాడు. 'మీరు వచ్చేటప్పటికి నేను పనిచేస్తున్న రాచకార్యానికి రాజుగారు ఇచ్చిన దీపాన్ని ఉపయోగిస్తున్నాను. ఇప్పుడు నేను మీతో మాట్లాడేది రాచకార్యం కాదు కదా! అందుచేత ఆ దీపాన్ని ఆర్పి నా సొంత దీపాన్ని వెలిగించాను' అని చాణుక్యుడు సమాధానం చెప్పాడు.

స్వామి వివేకానంద తన శిష్యులతో అమెరికాలో క్యాంప్‌టేలర్ అనే ప్రదేశంలో ఉన్నప్పుడు ఒక రోజు దువ్వెన క్రింద పడిఉండడం గమనిస్తారు. వెంటనే దాన్ని తీసి ఈ దువ్వెన ఎవరికి చెందినది అని అక్కడ ఉన్నవారిని ప్రశ్నిస్తారు. అది ఎవరిదీ కాదు అన్నప్పుడు స్వామి వివేకానంద దాన్ని ఆ ఉన్నచోటనే ఉంచేస్తారు.

శ్రీరామకృష్ణులు వారి అంత్యలీల సమాప్తిదశలో తీవ్రమైన గొంతు క్యాన్సర్ వ్యాధితో బాధపడుతున్నప్పుడు డాక్టర్ మహేంద్రలాల్ సర్కార్ శ్రీరామకృష్ణుల వ్యాధి ఉపశమనానికి గాను ప్రతి రోజూ నిమ్మరసాన్ని త్రాగమని సూచిస్తారు. ఆ పని తన సన్న్యాస శిష్యుడైన స్వామి యోగానందకు అప్పగిస్తారు. ఆయన దగ్గర్లో ఉన్న నిమ్మతోట కౌలుదారు వద్ద రోజూ ఒక నిమ్మపండు తీసుకొనేందుకు అనుమతి తీసుకొన్నాడు. ఆ విధంగా తెచ్చిన నిమ్మకాయతో చేసిన రసాన్ని శ్రీరామకృష్ణులు త్రాగేవారు. ఒక రోజు ఆయన సేవించడం మానేసారు. శిష్యులు ఎంత బ్రతిమాలినప్పటికీ వారు త్రాగలేదు. తరువాత తెలిసింది ఏమిటంటే ఆ నిమ్మ తోటకు ఆ రోజు నుంచి కొత్త కౌలుదారు వచ్చాడట. ఆ విషయం శిష్యునికి తెలియక తీసుకువచ్చాడు. కోసుకోవడానికి అనుమతి ఇచ్చినది కొత్త కౌలుదారు కాదు కదా!

### ఆశను వీడితేనే అస్తేయం సాధ్యం

ఒక వస్తువు మీద రాగం కలిగేది ఆశతోనే. ఈ ఆశను వీడితే అస్తేయం సాధ్యం. మనది కానిది మనకు తీసుకోవాలని పించడానికి కారణం కోరిక. అంతులేని కోరికలు అనంతమైన దుఃఖాలకు దారి తీస్తాయి. ఇతరుల వస్తువులను వారి అనుమతి లేకుండా వినియోగించకూడదు. సంపాదనలో కొంచమైనా పేద ప్రజలకు సహాయం చేయాలి. అలా చేయకపోయినా అది దొంగతనమే.

కోరికలు అదుపులో ఉన్నప్పుడే మనో నియంత్రణ సాధ్యం. అప్పుడే అస్తేయం ఆచరించ వీలవుతుంది. అలా నియంత్రించిన మనస్సుతోనే ధ్యానం సాధ్యం. దానికి నైతిక విలువలు, ఆచరణ ముఖ్యం. తద్వారా మాత్రమే ధ్యానానికి అర్హులం కాగలం. ❖



(1884 – 1967)

# ముందుకు సాగిపో!

**దివ్యజనని శ్రీశారదాదేవి ప్రత్యక్ష శిష్యులైన స్వామి ప్రేమేశానంద (1884-1967) రామకృష్ణ సంఘంలో అత్యున్నత గౌరవాన్నీ, ప్రేమాభిమానాలనూ చూరగొన్న అగ్రశ్రేణి సన్న్యాసి. ఆయన జీవితం శ్రీరామకృష్ణ - వివేకానందుల ఆశయాలతోనూ, భగవద్గీత సారాంశంతోనూ నిండింది. చాలామంది యువతీ యువకులకూ, గృహస్థులకూ, బ్రహ్మచారులకూ, సన్న్యాసులకూ ఆయన ఎన్నో లేఖలు వ్రాశారు. జీవితంలో అంకితభావం, ఆధ్యాత్మిక, సేవా భావాలను అలవరచుకొనేందుకు ఆ లేఖా పరంపరలు మార్గదర్శకాలయ్యాయి. పాఠకుల ప్రయోజనార్థం విలువైన ఈ లేఖలను 'శ్రీరామకృష్ణ ప్రభ'లో 2009 జూన్ సంచిక నుంచి ధారావాహికంగా ప్రచురిస్తున్నాం.**

సార్‌గచీ,
21, జూన్ 1958.

**ప్రియమైన విమల***

నీ ఉత్తరం చేరింది. చాలా ఆనందించాను. అమ్మ శారదను నీవు నీ జీవితానికి ఆదర్శంగా తీసుకున్నందుకు చాలా సంతోషం.

అమ్మా విమలా! మన స్త్రీల ఆశ్రమాల్లో నీకు నివాసం కల్పించడం పూర్తిగా అసాధ్యం. నీవు దివ్యజనని శారదామాతను ఆదర్శంగా తీసుకొని జీవించాలనుకుంటూనే ఒక పక్క నిస్సహాయుడూ, పేదవాడూ అయిన నీ భర్తను అనాథుణ్ణి చెయ్యాలని భావిస్తున్నావు. నీ బాగు గురించి మాత్రమే నీవు ఆలోచిస్తున్నావు. పెళ్ళినాడు నీవు చేసిన ప్రమాణాలు మరచిపోయావా తల్లీ! జీవితాంతం సహధర్మచారిణిగా ఉంటానని పవిత్రమైన అగ్నిసాక్షిగా చేసిన ప్రమాణం మాటేమిటి? మన అమ్మ శారదమ్మ మంచిలోనూ, చెడులోనూ, సుఖంలోనూ, దుఃఖంలోనూ శ్రీరామకృష్ణుల మీదే భారం వేసి చేసిన సేవను ఒక్కసారి జ్ఞాపకం చేసుకో!

ఇప్పుడు నువ్వు చెయ్యవలసింది ఏమిటంటే – నీ భర్త శ్యామపాదకు సహకరిస్తూ, మంచి సలహాలనిచ్చి ఏదైనా ఉద్యోగం సంపాదించేలా ప్రోత్సహించాలి. అప్పుడు పేదరికం తొలగి, మీరు ఇరువురూ మంచి ఫలితాన్ని పొందుతారు. ఎందుకు చెబుతున్నానంటే – "దారిద్ర్యమనే లోపం ఎన్ని సుగుణాలనైనా నాశనం చేస్తుంది" అని శాస్త్రాలు చెబుతున్నాయి.

ఇంకొక విషయాన్ని గమనించు – 'సర్వం పరవశం దుఃఖం, సర్వం ఆత్మవశం సుఖం' (మను సంహిత, 160.) – పరాధీనంలో జీవించడం వల్ల అడుగడుగునా బాధలే. స్వేచ్ఛాయుత జీవనంలో మనస్సు ఉత్సాహంగా ఉంటుంది. నువ్వు కూడా ఇంటి వద్దే ఉంటూ ఏదైనా కొంత సంపాదించగలిగావంటే నువ్వు లబ్ధి పొందడమే కాకుండా నీ కుటుంబానికి కూడా సహాయం చేసినదానవు అవుతావు.

ఇప్పుడున్న పరిస్థితుల్లో మీ దంపతులిద్దరూ మీ గ్రామంలోనే ఉంటూ ఆదర్శవంతమైన జీవితాన్ని గడపడం శ్రేష్ఠం. అది మీ గ్రామంలోని స్త్రీ పురుషులకు ఎంత మేలు చేకూరుస్తుందో ఆలోచించు! ఒక మంచి పని ప్రారంభించినప్పుడు అనేకమైన అవరోధాలు వస్తాయి. మొదట్లో మేము ఎన్ని కష్టాలు పడ్డామో! ఎన్ని నిరసనలకూ, హేళనలకూ గురి అయ్యామో! గురుమహరాజ్ అనుగ్రహం వల్ల ఈనాడు సచ్చిదానందాన్ని చవిచూడగలుగుతున్నాం. మీ దంపతులిద్దరూ మీ మనస్సులనూ, వాక్కులనూ ఒక్కటిగా చేసి గురుమహరాజ్ పాదాల వద్ద శరణుజొచ్చితే ఆయన అనుగ్రహంతో త్వరలోనే మీకు మంచి రోజులు తప్పక వస్తాయి.

చలతి ఏకేన పాదేన తిష్ఠతి ఏకేన బుద్ధిమాన్ ।
న అసమీక్ష్య పరమ్ స్థానం పూర్వం ఆయతనం త్యజేత్ ॥ *(హితోపదేశః, మిత్రలాభమ్, 109)*

'తెలివైనవాడు ఒక మెట్టు పైన నిలబడి మరో మెట్టుకై ఎదురు చూస్తాడు. మరో మెట్టు లేనప్పుడు తానున్న మెట్టును వీడకుండా అక్కడే సంతృప్తిగా ఉండడానికి ప్రయత్నిస్తాడు'.

ప్రేమాశీస్సులతో...

**స్వామి ప్రేమేశానంద**

(*విమలా పాత్రా వివాహం అయిన తరువాత సంసారాన్ని వీడి సన్న్యాసం స్వీకరించాలని నిర్ణయించుకున్నారు. అయితే, స్వధర్మాన్ని వీడకుండా గృహస్థుగానే ఉంటూ జీవిత పరమార్థాన్ని సాధించవచ్చని స్వామి ప్రేమేశానందజీ ఆమెను ప్రోత్సహించారు).

**తెలుగుసేత : కె. త్రివిక్రమరావు**

**...15వ పేజీ తరువాయి.**

పవిత్ర సాంగత్యం నాకు లభించదు. దయచేసి మరెవరినైనా పంపండి" అన్నాను. మహరాజ్ నవ్వారు. నేను వారి గది నుండి బయటకు వచ్చాక మిగతా స్వాములు నా గురువే కాకుండా సంఘాధ్యక్షులు అయిన వ్యక్తి పట్ల నా ప్రవర్తన దురుసుగా ఉందని నన్ను మందలించారు. అందువల్ల నేను వారి గదికి తిరిగి వెళ్ళి, వారిని క్షమాపణ కోరి, "మహరాజ్! నేను నాట్రంపల్లి వెళతాను" అన్నాను. "లేదు, నువ్వు వెళ్ళనవసరం లేదు. నువ్వు నాతోనే ఉండు" అన్నారు. నా బదులు స్వామి చిద్భవానందను పంపించారు.

మరొక రోజు నేను తోటలో పూలు కోస్తుండగా మహాపురుష్ మహరాజ్ కిటికీ నుండి నన్ను పిలిచి, కాసిని పూలు ఇమ్మన్నారు. నేను స్వామికి పూలు ఇవ్వడానికి తటపటాయించాను. పూజ కోసం కోసిన పూలు ఎవరి శరీరానికి గానీ, దుస్తులకు గానీ, శిరోజాలకు గానీ తగలరాదనీ, ఆ పూలను గుడిలోకి తీసుకొని వెళ్ళే ముందు వాటిని బాగా కడగాలనీ కూడా స్వామి అనంతా నంద చెప్పారు. నా తటపటాయింపు చూసిన మహరాజ్ "నేను గుడికి వెళుతున్నాను. నాకు కాసిని పూలు ఇవ్వు! వాటిని నేను గురుదేవులకు అర్పిస్తాను" అన్నారు. నేను వెంటనే వారికి కొన్ని పూలు ఇచ్చాను.



అప్పుడప్పుడు మహరాజ్‌కు వీపు నొప్పి వచ్చేది. వారు రోజూ నడవడానికి వెళ్ళేవారు. ఒకరోజు నొప్పి నుండి ఉపశమనం పొందడానికి నన్ను వీపు పట్టమన్నారు. నా గురువుగారికి కొంత కాలం వ్యక్తిగతమైన సేవ చేసే భాగ్యం లభించడం నా అదృష్టం అనిపించింది.

1927లో 'నాకు బేలూరు మఠం చూడాలని ఉంది'అని మహాపురుష్ మహరాజ్‌కు లేఖ వ్రాశాను. వారు నన్ను స్వామి యతీశ్వరానంద వద్ద అనుమతి తీసుకుని రావాల్సిందని అన్నారు. నేను అలాగే చేశాను. అప్పుడు కొద్దిమంది దక్షిణాది సాధువులు బేలూరు మఠంలో ఉన్నారు. మహాపురుష్‌జీ మా పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపేవారు. వారు మా కోసం రసం, సాంబారు, పెరుగు లాంటి ప్రత్యేకమైన దక్షిణాది ఆహారపదార్థాలు ఉండేలా శ్రద్ధ చూపేవారు.

అదే సంవత్సరం వివిధ కేంద్రాల నుండి కొంతమంది బ్రహ్మచారులు సన్న్యాస దీక్షకై బేలూరు మఠం వచ్చారు. మహాపురుష్‌జీ నన్ను "భజహరీ! నువ్వు సన్న్యాస దీక్ష తీసుకోవా?" అని అడిగారు. నేను "కాదు మహరాజ్! ఈ సంవత్సరం కాదు. నేను సన్న్యాస దీక్ష తీసుకోవడానికి ఇంకా ఒకటిన్నర సంవత్సరం ఆగాలి" అన్నాను. స్వామి అపూర్వానంద ఇది విని, నేను మహరాజ్ గది నుండి వచ్చాక మహాపురుష్‌జీ దగ్గర వెంటనే సన్న్యాస దీక్ష కోరనందుకు నన్ను మందలించారు. అప్పుడు నేను వారితో "నేను సన్న్యాస దీక్ష ఇప్పుడు తీసుకుంటే చాలా కాలం వరకూ బేలూర్ మఠానికి రాలేను" అన్నాను.

1930లో నేను తిరిగి బేలూరు మఠానికి వెళ్ళినప్పుడు "స్వామిజీ జన్మతిథి నాడు నేను సన్న్యాస దీక్ష తీసుకోవచ్చునా" అని మహాపురుష్‌జీని అడిగాను. మహరాజ్ "ఓహో! నువ్వు స్వామీజీ జన్మదినాన సన్న్యాస దీక్ష తీసుకోదలిచావా? నిజమే, స్వామీజీ జన్మదినం కూడా శ్రీరామకృష్ణుల జన్మదినమంత ప్రత్యేకమైనది. స్వామి శుద్ధానంద దగ్గరకు వెళ్ళి ఆయనకు నీ పేరు ఇవ్వు" అన్నారు. స్వామి శుద్ధానందజీ దగ్గరకు వెళ్ళినప్పుడు ఆయన "నువ్వు స్వామీజీ జన్మదినాన సన్న్యాస దీక్ష కోరుతున్నావెందుకు? మామూలుగా శ్రీరామకృష్ణుల జన్మదినాన సన్న్యాస దీక్ష ఇస్తారు" అన్నారు. నేను మౌనంగా ఉన్నాను. చివరకు స్వామీజీ జన్మదినాన నేను సన్న్యాస దీక్ష స్వీకరించాను.

సన్న్యాస దీక్ష తీసుకున్నాక నేను అలహాబాద్‌లో జరిగే కుంభమేళాకు వెళదామనుకున్నాను. మహాపురుష్‌జీని అనుమతి అడిగాను. వారు నా దగ్గర పైకం ఉందా అని అడిగారు. నా దగ్గర 12 రూ|| ఉన్నట్లు చెప్పాను. ఆ రోజులలో కలకత్తా నుండి అలహాబాద్ వెళ్ళే రైలు టికెట్టు ధర 4 రూ|| మహరాజ్ వెళ్ళమన్నాక వారి ఆశీర్వచనం తీసుకొని, నేను బయల్దేరి అలహాబాద్ వెళ్ళాను.

ఎన్నో ఏళ్ళు గడచిపోయినా సరే మహాపురుష్ మహరాజ్ నా జ్ఞాపకాలలో ఇంకా సజీవంగానే ఉన్నారు. ఆయన మహోన్నతులు. మృదువైన మనసున్న మహాపురుషులు. ❖

(*స్వామి సర్వజ్ఞానందజీ, స్వామి శివానందజీ మహరాజ్ శిష్యులు. పూజ్య స్వామీజీ తమిళనాడులోని నాట్రంపల్లి రామకృష్ణ మఠం అధ్యక్షులుగా ఉన్నప్పుడు గ్రామీణ ప్రజల సంక్షేమం కోసం ఎనలేని కృషిచేశారు. శ్రీరామకృష్ణుల సందేశాన్ని గ్రామగ్రామాలకూ వెళ్ళి ప్రచారం చేశారు.)

(డిసెంబర్ 12, శనివారం – శ్రీరామకృష్ణ పరమహంస సన్న్యాస శిష్యులైన **స్వామి శివానంద జయంతి**)

# ధీరగుణం

– ఆర్. కృష్ణ

మన వల్ల తప్పు జరిగినప్పుడు జరిగిన తప్పుకు నేనే బాధ్యుణ్ణి అని ఒప్పుకోవడంలోనే ధీరత్వం ఉందంటారు స్వామి రంగనాథానందజీ మహరాజ్. సాధారణంగా మన దగ్గర ఏదైనా పొరపాటు జరిగినప్పుడు అబద్ధం చెప్పి తప్పించుకోవడానికి ప్రయత్నిస్తుంటాం. లేదంటే ఇతరుల మీదకు నెట్టడానికో, కప్పిపుచ్చుకోవడానికో ప్రయత్నం చేస్తుంటాం. అబద్ధమాడి కప్పిపుచ్చుకునేవారు; మానసికంగా బలహీనులవుతారు; భయానికి లోనవుతారు. మరిన్ని తప్పులూ చేస్తారు. ఒక తప్పును కప్పిపుచ్చితే మరిన్ని తప్పులు చేయాల్సి వస్తుంది.

ఆరేళ్ళప్రాయంలో ఉన్నప్పుడు స్వామి రంగనాథానంద ఒక వ్యక్తితో ఘర్షణ పడి, అతని మీదకు కట్టెను విసిరారు. అది అతనికి గట్టిగా తగిలింది. అతను తనకు తగిలిన దెబ్బను రంగనాథానందజీ అమ్మగారికి చూపించి ఫిర్యాదు చేశారు. బడి నుంచి ఇంటికి వెళ్ళేసరికి స్వామి రంగనాథానందుల వారి తల్లి "అతణ్ణి కట్టెతో కొట్టడం నిజమేనా?" అని అడిగారు. "నిజమే! ఆవేశానికి లోనై కట్టె విసిరాను. అది అంత దూరం వెళ్ళి అతనికి తగులుతుందని అనుకోలేదు" అని తడుము కోకుండా చెప్పారు. అతనికి తగిలిన దెబ్బకు తల్లి మందలిస్తూ, స్వామీజీకి పది దెబ్బలు శిక్ష విధించారు.



భగవద్గీతా ప్రసంగాల్లో స్వామి రంగనాథానందజీ తన వల్ల జరిగిన తప్పు గురించి వివరిస్తూ, పొరపాటు జరిగినప్పుడు అది ఒప్పుకొని శిక్ష అనుభవిస్తే అది మధురంగా ఉంటుందని విశ్లేషించి చెప్పారు. ఘర్షణ వైఖరి అవలంబించడం వల్ల తప్పులు చేస్తాం. ఘర్షణ వైఖరికి లోను కావడం ఒక బలహీనతగా తలచి ఇక ముందు అలాంటి పొరపాటు జరగకూడదని నిర్ణయించుకొని జీవితంలో పాటించారు స్వామి రంగనాథానంద. కోపం, ఆవేశం వచ్చినప్పుడు అది బలహీన క్షణం అని మదిలో భావించి నిగ్రహించుకోవాలి. అంతే తప్ప ఆ క్షణాల్లో చర్యలకు తలపెట్ట కూడదు. ఆవేశంగా ఉన్నప్పుడు ఉచితానుచితాలు మరచిపోతాం.

పొరపాట్లు ఎవరైనా చేస్తారు. మనం చేసే పొరపాట్లను కప్పిపుచ్చుకుండా, ఇతరుల మీదకు నెట్టకుండా అవి పునరావృతం కాకుండా జాగ్రత్త వహించాలి. అదే నిజమైన 'ధీరగుణం'. ❖

**(డిసెంబర్ 15న స్వామి రంగనాథానందజీ జయంతి)**

## గ్రంథ పరిచయం



### రోజుకో శ్లోకం

**రచయిత : మల్లాది హనుమంతరావు**
**వెల: రూ. 55/-, పేజీలు: 128**
**ప్రతులకు: మల్లాది హనుమంతరావు 302, సిద్ధార్థ గీతాంజలి, ఎఫ్-50 మధురానగర్, హైదరాబాద్ - 38**

"విశ్వశ్రేయః కావ్యమ్." భారతీయ ప్రాచీన సాహిత్యంలో ప్రతీ అక్షరం మానవుణ్ణి మహనీయునిగా, మాధవునిగా మార్చడానికే ప్రయత్నించింది. స్వామి వివేకానంద బోధించిన విధంగా శాశ్వత బ్రహ్మానందానికి వారసులుగా చేయడానికే ప్రయత్నించింది. ఆ క్రమంలో అనేక ఇతిహాసాలు, పురాణాలు, కావ్యాలు, శాస్త్రాలు, నీతిసూత్రాలు వ్రాయడం జరిగింది. సంస్కృతభాషలోగల అద్భుతమైన గ్రంథాలను చదవడానికి మనిషి జీవితకాలం చాలదు. మరేం చేయాలి? ఆ గ్రంథాల సారాన్ని సూక్ష్మంగానైనా ఆస్వాదించి ఆనందించ డానికి యత్నించాలి. లేత అరిటాకులో రుచికరమైన భోజనం వడ్డించిన విధంగా మల్లాది వారు "రోజుకో శ్లోకం" అనే ఈ గ్రంథంలో అనర్ఘ రత్నాలను మనకు అందించారు. అందుకు రచయితకు ధన్యవాదాలు. ❖ **– ఎం.వి. నాగప్రసాద్**



### ధూర్జటి

**రచన: నోరి నరసింహశాస్త్రి**
**వెల: రూ.150/-, పేజీలు: 364,**
**ప్రతులకు: టాగూరు పబ్లిషింగ్ హౌస్, కాచిగూడా చౌరస్తా, హైదరాబాద్ - 27**

శ్రీకృష్ణదేవరాయుల ఆస్థానంలోని అష్టదిగ్గజ కవులలో శివ భక్తుడిగా, మహాకవిగా ప్రసిద్ధుడు ధూర్జటి. "శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యం, శ్రీ కాళహస్తీశ్వర శతకం" లాంటి అద్భుత రచనలు తెలుగు జాతికి అందించిన వాడు ధూర్జటి. ఆ మహాకవి జీవితంలోని సుఖదుఃఖాలనూ, జీవిత విశేషాలనూ కూలంకషంగా పరిశోధించి, తెలుగు సాహిత్యాభిమానులకు అందించారు ప్రసిద్ధ రచయిత నోరి నరసింహ శాస్త్రి. ❖ **– ఎం.వి. నాగప్రసాద్**



### గోవిందం... గోవిందం

రచన: పురాణపండ శ్రీనివాస్



### బాల (కటాక్ష వీక్షణాల లీల)

రచన: పురాణపండ శ్రీనివాస్

**వెల : తెలుపలేదు, పేజీలు : 128**

**ప్రతులకు : మోహన్ పబ్లికేషన్స్, ఫోర్ట్ గేట్, రాజమండ్రి-533 101**



# రామకృష్ణ మఠం


విజ్ఞానానంద మార్గ్, ముఠిగంజ్, అలహాబాద్-211 003 (ఉత్తర ప్రదేశ్)
ఫోన్: 0532 - 2413369, ఫ్యాక్స్: 2415235 Email : rkmathald@dataone.in




## త్రివేణీ సంగమ క్షేత్రంలో నూతన శ్రీరామకృష్ణ దేవాలయం

**ప్రియమిత్రులారా!**

ప్రయాగ (అలహాబాద్)లోని రామకృష్ణ మఠం 2010లో శతవార్షికోత్సవాలు జరుపుకోనుంది. ఈ శుభవార్త మీతో పంచుకోవడానికి ఆనందిస్తున్నాం. భగవాన్ శ్రీరామకృష్ణుల ప్రత్యక్ష శిష్యులలో ఒకరైన స్వామి విజ్ఞానానందజీ మహరాజ్ 1910లో ఈ మఠాన్ని ప్రారంభించారు. వారు ఆధ్యాత్మిక శక్తి సంపన్నులు, జీవన్ముక్తులు. స్వామి విజ్ఞానానందజీని రామకృష్ణ సంఘ ప్రథమ అధ్యక్షులూ, శ్రీరామకృష్ణుల ఆధ్యాత్మిక పుత్రుడూ అయిన స్వామి బ్రహ్మానందజీ మహరాజ్ 'గుప్త బ్రహ్మజ్ఞాని' అనేవారు. విజ్ఞానానందజీ జీవితమంతా దివ్యదర్శనాలతో నిండినది. ఆయన తమ 28 సంవత్సరాల తీవ్ర తపస్సాధనల దివ్యశక్తితో మఠ వాతావరణాన్ని ప్రభావితం చేశారు; మఠాన్ని సందర్శించే భక్తులు ఇప్పటికీ ఆ దివ్యశక్తి ప్రభావాన్ని అనుభూతి చెందుతారు.



ఈ ఆధ్యాత్మిక శక్తి చైతన్యాన్ని ప్రతి ఒక్కరూ తమ జీవితంలో సాక్షాత్కరింప చేసుకొనే విధంగా భగవాన్ శ్రీరామకృష్ణుల విశ్వజనీన దేవాలయాన్ని నిర్మించాలని చాలా సంవత్సరాలుగా అనుకుంటున్నాం.

అందుకు ప్రస్తుత ప్రార్థనా మందిరాన్ని 2010లోగా దివ్యమైన ఆలయంగా తీర్చిదిద్ది, శ్రీరామకృష్ణుల చలువరాతి ప్రతిమను ప్రతిష్ఠించాలని నిశ్చయించాం. జాతి మత విచక్షణ లేకుండా అందరూ దేవాలయానికి వచ్చి ధ్యానం చేసుకోవచ్చు.

రామకృష్ణ మఠం, మిషన్‌ల అధ్యక్షులు శ్రీమత్ స్వామి ఆత్మస్థానందజీ మహరాజ్ 2008, ఏప్రిల్ 11న ఈ ఆలయానికి శంకుస్థాపన చేశారు. రానున్న జనవరి నెలలో ఆలయ మహాసంప్రోక్షణ జరుగనుంది.

ఈ బృహత్తర ఆలయ నిర్మాణానికి సుమారు కోటి రూపాయలు వ్యయమవుతాయని అంచనా. ఈ ఉన్నత కార్యార్థం మిమ్మల్ని ఉదారంగా విరాళాలు ఇవ్వవలసిందిగా కోరుతున్నాం.

రామకృష్ణ మఠానికి ఇచ్చే విరాళాలన్నిటికీ 1961 నాటి ఆదాయపు పన్ను చట్టంలోని 80 (జి) విభాగం ప్రకారం పన్ను మినహాయింపు లభిస్తుంది.

"Ramakrishna Math, Allahabad" పేరున చెక్కు/ డి.డి. తీసి Ramakrishna Math, Vijnanananda Marg, Mutthiganj, Allahabad-211 003 కు పంపాల్సిందిగా మనవి. దయచేసి మీ ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ ఇంగ్లీషు, లేక హిందీ భాషల్లోనే జరపాల్సిందిగా వినతి.

భగవాన్ శ్రీరామకృష్ణుల అనుగ్రహం అందరి మీదా వర్షించాలని వారి పాదపద్మాల వద్ద ప్రార్థిస్తూ...

భగవత్సేవలో
**స్వామి త్యాగాత్మానంద**
అధ్యక్షులు

Advt.

# మనస్సును మార్చిన ప్రబోధాలు!

– మారుతి

నా పేరు మారుతి. నేను కరీంనగర్ జిల్లా, నిమ్మపల్లి గ్రామంలో నివసిస్తున్నాను. నేను సి.ఎ. (చార్టర్డ్ అకౌంటెన్సీ) రెండో సంవత్సరం చదువుతున్నాను. నా వయస్సు 22 సంవత్సరాలు. స్వామి వివేకానంద బోధనల వల్ల నాలో ఎంతో మార్పు కలిగింది. నా ఆత్మ సాక్షిగా చెబుతున్నాను.

నేను ఇంతకముందు ఎలా ఉండేవాడిని అంటే– విపరీతమైన కోపం, ఇతరులను ఏడిపించడం, అసూయ, ద్వేషం, ఇతరులను చులకనగా చూడడం, దుర్భాష లాడడం, వీటితో పాటు పిరికితనం, సోమరితనం – ఇలా అనేక అవలక్షణాలు నాలో ఉండేవి. జీవితమంటే ఆనందం, ప్రేమ, పెళ్ళి, పిల్లలు, అమ్మ, నాన్న, అక్క, చెల్లి – నా మనస్సులో అప్పుడు అదే భావన. అదే జీవితం అనుకునేవాణ్ణి.



మూడో తరగతిలో ఉండగా స్వామి వివేకానంద ఫోటో చూశాను. చేతులు కట్టుకొని నిల్చున్న ఫోటో. ఆ ఫోటోలోని ఆయన కళ్ళలో ధీరత్వం, విశ్వాసం కనిపించాయి. కానీ అప్పుడు నాకు ఏమీ తెలియదు. ఇంటర్ రెండో సంవత్సరంలో సంస్కృతంలో స్వామి వివేకానంద పాఠం చదివాను. అమెరికాలో వారి ప్రసంగం, భారతదేశంపై వారికి ఉన్న ప్రేమ ఏమిటో అర్థమైంది. కానీ పూర్తి వివరాలు తెలుసుకోలేదు.

డిగ్రీ మొదటి సంవత్సరంలో మా కళాశాలలో జరిగిన జాతీయ యువజనోత్సవంలో (నేషనల్ యూత్ డే) మా అకౌంట్స్ అధ్యాపకుడు, స్వామి వివేకానంద ఉపన్యాసాలు, బోధనలు చెబుతున్నప్పుడు 'అసలు జీవితం అంటే ఏమిటి? ఎందుకు జన్మించావు? నువ్వు ఎవరు? ఇప్పుడు నువ్వు ఏం చేస్తున్నావు?' – ఇలా వారి ప్రశ్నలతో ఒక కొత్త లోకానికి వెళ్ళినట్లు అనిపించింది. ప్రతి ప్రశ్నా గుండెల్లో సూదిలా గుచ్చుకుంది. ప్రాణం విలవిలలాడింది. అసలు 'నేను ఎవరు' అనే ప్రశ్న జనించింది. అప్పుడు మా అధ్యాపకుడు 'ఈ మాటలు నావి కావు, స్వామి వివేకానందవి!' అని చెప్పారు. నేను వెంటనే గదికి వెళ్ళి తలుపులు వేసుకొని, విపరీతంగా ఏడ్చాను.

స్వామీజీ పలుకులు నా మనస్సును కదిలించాయి. నన్ను అన్ని రకాలుగా ఆలోచించేలా చేశాయి. జీవితమంటే ఒక లక్ష్యం ఉండాలంటూ స్వామి వివేకానంద చెప్పిన మాటలు నన్ను ఉన్నత విద్య (సి.ఏ) వైపు ప్రయాణించేలా చేశాయి. విజయవాడ చేరిన తరువాత ఇక్కడ రామకృష్ణ మఠం ఉందని తెలిసింది. అంతే స్వామి వివేకానంద రచనలు, జీవితచరిత్ర, శ్రీరామకృష్ణులు, శారదదేవి చరిత్రలు చదివాను.

“నీ విధికి నీవే కారణభూతుడవు” అనే సూక్తి నన్ను బాగా ఆకట్టుకుంది. “సమస్త శక్తీ నీలోనే ఉంది. నువ్వు ఏదైనా చేయగలవు. ఏదైనా సాధించగలవు” అన్న స్వామి వివేకానంద పలుకుల వల్ల నాపై నాకు నమ్మకం పెరిగింది. అదే విధంగా “దేనికీ భయపడవద్దు. ధైర్యంగా ముందుకు సాగు” అనే మాటతో నాలో పిరికితనం నశించింది. ధైర్యంగా ఉండి ఒక్క క్షణం బ్రతికినా చాలు అనిపించింది. ధైర్యం అనే సూక్తుల్లోని గొప్పదనాన్ని నేను ఆస్వాదిస్తున్నాను. ధ్యానం, యోగాసనాలు ప్రతి రోజూ చేస్తాను. నిజంగా నాలో చాలామార్పు వచ్చిందని మా బంధువులు, మిత్రులు అంటుంటారు.

ఇప్పుడు నా జీవిత లక్ష్యం భారతదేశ ప్రజలకు సేవ చెయ్యడం. మన దేశంలో పరిస్థితి వివేకానంద వివరించినట్లు అందరికీ తెలిసిందే. నా ఆరాధ్య దైవమైన స్వామి వివేకానంద బాటలో ముందుకు సాగుతున్నాను. ఇతరులకు సేవ చేయడంలో ఉన్న ఆనందం ప్రపంచంలో ఎక్కడా లేదు అని నా అభిప్రాయం. అదే నా లక్ష్యం. నా ఆశయాలను కార్యరూపంలో తేవడానికి కృషి చేస్తున్నాను.

వివేకానందుల రచనలు, వ్యక్తిత్వం, జీవితచరిత్ర, పాఠ్యపుస్తకాలలో చిన్న తరగతుల నుండి పిల్లలకు వివరించినట్లయితే స్వామి వివేకానంద కోరుకున్న యువకులు ఒకరు కాదు, ఇద్దరు కాదు... లక్షల మంది తయారవుతారని నా ఉద్దేశం. అప్పుడు మన స్వామి వివేకానంద ఆశయం నెరవేరుతుందని నా అభిప్రాయం. ❖

మారుతి, నిమ్మపల్లి, ధర్మవరం (మం), కరీంనగర్ జిల్లా.

# చెరసాలలో స్వర్గజీవితం

- గుళ్ళపూడి శ్రీనివాసకుమార్

ధైర్యసాహసాలకు మారుపేరుగా నిలిచి, 14 ఏళ్ళ పిన్న వయస్సులోనే నెహ్రూ అంతటి నేతను టికెట్టు లేకుండా కాకినాడ కాంగ్రెస్ సభల ప్రదర్శన లోపలికి విడిచిపెట్టని స్వాతంత్ర్య సమరయోధురాలు దుర్గాబాయి దేశ్‌ముఖ్. ఉప్పు సత్యాగ్రహం జరిగే రోజుల్లో బ్రిటిష్ వారు ఆమెను కూడా ఖైదు చేసి, రాయవేలూరు జైలుకు తరలించారు.

అప్పటికే ఆ జైల్లో ఉన్న మహిళా ఖైదీల జైలు జీవితం నిస్తేజంగా గడిచేది. సకల కళాప్రవీణురాలైన దుర్గాబాయి ఆ జైల్లో అడుగుపెట్టి అక్కడి పరిస్థితులన్నిటినీ మార్చేశారు.



ఆమె అక్కడ ఉన్న కాలంలో అది చెరసాలా, లేక పాతిక ముప్ఫై మంది పిల్లలతో ఆటపాటల మధ్య కళకళలాడే ఇల్లా అని సందేహం కలిగేది అక్కడి ఖైదీలకు. చెరసాలలోని వారికి దుర్గాబాయి హిందీ పాఠాలు చెప్పేవారు. దుర్గాదాసు, మేవాడ్ పతనం లాంటి హిందీ నాటకాల గురించి వివరిస్తూ నిజంగా నటించి చూపేవారామె. తోటి ఖైదీలను ఆడిస్తూ, పాడిస్తూ ఉండేవారు. జైల్లో ఉంటూనే కథలు, ధారావాహికల రచనలు కూడా చేశారు.

జైలు అధికార్లను ప్రశాంతంగా ఉండనిచ్చేది కాదు దుర్గాబాయి జట్టు. సరిగ్గా అర్ధరాత్రి సమయంలో పాము వచ్చిందనీ, ఆ మర్నాడు రాత్రి తేలు వచ్చిందనీ అందరి చేతా అరిపించి, బుసలు కొట్టించేవారామె. నిద్ర నుంచి మేలుకొని కంగారుగా అక్కడికి వచ్చిన జైలు అధికార్లకు ఏమీ కనిపించక తిట్టుకునేవారు. 'తేలు కనిపించిందన్నారుగా! ఏదీ?' అని అడిగితే, సాలీడును చూచి తేలనుకున్నామని దుర్గాబాయి బృందం నుంచి బదులు వచ్చేది.

ఖైదీలు తాము కట్టుకునే చీరల ముక్కలు చించి జెండాల్లా తయారుచేసి, జైల్లోనే 'గాంధీజీకీ జై' అనీ, 'భారత్ మాతాకీ జై' అనీ ఊరేగింపులు నిర్వహించేవారు. దాంతో అధికార్లు వీరి రంగుల చీరలను తీసేసుకుని తెల్లచీరలిచ్చేవారట. వాటినే ముక్కలుగా చించి, ఆకుపసర్లు, కుంకుమ రంగులు అద్ది, మధ్యలో రాట్నం బొమ్మ వేసి జెండాలుగా తయారు చేసి అనుకున్న ప్రకారం జైల్లో తమ ఊరేగింపులు కానిచ్చేవారు. దుర్గాబాయి తడాఖా అది. అంతేకాదు, జైల్లోని మిత్రురాళ్ళతో నాటకాలు వేయించడంతో పాటు, ఆదివారాల్లో విచిత్ర వేషధారణ ప్రదర్శనలు కూడా ఏర్పాటు చేయించేవారామె. జైల్లో స్త్రీలు ఏర్పాటు చేసుకున్న సన్మాన సంఘం కూడా ఉండేది. విడుదలైన ఖైదీలకు వీడ్కోలివ్వడం, వచ్చేవారికి స్వాగతం పలకడం మాత్రమే ఇక్కడ పైకి కనిపించినా ఈ చర్యల ద్వారా స్వాతంత్ర్య సమర వ్యూహ ప్రతివ్యూహాల సమాచారం జైలు బయటకు వెళ్ళేది. బయటి నుంచి ముఖ్యమైన సమాచారం జైల్లోని సమరయోధుల సహచరులకు అందేది. దుర్గాబాయి జైల్లో ఉన్న కాలంలో విడుదలైన ప్రతి ఖైదీ ఈ ఆత్మీయవాతావరణాన్ని విడిచిపెట్టలేక కన్నీరు మున్నీరయ్యేవారట. ఇలాంటి కార్యక్రమాల్లో దుర్గాబాయి కవితలు కూడా వినిపించేవారు. చెరసాలనే స్వర్గసీమగా మార్చి అందరికీ ఆనందాన్ని పంచిన ప్రతిభావంతురాలు దుర్గాబాయి. ❖

ఆచార వ్యవహారాలు - అంతరార్థాలు- 46 - రెంటాల జయదేవ

# పరమశివునికి ప్రతీక

(...గతసంచిక తరువాయి)

టెంకాయకు మూడు కళ్ళుంటాయి కాబట్టి, దాన్ని త్రినేత్రుడైన పరమశివుడిగా భావించడం కూడా కద్దు. త్రినేత్రుడికి ప్రతిరూపమైన కొబ్బరికాయ మన కోరికలను తీర్చే సాధనమని భావన. ఇక మరికొన్ని ప్రత్యేక ధార్మిక ఉత్సవాల్లో కలశం మీద నారికేళాన్ని ఉంచి, అలంకరించి, పూలమాల వేసి, పరమ శివునికి ప్రతీకగా, జ్ఞానికి ప్రతిరూపంగా పూజించడం కూడా కొన్ని చోట్ల ఆచారం.



### ఆధ్యాత్మిక పురోగతినిచ్చే అభిషేకం

ఆలయాల్లో కానీ, ఇళ్ళల్లో కానీ దేవుడికి అభిషేకం చేస్తున్నప్పుడు సర్వసాధారణంగా అనేక రకాల ద్రవ్యాలను వాడతాం. పాలు, పెరుగు, తేనె, లేత కొబ్బరి నీళ్ళు, చందనం, విభూతి మొదలైన ద్రవ్యాలను అభిషేకానికి వాడుతుంటాం. అలా అభిషేకానికి వినియోగించే ఒక్కొక్క ద్రవ్యానికీ, ఒక్కో విశిష్టత ఉంది. వాడిన ద్రవ్యాన్ని బట్టి, అభిషేకం చేసిన వ్యక్తికి వచ్చే ఫలితం వేరుగా ఉంటుంది. అభిషేకానికి లేత కొబ్బరి నీళ్ళు వాడడం వల్ల, ఆధ్యాత్మిక పురోగతి లభిస్తుందని పెద్దల మాట!

### వైద్య ప్రయోజనాలు

ఆయుర్వేద రీత్యా కూడా టెంకాయ వల్ల అనేక ఉపయోగాలున్నాయి. కొబ్బరి మధురంగా ఉంటుంది. వాత పైత్యాలను హరిస్తుంది. మూత్రాన్ని శుద్ధి చేస్తుంది. మూత్ర విసర్జనలో మంట పుట్టడాన్ని తగ్గిస్తుంది. కడుపులో పైత్యపు మంటను హరిస్తుంది. కలరా వ్యాధి సోకినప్పుడు కొబ్బరి నీళ్ళు తాగిస్తే మంచిదంటారు. పార్శ్వపు నొప్పులతో బాధపడుతున్న వారికి కొబ్బరి నీళ్ళు ఇస్తే, నొప్పులు బాగా తగ్గుతాయి. అతిసారంతో బాధపడుతున్న వాళ్ళకు కూడా కొబ్బరి నీళ్ళు శ్రేయస్కరమంటారు.

కొబ్బరిని రుబ్బి, పాలు పిండి, తలకు మర్దన చేసినట్లయితే, చుండ్రు తగ్గుతుంది. జుట్టు ఊడడం తగ్గుతుంది. అలాగే, జుట్టు నల్లగా, బాగా పెరుగుతుంది. కొబ్బరి నీళ్ళతో తయారైన 'నారికేళాంజనం' ఒకటి, రెండు చుక్కలు కంటిలో వేస్తే, సమస్త నేత్ర రోగాలూ పోతాయి. కొబ్బరి చిప్పల నుంచి తీసిన నూనె తామర, తీట మొదలైన మొండి చర్మ వ్యాధులను హరిస్తుంది.

ఇలా నారికేళానికి మన ఆచారాల్లో, ఆయుర్వేదంలో ఉన్న విశిష్ట స్థానాన్ని తెలుసుకోవడం ఎంతైనా అవసరం. ❖

(వచ్చే సంచిక నుంచి 'తులసీ మాహాత్మ్యం')

## పండుగలు - పర్వదినాలు

### డిసెంబర్ - 2009

| | | |
|---|---|---|
| 08 | మంగళవారం | : దివ్యజనని శ్రీ శారదాదేవి జయంతి |
| 12 | శనివారం | : ఏకాదశి, స్వామి శివానంద జయంతి |
| 22 | మంగళవారం | : స్వామి శారదానంద జయంతి |
| 24 | గురువారం | : క్రిస్టమస్ (సాయంత్రం ఆరతి తర్వాత) |
| 28 | సోమవారం | : వైకుంఠ ఏకాదశి, గీతా పారాయణం - ఉ. 8 గంటలకు |
| 30 | బుధవారం | : స్వామి తురీయానంద జయంతి |

### జనవరి - 2010

| | | |
|---|---|---|
| 01 | శుక్రవారం | : కల్పతరు మహోత్సవం |
| 06 | బుధవారం | : స్వామి వివేకానంద జయంతి (తిథి ప్రకారం) |
| 11 | సోమవారం | : ఏకాదశి |
| 12 | మంగళవారం | : జాతీయ యువజన దినోత్సవం |
| 14 | గురువారం | : సంక్రాంతి |
| 17 | ఆదివారం | : స్వామి బ్రహ్మానంద జయంతి |
| 19 | మంగళవారం | : స్వామి త్రిగుణాతీతానంద జయంతి |
| 26 | మంగళవారం | : ఏకాదశి |
| 30 | శనివారం | : స్వామి అద్భుతానంద జయంతి |

... 17వ పేజీ తరువాయి.



10
భక్తులారా! పాండురంగణ్ణి దర్శించ డానికా వెళుతున్నారు! నన్నూ పండరీపురం తీసుకువెళ్ళండి! నేనూ భగవంతుణ్ణి దర్శించాలి!
అమ్మా! నీ భక్తికి జోహార్లు. కానీ నువ్వు వివాహితవు. నీ భర్తతో కలసి పండరీపురానికి రా!
11
ఇంట్లో భర్తనూ, అత్తగారినీ తనను పండరీపురం తీసుకువెళ్ళమని సక్కుబాయి వేడుకోగానే...
యాత్ర ఏమిటి, దర్శనం ఏమిటి! ఏం లేదు వెళ్ళు వెళ్ళు!
నా దైవం పాండురంగణ్ణి దర్శించుకోని నా జీవితం వ్యర్థం. నేను ఇప్పుడే పండరీపురం వెళ్ళాలి! తీసుకువెళ్ళండి.
మిత్రూ! భూతం మళ్ళీ విజృంభించింది! ఆమెను స్తంభానికి కట్టిపడేయ్! ఎలా పండరీపురం వెళుతుందో చూస్తాను.
12
స్తంభానికి కట్టివేయబడ్డ సక్కుబాయి ఎదుట అచ్చం ఆమెలానే ఉన్న ఒక స్త్రీ నిలబడింది.
ఏమిటమ్మా ఏడుస్తున్నావు? పండరీపురానికే కదా వెళ్ళాలి! తప్పకుండా వెళదాం.
నా దుఃస్థితి చూడు! అది సరే. నువ్వు ఎవరు? అచ్చం నా లాగే ఉన్నావే!
నీకు బదులుగా నన్ను స్తంభానికి బంధించు. నువ్వు పండరీపురం వెళ్ళి, విఠలుణ్ణి దర్శించుకుని రా! నువ్వు వచ్చేదాకా నీ స్థానంలో నేను ఉంటాను. వెళ్ళిరా! భయపడకు!
13
అనుకోని ఆ సహాయానికి కృతజ్ఞత తెల్పి, సక్కుబాయి పండరీపురం వెళ్ళి పాండురంగణ్ణి తనివితీరా దర్శించుకుంది. తక్షణమే ఆ ఆనంద పారవశ్యంలో బాహ్య స్పృహ కోల్పోయి పడిపోయింది. ఒక భక్తుడు చేసిన ఉపచర్యతో స్పృహలోకి వచ్చి, ఊరికి తిరిగి బయలుదేరింది.




భగవంతుడు మనకు ఎంతో సన్నిహితుడు, సొంతవాడు. ఇదే మనిషికీ, భగవంతునికీ మధ్యనున్న శాశ్వతమైన అనుబంధం. భగవంతుని పట్ల ఈ అనుబంధం ఎంత ప్రగాఢంగా ఉంటే అంత సన్నిహితంగా ఆయన్ని సమీపించవచ్చు. ❖

- మాతృమూర్తి శ్రీ శారదాదేవి



## వార్తావాహిని



భగవాన్ శ్రీరామకృష్ణుల నూతన దేవాలయం

# నూతన దేవాలయ సంప్రోక్షణం

కర్నాటక కొడగు జిల్లాలోని **పొన్నంపేట్ శ్రీరామకృష్ణ శారదాశ్రమంలో** భగవాన్ శ్రీరామకృష్ణుల నూతన దేవాలయం నిర్మించ బడింది. ఈ దేవాలయ ప్రారంభోత్సవాలు 2009 అక్టోబర్ 26,27,28 తేదీలలో జరిగాయి. రామకృష్ణ మఠం-మిషన్‌ల సర్వాధ్యక్షులు పరమపూజ్య స్వామి ఆత్మస్థానందజీ మహరాజ్ అక్టోబర్ 27న ఉదయం 7.30 గంటలకు నూతన మందిరాన్ని భగవాన్ శ్రీరామకృష్ణులకు అంకితం చేసి, ప్రథమ ఆరతినిచ్చి పుష్పాంజలి సమర్పించారు.

నూతన దేవాలయ ప్రారంభోత్సవం సందర్భంగా జరిగిన కార్యక్రమాల్లో రామకృష్ణ మఠం- మిషన్‌ల ఉపాధ్యక్షులు పూజ్య స్వామి స్మరణానందజీ మహరాజ్, పూజ్య స్వామి గౌతమానందజీ, స్వామి గిరీశానందజీ ఇతర రామకృష్ణ మఠ కేంద్రాల నుంచి వచ్చిన 200 మంది స్వామీజీలూ, 3000 మంది భక్తులూ పాల్గొన్నారు. ఈ కార్యక్రమాల్లో స్వామీజీలు, ప్రముఖ వక్తలు ప్రసంగించారు. ప్రముఖ కళాకారులచే సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించబడ్డాయి. స్వామీజీలు, భక్తులు ఎంతో ఉత్సాహంతో పాల్గొని అంతటా ఆధ్యాత్మిక వాతావరణాన్ని నెలకొల్పారు. ఈ మూడు రోజుల కార్యక్రమం దిగ్విజయంగా ముగిసింది. ❖



ఆలయ ప్రదక్షిణలో స్వామీజీలు, బ్రహ్మచారులు, భక్తులు



శ్రీరామకృష్ణులకు పుష్పాంజలి అర్పిస్తున్న పూజ్య స్వామి ఆత్మస్థానందజీ మహరాజ్

# ఆంధ్రావనిలో 'వివేకజ్యోతి'

స్వామి వివేకానందుని స్ఫూర్తిదాయక సందేశాన్ని యువతకు అందించాలనే సత్సంకల్పంతో **హైదరాబాద్ రామకృష్ణ మఠం, భక్తి టీ.వీ.** సంయుక్తంగా రాష్ట్రస్థాయిలో 'వివేకజ్యోతి' కార్యక్రమాన్ని నిర్వహించాయి. 'వివేకానందుని జీవితం -సందేశం'పై జరిగిన వక్తృత్వ పోటీల్లో సుమారు 800 మంది విద్యార్థులు పాల్గొన్నారు.

వివిధ ప్రాంతాల్లో నిర్వహించిన ప్రాథమిక పోటీల నుండి 83 మంది విద్యార్థులు సెమీ ఫైనల్స్‌కి ఎంపిక య్యారు. హైదరాబాద్ రామకృష్ణ మఠంలో అక్టోబర్ 2,3 తేదీల్లో జరిగిన సెమీ ఫైనల్స్ నుండి 14 మంది ఫైనల్స్‌కు చేరుకున్నారు.

4వ తేదీన జరిగిన ఫైనల్స్‌లో శ్రీమతి వీణాబాయి, అనంతపురం- ప్రథమ బహుమతి (రూ.50 వేలు); కుమారి జరీనా, గుంటూరు- ద్వితీయ బహుమతి (రూ.35 వేలు); శ్రీ రఘునాథ్, హైదరాబాద్ - తృతీయ బహుమతి (రూ.25 వేలు) గెలుచుకున్నారు.





హైదరాబాద్ రామకృష్ణ మఠం అధ్యక్షులు స్వామి జ్ఞానదానందజీ విజేతలకు నగదు బహుమతి, జ్ఞాపిక, యోగ్యతాపత్రాలను అందజేశారు. మిగిలిన 11 మంది విద్యార్థులు కూడా నగదు బహుమతి (రూ.3,000 చొప్పున), జ్ఞాపిక, యోగ్యతా పత్రాలను పొందారు. ❖

గమనిక: **'వివేకజ్యోతి' కార్యక్రమాన్ని 'భక్తి టీ.వీ.'లో ప్రతీ ఆదివారం ఉదయం 10 గంటలకు, మంగళవారం మధ్యాహ్నం 12 గంటలకు వీక్షించవచ్చు.**

# వరద బాధితులకు రామకృష్ణ మిషన్ కేంద్రాల సేవా కార్యక్రమాలు

2009 అక్టోబర్ మొదటి వారంలో తుంగభద్రా, కృష్ణా నదుల అనూహ్య వరదల కారణంగా ఆంధ్రప్రదేశ్, కర్నాటక రాష్ట్రాల తీర ప్రాంతాల్లోని అనేక గ్రామాలు జలమయ మయ్యాయి. వేలాది మంది నిరాశ్రయులయ్యారు. వరద బాధితులకు ఆంధ్రప్రదేశ్‌లోని హైదరాబాద్, కడప, విజయవాడ కేంద్రాలూ; కర్నాటకలోని బెల్గాం, మైసూరు కేంద్రాలూ తక్షణ సహాయక చర్యలు చేపట్టాయి.



హైదరాబాద్ రామకృష్ణ మఠం వరద బాధితులకు సహాయక చర్యలు

### హైదరాబాద్ రామకృష్ణ మఠం

మహబూబ్‌నగర్ జిల్లాలోని మెన్నిపాడు, కొరివిపాడు, మద్దూరు, శేర్‌పల్లి, కేటుపల్లి గ్రామాల్లోని 1653 కుటుంబాలకు సుమారు 30 లక్షలు విలువచేసే కిరాణా సామగ్రినీ, వంట పాత్రలనూ, చీరలూ, చొక్కాలూ, చాపలూ పంపిణీ చేసింది.



కడప రామకృష్ణ మిషన్ వరద బాధితులకు సహాయక చర్యలు

### కడప రామకృష్ణ మిషన్

కర్నూలు, మహబూబ్‌నగర్ జిల్లాల్లోని 16 గ్రామాల్లోని 8150 కుటుంబాలకు సుమారు 32 లక్షలు విలువచేసే కిరాణా సామగ్రినీ, వంట పాత్రలనూ, చీరలూ, చొక్కాలూ, దుప్పట్లూ, లుంగీలూ పంపిణీ చేసింది.



విజయవాడ రామకృష్ణ మిషన్ వరద బాధితులకు సహాయక చర్యలు

### విజయవాడ రామకృష్ణ మిషన్

కృష్ణా, గుంటూరు జిల్లాల్లోని (చల్లపల్లి, రేపల్లె, భట్టిప్రోలు, కొల్లూరు మండలాలు) 17 గ్రామాల్లోని 2004 కుటుంబాలకు సుమారు 18 లక్షలు విలువచేసే కిరాణా సామగ్రి, వంట పాత్రలూ, చీరలూ, దుప్పట్లూ, తువ్వాళ్ళూ, లుంగీలూ పంపిణీ చేసింది. మిషన్ పాఠశాల భవనంలో 200 మంది వరద బాధితులకు ఆశ్రయం కల్పించడం జరిగింది.



మైసూరు రామకృష్ణ ఆశ్రమం వరద బాధితులకు సహాయక చర్యలు

### బెల్గాం, మైసూరు రామకృష్ణ ఆశ్రమాలు

కర్నాటకలోని బళ్ళారి, బిజాపూర్, గుల్బర్గా, కొప్పల్, రాయచూర్ జిల్లాల్లోని 2742 కుటుంబాలకు 23,425 కిలోల కిరాణా సామగ్రి; 5250 పాత్రలు; 4020 దుప్పట్లు, చీరలు, చొక్కాలు పంపిణీ చేశాయి. ❖

**మాచర్ల శ్రీరామకృష్ణ సేవా సమితి** గుంటూరు జిల్లాలోని చింతలలంక, పెద్దలంక గ్రామాల్లో 350 వరద బాధిత కుటుంబాలకు 1లక్ష 75వేలు విలువచేసే కిరాణా సామగ్రి, దుప్పట్లూ, చీరలూ పంపిణీ చేసింది. ఈ సేవా కార్యక్రమానికి న్యూటన్ ఇంజనీరింగ్ కళాశాల సిబ్బంది రూ.50 వేలు విరాళం ఇచ్చింది. ❖ నివేదిక : ఎమ్. గోవిందరెడ్డి, మాచర్ల.

# శ్రీ పరమాచార్య చన్ద్రశేఖరేన్ద్ర సరస్వతీ వేదాధ్యయనానుసన్ధాన ప్రతిష్ఠానమ్

## ప్రవేశ / ఉద్యోగ ప్రకటన

**1. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది కోర్సులకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) 'వేదచూడామణి'** : ఋగ్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క అధ్యయనము
యోగ్యతలు : మాతృభాషలో చదువగలిగి, వ్రాయగలిగి ఉండాలి.
వయస్సు : 8 నుంచి 10 సంవత్సరాల మధ్య
స్టైఫండ్ : నెలకు రూ. 1,000/-

**(ఆ) 'వేదార్థచూడామణి'** : ఋగ్వేదము/ యజుర్వేదము/ సామవేదము/ అథర్వవేదము యొక్క భాష్యాధ్యయనము
యోగ్యతలు : సంస్కృత పరిజ్ఞానముతో బాటు ఏదో ఒక వేదాన్ని పూర్తిగా అధ్యయనం చేసి ఉండాలి.
వయస్సు : 15 సం॥, ఆ పైన
స్టైఫండ్ : నెలకు రూ. 3,000/-

**2. అర్హులైన అభ్యర్థుల నుంచి ఈ క్రింది ఉద్యోగాలకు దరఖాస్తులు కోరబడుచున్నవి.**

**(అ) వేదాధ్యాపకుడు** : (సామవేదము/ అథర్వవేదము - వేదానికి ఒక్కొక్కరు చొప్పున రెండు ఖాళీలు)
కావలిసిన అర్హతలు : క్రమాంతము లేక పదాంతము
అదనపు అర్హతలు : ఏదైన మఱియొక వేదము/ వేదభాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవము : 2 సంవత్సరములు
సంభావన : నెలకు రూ॥ 8,000/- మొత్తము, సౌకర్యములతో

**(ఆ) వేదభాష్యాచార్యుడు** : (ఒక్కొక్క వేదానికి ఒక్కొక్కరు చొప్పున 4 ఖాళీలు)
విద్యార్హత : ఏదైనా వేద భాష్యంలో ఉత్తీర్ణత
అదనపు అర్హత : మరొక వేద భాష్యము/ శాస్త్రము యొక్క పరిజ్ఞానము
అనుభవార్హత : 5 సం॥
సంభావన : నెలకు రూ. 10,000/- మొత్తము, సౌకర్యములతో

ముద్రించిన దరఖాస్తు ఫారములను **శ్రీ పి. వేంకటేశ్వర్లు గారు, మేనేజింగ్ డైరెక్టర్, కాకతీయ సిమెంట్, సుగర్ & ఇండస్ట్రీస్ లిమిటెడ్, 'గురుకృప' (ఆంధ్రా బ్యాంకు ఎదురుగా), 1 - 10 - 140/1, అశోక్‌నగర్, హైదరాబాద్ - 500 020** (ఫోను: 040 - 27637717) నుంచి ప్రత్యక్షముగా గాని, పోస్టు ద్వారా గాని పొందవచ్చు. పూర్తి చేయబడిన ఆ ముద్రిత దరఖాస్తులను ఈ పై అడ్రసుకు పంపవలెను. అవసరాన్ని బట్టి ఖాళీలను పూరించుట లోనూ, అర్హతల సవరణ లోనూ మేనేజ్‌మెంటుకు అధికారము కలదు.

సం/-
హైదరాబాద్ కులప్రశాసకుడు



Printed and published by **Swami Jnanadananda** owned by Ramakrishna Math Trust
and printed at Kala Jyothi Process, 1-1-60/5, RTC Cross Roads, Musheerabad, Hyderabad - 500 020
and published at Ramakrishna Math, Domalguda, Hyderabad - 500 029. **Editor: Swami Parijneyananda**

# నూతన విడుదల

తనను గురించి, తన ఉద్యమ కార్యం గురించి స్వామీజీ స్వయంగా అప్పుడప్పుడు వాక్రుచ్చిన పలుకులను, వ్యాఖ్యానాలను సేకరించి క్రోడీకరించి, వాటిని పూర్వాపర్యక్రమంలో (chronological order) అమర్చి, ఆ మహా యతివరేణ్యుని ఆత్మకథగా రూపొందించిన పుస్తకం...

## నా ఆత్మకథ

### స్వామి వివేకానంద

అనుసృజన : స్వామి జ్ఞానదానంద




తేటతెలుగులో, అందరికీ ఇట్టే అర్థమయ్యే సులభశైలిలో సాగి దాదాపు 400 పుటలున్న

ఈ పుస్తకం ధర : రూ 40/-

ఈ పుస్తకాన్ని గుంటూరులో డిసెంబర్ 25,26,27 తేదీలలో జరుగనున్న 19వ భక్త సమ్మేళనంలో విడుదల చేస్తున్నామని తెలుపడానికి సంతోషిస్తున్నాం. భక్తసమ్మేళనాన్ని పురస్కరించుకుని ఆ మూడు రోజులలో కేవలం రూ 15/- లకే అందిస్తున్నాం.

వివరాలకు

రామకృష్ణ మఠం
దోమలగూడ,
హైదరాబాదు - 500 029

Tel : 27633937
Telefax : 27633936
email : rktelugubook@gmail.com
www.rkmath.org

Vol.66-12, Sri Ramakrishna Prabha (Telugu Monthly) December 2009, Regd. with the Registrar of Newspaper for India Under No. 1120/57. Postal Registration No. H-HD-1071/2007-09. Licensed to Post Under WPP : CPMG/AP/HC-13/WPP/2007-09.

"Are you growing spiritually? Can you love others? Can you feel oneness with others? Have you peace within yourself? And do you radiate it around you? That is called spiritual growth, which is stimulated by meditation inwardly, and by work done in a spirit of service outwardly."

*- Swami Ranganathananda*